శ్రీరస్తు.

శ్రీబాలాత్రిపురసుందర్యై నమః.

# శ్రీకృష్ణభారతము

ఆది సభా పర్వములు — మొదటిసంపుటము.

సంస్కృతభారతానుసారము.

కవిరాజు శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి

ప్రణీతము.

చింతలపాటివారు జమీన్దారులు

శ్రీ రాజా వాసిరెడ్డి శ్రీచంద్రమౌళీశ్వరప్రసాద్ బహద్దరు వారి

నామాంకితము.

శ్రీమాహిష్మతీముద్రాక్షరశాలయందు

ముద్రితము.

ముక్త్యాల.



1916.

# విజ్ఞాపనము.

ఆర్యులారా! భారతీయులారా!

శ్రీమన్నారాయణాపరావతారం బని ప్రసిద్ధిఁ గాంచిన వేదవ్యాసమహాముని కలియుగమున కాది మహాభారతమును దేవభాషం జేసి చేసి లోకోపకారము గావించె. సమస్తధర్మములకు నిలయ మగుటవలనఁ బంచమవేద మని ప్రఖ్యాతి నొందిన దాని మూర్తిత్రయం బన నైపకవిత్రయం బాంధ్రీకరించి యుపకరింపఁ జేసె. మన దేశములో నీ తెలుఁగుభారతమును గని విని యెఱుంగనివాఁ డొక్కఁ డుండఁడు. ఆంధ్రప్రపంచమున కది యొక లక్ష్యగ్రంథము. ఆభాష యే మన కిప్పుడు ప్రమాణము. ఆమార్గమే మన కును మార్గము. అట్టి మహాగ్రంథము సంపఠనీయం బై విరాజిల్లుచుండ వెండియు నే నట్టి గ్రంథమునే రచింపఁ దొడంగుట చాపలమే. దాని కనుగుణముగాఁ గొందఱు మహామహులు నై సన్నయాదుల భారత ముండ నిది యేటి కనియు, ఇట్లు చేయుట నన్నయాదుల దిరస్కరించుట యనియు, ఆదికవులు తెలిఁగించినదానిఁ దెలిఁగించుట దోష మనియుఁ బలుఁదెఱంగుల భాషించుచు నన్నుఁ జెనకనాడు నావీనులకు వినిపింపకుండ లేరు. కానీ నాప్రారంభమునకుఁ గలకారణము కృత్యాదిని విన్నవించుకొనియే యున్నాఁడను. దానం జేసి నాయభిప్రాయము లోకమునకు విశదము కాకపోదు. అయినను మఱియు దాని నిట వ్యక్తీకరించుట పౌనరుక్త్యము కాదు. వాల్మీకికృత శ్రీమద్రామాయణమునకు భాస్కరరామాయణం బొండు వెలుఁగుచుండ నిప్పు డెన్నిరామాయణములు పుట్టి యున్నవో నే నిట వేఱె చెప్పవలయునా? కవిబ్రహ్మ యనంబడిన తిక్కనసోమయాజి రచించిన నిర్వచనోత్తరరామాయణము సర్వోత్తరముగ నుండఁ గంకంటి పాపరాజు మఱియు నుత్తరరామాయణము రచించుట లోక మెఱుంగదా? అది పనికిమాలినపని యని కాని దానం దిక్కనం దిరస్కరించినట్లగు నని కాని మన మన సాహసింపఁ గలమా? ఇప్పుడు నాకుఁ బట్టినయవస్థయే యప్పుడు పాపరాజునకును బట్టి యుండుటం బట్టియే కాఁబోలు తనరామాయణమందు:—

మ. వరుసం దిక్కనయజ్వ నిర్వచనకావ్యం బై తగం జేసె ను
త్తరరామాయణ మాదున న్మతి ప్రబంధం బూని నిర్మించు టే
సరసత్వం బని ప్రాజ్ఞులార నిగసింపం బోకుఁడీ రాఘవే
శ్వరచారిత్రము సెంద బెన్నిగతుల న్వర్ణించినం గ్రాలదే.

అని వ్రాసికొనియున్నాఁడు. ఇట్లే సంస్కృతమందు భోజరాజును దనరామాయణమునందు:—

శ్లో. వాల్మీకిగీరరఘుపుంగవకీర్తిలేశై, స్తృప్తిం కరోమి కథమప్యధునా బుధానాం
గంగాజలైర్భువి భగీరథయత్నలబ్ధైః, కిం తర్పణం న విదధాతి జనః పితౄణాం..

అని చెప్పుకొని యున్నాఁడు. మఱియు నిట్లనేకులు పూర్వులేకాక యిప్పటివారు నేదే నొక కారణముం బురస్కరించుకొని చేసిన పనినే మరల మరలఁ జేయుచుండుట యెఱుఁగుదుము. ఇది మన దేశమం దాచార మైయున్నదియే కాని నేను క్రొత్తగా నవలంబించినది కాదు. నాయందు నే ప్రౌఢపాటవము లేదు. నాకు లోపము రాఁ బోదు ఇది యిట్లున్నను మఱియొకటి చెప్ప సాహసించుచున్నాను చిత్తగింపుఁడు.

మన దేశమం దచ్చుకూటములు లేక భూర్జపత్త్రములు తాళపత్త్రములును వ్రాతకుఁ గతియై యున్నప్పు డెప్పుడో వేయిసంవత్సరముల క్రిందట వ్రాయఁబడిన గ్రంథములను నన్నయభట్టారకుని భారతమునందు లేఖకపాఠకుల ప్రమాదంబున నైనఁ బ్రక్షిప్తములో పాఠభేదములో స్ఖాలిత్యములో గ్రంథపాతములో యేమో చెప్పఁజాలము గాని మూలాతిక్రమణములై న్యూనాధికవ్యత్యయవినిమయాదులు పెక్కులు పడియున్నవి. మూలమునందలి కొన్నికొన్ని భాగములే తెలుఁగునఁ గానిపించుట లేదు. ఆ మూలభాగములు నన్నయాదులే తెలిఁగింపక విడిచివేసినారో లేక సంపాదకులే తొలఁగించినారో తెలిసికొనుట దురవగాహమై యున్నది. సర్వధర్మభూయిష్ఠం బయిన మహాభారతమునందలి విశేషము లిట్లు తెలుఁగునం జూపట్టకుండుటయుఁ జూపట్టినపట్ల వ్యత్యయవినిమయాదులు పట్టియుండుటయుం జూచి నేనా మూలభాగములు మాత్రము మూలానుసరణముగా సరిచేసి పూరింప వలయు ననుకొంటిని గాని యది సర్వత్రిప్రతిష్ఠితం బగుటం జేసి దుస్సాధ్యం బగుటచే నాయుత్సాహము విడిచి యీయుద్యమమునకుఁ దొరఁకొంటిని. ఇది దానికన్న దుస్సాధ్యమయినట్లు కానిపించుచున్నది. నన్నయభారతమందు హెచ్చుతగ్గులు పడియున్న వని తోఁచినపట్ల నైన దాను భిన్నదేశప్రతులతో మూలముం బరిశీలించి నాబుద్ధికి యుక్తమని తోఁచినభక్కిని బ్రవర్తించుచుంటి. ధీమంతులకేని ప్రమాదము గలదన్నచో నల్పజ్ఞుఁడను నే నెంతటివాఁడను. నాబుద్ధి పెడతలం బట్టి నేను దప్పుదారిం బడినచో నది యశుద్ధ మని బుద్ధిమంతులు నాకుఁ దెలియఁ జెప్పి నాజీవితకాలములో నాభారతమును సరిచేయించిన పుణ్యమునం బోవుదురుగాక. పై నుదాహరించిన కారణములం బురస్కరించుకొని నేను మరల భారతమును దెలిఁగింపఁ బ్రయత్నించితిని గాని 'నన్నయాదుల కవిత్వముకన్న మిన్నగాఁ గవిత్వము చెప్పఁగలను నాకవిత్వము సర్వోత్తమము నేను మహానుభావుఁడ' నని

ఎప్పటికిని చెప్ప సాహసింపను వేయేండ్లు తలక్రిందుగఁ దపస్సు చేసినను నన్నయాదులకవిత్వములో నన్నదాఁటు కవిత్వము కొంచె మయినను సరిపడఁ బోదు. వారికవిత్వము కడ నాయిది పైత్యమే. చీఁకటిరాత్రులు కలుగుటంబట్టి వెన్నెలరాత్రులు వన్నెగాంచినట్లు నాయీభారతమువలన నన్నయాదులభారతమునకు మఱింత ప్రఖ్యాతిగా వచ్చును గావున దీనివలన నే నొకవిధమైనపుణ్యము నే సంపాదించుకొన్నవాఁడ నగుదు నని విన్నవించుచున్నాఁడను.

నాకు భారతముపై నిట్టిప్రీతిని బుట్టించినవారు మాతండ్రిగారు. వారిసామర్థ్యమును గూర్చియు మావంశస్థితిగతులంగూర్చియు నిట నించుక వక్కాణించెద. మాపూర్వులు వేదశాస్త్రాధ్యయనము చేసినపండితప్రవరులు. మాయయ్యలును మంచివృత్తిం బ్రవర్తించినవారు. నాపితామహునిపితామహు లగుసర్వేశ్వరదీక్షితులుగారు రఘుదేవపురము రాజధానిగాఁ గలముంగపాటివారిసంస్థానమునందు మన్నింపఁబడి మహోన్నతఖ్యాతిఁ గాంచినవారు. వారిసహధర్మిణి వారణాసి కేశవావధానిగారిపుత్త్రికారత్నము పాపసోమిదేవమ్మగారు ఘనపాఠములో యజుర్వేదము సాంగాధ్యయనము చేసి జ్యోతిర్విద్యాభ్యాసము చేసినమహామహురాలు. (ఆమె మహాత్త్వమును బోధించు పెక్కుకథలు మాయింటఁ దాటియాకులపుస్తకములలో వ్రాయఁబడి యున్నవి). మాతండ్రిగారు వేంకటసోమయాజులుగారు మందిలోకజ్ఞులు. కోటం మభూపతిదేవుగారిసంస్థానమునఁ గొన్నిసంవత్సరములు మంత్రిపదమును బొందియున్నవారు. వారికి సంస్కృతాంధ్రములయందు సమానపాండిత్యము కలదు. వారుచేసిన జ్యోతిష్టోమాదియజ్ఞములు సర్వజనస్తుత్యము లనుట అతిశయోక్తి కాదు. మాతల్లిగారికిని వేదమునందుఁ గొన్నిపనసలును గొన్నిసామములును వచ్చును. నాచెల్లెండ్రిద్దఱు సంస్కృతము చదివియే యున్నారు. నాప్రథమపుత్త్రిక తెలుఁగున గొన్నిగ్రంథములు రచించినది. నాచిన్నకూఁతునకు సంగీతమునందుఁ గొంచె మభిరుచి కలదు. ఈచెప్పుటవలన మావంశమున స్త్రీలును బురుషులవలె విద్యాభ్యాసము చేయునాచారము గలిగియుండు నని తెలియనొప్పు నది యట్లుండనిండు. మాతల్లిదండ్రులకు నాకన్న మున్ను మోమునఁ దిరునామమునవలె నుప్పుమూఁడుగీఁతలతో నుదయించి లక్ష్మీపతి యనుబాలుఁడు మాసంపు పుట్టి (వానింగూర్చి మాతండ్రిగారు నాతో నెన్నో మహాద్భుతవిషయములు చెప్పి యున్నారు.) మూఁడువర్షములు జీవించి చిత్రమరణంబున నందె పరమపదంబుఁ జేరెనఁట. తరువాతఁబుట్టిన నాకు మాతండ్రిగా రైదవసంవత్సరమున నక్షరాభ్యాసము చేసినారు. నాకు నకారము మూఁడుమాసముల దనుక రాలేదు. అట్టిబుద్ధిమంతుఁడను నేను మొదట హిందూవిద్యాభ్యాసము చేయ

నారంభించియు నది విడిచి నాగలింగారాధ్యులవద్ద సంస్కృతకావ్యనాటకాలంకారా దులం జదివితిని. మాపితృపాదులు నాకైదాఱేండ్లు వచ్చినప్పటినుండియు మాటలతో భారతములోనికథలం జెప్పుచుండువారు. దానం జేసియే నాకు భారతముపై నత్యంత ప్రీతి యుదయించె. నే నాకాలమందుఁ దెలుఁగేమియుఁ జదువకున్నను బ్రతిదినము మాగ్రామములో నొకరియింటఁ బురాణము చదువుచుండఁ బోయి వినుచుండు నదియే నా కాంధ్రజ్ఞానమునకు సాధనం బయ్యె. భారతమునందుఁ దిక్కనసోమయాజి గద్యము వినినప్పుడెల్ల నేనును గవిత్వము చెప్ప నేర్చి గ్రంథములలో నిట్టిగద్య మెన్నఁడేని వ్రాసికొనుభాగ్యము గలవాఁడ నగుదునో యని తలంచుచుండు నట్టి తలం పిట్లు భగవదనుగ్రహంబున సఫలం బయ్యె నని వ్రాయుటకు మిక్కిలి సంతసించుచున్నాఁడ. తరువాత నేను శ్రౌతమును స్మార్తమును జదివి మాపితృవర్యుల యజ్ఞమున కాధ్వర్యవ మొనర్చితిని. నేను సంస్కృతకావ్యములు చదువునప్పు డొక నాఁడు అల్లమురాజుసుబ్రహ్మణ్యకవి యనువారు మానివాసగ్రామ మగుకాటవరము నకుఁ బని గలిగి వచ్చిరి. వారు కవు లని విని నేను వారి దర్శింపఁ బోయి కొంచెము ప్రసంగించి మఱునాఁడు:——

క. తోట్రేటిగ్రామమందున, కుర్రా సంభావ నిచ్చి కుదురుగ నీకుం
బ్రేమ సెగుగుతో నన్నము, శ్రీరంగా బెట్ట గలరు చక్కం బోరా.

అని యీపద్యము వ్రాసికొని పోయి చూపిన వారు నాపద్యమునకు మెచ్చి నీకుఁ గవిత్వము వచ్చును లక్షణగ్రంథములు చదువవలయు నని చెప్పి పైపద్యములోఁ గొన్నితప్పులు కల వని దిద్దినారు. ఆతప్పు లెట్టివో తెలిసికొనుటకు నే నప్పుడు సమర్థుఁడను గాఁ జాలనైతి. ఇదియే నా తెలుఁగుకవిత్వమునకు మొదటిపద్యము. అప్పటికి నాకుఁ బదునేనుసంవత్సరము లున్నను దెలుఁగువ్యాకరణము గాని లక్షణము గాని రాదు. అటమొదలుకొని లక్ష్యలక్షణగ్రంథములు చదివి మునుమున్న సత్యనారాయణోపాఖ్యాన మను చిన్నపొత్తము వ్రాసి పిదప మఱికొన్నిగ్రంథములు వ్రాసితిని. అందుఁ గొన్ని యీకృత్యాదిని దెలుపఁ బడియున్నవి. నాకుఁ గవిత్వమునకు గురువు లేఁడు. శ్రీనాథునిగ్రంథములు చదివి యవియే లక్ష్యలక్షణములుగా గ్రహించితిని గావున నాకవితాగురువు శ్రీనాథుఁ డని చెప్పుచు నమ్మహాకవిశిఖామణి కంతరంగమునం దనేక నమస్కారము లర్పించుచున్నాను.

శ్రీమహాభారతము సకలధర్మముల కాకర మ్మగుటచే లోఁగడఁ జెప్పిన ఫల మపేక్షించి సముద్రమున కేతా మెత్తినట్లు శ్రీకృష్ణభారత మనుపేర దాని నాంధ్రీకరింపం బూని కొంతభాగము రచించి దీనిని ముద్రింపించువా రెవ్వరు? దీనిలో

నున్న నాకుటుంబమును బోషించువా రెవ్వరు? అని పేరెన్నికఁ గన్న కొందఱం జూచియు సఫలమనోరథుండఁ గాఁజాల నైతి. అపుడు నా యుద్యమమును విని పాలవంచ భద్రాచలము సంస్థానముల కధీశ్వరు లైన శ్రీరాజా పార్థసారధి అప్పారావు సవై యశ్వారావు బహద్దరు వారు నయాచితముగ ధర్మబుద్ధిం జేసి వేయిరూప్యములు తపాలుమార్గమున నా యింటికిం బంపించిరి. నే నెప్పుడును గృతజ్ఞుఁడనై వారికిని వారి కుటుంబమునకు నాశీర్వాదము చేయుదును. పిమ్మట జగ్గయ్యపేటపురవాసు లగు పిరాట్ల మృత్యుంజయశాస్త్రిగారు నన్నుఁ దమ వెంటం బెట్టుకొని కృష్ణాతీరమునం గలముక్త్యాలరాజధానికిం దోడ్కొనిపోయి తత్పురాధినాథులదర్శనలాభంబు గలిగించిరి. వారియెడ నేను గృతజ్ఞుఁడ. మహాప్రభువులు లగు శ్రీరాజా వాసిరెడ్డి శ్రీచంద్రమౌళీశ్వరప్రసాదబహద్దరు మన్నెసుల్తాన్ వారు నా కప్పుడు దర్శనం బిచ్చి నూటపదియాఱు రూప్యములును విలువగల కొన్ని వస్త్రములును నాకు బహుమాన మొసంగి నా చేయు భారతము నిర్విఘ్నముగఁ గొనసాగించుటకు కాంక్ష యిడి యిది మొదలుకొని ప్రతి మాసమును నాకుటుంబపోషణమునకుం దగునట్లు నూటపదియాఱురూప్యంబు లొసంగుచుఁ గొన్నివేలు వెచ్చించి ముద్రాయంత్రముం దెప్పించి నాభారత మగునంతవఱకు ముద్రింపించి నన్నాదరించుచున్నవారు. అట్టిమహాప్రభువుల కభ్యుదయపరంపరాభివృద్ధి యగునట్లు పరమేశ్వరుఁ డనుగ్రహించుఁ గావుత మని ప్రార్థించుచున్నాను.

మఱియును శ్రీతిరుపతిపురవాస్తవ్యులును న్యాయవాదులును విమర్శకాగ్రగణ్యులును నగు బ్రహ్మశ్రీ నాగపూడి కుప్పుస్వామయ్య బి. యే. గారు తమ కెంత మాత్రమును దీరిక లేనివా రైనను శ్రమచేసి నాభారతమునకుఁ బీఠిక వ్రాసి గ్రంథమునకుఁ బ్రాశస్త్యముం గలిగించిరి. అట్టి విద్యానిధులకును, నా పుస్తకమును జిత్తగించి తమయభిప్రాయములను వ్రాసిపంపిన పండితోత్తములకును, నేను దూరముం డున్నను నాకన్న నెక్కుడుశ్రద్ధ చేసి ముద్రాపభ్రంశములు కలుగకుండ సంస్కరించిన నామిత్రులు చల్లా సూర్యనారాయణగారికిని, గృతజ్ఞతాపూర్వకవందనము లర్పించి "భారతమునకు రెండవభారతమా" యని యాధునికకృతిబుద్ధిం గొని రోయక నిష్పక్షపాతబుద్ధితో గ్రంథమును జిత్తగించి గుణాగుణంబు లరసి వక్కాణించుటకుఁ బండితోత్తములం బ్రార్థించి నాయీకృతి సకలజనాదరపాత్రంబై యాచంద్రతారార్కంబై యుండుఁగాక యని కోరుచు దీని నిట్లు జగదధీనంబు గావించి కృతార్థుఁడ నగుచుంటి నని విన్నవించుచున్నాఁడను.

రాజమహేంద్రవరము.
3-3-16

కృతికర్త,
శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి.

శాశీకగోత్రులు, అష్టావధానశతావధానములు పెక్కుదేశములం జేసి ప్రఖ్యాతి నొంది యున్నవారు. వీరికిఁ గవిరాజ బిరుదనామము గలదు. వీరు చిన్ననాఁటనుండియు ననేకగ్రంథములను రచియించినట్లు కృత్యాదిం గలపండ్రెండవపద్యమువలనఁ దెల్ల మగుచున్నది.

నన్నయభట్టారకుండు తాను వ్రాసినభారతమును రాజమహేంద్రపురవరాధీశ్వరుం డగురాజరాజనరేంద్రున కంకితము చేసినమాడ్కి నిక్కవిరాజు తనరచించినశ్రీకృష్ణభారతమును కృష్ణామండలములోని చింతలపాటివంటుజమీందారులును, మన్నెసుల్తానిత్యాదిబిరుదాంకితులును నగుశ్రీరాజా వాసిరెడ్డి శ్రీచంద్రమౌళీశ్వరప్రసాదబహద్దరు వారి కంకితము చేసెను. ఇమ్మహీపతి కిమ్మనిలల్లెలనుండె నిజరాజధాని యగుముక్త్యాలపురంబుఁ బాలించుచుండె. ఇమ్మన్నెసుల్తానుల ప్రపితామహుండై జగద్విఖ్యాతిఁ గాంచిన వేంకటాద్రినాయఁడుగారును భూలోకదేవేంద్రుఁ డని ప్రసిద్ధిగాంచిన వేంకటాద్రినాయఁడు గారును నీరాజవంశమునఁ బుట్టినవారే. ఇప్ప్రభువరుండు పరమధార్మికుం డనియు, నిజకులాచారపరాయణుం డనియు, దేవబ్రాహ్మణభక్తియుక్తుం డనియు, శ్రీయుమామహేశ్వరపూజాసక్తచిత్తుం డనియు, విద్యాలోలుం డనియు, సముచితసుగుణగణసంపన్నుం డనియుఁ బేరు వడసినవాఁడు. ఈవిద్యాప్రియుండు మాకవిరాజు నాదరించి శ్రీమహాభారతమును జేయించుచుండె నని వినుట కెంతయు సంతసించుచున్నవాఁడ. దీనివలన నిప్ప్రభునియౌదార్యంబును విద్వత్పక్షపాతంబును దెల్లం బగు.

ఇఁకఁ గృష్ణమూర్తిశాస్త్రిగారికవిత్వముం గూర్చి యించుక వచియించెద. ఇక్కవిచంద్రునికవిత్వ మంతయు ద్రాక్షాపాకవిలసితంబై సులలితమధురవచనరచనలఁ గ్రాలుచు మృదుశయ్యాచమత్కృతులఁ జొప్పడుచుఁ గడుంగడు మనోహరంబై యలరారెడు. ఎక్కడనో యొకకొన్నిచోటులం దక్కఁ బెక్కుతావులం గంతయు నతిసులభమై యన్వయకాఠిన్యము లేక ద్రాక్షాపాకమై రసవంతమై యుండుటం జేసి విరులపొట్లము విప్పినట్లు పద్యములఁ జదువుచుండఁ గనే వానిభావము మానసగోచరమై చదువువారికిని వినువారికిని నాహ్లాదం బొనరించు. గ్రంథమునుబ్రాయుచో నితఁడు పదములఁ దడవికొనినచందం బేమియు నుండఁ గానరాదు. వీనికిఁ గొన్ని యుదాహరణములు వ్రాసెద:—

ఉ. బాలికదానఁ బుట్టి పెరుఁగం దలిదండ్రులచాటు కన్నెనై
మేలపోలం గడున్నగుమేనున హానతి యుట్టు లుంటి నీ
కేల విరాళి నన్ గనియు నిందలఁ జూతురు కన్యకాత్వమున్
వ్రీలెడు నింక నెచ్చు జననీజనకుల్ వెడలింతు రిల్లు గాన్." పుట 118

చ. కొడుకులఁ గోలుపోం దన కకుంతికిఁ దాక్తిని మ్రొక్కివం గడుం
గడు ముద మందెఁ గుంతి బిగికౌఁగిట నెల్లరఁ గ్రుచ్చి యొత్తి నా
కొడుకులు శత్రులం గెలిచి కోడలితోఁ గుశలాంగలంబునన్
గడుకొని పట్టభద్రు లయి కౌతుకమందుచు నుండ్రు గావుతన్. పుట 312

పరఁగ సువృష్టి నిచ్చెదరు వర్షమునం బ్రభవించు నోషధుల్
కర మగు నోషధిప్రతతులం బ్రజ వర్ధిలు నాతఁ డల్పుఁడే. శ్రీకృష్ణభారతము పుట 88

ఇది నన్నయభారతమున లేదు.

“మూ. అహం హి పూర్వో వయసా భవద్భ్య స్తే నాభివాదం భవతాం న ప్రయుంజే
రో విద్యయా తపసా జన్మనా వా వృద్ధ స్స పూజ్యో భవతి ద్విజానాం॥” సం. భా.
తే. వయసునం జేసి నేఁ బెద్దవాఁడఁ గాన, వినతి మీ కొనర్పఁగ లేదు విద్యచేతఁ
దపముచేతఁ బుట్టుకచేతఁ దగి యొకండు, పెద్ద యగు వాఁడె పూజ్యుండు ద్విజాలలోన.
శ్రీ.కృ.భా. పుట 145

ఇదియు నన్నయభారతమున లేదు.

“మూ. నాస్యచ్ఛిద్రం పరం పశ్యే చ్ఛిద్రేషు పర మన్వియాత్
గూహే త్కూర్మ ఇవాంగాని రక్షే ద్వివర మాత్మనః” సం. భా
క. తనఛిద్రము వెలిపుచ్చక, యరిఛిద్రము తెలిసి కార్యరూఢి మెలఁగుచున్
మనుజేంద్రుఁడు రాజ్యాంగములను గూర్మను రీతి లోన డాఁపఁగ వలయున్. శ్రీ.కృ.భా. 245

దీనికి నన్నయార్యుఁడు:—

క. అమలినమతి నాత్మచ్ఛిద్రము లన్యు లెఱుంగ కుండఁ దా నన్యచ్ఛి
ద్రము లిమ్ముగ నెఱుఁగుచు దేశముఁ గాలము నెఱిఁగి మిత్రసంపన్నుండై.

అని వ్రాసియున్నాఁడు.

“మూ. కంటకో హ్యపి దుశ్ఛిన్న ఆస్రావం జనయే చ్చిరం
తథ మేవ ప్రశంసంతి శత్రూణా ముపకారిణాం
నావజ్ఞేయో రిపు స్తాత దుర్బలో౽పి కథంచన
అల్పో౽ ప్యగ్ని ర్వనం కృత్స్నం దహ త్యాశ్రయసంశ్రయాత్.” సం. భా.
క. ములు గా యని లోఁచి సాఁచా, లలఁతి గదా యనుచు నున్న నరి భీకరుఁడా
ములు సగము వచ్చి నిలిపిన, బలుగా ముదయించి నేలఁ బడ మిడ నగునే.
క. అలఁతి యని రాయ తమలో, మెలఁగెడు నని కరుణఁ దలఁచి మిన్నక నిలరా
దలఁతు లగునగ్నికణములు, పొలమునఁ బడి వనములెల్లఁ గోడ వడఁగించున్. శ్రీ.కృ.భా. 245

ఇప్పట్టున నన్నయభట్టు:—

క. తన కపకారము చేసిన, జనుఁ డల్పుం డనుచు నమ్మి జడమతియై చే
కొనఁ జన దంచుక ము ల్లయి, నను బాదతలమున నున్న నడవఁగ నగునే.
క. బాలుఁ డని తలఁచి రిపులో, నేరమునఁ గలసి యునికి యిది కార్యమె యా
తీక్ష్ణానలకణ మించుక, చాలదె కాల్పంగ నుగ్ర శైలాటవులన్.

అని తెలిఁగించెను.

“మూ. మహారాజ విజానీహి య త్త్వాం వక్ష్యామి భారత
ముమూర్షు రౌషధ మివ న రోచే తాపి తే శ్రుతం
య దైవ పురా జాతమాత్రో రురావ గోమాయువ ద్విస్వరం పాపచేతాః
దుర్యోధనో భారతానాం కులఘ్నస్సోయం వక్తుం భవతాం కాలహేతుః

తరమం దొప్పె సువర్ణకంటకము తీనం గ్రాల సేంద్రాయుధో
త్తరకాలాంబుదమో యన న్వివిధవాద్యంబు ల్బెడుఁ బ్రోయఁగన్. ఫుట 235

తెలుఁగురచనలు:—

సీ. కడుపులోపలిచల్ల గదలకుండఁగ నింట, నిట్టుండ కడపి కే లేగినాఁడ
నేగి యంతన పోక కట్టెట్టు మెట్టుచు, మెకములగమి నేల మెసవినాఁడ
మెసవి యంతన పోక మెసఁ బాలుపందెరోఁ గఱకరిన్ యేల పఱచినాఁడ
బఱచి యంతట పోక పాపపీనుఁగు నెత్తి తపసికుత్తుక కేల తాపినాఁడఁ
గీ. దాపితిని గాన దయ లేక శాపనుండు, పాముచేఁ జావు మని తిట్టె బాము చుట్టె
నకట చెడుపోకలం బోయి యాగడముగఁ, గ్రొవ్వియుండినవారికిఁ గొడవ లరుదె. ఫుట 90

చ. మడఁతివొ నీవు మున్ప్రేరఁ గుమారులఁ గంటివి గాని చెండియున్
బడయఁగ జిత్త మా నయినఁ బంపను దప్పని నిన్ను మాత్రికిం
గొడుకులమీఁదఁ బ్రేముడి యగుం గద నీ కది కూర్చుఁ గాన న
న్నడఁతికినిం దయం గడుపు పండఁగఁ జేయవె నాకుఁ బ్రోతగన్. ఫుట 214

ఉ. కొండల నాలుఁ గాయుచును గుత్తుకబంటిగ మెక్కి మాంసముల్
మిండఁడు పీఁడు వెన్నలును మీఁగడ పాలును దొంగిలించుమన్
మెండుగఁ శియ్యఁబట్టె బలిమిం గలద్రేతల నంటి తూఁగైదై
యుండుట యిందుఁ గాని మఱియొక్క విశేషముకల్మి యిందు మే. ఫుట 408

ఇక్క వీశ్వరునికవిత్వము పెక్కు చోటుల నన్నయాదికవిత్రియమువారికవనముం బోలె నెంతయు లలితముగా నున్నయది. కొన్నిస్థలంబులఁ బద్యములఁ జదువునపుడు నన్నయార్య భారతములోనిపద్యములను జదువుచున్నట్లె తోఁచెను. ఒకేసందర్భమున నీకవిగారు వ్రాసినపద్యములను నన్నయార్యుఁడు వ్రాసినపద్యములను జదువరులు పోల్చి చూచుటకై కొన్నింటిని వ్రాసెద:—

శ్రీకృష్ణభారతము:—

మ. ధరణీదేవునిమానసంబు నవనీతప్రాయముం బల్కు బం
గారుధారానిశితాసితుల్య మిది రెండున్ రాజవంశంబునన్
బరికింపన్ విపరీతి మందునను శాపంబుం గొలంగింప భూ
సురసంతాగణి నేర్చు నేరఁడు మహీశుం డెప్పుడా దేనియున్. ఫుట 44

నన్నయభారతము:—

ఉ. నిండుమనంబు నవ్యనవనీతసమానము పల్కు దారుణా
ఖండలశస్త్రతుల్యము జగన్నుత విప్రులయందు నిక్క మీ
రెండును రాజులందు విపరీతము గావున విప్రుఁ డోపు నో
పం డతిశాంతుఁ డయ్యు నరపాలుఁడు శాపముఁ గ్రమ్మఱింపఁగన్.

శ్రీకృష్ణభారతము:—

మ. ఇనుఁ డస్తంగతుఁడైన ధర్మముల కెంతే లోపమా నంచు నే
ననుమానింపక లేపితి న్నిను మునీంద్రా యిందు నాతప్పు గ

హాస్యరసము:—

సీ. స్ఫటికసంఘట్టితస్థలము జలాశయ మని వస్త్రము మెగఁ దోఁచికొని గమించె
స్ఫటికాంబుజములఁ బ్రస్ఫుటవాపి గని స్థలం బని చొచ్చి నీటిలో నార మునిఁగె
సంవృతద్వారదేశము వివృతం బని చొరఁ దలఁ గొట్టుకొఁ గ్రక్కపడియె
వివృతంబు సంవృతం బవప్రదేశం బని నడిఁ జని గల్క్రిందు పడి నగ్గె
గీ. సమతలం బున్నతం బని చక్కనడచి, యొకసిమణిదీప్తిఁ జెక్కుక ట్లూహ చేసి
తె న్నెఱుంగక ఖిన్నుఁడై యున్నఁ గాంచి, నలుగురును వాగ్రుతెంగుల నగిరి నగిరి. ఫుట 410

భయానకరసము:—

సీ. బ్రహ్మాండభాండంబు పటపటఁ బగిలెనో భూమండలం బెల్ల బూరటిలెనో
కులపర్వతం బేది కూలెనో వడివడి ప్రళయానలము రేఁగి పర్వెనో యేమొ
మింట సూర్యుఁడు దిగి మంటిపైఁ బడియెనో పుష్కరావర్తముల్ పొరలె నొక్క
బిట్టు సాగర మొక్క పెట్టన బ్రీలెనో పిడుగులమొత్తంబు పడియె నేమొ
గీ, యనుచు నెల్లరుఁ దిగ్భ్రాంతి నొందుచుండఁ, బాండవులు ద్రోణపితృదిక్కఁ బాఱఁ జనిరి
సుకుమారశోకంబు నివ్వెఱగు దోఁపఁ, బిలిచి గురుర్యోధనుని మేటిమఱువు సనిరి. ఫుట 286

ఇట్లు తక్కసరసముల కుదాహరణములు చూచుకొనునది.

ఇందు శబ్దాలంకారములును నర్థాలంకారములును సముచితరీతులం గన్పట్టుచున్నవి.

వృత్త్యనుప్రాసము:—

సీ. కన్నబిడ్డలకన్న మిన్నగాఁ బ్రజ నెన్ని మన్నించి చన్న లోకోన్నతుండు
పున్నమన్నె మెఱుంగ కున్నదిదల నెన్ని తన్నుగాఁ గన్న విద్వన్నుతుండు
జన్నిగట్టు లటన్న వెన్నులుగా నెన్ని కన్నఁ గైకొన్న మహోన్నతుండు
మన్నిరేఁడుల మన్ని కన్నన్న యని యెన్ని తెన్నుఁ బోకున్న రాజన్నయుండు
ఆ, నిన్నుఁ గన్నతండ్రి వెన్నుని కిష్టుండు, నేల యఱుగ దేఁడు లేరివాఁడు
మనపరిక్షితుండు గొనిగొని పెట్టుంతంబు, పాపకర్ముఁడైన పాము గఱచి. ఫుట 88

బమ్మెరపోతన కష్టం బగు సంత్యప్రాసము నీకవిగారు కొన్నిచోటులఁ గూర్చి యున్నారు.

శ్రీకృష్ణభారతము:—

మ. కనిరా ర్సర్వమహీశ్వరేశ్వరుఁడు వేడ్క న్మాలతీతీరమం
దనఘాచారమునీంద్రహోమసురగంధాకీర్ణదిక్పూరముఁ
వినివృత్తోన్నతృగజాతివైరము జగద్విఖ్యాతసద్వారముఁ
ఘనమాహాత్మ్యవిహారముఁ గ్రథనసంతారమ్ముఁ గాంతారముఁ. ఫుట 155

పోతన:— (దశమస్కంధము--పూర్వభాగము)

మ. కనియెం గృష్ణుఁడు సాధుసీమ మహాగంభీరముం బద్మకో
కనదస్వాదునానోదమోదమదభృంగద్వంద్వఝుంకారముఁ
ఘనకల్లోలలతావితానవిహరత్కాదంబకోలాహల
స్వనవిస్ఫారము మందవాయుజకణాసారంబుఁ గాసారముఁ.

గీ. సంతతము రాకపోకలు సలుపునట్టి, పరుస నానది దాఁటించి గరిమ నావ
నడపుచుండెను ఒడుప కప్పడఁతిమిన్న, దాశరాజానుమతి ధర్మతత్పరతను. పుట 112

కైశిక్యాదివృత్తులకును నోజఃప్రసాదమాధుర్యకాంత్యాదికావ్యగుణంబులకును నిగ్రంథంబున నుదాహరణంబులు చూపఁదగి యున్నను వానిని గ్రంథవిస్తరభీతిచే వ్రాయక విరమించితి. వానిని సహృదయు లాయాస్థలంబుల నారయుదురు.

గ్రంథకర్తగారు "పు" వర్ణమునకును "ము" వర్ణమునకును యతి చెల్లునట్లు పెక్కుపద్యములు వ్రాసియున్నారు.

"మాదుసలివాఁడఁ జిక్కితిని ♦ పూజ్యము కత్తము లిచ్చి మెత్తరే" పుట 85
"పురమున కేగుదెంచి రట ♦ ముచ్చటఁ బాతి మటంచుఁ జోరులాం" పుట 218
"మునికి భూతలంబునకుఁ ♦ బోనఁ దలంచితిరే మదగ్రజుం డదు" పుట 364

ఇట్టియతి కవిత్రయమువారిభారతమునందు మృగ్యంబుగా నున్నను నప్పకవిచెప్పిన ప్వాన
"ముత్తపురుషుల్లరులతోడిబుట్టుటకొమ్ముల్"

మొదలగుపూర్వకవిప్రయోగము లునికిం జేసి యీవిరమము సాధువుగానే గ్రహించి శ్రీకృష్ణమూర్తిశాస్త్రిగారు ప్రయోగించియున్నారు.

ఈ కవిచంద్రులు విరాటోద్యోగపర్వములను వ్రాసి పూర్తిచేసి పదంపడి యారణ్యపర్వమును వ్రాయఁ దొడఁగి యందుఁ జాలభాగము వ్రాసి యున్నారు.

ఇందలిశైలి తద్దయు మనోహరము పాకము ద్రాక్షాపాకము. అన్వయకాఠిన్యము కానఁగాదు. పదములును శిల్పములును మధురములు. గ్రంథముఁ జదువఁ జదువ నింపు గలిగించుచు వెండియుం జదువ నిచ్చ గొలుపు. ఇక్కాలంబున నింతసరసముగా నిట్టి మృదుశైలితో నాంధ్రీకరణము చేయువా రరుదని భావించుచున్నాను, ఈగొప్పగ్రంథము సంకితము పొందఁగలిగిన శ్రీరాజా వాసిరెడ్డి శ్రీచంద్రమౌళీశ్వరప్రసాద బహదరువారిభాగ్యము సామాన్యము గాదు.

ఈచందంబున సకలజనమానసానందజనకంబుగ సంస్కృతానుసారిగా భారతంబును బద్యకావ్యంబుగా వ్రాయఁ బూనిన కవిరాజు శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రిగా రీకావ్యము నిరంతరాయంబుగఁ గొనసాగునట్లనుగ్రహింపఁ బరమేశ్వరుని బ్రార్థించుచు గ్రంథమును వ్రాయుచున్నటు లీక్రిందిపద్యమువలన నెఱుంగనగు,

శా. ఆధివ్యాధుల కాకరంబు తను వత్యల్పంబు కాలంబు సం
బోధించుం జముఁ డింతలోఁ జపలతం బొంగారి నే భారతా
గాధార్థం బరియింపఁ బూనితిని నీకారుణ్యమ లేప నా
కాధారంబుగ నిచ్చి ప్రోవఁ గదె దేవా నిన్ను సేవించెదన్. పుట 416

వీరు ప్రార్థించుచున్నట్లే వడి నీమహాగ్రంథమును నిర్విఘ్నముగాఁ గొనసాగించుటకై శ్రీకృష్ణమూర్తిశాస్త్రిగారికి దీర్ఘాయువును సుస్థిరారోగ్యంబును బరమేశ్వరుం డొసంగి మనుపుఁ గావుత మని నెమ్మనమ్మున నేను సనయమ్ము ప్రార్థించుచున్నాఁడను.

నాగపూడి కుప్పుస్వామయ్య.

# పండితాభిప్రాయములు.

[రాజమహేంద్రవరము గవర్నమెంటు ఆర్ట్సుకాలేజియందు గీర్వాణాంధ్రభాషాప్రథమపండితులు బ్రహ్మశ్రీ కల్లూరి వేంకటరామశాస్త్రులవారు వ్రాసిపంపించినది.]

శ్రీకవిరాజబిరుదాంకితులగు శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రులుగారికి.

ఆర్యచూడామణీ!

తమరు రచించిన శ్రీకృష్ణభారతము మధ్యమధ్యమునఁ గొన్నిభాగములు పఠించి మిక్కుటముగా నానందించితిని. మీకవిత్వము మాధుర్యాదిగుణగణవిశిష్టమై నిరర్గళధారతో నివ్వటిల్లుచుండును. సరసములై యనఘములైన గీర్వాణభాషాపదములతో నల్లిబిల్లిగొన్న మీజిలిబిలి తెలుంగుపలుకులకవితాధారాప్రవాహంబు నోలలాడుచున్న తత్త్వనిరతజ్ఞులైన నిష్పక్షపాతమతిమంతులకు నలరు పుష్కరంబైన గంగాయమునానదీప్రవాహసంగమతీర్థమ్ము స్ఫురింపక మానదని నాయభిప్రాయము. కవితాపాకము మొత్తముమీఁద ద్రాక్షాపాకమునఁ దనరుచుండును. సరసమైన యుభయసాహిత్యసంపదం జేసి యియ్యది యిట్లున్నది. ఏతద్గ్రంథరాజరచనోద్యమంబు పరమేశ్వరుని కరుణాకటాక్షంబునఁ గొనసాగుంగాక. ఈగ్రంథరత్నంబు పండితాదరణీయంబై యాచంద్రతారార్కము తేజరిల్లెడుంగాక.

కల్లూరి వేంకటరామశాస్త్రి.

---

[విజయనగరవాస్తవ్యులు మహామహోపాధ్యాయ తాతా సుబ్బారాయశాస్త్రులవారి యభిప్రాయము.]

తమ శ్రీకృష్ణభారతము నచ్చటచ్చట స్థాలీపులాకన్యాయముగఁ జూచితిని. ఈగ్రంథము తమకవిరాజశబ్దమును సార్థకముగఁ జేయుచున్నది. దీనియుద్యమము సర్వాంధ్రభాషావాఙ్మయమున కత్యంతోపకారకము.

తాతా సుబ్బారాయశాస్త్రి.

---

[జగత్ప్రసిద్ధి నొందిన రావుబహదూరు కందుకూరి వీరేశలింగముపంతులవా రనుగ్రహించినది.]

బ్రహ్మశ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి కవిరాజుగారిసన్నిధికి.

భవద్విధేయుఁడు కందుకూరి వీరేశలింగము నమస్కారపూర్వకముగా చేయువిజ్ఞాపన.

ఆర్యవర్యా!

తాము నాయందలి దయచేతఁ బంపిన శ్రీకృష్ణభారతమునందలి ముద్రితము లయిన మూఁడుప్రథమపర్వములు నొకసంపుటముగాను చిరకాలమునకు నేఁ గృతజ్ఞ

తాభివ్యంజకవందనములతో నందిక్కొన్నాఁడను. పుస్తకమునంతను పూర్ణముగాఁ జదివి దానిపైని నాయభిప్రాయమును దెలుపఁదలఁచుకొన్నవాఁడ నయినను వార్ధకదౌర్బల్యమునకుఁ దోడు వ్యాధిబాధితుఁడ నయి యుండుటచేత నాయభిమతసిద్ధిని బడయఁ జాలనందులకుఁ జింతిల్లుచున్నాఁడను. అయినను నే నాదిపర్వములోని ప్రథమాశ్వాసమును రెండవపర్వములోని కొన్నిభాగములను జదువఁ గలిగినాఁడను. నేను చదివినదానినిబట్టి కవిత్వము మొత్తముమీఁద మృదుమధురపదగుంభిత మగుచు ద్రాక్షాపాక మయి నిర్దుష్టమయి యస్ఖలితప్రవాహముకల దయి యించుమించుగాఁ బూర్వకవులకవిత్వమును బోలి యున్నది. రచనానైపుణ్యమునం దొకవేళ మీభారతము కవిత్రయమువారియాంధ్రమహాభారతమునతో సరితూఁగలేకపోయినను, వారు తెలిఁగింపక విడిచిపెట్టినభాగముల సన్నిధిని గల దయి యథావ్యాసభారత మనఁ దగి వన్నె గాంచునని యెన్నుచున్నాను. లోకోపకారకముగా పుస్తకమును ముగింపఁ గలుగుటకు మీకును, ముద్రణాదికార్యములయందు మీకుఁ దోడుపడుచున్న శ్రీరాజావాసిరెడ్డి శ్రీచంద్రమౌళీశ్వరప్రసాదబహద్దరు గారికిని సర్వేశ్వరుఁడు దీర్ఘాయుస్సును బ్రసాదించుఁగాక.

రాజమహేంద్రవరము.
రాక్షస సం॥ మాఘ బ ౧౧ మంగళవారము.

ఇట్లు విన్నవించి నమస్కరించు మీవిధేయాప్తుఁడు,
కందుకూరి వీరేశలింగము.

---

[తిరుపతివేంకటేశ్వరకవు లని ప్రసిద్ధిగాంచినవారిలో నొకరగు శతావధాని
చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు వ్రాసిపంపించినది]

బ్ర॥ వేదమూర్తులైన కవిరాజు శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రులువారిచరణసన్నిధికి. నమస్కారపూర్వకముగ శిష్యపరమాణువు విన్నవించుకొనుమనవి. తమచే నూతనముగా యథామూలముగా నాంధ్రీకరింపఁబడి శ్రీశ్రీముక్త్యాలసంస్థానాధిపతులచే ముద్రింపఁబడిన శ్రీకృష్ణభారత మనియెడు శ్రీమదాంధ్రమహాభారతము మొన్ననే నాకు నందినది. నిన్న తమవ్రాయఁగలకార్డును జేరినది. తమరు పంపిన రెండుపర్వములందును, ఆదిపర్వములోని కొన్నిస్థలములను, సభాపర్వములోని కొన్నిస్థలములును నేను జదివితిని. చదివినంతలో నాయభిప్రాయమును మనవిచేయుచున్నాను:— నిర్గళధారాప్రవాహము గల్గి నిర్దుష్టమై చదివినకొలఁదిని జదువఁ గుతూహలము గల్గించుచు ననేకగుణముల కాటపట్టయి మిక్కిలి యానందమును గల్గించుచున్నదనుటలో నతిశయోక్తి లవమును లేదు. ఇట్టికవితాధార యనన్యసాధ్య మనినవా రుండరని నాతలంపు. ఇది కేవలము నాయభిప్రాయమే కాదు. నే నాయీభాగములు చదువునపుడు కవితారసాస్వాదననిపుణులగుమన్మిత్రులు మఱికొందఱుఁ గూడ నావద్దఁ గలరు వారుఁగూడ నిదే యభిప్రాయమును బొందియున్నారు. త్వరలో సంగ్రహముగా జవాబు వ్రాయవలసినదిగాఁ దమ

యా దేశమగుటచే నింతసంగ్రహముగా వ్రాయవలసివచ్చినది గాని లేనిచోఁ జాల విపులముగా వ్రాసి పంప నెంచుచుంటిని. చిన్నచిత్తమునకుఁ దే గోరినాను.

ఇట్లు భవచ్ఛిష్యపరమాణువు,
శతావధాని, చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి.

---

[చెన్నపురినుండి బ్రా॥ వేదము వేంకటరాయశాస్త్రులవారు వ్రాసినది.]

నేను బరంచినపద్యములు అమృతప్రవాహముగా నుండినవి. ఇంతకన్న నెక్కుడు ప్రస్కృతము వ్రాయఁ గాలు.

వేదము వేంకటరాయశాస్త్రి.

---

(శ్రీపీఠాపురసంస్థానాస్థానకవులు శతావధానులు నగు రామకృష్ణకవులు వ్రాసినయభిప్రాయము.)

ఆర్యవర్యా!

దయాపూర్వకముగాఁ దా మంపిన శ్రీకృష్ణభారతముం జదివి మీయుత్సాహమునకు మిక్కిలి యానందించినారము. పునఃపాకమునచే భారతమునకు మఱికొన్నివన్నెలు గలుగకపోవని మాయాశయము. తమకవిత్వమాధుర్యము జగత్ప్రసిద్ధమే కావునఁ మేము విశేషించి వ్రాయఁ దలంచుకొనలేదు. మిక్కిలి పర్వములును గూడ నచిరకాలములోనే ప్రచురింతురని కోరెదము. చిత్తగింపవలయును.

విధేయులు,
రామకృష్ణకవులు.

---

(విజయనగరవాసులు వైయాకరణశిరోభూషణులు పేరి కాశీనాథశాస్త్రులవారియభిప్రాయము.)

కవిరాజబిరుదాంకితులగు శ్రీపాదకృష్ణమూర్తిమహాకవిగారిసముఖమునకు:—

ఓ మహాకవీ! తాము రచించి యంపించిన శ్రీకృష్ణభారతము మాకార్యస్థానమునకుఁ జేరినది. అందుఁ గొన్ని యన్నయభట్టారకుండు విడిచిపెట్టియు సంస్కృతమందున్నట్టియు యావత్కథలను దాము నిపుణత రచించిన శ్రీకృష్ణభారతము పండితపామర సాధారణముగా లోకానందకరంబై యుండును.

పేరి కాశీనాథశాస్త్రి.

---

(రాజమహేంద్రవరము బోధనాభ్యసనపాఠశాలయం దాంధ్రపండితులును సంస్కృతకవిశేఖరాది
గ్రంథకర్తలు నగు బ్ర॥ మల్లాదిసూర్యనారాయణశాస్త్రులవారు వ్రాసినది.)

బ్రహ్మశ్రీ శ్రీపాద కృష్ణమూర్తికవిరాజప్రణీతం బయిన శ్రీకృష్ణభారతము ప్రథమసంపుటమును జదివి యానందించితిని. "వాసుదేవస్య మాహాత్మ్యం పాండవానాంచ సత్యతాం దుర్వృత్తం ధార్తరాష్ట్రాణా ముక్తవాన్ భగవా నృషిః" అను వ్యాసవచనముం బట్టి శ్రీకృష్ణునిమహిమమును దెల్పునది యగుటను నామైకదేశన్యా

యముఁబట్టి శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు రచించిన దని తెల్పుచుండుటను దీనికి శ్రీకృష్ణభారత మనెడునామ ముభయసమ్మతమై యెంతయు నుచిత మగుచున్నది. మఱియు బహుభంగులఁ బ్రాచీనకవిత్వమును స్మరింపఁజేయునిది యేతత్కవి కవివరులకే చెందియున్నకవిరాజబిరుదము నిపుడు సార్థకము గావించిన దని చెప్ప వచ్చును.

ధారాశుద్ధి నొందిన సుకవితయు నుభయసాహిత్యసంపదయుఁ గలయిక్కవి యిప్పటి కారుసర్గములు రచించిన ట్లెఱుఁగుదును. శేషించిన సర్గములును గూడ నిట్లే శ్రద్ధతో వ్రాసి శైలిం దెలిగించి భాషాపోషణము గావింపఁ బరమేశ్వరుఁ డను గ్రహించుఁగాక. ఇక్కవిరాజు మహాకావ్యరచనకు శ్రేయఃప్రాప్తి యొసంగినశ్రీరాజా వాసిరెడ్డి శ్రీచంద్రమౌళీశ్వరప్రసాదబహద్దరుగారు చిరాయువులై విలసిల్లెదరుగాక.

మల్లాది సూర్యనారాయణశాస్త్రి.

---

[బళ్లారిపురవాస్తవ్యులును సునందినీపరిణయాదిబహుగ్రంథకర్తలును న్యాయవాదులునగు కోలాచలం శ్రీనివాసరావుగారి యభిప్రాయము.]

తమభారతగ్రంథముఁ జదివించి వినుచుంటిని. మృదుమధురశైలి నొప్పి పండిత పామరసామాన్యమై, పూర్వగ్రంథానుక్రమ మేమాత్రమును వదలక మనోరంజకముగ మీగ్రంథరాజంబు వ్రాయఁబడియున్నది. శాస్త్రనియమభంగము లెచ్చట నున్నట్లు నా కగపడలేదు. ఈగ్రంథము మీనామంబును వాసిరెడ్డివారివంశనామంబును నాచంద్రతారార్కంబుగ జగత్తున నిలుపు ననుటకు సందియము లేదు.

కోలాచలం శ్రీనివాసరావు.

---

[మదరాసు ప్రెసిడెన్సీకాలేజీయందు ఆంధ్రప్రధానపండితులును, ఆంధ్రవాల్మీకిరామాయణాది మహాప్రబంధరచనాధురంధరులును, అగు బ్రహ్మశ్రీ వావిలికొలను సుబ్బారావుగారు వ్రాసిపంపించినది.]

తమరు పంపినభారతమును దమయుత్తరమును జేరినవి. నాయందుగల తమవాత్సల్యమునకు మిక్కిలి కృతజ్ఞుఁడను. విరామము లేమిచే నీమధ్యకాలమునం దచ్చటచ్చట గొంతగ్రంథమును చదివితిని. సుప్రసిద్ధులైన మీకవిత్వమును గూర్చి నేను చెప్పఁగలను జగమునకేల భానునికి జందె మేల యున్నట్లు మీకవిత్వాతిశయత్వము తెలియని యాంధ్రులెవరు. నూతనముగఁ గవిత్వ మభ్యసించి యభిప్రాయములచే బ్రసిద్ధి కాంక్షించువారికిఁ బరాభిప్రాయములు ముఖ్యములు గాని తమయట్టివారికిఁ గావు. అందు మీకన్న గొప్పవారియభిప్రాయములు మీ కవసర మగునేమోగాని నాయట్టివారియభిప్రాయము మీ కట్లు శోభావహము గలదు? మీగ్రంథముపై నభిప్రాయ మిమ్మనుట నాకు గౌరవముగదా! మీరు మీస్వభావసౌశీల్యముచే నన్నాదరించి పుస్తకము పంపితిరి. నేనును శిరసావహించి గ్రహించితిని. అయినను నాయభిప్రాయము మీకు వలయుచోఁ జెప్పెదను:—

కవిత్వము సరళముగాను హృదయంగమముగా నున్నది. శైలి గ్రంథయోగ్యతకుఁ దగి యున్నది. నేను జూచినచోట్ల లక్షణస్ఖాలిత్యములు లేవు. నేను మూలముతో

సరి చూడలేదు గావున యథామూలముగ నున్నదో లేదో చెప్పఁ జాలను. ఇదే విధముగఁ బదునెనిమిదిపర్వములు నాంధ్రీకరింపఁ బ్రార్థించు,

భవద్విధేయుఁడు,

వా. సుబ్బారావు.

---

[ప్రకృతము గుంటూరునందుఁ బెర్సనల్ అసిస్టెంటుగ నున్న బ్ర॥ జయంతి రామయ్యపంతులు బి. ఏ. బి. యల్. గారు ఆ 1916 సం॥ ఆశ్వయుజమాససాహిత్యపరిషత్పత్రికలోఁ బ్రకటించిన యభిప్రాయము.]

బ్రహ్మశ్రీ శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రి కవిరాడ్బ్రహ్మశేఖర బిరుదశ్రీకృష్ణభారతమునందలి యాది సభాపర్వములు గలపుస్తకము కృతజ్ఞతాపూర్వకముగా పంపినారు. గ్రంథ మచ్చొత్తుట గుత్తాహాలాయత్తచిత్తముతోఁ జదివి యానందించినారము. కవితానాణ్య మసదృశ మైనది. శైలి సుప్రసన్నమై మనోహరముగా నున్నది. మొత్తముమీఁదఁ గవిత్వము చదువుటకేమి వినుటకేమి యింపయి యున్నదై బహుభంగులఁ బ్రాచీనకవిత్వముం బోలియున్నది. సుప్రసిద్ధ మగుకవిత్రయాంధ్రభారత ముండ నీగ్రంథ మేలరచింపవలయు నని యనేకులకుఁ దోఁపక మానదు కాని:— "కలికల్మషహారి యనియుం గలకాలపు కోర్కి యనియుఁ గడఁగితి నిదిం దెలిఁగింప" నని యాశంకకు సమాధానము కవి కృత్యాదియందే యొసంగెను. ఈభారతము గూడ వ్యాసహృదయపురమునే తెలుపునట విశేషము. అచిరకాలమున నిర్విఘ్నముగా గ్రంథపరిసమాప్తి యగున ట్లీశ్వరుఁడు ప్రసాదించుఁ గావుత. ఆదిభారతమును బోలి యిదియు నాంధ్రలోకము నెల్లెడల నాచంద్రార్కముగాఁ బ్రకాశించుఁగాత.

ఇట్టిమహారంభమునకుఁ దోడ్పడిన శ్రీరాజా వాసిరెడ్డి శ్రీచంద్రమౌళీశ్వరప్రసాద బహద్దరుగారిపుణ్య మనల్పము.

జ. రా.

---

శతావధాని బ్రహ్మశ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు మరలఁ బంపినది.

బ్ర॥ శ్రీ॥ గురుచరణారవిందసన్నిధికి.

శిష్యపరమాణుకృతబహునమస్కారపూర్వకవిజ్ఞప్తి.

ఇదివఱలో సుమారు మాసత్రయముక్రిందటఁ దాము నాయందలివాత్సల్యమ్ము నంజేసి యనిపినభవన్నామాంకితంబును, భవదాంధ్రీకృతంబును నగుభారతమ్మునందలి ఆదిసభాపర్వములను, ఇతరులచేఁ జదివించియేమి తానే స్వయముగాఁ జదివియేమి, ప్రత్యక్షరమును జదివి కృతార్థుఁడ నైతిని. కవిత్రయాంధ్రీకృతభారత ముండఁగా మరల నిదేటి కనువారివాదమునకు బొత్తిగా నవకాశము చిక్కనీయక, ఎయ్యెడ నెట్టిరసము గురియవలయునో అయ్యెడ నట్టిరసోదయము సమగ్రముగా నొలుకుచు నిరర్గళధారాపూరితమై, నిరంకుశప్రతిభాస్ఫోరక మగుమీభారతము తక్కుపర్వములచేఁ గూడ నచిరంబున జగత్కర్ణపర్వం బొనరించి మించవలయు

నని భగవంతు నర్థింపనివా రుండ రని నానిశ్చితాభిప్రాయము. మాతిరుపతిశాస్త్రి కూడ నిట్టియభిప్రాయముసే పొందిన ట్లొకప్రసంగమున నతనిముఖముననే వినియుంటిని. ఎవరేని దీనింగుఱించి 'యిట్లు సంతసింతురనుటలో నన్యృతము లవమును నుండఁగూడదు ఎంతో వ్రాయవలసియున్నను గ్రంథవిస్తరభీతిచే సూత్రప్రాయముగా వ్రాసి విరమించుచున్నను మన్నించి యాశీర్వదింపఁ గోరుచున్నాఁడను. ఈనావ్రాసినవిషయము నాకు భగవంతుఁడు బోధించినదికాని కేవలము తమయందలిగురుభక్తిని దెల్పుటకుఁగాఁ బ్రవర్తించినది కాదని తామును లోకమును గూడ విశ్వసింతురుగాక యని యింతతో విరమించుచున్నాఁడను.

బందరు 23-3-16

ఇట్లు భవద్విధేయుఁడు,
చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి, శతవధాని.

---

(గుంటూరు హిందూ కాలేజీ సంస్కృతపండితులును అవధానిశిరోమణి బిరుదాంకితులును శ్రీకాశీకృష్ణాచార్యులవా రొసంగినది.)

శా. ధారాశుద్ధికి జహ్నుకన్య, పదసందర్భంపుఁబూఁబోఁట, భా
షారామామణిదర్పణంబు, కవితాసామ్రాజ్యసింహాసనం
బౌగా సర్వరసామృతాంబునిధి, శయ్యాపాకవృత్త్యాద్యలం
కారాగారము, కృష్ణభారత మనంగా నెన్న సామాన్యమే.

కాశీకృష్ణాచార్యః,
అవధానిశిరోమణిః.

---

(చెన్నపురిప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమునందలి)
(పండితులు వేటూరిప్రభాకరశాస్త్రిగారు పంపినయభిప్రాయము.)

శ్రీకృష్ణభారతము సర్వద్వయము పరికించితిని. సొగసైనపోలము తొలికృతిక నా యుద్దేశము నెఱుంగింపుచున్నాఁడను. తెలిఁగింపు సంస్కృతగ్రంథమును జీర్ణించుకొని క్రొత్త వెలయించినట్లు తొట్రుపాటులేక నినుపారి యున్నది. శైలియందు నవధారి గలదు. తెలిఁగింపునందు దిట్టిమేటకూర్పు నేటికవులకుఁ బెక్కుచోట్ల దక్కకున్నది. సద్వర్ణనాబాహుళ్యము గద్యవైశిష్ట్యము హృద్యము గానున్నది. గద్యస్థితియు నుచితస్థలములందే పరిమితమై వినువుందోపింపకున్నది. నన్నయాదులకుపతానే యీమహాగ్రంథరచనము నిర్వర్తించుటకు వలయునవెల్లయు బర్యాప్తముగా వీరివివర్షలకుఁ గుదిరియున్నవి. పాఠ్యనై విద్యాపరాయణులైనవారు లగుసంస్కృతభారతప్రతులు సూచి సాధుపాఠనిర్ణయము సుదుష్కరముగా నూహించుచుండువాఁడను. ఈకవివర్యులిట్టికష్టపడి బాల్యమునందే కృతార్థులు కాఁగలుచున్నారు గదా! మహాభారతప్రబంధము నిట్లు చక్కఁగా బూరింప దొరకొన్న శ్రీకృష్ణమూర్తిశాస్త్రిగారికి వారిని బ్రేరింపఁ గోరినట్టి శ్రీచందవోలుజమీన్దారప్రసాద ప్రభునకును శాశ్వతకీర్తులు దొరకినవి.

పెదకళ్లేపల్లి 4-4-16

వేటూరి ప్రభాకరశాస్త్రి.

శ్రీరస్తు.

ఇందు ముఖ్యముగా గమనింపవలసిన కొన్ని

# విషయములు.

☞ ఇరుగు మొదళ్లం గల యంకెలు శ్రీకృష్ణభారతములోని పుటలసంఖ్య యనియు, న. భా. యనిన నన్నయభారత మనియు, శ్రీ. కృ. భా. యనిన శ్రీకృష్ణభారత మనియు, మూ. అనినఁ జూడుం డనియు, మూలము అనిన సంస్కృతభారత మనియు, ఫు. నో. యన ఫుట్ నో టనియు సంజ్ఞలుగా నెఱుంగునది.

22 అనుక్రమణికాపర్వప్రారంభమున సూతశౌనకసంవాదమునందు దీనికిని న. భా. కును చాలవ్యత్యాసము కలదు. న. భా. లో సూతుఁడు నేను దక్షుఁడను నానలన మీ రేకథ వినవలతు రని శౌనకాదుల నడుగఁగా వా రుత్తమ మేదియో యది చెప్పు మన్న ట్లున్నది. మూలములో భారతము చెప్పు మన్న ట్లేయున్నది.

23 వ్యాసునకు బ్రహ్మ ప్రత్యక్షమగుట గణపతిచే భారతము వ్రాయించుట పెక్కుప్రతులందు లేదు. ప్రక్షిప్త మని నిర్ణయింపఁబడినను వాడుకం బట్టి యిట వ్రాయఁబడె నని యెఱుంగునది.

24–35 ఇందుఁ గలవిషయ మంతయు మూలమున విస్తరించి యున్నది. న. భా. లో లేదు. ఆశ్వాసాంతములయందుఁ బూర్వకవులవలెం గాక క్రొత్తమార్గ మిం దవలంబింపఁబడియె. న. భా. లో శమంతపంచకముం జెప్పి మఱియు నక్షౌహిణీసంఖ్య వినుం డని "సీ. వరరథమొక్కండు..." అని చెప్పఁబడియున్నది. శ్రీ. కృ. భా. లో అక్షౌహిణీసంఖ్య పద్యమునఁ జెప్పక 35 లో ఫు. నో వ్రాయఁబడియె. ఈవిడుమట కొంత లోపమే. ఇది ద్వితీయముద్రణమందు సవరించుకొందురుగాక.

34 మూలములో "అహానియుయుధే భీష్మో .శల్యోర్ధదివసంచైవ, గదాయుద్ధమతఃపరం । దుర్యోధనస్య భీమస్య, దినార్ధమభవత్తయోః । తస్యైవ దివసస్యాంతే, ద్రౌణిహార్దిక్యగౌతమాః । ప్రసుప్తం నిశి విశ్వస్తం, జఘ్నుర్యౌధిష్ఠిరంబలం" అని యున్నది. దీనికి న. భా. లో రెండుపద్యము లున్నవి. దేనియందును మూలార్థము సరిగా రాలేదు. రెండవపద్యమందు విపరీతార్థము కలిగియున్నది. దీనిలో శల్యుఁ డొక్కపవలు నాగపురీశుఁడు (దుర్యోధనుఁడు) ఒక్కరేయియును యుద్ధముచేసిన ట్లున్నది. శల్యుఁ డుదయము 6 గంటలు మొదలు 12 గంటలవఱకును అది మొదలు సాయంత్రము 6 గంటలవఱకును నాగపురీశుఁడు యుద్ధముచేసినట్లు పైమూలశ్లోకమువలనఁ దెలియుచున్నది. కాని నాగపురీశుఁడు రాత్రి యుద్ధముచేసినట్లు లేదు. ఇదిగాక ఆరాత్రి యశ్వత్థామాదులు చేసినయుద్ధము రెంటియందును లేదు.

38–42 వఱకుం గలకొంతభాగమును, ఉదంకగురుచరిత్రము—ఇం పయోదధౌమ్యునియు వానిశిష్యులయు చరిత్రము వ్రాయఁబడియె. దీన గురుకులవాసక్లేశ మెఱుంగ నగు. అశ్విదేవతాస్తుతి ఆరోగ్యకరము, ఇది యంతయు న. భా. లో లేదు.

45 "చ. ఖలుఁ డగు .." ఈపద్యార్థము న. భా. లో లేదు. తక్షకుండు పోయినవివరంబునుండి యుదంకుఁడు నాగలోకంబునకుం బోయిన ట్లున్నది. ఎట్లు పోఁ గలిగెనో వివర మట లేదు. మూలమున స్పష్టీకరింపఁ బడి యున్నది. న. భా. లో ఉదంకుఁడు నాగపతుల స్తుతించె నని పద్యములు వ్రాయఁబడి యున్నవి. అవి యన్నియును మూలమందు లేనివే. 69 వ పద్యార్థము కొన్నిమూలప్రతులందు లేదు.

46 హయాపానంబునం దూఁదు మని మూలమున నుండ న. భా. లో నశ్వకర్ణరంధ్రధ్మానంబు సేయు మని మార్పఁ బడియె. అశ్లీలాభవ్యోదార్థము కా నోపు.

48 ఉదంకుఁడు జనమేజయునికడకుఁ జని తక్షకునివలనఁ దనకు జరిగినపరాభవము ప్రధానముగాఁ

ట్లున్నది. ఇట్లు గాకున్నచోఁ గొడుకు మత్స్యదేశమున కధిపతి యయ్యె నని యున్న న. భా. వాక్యమునకు గతి మృగ్య మగుచున్నది.

113 న. భా. లో మత్స్యగంధి పూర్వజన్మవృత్తాంతము చెప్పఁబడి యుండలేదు వ్యాసావతారఘట్టమును మూలభేదమును బొందియున్నది.

116–124 వఱకుం గలభాగము పెక్కు తెలుంగుల భారతప్రతులందుఁ గాన వచ్చెడిని. పేళ్లు మిక్కిలి వ్యత్యస్తమును బొంది యున్నవి. మూలమున దుష్యంతునిచరిత్రము వ్రాసిన వెనుక యయాతిచరిత్రము వ్రాయఁబడి యున్నది. న. భా. లో—శ్రీ. కృ. భా, లో గానికి భిన్నముగా యయాతిచరిత్రము వ్రాసినవెనకనే దుష్యంతచరిత్రము చూపట్టెడిని. యయాతి దుష్యంతునకు 18 తరములు ముందువాఁడగుటచే మూలములో నట్లున్నను వంశానుక్రమణిక ననుసరించి వ్రాయఁబడె నని నిర్ణయించుకొనఁదగు.

126 కచుని దానవులు చంపి దంపి ముక్కచేసి గోవులకుఁ దినిపించినట్లు మూలమున «హత్వా సాలావృకేభ్యశ్చ ప్రాయచ్ఛన్ లవశః కృతం» అని యుండఁగా న. భా. లో «వధియించి విశాలసాల స్కంధంబున బంధించి చనిరి» అని యున్నది. సాలావృకశబ్దమున నిట్లు గ్రహించి లేఖకపాఠకు లిట్లు మార్చియుందు రేమో «భిత్వా భిత్వా శరీరాణి వృకాణాం స వినిర్గతః» అని మృతసంజీవని శక్తివలనఁ గచుండు పునర్జీవితుం డై వచ్చినప్పు డున్నది. దీనింబట్టి సాలావృకశబ్దమునకుఁ దోడేలే యర్థము కాని సాలస్కంధము కా దనుట నిశ్చయము.

128 న. భా. లో నసురులు కచుని భస్మము చేసి సురలో శుక్రునకుం ద్రావించినప్పుడు దేవయాని ప్రార్థనంజేసి «శుక్రుండు తన యోగదృష్టిం జూచి లోకాలోకపర్యంతభువనాంతరంబునఁ గచుం గానక సురాసమ్మిశ్రభస్మమయుం డై తన యుదరంబున నక్కచుం గని» మంత్రశక్తిం బ్రదికించి నట్లును తనహృదయంబు భేదించుకొని రాఁ దలఁచిన నట్లు వచ్చినఁ దనకు మృతి వచ్చు ననియు వచ్చిన మంత్రశక్తిం జేసి మరల బ్రదికింపు మని సంజీవని నుపదేశించినట్లును వ్రాయఁబడి యున్నది. ఇట్లు మూలమున లేదు. దేవయాని «వానిఁ జూచి కాని నేను గుడువ నొల్ల ననుడు» ఏమియు నాలోచింపక శుక్రుండు మంత్రశక్తి నావాహనం బొనరించె ననియు దాన నతఁడు బ్రదికి కడుపున నుండి తనవృత్తాంతము చెప్పి యిట బాధపడుచుంటి నన శుక్రుం డెఱింగి సురాపానంబున నైనదోసంగునకుఁ బశ్చాత్తాపము నొంది యపుడు చేయునది లేక తనబ్రదుకు గాశించి వానికి మృతసంజీవనిం జెప్పినట్లు సందర్భశుద్ధగా వర్ణింపఁ బడి యున్నది.

145–152 వఱకుం గలయష్టకాదులసంభాషణము న. భా. లో సంక్షిప్త మైనది. లోపించినది.

153 పూరునివంశచరిత్రము భారతప్రతులందు బహుపథంబులం బుట్టియున్నది. నేఁటికి యెంతవఱకు సత్యమో తెలియుట సాధ్యము కాదు.

154 ఈదుష్యంతచరిత్రమునకును న. భా. లోని దుష్యంతచరిత్రకును బెక్కుతావుల భేదంబు చూపట్టెడిని చిత్తగింపుఁడు.

169 భరతాదిరాజులవృత్తాంతమునందును గొన్ని పేళ్లు తాఱుమాఱు పడియున్నవి.

189 ధృతరాష్ట్రుఁడు పుట్టియుండఁగాఁ బాండురాజును బుట్టించుటకుఁ గలకారణము సయుక్తికముగాఁ జెప్పఁబడియున్నది. ఇది న. భా. లో లేదు.

194 «శ్లో. ధృతరాష్ట్ర స్త్వచక్షుష్ట్వా ద్రాజ్యం న ప్రతిపద్యత పారశవత్వా ద్విదురో రాజా పాండు ర్బభూవ హ» ఇట్లన్నిప్రతులందును జూపట్టియుండఁగా న. భా. లో «అంబికేయు ధృతరాష్ట్రు రాజ్యాభిషిక్తుం జేసి» అనియు «కుమారాయితశక్తిశాలి ధృతరాష్ట్రుఁడు రాజ్యము సేయుచుండఁగా» అనియు వ్రాయఁబడి యున్నది. ధృతరాష్ట్రుఁడే కురుదేశమునకు రా జైనయెడల నవిభాజ్య మగు రాజ్యము వానికొడుకు దుర్యోధనునకే వచ్చును గాని పాండవులకు రా నేరదు. ఇట్టిచో ధర్మాత్ముఁ డగుధర్మరాజు తనభాగము (దీనిం గూర్చి ముందు వ్రాయఁబడును.) తన [illegible]

నీకున్న యుద్ధము చేయుటయు ధర్మ మని తలంచెనా? భీష్మాదులు దీనికి సమ్మతింతురా? దీని కనుగుణముగా దక్షిణదేశమందుఁ గృష్ణమాచార్యులుగారు క్రొత్తగా ముద్రింపించిన యొకప్రతిలో మాత్రము "ధృతరాష్ట్రభీష్మేణోక్తః" అని యేకదేశపతితమై యున్నది. అనేక కారణముల చేత నిది ప్రక్షిప్త మని త్రోసివేయం దగు. ఇట్లు వ్రాసిన న. భా. లోనే:—

సీ. పైతృకం బగులక్ష్మి ♦ పాండుభూపతి మున్ను, తాల్చుటఁ జేసి తత్తనయుఁ డైన
ధర్మజుఁ డిప్పుడు ♦ తాల్చిన నాతని,తనయుండు మఱి దానిఁ ♦ దాల్చు మీఁద
నిప్పాటఁ బాండుసంతతుల వసుమతీ,రాజ్యార్హు లగుదురు ♦ రాజ్యమునకు
బరునడి మే మింత ♦ వాసిన మాపుత్ర,పౌత్రవర్గంబును ♦ బాయు నింక

ఆ. నొరులఁ గొలిచి కుడుచు ♦ నోప మే మట్లుగా,కుండ నుమ్ముఁ జేయ ♦ నోపు దేనిఁ
బాండురాజుతోంటి ♦ భక్తియు నప్పాండు,తనయులందు దయయుఁ ♦ దలప కుండు.

అని యున్నది. ఇట్లు నన్నయభట్టు పూర్వోత్తరసందర్భశూన్యముగా వ్రాయఁడు. కావున న. భా. లో ధృతరాష్ట్రుఁడు రా జని వ్రాసినవచనము ప్రక్షిప్తము.

195 ధృతరాష్ట్రుఁడు సత్యవ్రతాదులఁ బదుండ్రం దక్కనకన్యాశతంబును బెండ్లియాడి నట్లు కొన్ని ప్రతులలో లేదు. లేకున్నను నన్నయ వ్రాయుటం జేసియుఁ గొన్నిప్రతులలోఁ గలుగుటం జేసియు నిటఁ జేర్కొనంబడియె నేమో!

198 స్వయంవరమునందుఁ గుంతి పాండుని వరించినవిషయ మిటఁ జక్కఁగా వర్ణింపఁ బడినది. ఇది చదివినచోఁ బాండురాజునకుఁ గుష్ఠరోగము గల దని వాదించువారివాద మపాస్త మగుచున్నది. మఱియు వారి కిది వాకట్టుమంత్ర మగుచున్నది. ఇదియును మాద్రీవృత్తాంతమును న. భా. లో లేదు.

199 మూలములో మఱియొకతావున నున్నను ఇట విదురుని వివాహము వ్రాయఁబడినది. ఇట్లు స్థానభేదము గల్పించుటకుఁ గారణ మేమి యని యడుగఁగాఁ బ్రక్రమము ననుసరించి (ధృతరాష్ట్రపాండురాజుల వివాహ మిటఁ గలదు గావున దాని ననుసరించి) వ్రాయఁబడె నని గ్రంథకర్త వలన వినవచ్చుచున్నది.

219 మొదలు 220 వఱకును గొన్నికొన్నిచోట్ల మూలముకన్న భిన్నములైనస్థలములు న. భా. లోఁ గాన వచ్చెడిని.

220 భీముఁడు గంగలోఁ ద్రోయఁబడినప్పుడు నాగులు వాని నాగలోకమునకుం గొనిపోవుటయు నట రసపానంబున నాగాయుతసత్త్వము గలుగుటయు వెండి వచ్చుటయు ధర్మరాజువిచారములోనగు పెద్దకథ యంతయు న. భా. లోఁ బూజ్య మయ్యె.

226 ద్రోణుఁడు ద్రుపదునిచే నిరసింపఁబడి హస్తిపురికి వచ్చి కృపాచార్యునింటఁ బ్రచ్ఛన్నరూపమున నుండె ననియు నపుడు కృపాచార్యుఁ డెడసినప్పుడు కురుకుమారులకు నశ్వత్థామ శస్త్రవిద్యం జెప్పుచుండె ననియు మొదలగునవి న. భా. లో లేదు.

244 అహిచ్ఛత్ర మనుదేశముం గెలిచి తెచ్చి యర్జునుండు వెనుక గురువునకు దక్షిణగా నిచ్చుట న. భా. లోఁ గానరాదు. ద్రోణుఁ డర్జునునితో "నాయుద్ధంబు సేయునప్పుడు నాతోఁ బ్రతియుద్ధంబు సేయకుండు మిదియ నాకు గురుదక్షిణ యనిన నర్జునుండు నట్ల యని యాచార్యునకు నమస్కరించి దాని కొడంబడియె" నని న. భా. లో వ్రాయఁబడి యున్నయది. ఇది సరియైనచో నర్జునుఁడు సత్యవాది యైనచో గురునితో యుద్ధ మేల చేసెనో విచారించునది. మూలమం దిట్లు లేదు. "కలన నే మున్న కడఁగి నప్పుడ నన్నుఁ గలయు మియ్యదియె యలరుదక్షిణ" అనఁగా నేను ఏమీఁదికి యుద్ధమునకు వచ్చినప్పుడు గాని మునుమున్న నీవు నామీఁదకు యుద్ధమునకు రావల దని కోరఁగా నతం డంగీకరించె. ఇది సరిపడియున్నది. చిత్తగింపుఁడు. ధర్మజుని యౌవరాజ్యాభి
షేకమును న. భా. లో వ్యత్యస్తముగాఁ బడియున్నది.

245 ఇందు ధృతరాష్ట్రుఁడే పాండవేయుల మహోన్నతికి సైఁపక విచారించుచుండఁ గణికుండు వచ్చి రాజనీతులు చెప్పినట్లుండ దుర్యోధనుఁడు విచారించుచుండ నతనికిఁ గణికుండు వచ్చి చెప్పినట్లు న.భా. లో వర్ణింపఁబడినది. కారణము మృగ్యము. కణికుఁడు చెప్పిననక్కకథ న.భా. లో లేనేలేదు.

249 పౌరులు పాండవులం బ్రశంసించునట్టివిషయము సరిగా న. భా. లో లేదు. అది పాండుపట్టాభిషేకమును స్థిరీకరించును.

250 దుర్యోధనుఁడు తండ్రితోఁ జెప్పి మొత్తుపెట్టుకొనినమాటలు కొన్ని న. భా. లో సరిగా లేవు గాని "పైతృకంబగులక్ష్మి" అనుపద్య మిట వ్రాయఁబడి యున్నది. దీనివలనఁ బాండురాజ్యము ప్రకటింపఁబడును.

251 ధృతరాష్ట్రునిదుష్టత్వము న. భా. లోఁ గొంచెము కొంచెముగా స్ఫురించెడిని గాని యిందు స్పష్టముగా వక్కాణింపఁ బడినది. ఇట్లు చెప్పుట సమంజసము. దుర్యోధనునికన్న ధృతరాష్ట్రుఁడే క్రూరుఁడని నాయభిప్రాయము. వ్యాసునియభిప్రాయమును. పాండవులను వారణావతమునకుఁ బంపుటయే కాక లక్కయింటం జిచ్చు పెట్టి చంపుటకును ధృతరాష్ట్రునకు సమ్మతమే.

255 వారణావతంబునకు నరుగుపాండవులం జూచి పౌరులు దుఃఖించుట న. భా. లో లేదు. అదియును బాండురాజత్వమును స్పష్టీకరించుచున్నది.

258 పయనమై పోవుధర్మజునకు విదురుఁ డితరు లెఱుంగకుండఁ జెప్పినమ్లేచ్ఛోక్తు లనునవి న.భా.లో లేవు.

260 లక్కయింటఁ జచ్చిననిషాదవనిత పురోచనుచేఁ బంపఁబడిన దనియుఁ బండ్లు లోనగునవి తెచ్చి యిచ్చి కుంతిం బాయక సేవించుచు వారిప్రవర్తనంబు పురోచనునకుం జెప్పుచుండు నది యనియు న. భా. లో వ్రాయఁబడియున్నది. మూలమున నిట్లు లేదు. ఈవేఁగు పురోచనకృత్యంబున కుపకరించునది కాదు. ఉపకరించినను నేప్రతియందును లేనిది యిట్లు వ్రాయుట చింత్యము. సర్వప్రతులందును నిషాది నాఁడు తిండికి వచ్చి కలు ద్రావి యొడ లెఱుంగకఁ బండి నిద్రపోవుచున్నట్లే వ్రాయఁబడి యున్నది.

261 వారణావతమునందలిపౌరులు పోయి ధృతరాష్ట్రునితోఁ జెప్పినమాటలు న. భా. లో లేవు. దానివలనను బాండురాజత్వము స్పష్టపడును. భీముఁడు తనవారికై నీళ్లను గట్టిబట్టలో మూటగట్టి తెచ్చినట్లు మూలమునం దున్నది. న. భా. లో "అచ్ఛిద్రకములపత్రపుటికల" నీళ్లు గొనివచ్చినట్లున్నది. "ఈబట్టలో నీళ్లుమూట గట్టవచ్చును" అనఁగా నిది గట్టిచిక్కనిబట్టయని చెప్పుటకుమనవారిప్పుడును నిట్లు వాడుచుందురు. కావునఁ జిక్కనిగట్టిబట్టలో నీళ్లు మూట గట్టి తేవచ్చును. గట్టిబట్ట తడిపి పిండి దానిలో నీళ్లు పోసినఁ గారకుండుట సర్వజనైకవేద్యమే. భీముఁ డట్టిబట్టలోనే కట్టి నల్వురికిని జాలినన్నినీళ్లు తెచ్చె ననియే తోఁచెడిని గాని తామరాకుదొన్నెలతోఁ దవ్వెఁడు నీళ్లు తెచ్చె నని తలంచుట సరికాదు.

267 హిడింబ చెప్పినమాటలు, వ్యాసోపదేశమును గొన్నిప్రతులలో [illegible] యిటనే క్రిందవ్రాయఁబడి యున్నది. కాన నిట విస్తరింపలేదు.

270 బకాసురసంహారమందును గొంతకొంతమార్పు న. భా. లోఁ గలదు. ఏకచక్రపురవాసులు బ్రహ్మోత్సవము చేసినట్లు మూలమున నున్నది. న. భా. లో లేదు.

280 భారద్వాజునివృత్తాంతము న. భా. లోఁ దొంటిరీతినే మఱల వర్ణింపఁబడియున్నది. శ్రీ. కృ. భా. లోఁ బౌనరుక్త్యభీతిచేఁ గాఁబోలు దాని నిట సంక్షేపింపఁ బడియె. యాజోపయాజులకథ మూలమునం దున్నంత యిటఁ జూపట్ట లేదు. కారణ మేమై యుండునో! ఏప్రతియందైన నిట్లున్నదేమో విచారింప నగు. ద్రౌపదీధృష్టద్యుమ్ను లయోనిజులై యగ్నిం బుట్టుటకు నైనకారణము మూలమున సహేతుకముగాఁ జెప్పఁబడియె. న. భా. లో నట్లు లేదు. గంగామహాత్మ్యవర్ణనమును న. భా. లో లేదు.

290 వసిష్ఠకల్మాషపాదార్వాదికథలలోను మత్స్యయంత్రభేదనములోను మూలముకన్నఁ గొన్నిమార్పులు న. భా. లోఁ గలవు.

299 న.భా. లో "శిశుపాలజరాసంధశల్యకర్ణులు దర్పితులై క్రమక్రమమున నెక్కి విఫలురై క్రమంబున నలువురు మాపయి నుద్ధరోమధమాత్రంబులు దక్క గానయం బెక్కించియు మోపెట్ట నశక్యంబైన నక్కుసుడి నెక్కిన" అని యున్నది. ఇందుఁ గర్ణుఁడు రోమమాత్రవ్యవకాశమునుగా వింట నారినెక్కించె నని యున్నది. మూలమున నిది లేదు. కర్ణుఁడు పూర్ణముగా వింట నెక్కు వెట్టి బాణములు గొని సంధింప నున్నచో ద్రౌపది చూచి వీఁడు శూద్రుఁడు గాన మత్స్యయంత్రము నేసినను నేను వీని వరింప నని యుచ్చస్వరంబునఁ జెప్పినఁ గర్ణుండు ధనువు విడిచె ననిన ట్లున్నది. దీనివలన ద్రౌపది గాంభీర్యగౌరవాదులు లేకపోవుచున్నవి. న. భా. లోని మార్పునకుఁ గారణము మృగ్యము.

304 ద్రుపదుఁడు తనకు వచ్చినయల్లుఁ డెట్టివాఁ డగునో యని చింతించుచుఁ దనకొడుకు ధృష్టద్యుమ్నునితోఁ బలికిన పలుకులు న. భా. లో లేవు. వైవాహికపర్వమందలికథలు న. భా. లో స్వల్పముగా గానవచ్చును. పంచేంద్రోపాఖ్యానము నిల్లయున్నది. చూ.

317 ఇంగు భీష్ముఁడు చెప్పినప్రకారము సంధి యైనను జరుగుటంజేసి పాండవులు కర్ధరాజ్యము ప్రాప్తించినది. ఆకారణముచేతనే నాసగము మా కిమ్మని ధర్మరాజుఁడు కారవులం గోరియున్నాఁడు. ఈసూత్రమున న. భా. లో "దైవృకంబగు రాజ్యంబు పాండవుల కిచ్చి వారితోడ బద్ధప్రణయుండవై కీర్తి గనుఁగొనుము" అని భీష్ముఁడు చెప్పినవాక్యమునుబట్టి పాండుఁడే కురుదేశమునకు రాజు గాని ధృతరాష్ట్రుఁడు రాజు గాఁ డని స్పష్టపడుచుండఁగా లోఁగడ నున్న "ఆంబికేయు రాజ్యాభిషిక్తుం జేసి, ధృతరాష్ట్రుఁడు రాజ్యము సేయుచుండఁగా" అను నివి ప్రక్షిప్తము లని యూహించుట కెంత యును సందేహింపవలసినది లేదు.

327 ఉలూపి యర్జునుం జూచి మోహించి వర్ణించుట న. భా. లో లేదు. ఉలూపికి ఉలూచి యని యున్నది. అర్జునునితీర్థయాత్ర 12 సంవత్సరములు లని మూలమున నుండఁగా 12 మాసములు లని న. భా. లోఁ గలదు.

329 ఉలూపి యర్జునునకు జలచరములవలన భయము లేకుండ వరమిచ్చుట న. భా. లో లేదు. ఇరావంతుఁడు పుట్టినట్లు కొన్నిప్రతులలో లేదు. నాగలోకమునుండి యర్జునుఁడు తనంతఁ దానె గంగాద్వారమునకు వచ్చినట్లు న.భా.లోనున్నది. మూలములో నులూపియే తెచ్చి విడిచి పోయినట్లున్నది.

330 మణిపూరపురమునకు మణిపూరుపుర మనియు మూఁడుసంవత్సరములకు మూఁడుమాసము లనియు న. భా. లోఁ బడియున్నది. అచ్చుతప్పులు గానోపు

332 కృష్ణుం డర్జునునిచే రైవతకాచలంబున యతివేషము వేయించి ద్వారకాపురంబునకుఁ దోడ్కొని పోయి నట్లు మూలములో నున్నది. న. భా. లోఁ బ్రభాసతీర్థమం దున్నయర్జునుఁడు ద్వారక కేగ నెంచి యట నన్యులు దన్నెఱుంగకుండ యతివేషము స్వీకరించినట్లును అప్పు డటకు శ్రీకృష్ణుఁడు వచ్చి యతని ద్వారకకు దోడ్కొనిపోయిన వెనుక యట నుండి రైవతకమునకుఁ దోడ్కొని పోయి నట్లును తరువాత బలరాముడు ద్వారకకు రానలయు నని కృతకయతిని గోర నాతఁడు ద్వారకకు వెళ్లినట్లు నున్నది. ఎట్లు సరియో! కొన్నిప్రతులందు రైవతకమునుండియే సుభద్ర నర్జునుఁడు హరించి నట్లున్నది. కొన్నిప్రతులందు యతివేషము లేనే లేదు.

336 అర్జునుఁడు సుభద్రను దోడ్కొని యింద్రప్రస్థపురంబునకుం బోయి యట యథావిభవవిస్తరంబున వివాహము చేసికొనియెఁ గాని ద్వారకాపురంబున వివాహము చేసికొనినట్లు మూలమున లేదు. బలరాముఁడు తెలియంగకుండ "వాసుదేవుండు వసుదేవాక్రూరసారణసాంబసాత్యకిసహితుండై యంతర్ద్వీపంబులనుండి వచ్చినయనంతరంబ యమరావతినుండి యమరసిద్ధమునిగణపరివృతుండై యమరేంద్రుండు

మయుఁడు చేసి దానిని 14 వేలరాక్షసకింకరులచే మోయించుకొని వచ్చి ధర్మరాజున కిచ్చిన ట్లున్నది. సరోవరములు తోఁటలు మోచికొనివచ్చుట మూలమున మృగ్యము. మూలములో బిందుసరముకడ గోడలపై కప్పు (కట్టడము) అంతయుం గూర్చుకొని దాని మోయించుకొనివచ్చి యింద్రప్రస్థములో నియమితస్థలమున గోడలు గట్టి దానిపైఁ బెట్టి సభ నిర్మించి దానిచుట్టును దోఁటలు జలాశయములు కల్పించె నని యున్నది.

358 నారదుఁడు ధర్మజానియొద్దకు వచ్చినప్పుడు “నీరజమిత్రుఁ డేల” అనునమూలక మైనపద్యము న. భా. లోఁ జెప్పఁబడియున్నది. మూలములోఁ దత్కాలోపయోగ మైనట్టినారదునినీతి,విద్య,జ్ఞానము,ప్రజ్ఞ మొదలుగునవి చక్కఁగా వర్ణింపఁబడినవి.

383 నారదునకు సూర్యుఁడు ప్రత్యక్షమై బ్రహ్మలోకమునకుం గొనిపోయి చూపినట్లు న. భా. లో నున్నది. సూర్యుఁడు తనకుఁ బ్రత్యక్షమై నప్పుడు నారదుఁడు తనకు బ్రహ్మలోకముం జూపుమని కోరఁగా వేయేండ్లు తపించినవెనుకఁ జూడ వచ్చు నని సూర్యుఁడు చెప్పినట్లును నారదుఁ డట్లు చేసినట్లును వెనుక సూర్యుఁడు వచ్చి తోడ్కొని పోయి బ్రహ్మసభం జూపినట్లును మూలమున వర్ణింపఁబడినది.

441 దుస్ససేనుఁడు ద్రౌపదికడ కరిగి నీవు మాకు ద్యూతజితదాసివి సభకు రమ్మని బలాత్కరింపఁగా నామె జడిసి వృద్ధస్త్రీలు గలచోటికిఁ బాఱిపోయె ననియు వాఁడును గూడఁ బాఱి కొప్పు వట్టి తిగిచి సభ కీడ్చుకొని వచ్చె ననియు మూలమున నున్నది. న. భా. లోఁ బ్రాతికామితోడనే ద్రౌపది సభకు వచ్చి కురువృద్ధుసమీపంబున నున్నట్టు వ్రాసియు “దుర్యోధనుండు దుశ్శాసనుం బిలిచి ప్రాతికామి వృకోదరునకు వెఱచు నీవు పోయి ద్రౌపదిం దోడ్కొని రమ్మని” పంచి నట్లు మరల వ్రాయఁబడియె. అది యెట్లెంగి ద్రౌపది గాంధారియొద్దకుఁ బాఱిపోయి నట్లున్నది. సభలో నున్న ద్రౌపదిని మరల సభకు దీసికొనిర మ్మని దుర్యోధనుఁడు చెప్పుట యెట్టిదో ఆమె గాంధారికడకుఁ బాఱుటయెట్టిదో తెలియదు. ఇట్లు మూలమున లేదు. ఈమార్పులకుఁ గారణ మగోచరము.

455 గాంధారి దుష్టుఁ డైనతనకొడుకు దుర్యోధనునిఁ ద్యజించు మని తనభర్తతోఁ జెప్పినగొప్పవిషయము న. భా. లోఁ బరిత్యజింపఁబడినది. ఇట్లు చెప్పుటవలన గాంధారియుత్తమత్త్వము లోకమునకు వెల్లడి యగును. ధృతరాష్ట్రుఁ డెంతచెడ్డవాఁడో గాంధారి యంతమంచిది యని తెలియనగు. అది న. భా. లో లేకపోయినది.

ఇట్లు స్థాలీపులాకన్యాయముగా నాదిసభాపర్వములయం దక్కడక్కడఁ గలవిషయములందలి న్యూనాధికవ్యత్యయవినిమయాదులు నా నేర్చినట్లు మూఁడుగ్రంథములును జదివి యిట్లు సూచించి వ్రాసినాఁడను. ఈసూచించినతావులు తక్కఁ దక్కినతావుల మూలానుసారముగా నన్నయభట్టారకుని భారత మున్న దనిపాఠకు లూహింతురేమో యట్లు కాదు. ప్రతిపత్రమందు నేదో యొకవిధముగా [illegible]త్యయవినిమయాదులు గానం బడుచునే యున్నవి. గ్రంథవిస్తరభయంబున నే నింత [illegible] పాఠకమహాశయులారా! సంస్కృతభారతమును జెంత నుంచుకొని [illegible] మాత్ర మిట్లు వ్రాసి సంక్షేపించితిని. [illegible] భారతమును జదివినచో నానుడులు నానుడులు గా వనియు [illegible]కొని, నన్నయభట్టారకునిభారతమును శ్రీకృష్ణ[illegible]ము. వేయిసంవత్సరములనాఁటిగ్రంథము గనుక సత్యము లనియు మీకుఁ దోఁప కుండ వని నానమ్మకము. నేను నన్నభటును దూషించితి నని యెప్పుడును న. భా. లో నిట్లు ప్రక్షిప్తములు పడిన వని చెప్పుట కాని [illegible] దలంప కుందురు గాక యని విన్నవించుకొనుచున్నాఁడను.

మృత్యుంజయశాస్త్రి.
పిరాట్ల

—

# విషయసూచిక.



## ఆదిపర్వము—ప్రథమాశ్వాసము.



## ఆదిపర్వము—ద్వితీయాశ్వాసము.



## ఆదిపర్వము—తృతీయాశ్వాసము.

## ఆదిపర్వము—చతుర్థాశ్వాసము.

## ఆదిపర్వము—పంచమాశ్వాసము.



## ఆదిపర్వము—షష్ఠాశ్వాసము.

ఆదిపర్వము—సప్తమాశ్వాసము.

## ఆదిపర్వము—దశమాశ్వాసము.

సభాపర్వము—ప్రథమాశ్వాసము.



సభాపర్వము—ద్వితీయాశ్వాసము.

## సభాపర్వము—చతుర్థాశ్వాసము.





జనరంజేసినపాపసోమిదమనున్ ♦ నాత్రాతికుం దాత్రుఁ
త్ని ని సాక్షాత్పరదేవతామణిమెయిన్ ♦ నే నెంచి కీర్తింతునన్. ౬

ఉ. లోకులపాపముల్ దులుప ♦ లోఁ దలపోసి సరస్వతీనదిన్
వాకులఁ బూని రామగుణ ♦ వర్ణనముం బొనరించి పెంచు సు
శ్లోకులఁ గృత్తచిత్తగత ♦ శోకుల హర్షితసర్వలోకవా
ల్మీకుల సత్యవాకుల న ♦ మేయవివేకుల నాశ్రయించెదన్. ౭

శా. వేదంబుల్ విభజించునట్టిగరిమన్ ♦ విశ్వైకధర్మాంగమై
వేదార్థంబును బోనిధానినుమహా ♦ వేదంబు నిర్మించి క
ల్యాదిన్ లోకము నుద్ధరించినఘనున్ ♦ వ్యాహారసిద్ధార్థునిన్
వేదవ్యాసమునీంద్రు భక్తిమెయి భా ♦ వింతున్ సచ్ఛుద్ధికై. ౮

ఉ. ఏవి విలాసవాక్యములు ♦ వేతిగులాటకోటంబులై చనెన్
వాణికి నాంధ్రభాషయము ♦ ప్రస్తుతి కెక్కఁగఁ జేసి వానిని
భూనలహాసకారిముఁ ♦ బోయినయట్టికవిత్రయంబు నే
భావన సేయుచుం దెలుఁగు ♦ పుట్టిన నట్టి నాకుఁ దోఁచెడిన్. ౯

ఆ. కావ్యశాస్త్రగురుని ♦ ఘను నాగలింగార్య, నర్య స్మార్తగురుని ♦ బ్రహ్మసోమ
యాజి శ్రౌతగురుని వాజపేయాన్వయుఁ, బాపసోమయాజిఁ ♦ బ్రస్తుతింతు. ౧౦

సీ. సృష్టికిఁ బ్రతిసృష్టిఁ ♦ జేసినకౌశిక, మునిగోత్రమునయందుఁ ♦ బుట్టినాఁడ
వెలనాటివైదికి ♦ విప్రుండ వేంకట, సోమయాజికి సుబ్బ ♦ సోమిదమకు
నగ్రపుత్రుఁడ వైది ♦ కాచారనిరతుండ, శోభితాపస్తంబ ♦ సూత్రవిదుఁడఁ
బృథివీధవులు మెచ్చ ♦ వివిధానధానముల్, బలిఁ బొనర్చితసర్వ ♦ లాపితకోటుఁడ
తే. బ్రథితకవిరాజబిరుదవి ♦ భ్రాజితుండ, మహితరాజాధిరాజ ♦ మాన్యితుండ
రాజమహేంద్రపురీవర ♦ ప్రస్తుతుండఁ, గృతివిశారదకీర్తి శ్రీపాద ♦ కృష్ణమూర్తి. ౧౧

సీ. పదియు నాటకంబులలో ♦ పల సత్యకథయు నా, విక్రీచరిత్రంబు ♦ చిత్రశతక
మిరువదేడులలోన ♦ నరగౌతమీమహా, త్మ్యము కాళిదాసవృ ♦ త్తాంతవచన
మిరువదైదేండ్లలో ♦ నే కానఁబడియె జగ, న్నాధచరిత గజా ♦ ననవిజయము
ముప్పదేండ్లలోన ♦ మునుముద్రితము కావేరి, కథ వధూవిజయము ♦ కనకగిరియు
తే. నవల శ్రీవేంకటేశ్వర ♦ యమునా హీరం, రుద్రవిజయము ప్రద్యుమ్న ♦ భద్రచరిత
బొబ్బిలియువేణీసంహార♦ముకిలభాషి,తియును మోహినిరాజభ ♦ క్తయునుమొదలియు.

భారతమందు మాకొలము • వర్ణనముం బొనరించుచుం గడుం
గోరిక మీఱ నాంధ్రమునఁ • గూర్పుము నేర్పున సర్వపర్వముల్. ౨౭

వ. అని కర్పూరతాంబూలంబును సువర్ణాంబరంబులునుం బెట్టినం బట్టి సంతసించుచు.

చ. అడిగినదానికన్న నధి • కార్థము లర్థుల కిచ్చు నోటితో
నొడివినదానికన్నఁ గడు • నూఱ్ఱుని చేయును జెన్ను మీఱ నె
య్యెడ దురితంబులం దలఁపఁ • డిప్పటి రాజమహేంద్రిఁ జెన్న నీ
యొడయఁడు భారతప్రియుఁడ • హో యని యెంచెద భాగధేయమున్. ౨౮

వ. అని ప్రశంసించి దీవించుచు ముందు మంగళాచరణంబు గా నస్మన్మహీజానివంశావతారం బభివర్ణించెద. ౨౯

## వాసిరెడ్డివారి వంశవర్ణనము.

సీ. సకలసురాసుర • ప్రకరార్చితాచ్యుత, సదమలపదకంజ • సంభవంబు
పావనీకృతవిష్ట • పత్రయసురనిమ్న, గాకృపాకలితజ • ఘన్యజంబు
వేదవిద్యాదేవ • పాదపంకేజస, మారాధనాతిభ • క్త్యంచితంబు
న్యాయసమాసాది • తాఖండధనసంచ, యాధరీకృతరాజ • దైలబిలము

తే. శాసితాఘంబు పరమార్థ • సంయుతంబు, సన్నుతాచారనిరతంబు • సౌమ్యలంబు
పరమవిభవంబు సత్కవి • వర్ణితంబు, తుర్యవర్ణంబు కీర్తి నం • దుం ధరిత్రి. 30

తే. అల్లవర్ణంబునం దొగి • నవతరించి, కమ్మవారన మిగుల వి • ఖ్యాతిఁ గాంచి
కొండ లొప్పెరి నల్లుట్ల • గోత్రభవులు, భవసమారాధనాసక్తి వై • భవులు కవులు.

చ. ఘను లయి భూతలేంద్రు లయి • కమ్మకులార్ణవపూర్ణచంద్రు లై
తనరిన వారిలోఁ గడు ను • దారుఁడు ధీరుఁడు వాసిరెడ్డి నాఁ
జనుమహిఁ గొన్న వాఁడొకఁ డ • సంగుటచే మును వాసిరెడ్డివా
రినఁబడి వాసి నందిరి త • దన్వయమం దగువార లందఱున్. 3౨

చ. అతఁడు సదాశివుం డనెడు • నాఖ్య నెసంగుచు మున్ను వేమభూ
పతికడ విక్రమంబునను • బ్రస్తుతి కెక్కినవాఁడు వాని కా
క్షితిపతి వాసిరెడ్డి యను • కీర్తికి నాబిరు దిచ్చి దక్షిణ
క్షితిపతిఁ జేసె నందునఁ బ్ర • సిద్ధి వహించిరి వానివంశజుల్. 33

క. అలవాసిరెడ్డివంశజు, లలఘుగుణాన్వితులు శంక • రారాధనచి
త్తులు భూరిదానకల్ప, ద్రులు సత్యపరాయణులు వి • ధూతాఘచయుల్. 3౪

తే. అతఁడు తనతండ్రిపేర జ ♦ గ్గయ్యపేట, తల్లిపేర నచ్చమపేట ♦ తనదుపేర
మన్నెసుల్తానుపేట యు ♦ మఱి యురాజు, పేటనాయనిపేటయు ♦ వెలయఁజేసె.

క. మకుటాంగదాదిభూషల, సుకలుం డగు వేంకటాద్రి ♦ శోభిల్లి మయూ
రక వాహనప్రచారము, సకనకమణిగజరథప్ర ♦ చార మొనర్చెన్. ౨౦

క. గురువులు విద్వజ్జనములు, హరివేష్టింపుచుఁ బఠింప ♦ భగవద్గీతల్
నిరతము శంకరపూజా, పరతంత్రుం డగు నతండు ♦ పండితుఁ డగుటన్. ౨౧

సీ. అమరావతీపట్ట ♦ ణాధివాసంబు ను, విబుధపాలనము ను ♦ వేడ్కఁ గలిగి
సుమనోమనోజ్ఞను ♦ క్రమము సుధర్మను, వర్తనేష్టతయు ను ♦ వరుసఁ గలిగి
నందనవనశైల ♦ నము దివ్యసంతాన, సందర్శనేచ్ఛ యుఁ ♦ జాలఁ గలిగి
శతకోటిశక్తిసం ♦ తత వైభవంబు ను, నాకరాజ్యప్రాప్తి ♦ [illegible] గలిగి

తే. బ్రహ్మహత్యాఘము ను దుష్ట ♦ వర్తనంబు, స్త్రీభుక్త్యంబు వేశ్యాప్ర ♦ సక్తిగోత్ర
భిత్త్వము ను లేక భవ్యమై ♦ వెలసినట్టి, వేంకటాద్రీంద్రుఁ బోలఁడ నా ♦ వేయినోళ్ల.

సీ. అల వేంకటాద్రినా ♦ యఁడు వెలుఁగొందుచు, వెట్టమ్మఁ బార్వతిఁ ♦ బెండ్లియాడ
తనయులఁ బడయక ♦ కనుతాపమునఁ గుంది, పినతండ్రిపౌత్రుఁ డై ♦ తనరు పద్మ
నాభనామున జగ ♦ న్నాథబాబులలో న, వరజుని దన సెస్థ ♦ భార్య కనియుఁ
బెదతండ్రిపౌత్రుఁ డై ♦ పొదలు నాగానాయనామ, నాథులలోన వె ♦ న్కనగువానిఁ

ఆ. జిన్నభార్య కనియు ♦ స్వీకరించెను దత్త, హోమవిధిని బుత్త్ర ♦ యుగ్మ మందు
వయసుకతనఁ బెద్ద ♦ నాఁడు నాగన్న జగ, న్నాథబాబు ధరణి ♦ నాథుఁ డయ్యె. ౨౩

చ. ఘనుఁ డగు వేంకటాద్రినృప ♦ కౌశికుఁ డై యమరావతీపురం
బున వసియించి నేలి ధర ♦ ముప్పదినాలుగువత్సరంబు ల
న్వెనుక బుతుక్షితీభవిధు ♦ విక్రమతేనగణాశకాబ్దమం దగ
ష్టునఁ బరలోక మేగె నటు ♦ సొంపునఁ బెంపగు రాజ్య మేలఁగన్. ౨౪

వ. అంత నా వేంకటాద్రినాయనిదత్తపుత్త్రు లగువారు. ౨౫

ఉ. భూరమఁ గోరి పొందు విడి ♦ పోరిరి కోర్టుల నందుఁ దొమ్మిదేం
డ్లారట మెచ్చ నేలి యిల ♦ నగ్రజుఁ డిర్వదితొమ్మిదేండ్లవాఁ
డారయువారు లేనితఱి ♦ నచ్చమ రంగమ నాఁ గళత్రముల్
ధారుణిఁ గుందఁగా విడిచి ♦ తాఁ జనె స్వర్గసుఖంబు లందఁగన్. ౨౬

తే. అంత నాతని రెండవ ♦ కాంత రంగ, మాంబ లక్ష్మీపతి యనంగ ♦ నలరువానిఁ
బరఁగఁ గైకొని వచ్చి పెం ♦ పకము చేసి, కొని మఱఁదితో సపత్నితో ♦ ననికిఁ జొచ్చె.

తే. కప్పములు గట్టమానిన • కారణమున, దొరతనమువారు వారల • ధరణిరాజ్య
మంతయును గొని తగునట్టు • లందఱకును, భరణమిడ నొచ్చిరిప్పటి • వఱకు గరుణ.

తే. రంగమాంబకు దత్తుఁడై • రమణ మెఱయు, నతఁడు వేంకటలక్ష్మిని • సతినిబడసి
కనియె నరసింహనాయు • ఘనుఁ డతనికి, రమణి వేంకటలక్ష్మమ్మ • రసమదనరె.

సీ. అమరావతీశ్వరుం • డగు వేంకటాద్రిరెం, డనపత్నిపుత్త్రుఁడై • భువి నెసంగు
రామనాథము బాబు • రమణి పార్వతి వారి, కిరువురుసుతులు దా • శరధినాయఁ
డనల శివప్రసా • దాఖ్యుండు వానికి, జ్ఞానప్రసూనాంబ • జాయ యయ్యె
నాదాశరధికి ల • క్ష్మీదేవమయును బం, గారమ్మయును సతుల్ • గలరు జగతి

తే. వారియందు లక్ష్మీదేవి • వరసుతుంను, రామనాథబాబాతఁడు • రాజ్యలక్ష్మిఁ
బడసి యామెవలనఁ గాంచె • బాలచంద్ర, శేఖరవరప్రసాదప్ర • సిద్ధనామ. ౮౦

తే. దివ్యగుణ వేంకటాద్రిసి • త్ప్రవ్యపౌత్రుఁ, డైన శ్రీపద్మనాభరా • మన్న సత్య
దేవమాంబనుగైకొని • దేవిగాఁగ, నాయుఁడమ్మను సుతుఁగని • నలువుమీఱె.

సీ. ఆనాయుఁడమ్మకు • నభిజనస్తోత్రపా, త్రునన కైరి నెట్టెను • దుర్గమాంబ
వేంకటలక్ష్మమ • వెలఁదుక లందువేం, కటలక్ష్మి కాత్మజుల్ • గలిగి రిర్వు
రలపద్మనాభరా • మన చంద్రమౌళి యు, నన వారిలో ఘనుం • డైనపద్మ
నాభరామన పరి • ణయమై విశాలాక్షి, నన్నపూర్ణను వారి • యందు నగ్ర

తే. సతివలననాయుఁడమ్మను • సుతునిగనియె, నతఁడు రాజ్యలక్ష్మిని బెండ్లి • యాడియామె
యందునాత్మజులను వేంక • టాద్రినాయు, సిని జగన్నాథబాబును • గనితలిర్చు.

శా. శ్రీమంతుం డగుచంద్రమౌళి గరిమన్ • జెన్నారుచుం జానకీ
శ్యామన్ లక్ష్మిని బెండ్లియాడి నెన రె • చ్చన్వాసుదేవాద్యమా
డామాణిక్యవరప్రసాదుఁ గనె వే • డ్కం దత్కుమారుంను ని
త్యామోదంబున సుందరాంబ సతి గా • వారొప్పెందు నంశంబునన్. ౮౩

ఉ. వీరుఁడు మూలపూరుషుఁడు • వీరపనీనికుమారరామధా
త్రీరమణుండు రాఘవపు • రిన్నివసించి విభుత్వమేర్పడం
దా రఘురామఁ డో యనఁ బ్ర • థం బొలు పొందుచు నైదువర్షముల్
ధారుణిరాజ్య మేలి పర • ధామము నొందెను గీర్తిశేషుఁడై. ౮౪

తే. నృపతియతనికి వీరప • నీఁడురాఘు, వయ్యుచినపద్మనాభ భూ • పతియుఁ జంద్ర [మీఱ.
మౌళియును రామలింగన • మతియునరస, నయును సుతులార్వురై యొప్పి • రయుము

తే. మూలపురుషునిమూఁడవ • పుత్త్రుఁడైన, చంద్రమౌళిగారమ్మయైన • సాధ్వియందు
రాఘవయఁ గాంచి యేడేండ్లు • రాజ్యమేలె, రామరాజ్యము ప్రజలకా • భూమిఁ దోఁప.

మ. ఘనబాహాబలశాలి రాఘవమహీ • కాంతుండు దా నెంతయే
ఘనుఁడై తండ్రి ప్రభుత్వము న్సెలుపున • క్కాలంబున న్దేశముల్
గనునాసం జని కాశిముఖ్యపదము • ల్గాఞించి సేవించి నిం
చినవేడ్కం జనుదెంచుచుం దగ వసిం • చెం దారి ఢిల్లీపురిన్. ౯౭

చ. ప్రెగడలపేర్మిమూలమునఁ • బెంపెసలారుచు భూతలేశ్వరుం
డగు నవురంగజేబుకడ • నశ్వవిలాసగతిప్రకారముల్
తగుకరవాలచిత్రములు • లక్ష్యవిభేదవిశేషమార్గముల్
మొగిఁ బ్రకటించి వానిమన • ముం గరఁగించె నతండు దంచి స్థై. ౯౮

ఉ. ఆతనిచేఁతకు న్మిగుల • నచ్చెరు వందుచు మెచ్చి పాదుషా
భూతలనాథు లెవ్వరు ను • బోలరు నీకు బళీ ఘనుండ వౌ
తాతల మించి తన్నిటము • డం బని చాల బహూకరించి తా
నాతని నంపి పుచ్చెఁ బ్రజ • యుంబున నెయ్యము విస్తరింపుచున్. ౯౯

తరు. అతఁ డంత నిజపుర • మరుదెంచి పిత్ర్య • మగు రాజ్యము వహించి • యశముఁ గమించి
సతి శాకమూరివం • శజ వేంకటాంబ • సహధర్మిణిగ నొంది • సకలసౌఖ్యంబు
లతుక వైభవమున • నలరారి మేటి • యగురాజనామాన • చ్చిన యనులక్ష్మీ
పతిని గాంచి ధరిత్రిఁ • బదియు మూఁడేండ్లు • పాలించి ప్రాపంచెఁ • బరమపదంబు.

ఉ. అంతట రాజమౌళి ప్రభు • వై చిరమానితపాపమాంబికన్
గాంతగ సేకరించుకొని • కాంచి కుమారుని జంద్రమౌళి నా
మ్మాంత యు నందిగ్రామమును • యేటికిఁ గాల్వలు ద్రవ్వఁ జెట్టి య
చ్చింతలపాటివంటు వరి • చేలను బండఁగఁ జేసె వాసిమై. ౧౦౧

ఆ. దానకర్ణుఁ డనఁగఁ • దగి రాఘవుని రాజ, మౌళి యెన్మిదేండ్లు • నేల యేలి
కీర్తిశేషుఁ డయ్యె • మూర్తి యొక్కటి లేదు, గాని రాజమౌళి • గిలఁడు జగతి.

ఉ. భూపతిసూతి బాల్యమును • బొందుట వచ్చిన రాజ్యమేలి ల
క్ష్మీపతి నాఁగఁ బేరుఁ బ్రబ • సిద్ధి వహించుచు నట్టికాలమం
దే పగు రామరాజ్యము గ్ర • హించి విభాజ్యము చేసి వాసిమై
నాపము నాఁగఁ బంచుకొనె • నా ఆడి వోఁబిన తాతపాత్రుతోన్. ౧౦౩

తే. అట్లు రాజ్యాభివృద్ధి గాఁ • నవని నేలి, జాణయై చంద్రమౌళి పొఁ • సఁగఁ జూచి
వానిరాజ్యమువాని క • ప్పనముచేసె, సుజనుఁడై యచ్చెనాహ్వయ • క్షోణివిభుఁడు.

చ. తనపినతండ్రి రాజ్యమునఁ • దన్నటునిల్పఁ జంద్రమౌళి పెం
పునఁ దగి సీరుకొండకుల • భూషణమై తగుపార్వతమ్మ యన్
వనితను బెండ్లియాడి కను • వైభవ మేర్పడ రామలింగవీ
రన లనుసూనులం గని ధ • రం బెడఁబాసె నొకింతలోపలన్. ౧౦౫

క. మనుములు శైశవదశనే, గనుపట్టఁగ మరలఁ బుడమిఁ • గైకొని యేలెన్
ఘనుఁ డగునచ్చన సీలువది, యెనిమిదియేం డ్లిల విభుత్వ • మెసఁగ నతనికిన్.

మ. ధరణీరాజ్యభరంబు పూని పొలుపొం • దం జంద్రమౌళిప్రభూ
త్తరపుత్త్రుం డగురామలింగమనుజా • ధ్యక్షుండు నష్టాంశమున్
బరిపాలింపఁగ నాత్మసోదరుని నొ • ప్పం బుచ్చి కృష్ణానదీ
వరతీరంబున నుండెఁ దా వరణ మొ • ప్పం గట్టి ముక్త్యాలలోన్. ౧౦౬

ఉ. వీరన నష్టరాజ్యమును • వేడుకఁ గైకొని వేంకటాద్రిగో
త్రారమణాగ్రగణ్యునకుఁ • దండ్రియు నాగసపుత్త్రిఁ జైకడుం
బేరిమిఁ గన్నజగ్గప్రభు • వీపతితో సరి గాఁగ నేలుచో
వీరనఁ ద్రోచి జగ్గప్రభు • వీపతి చేకొనె సర్వరాజ్యమున్. ౧౦౭

సీ. రామలింగకుమా • రమణుండు చిరుమామి, ళాన్వయభవ వేంక • టాంబఁ దొలుత
నవలఁ బుదుంబాక • మనువంశమున నైన, పద్మాక్షమను వేడ్కఁ • బరిణయమయి
తేజు మీఱఁగఁ గాంచె • రాజమౌళిని లక్ష్మి, పతినాముఁ రాఘవ • ప్రభువుఁ జంద్ర
మౌళి వేంకయ యనం • బడు వేంకటాద్రి నా, నగువాని నేవుర • నాత్మజులను

తే. వార లేవురునుం బంచ • పాండవు లనఁ, బంచబాణము లనఁ బంచ • పర్వము లనఁ
బంచరత్నము లనఁ బంచ • వదనము లన, నెంచ నొప్పిరి ధరణియం • దంచితగతి.

శా. వర్షీయుం డగురాజమౌళి కడిమి • న్భాసిల్లి దేశంబు లా
కర్షింపం దగుపారుపాదయకు యో • గ్యత్వంబు దానం జగ
ద్ధర్షంబుం గొనఁ గూర్చునట్టిబిరుదుల్ • తద్రాజ్యముం బొంది స్వో
త్కర్షంబుం భువిఁ బాదుకొల్పె రిపువ • ర్గం బెల్ల భీతిల్లఁ గన్. ౧౧౦

సీ. అట్లు విభుత్వంబు • నంది యొక్కెటిలోఁ, బ్రతికూలవిధి కయ్యె • రాజమౌళి
తద్వ్యసనంబునఁ • దండ్రి కుందుచు నుండ, జగ్గన మరల రా • జ్యంబు నొడిచె
నిరువదొక్కేండ్లు భూ • భరముఁ దాలిచి మీఁద, రామలింగన స్వఃపు • రంబుఁ జేర

సీ॥ మొదలనీఁడయ్యె నే ♦ సదమలహృదయుండు, రాజర్ధనంబున ♦ రాజరాజుఁ
బొదల నీఁడయ్యె నే ♦ బుధమాన్యచరితుండు, జ్ఞానప్రపత్తి మై ♦ జనకరాజుఁ
గదల నీఁడయ్యె నే ♦ కరుణావలోకనుఁ, డతివిసర్జనమున ♦ నంగరాజుఁ
బ్రిదుల నీఁడయ్యె నే ♦ విఖ్యాతనాముండు, దివ్యభోగంబున ♦ దేవరాజు
తే. నతఁడు వెంపొందు నాసిరె♦డ్డ్యన్వవాయ, కలశవారాశిచంద్రుండు♦కాశ్యపీంద్ర
వినుతసద్గుణసాంద్రుండు ♦ విమలసుగుణ, పాలిచిన వేంకటాద్రిభూ ♦పాలమౌళి.
సీ. రామరాజ్యము వోలె ♦ రాజ్యమేలుచుఁ బ్రోచెఁ, బ్రజలను దనకన్న ♦ ప్రజలయట్లు
కోమటోప్పఁ జేయించె ♦ గోపురప్రాకార, ములను ముక్తీశున ♦ కలనుభక్తి
సోపానములు గట్టి ♦ శ్రుతిశైలనరసింహ, మూర్తిదేవళములఁ ♦ బొదలఁజేసెఁ
గవుల మన్నించి సొ♦గ్గలుగఁ గృష్ణానదీ, మాహాత్మ్యకృతి నందె ♦ మహిమమీఱ
తే. మఱియు సగౌతులు చెఱువులు ♦ మహిని నిల్పి, తోటలందుఁ బెండ్లోఁటలు ♦ పాదుకొల్పి
వసతు లెన్నెన్ని యోప్రప ♦ నసలకిచ్చి, యశము గడియించెఁ జిన వేంక ♦ టాద్రివిభుఁడు
క. ఆపతి వేంకమ్మయుఁ బాపమయుల నసకులాయ్బ ♦ పత్నులు గాఁగన్
శ్రీపతికరుణాపాత్రుం, డై పంద్రెండేఁడు ♦ లేలె నవనీస్థలమున్. ౧౨౧
ఉ. ఆచిన వేంకటాద్రినృపు ♦ లందు నుతింపఁగ నెప్పు నెంతయు
న్యాచకకల్పవల్లి సుగు ♦ ణప్రసణుత్రి ముముక్షుకాశిసీ
వాచకపాత్రభూతి గుణ ♦ వల్లి పవిత్రసతీమతల్లి తా
నాచిరుమామిళాన్వయము ♦ హేమంత పాపము పాపనూగ న్గై. ౧౨౨
తే. పుట్టినిల్లెల్లఁ గలఁగించి ♦ మెట్టినిల్లు, ననుఁజేచ రివురించె శ్రీ ♦ వనిత యనుచుఁ
దిట్టి పుట్టినయింటి ♦ మెట్టినింటి, కిరయఁ బొసంగ మిక్కిలి ♦ గిరిమఁ దెచ్చె.
ఆ. అన్నపూర్ణవోలె ♦ నన్నదానము చేసె, లచ్చివోలె సిరులఁ ♦ బెచ్చుపెఱిగి
ముక్తిపురమునందు ♦ ముక్తీశునకు గాలి, గోపురంబుఁ గట్టెఁ ♦ బాపమాంబ.
తే. అట్టిపాపమాంబికయందు ♦ సతఁడు గనియెఁ, గ్రివమునభ వానిముక్తీశ్వ ♦ రప్రసాద
నాయనిం జంద్రిమాకిభూ ♦ నాథుని న్స, దాశివప్రసాదాఖ్యునా ♦ త్మజుల మువుర.
క. నిసుగు లగుముగుర నెల విడి, వసుపావకసూర్యసంఖ్య ♦ వరయవనాబ్దం
బెసఁగఁ జిన వేంకటాద్రి ది, వసనాథుం డస్తమించె ♦ వగవఁగ జగముల్. ౧౨౩
శా. శ్రీముక్తీశ్వరసుప్రసాదమున నై ♦ చెన్నారునవ్వారిలో
భూమీశుం డయి పల్కవిప్రణతుఁ డై ♦ పొల్పొందఁ గా నై భవా
నీముక్తీశ్వరసుప్రసాదవిభుఁ డు ♦ న్మేషింప కున్నప్డు సా
ధ్వీమాణిక్యము తల్లి యేలెను ధరి ♦ త్రీపూజ్యసామ్రాజ్యమున్. ౧౨౪

క. అరయ భవానీముక్తీ, శ్వరప్రసాదవిభుఁడు వెలి • వరి యై యవల౯
ధరణీరాజ్యవిభుత్వము, భరియింప సమర్థుఁ డయ్యెఁ • బ్రాయముకలిమి౯. ౧౨౯

మ. హరిదంభోనిధిమిత్రసంఖ్య యవనా • బ్దాంతంబునం బ్రాప్తమై
ధరణీరాజ్య మెసంగ నాతఁడు గడుం • దాల్మి న్విభుత్వంబు సు
స్థిరుఁ డై చేయు చరణ్యము ల్వాలను లై • చెన్నొందఁ బండించుచుం
బరిపోషించుచు రాష్ట్రపుంబ్రజలఁ జె • ప్పం జొప్పడ౯ మెప్పున౯. ౧౩౦

తే. అట్టు లాతేండ్లు జరిగిన • యంత దొరలు, రామనాథునిదిగునంది • గాముతోడ
మరలఁ జింతలపాడు ప్రోమాదమునను, బన్నుకంచును గొసరికై • నసముగాఁగ.

శా. ఆరీతి న్నిజరాజ్య మేగినను బా • పాంబ్రాగపుత్త్రుండు ధీ
సారం బేర్పడ నేర్పునం దనరె కృ • ష్ణామండలేశుండు ప.
తారన్నిల్ దొర కూర్మిమై సలుపుచు • త్యంతోపకారంబున౯
భూరిప్రాభవ మంది వెంజియు ను జెం • పుం జెంచె మదాసున౯. ౧౩౧

సీ. మదరాసుగవర్నరై • పొదలెపువిల్లియం, థామసు డెనిసను • నాముఁ గవలఁ
గౌన్సిలు మెంబర్లు • క్లార్కును డబ్లియు, మోర్హెడ్డు నాములు • ముఖ్యులగును
ఫెల్లి స్ప్రింజియు మాల్టు • బీహడిల్స్టను నారు, బెత్సెట్టు పై కాప్టు • ప్రభ వెలిసను
సెక్రటరీ యగు • జే. డి. సిం నారుఁడు, మొదలగునధికారి • ముఖ్యులెల్లఁ

తే. దనకుఁ బరనా ... చుండ, రాజకీయంపుఁబను లెల్లఁ • దేశ మెఱయ
సెఁ గడఁక, నాసిరెడ్డికులేశ్వర • ప్రవరుఁ డలఁపు.
... రపురాసిరితోడ రాష్ట్రముం
బలరారఁగ దక్షిణస్థలాం
మము లన్నియుఁ జూచి వెంజియుం
చెను ముక్తిపురంబుఁ జేరఁగ౯. ౧౩౩

శా. శ్రీముక్తీలపురంబునందు విలస • త్సింహాసనాసీనుఁ డై
శ్రీమంతుం డయి పట్టభద్రుఁ డగుచు౯, జెప్పంగ నై సత్కృపల్
భూమీశు ల్పొగడంగ నైభవమునం • బొల్పొందు నా శ్రీభవా
నీముక్తీశ్వరసుప్రసాదవిభునిం • గీర్తింప సామాన్యమే. ౧౩౪

సీ. తనధన ... ంబుల, యందునే కాని వే • ఱొందు లేదు
తనదు ... సారక్షేత్ర, మందునే కాని వే • ఱొందు లేదు
తనయ ... దనఘుఁ ... ప, యందునే కాని వే • ఱొందు లేదు

తనదూషణం బంత • యును బురోభాగుల, యందునే కాని వే • తెంట లేదు

తే. తనదురాలోచనం బంత • తద్దయుఁ బర, దారగమనం బొనర్పడు • కూరిజనుల
యందునే కాని తలఁప వే• తెంటు లేద,నఁగ భవానిముక్తీశ్వర • నాముఁ డొప్పు.

సీ. శ్రీరంగనాయక • సేవకు నేఁటేఁట, ముప్పదార్ రూప్యము • లెప్పటికిఁ
దిరుపతివేంకటే • శ్వరునర్చ కేఁటేఁట, నేడార్లురూపిక • లిచ్చ నిచ్చెఁ
గంచికామాక్షిఁ బూ • జించుట కేఁటేఁట, నలుతొమ్మిదులురూపి•కల నొసంగె
వేదాద్రిముక్తుల • వేల్పుల నర్చింప, శాశ్వతభూములు • చాల నిచ్చెఁ

తే. దారణాబ్ధమున స్వేద • ధరన్నృసింహు,నెదుట నిల్పె ధ్వజస్తంభ•మెసక మెసఁగ
షష్టిపూర్త్యుత్సవము చేసి•బ్రాహ్మసురులకు, భూమిదానములొసఁగె నా•భూవరుండు.

క. ధన మింత యని గణింపక, మునియోటికిఁ గాల్వ త్రివ్వి • భూములు పండం
బొనరించి ప్రజలఁ బ్రోచెను, జనునాముక్తీశ్వరప్రి • సాదాఖ్యుఁ డిలన్. ౧౩౭

తే. ఎట్టివారికి సమకూర • నట్టిపర్వ, మైనసూర్యోపరాగము • నం దొసంగె
నుభయతోముఖగోదాన•ముర్విధనము, దక్షిణగఁ బెట్టిపార్థివో• త్తముఁ డతండు.

ఉ. పార్థివు లెల్లరుం దనకు • బాసట యై నలుచక్కి నిల్వఁ గా
నర్థులు దేహి దేహి యని • యంగ్రను నిందును సందడింపఁ గా
నార్థికులుం గవుల్ గురులు • సార్థక మంత్రము లుచ్చరింపఁ గాఁ
బార్థివలింగపూజఁ గడు • భక్తి నతం డని శం బొనర్చెనున్. ౧౩౯

క. చిరమూఖిల్ల కులార్ణవ, వరచంద్రుం డన్నపు
పరఁగిన వేంకటరామయ, వరసుత సౌభాగ్య

సీ. చాపలంబునఁ బెర • జనుఁ జేర నొల్లని, యఁ
బలుకాఁగ నై నోళ్లఁ • బడి రచ్చ లెక్క
మగనిసామేను వోఁ • దెగి గద్దరింపని, మృగ
పాటి చెప్పినఁ గాని • మ ాడఁ దలఁపని,
తేయనుచు నెల్లరుఁగొనియాడఁ బ్రాణనాథు, నెదవసించియు వాక్ప్రాన మెలమిఁగొనియుఁ
గలసికొనియనువర్తన•ములనిలిచిఁ యఁ,గొలుచు సౌభాగ్యవతిభక్తి•తొనలుసాఁగ.

తే. ధరనుమామహేశ్వరులన•గరిమఁగాంచి, యొసఁగువారలకునుమామ•హేశ్వరప్ర
సాద వేంకటాద్రివిభులు•సాంద్రయశులు, తనయులిద్దఱువాడమిరి•జనులు మెచ్చ.

వ. అథ వాసీముక్తీశ్వరప్రసాదనాయని తమ్ము ౧౪౩

తే. చంద్రమౌళి పార్వతియను•సతినిగొనియుఁ, ఉ •వప్రసాద
విభుఁడు వేంకాయమను వేడ్కఁ•బెండ్లియాడి,సూర్య ఁనిగని యొ

పంచచామరము. ధరాధరంబు వూని తండ్రి • దండ నుండి దండి యై
నిరంతరంబు నేర్చి ధర్మ • నిత్యసత్యనిష్ఠ నీ
శ్వరాంఘ్రిభక్తచిత్తుఁ డై మ • హంగు నయ్యుమామహే
శ్వరుం డిలేశ్వరుండు నై ప్ర • శస్తిఁ గాంచె నెంతయున్. ౧౪౯

సీ. నడయాడ నేర్చిన • నాఁడె ధర్మము నాలు, గడుగుల నడిపించె • నవనియందు
నత్త తాత యటంచు • నాడ నేర్చిననాఁడె, సత్యహరిశ్చంద్రు • సరణిఁ దాల్చె
నోనమాల్ నేర్చిన • నానాఁడె చాగపు, టాకులవ్రాయుచో • ప్పరసికొనియెఁ
జీజలఁ గట్ట నే • ర్చిననాఁడె కుడికేల, బీదలఁ బ్రోవంగ • బిరుదుఁ గట్టె

తే. వెలయఁబద్మాక్షి వెత్త్రమఁ • బెండ్లియాడి, వీథులం దేగు పెండ్లికై • వెడలునాఁడె
వెలయుకీర్తికన్నెనుగడల్ • వెడలనడచె, నెన్నఁగాఁదగఁడెయుమామహేశ్వరుండు

తే. కాశిరామేశ్వరంబులుఁ గంచిగయయు, మధురయున యోధ్యయును జిదంబరమునా
మొదలుగాఁగలక్షేత్రముల్ముదముతోడ, నయ్యతోఁ జని సేవించె నతఁడుభక్తి [య

తే. మేటిప్రతిభను జంతల • పాటిలోన, గుడియు గోపురమును గట్టి • కోర్కి మీఱ
శివుఁ బ్రతిష్ఠించి తత్పూజఁ • జేయుటకును, వసతిఁ గల్పించె నాపుణ్య • వాసి భూమి.

తే. తనయుముక్తీలలోధ్వజ • స్తంభములను, హరిహరాలయములయందు • నతఁడునిల్పెఁ
గడఁకముక్తీశ్వరస్వామి • గుడిశిఖరము, శాశ్వతముగఁగట్టెనుమామ • హేశ్వరుండు.

ఉ. అన్నరనాథచంద్రునకు • నాం డ్రయి యుండినవారిలోనఁ బే
రెన్నికఁ గన్నవెత్త్రమ మ • హిం బొలుపొందినకల్పవల్లి నా
వన్నెయు వాసి యుం గలిగి • వర్తిలు నెప్పుడు భర్తసన్నిధిన్
సన్నుతిపాత్ర యై మెలఁగి • సద్గుణముల్ గ్రహియించెఁ గావునన్. ౧౫౦

ఆ. శాకమూరివంశ • జలధిచంద్రుం డగు, వేంకటాద్రిపుత్త్రి • వెత్త్రమాంబ
వెలసి యద్రిపుత్త్రి • విధమున నుమ యై మ, హేశ్వరునకు మొదట • నెంచ నయ్యె.

ఉ ఆమనుజాధినాథునకు • నాత్తమహేంద్రున కర్థవైభవ
స్తోమజితామరేంద్రునకు • సోదరుఁ డై సుగుణాభిరాముఁ డై
భూమిఁ దలిర్చుఁ బెంపునను • బూజితరుద్రుఁడు వేంకటాద్రిధా
త్రీమహితామరద్రుమము • దీనజనావనభద్ర మూర్తియున్.

క. పితృభక్తితత్పరుండును, బితృసము...
దతికరుణామతి సజ్జన, హి... డనఘుఁ...

ఉ. ధీరుఁ డతండు సన్నుతమ • తి న్వెలుఁగొందుచు నేపుమీఱ పో
పూరున గోపురంబు గుడి • యు న్వరణంబును గట్టి శంకరుం
దేరినభ క్తిమై నటఁ బ్ర • తిష్ఠితుఁ జేసి తదర్చనార్థమై
కూరిచి చేసె భూవసతి • గోవిదు లెన్నఁగ నెప్పు డెప్పుడున్. ౧౫౪

ఉ. ఈశ్వరభక్తుఁ డాతఁడు స • మిద్ధమతిన్ మును ముక్తిభూమి ము
క్తీశ్వరసన్నిధి న్నిజపి • తృవ్యుఁడు భవ్యుఁడు నాసదాశివా
ఖ్యేశ్వరుఁ డిచ్చమై నలుప • నెంతయు నొప్పుసదాశివాఖ్య గా
రీశ్వరుపేర గోపురము • హీనగతిం బొనరించె మించఁగన్. ౧౫౫

తే. ఆవిభునకు రంగమసాధ్వి • తమ్మదుర్గ, మాంబ మఱియు లక్ష్మిదేవ • మాంబ త్రిపుర
మాంబయనువార లేవురు • నాండ్రుగాఁగ, నెసఁగిస్తుతియింపఁబడిరొగినసమకలిమి.

తే. చంద్రమౌళీశ్వరప్రసా • దేంద్ర వరస, దాశివప్రసాద దుర్గాప • దాశివప్ర
సాద దుర్గామహేశదేవ • సత్ప్రసాద, నాము లాదంపతులసుతుల్ • నల్వురైరి. ౧౫౬

క. అరయఁగ నం దాద్యులు సుతు, లిరువురు పార్వతికిఁగడమ • యిర్వురుసుతులుం
దరుణీమణి త్రిపురాంబకుఁ, బొరి నొదవిరి వేంకటాద్రి • పుణ్యముకతనన్. ౧౫౭

చ. నలువచతుర్ముఖంబు లన • నాలుగుసంద్రములో యన స్మహా
జ్వలగరుడధ్వజప్రథిత • బాహుచతుష్కము నా వసుంధరన్
గళల గశీరతన్ రిపుని • కారణదక్షపరాక్రమంబునన్
నలువురు నన్నదమ్ములు ఘ • నమ్ము పొగడ్తల కెక్కి రున్నతిన్. ౧౫౮

తే. ఆకుమారులలోనవి • ఖ్యాతిఁగాంచి, ప్రబలుశ్రీచంద్రమౌళీశ్వ • రప్రసాద
సుప్రభునుమామహేశ్వర • సుప్రసాద, భూవిభుఁడుచేకొనియెదత్త • పుత్త్రుఁగాఁగ.

ఆ. కొడుకుఁ బడసి యట్లు • కొంతలోన నుమామ, హేశ్వరప్రసాదుఁ • డేలి చనిన
వెనుకఁ జంద్రమౌళి • నెలయు ముక్త్యాలసిం, హాసనాధికార • మంది పొదలు.

చ. సుగుణము లెల్ల ప్రోగుపడి • చూపఱకున్ మదు ల్లులసిల్ల ని
జ్జగమునఁ జంద్రమౌళి యన • జన్మము నొందెను లేక తల్లి దా
సుగుణము లుగ్గునఁ న్మదపి • సొంపుగఁ బోసెను బాల్యలోనఁ గా
కగణితసద్గుణంబు లిటు • లారయ నాదొర కేల కల్గెడిన్. ౧౬౦

నమ్రతఁబు • పలుకఁబూనుట లేదు, లేదు లే దనుమాట • లేనె లేదు
—— ——ాడుట లేదు, లేదు లే దనుబుద్ధి • లేనె లేదు
లేదు లే దనుచింత • లేనె లేదు

నిజకులోచితకర్మ • నియతి మీఱుట లేదు, లేదు లేదనువిద్య • లేనె లేదు
తే. సన్నుతాచారనిరతుఁడై శాంతుఁడై ద,యాళుఁడై సుశ్రీప్రియుఁడై స•మస్తసుగుణ
సాంద్రుఁడై రాజచంద్రుఁడై • జగతినిపుడె, సంగునాచంద్రమౌళిప్ర•సాదునకును.
చ. గురుకరుణాకటాక్షమున • కుఁ గుత్రియై నిరతంబు యోగముఁ
దొరకొని భక్తితత్పరతఁ • దోఁగుచుఁ దోరపుశక్తి లోకముల్
పరఁగ నొనర్చు నీశ్వరుని • ధ్యానమునన్ భజియించి తన్మహా
త్తరకృతి జ్ఞానియై యతఁడు • తత్త్వవిచారము చేయుచుండెనుఁ. ౧౬౪
క. సతతపురాణశ్రవణ, ప్రతిపత్తిం దగిలి రేయుఁ • బవలును ఘనుఁడా
క్షితిపతి వేకువజామున, మతి నారాధించు యోగ•మార్గమునఁ బరున్. ౧౬౫
క. దేవబ్రాహ్మణభక్తియు, జీవేశ్వరభేదవిముఖ • చిద్రక్తియు స
ద్భావప్రసక్తి పరమో, చ్చావచశక్తియును వాని • సహజగుణంబుల్. ౧౬౬
సీ. విరచించె వేదాద్రి • నరసింహదేవాల, యమునకు శిఖర మే • యవనినేత
పొదలించె నిగమాద్రి • పురి శివాలయగోపు, రశిఖరధ్వజము లే • రాజవరుఁడు
చేయించె నామ్నాయ • శిఖరినృకేసరి, సర్వాంగకవచ మే • క్ష్మావిభుండు
కావించె శ్రుతిగిరిఁ • గలగుళ్లకడ ధ్వజ, స్తంభగోపురము లే • ధరణివిభుఁడు
తే. తనదుగ్రామంబులంగల•హనుమదాల, యములుమంటపములొనర్చియుఁ ర్చకు ధన
మిడియెనే ప్రభువా ప్రభు• వెన్నఁదగఁడె, కృతులనలరుశ్రీచంద్రమౌ • ళీశ్వరుండు.
మ. వరముక్త్యాలపురీశ్వరంబున లస • త్ప్రాకారమధ్యంబునన్
నిరహంకారుఁ డతండు భూరిధనము • న్వెచ్చించి పెం పెచ్చఁ గా
నరుదారన్ రచియించె హర్మ్యమునునా • ల్గంతస్తులం దొప్పని
ద్ధరణిం దానికి సాటి రా దొకఁడు సౌం • దర్యంబునం దెన్నఁగన్. ౧౬౮
ఆ. అధికవైభవమున • నలరునమ్ముక్త్యాల, రాజధాని గాఁ గ • వైజయంత
మట్టిసౌధరాజ • మం దుండి నిజరాజ్య, మేలుచుండుఁ జంద్ర • మౌళి నృపతి.
తే. ఆనృపతి యేర్లగడమల్లి • కార్జునప్ర, సాద ధరణీశ్వరునకును • సాధ్వియైన
శ్రీవిశాలాక్షమకుఁ బుత్రి•యై యెలసిన, యెలఁది వేంకటదుర్గాంబఁ • బెండ్లియాడె.
క. అల వేంకటదుర్గాంబిక, యిలఁ గల్పకవల్లి తల్లి • యిద్ధగుణంబుల్
గలసాధ్వి పుట్టిమెట్టిన, కొలములకుం గీర్తిఁ దెచ్చెఁ • గొంతటిలోనన్. ౧౭౦
తే. వెనుక శ్రీచంద్రమౌళిపృ•థ్వీధవుండు, ముదము పొదలఁగ శ్రీశాక•మూ
టాద్రివిభునకుసంపత్ప్ర • దాం…యుగుళ…

సీ. ఎంతకాలంబు ది ◆ గ్దంతిసంతతితోడఁ, దిరమై వసుంధర ◆ పరఁగు చుండు
నంతకాలంబు తా ◆ రేశదినేశాది, ముఖ్యగ్రహంబులు ◆ పొనరు చుండు
నంతకాలము ప్రజా ◆ సృష్టి చేయుచుఁ బర, మేష్ఠి నిశ్చలతమై ◆ మెలఁగు చుండు
నంతకాలంబు దే ◆ వేంద్రాదిదేవతా, వారంబు నిచ్చమై ◆ వఱలు చుండు
తే. నంతవఱకును వాసిరె ◆ డ్డ్యన్వవాయ, చంద్రమౌళీశ్వరప్రసా ◆ దేంద్రనాముఁ
డాయురారోగ్యపుత్త్రపౌ ◆ త్త్రాభివృద్ధిఁ, దనరు చుండెడుఁగాత భూ ◆ తలమునందు

వ. అట్టి శ్రీవాసిరెడ్డి శ్రీచంద్రమౌళీశ్వరప్రసాదభూమీశ్వరున కభ్యుదయపరంపరాభివృద్ధి యగున ట్లాశీర్వదించి పరమేశ్వరార్పణంబు గా నాయొనర్పంబూనిన శ్రీకృష్ణభారతంబునకుం గథాక్రమం బెట్టి దనిన నైమిశారణ్యపుణ్యక్షేత్రనివాసు లగు శౌనకాదిమహర్షులు హర్షోత్కర్షంబున ద్వాదశవార్షికోత్తమసత్రయాగంబు గావించుచు సమాగతుం డైనరోమహర్షణపుత్త్రుం డుగ్రశ్రవుం డను సూతు నర్చించి స్వాగతంబు వలుకుచు నెచ్చటినుండి వచ్చితి వేమివృత్తాంతం బని యడిగిన నతండు వారి కభివందనం బాచరించి యిట్లని చెప్పం దొడంగె. ౧౭౪

## అనుక్రమణికాపర్వము.

శా. ప్రద్వేషించి పరీక్షిదాత్మజుఁడు స ◆ ర్పవ్రాతము న్వేల్చుచో
విద్వాంసు ల్వినుచుండఁ బార్థివునకు ◆ న్వెచ్చేసి తా విన్నఁ గృ
ష్ణద్వైపాయనమౌనికృద్వివిధపు ◆ ణ్యప్రస్తుతాఖ్యానముల్
సద్వేద్యంబుగఁ బండితోత్తముఁడు వై ◆ శంపాయనుం డచ్చటన్. ౧౭౫

ఉ. భారతసంశ్రితంబు లయి ◆ భాసిలునట్టిమహావిచిత్రపుం
ధోరణు లెల్ల నే విని ప్ర ◆ తుష్టమనస్కుఁడ నై మహాస్థలుల్
భూరినదీనదంబులు ను ◆ బుణ్యనగంబులు దాఁటి వచ్చితిన్
న్మీరు పొనర్చుసత్రము త ◆ మిం గని పోవుతలంపుపెంపునన్. ౧౭౬

తే. అనిన శౌనకముఖ్యు లి ◆ ట్లనిరి ధర్మ, శాస్త్రములు పుణ్యవృత్తముల్ ◆ సత్పురాణ
కథలు నీ వెఱుంగుదు మాకుఁ ◆ గౌతుకంబు, భారతామ్నాయము వినఁగ ◆ భూరితేజ

వ. అనుటయు నక్కథకుండు. ౧౭౭

మ. నరగన్ సత్యవతీపరాశరులకున్ ◆ జన్మించి సత్త్వంబున
న్వరుస న్వేదము లచ్చుకట్టి యుఁ బురా ◆ ణంబు ల్వినిర్మించి ధ
ర్మరహస్యార్థము లెల్లఁ దేటపడఁ గా ◆ మర్త్యాళి రక్షించుమ
[illegible]గుఁ గా ◆ [illegible]న్ వ్యాసభట్టారకున్. ౧౭౮

వ. అని వినుతించి పరుండును బరాపరుండును బురాణుండును బురుషుండు నగుపుండరీకాక్షునకు నమస్కరించి యిట్లనియె నట్లు కృతార్థుం డయినమాతీర్థపాదుండు లోకహితార్థంబు గాఁ జతుర్వేదంబులు ను విభజించిన వెనుక నేకతంబ హిమవత్కందరంబున దర్భాసనాసీనుం డై తనహృదయపద్మంబున సమస్తప్రపంచోత్పత్తిస్థితిలయాదుల నెల్ల యోగదృష్టిం బరిశీలించి ధర్మార్థకామమోక్ష పదంబును వేదవేదాంగసమ్మతంబును నానావిధపురాణేతిహాసధర్మసహితంబును బంచమవేదంబు నగుభారతాఖ్యానంబు సంగ్రహంబుగను సవిస్తరంబుగను మనంబునం దలంచి దీని నెట్లు జగంబుల వ్యాపింపం జేయుదునో యని చింతించు చున్నంత.

చ. నలినభవుండు వోల్చి ముని నాథునిపజ్జ వివేక మొప్ప నీ
సలిపినదాని విఘ్నపతి చక్క లిఖించెడు నట్లు చేయు మం
చలర వచించి పోవ నతఁ డాగణనాథుని వేఁడి వానిచేఁ
గల మది యోఁగకుండ వడిగాఁ గవనంబునఁ గూర్చె నంతయుఁ. ౦౮౧

క. వెనకయ్యచేతివడికిం, వెనుకం దన నుడువు వడిన వేదవ్యాసుం
డును నర్థ మెఱిఁగి వ్రాయుమి, యని ఘట్టము లందునందు ననుసంధించెన్.

వ. అట్టిమహాభారతంబునందు సర్వపర్వవృత్తాంతంబులు నుం గల సంగ్రహాధ్యాయపర్వంబు నూటయేఁబదిశ్లోకములు గ మొదట రచియించి దానిఁ దనపుత్త్రుం డగు శుకునిచేఁ జదివించి పిమ్మట నుపాఖ్యానములు లేక యిరువదినాలుగు వేలగ్రంథంబుఁ జేసె నవల నఱువదిలక్షలగ్రంథంబు గ భారతసంహితం జేసి యందు ముప్పదిలక్షలు దేవలోకంబు నందు ను బదియేనులక్షలు పితృలోకంబునందు ను బదునాలుగులక్షలు గరుడగంధర్వయక్షరాక్షసలోకంబులందును నొకలక్ష భూలోకంబునందు ను వ్యాపింపం జేసె నిందు రెండువే లధ్యాయంబులు గలవు.

ఆ. భారతంబునందు నారాయణం నమస్కృత్య యనెడు శ్లోక మే మొద లని
యాస్తికునిచరిత్ర మది మొద లని వసు, చరిత మొద లని పలు వురు దలంత్రు.

వ. తొల్లి వేదవ్యాసుండు తల్లినియోగంబున విచిత్రవీర్యక్షేత్రంబుల ధృతరాష్ట్రపాండురాజవిదురులం బుట్టించె నందు ధృతరాష్ట్రునకు దుర్యోధనాదులు నూర్వురుపుత్త్రులు ను బాండురాజునకు ధర్మజభీమార్జుననకులసహదేవు లనునేవురుపుత్త్రులు నుం బుట్టిరి. పాండురాజు మృతుం డయిన వెనుకఁ బాండవులు కాలక్రమంబున వేదంబునందు ను ధనుర్వేదంబునందును విద్వాంసులై విలుకాండ్రలో నగ్రగణ్యులై రాజులం గెలిచి రాజసూయంబుచేసి రట్టివైభవంబునకుఁ జూపో

పక దుర్యోధనుండు శకునికైతవంబున పాండుసిరుల నపహరించుటం జేసి మహా
యుద్ధంబు సిద్ధించి ప్రజాక్షయం బయ్యె నందుఁ దమకు విజయంబు గామి విని వగచి
ధృతరాష్ట్రుండు సంజయుం బిలిచి కొడుకు నామాట వినమి నింతలు పుట్టె నేను గన్న
కడు పగుటం జేసి తెలివి మాలినవాఁ డాడినట్లు పడి మూఢుండ నైతి నింక వీరికి
వారితోడం బోర లావు చాలదని తొంటినుండియు నే నెఱుంగుదుం జెప్పెద విను
ము విజయుండు మత్స్యయంత్రిం జేసి ద్రౌపదిం గొంటయు, నింద్రు నోర్చి ఖాం
డవం బేర్చుట యు, భీమసేనుండు జరాసంధు సంగిసంధు లెడలించి గిట్టఁ గలుగుట
యు, దౌర్జన్యంబున మనదుస్ససేనుండు ద్రౌపదిపుట్టం బొలువ నది యక్షయం
బగుటయు, నిర్ధనులై వనంబున నున్నను వారి బ్రాహ్మణసమూహం బంటి యుండుట
యు, సవ్యసాచి మహేశునితోడం బోరి గెలిచి పాశుపతాదిదివ్యాస్త్రంబు లెన్ని
యే వడసి దేవదుర్జయు లగు కాలకేయాదుల నిర్జించుటయు ను, ఘోషయాత్ర
పోయి గంధర్వబద్ధు లయిననాపుత్త్రులను భీమార్జునులు విడిపింపఁ గలుగుటయు,
యక్షప్రశ్నముల కుత్తరం బిచ్చి ధర్మజుండు వానిదయకుం బాత్రుఁ డగుటయు,
విరటునిపాలనుండి వారు కీచకాదులం జంపి గోగ్రహణంబున మనవారి నెల్ల నెల్లఁ
బోఁ జేయుట యు, విరటునితో వారికి బంధుత్వంబు గలుగుట యు, నేడక్షౌహి
ణులబలంబు గాక లోకారాధ్యుం డగుశ్రీకృష్ణుండు వారిపక్షం బగుటయుఁ, గృ
ష్ణార్జును లిద్దఱు నరనారాయణు లని నారదుండు నా కెఱింగించుట యు, సంధి
సేయ వచ్చిన నారాయణు నెఱుంగం జాలక నాకొడుకు దుడుకుతనంబునం గట్ట
నెంచిన నతండు కోపంబున విశ్వరూపంబు చూపుటయు, భీష్మద్రోణులు లో
లో వారి నాశీర్వదించుచుండుటయు ను, గర్ణుండు భీష్మునితోఁ గలహించి సంగ
రరంగంబునుండి తొలంగి పోవుట యుఁ, త్రిజగదజేయుం డగు గాంగేయుండు పాండ
వులయందలి ప్రేమచేఁ దనచావునకుఁ దానే మార్గదర్శకుం డగుట యు, సుభద్రాసు
తుం డతిరౌద్రంబున దిగ్గజంబువలె మొగ్గరంబు భేదించుకొని వచ్చి మనమూఁ
కల నెల్లఁ జించి చెండాడ సనుటయు, నతిరథుం డగునరుండు జయద్రథుం జంపి
ద్రోణాది యోధవరులు చూచుచుండఁ దనప్రతిన సరవేర్చుకొనుటయుఁ, గర్ణుండని
భీమునిం బట్టి యు గిట్టక విడిచి పెట్టుటయు, నర్జునుం జంప నున్న యింద్రదత్తశక్తి
వమ్ముగుటయుఁ, బ్రాయోపవిష్టుం డైన ద్రోణునిశిరంబు ధృష్టద్యుమ్నుండు నఱకి
ననుటయు, ద్రోణాయనినారాయణాస్త్రమింతయుం బని సేయ లేకపోవుటయు,
భీమసేనుండు మత్తిలి దుశ్శాసనుని నెత్తురు ద్రావుచుండ మనవారు వారింప లేక

పోవుటయుఁ, గర్ణశల్యశకునిప్రభృతు లెల్లం ద్రెళ్లినప్పు డొంటిపాటి దుర్యోధనుం
డొక్కమడుఁగునం దాగి యుండవలసినవాఁ డగుటయు, వాని గదాయుద్ధంబున
భీముం డక్రమంబునఁ దొడలు విఱుఁగఁ గొట్టి చంపుటయు, నశ్వత్థామ నిద్రితు
ల నెల్లం జంపి యుం జెం పంద నేరక వారక వారిచేఁ దనబ్రహ్మశిరంబు వారింపంబ
డుట నోడి తలమానికంబు తీసి విజయునకుఁ గానుక వెట్టుటయు లోనగునవి వినిన
ప్పుడెల్ల మాకు జయంబు లే దని యెఱుంగుదు నెఱింగి యు నెఱుంగనివాఁడ నై
నేను నుం గాంధారి యు మోహాంధకారంబున మునింగి పరితపింప నైతి మక్క
టా! మొండికట్టకు నా కీప్రాణంబు లేల యని బెట్టు దుఃఖించుచు నిట్టూర్చి మూ
ర్ఛిల్లిన సంజయుండు సేద దేర్చి యి ట్లనియె. 185

క. నరవర సర్వజ్ఞుండవు, పరిదేవన మిట్లు సేయఁ • బాడియె నీకున్
జరుగఁ గల దెట్టు లైనన్, జరుగక పో దిందు వగవఁ • జను నే చెపుమా. 186

వ. తొల్లి దేవేంద్రునిం బోలి మహాబలపరాక్రమవంతు లై ధర్మయుద్ధంబున దిగ్విజ
యంబు చేసి బహువిధయజ్ఞంబు లొనర్చి ప్రసిద్ధిఁ జెందిన శైబ్య, సృంజయ,
రంతిదేవ, బాహ్లిక, చైద్య, నల, విశ్వామిత్రాంబరీష, రామ, శశిబిందు, భగీ
రథ, కార్తవీర్య, జనమేజయ, యయాతి, పురు, కురు, యదు, యువనాశ్వ
కకుత్స్థ, రఘు, విజయ, వీతిహోత్రాదు లెందఱో మహారాజులు నీపుత్త్రులకన్న
నన్నిఁట వేనవేలమడుంగు లెక్కువ యైనవారు దయాసత్యశౌచాదిసమస్తసద్గు
ణంబులు గలమహామహులు లీమహామహీవైభవంబు లెల్ల విడిచి కాలధర్మంబు
నొందిరి. నీపుత్త్రు లపవిత్రులు క్రూరచిత్తులు దుష్టవృత్తులు నున్మత్తులు వారికై
నీకు శోకింపం బని లేదు దేనికిని నీశ్వరుం డొక్కరుండు గాక కర్త మఱియొక్క
రుం డెవ్వండును లేఁడు సమస్తంబునకు ను గాలమే మూలము కాలమే సృష్టి
స్థితిలయహేతుభూతము కాలమే బ్రహ్మ మట్టికాలము గడవ నీఁదఁ గాదునకు
నుం దరంబు గాదు నీవు నుం గాలంబుబాఱిం బడి యున్నవాఁడ వ కాని వెలి
యైనవాఁడవు కావు గావున నియ్యంతయుం గాలమాహాత్మ్యం బని నెమ్మనమ్మున
నమ్మి యూఱటం బొందు మనిన నతండు ప్రాజ్ఞుండు గావున ధైర్యం బూఁది శాంతి
బొందియుండె నిక్కథాప్రపంచంబునన పంచమవేదంబు వుట్టె జగత్ప్రసిద్ధం బయ్యె
నని మఱియును. 187

భారతప్రశంస.

తే. ఐతిహాసికు లితిహాస • మంచు లాక్షణికులు లక్షణ మంచుఁ గా • ర్మికులు కర్మ
కాండ మంచు జ్ఞానులు జ్ఞాన • కాండమంచుఁ,జదువ భారతకల్పవృ • క్షంబు పొదలు.

సీ. సంగ్రహాధ్యాయబీ • జమ్ము పౌలోమమూ, లము సంభవస్కంధ • సముదయమ్ము
విమలసభావిటం • కము వనపర్వరూ, పము విరాటోద్యోగ • పర్వసార
మాభీష్మపర్వమ • హాశాఖము నుద్రోణ, పర్వపర్వము కర్ణ • పర్వసుమము
శల్యపర్వసుగంధ • సహితంబు స్త్రీపర్వ, సాధువిశ్రామము • శాంతి ఫలము
తే. అశ్వమేధామృతం బాశ్ర • మాధివాస, సంశ్రయం బైనభారతా • శ్రయకుజంబు
భూతములకుఁ బ్రసన్నంబు•వోలె నెల్ల, ద్విజుల కుపజీవ్య మై యొప్పుఁ•బృథివియందు
మ.*స్థితికృద్వ్యాసవచస్సరోజము లస • ద్గీతార్థగంధోత్కటం
బతిచిత్రం బతిపాత్ర ముత్తమము నా • నాఖ్యానకింజల్క మూ
ర్జిత మై పుణ్యకథామధూన్నతము స • ద్భృంగప్రపేయంబు భా
రతపంకేజ మొసంగెడుం గలిమల • ప్రధ్వంస మై శ్రేయముల్ 190
తే. తీర్థముల గంగవలె నోష•ధులతతి సమృత, మటులు శ్రుతుల నారణ్యక•మట్లు నరుల
యందు ద్విజుఁ డట్లు లిప్యక్కు•లందు గోవు, పగిది నితిహాసముల నొప్పు•భారతంబు.
మ. సరహస్యశ్రుతులెల్ల నొక్కయెడ భా • స్వద్భారతం బొక్కెడన్
సురవర్యుల్ తులఁ బెట్టి తూఁచి రపుడే • నొక్కెట్ల భారంబు సు
స్థిర మై భారతభాగమందుఁ గనుఁగోఁ • జెల్ల న్మహాభారతో
త్తరనామం బది నాఁటనుండి కలిగెం • దర్థ్యంబు గా దానికిన్. 192
తే. తలఁప ధర్మార్థకామశా • స్త్రంబు భార, తంబు దీనిని వినిన స • న్యంబు వినఁగఁ
దివురునవఁడు పుంస్కోకిల•రవము వినఁగఁ, గలుగుచెవి కింపుసేయు నే•కాకికూఁత
మ. భువి గార్హస్థ్యము వోలె శ్రేష్ఠతమ మై • పొల్పొందునీభారత
ధ్రువమందుం గనరానియట్టికథ లెం • దున్ లేవు సర్వోత్తమం
బవు నిక్కావ్య మెఱింగికాని కవు లై • హర్షొంద రెవ్వారలున్
గవు లిందుం గలకల్పనాంశముల నే • కై కొందురు కావ్యంబులన్. 194
క. పారాశర్యనిముఖ మను, పారావారంబునందు • బహుళతరము లై
భారతకథ లనురత్నము, లారయఁగ విశిష్టభూష • లై యొలరారున్. 195
క. ద్వైపాయనోష్ఠనిస్సృత, మీపుణ్యద మైనకావ్య • మేవాఁడు వచో
వ్యాపృతిగఁ గొనునొ వానికి, నేపుష్కరజలము లైన • నేమిటి కాదన్. 196
మ. భగవద్గీతలు నాఁగ నౌ నుపనిష • ద్భాగంబు పుణ్యప్రదం
బగు నాభారతవేదమధ్యమున నౌ • ప్పారున్ జగద్వేద్యమై

* స్థితి=లోకమర్యాద.

భగవంతుం డగువాసుదేవునిమహ • త్త్వం బందుఁ గీర్తింప నై
జగదారాధ్యము ముక్తిదం బగుచు నెం • చన్ భారతం బొప్పెడున్. 197

సీ. భారతంబనియెడు • బాలభాస్కరునిచే, నజ్ఞానతిమిరంబు • లడఁగి పోవు
భారతం బనుపూర్ణ • పార్వణచంద్రుండు, తెలియ శ్రుత్యర్థచం • ద్రికలుగాయు
భారతంబనెడుదీ • పముమోహమనుమాటు, దొలఁచిలోకగృహంబు • వెలుఁగఁజేయు
భారతం బనునగ్ని • ప్రజ్వలింపక యున్న, జడ మై జగంబెల్ల • బడలువడును
తే. ఆశ్రమములు మూఁడును గృహ • స్థాశ్రమంబు, నతిశయింపనియట్ల మ • హాకవీంద్రు
లతిశయింపఁగ లే రెవ్వ • రైన భార, తంబు నాఁబడుకావ్యవ • ర్యంబుఁ దలఁప.
తే. ఉపనిషత్తులతో నంగ • యుక్తవేద, ముల నెఱింగి ద్విజుం డైన • పురుషుఁ డెన్న
భారతమ్మెఱుంగక యున్నఁ • బండితుఁ డని, పేరువొందం గఁజాలఁడు • పృథివియందు.
సీ. భూతపంచకమున • భువనంబు లగునట్లు, భారతంబునఁ గవి • ప్రతిభ లగును
బ్రాణు లాకసమందుఁ • బరఁగున ట్లెల్లపు, రాణముల్ పరఁగు భా • రతమునందు
నాహార మంటక • దేహ ముండనియట్లు, భారత మంట కే • పదము లేదు
భటుఁడుసత్ప్రభుఁగొల్చి • బ్రదుకునట్లుబుధుండు, భారతంబునుగొల్చి • బ్రదుకుచుండు
తే. మనుజుఁ డింద్రియలోలుఁ డై • మహి నొనర్చు, పాపసంచయముల నెల్ల • భారతంబు
వినిన నప్పటి కప్పుడే • వెస నశింపఁ, జేసికొనినట్టివాఁ డగుఁ • జిత్తశుద్ధి. 200

చ. జయ మనుపేర భారత మె • సంగుట సంగరరంగమం దిలన్
జయమును గోరునట్టినృప • చంద్రుఁడు దానిఁ బఠించెనేని ని
శ్చయము గ నెక్కువేల్మిడిని • శాత్రవసంహతి నుక్కడంచి ని
ర్భయుఁ డయి భూతలంబునను • భాసిలు చుండు శుభావహంబుగన్. 201

తే. భ్రూణహత్యాఘమునశించుఁ బుణ్య మెచ్చుఁ, బురుషసంతానములభించుసిరులుమించు
మంత్రతుల్యమైమునిలోక • మాన్యమైన, భారతామ్నాయముఁ బఠించు • వారలకును
తే. గొజ్రెజలం గొమ్ములం బైఁడి • గొడుగులునిచి, కపిలగోశతమార్యుల • కుపకరింప
నీఁగనగుపుణ్య మాభార • తాగమంబు, వినినఁ జదివిన లభియించు • విశ్రుతముగ.

## పర్వసంగ్రహపర్వము.

వ. అని మఱియు నది పౌష్య పౌలో మాస్తీకాదివంశావతార సంభవ జతుగృహ దాహ హైడింబ బకవధ చైత్రరథ ద్రౌపదీస్వయంవర వైవాహిక విదురాగమ రాజ్యార్థలా భార్జునవనవాస సుభద్రాహరణ హరణాహారికా ఖాండవదాహ మయ దర్శనపర్వంబులతో నాదిపర్వంబు ను, సభా మంత్ర జరాసంధవధ దిగ్విజయ రాజ

సూ యార్ఘ్యాభిహరణ శిశుపాలవధ ద్యూతానుద్యూతపర్వంబులతో సభాపర్వంబును, ఆరణ్య కిమ్మీరవధేంద్రకీలాభిగమన కైరాత తీర్థయాత్రా జటాసురవధ యక్షయుద్ధాజగర మార్కండేయోపాఖ్యాన సత్యాద్రౌపదీసంవాద ఘోషయాత్రా ప్రాయోపవేశ వ్రీహిద్రోణకాఖ్యాన ద్రౌపదీహరణ కుండలాహరణారణేయ పర్వంబులతో నారణ్యపర్వంబును, వైరాట కీచకవధ గోగ్రహణాభిమన్యువివాహపర్వంబులతో విరాటపర్వంబును, ఉద్యోగ సంజయయాన ధృతరాష్ట్రప్రజాగర సానత్సుజాత యానసంధి భగవద్యాన సేనానిర్యాణోలూకదూతాభిగమన సమరథాతిరథసంఖ్యాన కర్ణభీష్మవివాదాంబోపాఖ్యానపర్వంబులతో నుద్యోగపర్వంబును, భీష్మాభిషేక జంబూషండవినిర్మాణ భూమి భగవద్గీతా భీష్మవధపర్వంబులతో భీష్మపర్వంబును, ద్రోణాభిషేక సంశప్తకవధాభిమన్యువధ ప్రతిజ్ఞాజయద్రథవధ ఘటోత్కచవధ ద్రోణవధ నారాయణాస్త్రప్రయోగపర్వంబులతో ద్రోణపర్వంబును, కర్ణపర్వంబును, శల్య హ్రదప్రవేశ గదాయుద్ధ సారస్వతపర్వంబులతో శల్యపర్వంబును, సౌప్తి కైషీక జలప్రదానపర్వంబులతో సౌప్తికపర్వంబును, స్త్రీవిలాప శ్రాద్ధ రాజ్యాభిషేక చార్వాకవధ గృహప్రవిభాగపర్వంబులతో స్త్రీపర్వంబును, శాంతి రాజధర్మానుశాసనాపద్ధర్మ మోక్షధర్మపర్వంబులతో శాంతిపర్వంబును, బ్రహ్మప్రశ్నానుశాసన భీష్మస్వర్గారోహణపర్వంబులతో నానుశాసనికపర్వంబును, అశ్వమేధికానుగీతాపర్వంబులతో నశ్వమేధపర్వంబును, ఆశ్రమవాస పుత్రసందర్శన నారదాగమనపర్వంబులతో నాశ్రమవాసపర్వంబును, మౌసలపర్వంబును, మహాప్రస్థానపర్వంబును, స్వర్గారోహణపర్వంబును, హరివంశపర్వంబును, భవిష్యత్పర్వంబుననునట్టి మహాపర్వోపపర్వంబులం బర్విన శ్రీమహాభారతంబు తొల్లి పారాశర్యుండు ద్వీపోపద్వీపవ్యాప్తం బగుప్రపంచంబు విరించి నిర్మించినట్లు వినిర్మించి తనశిష్యులకుం గఱపి దాని దేవదానవాదిలోకంబుల వాకొనం బుచ్చె నందు నారదుండు దేవలోకంబునందును నసితుం డగుదేవలుండు పితృలోకంబునందును శుకుండు యక్షరాక్షసలోకంబులందును వక్కాణించిరి. మనుష్యలోకంబున జనమేజయునకు వైశంపాయనుండు వక్కాణించె నక్కథాసంగ్రహం బెట్టి దనిన. 204

—— కథాసంగ్రహము. ——

క. పదునెనిమిదిపర్వంబుల, విదితం బగునట్టికథను • వేదవ్యాసుం
డొదవించె సంగ్రహంబుగ, నది వినిన౯ భారతార్థ • మంతయుఁ దెలియు౯.

వ. అందాదిపర్వంబునఁ బౌష్యోత్తంకమాహాత్మ్యంబును భృగువంశకథనంబును సర్పగరుడాదిసంభవంబును సముద్రమథనంబును జనమేజయునిసర్పయాగంబును నాస్తీకచరిత్రంబును వేదవ్యాసాదులజన్మంబును వంశావతారంబును వంశానుకీర్తనంబును యయాతికథయును శకుంతలాదుష్యంతులవృత్తాంతంబును భరతోత్పత్తియు భీష్మసంభవంబును సత్యవతీశంతనులపరిణయంబును జిత్రాంగద విచిత్రవీర్యులజన్మాదికంబును ధృతరాష్ట్ర పాండురాజ విదురుల జన్మంబును బాండవధార్తరాష్ట్రులజన్మంబును గృపద్రోణులవృత్తాంతంబును గుమారాస్త్రవిద్యాగ్రహణాదికంబును దుర్యోధనాదులదురాలోచనంబును జతుగృహదాహంబును హిడింబవధయు ఘటోత్కచజన్మంబును నేకచక్రపురప్రవేశంబును బకాసురసంహారంబును ద్రౌపదీస్వయంవరంబును విదురాగమనంబును నర్ధరాజ్యప్రాప్తియును ఖాండవవాసంబును నర్జునతీర్థయాత్రయు నులూపీచిత్రాంగదాసంగమంబును బభ్రువాహనోత్పత్తియును ద్వారకాప్రవేశంబును సుభద్రాహరణంబును నభిమన్యుజన్మంబును ద్రౌపదీపుత్త్రోత్పాదనంబును ఖాండవదహనంబును మందపాలోపాఖ్యానంబును లోనగువృత్తాంతంబులతో నెనిమిదివేలయెనమన్నూటయెనుబదినాలుగు శ్లోకంబులు నిన్నూటయిరువదియే డధ్యాయంబులు నుం గలిగె. 206

క. విదితముగ భారతమ్మున, మొదటం గీర్తింపఁ బడుచు ◆ మోదావహమై
పదునెనిమిదియుపపర్వము, లదుకఁగ నిది యాదిపర్వ ◆ మన నొప్పెసఁగెన్.

వ. పిదప ద్వితీయం బగుసభాపర్వంబునఁ బాండవులకు సభాప్రాప్తియు నారదాగమనంబును లోకపాలసభావర్ణనంబును రాజసూయారంభంబును జరాసంధవధయును దిగ్విజయంబును నర్ఘ్యప్రదానంబును శిశుపాలవధయును శకునికృతద్యూతంబును ద్రౌపదీపరిభవంబును ధృతరాష్ట్రవరంబును బునర్ద్యూతంబును పాండవవనవాసగమనంబును లోనగుకథలతో రెండువేలయేనూటపదునొకండు శ్లోకంబులు నుడెబ్బదియెనిమిదియధ్యాయంబులు నుం గలిగె. 208

క. తొమ్మిదియుపపర్వంబుల, నెమ్మెయిఁ గీర్తింపఁ బడుచు ◆ నిల కెన్న సపూ
ర్వమ్మయినసభ ప్రధాన, త్వమ్మున్ గొను నిది తగన్ స ◆ భాపర్వ మనన్. 209

వ. అవలఁ దృతీయం బగునారణ్యపర్వంబున యుధిష్ఠిరుండు సూర్యు నారాధించి వరంబుఁ గొనుటయు ను ధృతరాష్ట్రుండు విదురుం ద్యజించి మరలఁ బిలిపించుకొనుట యు దుర్యోధనుండు వనమున నున్న పాండవులం జంప నెంచుట యు మైత్రేయుండు దుర్యోధనుని శపించుటయు భీముండు కిమ్మీరుం జంపుటయుఁ

గృష్ణాగమనంబు ను వ్యాసదర్శనంబు ను నర్జునుని యింద్రకీలగమనంబు ను శివు నితోడియుద్ధంబు ను దివ్యాస్త్రలాభంబు ను స్వర్గగమనంబును బృహదశ్వుం డనుముని వచ్చి యుధిష్ఠిరునకు నలోపాఖ్యానంబు సెప్పుట యు నర్జునకుశల వార్తాశ్రవణంబు ను దీర్థయాత్రాభిగమనంబు ను బరశురామాగస్త్యమాంధాతృ ఋశ్యశృంగాద్యుపాఖ్యానకథనంబు ను భీముండు హనుమంతుం గాంచుట యు జటాసురసంహారంబు ను సౌగంధికహరణార్థగమనంబు ను నర్జునాగమనంబును గాలకేయనివాతకవచసంహారకథనంబును నాజగరంబు ను మార్కండేయుండు వచ్చి పృథూపాఖ్యానంబును నింద్రద్యుమ్నోపాఖ్యానంబును ధుంధుమారోపాఖ్యానంబును బతివ్రతోపాఖ్యానంబును లోనగు నానావిధోపాఖ్యానంబులు సెప్పుట యు సత్యాద్రౌపదీసంవాదంబును దుర్యోధనుని ఘోషయాత్రయుఁ గలియుగధర్మకథనంబును సైంధవపరాభవంబును శ్రీరామచరిత్రంబును సావిత్ర్యుపాఖ్యానంబును గర్ణకవచకుండలాహరణంబును నారణేయోపాఖ్యానంబును ధర్మదేవతాప్రసాదంబును లోనగువృత్తాంతంబులతోఁ బదునొకండువేల యాఱునూర్లయఱువదినాలుగు శ్లోకములు నిన్నూటయఱువదితొమ్మిది యధ్యాయంబులుం గలిగి.

క. తనరి పదా ఱుపపర్వము, లను నానాకథలు గలిగి • లా వయి నృపతుల్
వనవాసం బొనరించుట, వనపర్వం బనఁ గ నిది ప్ర • వర మై పరఁగున్. 211

వ. అంతఁ జతుర్థం బగువిరాటపర్వంబునఁ బాండవులు ప్రేతారణ్యమం దాకజమ్మి పైఁ దమయాయుధంబులు వెట్టి మాఱువేషములతో విరాటనగరమునఁ బ్రవేశించి యుండుట యు భీముఁడు కీచకుం జంపుట యు గోగ్రహణంబున నర్జునుండు కౌరవుల నోడించి గోవుల మరల్చుట యు నుత్తరాభిమన్యులవివాహం బుచితరీతిం బొనరించుట యు లోనగుకథలతో నఱువదియేడధ్యాయంబులు రెండువేలయేఁబదిశ్లోకంబులు నుం గలిగి. 212

క. ఉపపర్వచతుష్టయమున, నుపమానము లేనిరీతి • నొంది విరాటా
ఖ్యపురనివాసంబున నిది, ప్రపంచమునఁ దగె విరాట • పర్వ మనం గన్. 213

వ. మఱియుఁ బంచమం బగునుద్యోగపర్వంబునఁ బాండవు లుపప్లావ్యంబున విడియుట యు దుర్యోధనార్జునులు కృష్ణునిసాహాయ్యంబుఁ గోరుట యు శల్యుని దుర్యోధనుఁడు వంచించి తనపక్షంబున నుండఁ జేసికొనుట యు మద్రపురోహితునిఁ గౌరవులయొద్దకుం బంపుట యు సంజయురాయబారంబు ను విదురుండు ధృతరాష్ట్రుని బోధించుట యు సనత్సుజాతుం డధ్యాత్మకథ లుపదేశించుట యు

శ్రీకృష్ణరాయబారంబు ను గాలవచరిత్రంబు ను విశ్వరూపప్రదర్శనంబు ను సేనాసన్నికర్షంబు ను నులూకాగమనంబు ను సమరథాతిరథనిర్ణయంబు ను నంబోపాఖ్యానంబు ను లోనగుకథలతో నూటయెనుబదియాఱధ్యాయంబులు ను నాఱువేలయాఱునూర్లతొంబదియెనిమిది శ్లోకంబులు నుం గలిగి. 214

క. ఉద్యోగాద్యేకాదశ, హృద్యాంతఃపర్వవరస • మేతం బై యు
ద్ధోద్యోగ మొనర్చుట నిది, యుద్యోగం బనఁ గఁ బర్వ • మొప్పు ధరిత్రిన్.

వ. పిమ్మట షష్ఠ మ్మగుభీష్మపర్వంబున జంబూఖండనిర్మాణకథనంబును నర్జునవిషాదంబును భగవద్గీతోత్పత్తియుఁ గృష్ణవిజృంభణంబును భీష్మపతనంబును శరతల్పంబు ననువృత్తాంతంబులతో నైదువేలయెనమన్నూటయెనుబదినాలుగు శ్లోకంబులు నూటపదియే డధ్యాయమ్ములు నుం గలిగి. 216

క. పంచోపపర్వవృత్తస, మంచిత మై భీష్మముఖ్య • మై కార్యము వ
ర్తించుట నిది షా ష్ఠ్పసఁగెఁ బ్ర, పంచంబునయందు భీష్మ • పర్వం బనఁ గన్.

వ. సప్తమం బగుద్రోణపర్వంబున ద్రోణాభిషేకంబునుం బ్రతిజ్ఞయు సంశప్తకయుద్ధంబును భగదత్తసంహారంబును నభిమన్యుమరణంబును జయద్రథవధయును జలసంధ విరాట ద్రుపద ఘటోత్కచ సోమదత్త భూరిశ్రవో బాహ్లీక ప్రముఖయోధనిధనంబును ద్రోణపతనంబును నారాయణాస్త్రప్రయోగంబును గృష్ణార్జునమాహాత్మ్యకథనంబును మున్నగుకథలతో నెనిమిదివేల తొమ్మన్నూట తొమ్మిది శ్లోకంబులు నూటడెబ్బదియధ్యాయంబులు నుం గలిగి. 218

క. ఎనిమిదియుపపర్వంబులఁ, గనఁ దగి ద్రోణప్రముఖ్య • కం బయి ప్రధనం
బొనరుచుటఁ జేసి యిది మే, లనఁ బడియెన్ ద్రోణపర్వ • మనునామమునన్.

వ. అవల నష్టమం బగుకర్ణపర్వంబున శల్యసారథ్యంబును ద్రిపురసంహారకథనంబును గర్ణశల్యసంవాదంబును హంసకాకీయోపాఖ్యానంబును దండదండసేనపాండ్యవధయును ధర్మజప్రాణసంశయంబును యుధిష్ఠిరార్జున కోపోత్పత్తిప్రశమనంబులు ను దుశ్శాసనవక్షోవిదారణంబును గర్ణవధయు ననువృత్తాంతంబులతో నాలుగువేల తొమ్మన్నూటయఱువదినాలు గుశ్లోకంబులు నఱువదితొమ్మిది యధ్యాయంబులుం గలిగి. 220

క. నానాస్త్రశస్త్రవిద్యా, నూనయశోరాశి కర్ణుఁ • డోలి రణభారం
బూని మెలంగుట నిది యొం, డై నెగడెం గర్ణపర్వ • మన విదితం బై. 221

వ. నవమం బగు శల్యపర్వంబున శల్యాభిషేకమ్మును గురుకుమారనిధనంబును శల్యమరణంబును శకునివధయు హ్రదప్రవేశంబును గదాయుద్ధంబును దుర్యోధనోరుభంగంబును లోనగుకథలతో మూఁడువేలయిన్నూటయిరువదిశ్లోకంబులు నేఁబదితొమ్మిది యధ్యాయంబులుం గలిగి. 222

క. అని శల్యవిభుత్వము దగఁ, బనిత మ్మగుకతన శల్య • పర్వ మనం గాఁ
దనరె నిది భూతలమ్మునఁ, దనలోఁ బర్వములు నాల్గు • తద్దయు నొప్పన్. 223

వ. పిమ్మట దశమం బగుసౌప్తికపర్వంబునఁ బడియున్నదుర్యోధనునికడకుఁ గృపకృతవర్మాశ్వత్థామలు వచ్చుట యు నశ్వత్థామ రాజు విన సర్వశత్రుసైన్యంబును హతంబు గావింతు నని ప్రతిజ్ఞ సేసి చని రాత్రి నిద్రితు లయినవారి ధృష్టద్యుమ్నాదిపాంచాలురను బ్రతివిం దాదిపాండవసేనాసమూహంబును సంహరించుటయుఁ గృష్ణానుగ్రహంబునఁ బంచపాండవ సాత్యకులు దానికిం దప్పుట యు దుఃఖిత యగుద్రౌపది యనశనవ్రతంబు సంకల్పించుటయు ను గదచే భీముఁ డశ్వత్థామం దఱుమ నతం డపాండవం బయ్యెడుఁ గాత మని మహాస్త్రంబు విడుచుటయు ను దాని గృష్ణార్జును లుపసంహరించుటయు వ్యాసాశ్వత్థామలు శాపంబులు పెట్టికొనుటయుఁ బాండవు లశ్వత్థామశిరోరత్నముం గొని పాంచాలి కిచ్చుట యు నను కథలతో రెండువేలు నెనమన్నూట డెబ్బదిశ్లోకంబులును బదునెనిమిది యధ్యాయంబులు నుం గలిగి. 224

క. సుప్తులఁ జంపియు నిష్ఠువున, దృప్తుం డయి ద్రౌణి మెలఁగ • నిది పొలుపొందెన్
సౌప్తిక మైషీకము నాఁ, బ్రాప్తిం గొని మూఁడు లోని • పర్వంబులతోన్. 225

వ. ఏకాదశం బగుస్త్రీపర్వంబున ధృతరాష్ట్రదుఃఖంబును నయఃప్రతిమాభంజనంబును మోక్షస్వరూపకథనంబును యుద్ధస్థలదర్శనంబును వీరపత్నీవిలాపంబును గృష్ణకృతగాంధారీమనస్తాపోపశమనంబును దహనసంస్కారాదికంబును గర్ణజననగ్రహణంబును లోనగువృత్తాంతంబులతో నిరువదియేడధ్యాయంబులు వేయునేడునూర్లడెబ్బదియైదుశ్లోకంబులుం గలిగి. 226

క. ఏ నుపపర్వంబులతో, నైనెటి వో స్త్రీలదుఃఖ • మతిమాత్రము గాఁ
గానంగఁ బడుట నియ్యెడి, జా నగు స్త్రీపర్వ మనఁ గ • జాలిఁ గొలుపుచున్.

వ. ఇంక ద్వాదశం బగుశాంతిపర్వంబున ధర్మరాజునిర్వేదంబును ధర్మవృత్తకథనంబును నాపద్ధర్మంబులును మోక్షధర్మంబులు లో నగువానితో మున్నూటముప్పదితొమ్మిది యధ్యాయంబులును బదునాల్గువేలయేడునూరులముప్పదిరెండుశ్లోకంబులుం గలిగి. 228

క. ఎంతయు ధర్మశ్రవణము, చింతలఁ బెడఁ బాపి శాంతి ♦ చేసినదానన్
శాంతి యనఁ బర్వ మియ్యది, పొంతన మగు నాల్గుపర్వ♦ములు లోఁ గొనుచున్.

వ. త్రయోదశం బగు ననుశాసనపర్వంబున ధర్మాధర్మవ్యవహారకథనంబును దానఫలంబులును బాత్రవిశేషంబును నాచారవిధియు సత్యప్రయోజనంబును గోబ్రాహ్మణభాగ్యంబును దేశకాలజ్ఞానంబును ధర్మసూక్ష్మంబులును భీష్మస్వర్గగమనంబును లోనగువృత్తాంతంబులతో నెనిమిదివేలశ్లోకంబులును నూటనలువదియా అధ్యాయంబులు నుం గలిగి. 230

క. తనవిజ్ఞానంబున జగ, మనుశాసించుచుఁ దలిర్ప ♦ నలరుట ననుశా
సనపర్వం బిది తనరుం, దనలో పర్వములు రెండు ♦ దనరుచు నుండన్. 231

వ. చతుర్దశం బగు నశ్వమేధపర్వంబున సంవర్తమరుత్తీయాఖ్యానంబును సువర్ణకోశసంప్రాప్తియుఁ బరీక్షిజ్జననంబును నశ్వవిసర్జనంబును నర్జునానుగమనంబును బభ్రువాహనయుద్ధంబును నకులాఖ్యానంబును మొదలుగాఁ గలవృత్తాంతంబులతో మూఁడువేలమున్నూటయిరువది శ్లోకంబులును నూటమూఁడధ్యాయంబులు నుం గలిగి. 232

క. ఘనుఁ డశ్వమేధయాగము, పొనరించినకతనఁ దనరె ♦ భువనంబులఁ బెం
పున నశ్వమేధపర్వం, బన నుపపర్వములు రెంట ♦ నధికం బగుచున్. 233

వ. అంతఁ బంచదశం బగునాశ్రమవాసపర్వంబున గాంధారీసహితుం డగుధృతరాష్ట్రుండు విదురసంజయులతో నాశ్రమవాసంబునకుఁ జనుటయుఁ గుంతియు వారి ననుసరించుటయు వ్యాసానుగ్రహంబున నతండు మృతు లగుతనవారి నెల్లం జూచి దుఃఖంబు విడిచి సద్గతి వడయుటయు విదురుండును సంజయుండును సిద్ధి పొందుటయు నారదునివలనఁ బాండవులు యాదవులవ్యసనవృత్తాంతం బెఱుంగుటయు మున్నగుకథలతో వేయునేనూటయాఱుశ్లోకంబులు నలువదిరెం డధ్యాయంబులుం గలిగి. 234

క. ధృతరాష్ట్రాదులు ప్రాంచ, న్మతి నాశ్రమవాస ముంట ♦ నలు వొందె జగ
న్నుత మాశ్రమవాసం బన, క్షితి నుపపర్వములు మూఁడు ♦ చెలు వొప్పారన్.

వ. మఱియు షోడశం బగుమౌసలపర్వంబున యాదవు లెల్ల మదిరాపానపరవశు లయి ముసలకారణంబునం దమలోఁ దారు పోరి చచ్చుటయు బలరామకృష్ణులనిర్యాణంబు నర్జునుం డటఁ జని వారిం జూచి వ్యసనంబు నొంది యందు ముఖ్యులగువారి కగ్నిసంస్కారం బొనరించి బాలవృద్ధులం దోడ్కొని పోవుటయు గాం

డీవాదులతేజం బేగుట యు ధర్మజుకడకు వచ్చి నివేదించుటయు వ్యాసోపదేశం
బును ధర్మజరాజ్యత్యాగంబును నో నగుకథలతో మున్నూటయిరువదిశ్లోకంబులు
నెనిమిదియధ్యాయంబులుం గలిగి. 236.

క. ముసలసముద్భవమున నిది, యొసఁగె న్మౌసల మనం గఁ ♦ బృథివీస్థలిలో
నసదృశము పర్వరాజము, పరిసమీక్షింపం గ లోనఁ ♦ బర్వరహిత మై. 237

వ. పిదప సప్తదశం బగు మహాప్రస్థానికపర్వంబునఁ బాండవులు రాజ్యంబు విడిచి
ద్రౌపదీసహితు లై మహాప్రస్థానంబు వోవుట యు వారు రక్తసముద్రంబున
నగ్నిం గాంచుట యు నగ్నిచే నాజ్ఞాపితుం డై యర్జునుండు గాండీవం బతని కిచ్చు
ట యు యుధిష్ఠిరుండు పడినతమ్ములం దన్వానిం జూచియుం జూడక విడిచి పో
వుట యు ననుకథలతో మున్నూటయిరువదిశ్లోకములు మూఁడధ్యాయము
లుం గలిగి. 238

క. స్వస్థులు పాండవులు మహా, ప్రస్థానం బేగుటలనఁ ♦ బ్రత్యేకం బై
సుస్థితిఁ గైకొనియె మహా, ప్రస్థానం బనఁ గఁ బర్వ ♦ వర్యం బవనిన్. 239

వ. అనంతరం బష్టాదశం బగుస్వర్గారోహణపర్వంబున ధర్మజుఁడు తనవెంట నచ్చు
శునకంబును విడిచి స్వర్గప్రాప్తం బగుదివ్యరథం బధిష్ఠింప నొల్లకుండుట యు
ధర్మదేవతాప్రత్యక్షంబు ను స్వర్గగమనంబు ను నరకమందుఁ బడినతమ్ములదైన్యం
బు విని ధర్మజుండు జాలిపడుట యు నతం డాకాశగంగ నాడి మనుష్యదేహంబు
విడిచి స్వర్గపదంబు నొంది దేవతాపూజ్యుం డగుట యు మొద లగువృత్తాంతం
బులతో రెండువందలతొమ్మిదిశ్లోకంబులు నై దధ్యాయంబులుం గలిగి. 240

క. ఘనుఁ డాధర్మతనూజుఁడు, తనపుణ్యమువలన స్వర్గ ♦ ధామమ్మును గై
కొనుటన్ స్వర్గారోహణ, మనుపర్వము వర్ణనీయ ♦ మై వెలుఁగొందెన్. 241

వ. ఇవి యష్టాదశపర్వంబులు మఱియు ఖిలంబులందు హరివంశంబును భవిష్యంబు
ను జెప్పంబడియె హరివంశంబునఁ బన్నెండువేలశ్లోకంబులు వర్ణితంబు లయ్యె
నివి యన్నియుం జేరి మహాభారతంబు నాఁ బడు నట్టి మహాభారతంబున కాల
వాలంబు పాండవధార్తరాష్ట్రియుద్ధంబు. 242

చ. పదిదినముల్ నదీసుతుఁడు ♦ పంచదినంబులు కుంభజుండు రెం
డుదినము లంగభూమివిభుఁ ♦ డుం దివసార్ధము మద్రరాజు న
ర్ధదినము కౌరవేశుఁ డల ♦ రాత్రిఁ గృపాదులఁ గూడి ద్రౌణియున్
మదమునఁ బోరి రాహవము ♦ న న్వెను దీయక శత్రుసేనతోన్. 243

మ. * ఎర వోటుం గలరాజరాజుబలఁగం ♦ బేకాదశాక్షౌహిణుల్
హరిమిత్త్రుం డగుధర్మపుత్త్రుబల మే ♦ డక్షౌహిణుల్ వారలోం
బోరు బీరం బుడివ్రాక పోరిన మహా ♦ యుద్ధంబు సిద్ధించె నీ
స్థిరభారం బుడివోయె నెంతయుఁ గురు ♦ క్షేత్రంబునం దొల్లిటన్. 244

క. † అలయుద్ధమునం బాండవ, బలమున నేవ్వురు మఱి కురు ♦ బలమున ముగురున్
గలసి పదుగుండ్రు దక్కం, గలవారలు సెల్లఁ దెగిరి ♦ కడు ఘోరము గన్. 245

తే. మహిని దుర్యోధనుఁడు మన్యు ♦ మయమహాద్రు
మమ్ము కర్ణుఁడు దానిస్కంధ ♦ మ్ము శకుని
పలవ దుశ్శాసనుఁడు పుష్ప ♦ ఫలసమృద్ధి
మూల మమనీషి ధృతరాష్ట్ర ♦ భూవిభుండు. 246

తే. మహిని ధర్మసుతుఁడు ధర్మ ♦ మయమహాద్రు
మమ్ము విజయుండు స్కంధమ్ము ♦ కొమ్మ భీముఁ
డెన్నఁ గవలు పుష్పఫలస ♦ మృద్ధి మొదలు
వాసుదేవుండు బ్రహ్మము ♦ బ్రాహ్మణులును. 247

వ. అని మఱియు ను. 248

మ. ఇది వర్ణింప ననుత్తమంబు బుధలో ♦ కేష్టంబు శిష్టాంతరా
ర్థద మత్యర్థము సంగ్రహాగ్రిమిత మా ♦ ద్యం బుత్తమాఖ్యాన మై
పొదలుం దీనిని విన్న భారతమహాం ♦ భోరాశిమధ్యంబునం
దొదవుం జుండి సుఖావగాహ మది యెం ♦ తో సంతసం బిచ్చుచున్. 249

వ. అనిన విని నైమిశారణ్యవాసు లమ్మహాభారతవృత్తాంతం బంతయు సవిస్తరంబు
గం జెప్పు మని సూతు నడుగుటయు ను. 250

ఆశ్వాసాంతము.

ఉ. భారతవర్షధర్మములఁ ♦ బ్రస్తుతి కెక్కు నకారణంబునన్
భారత మన్న నెంతయును ♦ భక్తి భజించెడుచంద్రమాళిపృ
థ్వీరమణుండు సుస్థితి ల ♦ భింపఁగఁ జేయుటఁ జేసి నీకు ని
న్నారసి కొల్వఁ గల్గె నిటు ♦ లాంధ్రమునన్ జగదేకవల్లభా. 251

---

* ఎరవు=భేదము; ఓటు=అపజయము, భంగము; కలది గనుక నే పదునొకండక్షౌహిణు లైనను కురుబలం బోడె ననియు, హరిబలము గలది గనుక నే యేడక్షౌహిణు లైనను పాండవబలంబు గెల్చెనని సూచన. అక్షౌహిణి=21870 రథములు, 21870 ఏనుంగులు, 65610 గుఱ్ఱములు, 109350 కాల్బలము గలసేన.

† ఏవ్వురు=పంచపాండవకృష్ణసాత్యకులు; ముగురు=కృపాశ్వత్థామకృతవర్మలు.

చ. దురితము లెన్నొ చేసితిని ♦ దుష్టుఁడ శిష్టజనప్రసంగతిన్
బరఁగినవాఁడఁ గా నయినఁ ♦ బావనగాంగజలంబు లానుచున్
నిరతము నిర్మలం బయిన ♦ నెమ్మది నిన్ భజియించు చుంటి నన్
గరుణ ననుగ్రహింపుము జ ♦ గత్త్రయరక్షక! పాపశిక్షకా! 252

మ. భగవంతుం డగుశార్ఙ్గాయుధుఁడు దా ♦ భాషించె మున్నాడి కొం
తగ నయ్యుష్ణఫలంబులం గలిగి గం ♦ ధవ్యాపకిం బై పసా
దగు నియ్యాదిసుమంబు నీపదముల ♦ న్భక్తిన్ సమర్పించితిన్
జగదాధార! పరిగ్రహింపు మిఁకఁ బ్రై ♦ సర్వాం బపేక్షించుచున్. 253

గద్యము. ఇది శ్రీమదఘునాశనోభయకవిమిత్ర వేంకటయప్రాగ్రపుత్ర
సమారాధితవిబుధరాజ శ్రీపాదకృష్ణమూర్తి కవిరాజ
ప్రణీతం బయిన శ్రీకృష్ణభారతంబునం
దాదిపర్వంబునఁ బ్రథమాశ్వాసము.
శ్రీ. శ్రీ. శ్రీ.



తమ్ముల్ మోదిరి నల్లరా వెత యగుం ♦ దాపమ్ము కోపమ్ము పా
పమ్ముఁ ముప్పతి యయ్యెఁ బ్రోవఁ గదె నా ♦ పాలింటి దైవంబవై. 8

క. అని వగచు కొడుకుఁ గుస్త్రను, గని కరమునఁ దేర్చి సరమ ♦ కన లెదుచిత్తం
బున రవిలి యత్రినిత్రో నటఁ, జని దీక్షితుఁ గాంచి పలికె ♦ సాధ్వస మొదవన్. 9

తరలము. నిరపరాధుఁడు నాకుమారుఁడు ♦ నీకు నెగ్గు లొనర్పఁ డీ
వరుస మొత్తిరి నీదుతమ్ములు ♦ వారి కేమి ఘటిల్లె రా
నరవరుండను దీక్షితుండను ♦ నాకె నేఁ బురు డంచు నీ
గిరువమే సుమి నిన్ను పేక్షితుఁ ♦ గా నొనర్చెర దుర్మతీ. 10

మ. తపసీయూంచితచూడ పీఁ డిట హవి ♦ ర్ధానంబునం దూరెనో
నపఁ దా మూర్కొనెనో మహాత్ములకుఁ బా ♦ పం బెద్దియుఁ జేసెనో
విపరీతంబుగ హోమవస్తువులకడన్ ♦ విణ్మూత్రముల్ వేసెనో
యపచారం బెది యయ్యె నాకొడుకు నా ♦ రా! యిట్టు కొట్టింతురా. 11

క. మనమున యుక్తా యుక్తం, బని తెలియక నోరు లేని ♦ యఁబేదలకున్
మునులకుఁ బేదల కెగ్గుల్, పొనరుచుఖలుల కనిమిత్త ♦ ముగ భయము లగున్.

సీ. అని యేగిన విషణ్ణుఁ ♦ డై జనమేజయుం, డద్దీర్ఘసత్రస ♦ మాప్తిఁ జేసి
హస్తిపురం బేగి ♦ ప్రస్తుతాలోచన, పరుఁడై పురోహితు ♦ నరయఁ గోరి
చని యొక్కమునివాటి ♦ ననురూపుని శ్రుతశ్ర, వునిసు[illegible]ఁ సోమశ్ర ♦ వుని గ్రహించి
వినుతించి ప్రార్థించి ♦ మునివరు నీసుతు, నిడు మిచ్చ నాపురో ♦ హితునిఁ గాఁగ

తే. నన శ్రుతశ్రవసుఁడు వాని ♦ కనియె వీఁడు, నాముశుక్రింబుఁ ద్రావిన ♦ నాగవనిత
కడుపునం బుట్టిమత్తపః ♦ కలితుఁడయ్యె, ఘనుఁడు స్వాధ్యాయసంపన్నుఁడును దపస్వి.

వ. ఎట్టిపాపంబు లైన శమియింపం జేయఁ గలండు నీకు లగ్గుగుం గాని వీని కెవం డేది యడిగిన దాని నిచ్చునట్టి వ్రతంబు గలదది నీ కిష్టంబ యేని కొని పొమ్మనిన జనమేజయుం డట్లగుంగాక మని వానిం దోడికొని పోయి తదిష్టక్రమంబున దేవశునీశాపప్రతీకారార్థ మనవరతశాంతికపౌష్టికక్రియలు నిర్వర్తించుచుఁ దమ్ములం గూడి తక్షశిలాదిదేశమ్ముల జయించి హస్తినాపురంబునఁ బూజ్యసామ్రాజ్య మేలుచు సుఖం బుండె నయ్యవసరంబున. 14

## ఉదంకగురుచరిత్రము.

చ. * తనరు నయోదధౌమ్యుఁ డను ♦ ధర్మవిధిజ్ఞుఁడు విజ్ఞుఁ డన్న నా
తని కుపమన్యుఁ డారుణి యు ♦ దంకగురుం డగు వేదుఁ డాత్మవి

* ఉదంక, ఉతంక అని పాఠభేదములు గానవచ్చెడిని; వేద, బైద, యని మూలమున రెండురూపములుండ నన్నయభారతమందు బైలుఁడు అనియున్నది ఇదిమృగ్యము; అయోద, అపోద, అని కలదు.

ద్యను గొన శిష్యు లైరి ముగు♦రాయన వారిని జేల దుష్కఁ గాఁ
బనిచి యు నాలఁ గాయు మని▸పంచి యు నెంచెను గష్టవృత్తులన్. 15

వ. తత్ప్రకారం బెట్టిదనిన. 16

ఉ. † ఆరుణి దేశికాజ్ఞఁ బను♦లన్నియుఁ జేయుచు నొక్కనాఁడు కే
దారమునందు మళ్లకు ను♦దారత నీళ్లులు గట్ట నేగి పెం
దూరకు నడ్డుగాఁ దనదు♦దొడ్డశరీరముఁ జేర్చి తే ల్పన
శ్వాసయ నొక్కరీతిఁ బడి♦యక్కడ నుండె జనుల్ నుతింపఁగన్. 17

తే. అంత ధౌమ్యుఁడు శిష్యుల♦నరసి యెచటి, కరిగె నారుణి నా వారు▸గురువరేణ్య
వినుఁడు మీ పంపున న్వాఁడు♦చని యెఁగాదె, కమకొనినభక్తిఁ గేదార♦ఖండమునకు

వ. అని వారు చెప్పిన నట్లయినచో మనము నటకుం బోయి వత్తము రం డని
శిష్యులంగూడి. 19

ఆ. ‡ ధౌమ్యుఁ డటకుఁ బోయి♦తత్ప్రకార మెఱింగి, మెచ్చి తెమ్మసంగ▸నప్పుఁడా విడి
లేచి వచ్చెఁడు వానిఁ▸జూచి యుద్దాలకుం, డనుచుఁ బిలిచి పుచ్చె♦ఘనునిఁ జేసి.

తే. అంత నుపమన్యుఁడును గురు♦నాజ్ఞ నడపి, వనులఁ బవలెల్ల గోవులఁ▸దనరఁ గాచి
గురుకులంబున రేలెల్లఁ▸గొలిచి యుండు, భక్తియుక్తుల నిచ్చలుం♦బ్రస్తుతింప.

వ. అట్లనవరతానంతపరిచర్యలం జేయుచుం గొలిచి యుండునుపమన్యుం జూచి
యుపాధ్యాయుం డొక్కనాఁడు నీవు కడుం గడు బలిసితి వెట్లు వృత్తిఁ గల్పించు
కొంటి వనిన నతండు. 22

సీ. భైక్ష్యంబునను వృత్తిఁ▸బరిభవించితి నన, గురుఁడు నా కిడక ద♦కుడువకు మనె
నతఁ డట్లయగుఁగాత♦మని భైక్ష్య మంతయు, నతని కిచ్చుచు నాల♦నరయునంత
గురువు బలిసి తెట్లొ♦కో నా నతఁడుమీకుఁ, దొలి భైక్ష్యమిచ్చె నెండి♦మెలఁగుచుంటి
నావుడు నతఁ డది♦న్యాయ్యంబుగాదు భై, క్ష్యోపజీవులవృత్తి♦యుడుగు దాన

ఆ. ననుచు వల్లె యనుచు♦నతఁ డాలఁ గాయుచుఁ, బాలు పిదికి త్రావి♦బలిసె గురువు
దానిఁ దెలిసి నీకుఁ♦దగదు గురుద్రవ్య, మపహరించునట్టి▸దగు న టనియె. 23

వ. అంత నుపమన్యుండు నప్పాలు నుం ద్రావ మాని చనుఁ గుడుచు లేఁగలనోళ్ల నుండి
నేల రాలు ఫేనంబుఁ దిని కాలక్షేపంబు సేయు చుండ నది యుం దగ దని ధౌ
మ్యుండు శాసించుటం జేసి యుదరపోషణంబున కెట్లునుం గానక క్షుధార్తుం డై

† దూర=నీళ్లతూము; గనిమ తెగినచోటు.

‡ ఉద్దాలకుఁడు= (భూమిని) పెకలించుకొనివచ్చినవాఁడు.

యొక్క నాఁ డరణ్యంబున నాల మేపుచు ఘోరతిక్తకటురూక్షంబు లగునర్క పత్రంబుల భక్షించి తదీయోగ్రతీక్ష్ణవిపాకంబున నంధుండై తిరుగుచు నొక్క కూపంబునం బడియె నట నయోదుండును వానిమసలుటకు శంకించి శిష్యులతో వెదకుచు నట వచ్చి యుచ్చస్స్వరంబునం బిలుచుటయుఁ గూపగతుం డగునతండు నర్కపత్రభక్షణంబున నంధీభూతుండ నై కూపంబునం గూలి యుంటి నని ప్రత్యుత్తరం బొసంగఁ గురుండు వగచి దేవవైద్యు లగునశ్వినీదేవతల వేదవాక్యంబుల వినుతింపుము వారు నీకుఁ గన్నులొసంగెద రనిన నతండు మహాప్రసాదం బని నాసత్యుల నంతరంగంబునం దిడికొని. 24

అశ్వదేవతాస్తుతి.

మ. దినానాథాత్మజు లై మహామహిమ ను ♦ ద్దీపించి లోకంబులం
దనురూపప్రతిభ న్విమానగతు లై ♦ హవ్యాంది యజ్ఞాంశములన్
మునుముక్కంటి గ్రహింపఁ గొంది వేలుపులకున్ ♦ ముఖ్యాంగు లై చిత్రకాం
తి ననంతాకృతుల న్వెలుంగుఘనులన్ ♦ గీర్తింతు నాసత్యులన్. 25

చ. * తపనతపోబలంబున ను ♦ తం గనుసాధనమున్ ధరించి పా
పపరిమృతంబులన్ రుజలఁ ♦ బాఱఁగఁ ద్రోలఁగ నై జయంతు లై
యపరిమితప్రభావము న ♦ నై భువనంబుల శాంతిఁ గూర్చు నా
సుపురుషవర్యులం గనుల ♦ స్తోత్రము సేయుదు నాశ్వినేయులన్. 26

మ. దినప్రారంభములందు నెల్లరుఁ గరం ♦ తేజంబునం దోఁచునా
సవనారంభములందు నెల్లు త్రిజగ ♦ చ్ఛస్తప్రభావంబునన్
స్తనముల్ గ్రోలఁగఁ దోఁచి దేవతలకుం ♦ దాల్మిన్ హవిర్భాగముల్
దివులం జేయుమహాత్ములం బిలుతు నే ♦ నాసత్యులన్ దస్రులన్. 27

మ. నవమాసంబులు మాతృగర్భమున నుం ♦ డం బోక సద్యోగతి
న్భవనముం గాంచి సువైద్యు లై యమృతమున్ ♦ జాబిల్లిలోఁ జేసి య
ద్దివిషత్కోటుల నక్షమంపు బల మ ♦ ర్థిం గూర్చి మర్త్యావళిన్
నవిమర్శంబునఁ బ్రోచునశ్వులను నే ♦ స్వాంతంబునం దెంచెదన్. 28

చ. † తెలియ సువేము లట్లు కడుఁ ♦ దెల్లనివర్ణము గ్రాల సత్స్వరూ
పులకు నహర్గ్రహేంద్రులకుఁ ♦ బుట్టి దివంబున నింత లంత లై

* జయంతులు=జయశీలురు.

† సువేములు=మంచిమార్గము గలవారు; గ్రహేంద్రుఁడు=సూర్యుఁడు.

బలముమెయిన్ వెలుంగుచును ♦ భానునిమై నగునల్లకుష్ఠముం
దొలఁగఁగఁ జేసినట్టియఘ ♦ దూరులఁ గొల్చెద వేల్పువెజ్జులన్. 29

ఉ. ‡కన్నులు లేనిజీవనము ♦ కష్టి కగున్ జగ మెల్ల వానికిన్
సున్న యగున్ జడుం డనఁగ ♦ సాం పతి యుండెడు వాఁడు దారియుం
డెన్ను నెఱుంగ లేకపుడు ♦ నే సటులై పడి యుంటిఁ గావునన్
గన్నులొసంగి సన్ గరుణఁ ♦ గావఁగ వేఁడెద దేవవైద్యులన్. 30

వ. అని ప్రస్తుతించినం బ్రసన్నులై నాసత్యు లతనిసమక్షంబునఁ బ్రత్యక్షంబై నీస్తవంబునకు మెచ్చి దర్శనం బిచ్చితి మియ్యపూపంబు పుచ్చుకొని తినుము దీన నీ కాము యనివృత్తియై కన్నులు వచ్చు ననినం బ్రాంజలియై యతం డను. 31

చ. గురున కెఱుంగఁ జేయ కిది ♦ కొమ్మని మీ రనినం దినే మహా
త్తర మయినన్ గ్రహింప ననృ ♦ తంబునకుం జలియింతు నాప్రసు
న్నుర లిది మందు నీగురువు ♦ నన్నును మున్ను నుతించి పొందెడు దా
గురున కెఱుంగఁ జేయక త ♦ గుం దగు నీకును నట్లు చేయఁగన్. 32

తే. అనుఁడు నతఁడును నోయయ్య ♦ లార మీర, లెట్లు చెప్పినఁ గాని నే ♦ నిదిగురునకు
నిడక మున్ను భుజించుట ♦ కిచ్చగింప, ననిన నాసత్యు లిట్లని ♦ రాత్మఁ దలఁచి. 33

వ. వత్సా! నీగురుభక్తికి మెచ్చితిమి నీకుఁ గన్ను లిచ్చితిమి నీగురుండు నుక్కుదంతంబులవాఁడు నీవు బంగారుదంతంబులవాఁడ వై శ్రేయంబు లందఁగల వని యంతర్ధానంబు నొంది రంత నుపమన్యుండు లబ్ధచక్షుండై యుపాధ్యాయుని సమీపంబునకుం జని నమస్కరించి సర్వంబు నివేదించుటయు నతండు నుపమన్యునకుఁ బ్రసన్నుండై నీకు సర్వవేదంబులును సర్వశాస్త్రంబులును గరతలామలకంబులై శ్రేయంబు లొసంగుచుండు నింక గృహస్థుండవై సుఖం బుండు మని యతం డిట్లు వీడ్కొలుపంబడి గురుదయాపాత్రుం డయి కృతకృత్యుం డయ్యె నంత వేదుండును. 34

తే. అధికశీతోష్ణతృష్ణాక్షు ♦ ధాదిదుఃఖ, మును సహించి గురునియోగ ♦ మున సతతము
వాని కనుకూలుఁడై యెద్దు ♦ వలెను బూని, భారవాహకుఁడై పాటు ♦ పడుచునుండె.

క. గురుకులమునందు గురులకుఁ, బరిచర్య లొనర్చుచుండి ♦ బహుకాలము దా
గురుశుశ్రూషాపరుఁడై, చరితార్థుం డయ్యె నెల్ల ♦ జగము నుతింపన్. 36

తే. అట్లు చరితార్థుఁడై గృహ ♦ స్థుఁడైన వేదుఁ, డెద గురుకులవాసక్లే ♦ శ మెఱిఁగియున్న
వాఁడగుటఁ జేసి తనశిష్య ♦ వర్గమునకుఁ, గనికరము జూపుచుండెను ♦ కాలమునను.

‡ 'దారియుం దెన్నును':—ఇది లోకోక్తి గాని పునరుక్తి గాదు.

క. తనగురువునకుం బలెఁ దన, కును మూవురుశిష్యు లందు • గుణనిధి యగుచున్
ఘనుఁ డగుచుఁ దగు నుదంకుం, డనునాతఁడు గొలువ వేదుఁ • డలరెన్ బ్రేమన్.

క. జనమేజయుఁడుం బౌష్యుఁడు, ననుపార్థివు లిరువు రట్టి • యవసరమందున్
జనుదెంచి వేదవిప్రునిఁ, గని గురునిఁగఁ జేసికొనిరి • కడుభక్తిమెయిన్. 39

ఆ. అంతఁ గొంతకాల • మరుగ వేదుఁడుయాజ్య, కార్య మొంపుతనకుఁ • గలుగుటయు ను
దంకుఁ బిలిచి వస్తు • తతు లిల్లు నిల్లాలు, భద్ర మని నుడివి ప్ర • వాసమరిగె.

వ. అంత నయ్యుదంకుండును. 41

చ. గురునినియోగముం దలఁచు • కొంచు మఖాగ్నుల వేల్చుకొంచు స
ద్గురుకులవాసమున్ సలుపు • కొంచు జనావళి నేలుకొంచు న
ద్గురుసతివాక్కుల న్నడచి • కొంచు గృహం బది చూచుకొంచు నున్
గురుమతి శాస్త్రముల్ చదువు • కొంచుఁ జరించె విశేషభక్తిమై. 43

సీ. గొడ్డంట ప్రమాఁకులు • గొట్టుఁ గట్టియలకై, కుద్దాలములఁ ద్రవ్వుఁ • గూరమళ్లు
నీళ్లెత్తుఁ జేమోట • నీళ్ళకాల్వలు నిండఁ, బంటపైరుల నెల్ల • భద్రపఱుచు
నిద్ర వేఁకువ లేచి • నిత్యకృత్యముఁ దీర్చు, దున్నునాఁగలి గట్టి • తోట్టు నూడ్వ
నాలమందలు గాచుఁ • పేలఁ జెంగలి మేపి, వేఁపి వేగోలాల • నాపె పుచ్చు

తే. నిచ్చలున్ భక్తియుక్తుల • నిట్టు పడియు, సుగ మనక కష్ట మన కట్లు • చూడఁ జూడ
నింటిపను లెల్ల నెరవేర్చు • చుంట కెంచి, రతని నందఱు గురుకుల • మందుఁ గూర్మి.

తే. అప్పుడుతుమతి గురుపత్ని నంటిబుతువు, సఫలముగఁ జేయుమంచుఁ దత్సఖులు గోర
నియ్యకార్యకరిణముగ • శేఁ గపంగ, ననిన నాతని గలహించి • రతివ లెల్ల.

వ. అంతం గొంతకాలంబున కుపాధ్యాయుండు వచ్చి వానిచేఁతకు మెచ్చి వత్సా నీవు
నా కత్యంతప్రియాంతేవాసివి నీచే నే నెంతయు శుశ్రూషితుండ నైతి నింక నీవు
గృహస్థుండ వై సుఖంబుండు మనుటయు నయ్యుదంకుండు. 45

క. గురుశుశ్రూషాకరునకు, గురుదక్షిణ లిచ్చికోలు • కొలఁ గా దన నే
నురుశుశ్రూషకుఁడం గా, నరయుఁ గరుణించి తెలుపు • మా ప్రియతమమున్.

వ. అని యర్థించినం బ్రతిరోధించి పునఃపునఃప్రార్థితుం డయి విసిగి యుపాధ్యాయుం
డుపాధ్యాయికిం జెప్పు మనుటయు నతం డట్ల చేసిన నామెయు. 47

ఆ. * పౌష్యరాజుదేవి • ధర్మకుండలములు, దొడుగునిచ్చ నాకుఁ • బొడమె పుణ్య
కవ్రతంబునందు • సువతు లెల్లరు, మెచ్చి చూడ వానిఁ • దెచ్చి యిమ్ము. 48

* పుణ్యకము=వ్రతవిశేషము, బ్రాహ్మణసమారాధనమిందుఁ బ్రధానము.

క. అని కుండలములు గైకొని, చని పౌష్యునిపాలి కేను • జని యెదనన నా
జనపతి నీ వతిథివి గా, వున నాతిథ్యము గ్రహించి • పోవు మనుటయున్. 58

క. * క్షణియింపఁ బడితి నర్థ, క్షణమునఁ గావలయు నన్న • సంసిద్ధాన్నం
బణుమధ్య యొకతె పెట్టినఁ, గణములు వేయుచు నతండు • గనెఁ గేశగతిన్. 59

వ. కని పౌష్యు నుపలక్షించి రోషారుణితాక్షుండై పరీక్షింపక నాకుఁ గేశదుష్టం బగు శీతలాన్నంబు పెట్టించితివి గావున నీ వంధుండ వగు మని శపియించె నంత నతండును నిసుష్టాన్నంబు దుష్ట మని దూషించితివి గావున నీ వనపత్యుండ వగు మని ప్రతిశాపం బిచ్చె నుదంకుండు నయ్యన్నంబు దుష్ట మని ప్రత్యక్షంబు చేసి రాజా నీ వెఱుంగక యిచ్చిన శాపంబు గ్రిమ్మఱింపు మనినం గృతాపరాధుండ నని పౌష్యుండు వెండియు. 60

మ. ధరణీదేవుని మానసంబు నవనీ • తప్రాయముం బల్కు బం
ధుర ధారానిశితాసితుల్య మివి రెం • డున్ రాజవంశంబునన్
బరికింపన్ విపరీత మందునను శా • పంబుం దొలంగింప భూ
సురసంఘాగ్రణి నేర్చు నేరఁడు మహీ • శుం డెట్టివాఁ డేని యున్. 61

వ. తీక్ష్ణహృదయుండ నగు నేను నీకు శాపంబుఁ గ్రిమ్మఱింప నోప నంధుండ నై యుండం జాల నిది యెఱింగి నీవు నాకు శాపమోక్షం బనుగ్రహింపు మని ప్రార్థించినం బ్రసన్నుం డయి యుదంకుండు నీ వంధుండ వయ్యు నచిరకాలంబున ననంధుండ వగుదు వని విశాపంబు నలికి యదుష్టాన్నంబు దుష్ట మంటి నని కదా నన్ననపత్యుండ వగు మంటి వ ట్టిది కావున నాకును నీశాపంబు దాఁకకుండుఁ గావుతి మని సమర్థించుకొనియె నని వెండియు. 62

క. చేయుటకుఁ జేయకుంటకుఁ, జేయక చేయుటకుఁ జేసి • చేయకునికికిన్
జేయఁగల రంత యొకటిగఁ, జేయుటకు సమర్థు లన్న • క్షితిసురుల కదా. 63

వ. అట్లు కృతార్థుండయి యుదంకుండు కుండలమ్ములు గొని వేడుక వీడుకోలు వడసి చనువాఁడు ముందట. 64

తక్షకుఁడు కుండలంబు లపహరించుట.

క. దిసమొలక్షపణకుఁ డొకరుం, డసితద్యుతి మెఱసినట్టు • లగపడి యెడలన్
గసిమసవుచు ముసురుకొనుచు, నసదృశగతి ననుసరింప • నరయుచు నరిగెన్. 65

వ. ఇట్లరిగి మార్గమధ్యంబున నొక్కచో నొక్కజలాశయంబుకడఁ గుండలమ్ములు

* క్షణియింపఁబడితిని=నిర్వ్యాపారస్థితి గలవాఁడను గాఁ జేయఁబడితిని.

వెట్టి జలార్థ మెడయుటయు నంతలో నాక్షపణకుండు వాని నందుకొని పలాయి
తుం డయ్యె నుదంకుండును గృతోదకకార్యుం డయి వేల్పులకు మ్రొక్కి యతి
జవంబున వెనుచఱచి పఱచి వానిం బట్టుకొనియె నంత వాఁడు రూపంబు విడిచి
తక్షకుండై తత్క్షణంబ భూవివరమార్గంబున నాగలోకంబునకు నిర్గమించె నుదం
కుండును. 66

చ. *ఖలుఁ డగుతక్షకాహి చొఱఁ • గా నగులాఁగను గ్రొస్సి గ్రొస్సి లో
నలయిక పుట్ట నూర్చుచు ను • పాసతివాక్యము సంస్మరించుచున్
పలవుచు నిల్చుటం దెలియ • వచ్చిన మెచ్చి బలారి వజ్రముం
దలఁపడఁ బుచ్చె నయ్యది యు • దారతఁ ద్రొచ్చెను ద్రవ్వఁగోఁబిలోన్. 67

ఉదంకుఁడు నాగలోక మేఁగి కుండలములు దెచ్చుట.

వ. దానం జేసి యుదంకుం డొక్కనిమేషంబున ధాత్రిం బెకలించుకొని నాగలోకం
బునం బ్రవేశించె నదియును. 68

ఉ. † మేడలబారు మాడుగుల • మించినతీరు దినంబురాయుసై
గోడలసారు గోపురపుఁ • గోటులకారు వనాళిపేరు పూ
వాడనితీవజొంపముల • వాల్చుచుఁ బాతాళునేల్ల జోరు నుం
జూడఁగఁ జూడ నమ్మునికిఁ • జోద్య మొనర్చి తనర్చెఁ బెంపునన్. 69

వ. అట్టి లోకోత్తరగుణోత్తరం బగునాదర్వీకరలోకంబు లోచనగోచరం బగుటయు
నతం డద్దియుం దోఁపక తక్షకాదికాకోదరాధ్యక్షుల నిట్లని ప్రస్తుతించె. 70

ఉ. కోటులు నర్బుదంబులు గఁ • గూడి జగంబుల సంచరించుచున్
జాటి విషోగ్రపూరముల • శాత్రవసంహతి నుక్కడంచుక
ర్కోటకముఖ్యసంతతుల • కుం బ్రభు లై తగునాగరాట్టులన్
మేటులఁ గొల్తుఁ గూర్మికలి • మిన్ ననుఁ గాచి యనుగ్రహింపఁ గన్. 71

తే. అర్కు లట్లు ప్రపంచము • లావరింప, నగుచు నలరారునైరావ • తాన్వవాయు
లైన నాగేంద్రులార మా • యన్నలార, కరుణతో నర్థిజను నన్నుఁ • గావరయ్య.

మ. తమ కైరావతుఁ డీశుఁడై తగ ననిం • దళ్కొత్తి కార్మబ్బు ల
ట్లమితం బై శరవర్షముం గురియుచున్ • హర్షొందుచున్ జారురూ
పములం గల్గి సచిత్రకుండలము లొ • ప్ప న్వేల్పు లై నాకపృ
ష్ఠమునం దెలెడ నుండునాగపతులన్ • సద్భక్తిఁ గీర్తించెదన్. 73

* పలవు=పలవించు; † బారు=పర్ణాధిక్యము.

మ. నవరంధ్రంబులనుండి ధూమశిఖలున్ ♦ వ్యాపించి యుగ్రాగ్నిసం
భవ మై కల్పసముద్భవౌర్వముబలెన్ ♦ జ్వాలార్చితో నయ్యధో
భువనం బెల్ల మసుంగు వెట్టిన మహా ♦ భోగీంద్రవంశంబు తె
ల్ల వగం ద్రెళ్లెను దక్షకాహిమనము ♦ ల్లాడెన్ భయభ్రాంతమై. 84

వ. అయ్యకాండప్రళయంబు భూసురామర్షసంభవం బని భయంపడి తక్షకుండు కుండలంబులు దెచ్చి యుదంకున కిచ్చి పుచ్చె నంత నతండును. 85

మ. రమణన్ నాగురుపత్ని పుణ్యక మొక ♦ ర్వంబోలు నాల్గాళ్లపై
నమరన్ మూర్తము తెమ్ము కుండలము లీ ♦ వానాఁటి కం చాగె నా
సమయాహం బిది దాఁటిరేన్ విఫల మీ ♦ సర్వప్రియత్నంబు మా
తమ కీలోకమునుండి నేఁడె చనుమా ♦ ర్గం బెట్లొకో దైవమా. 86

క. అని వగచునాతనిం గనుఁ, గొని దివ్యుఁడు హయము నెక్కి ♦ కొని పో మ్మిదె నె
మ్మనమును మించినగతి ని, న్గొని చనుఁ గనుమోడ్పునంత ♦ గురుకులమునకున్.

వ. నావుడు నతం డట్లు చేసి గురుకులంబునకు వచ్చి నిత్యస్నాత యై తనరాక కెదురు చూచుచున్నగురుపత్ని కక్కుండలమ్ము లిచ్చి నమస్కరించి కృతకృత్యుం డై గురునకు నివేదించుటయు నతండును. 88

క. ఇదె యున్నది పౌష్యుని పీ, డ ని యొకదినసంబులోని ♦ యది కన తెలియన్
ముదుకడఁవు గావు తడసితి, పదిలముగాఁ బయన మేగి ♦ వచ్చితె వత్సా. 89

వ. అనిన నుదంకుండు తనపోయివచ్చినవృత్తాంతం బంతయు గురునకు నాద్యంతంబుగా నివేదించి పురుషవృషభగోమయాదులయుఁ బురుషాశ్వసహరాదులయు వృత్తాంతంబు సెప్పు మనుటయు నతండును. 90

మ. అమరేశుం డలపూరుషుండు వృషభం ♦ బైరావతం బప్పురీ
షము పీయూషము క్రిందిపూరుషుఁడు పా ♦ ర్జన్యుండు వైశ్వానరుం
డమలాశ్వం బలతంతువు ల్పవలు రే ♦ లా ఱా అట ల్గల్గుచ
క్రమము మాసాత్మకవత్సరంబు బుతుష ♦ ట్కం బెన్న నచ్చాలపుల్. 91

వ. * మఱియు నవిద్యాకామకర్మాత్మకనాసనాజాల మ్మనుయంత్రమ్మునఁ బన్మాయాశక్తు లగుధాతయు విధాతయు నను స్త్రీ లిద్దఱును నేయుంబన ళ్లనుసితాసితతంతువుల నధిరోపించి దివ్యపురుషుని ప్రేరేపణంబునం జేసి యగ్నిసాహాయ్యంబున నార్వురుబాలురు ద్వాదశారచక్రంబుఁ ద్రిప్పుచుండ సంసారాత్మకపటం బనువయించు

* ఆగ్నేయయంత్రసాహాయ్యంబున బట్టలు నేయుట తొల్లియుం గల దని దీనఁ దేటతెల్ల మగుచున్నది.

చుండిరి. నీవు నాప్రియమిత్రుం డగు దేవేంద్రు ననుగ్రహంబునం జేసి యమృతపానంబు సేయుటయుం గృతకృత్యుండ వై పాతాళంబునుండి బయటవచ్చుటయుం గలిగె నని వెండియు. 92

మ. *గురుభారం బయినన్ బ్రయాసము బయిం గొంకుం గూర్చున దైన దు
ష్కర మైనం బరిహాసగంబు బయిఁ గి ♦ ష్టం బైన నే మైన లో
నరయం బోవక జన్మసార్థకము పో ♦ యంచు న్విచారించుచున్
గురుకార్యం బొనరించు శిష్యుఁ డనిశం ♦ బుం బొందు నింపుం దగన్. 93

—•—◆ ఉపాసకులకుఁ జానవే యోగికిఁ బకరిగి ప్రయోగబుద్ధి పుట్టదుట. ◆—•—

వ. నీవు ఋణవిముక్తుండ వైతి వింక గృహస్థుండ వయి సుఖంబుండు మనిన నుదంకుండు గురున కభివందనంబు చేసి యెంతో కృతప్రయాణుండై హస్తినాపురమార్గంబు వట్టి పోవుచుం దనలో నిట్లని వితర్కించె. 94

మ. ఉపమాతీతవయోవిలాసవనితా ♦ సూక్తి చవిం దాఁకనో
సుపరిష్వంగము లంగముం బెనుచునో ♦ శోభించునో వైభవా
ప్పదారామగృహాదు లాత్మకుఁ దలం ♦ ప న్మానికిం బూని పే
రపకారం బొనరించుకించుఁ జెపఁ జే ♦ యన్ లే కుపేక్షించినన్. 95

మ. మగవాఁ డై ప్రభవించియుం బ్రబలి వే ♦ మా త్రిగ్గులం బొందియుం
దగ కన్నుం గను వేఁడి దైన్య మొదవం ♦ దబ్బిబ్బునుం జెందియున్
దగ మైత్రిం గొని యున్నఁ బాసి యగుచున్ ♦ దాటరాదుఁ జేఁపన్ బదుల్
పగ సాధింపఁగ లేనివాని బ్రదుకే ♦ లా నిష్ఫలం బౌ ననా. 96

క. అని మనసు కములఁ గుములం, దనుపుఁ బోగ లెగయ మిగులఁ ♦ దామ్రాక్షుం డై
కనుఁగొనల నుబుల మిఱుఁగులు, లను నట్టి తపకుని చేత ♦ కలఁడు కనలుచున్. 97

వ. చని మంత్రిసామంతాదిపరిజనసమేతుం డై పేరోలగం బున్న జనమేజయుం గని తన్నెఱింగించి యాశీర్వదించుచు ని ట్లనియె. 98

చ. మనుజవరేణ్య! సజ్జన ♦ మాన్య! సమంచితపుణ్య! ధన్య! నీ
ఘనయశ మెల్లలోకములఁ ♦ గ్రమ్మి వెలింగెడు భారతాన్వయం
బునకు విభూషణం బయితి ♦ పొమ్ము భవత్కరణీయకార్య మొం
డొనరఁ వచింప వచ్చితి న ♦ నుత్తము మే నిట బాల్యమిత్రుఁడన్. 99

* విందు=మంచిభోజనము; పొందు=పొందిక, ప్రాప్తి, అనుకూల్యము.

క. నావుడు జనమేజయుఁడే, భూవలయం బెల్ల ధర్మ ♦ మునఁ బాలింతున్
నావలన నేమికార్యం, బో విప్రవరేణ్య వలయు ♦ నో తెలుపఁ గదే. 100

వ. అనిన నుదంకుం డి ట్లనియె. 101

చ. అతులితబాహువిక్రమవి ♦ హారవిదారితశత్రులోకు నూ
ర్జితమతిఁ బాండవాన్వయవ ♦ రిష్ఠుని శిష్టజనేష్టునిం బరి
క్షితు నతిశాంతు నీజనకుఁ ♦ జెచ్చెరఁ దక్షకుఁ డాగ్రహించి గ
ర్వితమతి యై విషాగ్నిపద ♦ విన్ గతజీవితుఁ జేసె నీసునన్. 102

ఉ. భారతవంశవర్ధనునిఁ ♦ బాలితభూజను సమ్మహీశు ని
ష్కారణ మట్లు చేసి త్రిజ ♦ గంబులకుం బరమాపకారముం
గూరిచె నట్టిజాల్మపయిఁ ♦ గోపము సూప కుపేక్ష సేయుటల్
ధారుణికిన్ మహాపకృతు ♦ లం బొనరించుట సూవె చూడఁ గన్. 103

వ. ఇదియునుం గాక. 104

చ. గురుహితకార్యమున్ సలుపఁ ♦ గోరి మెలంగెడు నా కకారణం
బరయ కకార్యమున్ సలిపె ♦ నాఖలుఁ డాతనిఁ ద్రెళ్ల నేయుటల్
పరమహితంబ సువ్వె జన ♦ పాలక! నీ వురగాధ్వరంబు స
త్వరముగఁ జేయు మద్ది పితృ ♦ పాదసమర్చన మార్యజుష్టమున్. 105

చ. చెఱకున వెన్ను పుట్టి చెఱ ♦ చె న్నిలు వెల్ల నిరస్తమయ్యె న
త్తెఱఁగున నీచు చేసినగ ♦ తిం గులమెల్లను జెట్ట కాన నీ
వఱిముఱి సర్పయాగమున ♦ నాహుతి సేయుము వహ్నిమధ్యమున్
పఱపుచుఁ దక్షకాధముని ♦ పంబున సర్పము లెల్లఁ ద్రెళ్లఁగన్. 106

తరళము. అని యుదంకుఁడు చెప్పినం బితృ ♦ హంతకుం డగుతక్షకుఁ
గనలి వాని సహాన్వవాయము ♦ గా నశింపఁగఁ జేయ న
మ్మనుజనాయకుఁ డెంచి యాగము ♦ మానఁ జేయుదు నం చనన్
విని ముదంపడి మెచ్చి యిచ్చెఁ జ ♦ నెన్ గృహంబున కాతఁడున్. 107

వ. అని చెప్పిన శౌనకాదు లిట్లని రట్లుదంకప్రేరితుం డగుజనమేజయుం డొనర్చు సర్పయాగంబున సర్పంబు లెల్లం ద్రెళ్లుటకును యాగంబున కంతరాయంబు గలుగుటకును వైశ్వానరుండు సర్వభక్షకుం డయి యాగంబున సర్పంబులం దినుటకును గారణం బున్నయెడల సవిస్తరంబుగం జెప్పు మనిన నక్కథకుండు శౌనకుం జూచి మహాత్మా! మున్ను నేను మాతండ్రివలన నెఱింగిన తెఱంగున నది యంతయుం జెప్పెద నవహితుల రయి వినుం డని యి ట్లనియె. 108



## పౌ లో మ ప ర్వ ము.

### భృగువంశకీర్తనము.

సీ. వరుణాధ్వరమునందుఁ బావకజ్వాలలో, విధిచేతి నుదయించె భృగుమహర్షి
యతఁడు పులోమయన్ సతియందుఁ జ్యవనునిఁ, గనె వానికి సుకన్యకు సగుఁ బ్రమతి
ప్రమతియును ఘృతాచి వలన రురుం గనె, నతఁడు ప్రమద్వర యందు శునకు
భువి నాశునకుఁడు నీ పూర్వపితామహుం, డగుఁ జువ్వె యిది భార్గవాన్వయంబు
తే. భృగుఁడు శపియించె ననలునిఁ బగను సర్వ, భక్షకుండవు గమ్మని భార్యకలన
జననిగర్భచ్యుతుం డైన చ్యవనుఁడప్పు, లోమరాక్షసుఁ గూల్చె వి లోకనమున.
వ. తద్వృత్తాంతంబు సవిస్తరంబుగం జెప్పెద వినుం డని వెండియు. 110
చ. అనఘచరిత్ర గర్భవతి నంబుజనేత్రఁ బులోమ నాశ్రమం
బున నిడి యేటికిన్ భృగువు వోయినయప్పుడు మూర్త మహాతమం
బనఁ దగురక్కసుం డొకరుఁ డక్కడకుం బఱతెంచి కాంచె న
మ్మునిసతి వానిపేరు పొలు పొందుఁ బులోముఁడు నా జగంబునన్. 111
క. అతిథి యని తలఁచి వానికి, సతి యాతిథ్యం బొసంగఁ జనుదెంచుటయున్
మతిఁ గలఁగి వాఁడు మోహా, న్వితుఁడయి మరుబారిఁ జిక్కి వెక్కసపడుచున్.
వ. అది మున్ను తనచే వరియింపంబడి దానితండ్రిచే భృగున కీయఁబడినపులోమ
కా వగచి మరులుకొని తదంతరంబున దాని హరింప నెంచి యించుఁబోఁడీ
నీకావించునాతిథ్యంబు నాకు వచ్చె నని యగ్నిశరణంబున వెలుంగుచున్నజాతవే
దునిం జూచి. 113
మ. * ఇది నే మున్ను వరించినట్టియు భృగుం డీడాడి కొన్నట్టియున్
సుదతీరత్నము నా నెదం బొడమె నీ సుద్దిం దిరం బయ్యె నే
నిదె బల్మిం గొని పోదు సత్యమును వా కిమ్మేనివాల్గంటి యో
సదసత్సాక్షి వసత్య మాడకుము వి శ్వస్తుత్య వైశ్వానరా. 114
వ. అని యడిగిన నగ్నిభట్టారకుండు బెట్టు దుఃఖించుచు. 115
తే. మగువకలరూపు సెప్పిన భృగుఁడు దిట్టు, జంకి చెప్పక యున్న న సత్యదోష
మొనరు నిటముందుఁబోనుయ్యి వెనుకగొయ్యి, యనెడుసామెత నిక్కమైహానివచ్చు.
క. అనృతంబుకన్న నెన్నన్, ఘనతరకిల్బిషము లేదు కావున మనుజుం
డనృతంబు వలుకఁ జెల్లదు, తనకు న్మృతి యెంత లావ దలు రా నున్నన్.117

---

* ఈడాడి = మార్కొని.

ఆ. అనుచు నిశ్చయించు ♦ కొని యగ్ని యిది తొల్లి, నీవరించినట్టి ♦ నెలఁత దీని
తండ్రి యొసఁగ భృగువు ♦ తగ విధివిధమునఁ, బెండ్లియాడె లోక ♦ విశ్రుతముగ.

క. వరలోభంబున నీ కీ, వరనర్థి నితండ్రి యిడమి ♦ వరియించియు నీ
వరయ న్విధిదృష్టవిధిన్, బరిణయమాడంగ లేదు ♦ పడఁతిం దీనిన్. 119

వ. కర్మసాక్షి నగు నే నిది యంతయు నిక్కంబ యని చెప్పుచుంటి నని చెప్పిన నప్పు రికింప కప్పులోముండు వరాహరూపంబున నత్తలోదరి నెత్తికొని మహావేగంబునం బోవు నంత నామె గర్భంబున నున్నయర్భకుండు కనలి కుక్షిచ్యుతుం డై చ్యవనుండు నాఁ బడె నప్పుడు. 120

క. బాలార్కసదృశతేజుని, బాలుం గనుఁగొన్నమాత్రఁ ♦ బ్రాణము వెడలం
గూలఁ బడి భస్మసాత్కృతుఁ, డై లక్షింపంగ నయ్యె ♦ నయ్యసుర నడిన్. 121

ఉ. అంతఁ బులోమయుం గురరి ♦ య ట్లట నేడ్చుచు బాలుఁ గొంచుఁ బో
నెంతయుఁ గాఱునశ్రుజల ♦ మే యయి పాఱెఁ దదంతరంబునన్
స్వాంతముఁ దేర్చి బ్రహ్మ యట ♦ వచ్చి వధూమణి మెచ్చి యాశ్రమ
ప్రాంతమునందు నన్నదికి ♦ నాఁడె వధూసర నాఁగఁ బేరిడెన్. 122

తే. అట్లు పుట్టి పితామహు ♦ నాజ్ఞవలన, నట వధూసర యన నొప్పు ♦ నేటిచెంతఁ
దొల్లి భృగుకులోద్వహుఁడగు ♦ నల్లచ్యవనుఁ, డాశ్రమముఁ జేసికొని తప మారఁ జేసె.

వ. అంతఁ గృతస్నానుం డయి వచ్చినభృగుం డాబాలార్కతేజం బగుబాలు నెత్తి కొని యున్నమత్తకాశిని నిరీక్షించి రాక్షసకృతాపరాధం బెఱింగి కరం బలిగి ని న్నెవ్వఁ డప్పులోమున కెఱింగించెం జెప్పు మాతని నిప్పుడ శపియించెద ననిన నత్తన్వి యి ట్లనియె. 124

చ. ఇది భృగుపత్ని యం చసుర ♦ కీదహనుం డెఱిఁగించెఁ గొంచ కా
మదయుతుఁ డెంతయుం దెలివి ♦ మాలి బలిమిం గొని నన్నుఁ బంది యై
కొదుకక పాఱెఁ బాఱునెడఁ ♦ గుఱ్ఱఁ డితం డుదరచ్యుతుండు భీ
ప్రదుఁ డయి క్రాలె రాక్షసుఁడు ♦ భస్మము నొందెను వీనివేఁడికిన్. 125

వ. అట్లు నీకొడుకుచేఁ బరిమోక్షిత నై యిట్లు వచ్చితి ననిన నతం డదరిపడి హుంకారంబు సేయుచు నహంకారంబున నగ్నిదేవుం దిలకించి నీవు నాపాలఁ దప్పు చేసితి కావున నిప్పటినుండియు సర్వభక్షకుండవు గమ్మని శపియించిన నించుక కనలి యతం డతని కి ట్లనియె. 126

చ. మునివర నన్ శపించి యిటు ♦ పోలనిసాహసముం బొనర్చి తే
ననయము ధర్మమార్గమున ♦ యందు మెలంగెద సత్యవాది నై

కని విని యున్నయర్థ మడుగంబడి చెప్పితి సత్య మిందు నా
యొనరిచినట్టి దై తెలియ నుండినఁ దప్పిద మేమి చెప్పవే. 127

ఆ. కనినయర్థ మెట్టు లని యడిగినఁ జెప్ప, నట్టివాఁడు వ్యర్థ యంబు సెప్పి
నట్టివాఁడు దుఃఖ మనుభవించెదు నిజ,పితృగణంబుతోడ దు రితము నొంది.

వ. సకలధర్మస్వరూపుండ వని పేరొందిన నే ననస్యంబు చెప్పనేరక సత్యంబు చెప్పితి నిందు నా తప్పు విచారింపక శాపం బిచ్చితేని నీకుఁ బ్రతిశాపం బీ నోపని వాఁడఁ గాను వినుము. 129

ఉ. కొట్టినఁ దిట్టిన న్మతిభయుఁ గోపము సూపినఁ బాపకర్మముం
గట్టినఁ గిల్లలాడినను గిన్నెను పెట్టినఁ జిత్తశుద్ధుఁ డౌ
నట్టి మహాసుపర్వుఁడు మహాహుము హూఁ డాలని కెగ్గు చేసినం
జెట్టగు నిందు నందు నని చేయుదు రిష్టము వాని కెట్టిరున్. 130

వ. నీవు భూదేవుండవు గావున నీ కెట్లాడినం జెల్లె నది యట్లుండనిమ్ము వేదవిహితనిత్యనైమిత్తికాదివివిధవిధానంబుల నాయందు వేల్వంబడునహవ్యకవ్యంబులు నా ముఖంబునన దేవపితృగణంబు లనుభవించు చుండు రట్టి దేవముఖంబ నైన నేను సర్వభక్షకుండ నై యెట్లు ప్రవర్తింతు నని వీతిహోత్రుండు జగం బావరించినతన మూర్తి నుపసంహరించె నంత నంతరంబ. 131

సీ. యాయజూకులు సవనాగ్నులఁ బ్రజ్వలింపఁ, జనికాననాముల స్తబ్ధమయి పడిరి
వంట కిగ్గి గుల్ల నింటింట గేస్తురాం, డ్రల్లఁ బోయిరి రిత్త యాఁదియాఁది
ముదుకళ్ళ హూమహూలెల్ల మొదటి సగుకుల్కుల లక్కింది, ఘనహసంతుల రేపి వనటఁ బడిరి
పొలము కాపరు లగ్గిఁ గలిగింప దారువుల్, మధియించి మధియించి వ్యధితు లైరి

తే. హవ్యకవ్యంబు లుడిగె స్వాహాస్వధాదు,లనునుడు లడంగె నిర్మములనలఁబడిరి
నన్న మరయంగ లేక సమస్తజనులు, కుతిలఁ గుడిచిరి కడుపుచిచ్చుతిశయింప.

వ. అట్టి మహాపన్నవంబున ఋషులు నమరులు ను గలసి బ్రహ్మదేవునికడకుం జని ప్రార్థించి మొఱ్ఱ వెట్టుచు ని ట్లనిరి. 133

మ. భృగుశాపంబున సర్వభక్షుఁ డగుటన్ బెం పేది వైశ్వానరుం
డాగిఁ దేజం బుపసంహరించె నెట నే నొక్కిం టలెనర్కాగ్ని మేఁ
దగులం బోవదు హవ్యకవ్యములు భ క్తంబుం గనన్ రావు ము
జ్జగమం దల్లడతల్లడం బగు నయో స్వామీ! దయం బ్రోవవే. 134

వ. అని ప్రార్థించినం బ్రసన్నుం డై విశ్వస్రష్ట యగ్నిభట్టారకుం బిలువం బంచి మృదుమధురవచనరచనల నతని ననునయించుచు ని ట్లనియె. 135

మ. * తెగువం జేయుము ముఖంబుల న్ముఖమవై ♦ దేవర్షికిన్ హవ్య మీ
యఁగ మర్త్యాళికి నన్న మీయఁ గడుము ♦ ఖ్యంబై ప్రభూతంబవై
తగి లోకంబుల నేలు నీవు దయలో ♦ దైవారఁ గోపంబునన్
డిగి నా చెప్పెడు మాటలన్ వినుము తం ♦ డ్రీ యగ్నిభట్టారకా. 136

ఉ. లోకములన్ భరించెదవు ♦ లోకవిభుండవు లోకకర్తవున్
నీ కిటు చెల్లునయ్య కరు ♦ ణించి పరాఙ్ముఖభావ మొందఁగ లో
కావలెనింత దారుణముగా నిటు ♦ లయ్యయి కర్మము లొప్పఁ జేయవే
చేకొని యాగభాగములు ♦ చేర్పవె వేల్పులకున్ హుతాశనా. 137

క. పరమపవిత్రుండవు నీ, వరుదారన్ సర్వభక్షకుఁ ♦ డయ్యును శుచివై
పరఁగెదవు సర్వపూజ్యుఁడ, వరయన్ దేవర్షిముఖమ ♦ వగు మెప్పటికిన్. 138

తే. అరుణకిరణంబు సోఁకిన ♦ యట్టి వస్తు, వెట్టులు పవిత్రమగు నట్లు ♦ లీవు దాఁకి
నట్టి వస్తువును బవిత్ర ♦ మగును గాన, దేవ భువనప్రవృత్తికై ♦ తిరుగు మనఘ.

తే. అనుచుఁ బరమేష్ఠి పలికిన ♦ నలరి వహ్ని, నీ మహాశాసనము మూఁదల ♦ నిల్పుదు నని
తొంటియట్టులు దీపించె ♦ దానఁ గుశలిఁగి, మునులు సురలును జనులు నిచ్చ ♦ ముదితులగుచు.

క. ఎప్పటియట్టులు కర్మము, లొప్పెను స్వాహాస్వధాదు ♦ లుద్ఘోషణలిం
నప్పుడు వినఁబడె మరలన్, జొప్పడె లోకంబు లెల్ల ♦ సొంపెసలారన్. 141

వ. ఇది హవిర్భక్షుని సర్వభక్షకునిఁగా నేపింపఁజాలిన భృగుమహర్షి మహత్త్వం బట్టి భృగువునకుం బ్రపౌత్రుఁ డయిన రురుని వృత్తాంతంబు సెప్పెద వినుం డని యొండియు.

—••◆ ప్రమద్వరారురుల వృత్తాంతము. ◆••—

తే. ధరణి విశ్వావసుండను ♦ గంధర్వరాజు, లీల విహరించుచున్ మేన ♦ కాలతాంగి
నంగభవుబారిఁ గప్పిన ♦ నావరించి, కలసి మెలసి మెలంగె న ♦ క్కాలమందు.

వ. దానికిఁ జూలు నిలిచి సద్యఃకాలంబున నొక్కబాలిక యుద్భవించుడు నయ్యచ్చర దాని స్థూలకేశాశ్రమసమీపంబునం దొకనదిచెంతం బాఱవైచి స్వర్గంబునకు నిర్గమించె స్థూలకేశుండును దిక్కుమాలినది యై నదియొడ్డునం బడి యున్న దానిం గని కనికరంబునం దెచ్చి యుటజంబునం బెట్టుకొని ప్రమదాజనవరిష్ఠ యగుటం జేసి ప్రమద్వర యని పేరు పెట్టి పెంచి పెద్దదానిం గావించె నంతట. 144

చ. రురుఁడు విలాసమార్గమునఁ ♦ గ్రుమ్మఱుచు న్నుటజంబుకుం బ్రమ
ద్వరఁ గని మోహితుం డగుచు ♦ దానిని బెండిలియాడ నిచ్ఛమై

* తెగువ = దాతృత్వము.

బరఁగి నిజాంతరంగమునఁ • బట్టినదానిని మిత్రకోటిచే
గురున కెఱుంగఁ జేసి మదిఁ • గోరిక లీరికలెత్త వర్తిలున్. 145

గీ. ప్రమతి ప్రమదంబునం బొంది • వధువుఁ గూర్చి, స్థూలకేశునికడ కేగి • సుతునికోర్కి
దెలియఁ జెప్పఁ నాతఁడు • దెలిసి చేసెఁ, గన్నె నీయఁగ వాగ్దాన • మెన్న మునులు.

వ. అంతం గొన్నినాళ్ల కవల హస్తానక్షత్రంబున వివాహముహూర్తంబు నిర్ణయింపంబడి యున్నయప్పుడు. 147

చ. లలనలతోఁ బ్రమద్వర వి • లాసవిహారము సేయఁ బోయి పో
వలసినచోటఁ గా మొకఁడు • పండుటఁ గానక కాల మెట్టె మి
క్కిలి పగవట్టి సర్ప మది • కిర్కురు వెట్టుచు నొక్కె కోఱ లో
పలఁ జనఁ గాలు వైచెఁ జెలి • పాటవముం జెడి కూలె నేలకున్. 148

గీ. నురుఁగుగము వెల్లి పెల్లున • నోటఁ గాఱెఁ, గాంతి చెడి కాయమంతయు • గాజువాఱెఁ
గనులు మూఁతలువడె నూర్పు • కడలు నట్టె, నెఱులు విడి చిక్కుపడి పడి • నేలఁ బొరలె.

క. కఱచెం బన్నగ మంచున్, వెఱచఱచి సఖీజనంబు • వెస నల్గడలుం
బఱచిరి యఱచుచు రోదయున్, బఱపయ్యెన్ వనులు మొఱసెఁ • బరుసయు విరిసెన్.

వ. అపుడు స్థూలకేశాదిమహామును లచ్చటికి నచ్చి చచ్చి పడి యున్న ప్రమద్వరం జూచి వాపోవు చుండిరి ప్రమతితో వచ్చినరురుండు నట నుండ నోపక శోకాకులితచిత్తుండై తత్తఱంబునం బోయి వనాంతరంబుల నేకాకి యై పరిభ్రమించుచుఁ బ్రమద్వర నుద్దేశించి. 151

చ. కలకలలాడు నీ మొగము • కన్నులఁ గాంచిన దాది గాఁగ నా
వలపులపంట యంచు నెద • భావన సేయుచుఁ బెండ్లియాడఁ గాఁ
దలఁచితి నట్టినీవు విధి • ధంబుగఁ బోయితె నన్నుఁ బాసి పా
ముల కశనంబవై యకట • ముద్దియ! నే నిఁక నెట్లు తాళుదున్. 152

వ. అని మిగుల నగలం బొగులుచు. 153

ఉ. ఏను మునీంద్రవంశజుఁడ • నేనిఁ బరార్తినిఁ గోర నేని నా
మానస మెప్పుడున్ సుకృతి • మార్గమునం దగు నేని నిశ్చలా
నూనదయాళులార దివి • జోత్తములార ప్రమద్వరాసతీ
ప్రాణము లీయరే భుజగ • రాజవిషమ్ము హరించి కావరే. 154

వ. అనుచు నాక్రోశించుచుండ నాకాశంబున నుండి దేవప్రేరితుండయి యొక్క దూత పొడసూపి కాలగతి కిట్లు జాలింబడి ఫలంబు లేదయిన నొక్కయుపాయంబు సెప్పెద నట్లు సేయుమని యిట్లనియె. 155

ఆ. నేను దేవదూత ♦ నీప్రార్థనకు వేల్పు, లలరి నన్నుఁ బుచ్చి ♦ రెలమి నీదు
నాయువున సగ మిడ ♦ నచ్చెలి బ్రదికించు, కొనఁగ వచ్చు ననిన ♦ విని రురుండు.

వ. కడుంగడు సంతసించుచు నో ఖేచరోత్తమా నీచెప్పినట్లు చేయం గలవాఁడ నాప్రమద్వరం బ్రదికింపు మని ప్రార్థించిన నతం డతిత్వరితగతి గంధర్వరాజుం గూడి ధర్మరాజుకడకుం జని యిట్లనియె. 157

చ. రురుఁ డనువానిభార్య వర ♦ రూప ప్రమద్వర సర్పదష్టయై
మరణము నొందె దానఁ గడు ♦ మానతి యుండిన వానిఁ బ్రోచి రా
సుర లెవ నీవునుం గరుణఁ ♦ జూచి గ్రహించి తదాయురర్ధముం
దరుణి నెలర్పఁ జేయు మని ♦ తద్దయు వేఁడుచు నుంటి నియ్యెడన్. 158

ఆ. అనిన ధర్మరాజు ♦ మనమున హర్షించి, సురలపంపు సేయఁ ♦ జూడ వలయుఁ
గానఁ జెప్పినట్లు ♦ గాఁ జేయఁ బడుఁ దతి జీ, వించు నని యనుగ్ర♦హించి పుచ్చె.

వ. దానం జేసి విషనిర్ముక్త యయి ప్రమద్వర సువ్యక్తప్రభ నొప్పె నంతఁ గొంతకాలం బున కక్కాంతం బెండ్లియాడి రురుండు దానితో నిష్టోపభోగంబు లనుభవించుచు సుఖంబుండె. 160

తే. కఱచెఁ దనకాంతఁ బాము ♦ కనలి రురుఁడు, వెదికి పాముల వధియింప ♦ మొదలుపెట్టి
పొదలుపుట్టలుదిరుగుచుఁ ♦ బోయిపోయి, యొక్కచో నొక్క డుండుభ ♦ ముండఁ జూచి.

ఆ. *దండ మెత్తి నైవ ♦ నుండుడు డుండుభం, బిట్లు లనియె నీకు ♦ నేమి కీడు
చేసినాఁడ నేను ♦ జెప్పవే న న్నేల, చంపుచుంటి విట్లు ♦ శాంతి లేక. 162

వ. అని మఱియును. 163

చ. ఒరులకు నెగ్గు సేయ కెట ♦ నో పడియుండిన చోట నుండి యొం
డరయఁగ లేక మన్నుఁ దిని ♦ యాఁకలిఁ దీరుచుకొంచు నాఘులి
క్కరణిని ద్రోయుచుంటి నిటు ♦ కాఱియ నొందు నను న్వధింప నో
పురుషవరేణ్యా! నీకు మది ♦ వుట్టుట కేమి కతంబు సెప్పవే. 164

వ. అనిన రురుం డిట్లనియె. 165

ఉ. ప్రాణముకన్న నెక్కుఁ డని ♦ ప్రస్తుతికెక్కిన ధర్మపత్ని ని
ర్యాణము నొందఁ గాఁ గఱచె ♦ వ్యాళి యొకం డది కారణంబు గా
వేఁకముం ధరించి పృథి ♦ విం గలపాముల నెల్లఁ జంప న
క్షీణరుషాకృతిం బ్రతినఁ ♦ జేసితిఁ గావున నిన్నుఁ జంపెదన్. 166

---

* డుండుభము = నీటిపాము.

బున నింక విరక్తుండ వగు మని వాని కుపశమనబుద్ధి పుట్టించి సహస్రపాదుం డంత
ర్ధానంబు నొందె రురుండును వాని నన్వేషించుచు సర్వవనం బెల్లఁ గ్రుమ్మరి కానం
జాలక కాఱుతుండై నిజోటజంబునకు వచ్చి తండ్రికి యథావృత్తాంతం బెఱింగించి శాం
తుం డయ్యె ననిన విని శౌనకాదులు సూతుం జూచి యి ట్లనిరి. 174

మ. నవమాసంబులు మోసి గాసిలి కడున్ • గర్భంబునం గాంచి గా
రవమారం భరియించి పెంచి సుతులన్ • రక్షింప నొత్తల్లి దా
నెవనే వారల కెగ్గు సేయ దయతో • నేలంగ నూహించుఁ గా
కపురా! చాపుఁ డటంచు నిప్పులను వే • యం జూచి వేధించు నే. 175

వ. అని యట్లుండఁ దమ్ము సర్పకులమాత కార్పణ్యంబున సర్పంబుల నట్లుగ శపించె
సర్పశాపంబును సౌపర్ణాఖ్యానంబును జరత్కారుసుతుం డాస్తీకుని చరిత్రం
బును జెప్ప, మఱి యనంతరము. 176

ఆశ్వాసాంతము.

ఉ. భాసురభక్తితత్పరత • బ్రస్తుతి కెక్కఁగఁ దొంటిపుట్టులం
జేసినకర్మలేశమునఁ • జేసి మహీసురవంశజుండ నై
వాసిఁ దలిర్చి యిష్టిలర • వైఖరి నూనఁగ లేక నేర్చిన
ట్లీసరణిం గృతిం గొలువ • నెంచితి మంచుము సర్వరక్షకా! 177

గద్యము. ఇది శ్రీమద్రఘునాథనృపోభయకవిమిత్ర వేంకటయజ్వపుత్త్ర
సమారాధితవిబుధరాజ శ్రీపాదకృష్ణమూర్తి కవిరాజ
ప్రణీతం బయిన శ్రీకృష్ణభారతంబునం
దాదిపర్వంబునఁ ద్వితీయాశ్వాసము.

శ్రీ. శ్రీ. శ్రీ.



శ్రీ

బాలాత్రిపురసుందర్యై నమః.

# శ్రీకృష్ణభారతము

ఆదిపర్వము – తృతీయాశ్వాసము.

ఆస్తీకోపాఖ్యానము.



వేదవ్యాసమహా

భావేరితభారతప్ర ♦ భవగీతామృత

త్త్వావిష్కృతలోకప్రియ

భావితపర మోక్షరప్ర ♦ భావా! దేవా! 1

వ. అక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లని చెప్పం దొడంగె. 2

కద్రూవినతలు పుత్త్రులం బడయుట.

ఉ. దేవయుగంబునందు మును ♦ దివ్యమునిప్రముఖుండు కశ్యపాహ్వయుం

డావనజాసనప్రతిముఁ ♦ డై ప్రతిభం దనరారు వానిఁ గం

బావనమూర్తులై గరిమ ♦ భాసిలు దక్షుసుతల్ గన్నవారు క

ద్రూవినతాఖ్యలిద్దఱు సు ♦ రూపవతుల్ సతులొప్ప నొప్పఁగన్. 3

ఉ. ఆదర మొప్ప నిద్దఱికి ♦ హర్షముతోఁ దమ కిష్టవర్తియై

భేదము లేకయుండఁగను ♦ బెంచుచుఁ గశ్యపుఁ డుండెఁ గాన నా

మోదము హెచ్చి వారిరువు ♦ రొందిరి యంతఁ బ్రసన్నుఁడై యతం

డేది యభీష్టమో తెలుపుఁ ♦ డిచ్చెద నావుడు సంతసించుచున్. 4

చ. మఱి వినఁ గోరెఁ గద్రువ సు ♦ మారుల వేవుర నాగముఖ్యులన్

వెఱచుచుఁ గోరె సవ్వినత ♦ వేగుర మించినవీర్యవంతులన్

మెఱియల సద్గుణ సుతుల ♦ మే లటులౌ నని కశ్యపాఖ్యుఁ డ

త్తెఱవలకుం బ్రసాదమును ♦ దెల్పి తపింపఁగఁ బోయెఁ గానకున్. 5

మ. జ్వలదగ్నిప్రతిమాన మై పరమణి • స్వర్ణప్రభారాశి ను
జ్జ్వలశృంగంబుల మిన్ను ముట్టి రవితే • జం బాఁగి సర్వోత్తరం
బు లసద్రూపము నైన మేరుకుధరం • బుం జేరఁ గాఁ బోయి పెం
పలర స్నానిరి యుండి రచ్చటియప్పై • నత్యంతనిష్ఠాగతిన్. 12

వ. అక్కాలంబునం దక్కడ రమాకాంతుండు వాణీకాంతునిం గని యి ట్లనియె. 13

చ. అమృతమొకండు మృత్యువున • హంకృతిఁ బోలఁ గిఁ జాలినట్టిది
న్య మగుమహౌషధం బది మ • హార్ణవమం దెసఁగు స్మహౌషధీ
సముదయ మజ్జలంబులఁ బొ • సంగఁ గఁ జేసి నడిన్ సురాసురుల్
శ్రమ మన కెల్లరుం గలసి • త్రచ్చిన దో లభియించు నెంతయున్. 14

వ. అని మఱియు నక్కలశార్ణవంబున మందరాచలంబు గవ్వంబుగ నమరించి దానికి వాసుకి యోక్త్రంబు సేయునది యని యమృతోత్పాదనక్రమం బంతయు నెఱింగించిన విని వేల్పులు వారియనుజ్ఞ నడసి వీడుకొని చని. 15

తే. ఓషధీసన్నతతి నబ్ధి • యో యఱంగి, వెలుఁగుచు విహాయసము రాయు • విపిధశృంగ
ములఁ దలిర్చెడుమందరం • బును బెకల్ప, శక్తి చాలక యెంతయు • జాలి నొందె.

వ. కమలాసనకమలాక్షులకడకు మరలి నచ్చి తమయశక్తి నెఱింగించి మందరోద్ధరణ ప్రయత్న మొనరింపుఁ డని ప్రార్థించిన వారు ననంతబలపరాక్రమునంతుం డగు ననంతు నాహ్వానంబు గావించి కార్య మెఱిఁగించి నియోగించుటయును. 17

చ. అనఘుఁ డనంతుఁ డంతట న • నంతగతిం బదుగొంపవేలయో
జనములలోఁతు నంతియ పొ • నంగినయొత్తును గల్గుమందరా
ద్రిని బెకలించి తే నుని ల • తిప్రముదంబున దాని సర్ణవం
బున నిడి త్రచ్చ నాజ్ఞఁ గొనఁ • బోయి వచించిరి వాని కంతయున్. 18

వ. అంత మూర్తీభవించి ప్రత్యక్షుం డై సముద్రుండు వారి కిట్లనియె. 19

ఉ. త్రచ్చెదవేని మందరభ • రంబు కరంబు వహించి మర్ద మే
నచ్చముగా సహింతు నమృ • తాంశము నాకును గల్గునేని నాఁ
బెచ్చినవేడ్కె నా ననుచు • వేల్పులు కవ్వపుఁగొండక్రిందు గాఁ
బొచ్చెము లేనితాపుగను • బ్రోపుగ నిల్పిరి కూర్మవల్లభున్. 20

క. జలధిం గూర్మముపీఁపున, నలరారెడుమందరాద్రి • నరసి తదీయో
చ్ఛలనంబు వజ్రపాతము, వలనం బురుహూతుఁ డపుడు • వడి సడఁగించెన్. 21

క. సకలౌషధీరసంబులఁ, బ్రోకటిగ మగుపాలవెల్లిఁ • బఱపిన మంథా
ద్రికి యోక్త్రముగా నలవా, సుకిఁ జుట్టి మథించి రఖిల • సురలు నసురులున్. 22

చ. శిరములవైపునన్ దనుజ ♦ శేఖరులు న్మతి తోఁకవైపునన్
సురలును మందరంబునకుఁ ♦ జుట్టినవాసుకిఁ బట్టి త్రచ్చు నాఁ
డురుతరశబ్దమొంతయు స ♦ ముద్భవమై వియదంతరంబునం
దిర వుగ నిండి మెండుకొనె ♦ దిక్కులు పిక్కటిలంగ మ్రోయుచున్. 23

తే. వృక్షపాషాణఘృష్టజా ♦ తాశుయూగ్ని, యోక్త్రఘాతసరీసృపా ♦ స్యోద్భవవిష
వహ్నియును గూడి భయదమై ♦ ప్రజ్వలింప, సమువిభుఁ డబ్దవాహ ♦ జల్లార్చె నపుడు.

శా. ఆపాతాళనిమగ్నమందరమహీ ♦ ధ్రాతిభ్రమత్ప్రస్థితిం
గ్రాహాదిస్థితజంతుసంతతులునుం ♦ క్షోణీరుహంబు ల్మహా
ద్వీపంబుల్ పృథివీధరంబులును ని ♦ ష్పిష్టంబులై పోఁ బయో
మూలం బొందెను దజ్జలం బడరె వా ♦ రు న్వారుణుం దప్పిపోన్. 25

ఉ. ఏండ్లకొలంది గాఁగ నిటు ♦ లెంతయుఁ బాలముతో సురాసురుల్
వీండ్లఁ గిండ్లనాక కడు ♦ నేసట నొందుమఁ ద్రిచ్చఁ ద్రిచ్చ న
గ్రొండ్లి యుడంగ ఘోరము ♦ గ్రమ్మిన హాలహలంబు పుట్టె వా
రొండ్లు నెఱుంగ కంతమును ♦ నొందిరి నాఁ బడియుండి రయ్యెడన్. 26

వ. బ్రహ్మాదు లయ్యుపద్రవంబునకోడి పిడవిభయంబున భవునికడకుం జని విన్నయం
బభినయించుచు నది యంతయు విన్నవించి. 27

క. లోకములు పదియు నాలుగుఁ, జీకాకుం బడియె సకల ♦ జీవేశ్వర సు
వీకరణి నూఱ కుండక, మాకుం జూపింపు బ్రదుకు ♦ మార్గం బభవా. 28

వ. అని ప్రార్థించుటయుం బ్రసన్నుం డయి. 29

క. త్రిజగత్సంరక్షకమై, గరళము సేయంగ నున్న ♦ కాకోలంబున్
గజదానవారి చేకొని, నిజగళమున నిలుపుకొనియె ♦ నలగళుఁ డగుచున్. 30

వ. అనంతరంబ దేవదానవులును సంకర్షణాపరిమితబలపరాక్రమంబులం బరగి హర్షోత్కర్షంబున మఱియుం దొడంగి మహార్ణవంబు మథియింపం జొచ్చి రంత. 31

క. కిమునల్లనిరూపము నలు, గడఁ జీఁకటు లీన రత్న ♦ ఖచితములై పే
ర్పడిన విభూషణములతో, వడి జ్యేష్ఠాదేవి పుట్టె ♦ వారిధి నవలన్. 32

సీ. నలుగడఁ జలివెలుం ♦ గులు పర్వ జాబిల్లి, ధవళద్యుతులతోడ ♦ ననుసరించె
వెలిపట్టుపుట్టంబు ♦ వలెవాటు గాఁ గొని, సప్రోప్ప శ్రీదేవి ♦ సంభవించె
వెన్నెలల్ వెదజల్లి ♦ వెన్నలోపలినుండి, రాణించి కౌస్తుభ ♦ రత్న మొదవెఁ
గోరినకోర్కెల్ ♦ కొనసాగఁ జేసెను, కామధేనువుఁ గల్ప ♦ కమును బొడమె

తే. మఱియు నాల్గుదంతంబుల • మత్తగజము, నమలతురగంబు సురయును • నప్సరసలు
నమృతకలశంబులోనుండి • రాంగ మొప్ప, ఘనుఁడు ధన్వంతరియు నందుఁ • గలిగె నపుడు.

ఉ. * దుశ్శ్రవణంబు లైన సడులు • తోయధిఁ ద్రచ్చ సుధారసంబు ను
చ్చైశ్శ్రవణ మత్సరత రమయుఁ • జంద్రుఁడు గోవు ననేకవస్తు లం
భశ్శ్రవనంబునుండి వెస • వారి వెలుంగుచు నెల్లడంగి నా
స్వశ్శ్రవులందు నేఁగు లగు • వారు గ్రహించిరి వాని వానినిన్. 34

సీ. భూమినాథ వరేణ్య • భూపతి నెల యయ్యె, నమరులపాలైరి • యప్సరసలు
శ్రీయుఁ గౌస్తుభము నా • రాయణుని జేరెఁ, గామధేనువు స్వర్గ • గతికిఁ బోయె
నందనోద్యానము • నంటుఁ గల్పకము నొందె, ధన్వంతరియు బుధా • స్థాన మొందె
నిచ్చ నైరావణ • ముచ్చైశ్శ్రవ మును, హరిహయునకును వా • హనములయ్యె

తే. ఒరయు మృత్యువును రిక్కఁడు • జలువునట్టి, యమృతకలశంబు వేల్పుల • హస్తమందుఁ
జిక్క నసురుల కొక్క శ్రమ • తక్క మఱియు, నన్యమేమియుఁ జిక్క లే • దయ్యె నపుడు

చ. అమృతము పుట్టినట్టియది • యంబుధి వేలుపు లెల్ల వంచనా
క్రమమున సోఁకుమూకలను • గన్న మొఱంగి హరించి వారి కీ
యమృతముఁ దాని మొక్కటను • నాయిత పాటు గ్రహించి సోఁకు లా
సమయమునందు దేవతల • నశ్యము నీడి పరాక్రమంబునన్. 36

వ. ఇట్లు పడిన మత్సరాముష్టిం గలహించి బెనంగి పోరి యమృతకలశం బూడిసికొని కట్టి సమయంబునఁ బుండరీకాక్షుండు రాక్షసుల కమృతము దక్కుట పాములకుం బాలు వోయుట యని నిశ్చయించి. 37

మ. తళుకుంబంగరుఁ జాలు శ్రీ లప్పసగితం • బై వాడు నెమ్మేనును
న్నల నా ముద్దులు పూటగట్టి మిగుల • న్వాల్గొందు నెమ్మోమును
న్గలుకుంగుబ్బలు వాలుఁగన్నులును వి • న్నుం బోలు లేఁగౌనునుం
గలనారీమణి యై రమాధవుఁ డటన్ • గన్పట్టె నప్పట్టునన్. 38

తే. ఇట్లు మోహిని యై విష్ణు • వెసఁగ నల్ల, దానవుల నెల్ల వంచింపఁ • దలఁచి వారి
కెదుర బఫ్యక్షమగుటయుఁ • గెరలి వారు, మోహపరవశు లై యుండి • రూహ చెడఁగ.

వ. ఇట్లు మేను మఱచి తన్నుం జూచుచున్న దానవుల చెంత కావచ్చి దైత్యాంతకుండు తక్కుచుం దారుచుం జని మీలో మీ రిట్లేల వాదు పెట్టుకొనియెదరు నేను మీ యిరు దెఱంగులవారికి నమృతంబు పంచి యిచ్చెదం డెం దని తత్కలశంబు పుచ్చుకొని

* దుశ్శ్రవణము=కీడు, చెడుగు; అంభశ్శ్రవనము=వార్ధి; స్వశ్శ్రవులు=వేల్పులు.

సురాసురుల వేఱువేఱ రెండుపంక్తులుగాఁ గూరుచుండంబెట్టి సుధారసం బసురులకుం బోయక సురలకుం బోయుచుండ నప్పుడు నరుండను విల్లు గొని దైత్యదానవులం దఱిమి పోనీక నిలువరించె నాలో రాహు వక్కాలకం బెఱింగి దేవరూపంబున వారిబంతికి వచ్చి యమృతం బాస్వాదింపఁ బోవుటం దెలిసి పుష్పవంతులు తెలుపంగం దెలుపుటయు నతిరభసంబునఁ జక్రి చక్రాయుధంబున వానిశిరంబుఁ దెగ నఱికె నంతఁ గబంధంబు నేలఁ గూలి విలవిలఁ దన్నుకొనుచు సాద్రిపర్వతం బగుభూతలంబెల్లఁ జలింపం జేసె నమృతస్పర్శంబునం జేసి తెగియును శిరం బజరం బై గగనంబున కెగసి భయంకరధ్వానంబుఁ గావించె నది మొదలు రాహుముఖమునకు సూర్యాచంద్రమసులతోడి వైరంబు శాశ్వతం బయ్యె నంత దైత్యేశ్వరు లొండొరుల మంతనంబు చేసి. 40

దేవదానవుల యుద్ధము.

మ. కలశాబ్ధి న్మథియింపఁ గల్గిన సుధా • కల్యాసు లన్యోన్యముం
దులగాఁ గొండ మటంచుఁ బల్కి మును సీ • దుర్మార్గు లమార్గముం
దలఁపం బోక రమాసుధాదిసకల • ద్రవ్యంబులు న్వారలో
పల వారే కొని రింతె కా కడచి రో • స్వాం జాల కస్మజ్జనుల్. 41

వ. మన కింక నీగీర్వాణులతోడిపొత్తు చాలు నని సంగ్రామం జొత్తు మని కొందఱు దైత్యులు రథాశ్వగజాదిసాధనంబులం గూర్చుకొని పేర్చి బెట్టార్పులం గ్రొవ్వి లోకభయంకరాకారులై సురసేనం గదిసి తోమరభిండివాలపరశుపట్టిసముసలముద్గరగదాప్రాసకుంతప్రముఖశస్త్రాస్త్రంబుల నొక్కపెట్టునం బట్టుముట్టి పెట్టులు గిట్టఁ గొట్టుచు శౌర్యగాంభీర్యధైర్యస్థైర్యంబులం బొదలి పోలిపోక పేకెం బోరాడుచు. 43

శా. దైత్యుల్ నిత్యపరాక్రమక్రమలస • ద్ధార్ష్ట్యాతిశౌర్యంబునన్
బ్రత్యాలీఢపదస్థు లై స్థగితర • త్నవ్రాతహేతిచ్ఛటా
ప్రత్యాహారవిహారభూరిసమర • వ్యాపారులై పోర నా
దిత్యుల్ స్థైర్యము దక్కి ధైర్యము సెడన్ • దిక్కు ల్విలోకించుచున్. 43

క. అతివ యగురూపు విడివడి, నతులితవిక్రమముతోడ • హరి నిశితాస్త్ర
ప్రతతిఁ బరగించి భీకరగతి దానవకోటి నడిచెఁ • గడువడి నంతన్. 44

మ. నరనారాయణు లిద్దఱుం గవిసి స • న్నద్ధాసురశ్రేణులం
గరవాలంబులు భిండివాలములు చ • క్రప్రాసకుంతాదులన్

గరిమన్ వ్రేయుచు డాయుచున్ ఘనభయా ♦ క్రాంతాత్ములం జేయుచున్
దురపిల్లన్ జముబీడుఁ జూపి రలపా ♦ థోరాశితీరంబునన్. 45

శా. జంభద్వేషియు భూరిభూమిధరప ♦ క్షచ్ఛేదదక్షోచ్ఛల
ద్దంభోళిం గరమం దమర్చి నిజదో ♦ ర్గర్వంబు దీపింప స
త్కుంభీపాకమునందుఁ బాకరుచిఁ గ ♦ న్గోఁ జేసి దైత్యాధమా
రంభంబుం బొలివో నొనర్చె నిజసం ♦ రంభంబు జృంభింపఁ గన్. 46

శా. జ్యాఘోషంబున నాకసంబు వగులన్ ♦ సంధించి కోదండమున్
మాఘాదిత్యునిరీతిఁ దొల్త నయి గ్రీ ♦ ష్మర్తుబధ్నుఁ డై యంత బా
ణౌఘాస్త్రంబుల దైత్యవాహినుల మా ♦ యం జేసె న్నుగ్రప్రచా
రాఘాటం బిసుమంత లేక నరుఁ డ ♦ త్యంతప్రతాపంబునన్. 47

మ. అని నారాయణుఁ డుగ్రుఁ డై తెగి ప్రవ ♦ ర్గాగ్నిప్రభన్ భీమద
ర్పస్ఫూర్తిన్ సుదర్శనం బది కరా ♦ గ్రంబందుఁ గైసేతఁ గాఁ
గొని నాకద్విషులం దెరల్చుచు మహా ♦ ఘోరక్రియం బోనీఁ బెం
పున సారణ్యసముద్రభూధ మగునీ ♦ భూభాగ మల్లాడఁ గన్. 48

ఉ. అత్తఱి దేవదానవుల ♦ కై నమహాద్భుతయుద్ధమం దొగిం
దుత్తుము రై సశస్త్రములు ♦ దొప్పలు దోరలు కుప్పఁగూర లై
మొత్తము లై కనంబడియె ♦ మొత్తెడువేల్పులకత్తిపోట్లఁ బె
న్నెత్తురు గ్రక్కుకొంచు సురు ♦ నేతలు గూలిరి నేల కెంపెయున్. 49

వ. అట్టిమహోగ్రయుద్ధంబునం బరాజితు లై హతశేషు లగురక్కసులు క్రుడంగి సముద్రంబు సొచ్చిన విజయంబు నొంది వియచ్చరులు విచ్చలవిడిఁ బెచ్చుపెరిగి ముచ్చటం బడుచు నందఱుం గూడి మందరంబు ముందటిచోట నిడి యమృతం బిం ద్రునకు నరునకును రక్షింప నిచ్చి స్వర్గంబునకు నిర్గమించి సుఖంబుండి రనంతరంబ.

కద్రూవినతలు పందెములు సలుపుట.

మ. వినతాకద్రువ లిద్దఱు న్మతి నతి ♦ ప్రీతిం బ్రసంగించుచు
స్వనధిం ద్రచ్చుటయున్ సుధారసము మం ♦ దారంబు నుచ్చైశ్శ్రవం
బును లో నొనవి సంభవించుటయునుం ♦ బోలంగఁ దర్కించి న
ల్లనివా తెల్లనివా య వెల్ల నని లీ ♦ ల న్వారు చర్చించుచున్. 51

క. ఉచ్చైశ్శ్రవఃప్రసంగం, బచ్చంబుగఁ దెచ్చి ధూర్త ♦ యై కద్రువ నా
కచ్చుపడఁ జెప్ప మనుటయుఁ, గ్రచ్చఱ వివరించె వినత ♦ కలవరా పెల్లన్. 52

ఉ. కత మొక్కఁ డాట నీగరిత ♦ కన్నకుమారుల దందశూకసం
తతుల శపించె యజ్ఞమున ♦ నాశము నొందఁగ నట్లు దైవని
ర్మితి యగు దీనికిం గినుక ♦ మించఁగ నీ కని తేర్చి వాని కం
చితముగ నిచ్చె పుష్టి విష ♦ శేషహారం బగు నొక్క మంత్రిముల్. 64

వ. అంత నొక్కనాఁడు ప్రభాతం బగుటయు దక్షపుత్త్రిక లగు కద్రూవినత లిద్దఱు నుచ్చైశ్శ్రవోవర్ణనార్థము సముద్రతీరంబునకుం జని రదియును. 65

సీ. రంగత్తరంగిత ♦ రంగపరంపరా, సంకులంబు సుధాతి ♦ పంకిలంబు
తిమితిమింగిలనక్ర ♦ కమఠాదిజలజంతు, భీషణం బతిఘోష ♦ భూషణంబు
నధికాప్సృతార్థక్ష ♦ తార్థదేవవ్రాత, చాలితం బచ్యుత ♦ పాలితంబు
పరివిమలాపత్యాయి ♦ తవరదోచ్చైశ్శ్రవ, స్సైంధవంబు సురేంద్ర ♦ బాంధవంబు

తే. వివిధరత్నాకరం బహి ♦ భీకరంబు, వరుణనిలయంబు కల్పిత ♦ ప్రళయంబు
బాడబానలదీర్ఘార్చిహారి బద్ధి ♦ భరసహంబు, నద్భుతం బగుఁ గలశమ ♦ హార్ణవంబు.

మ. ఘనతాళ్వానిలవేగవిష్టవిచల ♦ త్పాథస్తరంగోన్నతి
స్ఫురదాస్ఫాలనపరన్ ఘనఘనా ♦ పూర్ణాభ్రరంగంబునన్
విరతాబ్దం బెట లేక చుట్టుయ భవనన్ ♦ విస్ఫారమృదంగాళి దా
నరయం గై నృత్యము సేయు నాఁడ నుద ♦ న్వంతుండు ధాస్వంతుఁడై. 67

తే. చంద్రుఁ జూచి యుంచి శీతించు సమయమందు, సంద్రము ప్పొంగు నాత్మద్వంద్వంబు నొందఁ
దానుసస్వంబు నొందునాఁ ♦ డుఱుగు నరయఁ, దనయుఁ దృద్ధిఁ జయంబులు ♦ తండ్రి వకద.

తే. అంత నొంపారుఁ గెలువంగ ♦ నైకచంద్రు, వయును విరతియు నాకాశ ♦ పథమునుండి
యుదధిమాఁవలిగట్టున ♦ నున్న యట్టి, యశ్వరాజముఁ జూడంగ ♦ నరుగు దెంచి.

మ. విచలద్గ్రాగితచంగిశీకరకణా ♦ విర్భూతశీతానిలా
రచితాహ్లాదముఁ జొందు సౌఖ్యమున కై ♦ రామానుజుల్ వార ల
ఖ్లిచయ ప్రాంతమునందు మెట్టుచు నటన్ ♦ వీక్షించి రక్షీణకాం
తిచయోపాసితనేత్రపర్వ మమరా ♦ ధిష్ఠానగంధర్వమున్. 70

క. కనుఁగొని తెల్లని దనుచున్, వినతాసతి చూపు చుండ ♦ వెసఁ గద్రువయుం
గని నలువాల మల్లదె, కనఁబడు చుండంగ నిట్లు ♦ కడఁగం దగునే. 71

వ. నీ వోడితివి నావచనంబ సత్యం బై పందెంబు గెలిచితిం గావున నీవు నా కింక దాసి వగు మని గర్జించుటయు నూర్జితమతి యగు నవ్వినత లజ్జావనతవదన యై చేయునది యెద్దియును లేక. 72

చ. పవ గొనులాఁతిచేతఁ దన ♦ పన్నిద మీఁగుట నోగుఁ జెందుచున్
సవతికి దాసి యై వినత ♦ చాలఁ గృశించియు నింట నొపనుల్
దవిలి పొనర్చుచుం బ్రతిప ♦ దంబును బాయక కాళ్ళు లొత్తుచుం
జవు లుదయింప నోగిరము ♦ సాపడఁ జేయుచుఁ గొల్చు నిచ్చలున్. 73

వినతకు గరుత్మంతుఁడు జనియించుట.

క. ఇటువలె నేనూతేండ్లు, కుటిలాలక దాసియగుచుఁ ♦ గుందుచు నున్నం
తట రెండవయండము ప్ర, స్ఫుటముగఁ దనయంత నవిసి ♦ పోయిన యందున్. 74

క. జననం బందెఁ గుమారుఁడు, ఘనతరకాయుండు కామ ♦ గమనుండు మహా
జనవందనీయసత్త్వుఁడు, ఘనుఁడు గరుత్మంతుఁ డన్న ♦ కల్యాం డగుచున్. 75

చ. జనకవరప్రసాదమున ♦ సంజనితప్రథితప్రభావుఁ డై
ఘనతరదేహుఁ డై ప్రళయ ♦ కాలహుతాశనరాశివోలె నై
వినతకుమారుఁ డగ్గరుడి ♦ వీర్య మవార్యము గాఁ జెరింగి సు
ర్యునిఁ గబళించునో యనఁ గ ♦ నొయ్యన నాకస మంటఁ బట్టి నై. 76

వ. అట్టిసమయంబున. 77

చ. ప్రళయహుతాశనుం డగుచు ♦ బగ్గున మండ నపం డి దేమొకో
తెలుపఁ గరా దటంచు సుర ♦ తల్లడ మొల్లఁ దల్లడిల్లి ని
స్తులగతి నగ్నిసూక్తముల ♦ తో నుతియించి భయంబు దీర్పవే
సలలితమూర్తి! నీవ గనఁ గఁ ♦ జాలము మే నుపసంహరింపవే. 78

వ. అని విశ్వరూపుం డగు వైశ్వానరుని శరణంబు వేఁడుటయు నతండును. 79

ఆ. అమరులార మీర ♦ లనుకొనునట్లు గా, దతఁడు గరుడఁ డగ్ని ♦ పాత్రుఁ డతఁడు
నన్నుఁ బోలుఁ దేజ ♦ మున దేవమిత్త్రుండు, వానిభయము వలదు ♦ వలయు బాగ. 80

వ. అనిన వా రెల్లరు నల్లంతదవ్వులం జని వినయంబుతో వినతాసుతు నిట్లని
వినుతించిరి. 81

సీ. నీవ లోకము లేలు ♦ దేవదేవుండవు, నీవ ప్రజాపతి ♦ వీవ హరివి
నీవ సూర్యుండవు ♦ నీవ చంద్రుండవు, నీవ యింద్రుండవు ♦ నీవ ఋషివి
నీవ హయగ్రీవుఁ ♦ డీవ దేవుండవు, నీవ మహాభాగుఁ ♦ డీవ శివుఁడు
డీవ వైశ్వానరుం ♦ డీవ కుమారుండ, వీవ హేరంబుఁడ ♦ వీవ ద్విజుఁడ

తే. వీవ లోకైకపూజ్యుఁడ ♦ వీవ ఘనుఁడ, వీవ వైవస్వతుండవు ♦ నీవ శుచివి
నీవ బాహాబలాఢ్యుఁడ ♦ వీవ గుణివి, నిన్నుఁ గొనియాడఁ దరముగా ♦ దెన్న మాకు

ఆ. సవతిబిడ్డబలము ♦ శౌర్యము కద్రువ, కనియు వినియు నెఱిఁగి ♦ మనమునందుఁ
జలచుచుమని మండఁ ♦ జూపోప కొకనాఁడు, వినతఁ బిలిచి పలికె ♦ విస్మితముగ.

క. సాగరకుక్షిం దనరెడు, నాగాలయమునుం గనంగ ♦ నాకు మనం బా
సోఁగఁబ్రగాఢమిని నన్నున్, వీఁగక కొని పొమ్ము నీవు ♦ వీఁపునఁ గొనుచున్. 94

క. నీకొడుకు నాకుమారుల, వాకల మెలఁగుచును వారి ♦ వంచిన వెల్లన్
దేఁకువఁ జేయుమి వారికి, లోకంబులు లోకచర్య ♦ లుం జూప నగున్. 95

చ. అనుచుఁ బ్రభుత్వగర్వమున ♦ నాడిన నవ్వినతాంబుజాక్షి పు
త్రుని వినుపింప నాతఁడు ప్ర ♦ తుష్టమతిం దగి కాద్రవేయులం
గొనకొని వీఁపుపై నిలుపు ♦ కొంచు నదీనదాద్రులున్
వనులును విష్టపంబులు న ♦ వారిగఁ జూపుచు నేగె మింటికిన్. 96

వ. చండభానునిచండకిరణంబుల వేఁడిమికిఁ బాములెల్ల వాఁడిపోయి మూర్ఛిల్లియున్న నత్త
యపుడు నాగమాత సహస్రాక్షునిం బ్రార్థించి యిట్లనియె. 97

చ. మొదలను నాకు మేలుచును ♦ ముప్పదికోటులు ముమ్మఱుఁగోటులుం
ద్రిదశులు గొల్వ హస్తిగత ♦ దివ్యవితానవితేజ మూర్తివై
పదియును నాల్గులోకములఁ ♦ బాలనముం బొనరింపఁ బెంపుతోఁ
బొదలెదు శక్ర నాసుతులఁ ♦ బ్రోవుము కావుము వేఁడి పీడఁగన్. 98

వ. అని ప్రార్థించిన తత్ప్రసాదాసాదితమహావృష్టిం బునఁ గొడుకులకు సంతుష్టిం బా
పాదించె నంతఁ గొంతకాలంబునకు నట్లు పాములకుం బరిచర్య సేయుచుండ నేన
టం బటుపులుఁగురాయుండు తల్లికడ కరిగి మెల్లన నిట్లనియె. 99

చ. అతులితపఃప్రభావనిధి ♦ యై నుడికెక్కిన కశ్యపబ్రహ్మా
పతికి సుతుండ నై ప్రథిత ♦ పక్షబలాద్భుతవిక్రమంబునన్
క్షితిధరకోట్ల నైన నుసిఁ ♦ జేయ సమర్థత గల్గి వెల్గునే
నతినికృతిన్ భుజంగులకు ♦ నంజలిసేయఁగ నేటి కమ్మరో. 100

వ. అనిన వినత సనరుచుం దన కనూరునిశాపంబునం జేసి కద్రువతోడి పన్నిదంబున నై
నదాసీత్వంబునుం జెప్పిన నప్పక్షీంద్రుండు. 101

చ. అకట మహానుభావుఁడగు ♦ నంతటివానికి ధర్మపత్ని వై
లోకలోక లేనికీర్తిఁ జను ♦ దొడ్డల బిడ్డలఁ గన్నతల్లి వై
సకలజగంబులం గెలువఁ ♦ జాలినయీలువుఁ గొన్నసాధ్వి వై
వికృతము గాఁగ దాస్యమున ♦ వేఁగుచు నుంటివె వీరమాతృకా. 102

తే. కొడుకులు సమర్థులై యుండి • బహుగుణులైన, తల్లిదండ్రులు పడు బాధ • తలఁగఁ జేయ
లేక మిన్నక యుండిన • నాకలివ్రుల, కష్టజీవన మేటికిఁ • గాల్పనొకొ. 103

వ. అని పగచి వైనతేయుండు కాద్రవేయులకడ కరిగి వినయం బభినయించుచు నే
ర్పున ని ట్లనియె. 104

మ. నెగు లెక్కఁగొని సపత్నులం దొరిగి సప • త్నుల్ దాస్యముం జేయుటల్
తగునే దాసులు లేరె యొప్ప మునకున్ • దల్లు ల్గదా వారు కా
నగు నంచున్ సుతు లీరెనం దగినదే యి • ప్రాప్తంబు లే వేనిఁ బో
నఁగ రాదే నను బుద్ధి నావలనఁ బొం • దన్ రాని దున్నే ధరన్. 105

ఉ. నావుడుఁ గాద్రవేయులు మ • నంబున సంతస మంది తమ్ముఁడా
నీవు మహానుభావుఁడవు • నీ వొనరింపఁగ నీకార్యముల్
త్రావు జగత్త్రయంబున ని • లింపులమన్కి సుధారసంబు మా
కవలయున్ శివంబు జన • యిత్రికి నీకును గోర నొంచినన్. 106

గరుడుం డమృతముఁ దేఁ బ్రయత్నించుట.

వ. అనుడు నవ్విహగేంద్రుండు నాగేంద్రులం జూచి నేను మీ కమృతంబుఁ దెచ్చి
యిచ్చి తల్లికిం దాస్యంబునుండి విముక్తిం గలిగించుకొందు నని నెఱిఁగి యది
యంతయుం దనజననికి నివేదించి యిట్లనియె. 107

ఉ. ఆఁకలి వేయుచున్నది మ • హానలసంక్షుభితార్థి వోలె నై
నాకడుపున్న దిప్పుడు క • ణంబులఁ దీఱదు పెద్దతిండి నా
కాఁకఁ దొలంగఁ బెట్టు మమృ • తార్థము వోయెద వేల్పుమూఁకలం
జేకొని సంహరించెదఁ బ్ర • సిద్ధబలమ్మున నమ్మ మమ్మరో. 108

వ. అనిన వినత యి ట్లనియె. 109

మ. లవణాంభోనిధికుక్షి నక్షయగతిన్ • లక్షింపఁ గా నొప్పు లో
కవిరోధాగమభిల్లబృందము లసం • ఖ్యాకంబులై వాని నె
క్కొనఁ జెండి మ్రింగుము మ్రింగునప్పుడటఁ దోఁ • గ న్విప్రు వర్జింపు మ
న్నవలెం గుత్తుక నేర్చువాఁడు తెలియ • న్విప్రుండు పక్షీశ్వరా. 110

ఉ. *కోపితుఁడైన విప్రుఁ డతి • ఘోరతరాస్త్ర మగు న్విషం బగున్
వ్యాపృతచిత్రభానుఁ డగు • భానుఁ డగున్ జను నేచు నర్చనో

* వ్యాపృతము=అతిశయించినది. మేచెదు=తింపి పెట్టెంచెదు.

దీపితుఁ డైనవిప్రుఁ డొక ◆ దేవుఁ డగుం ఫలదాయకుం డగున్
మేపెను సద్గురుం డగు సు◆మిత్రుఁ డగున్ జనుఁ గాచు నెప్పుడున్. 111

ఆ. చంపఁ దగినకీడు ◆ సల్పిన యేనియుఁ, బుడమివేల్పుఁ జంపఁ ◆ బోల దతని
వెడలనడుము టదియ ◆ విహితం బటంచును, మనువు ధర్మశాస్త్ర◆మున వచించె.

వ. అనినం దాక్షిణ్యం బట్ల యగుం గావుత మని తల్లికిం బ్రదక్షిణంబు గావించి ప్రయాణాభిముఖుండై యున్నసమయంబున. 113

చ. తనయునిఁ గౌఁగిలించుకొని ◆ తల్లి ప్రియంబునఁ బల్కె నీకు ని
చ్చనిమొదవారి మంగళ మొ◆సంగెడు హవ్యవహుండు సీశం
బనిలుఁడు నీకు వృద్ధియును ◆ నర్కుఁడుఁ జంద్రుఁడు నీకు నిచ్చ నిం
పెనయఁగ నీయొడల్ వసువు ◆ లెప్పుడుఁ గాచుచునుండ్రు గావుతన్. 114

క. సర్వవ్యాపి యనం దగి, సర్వజగజ్జనులఁ బ్రోవఁ ◆ జాలినఘనుఁ డా
సర్వేశ్వరుండు హరి నీ, సర్వాంగంబులును గాచి ◆ సాఁకుత నెప్పుడున్. 115

వ. అని దీవించి వినతచ్చుడనుకొని నీవిజయంబుఁ గోరుచు నేనిచ్చట నుండుదాన నని యంపి పుచ్చుటయు వేడ్కొని యతండును. 116

మ. పదయుగ్మం బిల మోపఁ బట్టి మిగులన్ ◆ బాహంబుగా జాఁచి వి
ప్పుదలన్ రెక్కలఁ బాఁకుకొల్పి పవనం ◆ బుల్ భూరజం బేగుఁ దొ
ల్గాదవం జేయుచు నంతవోయి జవమా ◆ శాఖి స్వాశేషంప స
త్వదము ల్మ్రొక్కగను జేర్వరన్ రవము గాఁ ◆ బఱ్చిప్రకంపంబునన్. 117

వ. ఇట్లు త్వరితగతిం బఱచి సముద్రాలయంబున ననేకసహస్రసంఖ్యులై యున్న నిషాదుల నెల్ల మహాబిలంబుం బోని తనకంఠబిలంబుఁ దెఱచి యుక్కుపెట్ట మ్రింగుచు గళంబున గాలంబువలెం గ్రుచ్చుకొని చిచ్చువెట్టి కాల్చిన ట్లయినవాని విప్రునిఁగా నెఱింగి గరుడుం డిట్లనియె. 118

ఉ. కుత్తుకఁ జిత్తవెట్టినయ◆ట్టుం దగు భూసురుఁ డున్నవాఁడ యే
నిత్తఱి బైట వచ్చునది ◆ యేఁ గబళింపఁగఁ జాల నావుడున్
వత్తు నిషాది నాదుసతిఁ ◆ బాయఁగ లేనిది కూడ రా విహం
గోత్తమ నీదునాజ్ఞ యగు ◆ నో యని బ్రాహ్మణుఁ డన్న నాతఁడున్. 119

క. దురితతరతుం డగునేనిన్, ధరణీసురుఁ డెట్లు చంపఁ ◆ దగఁడో వానిం
బరివేష్టించినవారట్టిరె కాన నిషాదితోడ ◆ డిన్ వెల్వడుమా. 120

వ. అని వదనంబు దెఱచి వెడల నుమిసినం బోడసూపి వినయం బభినయించుచు నాశీర్వదించు నతని నిషాదీసహితంబుగా నెందేనియుం బొమ్మనుగ్రహించి పుచ్చి సర్వ

బిచ్చెని ట్లిరువురునుం బరస్పరశాపంబులం జేసి యోజనత్రయోత్సేధంబును దశ
యోజనవృత్తంబునుం గలకూర్మంబును షడ్యోజనోత్సేధంబును ద్వాదశయోజన
విస్తృతంబునుం గలగజంబు నై పూర్వవైరంబున నిం దొక్కసరోవరంబునం జేరి
పోరుచుండె నవి నీకు భక్ష్యంబు లగుం బొమ్మనిన గరుడుండు నట్ల చని వానిం
బట్టి నఖంబుల నిఱికికొని పోయి వీని నెందుఁ బెట్టుకొని తిందునో యని నలు
గడలం దిరిగి పరికించునప్పు డెల్లమహీరుహంబులును గజగజ వడంకుచుండ సాగర
జలావృతం బగునలంబతీర్థంబునం గలరోహిణపాదపంబు గరుత్మంతునిం బిలిచి
నీవు శతయోజనాయతం బగునాశాఖపై వీనిం బెట్టుకొని తిను మనిన నతం డట్ల
యగుంగాత మని దానిపయిం గా లూఁదుటయు నంత నాస్వర్ణమాత్రభారం
బున నది విఱిగి నేలం బడ నున్నసమయంబున నెఱింగి దానిం బట్టుకొని తరణికిర
ణంబు లాహారంబుగం గొనుచుఁ దలక్రిందుగ వ్రేలాడుచుఁ దపంబున్న యట్టి
వాలఖిల్యాదిమహామునిగణంబులకు బాధయగు నని శంకించి యక్కొమ్మ ము
క్కునం గఱచుకొని దాని నేమి సేయుటకు నెందుఁ బెట్టుటకును బోవం గానక
తన కేమియుం దోఁపమి నలుగడలం గలయం దిరిగి గజకచ్ఛపంబులతోఁ దండ్రి
కడకుం జనుచున్నసమయంబున. 131

క. మును లతిదైవత మగునా, ఘనపక్షం బరసి యప్పు♦ తంపడి చిత్తం
బున గురుభారముఁ గొనెఁ గా, వున గరుడుం డను మఁ బేరు♦ వొనరిచి రంతన్.

వ. పక్షవిక్షేపంబుల శైలవృక్షాదులఁ గంపంపం జేయుచు నానాదేశంబులు దాఁటి
యెందును విడియఁ గానక గంధమాదనంబునకు వచ్చుటయు నంతఁ గశ్యపప్రజా
పతియును. 133

మ. బలముం దేజముఁ గల్గి గాలికని బో♦ల్ప న్వచ్చువేగంబునం
జలదాద్రీంద్రము నోలె మే న్వొరుఁగ సా♦క్షాదగ్ని నా వెల్గుచున్
విలయార్కుం డన సర్వభూతములకు♦ న్భీతిం బ్రకల్పించుచున్
బలభిచ్ఛత్రు మనంగ వచ్చుసుతునిం♦ బోలంగ వీక్షించుచున్. 134

వ. ఆతనివలనఁ దద్వృత్తాంతం బంతయు నెఱింగి. 135

ఆ. తనయ! సాహసంబు♦ పోనరింపఁ బోకుము, వ్యథ యడంగు నిపుడ♦ వాలఖిల్య
మునులు వీరు నిన్నుఁ♦గినిసి కాల్పఁ దలంప, రనుచుఁ దేర్చి కశ్య♦పాహ్వయుండు.

వ. వాలఖిల్యాదులం బ్రార్థించి యి ట్లనియె. 137

చ. మునివరులార భాసురత♦పోధనులార భవత్తపోబలం
బున సురనాథు నొద్దఁ గల♦ పుత్త్రుని నాకు మఖాగ్ని వేల్చి మున్

తనర ననుగ్రహించితిరి • దాన జనించె విహంగమేంద్రుఁ డై
వినతకు వీఁడు వీని నెస • పించెడుభారము మీఁదియే సుఁడీ. 138

మ. జననీదాస్యము వాప వీఁడు సుధకై • స్వర్గంబు వో నెంచి నేఁ
బనుపం డా గజకచ్ఛపంబుల నొగిన్ • భక్షించి పో రోహిణాం
బున క్షుధాయుక్కి యెఱుఁగ కిట్లవిసయం • బుం జేసె సైరించి వీ
నిని గారుణ్యసమంచితేక్షణముల • న్వీక్షించి రక్షింపుఁడీ. 139

వ. అని ప్రార్థించి ప్రసన్నులం జేసి వారి నెల్ల హిమవంతంబునకుం బుచ్చి కొడుకుం జూచి నీ వీశాఖం గొనిపోయి యిటకు శతసహస్రయోజనంబుల దూరంబునం దున్న హిమరుద్ధమహాకందరం బగు నిష్పురుషనగంబునం బడ నైచి హిమవంతంబున నీగజకచ్ఛపంబులం దిని నాకసంబునకుం బొమ్ము నీకుఁ గార్యసిద్ధి యగుం గాత మని దీవించిన గరుత్మంతుండు సర్వపక్షంబున నట జని నిష్పురుషనగంబునఁ దరుశాఖ విడిచి గజకచ్ఛపంబులం భక్షించి బుభుక్షుం దీర్చుకొని బుభుక్షులోక ప్రయాణాభిముఖుం డై పక్షవిక్షేపంబు సేయుటయును. 140

మ. ధర గంపించెఁ బయోనిధుల్ గలఁగెఁ బో • తాళంబు భేదిల్లె ది
క్కరులున్ మ్రొగ్గ ననంతుఁడుం బడియె ద • క్కుల్ రాలె భూమీధ్రముల్
విరిసెన్ విష్ణుపదంబు వేలి పగిలె • న్వేవెల్గు రేవెల్గు నుం
జెరు వేదం గతి దప్పె గల్లకడలన్ • దీపించెఁ బెంజీఁకటుల్. 141

గరుడునిస్వర్గగమనము.

సీ. రక్షకావళిఁ ద్రోలి • రక్షుఁడై సుధఁ గ్రోలు, నని చెప్ప నా మీఁదు • లావరించె
నాగాంతకుఁడు పుట్టె • నాగంబులను గొట్టు, నని చెప్ప నాఁ గ్రిందు • లావరించె
ఘనతేజ మడఁగించి • ఘనతేజమున మించు, నని చెప్ప నా నిను • నావరించె
బ్రహ్మాండ మగలించి • బ్రహ్మాదులను మించు, నని చెప్ప నా దెస • లావరించె
తే. పక్షవాతాహతోద్ధూత • వృషచయము, పాదసంఘట్టితాఖిల • పర్వతాళి
పుచ్ఛవిక్షేపజాతాతి • భూరవంబు, భూరిగాత్రచలాంచలో • ద్భూతరవము. 142

వ. ఇట్లు సుపర్ణుం డతితూర్ణగతి నాకసంబున కెగయ నుంకించె నప్పుడు. 143

చ. త్రిదివమునన్ సుధర్మఁ గడు • దేవరు వుట్టఁగ వెట్టఁ జూపుచున్
వదలక నిప్పుక ల్గురిసె • వావిరి వోఁ బడె దిగ్గజంబు లు
క్కు దఱిఁగె వజ్రధార లతి • కుంఠిత మయ్యెను దిక్పతు ల్మదిం
బెదరిరి వాహనంబులకుఁ • బెల్లుగ రాలెను గంట నశ్రువుల్. 144

క. ఇట్టిమహాత్మ్యంబులు, పుట్టుటఁ దలపోసి త్రిదశ పుంగవుఁడు మదిం
దిట్టచెడి దీనికారణ, మెట్టిది యని యనఘ ధిషణుఁ డిట్టని పలికెన్. 145

చ. అతులతపఃప్రభావనిధి యైన వెలుంగొందెడుకశ్యపప్రజా
పతికి వరప్రసాద మొదవ న్వినతాసతియందు దతిప్రభన్
సుతుఁ డయి పుట్టి యింద్రునకు శత్రుఁ డగువాఁడు విహంగమేంద్రుఁ డై
తతబలుఁ డైనతార్క్ష్యుఁడు సుధం గొన వచ్చెడు నిన్ను నోర్చెడున్. 146

సీ. పుట్టిపుట్టకమున్నె యిట్టి ముల్లోకముల్, మట్టాడ లేచిన యట్టి జట్టి
కోటానఁగోటులై నీటఁ డాఁగినబోయ, కూటువల్ మ్రింగిన మేటియొడయఁ
డింతలింతలు గాని దంతికచ్ఛపశాఖ, లెంతో వింతగ మోయు నంతకారి
వెల్లుబ్బ తే జెల్ల మొల్లమై యవి నల్ల, గల్లిబిల్లికగొన్న బల్లిదుండు

తే. తల్లియూడిగ మెల్లను దెల్లఁ జేయ, నెంచి సుధఁ గొంచుపో నేగుఁ బెంచునాతఁ
డిచ్చవచ్చినమచ్చునఁ బెచ్చుపెరుఁగు, నీ కజయ్యుఁడు నెయ్యుఁ డాఁ బాకవైరి.

వ. అనిన శౌనకాదు లాగరుడున కట్టిప్రభావంబు పుట్టుటకును వరప్రసాదంబునకును
గారణం బున్నం జెప్పు మనిన సూతుం డిట్లనియె. 148



గరుడప్రభావకథనము.

తే. కశ్యపునిపుత్త్రికామేష్టి కాలమందు, నతనిపంపున వాలఖి ల్యాదిమునులు
నింద్రుఁడును దేవతలుఁగూడి యిధ్మములకు, నిచ్చఁజని వాని నాకొని వచ్చునపుడు.

మ. పెనుగొండంతటి యిధ్మభారమును దోర్వీర్యంబునై నశ్రమం
బున నెత్తిం గొని వచ్చు నింద్రుఁ డలుపం బున్మొదుగుం బెట్టు రె
మ్మను బెక్కండ్రు వహించి భారము సహింపం లేక గోరంత దాఁ
టు నెడం గష్టము నొంది కుందుచు మునుల్ పోఁగాంచి నీక్షించుచున్. 150

క. అంగుష్ఠోదరతనుల నెం, గిలిగ మడిఁగి యున్నవాల ఖిల్యాదుల వా
రిం గేరి నవ్వె దివ్వన, సంగతి విడి యేఁగ గర్వ సహితుం డగుచున్. 151

వ. అంత వారు నవారితకోపతాపపరివృతు లై చని కామగమనుండును గామ
వీర్యుండును దేవరాజభయప్రదుండు నగు రెండవయింద్రుండు తమతపఃప్రభావం
బునం జేసి పుట్టుఁ గావుత మని సంకల్పించి సప్తతంతుతంత్రంబు సమంత్రంబు గా
సంధించి నడపించుచుండి రప్పు డింద్రుండు బెగడి తండ్రి యగుకశ్యపునిశరణు
సొచ్చుటయు నతండు కరుణాతరంగితాంతరంగుం డై వాలఖిల్యులకడకుం జని
యడిగిన వారు నైశ్వర్యగర్వదుర్విదగ్ధుం డగునియ్యింద్రుండు మ మ్మవమానించెం
గావున మే మిట్లు గడంగితిమి దీనం జేసి. 152

తే. ఇంద్రునకుమించి శతగుణం • బింద్రుఁ డగుచు, నడరుతేజున నొప్పెడు • కొడుకు నీకుఁ
బుట్టఁగలఁడన్న వినికశ్య • పుఁడు బిడౌజు, దైన్యమున కెంత యేఁ జాలి • దనరనపుడు.
తే. ఆర్యులార తపోధన • వర్యులార, ముజ్జగంబుల కింద్రుఁడై • మొనసె నితఁడు
బ్రహ్మశాసన మది దాని • వమ్ము సేయ్కుఁ, డగదు ప్రార్థింతు దయసేయఁ • దగును వీని
క. ఇంద్రుం డగు నని మీ రిట, సాంద్రతపోమహిమవలనఁ • జదివినవాకుల్
తంద్రిఁ గొనఁ బోవు కాన ఖ, గేంద్రుం డగు నాకుమారుఁ • డెంతయు శక్తిన్.
వ. అని సమర్థించి పలికినం గరుణించి వారు మాతపోఫలంబు నీ కిచ్చితిమి పోలినట్లు చేసికొను మని రంత నతండు వ్రతస్నాతయై వచ్చి యున్నవినత కాఫలప్రసాదం బనుగ్రహించి దీని నీ కిరువురుబలపరాక్రమసంపన్నులు పుట్టఁ గల రని దేవేంద్రు దిక్కు మొగం బై. 156
మ. వినతాగర్భమునందుఁ బుట్టెడుసుతుల్ • వీరప్రతిష్ఠాఢ్యు లా
ర్యనుతానంతమహాత్మ్యతత్త్వనిధు లిం • ద్రా నీకు నైఁదోడు లె
ప్డు నొక్కింతేనియుఁ గీడు వారి వలనం • బొందంగఁ బో దీవు నీ
కనయం బింద్రత యుండుఁ బెద్దలను నో • నాడంగఁ బో కెప్పుడున్. 157
వ. అని బోధించి కశ్యపుం డింద్రు ననుగ్రహించి పుచ్చె వాలఖిల్యాదులతపఃప్రసాదంబునం బుట్టుటం జేసి యరుణుండు సూర్యరథ మధిష్ఠింపఁ గలుగుటయు గరుడుండు పక్షీంద్రపదాభిషిక్తుం డగుటయుం గలిగె నింక నమ్మహాప్రభావనిధి యగు గరుత్మంతునివృత్తాంతంబు వినుం డట్లు బృహస్పతి చెప్పిన విని దివస్పతి యమృతరక్షకుల రావించి మీ రందఱు నప్రమత్తులై యమృతంబు రక్షించుచుండునది యని యాజ్ఞాపించుటయు ననేకశతసహస్రసంఖ్యాకు లగువారును సర్వసన్నద్ధులై నానావిధశస్త్రాస్త్రపాణు లై నలుగడం బరివేష్టించియుండి రింద్రుండును వజ్రంబు దాల్చి కాచికొనియుండె నంతట. 158
మ. క్షితికృద్ధాలహాలాగ్నితోఁ గబడబా • గ్నిజ్వాలజాలంబు నా
నతిమాత్రప్రతిభాంచితానిశవిలో • లారక్తగాత్రప్రభన్
మిటిమీఱ న్వెలిఁగించుచున్ దశదిశ • ల్మిన్నెల్ల నై గా వెలుం
బ్రతిపాదించుచుఁ దోఁచెఁ దార్క్ష్యుఁడు సుధా • పాలోపకంఠంబునన్. 159

గరుత్మంతుఁడు దేవతల నోడించుట.

శా. విద్యుత్పుంజము నాఁగఁ దోఁచి భటుల • న్వీతాస్త్రులం జేసి దు
ష్ప్రేక్ష్యుం డై చొఱుడున్ సుధాభవనమున్ • విద్యాధరుల్ సాధ్యులు

వైద్యు లుగుహ్యకులుం బిశాచులును గం ◆ ధర్వు లసుర లిద్ధులున్
ఖద్యోతాఖ్యులు దిక్పతు ల్గరుడు వీఁ ◆ కం దాఁకి రొక్కుమ్మడిన్. 160

క. తాఁకి వియచ్చరవీరులు, వీఁకం బెల్లార్చి పేర్చి ◆ వివిధాస్త్రములన్
డీకొనఁగం గరుడి మహా, నీకినితో భౌమనుండు ◆ నిలిచి పెనంగెన్. 161

ఉ. చీమలు మూఁగిన ట్లమర ◆ సేనలు మూఁగి పెనంగు చుండ న
ప్పాములతిండికాఁ డలిగి ◆ పక్కన ఱెక్కల నప్పళించె నా
భీమసమీరణాహతిని ◆ వెక్కసమై రజ ముప్పతిల్లి దృ
క్సీమల కడ్డమై సకల ◆ సీమలభూముల ముంచె మించఁగన్. 163

తే. ఆరజోవృష్టి ననిమిషు ◆ లంధు లగుచుఁ, గాలు సే యాడనేరక ◆ జాలిఁ బడిన
జిష్ణుపంపునఁ బవనుఁ డా ◆ సేగి సెదర, వీచె నప్పుడు సురసేన ◆ లేచె మఱల.

సీ. బ్రహ్మాస్త్ర మరివ్రాసె ◆ బ్రహ్మదేవుఁడు డాసి, చక్రంబు సంధించెఁ ◆ జక్రపాణి
శూలంబు గుఱి సేసె ◆ శూలాయుధుం డేచి, కాలదండము వైచెఁ ◆ గాలుఁ డలిగి
యాగ్నేయమడరించె ◆ నగ్ని యత్యుగ్రుఁడై, వరుణపాశముఁ ద్రిప్పె ◆ వరుణుఁ డాఁగి
వాయవ్య మెసఁగించె ◆ వాయుదేవుం డంత, శక్తియుక్తులఁ జూపె ◆ శక్తిధరుఁడు

తే. పరశుపట్టసముసలము ◆ ద్గరగదాసి, భిండివాలాస్త్రశస్త్రాదు ◆ లొండొకండు
మొనసికొన నేసెఁ బక్షిమా ◆ ర్తాండుమీఁద, గరుడగంధర్వకిన్నర ◆ సురగణంబు.

వ. అప్పు డప్పక్షీంద్రుండు గండుమిగిలి. 165

సీ. పక్షచ్ఛదాక్షేప ◆ విక్షేపములచేత, నఖిలాస్త్రశస్త్రాళి ◆ నపహరించి
తుండదండాధికో ◆ ద్దండచండిమచేతఁ, దుండెతుండెములు గాఁ ◆ బెండుఁ జెండి
మఖవాస్త్రదృఢఖర ◆ నఖరాగ్రములచేత, రక్తప్రవాహంబు ◆ వ్యక్తపఱిచి
యంఘ్రిప్రఘూర్ణనా ◆ ఘాఘాతములచేత, దిమ్మఁ దిరిగి మూర్ఛఁ ◆ ద్రెళ్లఁ జేసి

తే. తూఁటిమడుఁ గేన్గు సొచ్చిన ◆ సాటి దోఁప, నార్చి వేల్పులఁ బట్టి ◆ పల్లార్చి పేర్చి
చించి చెండాడె నప్పుడు ◆ చెన్ను దఱిఁగి, వారలూడనిఁబాడిరి ◆ పోరు దక్కి.

వ. ఇట్లప్పక్షిరాజక్షీణపరాక్రమంబున ఖగనఖరతుండదండాద్యాయుధంబుల నిర్జర సమూహంబు నిర్జించుచున్నసమయంబునఁ గా లూఁదఁ జాలక సాధ్యులును గంధర్వులును దూర్పుగను వసువులు రుద్రులును దక్షిణముగను నాదిత్యులు పశ్చిమంబుగను నాసత్యు లుత్తరంబుగను దత్తఱంపడి గుంపులుగుంపులై పాఱి పోయి రశ్వక్రందుండును రేణుకుండును క్రథనుండును దపనుండును నులూకుండును శ్వసనుండును నిమేషుండును బ్రరుజుండును బులినుండును గల్పానల్పగభీరభైర

వాకారుం డగుగరుత్మంతునిబారిం బడి సముత్క్రాంతజీవను లై రిట్లుబృందారక
బృందంబు నెల్లం జిందఱవందఱమై కాందిశీకు లైన వారి నతిక్రమించి. 167

మ.*గరుడుం డాజి జయంబుఁ గాంచి యమృతా ♦ గారంబునం జుట్టునుం
బరివేష్టించి జ్వలించుచు న్నభము నా ♦ స్వాదించు ఘోరాగ్నిభీ
కర మై చండసమీరణేరితము నై ♦ కన్పట్టి వేండ్రంబునన్
జోరిం బాఱం దెరు వీయకున్న మిగులన్ ♦ జూపెట్టి యప్పట్టునన్. 168

ఆ. వేనవేలునోళ్లు ♦ వెసం దాల్చి పుక్కిళ్లఁ, బట్టి నదిజలంబు ♦ లట్టె తెచ్చి
బగ్గుమనుచు మండు ♦ నగ్గి పెం పడఁగఁ జ, ల్లార్చి సూక్ష్మరూపుఁ ♦ డగుచు నతఁడు.

వ. అతిరయంబున నందుఁ జొచ్చి ముందఱ సుధారససమీపంబున. 170

మ. క్షురము ల్వోలవి చుట్టునుం గలిగి కొం ♦ చున్ తీక్ష్ణధారంబు నై
పఱఁగం జేరినవారి వ్రక్కలు పొన ♦ ర్పం జాలి వేవెల్గు నా
గరిమం గ్రాలుచు దేవనిర్మితము ను ♦ గ్రంబై సదా దిర్దిరం
దిరుగం బాటసయంత్రచక్ర మొకఁ డు ♦ ద్దీపింప నీక్షింపుచున్. 171

వ. అయోమయం బైనదానిచుట్టు నంతరం బరయఁ దిరుగుచు నొకింతలో నరాం
తరంబుల నణుమాత్రగాత్రుం డై చొచ్చి దానిక్రింద. 172

క. మెఱపులు నా నాల్కలు గడు, మెఱయఁగ జ్వాలదగ్ని వ్రూని ♦ మేనులు పొదలన్
గిఱుకు గల రెండుత్రాఁచులు, మఱవక సుధఁ గావ నుండె ♦ మచ్చరి మెచ్చన్. 173

చ.† కనుల విషంబు గ్రక్కి యవి ♦ గన్గొనినంతన కొండలంతలన్
జనవున నీఱు గా సలుపఁ ♦ జాలి చలంబున తప్పపాటు లే
కనిశము బిట్టుగాఁ గనుచు ♦ నయ్యమృతంబును జట్టి కాచుచున్
దనరుటఁ జూచి తార్క్ష్యుఁ డు ♦ దంబటి చింతిలె నింత వింతగన్. 174

వ. ఇట్లొక్కనిమేషంబు తజ్జయోపాయంబునకై చింతించి వానికన్నుల నెన్నరాని
పరాగపటలంబుఁ జల్లి వైనతేయుం డల్లన నదృష్టరూపుం డయి వానిమేనులు
తెగ నడంగఁ ద్రొక్కి మిక్కిలిజవంబున నమృతకలశంబు వెదకికొని యు నాస్వా
దింపక యంత్రచక్రం బపక్రవిక్రమంబున నత్యంతంబు భగ్నంబు గావించి య
చ్చోటు దాఁటి గగనతలంబున కుద్గమించుటయు నప్పు డతనిపరాక్రమంబునకు
నలౌల్యంబునకు నచ్చెరువడి మెచ్చుచుం బాంచజన్యధరుండు ప్రత్యక్షం బై వా
త్సల్యంబున వత్సా వరంబు వేఁడు మనుట యు నతండును. 175

* చూపెట్టి = కనుపెట్టి. † చనవు = చెల్లుబడి.

మ. ‡ అమరేంద్రార్చిత నేను నీపయిని వి ♦ ఖ్యాతిం గొనం జేయు మి
య్యమృతాస్వాదన మాచరింపక జరా ♦ వ్యాధ్యాదులున్ లేక నా
కమరత్వంబు లభింపఁ జేయు మన న ♦ ట్లాఁ గాత మంచుం బ్రసా
దము గావించెను పాంచజన్యధరుఁ డ ♦ త్యంతానురాగంబునన్. 178

తే. అట్లొసంగినవరముల ♦ నంది గరుడి, హృదయమున సంతసించుచు ♦ నేను నీకుఁ
గూడ వరములనొసఁగెదఁ ♦ గోరుకొనుము, వలయువానినటంచును ♦ బలుకహరియు.

ఆ. వైనతేయ నీదు ♦ భక్తివిశ్వాసధై, ర్యాదులకు మదిం బ్ర ♦ హృష్ట మయ్యె
నాకు వాహనంబ ♦ వై కోర్కి నుండుము,ధ్వజము గాఁగ మీఁదఁ ♦ దాల్తు నిన్ను.

చ. *అనుచు మహాప్రసాద మని ♦ యాఁకుచు నాతఁడు మ్రొక్కి పోవుటల్
గని శతమన్యుఁ డస్య మెఱుఁ ♦ గ న్నదిఁ జాలక వజ్ర మెత్తి వై
చిన గరుడుండు దానిఁ గని ♦ చెన్నఁటివజ్రమ నన్ను నేమి చే
యను జనుదెంచుచుంటి వహ ♦ హా యికఁ జాలును నిన్నెఱుంగుదున్. 179

క. మునిసంభవంబ వగుట, న్నిను నవమానింప నోప ♦ నే నిదె పర్ణం
బునఁ దాఁకి యొక్కశకలం, బును గొన లే వనుచు నింద్రుఁ ♦ బొడఁగని నగుచున్.

చ. వినుము మహేంద్ర నాపయిని ♦ వేసితి వజ్రము రిత్త వోయెడిన్
ఘనుఁడు దధీచియెమ్ము వల ♦ సంబ్రభవించిన చౌటఁజేసి దీ
నిని త్రిజగత్ప్రభుండ వగు ♦ నిన్నును నమ్మిని గారవింప ని
త్తును గొను మొక్కయీఁక సని ♦ త్రుంపి యటం బడవైచె నేచినన్. 181

వ. సుందరం బగుదానిం జూచి సర్వభూతంబులును సంతుష్టంబు లై యపుడు వాని పర్ణంబులసుస్థిరత్వంబునం జేసి వాని కపుడు సుపర్ణుం డనుపేరు పెట్టి రంతఁ బురందరుండు వానిప్రభావంబునకు నిచ్చ మెచ్చుచు ని ట్లనియె. 182

ఉ. నీవు మహాబలుండ వని ♦ నేఁ గనుఁగొంటి మహాబలుండవును
న్నీవలె లావు చూపుటకు ♦ నేరఁడు నీవరపక్షవాత మీ
స్థావరజంగమాంచితర ♦ సావలయంబునె కాదు సర్వలో
కావళి నొక్కపెట్ట విల ♦ యంబుగఁ గ్రక్కదలించెడుం జుమీ. 183

శా. నీ తేజఃప్రథితప్రభావమును నీ ♦ నిర్నిద్రసత్వంబునున్
నీతత్త్వజ్ఞత నీసమర్థతయును ♦ న్నే వించు నిన్నెంచుచున్

‡ నీపయిని...జేయుము = నన్నుధ్వజముగానీరథముమీఁద నుండునట్లు చేయు మని తాత్పర్యము.

* కొన్నిప్రతులలో నింద్రుని సంబోధించినట్లుమాత్రమే యున్నది.

నీతో సఖ్యము సేయ వచ్చితిని నే • నే నీవు నీ వేను గా
నేతత్కాలమునుండి యుండుటకు నా • కిష్టంబు పక్షీశ్వరా. 184

వ. మఱియు నీబలం బెంతయో విని యెఱుంగుటకు నంతరంగంబు సంతసించుచున్న యది గావునం దెలియఁ జెప్పి నాయందుఁ జెలిమిం గూర్చు మనిన గరుత్మం తుండును. 185

క. విను మాత్మస్తుతి మరణం, బునకంటెను సేగి యనుచు • బుధవరు లనుటన్
మనుజుండు స్వగుణకీర్తన, మును దనకుం దాన సేయఁ • బోలదు తెలియన్. 186

వ. అయినఁ గారణాంతరంబున నొరు లడిగినం జెప్పకొన నొప్పు ననుటంబట్టి మిత్ర మనోరథ మవశ్యకర్తవ్యము గావున మిత్రునకు నీకుం జెప్పెద నవధరింపుము. 187

చ. వనులును బర్వతంబులును • వారిధులుం గలభూమి యంతయుం
గానగొని తక్కడోయికొనఁ • గొంచుఁ జరించెద నంట మేటి గా
దనయము సర్వలోకము ల • నంతబలంబున నొక్కపెట్టఁ గై
కొని యిసుమంతశ్రాంతియును • గూడక యుండ వహింతు వింతగన్. 188

వ. అనిచెప్పిన నప్పక్షివల్లభునిశక్తిసామర్థ్యంబులకు మెచ్చి వియచ్చరవల్లభుండు వెం డియును. 189

ఉ. వావికి నాకుఁ దమ్ముఁడ వ • పారపరాక్రమమందు నన్న వో
దేవగురుస్తుతా వినుము • దేవుఁడ వీ వమృతంబు నొండ్లకీఁ
గా నలదయ్య నీకుఁ గొఱ • గా దమరుండవు గాన వెండి నా
కీవలయున్ జగంబులకు • నిష్టము గూర్పఁగ నెంచితేనియున్. 190

వ. అనిన గరుడుం డిట్లనియె. 191

తే. మాతృదాస్యనిరాసార్థ • మేతదమృత, మేను గొని కాద్రవేయుల • కీయ వచ్చి
నాఁడ నిదివారికడ నిడు•నాఁడు నీవు, వారు గొనకుండఁ గొనిపొమ్ము•వడిగవచ్చి.

వ. అనుడు వానిమహానుభావంబున కచ్చెరువడి మెచ్చుచు వియచ్చరాధీశ్వరుం డా ఖగేశ్వరునితో సఖ్యంబు వాటించి. 193

క. నీమాటకు సంతోషము, నామది నుదయించె నీకు • నావలన వరం
బే మైన వలయు నేనిన్, నీమది యిది యన్న దాని • నే నొనరింతున్. 194

వ. అనిన గరుడుండు కద్రూపుత్త్రులదుర్జనత్వం బనుస్మరించి కార్పణ్యంబున. 195

తే. ఏ సమర్థుఁడ నైన నీ • రేడులోక, ములకు నీ వీశుఁడవు గాన • సలలితాత్మ
మాకు నపకార మొనరించి మసలుచున్న, యట్టి సర్పము లాహార•మగుత నాకు-

వ. అని యర్థించిన నతండు వాని కురగభోజనము ప్రసాదించి జనార్దనునకుం జెప్పి తదనుమతంబున నమృతార్థము వాని ననుసరించె నంత నతండును. 197

చ. వడివడి వచ్చి తల్లి కట • వందనముం బొనరించి తెచ్చితిం
దొడిఁబడఁ గే సుధారసము • దొడ్డభుజాబల మందుఁ జూపి యి
క్కడ నిఁక నేమి చేయఁ దగుఁ • గార్య మెఱుంగఁగఁ జెప్పు మన్న నా
వినత కడు సంతసించి తన • బిడ్డను నక్కునఁ జేర్చి యిట్లనున్. 198

తే. తండ్రి నీచేత మిక్కిలి • స్తవము సేయఁ, దగిన దే ధన్యురాల నీ • దాస్య మీఁగఁ
గంటి నిఁక నీవ ముకుఁడవు • గాన దేవ, హితుఁడవై యుండు మిది నాకు • హితము సుమ్మి.

వ. అనిన నతం డట్ల యగుం గాక యని సరీసృపంబు లున్నకడకు వచ్చి నే నిదె యమృతంబుఁ దెచ్చితి నిఁక మా దాస్యంబు వాసె దీని మీరు కృతస్నానుల రై వచ్చి యనుభవింపుం డని యొక్క కుశాస్తరణంబునం దక్కలశంబు వెట్టి తల్లిం దోడ్కొని మొట కేనియుం జనియె నిట భుజంగమంబులు జలం గాడి వచ్చునంతలో బిడౌజుం డదృశ్యుం డై వచ్చి కలశంబు గ్రహించుకొని చనియె నురగు లమృతంబు గానక యచటి దర్భలు నాకుటం బట్టి నాలుకలు రెండుగా వ్రయ్యుటం జేసి ద్విజిహ్వు లనం బరఁగిరి సుధాకలశస్థానంబున దర్భలు పవిత్రంబు లయ్యె నంత.

శేషుని వృత్తాంతము.

ఉ. ప్రల్లదనంబునం దమకు • వచ్చిన శాపము పాపహేతు వై
త్రెళ్లఁగఁ జేయు నంచు నెద • దేవురు పుట్టఁగ బిట్టు కుందుచున్
దల్లిని దమ్ములన్ విడిచి • తా నల శేషుఁడు వోయి భూతలం
బెల్ల నొకండ కస్తికి స • హించి చరించి తపించె మించఁగన్. 201

వ. మఱియు నతండు గంధమాదనగోకర్ణపుష్కరారణ్యాదిపుణ్యక్షేత్రంబులం జటావల్కలధారియు జితేంద్రియుండు నై యత్రవతంబునఁ బితామహుం గూర్చి పెక్కేం డ్లుగ్రతపంబు చేసె నపుడు బ్రహ్మ ప్రత్యక్షుండై యేమి యిట్లు ఘోరతపంబునం బ్రజలఁ బీడించుచుంటి వేమి కావలయును వరం బడుగు మనిన శేషుం డిట్లనియె. 202

చ. *జననియు సోదరుల్ కడు న • సత్య మధర్మము నొంది మూఢులై
వినతకు వైనతేయునకు • వేరముతోఁ గడు నగ్గు సేసి రం
తన బలవంతుఁ డైనవిన • తాసుతుఁ డేమి వొనర్పఁ బోవఁ డం
దున మది రోసి మే న్విడువ • నోసి తపించెదఁ బద్మసంభవా. 203

* నోసి = నోచ్చి.

క. అనిచెప్పిన యేలాపత్రుని వాసుకి యెత్తికొని పరితుష్టమనస్కుం
డును ముద్దులచెలియలి పెండ్లిని గోరినవాఁడు నగుచు నెత్తఁగొని యుండెన్.

జరత్కారునిచరిత్రము.

వ. *ఇంక నా జరత్కారునిపుత్రుం డాస్తీకునివృత్తాంతంబు చెప్పెద వినుండు తొల్లి యాయాయావరాన్వయోత్తరుండు జరత్కారుం డను బ్రాహ్మణుండు బ్రహ్మకుం బోనితపస్స్వాధ్యాయనిరతుండు దారపరిగ్రహంబు సేయ నొల్లక మహోగ్రం బగుబ్రహ్మచర్యవ్రతంబునం దగిలి గ్రామంబునం దొకరాత్రికన్న నుండనినియమంబునం బ్రొద్దు గ్రుంకినచోటన విశ్రమించుచు నాఁకలికి వాయు వాహారంబు చేసికొనుచు భూతలం బెల్లం జుట్టి పరిభ్రమించువాఁ డొక్కనాఁ డొక్కవనంబులో నవురుగంటవే రవలంబంబుగాఁ దలక్రిందై లోఁతుగోతిలోఁ వ్రేలుచున్న కొందఱం జూచి వారి కిట్లనియె. 227

మ. †అవురుంగడ్డికిఁ బుట్టువే రొకఁడు మీ కాధారమై యుండ మెం
డవునిష్ఠం దలక్రిందుగం బడి తమో వ్యాప్తాంతరంబై యధో
భువనం బట్టిమహావటంబునఁ దపం బుం జేయుచున్నారు మీ
రెవరో సన్మునివర్యు లేమితపమో యిప్పేదకుం జెప్పఁడీ. 228

వ. అనిన విని వా రిట్లనిరి. 229

మ. తపమా కాదిది మేము పాపులము గ్రిందం బే మహారౌరవం
బెపుడో కూలుదు మిందు మూషికవరం బీవీరణాస్తంభముం
గృపలే కింతకుఁ దెచ్చె శేష మిసుమం తే పో జరత్కారుఁడన్
గృపణుం డొక్కఁడు మాకులంబునకు మే మిట్లార్తిఁ బోఁ జూచెదున్. 230

వ. అని మఱియును. 231

ఆ. అవురుగంట యస్మ దన్వయం బగు దాని, వ్రేళ్లపత్య మొంటి వేరు బ్రహ్మ
చర్యమున మెలంగు జనుఁడు జరత్కారుఁ, డెలుక యముఁడు దాఁప నేల నింక.

వ. మే మాజరత్కారునిపితృపితామహులము వాఁడు దారపరిగ్రహంబు చేసి సంతానంబు వడయక మూషికవ్యాజకృతాంతునిచేతం దెగ నేని మా కధోగతి సిద్ధించు నని వెండియును. 233

క. చుట్టమవు నీవు మాయి, క్కట్టులఁ జెవి యొగ్గి వినఁగఁ గలిగితి వానిం
గు ట్టెఱిఁగి తేని మాగోడ, లిట్టట్టని తెలియఁజేయు దేదయతోడన్. 234

* జరత్కారుడు = జర యన క్షయము; కారు వన దారుణము; శరీరము (తపమున) క్షయింపఁ [జేసినవాడు; † మహావటము = పెద్దగొయ్యి.

వ. అనినం గరుణాతరంగితాంతరంగుండయి గడగడవడంకుచు జరత్కారుండు పితృవర్గంబున కిట్లనియె. 235

శా. ఆనిర్దారకుఁ డాదరిద్రగతుఁ డా • యప్రాజ్ఞుఁ డాపుణ్యసం
తానేచ్ఛారహితాత్ముఁ డాజడజర • త్కారుండు వీఁడే మిముం
బ్రాణాచారము పడ్డయట్లు పడి సం • ప్రార్థించుచున్నాఁడు మీ
యానన్ శీఘ్రమునందుఁ దాల్చి భవది • ష్టార్థాభివర్తించెదన్. 236

వ. అని మఱియును. 237

ఉత్సాహము. ఏమిచేయువాఁడ మీకు • నేను నాతపంబులో
నా మొసంగ నుంటి దాని • శక్తిఁ గొంచు మీర లీ
భూమివివరమందు నుండి • పోయి స్వర్గమందు నే
డేమి లేక సౌఖ్య మొసఁగ • నెప్పుడు న్వసింపుఁడీ. 238

వ. అనిన సంతసిల్లి పితృదేవత లిట్లనిరి. 239

ఆ. మాకు నూర్ధ్వగతులు • గైకొంట కీ వన్న, యట్లు తపమువలన • నరయఁ గాదు
వత్స నీదుకలన • వంశాభివృద్ధి గా, నగును దపముకన్న • నదియు ఘనము. 240

క. తనవంశవిస్తృతికి స, త్తనయులఁ గని ధర్మమార్గ • తత్పరుఁ డైనన్
జనుఁడు జపంబుఁ దపంబుం, బొనరింపఁగ నేల పుణ్య • మునఁ బోవుటకున్. 241

ఆ. జపము తపము బ్రహ్మ • చర్యంబు స్వాధ్యాయ, దానధర్మములు స • దక్షిణాధ్వ
రములు చేసి సుగతి • సముపార్జకుఁడు గాఁడు, పుత్త్రుఁడొకఁడు లేని • పురుషవరుఁడు.

వ. కావున నీవు దారపరిగ్రహంబున సుకృతసంతానంబు వడసి మా కూర్ధ్వగతులొసంగు మనుటయు జరత్కారుండును. 243

తే. బ్రహ్మచర్యవ్రతంబును • బట్టి యూర్ధ్వ, రేతసుఁడనై పరం బందు • చేత నున్న
నిపుడు మీవాకునం బుద్ధి • నెసఁగఁ ద్రిప్పి, పెండ్లి యాడఁ దలంచితి • పితరులార.

చ. ముదుసలివాఁడఁ జిక్కితిని • పూజ్యము విత్తము బిచ్చ మెత్తు రే
నిది విని కన్నె నే రిడఁగ • నెంతురు నా కెటు పెండ్లి యౌను మీ
చదివిన దీనవాక్యములు • చాల మదిం గరఁగించె నింకె కా
దొదవినకన్య పేరు పోలు • పొందనగుం దగ నాదుపేరునన్. 245

వ. మఱియు నయాచితోపపన్నం బై కన్యాభిక్షము దానిబంధువులవలన వచ్చినం గ్రహించునట్టినియమంబును నాకుఁ గల దనినఁ బితృదేవతలు కృతప్రియత్వం బెప్పుమను విత కాదు సిద్ధిదాయకం బగుం బొమ్మనుటయు నతండు వారి కభివందనం బాచరించి వీడ్కొని చని కన్యాన్వేషణంబు చేయుచు నెందునుం బడ

ఆ. నిదుర వోవుచున్న ♦ నెఱి పీడ లేపితి, తప్పుచేసి తివుడు ♦ తగదు నాక
సమయభంగ మయ్యెఁ ♦ జనియెద నవమాన, మిదియ తలఁప నాకు ♦ నిగురుఁబోఁడి.

వ. అని కోపించి పలికినం గడగడ వడంకుచు నప్పడంతి పతి కిట్లనియె. 259

మ. ఇనుఁ డస్తంగతుఁ డైన ధర్మముల కెం ♦ తే లోప మౌ నంచు నే
ననుమానింపక లేపితి న్నిను మునీం ♦ ద్రా యిందు నాతప్పు గ
ల్గినఁ జైరింపు మటంచు వేఁడెదఁ గృపం ♦ గీలించి రక్షింపవే
యన నే మేల్కొనుదాఁక నుండక నినుం డే ♦ లస్తంగతుం డయ్యెడిన్. 260

వ. నీవు చేసినది నాకపచారంబ కావున నే నిపుడ నిన్నుఁ బెడఁబాసి పోయెద దీని కింతయును జింతింపకు మని జరత్కారుండు పలికినం గంట నీరు వెట్టుకొనుచు జరత్కారు విట్లనియె. 261

చ. ననుఁ బెడఁబాసి పోవుటది ♦ న్యాయము గా దిసుమంత దోస మే
నొనరిచి యున్నదాన నన ♦ నెప్పుడు నామసహోదరుండు క్ష్మా
తినిచయరక్షణార్థము మ ♦ దిం దలపోసి యొసంగె నీకు న
దనయునిఁ గోరి యయ్యది సృ ♦ థా చనఁ జేయుదె జీవితేశ్వరా. 262

తే. అన జరత్కారుఁ డను గర్భ ♦ మయ్యె నీకుఁ, బరమధర్మాత్ముఁడును వేద ♦ పారగుండు
పోడమునా తేజమున వాఁడు ♦ భుజగకులము, నెల్లఁ గాచెడు ననుచుఁ జ ♦ య్యనఁ జనియె.

వ. అంత నమ్మగువ మిగుల వగలం బొగులుచు నన్న యగు వాసుకికడకుం వచ్చి జర త్కారునివృత్తాంతం బంతయుం జెప్పి వసించెను. 264

శా. మోసం బయ్యె నయో కుమారుఁ డొదవుం ♦ బో నీకు వారెల్లం
ద్రాసంబుల్ దొలఁగించు నంచుఁ గినునా ♦ స్థం జేసి మే ముంటి మే
కాసంతైనను లేక పోయె నశు భో ♦ కంబుం బ్రదర్శింపుచో
నాసాధ్వీమణి గర్భ మస్తి యని యా ♦ య్యం బల్కె నయ్యన్నకున్. 265

వ. అంతఁ గొంతకాలంబునకు శుక్లపక్షచంద్రునివలె వర్ధిల్లినయాగర్భంబున. 266

మ. ఉదితుం డయ్యె సుతుండు లోకవినుతుం ♦ డుద్యన్మహాతేజుఁ డా
భ్యుదయాలోకనముం బ్రసన్నతుం శుభయతం ♦ శోద్ధారకుం డిద్ధస
త్యదయాశౌచరతుం డపాకృతభయుం ♦ డాస్తీకుఁ డన్వాఁడు స
ర్వదిశాభాగములందు నిండుకొని ప ♦ ర్వెన్ గీర్తివిస్ఫూర్తితోన్. 267

తే. మొదట జనకుండు తల్లితోఁ ♦ బిదపఁ దల్లి, మామతో గర్భమస్తి యన్ ♦ మాటవలన
నాతఁ డాస్తీకుఁ డను పేర ♦ నలరి చ్యవను, కడ సకలవిద్యలను నేర్చి ♦ ఘనత కెక్కె.

జనమేజయునకు మంత్రులు పరీక్షితునిశాపముం జెప్పుట.

తరళము. అట సుదంకుఁడు వోఁ బరీక్షితు ◆ నట్టుగాఁ బగవట్టనే
మిటికిఁ దక్షకుఁ డంచు నాజన ◆ మేజయుండు సమాత్యులన్
స్ఫుటగతి న్వివరించి కారణ ◆ ము న్వచింపుఁడు నావుడుం
గటకటంబడి వారు వల్కిరి ◆ కంట నీళులు గ్రుక్కుచున్. 269

సీ. *కన్నబిడ్డలకన్న ◆ మిన్నగాఁ బ్రజనెన్ని, మన్నించి చన్నలోఁ ◆ గొన్నతండు
పున్నె మన్న మెఱుంగ ◆ కున్నబీదల నెన్ని, తన్ను గాఁ గన్నవి ◆ ద్వన్నుతుండు
జన్నిగట్టు లటన్న ◆ వెన్నులుగా నెన్ని, క్రన్నఁ గైకొన్నమ ◆ హోన్నతుండు
మన్ను తేఁకులమన్ని ◆ కన్నన్న యనియెన్ని, తెన్నుఁ బోకున్నరా ◆ జన్నయుండు

ఆ. నిన్నుఁ గన్నతండ్రి ◆ వెన్నుని కిష్టుండు, నేల యఱువదేండ్లు ◆ నేలినతఁడు
మనపరిక్షితుండు ◆ గొనియె దిష్టాంతంబు, పాపకర్ముఁ డైన ◆ పాము గఱచి. 270

వ. తద్వృత్తాంతంబు చెప్పెద మవధరింపుము కృష్ణప్రియుండును గృపాచార్యశిష్యుండు నై వన్నెఁ గాంచిన మీతండ్రి కౌరవులెల్లఁ బరిక్షయం బయిన వెనుక నయినవాఁడు గానఁ బరిక్షితుం డని పిలువంబడుచుండు నాతం డొక్కనాఁడు మీతాతతాత యగుపాండురాజుం బోలె మృగయావిహారార్థ మడవి కరిగి నానావిధమృగవిహంగమవధం బాచరించుచు భగవంతుం డగురుద్రుండు యజ్ఞమృగంబు వెన్నంటు చందంబునఁ దనచేత క్రేటు వడినయొక్క మహామృగంబు వెంట నంటి యొంటి నోయి క్షుత్పిపాసార్తుం డై పరిశ్రాంతిం జెంది తనమనంబున. 271

తే. సుకముగా రాజకీయముల్ ◆ చూచుకొనుచు, సతులుసుతులును వేష్టింప ◆ సౌఖ్యపడక
వేఁట నే నేల వచ్చితి ◆ వెఱ్ఱి నగుచు, సకల వ్యసనంబు లన్నియు ◆ నొకటి గాదె.

క. సప్తవ్యసనములందుం, బ్రాప్తించిన నొక్కఁ డేని ◆ పండితుఁ డైనం
దృప్తుఁ డయి చెడును వానికి, వ్యాప్తిం బడు నెల్లశ్రమలు ◆ పరముం దప్పున్.

వ. అని మృగంబు నన్వేషించుచుం బెద్దదవ్వు వోయి యట నొకగోప్రచారంబునఁ బయఃపానంబు సేయు లేఁగల నోళ్ల నుండి రాలిన ఫేనం బాహారంబుగా మౌనవ్రతుం డై తపంబున్న శమీకుం డనుమునివరుం గని నేను బరిక్షితుండ నావేఁటుపడినమృగం బిటు వచ్చెఁ గంటివే యని ప్రశ్నించియుఁ బ్రత్యుత్తరంబు వడయం గానక యలుక వొడమ నొం డరయక యటఁ జచ్చి పడి యున్నపాముం దనవింటికొప్పున నెత్తి వానియఱుతం దగిలించి మరలి కరిపురంబున కరుగుదెంచె నంత నట. 274

---

* వెన్నులు = విష్ణులు; దిష్టాంతము = మరణము.

ఉ. ఒండొకవోఁ దపించుచు ను • న్మాద్ధతి నొప్పెసునాశమీకసూ
నుం డది యంతయుం గృశుని • నోటన వించుఁ గలంగి శృంగి నా
నుండినపేరు సార్థముగ • నుగ్రుఁడ వై జల మాని తండ్రిపై
నెంతుప్ప నేయునీచు డగు • నేడవనాఁటను దక్షకాహిచేన్. 275

చ. అని శపియించి శృంగి సర • యం బగుకాల్పడఁ దండ్రిపాలికిం
జని శవ మంసమందుఁ గల • జూడ లెఱుఁగక నిశ్చలస్థితిం
బూనరుటఁ జూచి సర్పశవ • ముం బెడఁబాపి పరిక్షిదాగముల్
మనమున నెంచుచు స్వనట • మానతి పొందుచు నున్నయంతటన్. 276

వ. సమాధి విడం గనులు దెఱచి సలుగడం బటికిందుకొడుకు దండప్రణామంబు చేసి పరి
క్షితుండు వచ్చి సర్పశవంబు వేయుటయుఁ దా నతని శపించుటయుఁ దెలియఁ జెప్పిన
శమీకుండు కరం బలిగి కొడుకునకు మొగం బై. 277

క. సీ సీ దోసము చేసితి, భూసురుఁడవు మఱి గోపస్వ • ముఖ్యుఁడ విదు సు
భాసురమతి ధర్మం బని, చేసినయది యేప్రకోప • శీలుఁడ వకటా. 278

ఉ. కోపము సర్వముం జెఱచుఁ • గోపము తాపముఁ గల్గఁ జేయుఁ గో
పము నైరకారణము • కోపము ధర్మమునుం దొలంచెసుం
గోపము సర్వకార్యముల • కుం బ్రతిబంధకరంబు కోపమే
పాపము కోపవైయైన జన • నంచితుఁ డై సరుఁ డందఁ డిష్టముల్. 279

ఆ. దయయు క్షమయు లేని • తపసితపంబును, మత్తుఁ డైనవాని • మెప్పు దయయు
ధర్మబాహ్యుఁ డైన • ధరణీశురాజ్యంబు, నోటికడవలోని • నీటిపోలు. 280

వ. అని మఱియును. 281

ఉ. రాజులు ధర్మమార్గముల • రాజ్య మొనర్పుటఁ జేసి తాపసుల్
తేజము నొందుచుం దపము • తీర్చ పొనర్చుచు నుండ్రభీతి నై
రాజులు తప్పి పోయెగుల • రాజకి నైనఁ జెడున్ సమస్తముల్
రాజులు రక్షణీయు లప • రాధము చేసిన మానిరి టికన్. 282

ఆ. ప్రజకు రాజు తండ్రి • ప్రజ రాజునకు బిడ్డ, పోష్యపోషకాది • ముఖ్యగుణము
ములను బిడ్డ తండ్రి • నెలస నెగ్గయునను, పైఁచియుంట శాస్త్ర • నియతి గాదె. 283

చ. ధరిపతి ధర్మము న్నిలుపు • ధర్మమునం దగు సత్ప్రయాగము ల
ధ్వరముల దేవకోటికి ము • దం బగు మోదితు లై సదేవతల్
పరఁగ సువృష్టి నిచ్చెదరు • వర్షమునం బ్రభవించు నోషధు
ల్పరఁగు మగునోషధిప్రతతు • లం బ్రజ వర్ధిలుఁ నాతఁ డల్పుఁడే. 284

తే. ధర్మపరిపాలనము సేయు • ధరణిపతికి, దురిత మనునది యింతయుఁ • బొడఁగఁబోదు
పదుగురకు శ్రోత్రియులకైన • నచ్చుస్మృతి, యనిమనువువక్కాణ నెఱుఁగవే • తనయనీవు.

క.* శ్రుతిహితధర్మవ్రతుఁ డతు, లితవిక్రమకీర్తి నల్ల • లితమూర్తి పరి
క్షితుఁ డతనికిఁ దగఁ డప, మతికి నమన ముతఁడు చితుక • నలుగిం దగునే. 285

వ. సకలధర్మపరాయణుం డగునప్పాండవేయుండు క్షుత్పిపాసాతురుం డయి నావ్రతం బెఱుంగక చేసినదానికి నీ నజ్ఞానంబునం జేసి పసివాఁడుంబోలెఁ గసిమసంగి కోపంబున శాపంబు వెట్టి పాపంబు మూఁటఁ గట్టికొంటి విది నా కెక్కా దఖిలలోకంబుల కప్రియంబు. 287

తే. ఎయసు మీఱినవాఁ డేని • ప్రాజ్ఞుఁ డేని, కోమసు గుణవంతుఁడైన కీర్తి • గొనెడునట్లు
తలఁచి బోధించు మంపును • దండ్రి యెపుడు, గాన నే నిప్డు చెప్పెడు • దాని వినుము.

క. మరలింపఁ గలిగితేనియు, మరలింపుము శాప మనుచు • మది బెదరుచు నే
మరలింప నోప నాపలు, కిరియంగ మృషాత్వ మంద • దనె శృంగి వడిన్. 289

వ. అనిన శమీకుండును మిగుల నగలం బొగులుచుఁ జేయునది యుద్దియును లేక శృంగిశాపంబున నగుచెడుకదంశమునకు మణిమంత్రాదు లవధరింపుమికొ మ్మని తనశిష్యుం డగుగౌరముఖునిచేతఁ బరీక్షితునకుం జెప్పి పుచ్చె నంత నుత్తరేయుండును.

క. తన్నెఱుఁగ కదిరి నెఱుఁగక, యున్నట్టుల యుండి తపము • నొనరుచుమునులం
గన్నుంగానక పసరుమి, బన్నంబులు గూర్చు జనులు • బడలం బడరే. 291

సీ.† కడుపులోపలిచల్ల • గిపల నుండఁగ నింట, నిట్లుండ కడవి కే • గేసినాఁడు
నేగి యంతిన పోవ • కట్టుట మొట్టుము, మెకములగమి నేల • మెసవినాఁడు
మెసవి యంతెన పోక • వెసఁ బాఱుపందితోఁ, గలకరినై యేల • పఱచినాఁడు
బఱచి యంతెన పోక • పాపపేనుఁగు నెత్తి, తపసికుత్తుక కేల • తాపినాఁడు

తే. దాపితిని గాక దయ లేక • తాపసుండు, పాముచేఁ జావు మని తిట్టె • బాపు వెట్టె
నకట చెనుపోకలం బోయి • యాగడముగఁ, గ్రొవ్వి యుండెడువారికి • గొడవలరుదె.

వ. అని చింతించుచు మంత్రివర్గంబుతో నాలోచించి. 293

మ. మనుజేశుండు విషాంగిరక్షకొఱకున్ • మన్నించి మున్ శిల్పుల
స్వనివాండ్రం గొని పోతుటీఁగ యయిన • న్నా దీఁద యైనం జొరం
గ నశక్యంబుగ నొంటికంబపుమహా • గారంబు నిర్మించి చు
ట్టును రక్షావిధి నేర్పరించె మది కా • టోపంబు లేనట్టుగన్. 294

* చితుక=నలుగు, వెడిపోవు; † మెసవినాఁడు=చంపినాఁడు; అని లక్షణచే నీయర్థము సిద్ధమగుచున్నది.

ఆ. దానిలోనఁ దాను ♦ దనమంత్రివర్గంబు, మంత్రియంత్రతంత్ర ♦ మహితమైన
విప్రవర్గ మలరు ♦ వెజ్జులు మంత్రికాం, డ్రొప్పి రౌషధంబు ♦ లుప్పతిల్ల. 295

వ. అంత నట విప్రశాపప్రేరితుం డగుతక్షకుండును బరీక్షితురక్షావిశేషం బశేషంబుగ నెఱింగి తనకార్యం బెట్లగునో యని విచారించుచుండ నాఱునా ళ్ళతిక్రమించె నా మఱునాఁడు. 296

తక్షకుఁడు కాశ్యపునకు ధన మిచ్చి మరల్చినకథ.

తే. కాశ్యపుం డనువిప్రుం డొ ♦ కండు శృంగి, శాపమునఁ బరీక్షితు చెడఁ ♦ గావవిద్యఁ
డగును నేఁడ సప్తమదినం ♦ బట్టె నేను, వాని బ్రతికింతు నామంత్ర ♦ బలమునఁ దలఁ.

వ. దానం జేసి నా కధికధనంబు సంప్రాప్తం బగు నని హస్తిపురంబునకుం బయనం బయి వచ్చువాని వృద్ధబ్రాహ్మణరూపుం డగుతక్షకుం డెదురుకొని నీ వెవ్వఁడ వెందుల కెం దు వోవుచుంటి వనినఁ గాశ్యపుం డిట్లనియె. 398

మ. విషవైద్యుండను గశ్యపుం డనువిశా ♦ ల్యాతుండ నేఁ డిమ్మహా
విషయం బేలుపరీక్షితుం గఱచు నా ♦ విద్యాప్రభావంబునన్
విష మెల్లన్ హరియించి కాతు నలఘు ♦ క్ష్మానాథునిం దాన నా
తృష దీఱన్ లభియించు విత్త మనుబు ♦ ద్ధిం జేసి నేఁ బోవుదున్. 299

వ. అనిన నతండును దనవృత్తాంతం బంతయుం జెప్పి తిగ్మానంబ తక్షకుం డి. 300

క. ఎందులకుఁ బోవ దీని, మందులు మాటలును యంత్ర ♦ మంత్రంబులు నా
యం దేమి సేయ నోపవు, మందుఁడ వెఱుకొండ వేయు ♦ మా కా చేఁ. 301

క. ఈవటముఁ గఱచి నావిష, పావకఘోరార్చివలన ♦ భస్మ మయినదాన్
దేవుఁడవై చాలితివే, నావల బ్రదికింపు దీని ♦ నని కినుకమెయిన్. 302

వ. తక్షకుం డమ్మహావృక్షంబుఁ గఱచిన నప్పు డదియు నాక్షణంబున భస్మం బయ్యె నంతఁ గాశ్యపుండును. 303

ద్వి. ఆభస్మచయ మంత ♦ నంతంతఁ జేర్చి, లోభుఁడై నాశక్తి ♦ లో నెంచు మును
నాథాను నెఱిగి నుం ♦ త్రాపంతశక్తి, నాభద్రవృక్షంబు ♦ నట్ట పుట్టించె. 304

వ. అంత నదియును. 305

క. మొలకయు ద్వివర్ణపు మొగడయుఁ, జిలువలుఁ బలువలును దోడ్తొ ♦ శీఘ్రమునం గా
బలుశాఖలుఁ బలుకొమ్మలుఁ, గలవృక్షం బగుచుఁ దొంటి ♦ కరణిన్ నిలిచెన్. 306

వ. తక్షకుం డతివిస్మితుండై మునీంద్రా నీమంత్రప్రభావం బత్యంతోస్త్రోపత్రం బిది యెట నేర్చె తనిం బ్రాహ్మణుండు. 307

తే. తొల్లి యురగులవిషవహ్ని ♦ కెల్లజగము, తల్లడిల్లఁగఁ దలపోసి ♦ దాని నడఁప
బ్రహ్మ మంత్రము కశ్యప♦బ్రహ్మ కిచ్చె, నతఁడు వెలయించె జగమున♦నదియు నిదియు.

వ. అంత నాసరీసృపేశ్వరుండు తననీతికౌశలంబున నాతనితో సఖ్యంబు చేసి పరీక్షితుం డిచ్చుధనంబుకంటె నేఁ గొన్నిమడుంగు లెక్కువ యిత్తుం గావున పొమ్ము పరీక్షితుం డమోఘవిప్రశాపనిహతుండు గావున నట్లు కావలయు ననినం గాశ్యపుండు ధనలోభంబునం జేసి వానివలనం బెద్దమొత్తంబు విత్తంబు పుచ్చుకొని క్రమ్మఱి చనియె.

తే. *గోడి వాటింగించు సత్యంబు ♦ పాడిఁ జెఱచు, దుష్టబుద్ధులఁ దగిలించు ♦దోసగు వెంచు
లాఘవముఁ గూర్చు స్థిరత దొ ♦ లంగఁ జేయు, నేమి చెప్పను ధనలోభ ♦ మెంతచెడ్డ.

వ. కాశ్యపుండు ధనలోభంబునం జేసి కదా యిట్లు చేసె నని వెండియును. 311

తే. కట్టియలు కొక్కఁ డట కేగి ♦ చెట్టు నెక్క, దానితోఁ గాలి మఱి దాని ♦ తోన బ్రదికె
నద్ది కాశ్యపుమంత్రసి ♦ ద్ధాన మంత, వెలయ నెల్లరకును జెప్ప ♦ వింటి మేము.

వ. అంత నాతక్షకుండు నాగకుమారులఁ గొందఱం బిలిచి మీరు తాపసులై పరీక్షితు నికడకు ఫలంబులుఁ బుష్పంబులుం గొని పోయి యుండుఁ నేను మీకొనిపోవుఫలంబు లలో నిమిడి యుండెద ననినఁ గామచారు లగువా రట్లు గావింప నంగీకరించి.


పరీక్షితుఁడు మృతుఁ డైనకథ.

తే. తాపసులై వేదశాస్త్రముల్ ♦ దగఁ బఠించు, కొనుచు భూజానిదిగ్గనం ♦ గోరి కొన్ని
ఫలములను వెంటఁ గొని పోయి ♦ ప్రస్తుతించి, కాన్క వెట్టిరి వానిని ♦ గౌతుకమున.

వ. అంతట. 315

చ. ఫలములఁ గొంచుఁ బార్థివుఁ డ ♦ వారిగ వారి బహూకరించి సూ
రిలఁ గలమంత్రులం బలుక ♦ రించుమ నం దొకపండు విచ్చుడుక్
మిలమిలఁ గొట్టుకొంచు నొగి ♦ మిట్టి యుఁ బుర్గుననంతయై కనుక్
నలు పగుకన్ను లెఱ్ఱనయి ♦ నల్వగు మేనును గల్గి వెల్గుచుక్. 316

చ.† పురుగువిషంబునం దనకుఁ ♦ బుట్టు భయం బిసుమంతయేని యుం
బరఁగదు ప్రొద్దు గ్రుంకు ముని ♦ వాక్యము వమ్ముగు నంచు దాని న
క్కురువిభుఁ డుత్తమాంగమునఁ ♦ గొంచుఁ బకాలున నవ్వె నంత న
ప్పురు గురగంబు గాఁ బ్రబలి ♦ బోరన భూపతి ముట్టి మెట్టెనక్. 317

క. ఆతఁడు ఘోరవిషానల, పాతమునం బూరు వట్లు ♦ పడి చచ్చె కనుక్
భీతిగ భస్మం బయ్యెక్, భూతలజను లెల్లఁ గుందఁ ♦ బురునంశపరా. 318

* గోడి=గౌరవము; (వాఁడు గోడిగా సంసారము చేయుచుండెనని గోదావరిమండలమున వాడుదురు.)
† ముట్టె=కఱచె; (ఇట్లు గోదావరిమండలమున వాడుదురు)

మ. అనిపల్కన్ హోతసహేంద్రతక్షకముగా ♦ నాహ్వానమంత్రం బొగిన్
ఘనతేజఃప్రథితప్రభావమున నా ♦ కర్ణించి ఘూర్ణించుచు
న్వనితామోగించి నింద్రుఁ డాసనములో ♦ విత్రస్తుఁడై తక్షకుం
గొని యేతెంచి దివి న్మెలంగుచుఁ గనుం ♦ గొంచు న్ననం బార్తుఁడై. 360

తే. తన్నుఁ దక్షకుతోఁ బట్టి ♦ దగులఁబడుము, వడిగ నని పల్కుచును హోమ ♦ మడరు విధిని
పలుపు మించుటఁ గని లోన ♦ జంకి యతఁడు, పుట్టముఁ దక్షకాహిని ♦ జుట్టఁ బెట్టి.

మ. లవమాత్రం బట్టు లున్న నక్కఁగన్నులో ♦ లా వేది తాను న్మహా
హవనిమాగ్నిని ద్రెళ్ల నెం నని మనం ♦ బల్లాడ సుత్రాముఁ డొ
క్కఁ నడిం దక్షకుఁ ద్రోచి తా దివికి నే ♦ గ న్వాఁడు విత్రస్తుఁడై
పవనప్రస్తుతులౌచ దీనుఁడ ననుం ♦ జా కుండ రక్షింపవే. 362

క. అని వేఁడుచు నగ్నిం బడ, ననువున నాస్తీకుఁ డాఁగు ♦ మాఁగు మనుటయున్
జననాథ వని మొనంగుము, మనుపుము సర్పముల నింక ♦ మఖ ముడిగి వడిన్. 363

మ. అనఁ బారిక్షితుఁ డిట్లు వల్కును మహా ♦ త్మా నీ విటం గోరినన్
ఘనధాన్యంబులు వస్తువాహనముఖ ♦ ద్రవ్యంబు లే మైన ని
త్తును గా కెంతయు నంతరింగముఁ యం ♦ దుం దత్పరత్వంబు చే
ల్లుఁ గావించెమ పధ్వరం బునుగఁ జా ♦ ల న్నన్ను మన్నింపుమా. 364

తే. అనుచు నాస్తీకుఁ డిట్లను ♦ మనుజనాథ, సరము లితరమ్ము లెవ్వియు ♦ వలవ దీఁక
లాడ వేవియు నిమ్ము నా ♦ యాడిపట్లు, పలుపు టనుపట్టినరం మొంపు ♦ చాలు నాకు.

వ. అవె నాతల్లివంక చుట్టంబుల కెల్ల క్షేమకరంబు గావున ని ట్టడెంచు చుంటి నని పలుకు చున్నంత. 366

ఉ. తత్త్వవిశేషుఁ డాస్తికుఁడు ♦ తక్షకు నాఁగు మటన్న మాత్రి గ
సత్త్వము పీఁగి వాఁడు పన ♦ నజ్వలనంబునఁ ద్రెళ్ల కుండుటల్
ఋత్విజు లెల్లఁ గాంచి మది ♦ నెంచి మునీంద్రు నగేంద్రుఁ డోడ నీ
సాత్త్వికమూర్తికిఁ స్వర మెు ♦ సంగు మితంపు మహాత్ముఁ డాయెన్. 367

వ. అని పలుకుటయును. 368

చ. విని జనమేజయుం డచటి ♦ విప్రులు చెప్పటఁ జేసి తొల్లి యి
చ్చినవరవాక్యముం దలఁచి ♦ చేయున దేమియు లేక వానినిం
గని వర మిచ్చితిన్ మదికిఁ ♦ గా దయిన స్సవనంబు మానితిన్
మనిచితిఁ దక్షకాద్యహికు ♦ మారుల నింకిట నంచుఁ బల్కుచున్. 369

క. అవభృథము చేసి యాగం, బవశిష్టము గాక యుండ • నార్యులు మెచ్చన్
సవిశేషభూరిదక్షిణ, లవనీశుం డిచ్చె భూసు • రావళి కెల్లన్. 370

చ. ద్విజులు సదస్యముఖ్యులకు • విత్తము మొత్తము గా నొసంగి యుత్
సుజనుఁడు లోహితాస్యుఁ డను • సూతునకు న్మతియుం బ్రసర్పకుల్
ప్రజలకు వేనవేల్ ధనప • రంపరలు న్మణిభూషణంబులున్
వృజినపరాఙ్ముఖుం డొసఁగి • వేడుక నాస్తికు నంపి పుచ్చెన్. 371

ఆ. రత్నకాంచనాంబ • రంబు లాభరణంబు, లెన్నియే నొసంగి సన్నుతించి
ద్విజవరేణ్య నీవు • వెండియు నపు డప్డు, ప్రీతి రాఁగ నవధ • రింప వలయు. 372

క. అవలన్ ముఖ్యముగా నేఁ, దవిలి పౌనర్భంగ నుంటి • ధరణీంద్రులు నే
లవు నన హయమేధం బను, సవనం బందులకు రాఁగఁ • జను నీ కనఘా. 373

వ. అనిన నయ్యాస్తీకుం డట్ల యగుం గాక యని ప్రీతుండై వెడలి మాతులగృహం
బరిగి తనపోయివచ్చిన వృత్తాంతం బంతయు నెఱింగించుటయు వారు నవారితకౌతూ
హలాయత్తచిత్తులై భాగినేయుం జూచి. 374

ఉ. అల్లుఁడ నీకతంబున న • మ్మహామఖవహ్నిముఖాంతరంబునం
ద్రెళ్లక మే మిలం బ్రదుకఁ • దీరె శుభంబులఁ జేరఁ గంటి మీ
వెల్ల విధంబులం దగుదు • వెన్నఁగ నీకు వరం బొసంగ మా
యుల్లము వచ్చెఁ గోరుకొను • మోయి కుమారవరేణ్య యిష్టమున్. 375

వ. అనిన నతం డీయాఖ్యానంబు పఠించువారికి సర్పభయాదులు లేకుండ ననుగ్ర
హింపుఁ డిదియ నాకు వరం బనిన వారును. 376

చ. ఘనుఁడు పరీక్షిదాత్మజుమ • ఖంబునఁ ద్రెళ్లక యుండఁ బాముల
న్మనిచితి మేటి వైననిను • మానసమందుఁ దలంచునట్టిభూ
జనులకు సర్పభీతి యని • శంబును బాయు వరంబు నీకుఁ గా
మనుజుల కిచ్చినార మిట • మాటయె మంత్రము గా నెసంగుతన్. 377

"శ్లో. సర్పాపసర్ప భద్రం తే గచ్ఛ సర్ప మహావిష
జనమేజయస్య యజ్ఞాన్తే హ్యాస్తీకవచనం స్మర."

వ. అని యీమంత్రంబు పఠించినవారికి సర్పభయంబు గలుగ నేరదని మఱియు. 378

తే. ఆస్తీకునిమాట వినియు న • హంకరించి, తొలఁగ కేసర్పమేనియు • నిలిచి యున్న
దానితల నూఱుప్రయ్యలై • ధరణిఁ ద్రెళ్లు, ననుచు వరమిచ్చెఁ బాము ల • య్యాస్తికునకు.

వ. అట్లు సర్పరాజగువాసుకివలన వరంబు వడసి యాస్తీకుండు చని గృహస్థుండై కాల
క్రమంబునఁ బుత్త్రులం బౌత్త్రులం బడసి పరంధామంబు నొందె నది జరత్కారు

శ్రీ

బాలాత్రిపురసుందర్యై నమః.

# శ్రీకృష్ణభారతము

## ఆదిపర్వము – చతుర్థాశ్వాసము.



ముక్తిలపురీశ్వర
సోమార్చితపాదపీఠ ♦ శ్రుతిపారగసు
త్ర్యామోదాంచితహృదయా
సోమప్రియ విగతతాప ♦ సురుచిరరూపా. 1

కథాప్రారంభము.

వ. అక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లనియె నట్లు జనమేజయుండు సర్పసత్రం బుపక్రమించి చేయుచుం గర్మాంతరంబులం బురాతనపుణ్యకథాశ్రవణాసక్తిం దగిలి విద్వద్గోష్ఠి నున్నసమయంబున. 2

సీ. కనియె నేమహితాత్ము ♦ కుని సత్యవతి శక్తి, వరపుత్రుఁ డగుపరా ♦ శరునివలనఁ
జదివె నేమహనీయుఁ ♦ డుదయించినంతనే, [illegible]యె సాంగవే ♦ దంబు లెల్లఁ
గలిగించె నేముని ♦ తిలకుండు శంతను, సంతతి నెసఁగింప ♦ సత్తనయుల
రచియించె నేకవి ♦ రాజు పురాణముల్, మించి జగం బుద్ధ ♦ రించుబుద్ధి

తే. వఱలె నేయతి లోకైక ♦ వంద్యుఁ డగుచు, నతఁడు సత్యవ్రతుఁడు బాద ♦ రాయణుండు
వచ్చె శిష్యసమేతుఁడై ♦ సచ్చరిత్రుఁ, డయినజనమేజయుఁడు వెల్గు ♦ పట్టి యెడకు.

వ. అట్లు వచ్చువాని నఖిలఋత్విగ్జనపరివృతుం డగుజనమేజయుం డెదురు వోయి తోడితెచ్చి బృహస్పతి నింద్రుండుం బలె నాఋషి నావాహనాసనవిన్యాసనార్ఘ్యపాద్యాదివిధుల నభ్యర్చించి వినయవినమితోత్తమాంగుండై యిట్లనియె. 4

ఉ. భారతవంశభూషణులు ♦ పాండుకుమారులు ధార్తరాష్ట్రులున్
వారికి భేదకారణము ♦ వారిగఁ బుట్టి పరాక్రమంబునం
బోరి సమస్తలోకమును ♦ బోకడఁ బెట్టిరి భీష్మముఖ్యులున్
మీరలు నుండ నిట్లు మఱి ♦ మీఱుటకుం గత మేమి చెప్పుఁడీ. 5

వ. అని యిట్లు మహాభారతకథాశ్రవణకుతూహలాయత్తచిత్తుండై విన్నవించినం గరుణించి కృష్ణద్వైపాయనుండు వైశంపాయనుం జూచి భారతాఖ్యానం బంతయు నాద్యంతంబుగా నాచెప్పినవాఁడవు గాన నితనికిం జెప్పు మని నియోగించుటయు నతండును. 6

క. వేదవ్యాసమహాముని, కాదిం దండప్రణామ మర్పించి మునీ
ట్ప్రోదితుఁడై మోదితుఁడై, వేదంబును బోనిదాని విధ మిట్లనియెన్. 7

మ. ఘను లాపాండవధార్తరాష్ట్రులకు లోకవ్యాప్తభేదంబు గా
ధనలోభంబున రాజ్యకాంక్ష మెయి జూదం బయ్యె నద్దానిచే
వనవాసంబు ఘటిల్లెఁ బాండవులకా పై వారి కాలంబు న
చ్చెను దత్సర్వము ప్రస్తుతింపఁ బడియెన్ శ్రీభారతాఖ్యానమై. 8

భారతకథాసంగ్రహము.

సీ. పాండుభూపతి తొల్లి ప్రవ్రజితుం డయి, తనయులఁ గని కానఁ దనువు విడిచె
మునులు పాండవులను పురమునకుం దెచ్చి, ధృతరాష్ట్రునకు నివేదించి చనిరి
వేదమునన్ ధనుర్వేదమునన్ వారు, విద్వాంసులై జగద్వేద్యు లయిరి
ధార్తరాష్ట్రులు పాండుతనయులకల్మికి, సైఁప కీర్ష్యాకులస్వాంతులైరి

ఆ. తోడరి కర్ణశకుని దుశ్శాసనాదుల, దుష్టబోధఁ జేసి దుష్టుఁ డాసు
యోధనుండు వారి కుహక యోగ్యులు సేసె, రాజ్యలుబ్ధుఁ డగుచు నిమ్మఁ జెడఁగ.

చ. అలసి నదీసమీపమున యందొకచో నిదురించుభీమునిం
బాలుపలు నంటఁ గట్టి జలపూరమునం బడఁ ద్రోచియుం గసన్
సిలుగుగఁ గృష్ణసర్పములచేఁ గఱపించియు భోజనంబునం
గలిపి విషంబు వెట్టియును గాఱియ వెట్టిరి వారు చెట్టలై. 10

ఆ. బలము దైవబలము కలిమి నాభీముండు, బ్రదికె నీటఁ బడియుఁ బ్రబలవిషముఁ
దినియు నంగసంధులను గోడ్రత్రాఁచుల, గములచేతఁ దద్ద కఱవఁబడియు. 11

తే. ప్రబలి ధృతరాష్ట్రనందనుల్ పాండవులకుఁ, జేయునపకారములు దుష్టచిత్తునకును
జేయునుపకారములుపోలెఁ జెన్ను దక్కి, వ్యర్థములయయ్యె నుగ్రదైవబలముకలిమి.

చ. త్రిదివమునందు నుండియును దేవవిభుం డటు ప్రాణికోటులం
బాదలఁగఁ జేయునో సుఖము పొంపిరివోవఁగ నెందు నుండియున్
విదురుఁ డొకండు వారి నటు వీఁగ కపాయములం దొలంచుచుం
బావలఁగఁ జేయుచుండె నటఁ బోల నుపాయములన్ ఘటించుచున్. 12

మ. *ధృతరాష్ట్రానుమతిన్ సుయోధనుఁడు గుంతీపుత్త్రులం గూల్పఁగా
జతుగేహం బది వారణావతమునన్ సంధించి బంధుత్వమున్
మతిలో నెంచక వారి నుంచి యట హోమంబుం బొనర్పంగ ను
న్నతఱిన్ దాని నెఱింగి వాయుసుతుఁ డుగ్రాకుంఠి రాయుష్మతిన్. 14

ఆ. నడికి రేయిఁ జిచ్చు వడి దరికొలుపంగ, నున్నవానితోడ మున్న లక్క
యిల్లు గాల్చి భీముఁ డెగ సొరంగంబు, వలనఁ గొంచు నేగె వారి నెల్ల. 15

సీ. అన్నదమ్ములఁ దల్లి నచ్చోట నిడికొని, వడమునఁ జనుచుఁ గా నడవియందు
ఖలుఁడు హిడింబుఁ డన్ క్రవ్యాదు నడఁగించి, వాని సోదరి హిడింబను వరించి
ఘనుని ఘటోత్కచుం దనుకుమారునిఁ గని, సతి సుతు విడి యేక చక్రమరిగి
తనవారితో నట ధరణీసురుఁడువోలెఁ, దనరి బకుం జంపి జనులఁ గాచె

ఆ. నంత ద్రౌపదీస్వయంవరం బని విని, వడుగు లగుచు వారు నడచి ద్రుపదు
పురికిఁ బోయి యచట భూసురావళితోడఁ, గలసి తన్మహంబుఁ గాంచి రపుడు.

ఉ. ఎచ్చట నెవ్వరుం గొనయ మెక్కుడఁ జాలనివిల్లు వంచి వి
వ్వచ్చుఁడు పంచబాణముల వారణలీల నిగిడ్చి పైఁ గనన్
నచ్చెడుమత్స్యయంత్రమును వ్రక్కలు సేసి జయించి రాజులన్
దెచ్చిన పేర్మి ద్రౌపదిని వేఁ గొనివచ్చి యొసంగెఁ బెల్లికన్. 17

వ. తల్లియుం దాని సేవ ననుభవించుఁ డనుటం జేసి పాండవు లేవురుం ద్రౌపదిం బెండ్లియాడి కాంపిల్యపురంబున నొక్కసంవత్సరం బుండి ధృతరాష్ట్రానుమతంబునఁ దమ్ముఁ దోడ్కొనిపో నచ్చినవిదురునితో హస్తినాపురం బరిగి తండ్రిచే నర్ధరాజ్యంబు వడసి ఖాండవప్రస్థంబు రాజధానిగాఁ గొని యటఁ బెక్కువర్షంబులు రాజ్యం బేలుచుండ ఫల్గునుండు తీర్థయాత్రలు సేవించుచు ద్వారకకుం బోయి బలభద్రానుజుం డెఱుంగ సుభద్రం దెచ్చి పెండ్లియాడి యభిమన్యుం డనునీతండ్రితండ్రిం గనియె నతండును. 18

మ. ‡పదియాఱేఁడులయీడునాఁ డయినయభ్యామర్దమం దొక్కఁడా
ముదయాదృక్కండడన మండి యొద్లకవచం బొడ్డాంపు ఛేదించి భీ
ప్రదుఁడై శత్రుల నూఁచకోఁతలుగ నెం పెక్కం గోసి వేవేలఁ ద
త్పదమందుం బ్రవహింపఁ జేసెఁ గరుడీం డం జాలఁ గీలాలమున్. 19

వ. అట్టిపుత్త్రునిఁ బడసినపురుహూతపుత్త్రుం డగ్నిభట్టారకునివలన ననశ్వరరథాశ్వంబులును గాండీవంబు నక్షయతూణీరంబులు నుం బడసి ఖాండవవనంబునుం బరవ

* ఇట హోమము బొనర్పనఁగా గాల్చిపుచ్చనని లక్షణార్థము. ‡ అభ్యామర్దము = యుద్ధము.

రామప్రీతి గావించె నంత. 20

ఆ. మయుఁడు దివ్యరత్న • మయసభాభవనం బ, పూర్వముగ రచించి • పూరుసంశ
జుల కొసంగ వారు • తులలేనివైభవ, మునఁ జెలంగి రెల్ల • జనులు పొగడ. 21

వ. ధర్మజుండు భీమసేనునిచే జరాసంధుం జంపించి దిగ్విజయంబు సేసి సార్వభౌముం
డయి రాజసూయాధ్వరంబుఁ గావించె నట్టి పాండవులమహావైభవంబునకుఁ జా
ఘపక దుర్యోధనుండు శకునికైతవంబున మాయాద్యూతంబు గల్పించి పాండవే
యులం బరాజితులం జేసి పదిరెండేండ్లు వనవాసంబు నొక్కయేఁ డజ్ఞాతవాసం
బును గా సమయంబు చేసిన వారును వనం బరిగి యున్నంత. 22

మ. సురరాజ్ఞానఁ బార్థుఁ డింద్రకీలమున నీ • శుం గొల్వ నాతండు న
స్త్వరముల్ పాశుపతాస్త్రముఖ్యములటం • బ్రత్యక్షమై యిచ్చె న
క్కురుముఖ్యుం గొనిపోయి స్వర్గమునకుం • గోర్కె బిడౌజుండునుం
బరమాస్త్రంబు లొసంగెఁ దున్మె నతఁ డా • ప్తుం గాలకేయాదులన్. 23

వ. అనంతరంబ. 24

సీ. విరటునిపాల న • క్కురువంశశేఖరు, లజ్ఞాతవాసంబు • నధిగమించి
రపుడు మదాంధుఁడై • కుపథంబునం బడు, సింహబలుని భీమ•సేనుఁ డడఁచెఁ
గురుముఖ్యు లెల్లరు • విరటునిపై దాడి, వచ్చి గోగణములఁ • బట్టుకొనిరి
నరుఁ డుత్తరునిఁ దేరు • నకు సారథిగఁ గట్టి, గోగణంబు మరల్చెఁ • గొట్టి రిపుల
తే. నట్లు పదుమూఁడువర్షము•లార్తిఁ గడపి, వెనుకఁ దమరాజ్యమిమ్మని • వేఁడికొనియు
నీయకుండిన నప్పాండు • పేయు లలిగి, పోరి గెలిచిరి కౌరవ • వీరవరుల. 25

తే. అంతఁ బాండవు లఖిలరా•జ్యంబు నెలి, తురగమేధ మొనర్చి వి•దురుఁడును ధృత
రాష్ట్రుఁడును గృష్ణముఖ్యులు • ర్వరను విడిచి, స్వర్గ మరిగిన నరిగి రా•వారునవుడు.



వ. ఇక్కథ యంతయు మహాభారతంబు నాఁ బ్రసిద్ధికెక్కె నని మఱియును. 27

సీ. నాకసౌధారోహ • ణాకల్పితసరణి, పావనంబు శ్రీమహా • భారతంబు
తతపాతకోపహా • నికపర్వతవ్రాత, వజ్రంబు శ్రీమహా • భారతంబు
ఘనతరధర్మార్థ • కామమోక్షాకర, పరికీర్తి శ్రీమహా • భారతంబు
నారకద్వారబం • ధసమగ్రవజ్రక, వాటంబు శ్రీమహా • భారతంబు
తే. పరమపదగామిమిత్రంబు • భారతంబు, భక్తివైరాగ్యవరదంబు • భారతంబు
భవ్యవిద్యోపదేశంబు • భారతంబు, బహునియమసారభూతంబు • భారతంబు. 28

ఉ. అట్టిమహాప్రబంధము మ ♦ హాత్ముఁడు వ్యాసమహర్షి తొల్లి దా
నెట్టియెడం దదేకమతి ♦ నిట్టటు మెట్టక మూఁడువర్షముల్
కట్టడ చేసి శీతనగ ♦ కందరమం దొకలక్షపద్యముల్
పుట్టఁగఁ జేసె నిజ్జగము ♦ పొంటెను దాని వచింతు నిమ్మెయిన్. 29

క. మేరుగిరీంద్రమువోలె, న్నీరాకరమ్ములు రత్న ♦ నిధులకు నెలవై
భారత మఖిలార్థంబుల, సారతరం బగుచు వెలసె ♦ సర్వజగములన్. 30

క. ఇందుం గలధర్మము లే, యొందుం గల విందు లేని ♦ యెందును లే వే
సందేహము నొందఁగ వల, దిందే వేదంబు లెల్ల ♦ నిమిడిక నుండెన్. 31

క. భరతకులముఖ్యనృపతుల, చరితలు గీర్తించుకతన ♦ తన్మాత్మలమందున్
బరఁగెన్ భారత మన నిది, గురువరుఁ డెఱిఁగించె నాకుఁ ♦ గొన ముట్టంగన్. 32

మ. నిరతిం బీయితిహాస మెవ్వఁడు కడు ♦ న్నేమంబునన్ సర్వవా
క్స్థిరతుండై పఠియించునో పరులకు ♦ న్నేర్పొప్పఁ గాఁ జెప్పునో
వరచిత్తుం డతఁ డెల్లకల్మషముల ♦ న్వర్జించి పుణ్యాత్ముఁడై
ధరణిం బ్రస్తుతి కెక్కుఁ బండితుఁడునై ♦ ధర్మార్థకామంబులన్. 33

సీ. విజిగీషు వగురాజు ♦ విని దీని రిపుల ని, ర్జించి భూచక్రమూ ♦ ర్జించి మించు
సుతుల నర్థించిన ♦ సతి భారతము విని, మంచికొమాళ్ళను ♦ గాంచి మించు
నామయగ్రస్తుఁ డీ ♦ యాగమార్థ మెఱింగి, మించినరోగంబుఁ ♦ ద్రుంచి మించు
నిజువేద భక్తితో ♦ నిరత మీశాస్త్ర మా, లించి ధనాఢ్యతఁ ♦ గాంచి మించు
తే. సరయ ధర్మార్థకామమో ♦ క్షోంచితంబు, భారతంబు దీనిని భక్తి ♦ భరితు లగుచు
విననవారికిఁ బాపముల్ ♦ వెస నశించుఁ, బుణ్యమును మించు దేవత్వ ♦ మును లభించు.

వ అనిన విని జనమేజయుండు వైశంపాయనున కిట్లనియె. 35

తే. వింటి సంక్షేపముగఁ గురు ♦ వీరవరుల, నిస్తులచరిత్ర మెల్ల న ♦ విస్తరముగ
వినఁగఁ గౌతూహలం బయ్యె ♦ మునివరేణ్య, తెలియ నానతి యీయవే ♦ లలితఫణితి.

### పూరువంశవృత్తాంతసంగ్రహము.

వ.*అని మఱియు మాకూటస్థులపవిత్రచరిత్ర మెంత విన్నను దనివి తీఱదు గావున మా
పూరువంశవృత్తాంతం బంతయు నాద్యంతంబుగాఁ జెప్పు మనిన వైశంపాయనుం డిట్టు
లనియె నట్టియవ్యక్తం బగుపరబ్రహ్మంబువలన బ్రహ్మదేవుండు పుట్టె నతనికన్నుంగవ
వలన మరీచియు నంగుష్ఠంబువలన దక్షుండును బుట్టిరి. మరీచిపుత్త్రుం డగుకశ్యపు

* ఈవచనములో నునంద, సుందర, భాస, వామదేవ, లోనగు నీ పేళ్లు నన్నయభట్టారకుని తెలుఁగులో మాఱి మఱియొకవిధముగా నున్నవి. కారణము మృగ్యము.

పుట్టె నతనికిఁ గేకయరాజకుమారి యగుసుకుమారియందుఁ బరిశ్రవుండు పుట్టె నతనికిఁ బ్రతీపుండు పుట్టె నతనికి శిబిచక్రవర్తికూఁతు సునందయందు దేవాపి శంతను బాహ్లీకులు పుట్టిరందు శంతనునకు గంగాదేవియందు భీష్ముండు పుట్టె నతండు సత్యవతిం దెచ్చి తనతండ్రికిం బెండ్లిచేసెఁ గన్యయగునాఁడు సత్యవతికిఁ బరాశరునివలనఁ గృష్ణద్వైపాయనుండు పుట్టె మఱియు నా శంతనునకు సత్యవతియందుఁ జిత్రాంగదవిచిత్రవీర్యులు పుట్టిరి విచిత్రవీర్యక్షేత్రంబులందు దేవరన్యాయంబున వ్యాసునివలన ధృతరాష్ట్రపాండురాజవిదురులు పుట్టిరి ధృతరాష్ట్రునకు గాంధారియందు సుయోధనాదులు నూర్వురు పుట్టిరి పాండురాజునకుఁ గుంతీమాద్రులయందు దేవతాప్రసాదంబున ధర్మభీమార్జుననకులసహదేవులు పుట్టిరి వారికి ద్రౌపదియందు వరుసగాఁ బ్రతివింధ్య శ్రుతసోమ శ్రుతకీర్తి శతానీక శ్రుతసేను లనుపుత్త్రులు పుట్టిరి మఱియు ధర్మజునకు శైబ్యునికూఁతు రగు దేవికయందు యౌధేయుండు పుట్టె భీమసేనునకుఁ గాశిరాజపుత్త్రిక యగు బలంధరయందు సర్వత్రాతుండు పుట్టె నర్జునునకుఁ గృష్ణసోదరి యగు సుభద్రయందు నభిమన్యుండు పుట్టె నకులునకుఁ జేదిరాజసుత యగు కరేణుమతియందు నిరమిత్రుండు పుట్టె సహదేవునకు మద్రరాజపుత్త్రి యగు విజయయందు సుహోత్రుండు పుట్టెఁ దొలుదొల్త భీమునకు హిడింబయందు ఘటోత్కచుండు పుట్టె నర్జునునకు నాగకన్య యగు నులూపియందు నిరావంతుండును మణిపూరేశ్వరునికూఁతు రగుచిత్రాంగదయందు బభ్రువాహనుండును బుట్టి రిట్లు పదుమువ్వు రగుపాండవపుత్త్రులలో వంశకరుండగు నభిమన్యునకు విరాటపుత్త్రి యగునుత్తరయందు మీతండ్రి పరిక్షితుండు పుట్టె నశ్వత్థామాస్త్రనిహతుండై మృతుండై పుట్టిన వాని శ్రీకృష్ణుండు బ్రదికించెఁ గులము పరిక్షీణ మయిన వెనుకఁ బుట్టినవాఁడు గావున నతని కా పేరు సుభద్ర పెట్టె నా పరీక్షితునకు భద్రవతియందు జనమేజయుండు నాఁ బడునీవు పుట్టితివి నీకుఁ గాశిరాజపుత్త్రి యగువపుష్టమయందు శతానీకశంకుకర్ణులు పుట్టియుండిరి శతానీకునకు విదేహరాజపుత్త్రిక యగు వైదేహియందు నశ్వమేధదత్తుండు పుట్టియున్నవాఁ డిది మీవంశవృత్తాంతసంగ్రహ మిది యంతయు ననేకేతిహాససంయుతం బై మహాభారతం బయ్యె నేతన్మహాప్రారంభంబునకు ముందు మంగళాచరణంబు గా భారతవంశవివర్ధనుండును భారతగ్రంధకర్తయు నగువ్యాసభట్టారకునిజన్మప్రకారం బభివర్ణించెద నాలకింపుము. 37




చ. ఉపరిచరుండు నాఁగ నృపుఁ డొక్కరుఁ డిమ్మహి ధర్మనిత్యుఁడై
యపగతదోషుఁడై శుచియు నై నిగమంబు లెఱింగి మున్న దా

నెపుడు ధృతవ్రతుం డయి సు • రేంద్రునిపంపునఁ జేసి రమ్యమై
యుపచిత మైనచేదివిష • యంబును జేకొని యేలె మేలుగన్. 38

క. పౌరవకులనందనుఁ డగు, నారాజేంద్రుండు వేఁట • లాడెడునిచ్ఛన్
గూరినమనమునఁ దిరుగుచు, భూరాజ్యం బెలెఁ దొల్లి • బుధు లగ్గింపన్. 39

మ. వసురా జాతఁడు పెద్దకాలము మహిం • బాలించి నిర్వేద ఖిం
ను నతఁ గాన దపించుచుండ విని దే • వేంద్రుండు చింతించి లో
నసమానేంద్రపదంబు నొందు నని తా • నచ్చోటఁ బ్రత్యక్షమై
పొసఁగన్ సఖ్యము చేసి నిల్పఁ గఁ దపం • బుం బల్కె నేర్పొప్పఁగన్. 40

చ. నరవర నీవు ధర్మము న • నారతము న్విడకుండ భూప్రజం
గరుణ దలిర్ప నేలుకొనఁ • గాఁ దగు ధర్మమునం జువిూ జగం
బరుదుగ నిల్చి యుండు విను • మట్లు ప్రవర్తిలఁ జేయురాజు సు
స్థిరుఁ డయి పుణ్యలోకములఁ • జెంది సుఖంచెడునం చెలుంగుమా. 41

చ. తనయులు లేక నీ వితలు • దారతిఁ బానరింపఁ బూన భూ
వనిత సరీశ్వరత్వమున • వాసి చొఱంగెను వర్ణసంకరం
బును మఱి ధర్మలోపమును • బుట్టెడుఁ గావున స్వర్గమందు నే
నును బలె ధాత్రి నీవును ఘ • నుండవ యై విభుతం గనం దగున్. 42

ఉ. మిత్రమ వైతి మాకు దుర • మిత్రనిబర్హణసక్తచిత్త యీ
ధాత్రియె కామధేను వగు • దానిపొదుం గగుఁ జేదిదేశ మా
క్షేత్రము సారవత్తర మ • శేషవిశేషవిరాజితంబు వ
స్త్రత్రయసాధనంబు విస • రద్ధనధాన్యసమృద్ధ మెన్నఁగన్. 43

సీ. సకలసంపదలకు • సదనమై, సుఖమై తృణజలకాష్ఠస • మృద్ధి గలిగి
చేదిదేశము జగ • జ్జేగీయమానమై, దుర్భిక్షరహితమై • తోఁచు నెపుడు
ధర్మతత్పరు లయి • తద్దేశవాసులు, సత్యంబు దప్పని • సరణి నుంద్రు
పితలతోఁ గ హించి • సుతులు దాయవిభాగ, మును జేసికొనరుభ • క్తిని భజింత్రు

తే. కాఁడిగిట్టరు చిక్కినఁ • గాని కొంత, ముదిసినం గాని యెద్దులఁ • బుష్టిగూర్తు
రీ వెలుంగనివిషయ మెం • దేని లేదు, చేదివిషయంబునం దీవు • స్థిరుఁడ వగుము.

వ. అని దేవేంద్రుం డతని కొక్క దివ్యస్ఫాటికవిమానంబును నింద్రమాల యనునమ్లాన కమలమాలయు నిష్టప్రద మ్మగు వేణుయష్టియు నొసంగి వెండియు. 45

తే. ఆకసంబునఁ దిరుగంగ • నగువిమాన, మును సుమమాలఁ దాల్చిన • నని శరములు
గాఁడవు జయం బగున్ యష్టి • గాచు శిష్టజనుల నిష్టము లొడఁగూర్చు • మనుజనాథ.

వ. అని మఱియును. 47

క. ఓవసురాజ నీ వెఱక, నీవసురాజితవిమాన ♦ మెక్కి ముదమునన్
మావీటికి మీవీటికి, నేవేళన్ రాకపోక ♦ లెసఁగింప నగున్. 48

చ. మనుజుల కేరి కిట్టివి వి ♦ మానము లెప్పుడు లేవు నీవు మా
కెన యగునట్టివాఁడ వగు ♦ టెన్ని యొసంగితి దీని దీనిపైఁ
జని విబుధత్వ మేర్పడ నె ♦ సంగుము యష్టియు నిష్టముల్ పౌన
ర్చును సుమనూల శత్రుజయ ♦ సూచక మయ్యెడుఁ గాత మియ్యెడన్. 47

సీ. అని యింద్రుఁ డరిగిన ♦ నతఁడు క్రమ్మఱఁ జేది, పురమేగి ప్రజ నేలు ♦ గరిమ నుండి
సురయానమునఁ దాను ♦ పరలోకచరుఁ డౌట, నుపరిచరుం డను ♦ నామ మొంది
రాజులం గూడి యిం ♦ ద్రప్రీతిగా నుత్స, వము యష్టికిఁ బొనర్చి ♦ ప్రతిభ నట్లు
ప్రతివర్ష మింద్రోత్స ♦ వము సేయు చేవురఁ, గులకర్తలం బుత్త్రు ♦ ఘలను గాంచి

తే. యదుబృహద్రథమణివాహ ♦ నామకులైన, వారి వేర్వేఱ దేశాధి ♦ పతులు గాఁగ
నిలిపి రాజ్యాభిషేకంబు ♦ సలిపి తాను, రాజ్య మేలుచు నుండె సం♦ప్రాజ్యముగను.

శా. నాఁటంగోలె మహీశ్వరప్రవరు లిం ♦ ద్రప్రీతిగా నుత్సవం
బేటేటం బొనరించుచుండ్రు విభవం ♦ బెంతేనియుం గ్రాల న
ట్లేటేటం బొనరించు దాని విజయం ♦ బిష్టార్థసంసిద్ధియుం
జాటింపంబడుఁ గీర్తియు న్సిరియును ♦ నారోగ్యంబును గల్గెడున్. 51

వ. అది ప్రవేశం బనునింద్రోత్సవంబు ప్రతిసంవత్సరాంతంబునం దమను ద్వైపాయనోక్తిప్రమాణంబు గలవేణుయష్టికిం బూజించి మహోత్సవంబు గావింతు రిప్పాడు నట్టి దనిన. 52

ఉ. పూజ యొనర్చి యష్టిక న ♦ భూతవిలాసముతోడ నట్లట
న్రాజులు నాఁడు పుచ్చి మఱు ♦ నాఁ డలకోలను బూలదండలన్
రాజితవస్త్రభూషణప ♦ రంపరలం గయిసేసి మ్రొక్కి శ్రీ
శ్రీజయవాద్యఘోషముల ♦ చేరిక బోరుకొనంగఁ జేయుచున్. 53

వ. భూసురకృతస్వస్తిపుణ్యాహవాచనంబు లెసంగ దానంబు బఱు కీర్తి పఠనంబునం దోతి మహామహం బొనరింతు రిపుడు వాసవుండు నహంసయానంబున నచ్చి రాజులచే సర్చింపంబడి వారికి వసురాజునకుం బోలె నైశ్వర్యం బొసంగుచుండు భూసురసమారాధనంబు నొనరించిన వెనుక పౌరజానపదాదిపరిక్రియజనపరివృతు లై రాజు లెల్ల నానావిధాలంకారాలంకృతు లై వేడుకమెయి నాడుచుం బాడుచుం బెనుమోత్సవంబునం బ్రవర్తింతు రట్లింద్రపూజాప్రభావంబునం జేసి ప్రబలుం డయి నయ్యుపరిచరుండును బృహద్రథ ప్రత్యగ్రహ కుశాంబ మావేల్ల యదుపు లనుతన యేవురుపుత్త్రులును వేఱు

వేఁడి వంశకర్తలై మగధకుశాంబప్రత్యగ్రహాదిస్వస్వనామాంకిత దేశంబులం బరిపాలింపఁ
దాను జేదిదేశంబు పరిపాలించుచు ననేకయజ్ఞంబులు గావించి భూమండలం బెల్లఁ
దెల్లంబుగా నేలుచుఁ గామచారియు గంధర్వాప్సరస్సేవ్యమానుండును నింద్రప్రియుండును,
నై యుండె నంత నయ్యుపరిచరుం డొక్కనాఁడు పురోపకంఠంబున విహరించుచు.

తే. శుక్తిమతి యను నదిఁ జూచి • చూచి కామి, మోహితుండయి పడిన కో • లాహలాద్రిఁ
గాలిఁ దన్ని తా • త్కాలమందు, ముప్పు దొలఁగించుటను నది • మెచ్చఁ గాంచె.

వ. అట్లు నిర్భేదింపంబడి శుక్తిమతి చేతనయుక్తం డగు కోలాహలునివలన సంపర్కంబునం జేసి
గర్భవతియై యొక్కకొడుకు నొక్కకూఁతుం గని వారిని వసురాజునకుఁ గానుక
పెట్టుటయును. 56


ఉపరిచరవసుండు గిరికం బెండ్లియాడుట.

క. గిరికను నదికని వాడమిన్, గిరికయు వసువునకుఁ దన కో • గిరం గానుక రా
గిరికన్ నతిగా వసువను, వరసేనాపతిగఁ గొనియె • వసురా జంతన్. 57

చ. గిరికయుఁ గామపాలు మొకఁ • గించి రజస్వలయై జలంబులా
డి వసురాజు కొప్ప నిప్పుడు • డెందమిరఁ గాని కోర్కెవై నసురా
పరిచరుఁ డుండె నట్టిశుభ • వాసముగం బిత్రుదేవతల్ మునం
బరఁగి నింబు వొమ్ము మృగ • మాంసము నీవని యానతిచ్చుటన్. 58

చ. ధరణీపుఁ డానియోగమును • దాఁటఁగ లేక సతిన్ స్మరించుచున్
వనాంతరశోభితం బగును • నంబునకుం జని వేఁటలాడి
స్వేచ్ఛలెసఁగు మన్మథాగ్నులఁ బి • నంబడుకోకిలకాకలీధ్వనిన్
మరుదారిబారి కగ్గమగు • మాత్రపుడెఁ జిత్తము తత్తరింపఁగన్. 59

చ. చిలుకలపల్కు కోయిలల • చిక్కనికూఁతలకుల్కు తేఁటిదా
టులనునుఁబాటలిక్కను గ • పుంగడు నెల్లెడ నిండఁ బాటలా
దులఁ గని కొప్పు మైత్రివిధ • తుల్యగుణం బగునవ్వనంబునం
బొలుపగు నశోకభూరుహము • పొంత నృపాలుఁడు సంచలించుచున్. 60

క. కమ్మనిలతాంతవాసన, లమ్మొయిఁ బవనుండు తెచ్చి • యర్పించుట యున్
నెమ్మది నెమ్మది చెడి నసుఁ, డమ్మహి నలుగడలు మెట్టి • సతినఁ దలఁచుచున్. 61

చ. కులుకుమిటారిగిబ్బచను • గుబ్బలిదోయి బెడంగు పొంగునం
బలుకులముద్దు సోయగపుఁ • బద్దు నెడందపిఱుందుపొందునుం
దలఁపున రాఁ దమిం దగిలి • తాలిమిఁ దూల విరాళి సోలి లోఁ
గలఁగి వసుండు మెట్టునెడఁ • గ్గలెను వానికిఁ దేజ మీఁగుటల్. 62

సీ. సుడిగాలి గొట్టునోఁ ♦ జుక్కాని బిగియించి, గాలివాటునఁ జాప ♦ ద్రేలఁ గట్టి
కడల సందిసనోట ♦ గడ వేసి నడిపించి, లోఁతునీటను దెడ్డ ♦ లోఁచి త్రిప్పి
యేటవాలోర్మముగా ♦ నేగిఁ గలము నిల్పి, యెడగాలిరివ్వ రా ♦ నీలఁ గొట్టి
యనువైన నమెడఁ గట్టి ♦ యంత్రచక్రము త్రిప్పి, భంగపాటప్పునోఁ ♦ లంగ రేసి
తే. సంతతము రాకపోకలు ♦ సలుపునట్టి, పరుస నానది దాఁటించి ♦ గరిమ నావ
నడుపుచుండెను వినువ క ♦ ప్పడఁతిమిన్న, దాశరాజానుమతి ధర్మ ♦ తత్పరతను. 71
వ. అయ్యవసరంబున. 72

పరాశరుఁడు మత్స్యగంధిని వరించుట.

క. పరమతపోధనుఁడు పరా, శరుఁ డనుముని తీర్థయాత్ర ♦ సనువాఁ డవ్వే
నరుదెంచి యోడ కేవ్రునఁ, బరికించెన్ మత్స్యగంధి ♦ వరగుణకంధిన్. 73
సీ. తొగలరాయని గేరు ♦ నగమోముసిద్దంపు, ముద్దు గుల్కెడునగు ♦ మోముదానిఁ
జిగురుఁగైదువుజోదు ♦ సిడ మేనువడి నూఁది, సొగసు లీనెడు వాలుఁ ♦ జూపుదానిఁ
దొలుకారుమెఱుఁగుఁదీఁ ♦ గలసౌరు నగఁ జాలు, మిసిమిసిగ్గులు దేరు ♦ మేనిదానిఁ
జిలుకలగిమిఁ దోలి ♦ వలపులఁ దమి నేలు, జిలిబిలిపలుకుల ♦ పలుకుదానిఁ
తే. జిలుఁగుఁబుట్టంబు గట్టిన ♦ పొలుపుదాని, నడుము వసివాడ గడవేయు ♦ వడుపుదాని
సత్యవతిఁ గాంచి మోహించి ♦ సంభ్రమించి, పూవిలుతుబారి కగ్గమై ♦ మునివరుండు.
వ. ఆమెతోడ నయ్యోడ నెక్కి పోవుచు. 75
సీ. పరుసలో నత్రాతి ♦ పొరిఁబొరిఁ జెలిఁ జూచు, చూచి చూడనియట్లు ♦ వోట్లు చూచుఁ
గనుమూసి సనఁబోఁడి ♦ మనములోఁ దలపోయుఁ, దలపోఁత లుడిగిన ♦ తపసియట్లు
బిగియఁ గాఁగిటఁ జేర్పఁ ♦ బెనిమ నువ్విళ్లూరు, వెడఁగుఁజెయ్వులటంచు ♦ విశదపడఁగఁ
జూపునరా పేకమై ♦ చొప్పడఁ దమకించు, నైక్యానుసంధాన ♦ మయిన యట్లు
తే. పలుకరింపఁగ వాతెఱఁ ♦ బెలుచఁ గదుపు, నోటిపలు కాలకింపంగ ♦ నోరు దెఱచు
నీవిమోక్షమె మోక్షమన్ ♦ నెఱి నెఱుంగు, నాశపడు నామెఁ గవయఁ బ ♦ రాశరుండు.
మ. కనులుం గాసులు లేక సౌఖ్యమునకుం ♦ గానట్టికష్టాత్ముఁడున్
దునుమం జాలుమహోధిఁ గుందెడుఖలుం ♦ డుం గాటికిం గాళ్లు సాఁ
చినవృద్ధుండును నిఁ కెట్టిహీనుఁడయినన్ ♦ స్త్రీ యన్నశబ్దం బొగిన్
వినుపింపంబడి సంతమాత్రమున నే ♦ విభ్రాంతుఁడై క్రాఁగెడున్. 77
తే. శాంతులై జితేంద్రియులై వి ♦ చారదూరు, లయి పయిం బుట్ట లారంగ ♦ నధికతపము
సేయుమునులైన నెఱి దార ♦ సించనేని, గలఁగరే కాముశక్తికిఁ ♦ గలదె కొఱఁత. 78

వ. ఇట్లు వితుండై కనుచుండ నంతిలోనం బెరిఁగి పెద్దవాఁడై తల్లికిం దండప్రణామంబు గావించి పని వడి నీ తలంచినప్పు డెల్ల వత్తు నని చెప్పి యనుజ్ఞం గొని తండ్రితోఁ దపోవనంబునకుం జని యాజ్ఞవల్క్యునిచే నుపనీతుండై పరమతపం బాచరించి మొదల నొక్కటి గాఁ గలసి యున్న వేదంబులు విభాగించి పురాణంబులు నిర్మించి భారతార్థంబులఁ బ్రబలించి వాని నెల్ల శిష్యు లగుసుమంతు జైమిని పైల శుక వైశంపాయనులకుం బ్రబోధించి కృష్ణాంగుఁ డగుటం జేసి కృష్ణుఁ డనియు యమునా ద్వీపంబున న్యస్తుం డగుటం జేసి ద్వైపాయనుం డనియు వేదంబులకు వ్యాసంబు గావిం చుటం జేసి వ్యాసుం డనియు బదరీవననివాసుం డగుటం జేసి బాదరాయణుం డనియు జన్మంబుం జేసి సాత్యవతేయుం డనుఁ బారాశర్యుం డనియుఁ బ్రసిద్ధిం గాంచి భారత సంహితవిస్తరుండై ప్రఖ్యాతిం గొనియె నని చెప్పిన జనమేజయునకు వైశంపాయనుం డిట్లనియె. 98

ఉ. భారతయుద్ధవీరు లయి ♦ ప్రస్తుతి కెక్కినవార లెవ్వరె
వ్వారలభాస్వదంశముల ♦ వర్ణనముం గొనరింప నొప్పిరో
వా రెలు భూమిఁ బుట్టుటకు ♦ వారణకారణ మేమి వచ్చెనో
వారియథాస్వరూపమును ♦ వారిన నయ్య సవిస్తరంబుగన్. 99

వ. అనిన వైశంపాయనుం డిట్లనియె. 100

దేవదానవాద్యంశంబుల భీష్మాదులు పుట్టుటం గాథయు.

ఉ. ఆదిని దేవదానవుల ♦ యంశములం గొని మర్త్యమందు భీ
ష్మాదు లనేకు లుత్పతిలి ♦ రందఱఁ జెప్పఁగ బ్రహ్మశక్యముం
గా దయినం గథాక్రమము ♦ గా మును భారతయుద్ధముఖ్యులౌ
భూదయితాదులం దెలియఁ ♦ బుచ్చెద వి న్మిట సంగ్రహంబుగన్. 101

మ. జమదగ్నిప్రభవుం డరాతిఖలరా ♦ జన్యాన్వయోగ్రాహవా
రము లిర్వ్యం దెగ నేయ రూపఱిచె నా ♦ క్రాంబంతిఁ దత్కామినుల్
క్షమ సంతానఫలార్థమై ఋతువులం ♦ గామించి భూదేవతో
త్తములం బెక్కురు బిడ్డలం బడసి రం ♦ త న్నిల్చెఁ దద్వర్గముల్. 102

వ. ఇట్లు బ్రహ్మతేజఃప్రభవు లైన క్షత్త్రియు లాకృతయుగంబున నప్పటియట్ల చతు స్సముద్రముద్రితం బగు నీధరారాజ్యంబు నేలుచు ధర్మమార్గంబునం బ్రజాపాల నంబు సేయుటం జేసి బ్రహ్మక్షత్త్రియవైశ్యశూద్రులు వర్ణాశ్రమధర్మతత్పరులై యాధివ్యాధిజరామరణభయవర్జితులై సకలసంపత్సమేతులై బహువిధయజ్ఞమ్ము లొనరించి సమృద్ధిం గొని సహస్రశతజీవులై ప్రవర్తిల్లుచుండి రపుడు కృతయుగ

ధర్మంబు చక్కఁగా నడచుచుండె నది విని నిర్జరలోకవినిర్జితులు నైశ్వర్యభ్రం
శితులు నగుదైత్యదానవు లెల్ల భూలోకంబున సుఖం బుండ శిశుపాలాదిరాజన్యు
లై పుట్టి మదోన్మత్తులై జగం బావరించి ప్రజల వేధింపం జొచ్చి రంత నత్యం
తప్రజాభారపీడిత యైన భూదేవి సకలలోకపాలపరివృతుం డగులోకేశునికడకుం
బోయి. 104

తే. పత్తనంబులు పల్లెలు • బాట లెల్ల, గిరులు గుహలును వనము లం • తరము లెల్లఁ
బ్రజలతో నిండి యుండయి • భార మయ్యె, మోయఁజాలను గరుణింప • వో విరించి.

వ. అని విన్నవించిన బ్రహ్మయు నోడకుండు మని భూదేవి సంపిపుచ్చి మీ రెల్ల
భూతలంబున నవతరించి దుష్టరాక్షససంహారంబు గావించునది యని దేవతల కా
జ్ఞాపించె నంత నింద్రపురోగము లగువారును నారాయణసహితులై క్రమక్రమం
బున మర్త్యలోకంబునఁ బ్రహ్మర్షిరాజర్షివంశంబులం బ్రభవించి రందు. 105

తే. వరసురాంశజు లెల్లరుఁ • బాండవేయ, పక్షమున నసురాంశజు లధర్మ • పరులు ధార్త
రాష్ట్రపక్షము నై పోరి • ప్రధనమందు, నీల్గ ధరభార ముడిగె నో • యింత యేని.

వ. అనిన విని జనమేజయుండు దేవదానవయక్షరక్షోగంధర్వపన్నగోరగనరాదిసకల
ప్రాణిసంభవంబును విన వలతు సవిస్తరంబుగాం జెప్పు మని యడిగిన వైశంపాయ
నుండు. 107

క. జనమేజయ నీ యడిగిన, ఘనతరమార్గమున భూత • గణసంభవ మె
ల్ల నెఱిఁగ సవిస్తరంబుగ, వినుతింపఁగ దుర్లభంబు • విను మటు లైనన్. 108

—సంభవపర్వప్రారంభము.—

వ. అందు ముఖ్యు లగుకొండఱవృత్తాంతంబు చెప్పెద నాకర్ణింపుము తొల్లి బ్రహ్మ
మానసపుత్త్రు లయిన మరీచ్యంగిరోఽత్రి పులస్త్య పులహ క్రతువు లనునార్వురిలో
మరీచికిఁ గశ్యపప్రజాపతి పుట్టె దక్షునిపుత్త్రిక లయిన యదితి దితి దనువు కాల
దనాయువు సింహిక క్రోధ ప్రాధ విశ్వ వినత కపిల ముని కద్రువ యనుపదుమూ
వురం బెండ్లియాడె. 109

క. ఘనుఁ డగుకశ్యపువలనం, దనియ మొగిం బ్రజలు దేవ • దానవముఖ్యుల్
జనియించి రెందఱేనియుఁ, గనుఁగొన నద్దాన జగము • ఘనతర మయ్యెన్. 110

వ. అం దదితికి నింద్రాదిదేవతలును ధాతృ మిత్త్రార్యమ శక్ర వరుణాంశ భగ
వివస్వ త్పూష సవితృ త్వష్టృ విష్ణు లనుద్వాదశాదిత్యులును బుట్టిరి. 111

క. అందుఁ గడగొట్టు విష్ణుఁడు, బృందారకబృందమందుఁ • బేర్వడి కడిమిన్
బొంది ఘనుండై తగె ఘను, లందఱకును వందనీయుఁ • డై నిజమహిమన్. 112

క. దితి పడయించెన్ దైత్య, ప్రతతికి నధినాయకుండు ♦ బాహాబలసం
పన్నుతుఁడు హిరణ్యకశిపుఁ డన, నతని న్నరసింహమూర్తి ♦ యై హరి దునిమెన్.

వ. ఆహిరణ్యకశిపునకుఁ బ్రహ్లాద సంహ్లా దానుహ్లాద శిబి బాష్కలు లనునేవురు పుట్టి రందు. 114

క. హరిభక్తుఁడు ప్రహ్లాదుఁడు, పరమతియై తండ్రిదుష్ట ♦ వర్తనములచే
నిరసింపఁబడియు నోర్చి, గరిమ న్నుతి మీఱె ముజ్జ ♦ గంబులయందున్. 115

వ. అప్పిప్రహ్లాదునకు విరోచన కుంభ నికుంభు లనుమువ్వురు పుట్టి రందు విరోచనునకు బలి పుట్టె నతండు వామనుం డయినవిష్ణువునకు విశ్వం బంతయు ధారవోసె నబ్బలిచక్రవర్తికి బాణాసురుండు పుట్టె. 116

క. బాణాసురుండు ఘనుఁడై, క్షోణీస్థలిఁ దప మొనర్చి ♦ శుద్ధమనీషన్
స్థాణువ కనుచరుఁ డగుచున్, రాణించె జగత్త్రయంబు ♦ ప్రస్తుతి సేయన్. 117

వ. ఇది దితిసంతానంబు మఱియు దానవునకు విప్రచిత్తి శంబర నముచి పులోమాసిలోమ కేశి దుర్జ యాయశ్శి రోశ్వశి రోశ్వశంకు గగనమూర్ధ వేగవత్కేతుమ త్స్వర్భా న్వశ్వాశ్వపతి వృషభవ ర్వాజ కాశ్వగ్రీవ సూక్ష్మ తుహుండైకపా దేకచక్ర విరూపాక్ష మహోదర హర నిచంద్ర నికుంభ కుపథ కపట శరభ కోభ శలభ వృషపర్వ చంద్ర సూర్య బక ప్రలంబ వనాయు శిశ్వగ్రీవు లనుపలువండ్రును గాక యేకాక్ష మృతప ప్రలంబ నరక వాతాపి శత్రుతపన శఠ గవిష్ఠ దీర్ఘజిహ్వా వనాయువు లనుపదుగురును బుట్టి దానవు లయిరి. వారిపుత్త్రపౌత్త్రసర్గం బసంఖ్యేయం బయ్యె నింక సింహికకు రాహువు చంద్రార్కమర్దన సుచంద్ర చంద్రహంతృ చంద్రప్రమర్దను లనునేవురు పుట్టిరి క్రోధనకుఁ గ్రూరకం బైనక్రోధవశగణంబులు పుట్టె వారిపుత్త్రపౌత్త్రసంతానం బసంఖ్యేయం బయ్యె మఱి దనాయువునకు విక్షర బల వీర వృత్రు లనునల్వురు పుట్టి యసురనాయకు లైరి కాలకు వినాశన క్రోధ క్రోధహంతృ క్రోధశత్రువు లనువారును గాలకేయు లనం బరఁగి కాలకల్పు లైనమఱికొందఱును బుట్టిరి. 118

క. ఈకాలకేయసంఘము, లోకంబుల కెల్లబాధ ♦ లుం గలిగింపన్
వీఁకమెయి గండుమిగిలినఁ, బాకారిసుతుండు పేర్చి ♦ బట్టి వధించెన్. 119

వ. మఱియు నమ్మునియనుదానికి భీమసేనోగ్రసేన సువర్ణ వరుణ గోపతి ధృతరాష్ట్ర సూర్యవర్చ స్సత్యవా గర్కపర్ణ ప్రయుత భీమ చిత్రరథ శాలిశిరః పర్జన్య కవి నారదు లనుపదునార్వురు దేవగంధర్వులు పుట్టిరి వినతకుఁ దార్క్ష్యారిష్టనేమి గరు డారు ణారుణి వారుణినాము లార్వురు పక్షీంద్రులు పుట్టిరి.

వినతాసుతుం డగునరుణునకు శ్యేనివలన సంపాతిజటాయువు లనువారు పుట్టిరి. 120

ఆ. రావణుండు తొల్లి ♦ రామపత్నిని జెఱ, పట్టి పోవుచున్న ♦ యట్టియెడల
వానితోడఁ బోరి ♦ ప్రాణంబులను గోలు, పోయినట్టిఁ డీజ ♦ టాయు వరయ. 121

వ. మఱి కద్రువకు శేష వాసుకి తక్షక కేలాపత్త్రాదు లనువేగురు నాగకుమారులు పుట్టిరి ప్రాధ యనుదానికి ననవద్య మను వంశా సుర మార్గణప్రియా యోరూప సుభగ భాసి యను నెనమండ్రుపుత్త్రికలును సిద్ధ పూర్ణ బర్హి పూర్ణాయు బ్రహ్మచారి రతిగుణ సువర్ణ విశ్వావసు భాను సుచంద్రు లనుపదుండ్రుపుత్త్రకులును బుట్టి దేవగంధర్వు లయిరి. ప్రాధాపుత్త్రిక యగుసుభగా దేవికి దేవర్షివలన నలంబుస మిశ్రకేశి విద్యుత్పర్ణ తిలోత్తమ యరుణ రక్షిత రంభ మనోరమ కేశిని సుబాహువు సురత సురజ సుప్రియ యనుపదుమూవురప్సరసలును నతిబాహువు హాహా హూహూ తుంబురు లనునలువురుగంధర్వశ్రేష్ఠులును బుట్టిరి కపిలకు నమృతము బ్రాహ్మణులు పశువులు గంధర్వులు నప్సరసలునుం బుట్టిరి. 122

క. అలకశ్యపప్రజాపతి, వలనన్ విఖ్యాత మగుచు ♦ వర్ధిల్లినపు
ష్కలమగుసంతానం బిది, తెలియఁగ వినినంత శుభమ ♦ తిన్ శ్రేయ మగున్.

వ. మఱియునుం గలమానసపుత్త్రులలో నంగిరసునకు బృహస్పత్యుతథ్య సంవర్తు లను మూవురుపుత్త్రులు పుట్టిరి. 124

క. అందు బృహస్పతి వేల్పుల, కందఱ కాచార్యుఁ డగుచు ♦ ననుదినము జగ
ద్వందితుఁ డై విమలయశో, నందితుఁ డై యింద్రుకొలువు ♦ నం బేరందెన్. 125

గీ. అన్నతో నొడ్డి సంవర్తుఁ ♦ డామరుత్తు, మఖమునకు నుపద్రష్ట యై ♦ మసలుచున్న
యప్పుడు దేవేంద్రుఁ డలిగి వ ♦ జ్రాయుధంబు, వేయ నది రిత్త వోఁ జేసె ♦ వెస నతండు.

వ. మఱియు నత్త్రి యనుమానసపుత్త్రునకు సర్వవేదవిదు లగుసిద్ధులును శాంతాత్ము లగుమహాత్ములును బెక్కండ్రు పుట్టిరి పులస్త్యుం డనుమానసపుత్త్రునకు యక్షరాక్షస కిన్నర వానరప్రభృతు లనేకులు పుట్టిరి పులహుం డనుమానసపుత్త్రునకు సింహ శార్దూ లేహామృగ శరభ వృక భల్లూకాదులును గింపురుషాదులును వేనవేలు పుట్టిరి. క్రతు వనుమానసపుత్త్రునకుఁ గ్రతుసములు సత్యవ్రతపరాయణులు పతంగసహచారులు నగువాలఖిల్యాదిమహామును లెందఱో పుట్టిరి మఱియు బ్రహ్మదేవున కేడవమానసపుత్త్రుం డైనరుద్రునకు మృగవ్యాధ సర్ప నిరృత్యజైకపా దాహిర్బుధ్న్య పినాకి దహన కపాలీశ్వర భగ స్థాణు లనునేకాదశరుద్రులు పుట్టిరి. మఱియును బ్రహ్మదక్షిణాంగుష్ఠంబున దక్షుండును వామాంగుష్ఠంబున వీరిణి యనుస్త్రీయుం బుట్టి రామిథునంబునకు వేగురుకొడుకులు నేబండ్రుకూఁ

తులుం బుట్టిరి నారదోపదేశంబునఁ గొడుకులు సాంఖ్యులై ముక్తిం గాంచిన వగచి దక్షుండు కీర్తి లక్ష్మి ధృతి మేధ పుష్టి శ్రద్ధ క్రియ బుద్ధి లజ్జ మతి యనుపదుగురుకూఁతుల ధర్ముం డనుమనువునకును నక్షత్రయోగినుల నశ్విన్యాదుల నిరువదేడ్వురు కూఁతులఁ జంద్రునకును నదిత్యాదులఁ బదుమువ్వురుకూఁతులఁ గశ్యపునకు నొసంగె మఱియుం బైతామహుం డగు మనువునకుఁ బ్రజాపతి పుట్టె నతనికి ధర ధ్రువ సోమ శ్వసనా హ్వానల ప్రత్యూష ప్రభాసు లను నెనమండ్రు వసువులు పుట్టి రందు ధూమ్రయందుఁ బుట్టినధరునకు ద్రవిణ హుతహవ్యవహులును బ్రహ్మవిద్యయందుఁ బుట్టినధ్రువునకుఁ గాలపురుష లోకప్రకాలనులును మనస్వినియందుఁ బుట్టినసోమునకు లోకమునకు వర్చస్సు నొసఁగువర్చసుండు లోనగునల్వురుకొడుకులును బృధ యనుకూఁతురు నప్పృథకుఁ బదుండ్రు గంధర్వపురులును శ్వాసయందుఁ బుట్టినశ్వసనునకు మనోహరియందు శిశిర ప్రాణ రమణులును శివయనుదానియందు మనోజవుఁడు నవిజ్ఞాతగతి యనువారును గతియందుఁ బుట్టిన యహస్సునకు జ్యోతి శ్శమ శాంత మునులును శాండిల్యయందుఁ బుట్టినయనలునకుఁ గుమారుండును గుమారునకు శాఖ విశాఖ నైగమేయ పృష్ఠజులును బ్రభాతయందుఁ బుట్టినప్రత్యూషప్రభాసులలోఁ బ్రత్యూషునకు దేవలుండును దేవలునకు క్షమావంతు లగునిద్దఱుకొడుకులును బ్రభాసునకు బృహస్పతి చెలియ లయినయోగసక్తవలన శిల్పప్రజాపతి యగువిశ్వకర్మయును బుట్టిరి. 127

తే. అద్దు లే కాకసంబున • నరుగునట్టి
దేవయానంబులుం దొట్టి • దివ్యశిల్ప
ములను బెక్కులఁ బొనరించి • పూజ్యుఁ డగుచుఁ
జెన్ను మీఱె నశేష దేవ • శిల్పి యగుచు. 128

వ. మఱియు బ్రహ్మదక్షిణస్తనంబునం బుట్టి ధర్మునకు శమ కామ హర్షు లనుమువ్వురు పుట్టి రందు శమునకుఁ బ్రాప్తియుఁ గామునకు రతియు హర్షునకు నందియు భార్య లై పెక్కురం బడసిరి సూర్యునకు బడబ యగుత్వాష్ట్రివలన నంతరిక్షంబున నశ్విదేవతలు పుట్టిరి. 129

క. ఆవగఁ బుట్టినవారలు, దేవతలకు వైద్యు లగుచు • దివ్యౌషధముల్
భావించి చేసి రుజలన్, బోనఁగ నొనరించి పెర్మిఁ • బొల్చి రసమునన్. 130

వ. ఇట్లు దేవత లెల్ల ముప్పదిమూఁ డన్వయంబులుగ నొప్పుచుండు రందు రుద్రులు సాధ్యులు మరుత్తులు విశ్వేదేవులు నపరపక్షు లై శుక్రునిం గూడి వసువులం జేరి యుండురు వినతాపుత్త్రు లగునరుణగరుడులును బృహస్పతియు నాదిత్యులం

జేరుదురు నాసత్యులు నౌషధులుం బశువులు గుహ్యకులం జేరుదురు కవియుఁ గవిపుత్త్రుండును గ్రహంబులం జేరుదు రని మఱియును. 131

క. దేవగణంబుల నెల్లన్, భావంబునఁ దెలియ వినినఁ ❘ బాపము లెల్లన్
బో విడిచి జనుఁడు విజ్ఞా, నావృతమతి యగుచు శుభయు ♦ లందు ధరిత్రిన్. 132

వ. మఱియును బ్రహ్మహృదయంబు భేదించుకొని పుట్టినభృగునకు నగ్రపుత్త్రుం డగు శుక్రుండను కవి యనం బరఁగి బ్రహ్మశాసనంబున వర్ష వర్షాభావ భయాభయంబు లొసంగునధికారం బంది యసురగురుం డై గ్రహంబయి మెలఁగె నతనికి నత్రి త్వష్టృ వరత్ర విశ్వకర్మ లనునలువురుకొడుకులు పుట్టిరి భార్గవుం డగుచ్యవనునికి భార్యయు మనువునకుఁ బుత్త్రియు నగునాఋషియను నువునందు నూర్వుం డను పుట్టె మహాతేజుం డగు నతనికి ఋచీకుండు పుట్టె నతనికి జమదగ్నిప్రభృతులు నూర్వురు పుట్టి రానూర్వురకుం బెక్కువేలు పుట్టి రందుఁ జమదగ్నికి నలువురు పుట్టి రందుఁ గడగొట్టువాఁడై.

చ. హరి యన నొప్పి రాముఁడు మ ❘ హామహిమ న్నవిధాస్త్రవేది యై
పరశువు చేతఁ బూని నిజ ❘ బాహుబలంబున నెల్లరాజులన్
బరిపరి సంహరించి ధర ♦ భారి మడంచి తొరంగు నెత్తురన్
బఱితోన నేను పెద్దమడు ♦ వు ల్పొనరించె నిజస్థలంబునన్. 134

వ. మఱియు నాబ్రహ్మప్రాణంబులనుండి ధాత విధాత యనువారు మనువుతోడం బుట్టిరి వారికి లక్ష్మి యనుమహాలక్ష్మికి మానసపుత్త్రు లయి స్వర్గసంచారు లగుతురగులు పుట్టిరి వరుణునకు శుక్రపుత్త్రికి యగుజ్యేష్ఠాదేవివలనం బలుం డనుపుత్త్రుండును సుర యనుపుత్త్రియునుం బుట్టిరి వెండియు సర్వభూతవినాశకరుం డగు నధర్ముండు పుట్టె నతనికి నిర్ఋతి యనుభార్యవలన నైర్ఋతు లను పెక్కురాక్షసులును ఘోరభయంకరులై భయ మహాభయ మృత్యువు లనుమువ్వురుపుత్త్రులుం బుట్టిరి మఱియుఁ దామ్ర యనుదానికిఁ గాకి శ్యేని భాసి ధృతరాష్ట్రి శుకి యనుకన్యలు పుట్టిరి కాకికి ఘూకంబులును శ్యేనికి శ్యేనంబులును భాసికి భాసంబులుం గృధ్రంబులును ధృతరాష్ట్రికి హంసలుం గలహంసలుం జక్రవాకంబులును శుకికి శుకంబులును బుట్టెఁ గ్రోధవశ యనుదానికిఁ గోపదేవతవలన మృగి మృగమంద హరి భద్రమనస మాతంగి శార్దూలి శ్వేత సురభి సురస యనుతొమ్మండ్రుకూఁతులు పుట్టి రందు మృగికి మృగంబులును మృగమందకు భల్లూకంబులును సృమరంబులును భద్రమనసకు నైరావతంబును హరికిఁ గోఁతులుం గొండముచ్చులును శార్దూలికి సింహశార్దూలాదికూరసత్త్వంబులును మాతంగికి మాతంగంబులును శ్వేతకు శ్వేత యనుదిగ్గజంబును సురభికి రోహిణి గంధర్వి విమల యనల యనుకూఁతులును రోహిణికిఁ బశువులును గంధర్వికి గుఱ్ఱంబు

లును బుట్టె నాస యనుదానికి నైఋత్య శ్రమ శాంతులు పుట్టిరి మఱియు నిరయనుదానికి ముగ్గురుస్త్రీలు పుట్టిరి వారివలనం దరుగుల్మలతాదులు నెల్లవనస్పతులును బుట్టె ననలకుం బిండఫలంబులం గనునేడుజాతులవృక్షంబులు పుట్టె సురభికి యమునొక్కకూఁతురును సురసకుం గంకుఁ డనుకొడుకును బుట్టిరిట్లు చరాచరాత్మకం బగుసకలప్రపంచంబు నుత్పన్నం బయ్యె నని వెండియును. 135

మ. భగవంతుం డగువానిలీలవలనం ♦ బ్రాప్తించి యున్నట్టి యీ
జగదుత్పత్తి విధాన మెవ్వరియుఁ ♦ శ్రద్ధాన్వితస్వాంతులై
తగునీతి న్వినిరేని వారలకు నా ♦ త్తస్వాస్థ్యముఁ సౌఖ్యముఁ
ద్విగుణీభూతము లై శుభం బగు మహా ♦ దేవప్రసాదంబునన్. 136

దేవదానవాంశంబులచే భూమియందుఁ బుట్టినవారిక్రమము.

వ. అనిన జనమేజయుండు వైశంపాయనున కిట్లనియె. 137

క. నరలోకమునందు దేవా, సురు లెవ్వ రెవ్వ రెట్లు పుట్టి ♦ సురుచిరలీలం
బరఁగిరొ వారలచరితం, బరుదుగ నెఱిఁగింపు మనిన ♦ నతఁ డిట్లనియెన్. 138

క. జనమేజయజననాయక, వినిపించెద వినుము నేను ♦ వినినవిధమునన్
మునుమును సురులజన్మం, బును వెనుకన్ సురలజన్మ ♦ మును వినుముగన్. 139

వ. అని మఱియు నావిప్రచిత్తి జరాసంధుం డయ్యె హిరణ్యకశిపుండు శిశుపాలుం డయ్యెఁ బ్రహ్లాదానుజు లగుసంహ్లాదానుహ్లాదులు శల్యధృష్టకేతు లైరి ప్రహ్లాదశిష్యుం డగునగ్నచిత్తి సుబలుం డనురాజయ్యె శిబి ద్రుముం డనురాజయ్యె బాష్కలుండు భగదత్తుం డయ్యె నయశిరఃప్రభృతులు కేకయరాజు లైరి కేతుమంతుం డమితౌజుం డనురాజయ్యె స్వర్భానుం డుగ్రసేనుం డయ్యె నశ్వుం డశోకుం డయ్యె నశ్వపతి హార్దిక్యుం డయ్యె వృషపర్వుండు దీర్ఘప్రజ్ఞుం డయ్యె నజకుండు సాల్వుం డయ్యె నశ్వగ్రీవుండు రోచమానుం డయ్యె సూక్ష్ముండు బృహద్రథుం డయ్యెఁ దుహుండుండు సేనాబిందుం డయ్యె నేకపాదుం డగ్నిజిత్తనురాజయ్యె నేకచక్రుండు ప్రతివింధ్యుం డయ్యె విరూపాక్షుండు చిత్రధర్ముం డయ్యె హరుండు సుబాహుం డయ్యె నహరుండు బాహ్లికుం డయ్యె నిచంద్రుండు ముంజకేశుం డయ్యె నికుంభుండు దేవాధిపుం డనురాజయ్యె శరభుండు పౌరవుం డయ్యెఁ గుపథుండు సుపార్శ్వుం డయ్యెఁ గ్రథుండు పార్వతేయుండనురాజయ్యె శలభుండు ప్రహ్లాదుం డనుబాహ్లీకుం డయ్యె దైత్యచంద్రుండు చంద్రవర్మయయ్యె దైత్యసూర్యుండు ఋషికుం డయ్యె మృతపుండు పశ్చిమానూపకుం డయ్యె గవిష్ఠుండు ద్రుమసేనుం డయ్యె మయూరుండు విశ్వుం డనురాజయ్యె సుపర్ణుండు కాలకీర్తి యయ్యెఁ జంద్రహంత శునకుం డనురాజయ్యెఁ జంద్రప్రమర్దనుండు జానకి యనురా

జయ్యె దీర్ఘజిహ్వుండను కాశీరా జయ్యె సర్కేందుమర్దనుండను క్రాంతుం డనురాజయ్యె వికరుండను వసుమిత్రుం డయ్యె వికరానుజుండు పాంశ్యుం డయ్యె బలీనుండు పౌండ్ర మాత్స్యకుం డయ్యె వృత్రుండు మణిమంతుం డయ్యెఁ గ్రోధహంత దండుం డనురా జయ్యెఁ గ్రోధవర్ధనుండు దండధారుం డయ్యెఁ గాలేయు లెనమండ్రుగురును గ్రమంబుగ జయత్సేనుఁ డపరాజితుండు నిషాదరాజు శ్రేణిమంతుండు మహౌజసుండు నభీరుండు సముద్రసేనుండు బృహన్నాముండు ననురాజులై రి కుక్షి పార్వతీయుం డనురాజయ్యెఁ గ్రథనుండు సూర్యాక్షుం డయ్యె ననుసూర్యుండు దరదుం డనుబాహ్లీకుం డయ్యెఁ గ్రోధవశగణంబునుండి మద్రకి కర్ణవేష్ట సిద్ధార్థ కీటక సువీర సుబాహు మహావీర బాహ్లీక క్రథ విచిత్ర సురథ నీల చీరవాసో దంతవక్త్ర రుక్మి జనమేజ యాషాఢ వాయువేగ సురి తైత్తికలవన్న భూరితేజో వాటధాన గోముఖ కారూష క్షేమ ధూర్తి శ్రుతాయు రుద్వహ బృహత్సేన క్షేమాగ్రసేన కుహర మతిమ దీశ్వరు లనురాజులసమూహం బయ్యెఁ గాలనేమి యుగ్రసేనపుత్త్రుం డగుకంసుం డయ్యె దేవకుండు దేవకుం డనురా జయ్యె మఱియు బృహస్పత్యంశంబున ద్రోణుండును శివయమాంశంబులఁ గామక్రోధంబులనుండి యశ్వత్థామయు వసువులయంశంబున భీష్ముండు నేకాదశరుద్రులయంశంబునఁ గృపుండును ద్వాపరయుగాంశంబున శకునియు సప్తమరుత్తులయంశంబున సాత్యకియు మరుద్గణాంశంబున ద్రుపదవిరాటులును నరిష్టాపుత్త్రుం డగుహంసుం డనుగంధర్వునంశంబున ధృతరాష్ట్రుండును సమస్త మరుద్గణాంశంబునఁ బాండురాజును సూర్యునంశంబునఁ గర్ణుండును బుట్టిరి కలిపురుషుండు దుర్యోధనుం డయి పుట్టెఁ బౌలస్త్యభ్రాతృవర్గము దుర్యోధనానుజశతం బయి పుట్టె స్త్రీరూపధరుం డగురాక్షసుండు శిఖండి యయి పుట్టె మాండవ్యశాపంబున యముండు విదురుండై పుట్టె గవల్గణుం డను మునితుల్యుం డగు సంజయుండు పుట్టె ధర్మాంశంబున యుధిష్ఠిరుండును ననిలాంశంబున భీమసేనుండును నింద్రాంశంబున నర్జునుండును నాసత్యులయంశంబున నకులసహదేవులును బుట్టిరి సోమాత్మజుం డగువర్చసు నంశంబున నభిమన్యుండును నగ్నియంశంబున ధృష్టద్యుమ్నుండును విశ్వేదేవాంశంబుల ద్రౌపదేయులును బుట్టిరి మత్యంశంబున గాంధారి పుట్టె నాదిశక్తి యగుశచీదేవియంశంబున ద్రౌపది పుట్టె సిద్ధి బుద్ధి యనుదేవతలు కుంతీమాద్రులై పుట్టిరి. 140

క. యదువంశంబున విష్ణుం, డుదయించెను గృష్ణుఁ డనఁగ ♦ నొగి శేషుం డ
భ్యుదయం బందెను సతము, క్తిదుఁ డయి బలభద్రుఁ డనఁగ ♦ గృష్ణాగ్రజుఁ డై.

వ. మఱియు మరుదంశంబున సత్యకహృదికులకు సాత్యకి కృతవర్మలును రమాంశంబున

రుక్మిణియు సనత్కుమారాంశంబునఁ బ్రద్యుమ్నుండును నప్సరోగణాంశంబునఁ గృష్ణాంతఃపురస్త్రీలును దేవాంశంబుల యదువృష్ణిభోజాంధకాదిసంశంబులవారును బుట్టి రీచెప్పినవారు గాక మఱియు ననేకు లనేకాంశంబులం బుట్టి రని చెప్పిన విని జనమేజయుండు వైశంపాయనుం జూచి యి ట్లనియె. 142

కౌరవవంశావతారము.

మ. ధరణీరాజ్యరమాధురంధరు లుదా । త్తప్రోద్ధతశ్రీయుతుల్
గురుబాహాబలనిర్జితారినృపతు । ల్పుణ్యానుష్ఠానప్రస్తుతుల్
భరతుం దొట్టి మహామహేంద్రవరు లే । వంశంబునం బుట్టి రా
కురువంశస్థితి నాదినుండి విన నా । కుం బ్రీతి వా ర్యయ్యెడిన్. 143

వ. అనిన వైశంపాయనుం డి ట్లనియె. 144

క. కౌరవవంశ మహత్త్వము, పారావారంబు బోలె । పట్టఁ జెప్పన్
నేరఁడు వేనో ళ్లుండిన, ధీరుఁడు నొక్కొండుఁ గొలఁది । దెలిపెద విను మా. 145

వ. తొల్లి ప్రాచీనబర్హి పుత్త్రు లగుప్రచేతసులకుం బుట్టి ప్రాచేతసుం డను నాఁ బరఁగినదక్షుని పుత్త్రిక యగునదితియందుఁ గశ్యపునకుఁ బుట్టిన వివస్వంతునకు వైవస్వతుం డను యముండును శనైశ్చరుండును యమునయు దపతియుం బుట్టి రావైవస్వతమనువునకు వేనధృష్ణునరిష్యంతనాభాగేక్ష్వాకుకారూషశర్యాతిపృషధ్రధార్ష్టు లను తొమ్మండ్రు కొడుకులు నిల యను కూఁతురుం బుట్టిరి మఱియు నేఁబండ్రు కొడుకులు మున్న పుట్టి వారిలో వారు పోరి చచ్చి రిట్లు బ్రహ్మపుత్త్రుఁ డైన మనువునకుం బుట్టి మానవు లైరి తొలుతఁ బురుషుండును పిదప స్త్రీయు నైన యిలయందు నిందునందనుం డగుబుధునకుఁ బురూరవుండు పుట్టి చక్రవర్తి యై త్రయోదశద్వీపసముద్రముద్రితం బగువిధరాచక్రం బెల్ల ననతివిక్రమంబునం బరిపాలించుచు.

మ. మనుజుం డయ్యు నమానుషక్రియల ను । న్మత్తుండు దృప్తుండు నై
ఘనుఁడై వీర్యమున న్మెలంగి ద్విజసం । ఘద్వేషి యై పోరి త
ద్ధనరాశిన్ హరియింపఁ గా దనుచు వా । ర్ధర్మ్యయ చేతెంచి బ్ర
హ్మనియోగింప సనత్కుమారుఁ డట బ్ర । హ్మర్షుల్ దనుం గొల్వఁగన్. 147

వ. ఇట్లు వచ్చి బోధించినను వానిమాట సేయకుండ నిరాకరించినఁ బురూరవుని గినిసి నీ వున్మత్తుండ వగు మని మహర్షు లెల్లఁ బలికి చని రందుఁ జేసి యతండు. 148

క. ఎఱుక విడి బలమదంబున, మఱకువయై లోభి యగుచు । మహిమాదికముం
దొఱఁగి చెడి గ్రామ్యధర్మము, నఱగొఱ లేకుండ నొందె । నభిలాషమెయిన్. 149

వ. అతండు గంధర్వలోకంబున నూర్వశిం దగులుకొని యొండు దెఱంగు లేకుండె నట్టిపురూర

పున కూర్వశియందు నాయువు ధీమంతుఁడు నుదావసువు దృఢాయువు వనాయువు శతా-
యువు ననునార్వురు పుట్టి రందు నాయువునకు స్వర్భానవియందు నహుషు వృద్ధ
శర్మ గయానేనసు లను నల్వురు పుట్టి రందు నహుషుండు. 150

తే. రాజ్యపట్టాభిషిక్తుఁడై ♦ పూజ్యుఁ డగుచు, విక్రమక్రియమున శత్రు ♦ వితతిఁ దోలి
నేలనాలుగుచెఱఁగులు ♦ నేలి నూఱు, యజ్ఞములు చేసి దేవేంద్రుఁ ♦ డై తలిర్చె.

వ. ఆనహుషునకుఁ బ్రియంవదయందు యతి యయాతి సంయాతి యాయాతి యయతి ధృవుఁడు ననునార్వురు పుట్టి రందు యతి యోగం బనుసంధించి బ్రహ్మభూతుం డయిన యయాతి రాజై దేవయానిశర్మిష్ఠలం బెండ్లియాడి రాజసూయాద్యధ్వరంబులు చేసి రాజ్యపాలనంబు సేయుచు దేవయానియందు యదు తుర్వసు లను నిర్వురను శర్మిష్ఠయందు ద్రుహ్యనను పూరు లనుముప్వురను గని శుక్రశాపంబునం జేసి జరాభార పీడితుం డై విషయేచ్ఛం దగిలి కొడుకులం బిలిచి మీలో నొక్కరుండు నాముదిమి కొని తనజవ్వనంబు నా కిచ్చునది యట్లిచ్చినవాఁడె రాజ్యార్హుం డగు ననిన యదు ప్రభృతులు దాని కంగీకరింపకున్నం బూరుండు పిత్రుమనోరథం బవశ్యకర్తవ్యం బని యట్లు చేసె యయాతియుం దనయభీష్టంబు నెఱవేర్చుకొని యనలికాలంబున వాని యౌవనంబు వాని కిచ్చి పూరునకుం బట్టంబు గట్టి తాను దపోవనంబునకుం జనియె.

తే. అనిన జనమేజయుం డను ♦ నార్య యాయ, యాతి భార్గవసుత దేవ ♦ యానిఁ బెండ్లి
యై వసుధ నేలె నంతి వా♦యయ ఘుచరిత, విన దలఁతుఁ జెప్పవయ్య స ♦ విస్తరముగ.


యయాతిచరిత్రము.

వ. అనిన వైశంపాయనుం డి ట్లనియె. 154

తే. భూతలేశ్వర వినుము య ♦ యాతి తొల్లి, దేవరాజసముం డయి ♦ తేజరిల్లెఁ
గవికి వృషపర్వునకు నల్లుఁ♦డవుచు నట్టి, పూర్వకథను జెప్పెద నాను♦పూర్వముగను.

క. సురలకు నసురులకుఁ బర, స్పర మైశ్వర్యంబుకొఱకుఁ ♦ బనివడి యుంటం
బోరఁ బొచ్చె మంకురించియుఁ, బరఁగెన్ వైరంబు విడని ♦ వడువున నెపుడున్. 156

మత్తకోకిలము. దేవదానవు లంత వింతగ ♦ ద్వేషము న్మదిఁ బెంచుచున్
జీవ నొంకోరు గెల్వ నెంచుచు ♦ జీవుని న్సురపిల్లజుల్
దేవవైరులు కావ్యునిం గదుఁ ♦ దేఱఁ గూర్పఁగ నొజ్జలం
గా వరించి పురోహితత్వముఁ ♦ గైకొనం బొనరించుచున్. 157

క. దానన్ గురువుల కన్యో, న్యానూనస్పర్థ వొడమి ♦ నందుం వారల్
మానసమున ద్వేషింపుచుఁ, గానంబడుచుండి రుగ్ర ♦ కల్పులు గ నెగిన్. 158

వ. ఇట్లు గురుశుక్రు లిద్దఱును దేవదానవులకు గురుత్వ మొంది యున్నయవసరంబున.

ఉ. శుక్రుఁడు దానవేంద్రుఁ డయి • చొప్పడునావృషపర్వునొద్ద ని
ర్వక్రతపోమహత్త్వమునఁ • గ్రాలెడువిద్యను బోర నీల్గిన
య్యక్రమనర్థులన్ బ్రదుకు • నట్లుగఁ జేయుచు నుండె నందునన్
శక్రపురోగముల్ సురలు • చాలఁ గృశించిరి శత్రువృద్ధికిన్. 160

దేవతలు మృతసంజీవనిం దేఁ గచుం బుచ్చుట.

వ. అప్పు డింద్రాదిబృందారకు లెల్ల నల్ల ద్రావణులు చచ్చియు శుక్రవిద్యాశ్రయబలంబునం
జావక బ్రదికి పోరుచుండిరి బృహస్పతికడ మృతసంజీవని లేమిం జేసి మన మోడు
చుంటి మని భయోద్విగ్నమానసులై దానిఁ బడయం గోరి గురుపుత్త్రుం డగు కచుం
డనువానికడకుం జని కార్యం బెఱింగించి ప్రార్థించుచు. 161

మ. మృతిసంజీవని నీదుతండ్రికడ లే • మిం జేసి నీవారు వీ
రతిభీతిం గొని మిత్తినోటఁ బడిరయో • య్యం బోవుచున్నారు వి
ద్గతి విద్వేషులు గొల్చుచుండి రధిక • త్వం బంది నీ విమ్మహా
కృతికిన్ శక్తుఁడ వొప్పఁగా రమలమూ • ర్తీ మమ్ము రక్షింపవే. 162

తే. కవికిఁ గూఁతురొప్పెఁ గన్య • గరుణ గలదు, దాని నుడి దాఁట నోపఁడు • గాన నీవు
దేవయానిని సేవించి • తేని విద్య, గలిగి సురలను బ్రదికింపఁ • గలుగు దాన. 163

ఉ. బాలుఁడ వీవు పోయి వృష • పర్వునివీట మెలంగు కావ్యునిం
బోలఁగఁ జూచి శిష్యుఁడను • బ్రోవు మటంచని వేఁడి పోడిమిన్
బాలిక దేవయానిమది • నట్టి మెలంగుచుఁ గొల్చుచుండి నీవే
మేలు గ్రహించి వేలుపుగ • మిం బ్రదికించినపుణ్యు మయ్యెడిన్. 164

తే. అనుడు నట్ల గాక యని కచుం • డటకుఁ బోయి, శుక్రుఁ గని మ్రొక్కి నేను గ • సూనుఁడ గురుని
పుత్త్రుఁడ మునీ యంగిరసుని • పౌత్త్రుఁడను గ, లార్థి వచ్చితి శిష్యుఁగా • నేయు మనుడు.

క. కరుణించి దీని కిం గీ, కరించితి నేను విద్య • గఱచుచు నిచటన్
గురుశుశ్రూష యొనర్చెదఁ, బరికింపఁగ నొక్కవేయి • పదివత్సరముల్ • 166

ఉత్సాహము. అనిన నక్కుమారు వినయ • మలరుసౌకుమార్యమున్
గని మదిం గరంగి పొంగి • కావ్యుఁ డర్మిలిం గచుం
గొని గృహంబునందు నిల్పు • కొని గురుత్వ మందె జీ
వునిపయిం గలట్టి కినుక • వ్రానఁ బోక నెమ్మదిన్. 167

వ. కచుండును గురుదయాపాత్త్రుం డయి భయభక్తియుక్తులం బ్రవర్తించుచు. 168

కచుండు శుక్రు నారాధించుట.

మ. పని యన్నం బని యున్న మాని పొసఁగం • బం జూచి తచ్చిత్తవృ
త్తిని గైకొం చనుకూలుఁడై వినయభ • క్తిశ్రద్ధలం జూపు మఱ్
మనముం జెయ్వులు మాట లొక్కమొగినై • మానొంద నానందసాం
ద్రుని గాఁ జేసెఁ గవీంద్రునిం గచుఁడు శు • శ్రూషావిశేషంబులన్. 169

సీ. దేవగాయకులలో • దిగుదొరంగ గాంధర్వ, మొనరించి నృత్యంబు • వొసఁగఁ జేసి
వేణువీణాదుల • రాణ లెసంగ నా, యించి పురాణము • లెంచి చదివి
బుధు లెన్నఁగా మృదు • మధురకవిత్వంబు, గురువర్ణనంబునఁ • బరఁగఁ గూర్చి
పూల్పంబ్లు ప్రేముడి • పుట్ట నివేదించి, మంచిమాటలు ప్రియ • మించు విరిచి

తే. యుబుసు పోమి కథల్ సెప్పి • మొఱుఁగ నొప్పి, మేటిచదురుగ నుతికెక్కి • నాట లాడి
విచిత్రవినోదముల్ • చేసి నెమ్మి, గలుగి గురుభక్తి గురుపుత్త్రిఁ • గొలిచెఁ గచుఁడు.

వ. ఇట్లు మహోత్తమం డక్కచుండు నియమవ్రతనిష్ఠాగరిష్ఠుండై గురుని గురుపుత్త్రినిం గొలిచి వారిమైత్రికిం బాత్రుండగుచుం బ్రియశిష్యుండు నై యున్నయప్పు డొక్కనాఁడు గోరక్షణార్థ మడవిం గ్రుమ్మరుచుండఁ జూచి పాపకర్ము లగుదానవులు సురాచార్యునిపైఁ గలవైరంబున నెఁ జేసి వాని బట్టి గిట్టించి నువ్వుతునుకలు గావించి దంపి మ్రుగ్గ చేసి తోడేళ్ళం దినిపించి చని రంత సాయంతనం బగుటయు ధేనువు లింటికి వచ్చుటయును గచుండు రాకుండుటయు నెంౘ దెలిసి దేవయాని దేవురింపుచుఁ దండ్రి కిట్లనియె. 171

ఉ. ఎట్టులు వాఁటె నింగి మొగు • లెక్కఁగఁ బొద్దు మునింగెఁ బుల్గులుం
దొట్టులు సేరఁ జొచ్చె నొద • తో భవనగ్నులు వెల్గెఁ గాఁచెదం
దొట్టులు నింటికిమో మగుచు • బూఁడలఁ జూడఁగ వచ్చె నొంటిమైఁ
గుఱ్ఱ కచుండు రాఁ డెపుడొ • గోసిరొ కొట్టిరొ వాని రక్కసుల్. 172

మ. పులి సింగం బెలుఁ గేదు వేఁపి గొఱ్ఱ కా • ర్చిచ్చు తేఁళ్ళు పా మేదియేఁ
జులుకన్ మ్రుద్దులు మూఁటగట్టుకొనినం • జొక్కెంచెనో చిక్కెనో
యిలు సేరం డిరులయ్యె నెయ్యెడల నా • కింతేనియుం దోఁప దా
చెలిమిం గూర్చెడువానిఁ జూడ కిదియుం • జెల్లు న్నిజం బాపెదన్. 173

మృతసంజీవనిచేఁ గచుండు పునర్జీవితుం డగుట.

వ. అనిన శుక్రుం డది యంతయు నెఱింగి వానిం దేర మృతసంజీవనిం బుచ్చుటయును దత్ప్రభావంబున నతండు బ్రదికి తోడేళ్ళపొట్టలం జించుకొని వచ్చి దేవయానికిం బొడసూపుటయు నామె యానందంబున వానిం జూచి యి ట్లనియె. 174

చ. తడసితి వింతసేపెచట ◆ దాఁగితి వేగతిఁ దాళుదాన నో
వడుగ నినుం గనుంగొనక ◆ వత్సగుణంబిది యేమొ నా నతం
డడఁకువఁ జూపుచుం బలికె ◆ నక్కట భార్గవపుత్త్రి నేఁడు నే
నడవికి నాలఁ గాయఁ జని ◆ యందు సమిత్కుశకాష్ఠభారముల్. 175

ఆ. సంతరించికొంచు ◆ శ్రమ నొక్క వృక్షంబు, నీడఁ బట్టపగటి ◆ వేఁడి కుడిసి
తొడుకుగములు నేను ◆ గడె నిల్చి యున్నవో, యసురు లటకు వచ్చి ◆ కసరి నన్ను.

చ. ఎవఁడవు రోరి నీ విచటి ◆ కేటికి వచ్చితి ముచ్చువోలె నుం
టివి యని రేఁగి నే నసును ◆ డి న్వీన కెల్లరు నన్నుఁ బట్టి బి
ట్టవియఁగ మొత్తి పిండి యగు ◆ నద్ది వృకాళికిఁ బెట్టి పోయి నీ
భవనమున నిట్లు నే బ్రదికి ◆ వచ్చితి భార్గవపేర్మి పెంపునన్. 177

వ. అనిన విని దేవయాని వానికై నకష్టంబునకు వగచి యిష్టకథానులాపంబుల వానిఁ దేలించుచుండె నంతఁ గొంతకాలంబునకు. 178

క. మఱియొకనాఁ డడవికిఁ బూఁ, దరుదుగఁ దేఁ బోవు కచుని ◆ నసురు లసురు వ్రాఁ
బారి నసాటి సముద్రజలాం, తరమందుం గలిపి చనిరి ◆ తెగఁ గ్రౌర్యమునన్. 179

వ. తొంటియట్లు దేవయాని తండ్రి కెఱిఁగించి వానిం బ్రదికించె నంతఁ దృతీయవారంబున. 180

క. కర మలిగి నిర్జరారులు, పరిపరివిధములను గచుని ◆ భంజించు చొగిన్
బొరిఁగొని కాలిచి భస్మము, సురతోఁ గ్రోలించి రొకట ◆ శుక్రాచార్యున్. 181

వ. దానం జేసి శుక్రుండు మోహితుం డయి యుండఁ దొంటియట్లు కచుం గానక దేవయాని తండ్రికడకు వచ్చి కచుండు లేకున్న నేను బ్రదుక లేనని చెప్పి దుఃఖించుటయు నతండును. 182

క. మృతసంజీవని బ్రతికెడు, నసువిం బగ మఱియు మఱియు ◆ నడఁచెద రసురుల్
బ్రతికింపలేను విసిగితి, మతిఁ గుందకు మతఁడు సుగతి ◆ మార్గము నట్టున్. 183

క. నీడయకుఁ బాత్రుఁ డొకకచుఁ, డా దొరకెను నీదు తండ్రి ◆ కసురులు సురలున్
భూదేవు లాశ్రయు లెందఱొ, పాదాక్రాంతు లయి యుండఁ ◆ బరికింపవొకో. 184

వ. అని దేవయాని వలవల వలపోయుచుఁ దండ్రి కిట్లనియె. 185

మ. అకటా నీ కిటు లాడఁ జెల్లునె మహా ◆ త్మా దేవతాచక్రవ
ర్తికి నాచార్యుని యంతవాని సుతుఁ డా ◆ దిత్యాభుఁ డా సృష్టిక
ర్తకు నుం దీ టగు నీకు శిష్యుఁడు జగ ◆ ద్వంద్యప్రభావుండు బా
లకుఁ డాతం డటు వో నుపేక్షఁ గొనుటల్ ◆ ధర్మంబె మీబోంట్లకున్. 186

ఆ. వానిఁ జూచి కాని • నేను గుడువ నొల్ల, ననుచుఁ గూఁతుసందు • నలరుప్రేమ
నతఁడు మంత్రశక్తి • నాహ్వాన మొనరించెఁ, గచుని వాఁడు బ్రదికి • కడుపులోన.

చ.* కడుపున నున్నవాఁడ నని • కావ్యునితోడ నలంతివాకునన్
నొడివిన నాతఁ డెట్లు చొరి • నోయుచు నుంటివి నాఁ గచుండు దనున్
జడు లసురుల్ ననుం బొడిగ • సల్పి సురం గలయంగఁ గూర్చి నీ
కిడి రది ద్రావితీ విపుడ • యే నిటు లైతి సయో మహోదయా. 188

క. స్మృతి చెడదు నీప్రభావం, బతులితమై కలిగి యుంట • నఖిలజగద్వం
దితపాదపీర నే నిట, నతిఘోరక్లేశ మొంద • నై యుంటిఁ జుమీ. 189

వ. అనిన విని భార్గవుండు సురాపానంబున నిట్టిప్రమాదంబు సంభవించె నని విచారించుచు. 190

ఆ.† ఎఱుకఁ జెఱచు నొడలి • కెక్కించు రోగంబు, లోకనిందఁ దెచ్చు • వేఁకి గూర్చుఁ
దలఁగఁ జేయు నరుని • ధనమానజీవముల్, మలఁచు నిహము పరము • మద్యసేవ.

క. నాలుగుజాతులవారీ, పోలనిసుర సేవ సేయఁ • బోయిర యేనిం
బాలసులై పాతకులై, కూలుదు రిది మొదలుగాఁ గఁ • గుటిలమునందున్. 192

వ. అని సురాపానంబు మహాపాతకంబుగా శపియించి దేవయానిం జూచి యిట్లనియె.

క. ఆకచుఁడు దగిన నేనో, కాకేఁ గడ తేరఁ గచుఁడు • కాఁ్రిలెద మిందున్
నీ కేది ప్రియము చెప్పుము, నాకుఁ దెఱఁ గెందుఁ బొసఁగు • నా రా దిచటన్. 194

వ. అనినం దేవయాని దైత్యాచార్యున కిట్లనియె. 195

క. ఏతద్ద్వయంబు నామది, నాతతకల్పాగ్నివోలె • నై యెరియించున్
నాతండ్రి నిన్నుఁ బాసియు, నాతనిఁ బాసియును బ్రదుక • నని పలుకుటయున్. 196

వ. కరుణాతరంగితాంతరంగుండై శుక్రుండు తనకడుపులో నున్నకచునిం జీరి కుమారా నిన్ను దేవయానిప్రార్థనం జేసియు బ్రాహ్మణోత్తముఁడ వగుటం జేసియు నుద్ధరింపం దలంచితిని నీవు సంసిద్ధరూపుండ వైతి మృతసంజీవనీవిద్యం గొని నాయుదరంబు భేదించుకొని వెడలి వచ్చునది యని మంత్రోపదేశంబు చేసి మఱియును. 197

ఆ. కొడుక వైతి నాదు • కడుపునయందుండి, వెడలి వచ్చుకతన • వడుగ నీవు
నట్ల తలఁచికొనుచు • నంతరంగమున నే, మఱక నాదుబ్రదుకు • నరసికొనుము. 198

వ. అంతఁ గచుండును. 199

శా. విద్యావంతుఁడు వీర్యవంతుఁ డగుచున్ • భేదించి వజ్రాయుధా
భేద్యం బైనకవీడ్యగర్భమును నా • విర్భూతుఁడై తద్భిదా

* నోయు=నొచ్చు, బాధపడు. † మలఁచు=తొలఁగఁజేయు.

ప్రీతి ఘటించితే నసుకు • వీడి సేవంబు గణింప కొప్పి నే
నూఁతగఁ బోని పో మ్మనుచు • నుందునె గా కిటు పోవ నిత్తునే. 210

వ. అని యిట్లు సాభిప్రాయంబుగాఁ బలికి మఱియు. 211

ఉ. ఈవు సువంశసంభవుఁడ • వేను సువంశసముద్భవన్ గురుం
డీవు ప్రతిష్ఠుఁ డౌనసుగ • వేను ప్రతిష్ఠను గన్నె నెన్నఁగా
నీవును నేను గూడుకొన • నీళ్లును బాలును గూడిన ట్లగుం
గావున బెండ్లియాడి నను • గౌతుకముం గలిగింపవే పయిన్. 212

క. ఇది క్రొత్తె కాదె నిన్నా, త్రిదశారులు చంప నొంప • దిగు లంది గురుం
బదిపదులు వేఁడి మఱి మఱి, బ్రదికించుచు వచ్చితిం గృ • పాపాథోధీ. 213

క. నావుడుఁ గచుఁ డధికవిషా, దావిలహృత్పద్ముఁ డగుచు • నను ని ట్లయయో
వావియు వరుసయుఁ దెలియక, యీవరుసఁ బలుకఁ జెల్లు • నే గురుపుత్త్రీ. 214

ఆ. గురుఁడు తండ్రి శిష్య • కోటికి గురుపుత్త్రి, చెల్లె లగును వాని • చెల్లుబడిని
గాన నీవు నేను • గావ్యనికసుపుత్త్రి, బాడమినారి మిట్లు • నోరుఁప వలదు. 215

క. ధర్మమునఁ బోనాడెచిదు, ష్కర్మములకుఁ బోవునట్టి • కష్టాత్ముండున్
నిర్మలవివేకహీనుండౌచు, దుర్మరణము నొంది నరక • ధునిఁ బడుదు గొఁగిన్. 216

దేవయానియుఁ గచుఁడు నొండొరులు శపించుకొనుట.

వ. నీవు నాకు సాక్షాత్సోదరివి గాని మఱి యొకండవు గాఁ గట్టినీ విట్టియధర్మంబు లాడక నన్ను దయఁ జూచి మేము బోయినచ్చెద నంపిపుచ్చు మని ప్రార్థించుటయు నాపె పెచ్చుపెఱుగుమచ్చరంబుచు నిన్నుఁ బెండ్లియాడఁ గోరిక తాన పెట్టుకొని యున్న న న్నిట్లు చేసితివి గావున నీకు సంజీవనీవిద్య సిద్ధింప కుండుఁ గావుత మని శాపం బిచ్చినఁ గచుండును నీవు ధర్మబద్ధంబు తప్పనివాఁడ నేని నాకు సిద్ధింపకున్నను నే నిచ్చినవారి కీ విద్య సిద్ధించెడు నీ వధర్మపథవర్తిని వైతివి గావున బ్రాహ్మణేతరుండు నీకు భర్త యగుంగాక యని ప్రతిశాపం బిచ్చి స్వర్గంబునకు నిర్గమించి మృతసంజీవనీవిద్య హృద్యం బగు దెల్లసురల కుపదేశించి కృతార్థులం జేసె నిట వృషపర్వునికూఁతురు శర్మిష్ఠ యొక్కనాఁడు. 217

ఉత్సాహము. *కన్యకాసహస్ర మంటఁ • గదలి దేవయానితో
వన్య మానసోవరంబు • పజ్జఁ బెట్టి పుట్టముల్
కన్య లాడి నీట వచ్చి • గాలిఁ గలియువాని న
న్యోన్యవినిమయంబు గాఁగ • నవధరించి రత్తఱిన్. 218

* అవధరించిరి = తాల్చిరి.

వ. శర్మిష్ఠ దేవయానిపరిధానంబు గట్టిన దేవయాని దానిపుట్టంబుఁ గట్ట రోసి. 219

క.† నీతాతకు నీతండ్రికి, నీతోయమువారి కెల్ల నెత్తి నారాధ్యుం
డై తనరు దైత్యగురునకుఁ, గూఁతుర నేఁ బూజ్యురాలఁ గోమ లందఱకున్. 220

సీ. నాకట్టుపుట్టంబు నీ కేల కట్టంగ, నిమ్మెలఁ గట్ట నా కేమి వచ్చె
ననుచు మండి శర్మిష్ఠ యను నేను రాకన్న, నను నీవు గొలుచుట నాయ మగును
నీతండ్రి నాతండ్రి నిలిచిన నో నిల్వ, రాదు భజించియే బ్రదుక వలయు
నిమ్మహి మీవార లందఱు మాయిండ్ల, భిక్షాటనము చేసి పెరిగినారు

ఆ. నీ కిదేటి గర్వ మేఁ గట్టుపుట్టంబు, నీకుఁ గట్ట రాదు గాక యేమి
యనుచు నెగ్గులాడి యాదేవయానిని, బడఁగఁ ద్రోచి నూత వైచె నంత. 221

చ. నహుషున కాత్మజుండు భుజసప్రవరుండు యయాతి వేఁట కా
గహనముఁ జొచ్చి శ్రాంతుఁడును క్షుత్పిపాసితుఁడై మెలంగుచున్
గుహానలెఁ గప్పి యున్న యొక కూపమునం దనలార్చివోలె నా
గ్రహమతి గోఁజుదానిఁ గనెఁ గందొనవిందుగ దేవయానినిన్. 222

మ. కని నీవెవ్వరిదాన వెవ్వతెవి యిక్కాంతారమధ్యంబునం
జనుదే నేమి తృణావృతంబును భయాస్థానంబు నిర్జాతిలో
వనటం గుందఁగ నేల చెప్పు మనినన్ వామాక్షి సన్నద్ధుఁడం
గనువారిన్ బ్రదికించుభాగ్యపరుఁ డేఁ గన్యం జగన్మాన్యకా. 223

యయాతి దేవయాని నుద్ధరించుట.

వ. ప్రమాదవశంబున నిందుఁ బడి యున్నదాన నీ వార్తత్రాణపరాయణుండవు
గుణనిధివి నన్నెత్తికొను మనుగ్రహించి సముద్ధరింపు మని ప్రార్థించి తన దక్షిణ
హస్తంబు చూపుటయు నత్తాపసశరణ్యుండును దక్షిణంబున దానిం గ్రహించి నూయి
వెడలం దిగిచి తత్కోదరి నామంత్రితంబు చేసి తాను నిజరాజధానికిం జనియె నిట
దేవయాని శర్మిష్ఠచేతఁ జెందిన సంజాతజాతివేదోపనిభం బగు కోపతాపంబున
ఘూర్ణిల్లుచుఁ దన్ను రోయ వచ్చు ఘూర్ణిక యను దానివలనఁ దా యవమానంబు
తండ్రికిం జెప్పి పుచ్చి తానప్పురంబు సొర నొల్లకున్నంత శుక్రుండును నతిత్వరితగతి నట
వచ్చి దేవయానిం గాంచి కౌఁగిలించుకొని వగచుచు సాంత్వవచనపూర్వంబుగా
నిట్లనియె. 224

క. తనచేసినదోషంబున, జనునకుఁ గష్టంబు సుఖము జరిపెడుచుండున్
వనరుట కష్టం బయినను, బొనరుట సుఖ మయినఁ దగదు పూరుషున కిలన్. 225

† కొమలు = స్త్రీలు.

వ. అంత నయ్యయాతియు నట విగతపిపాసాశ్రముండై విశ్రమించి దేవయానిని మున్న యెఱింగి యున్నవాఁ డయ్యు నెదుట రూపలావణ్యగుణగరిష్ఠ యగుశర్మిష్ఠం జూచి దానికులగోత్రనామంబు లెఱుంగం గోరి మీ రెవ్వరివారలు వినవలతుం జెప్పుఁ డనిన దేవయాని యయాతిదిక్కుమొగం బై నేను శుక్రపుత్త్రికను దేవయాని యనుదాన న న్నెఱిఁగియుందు విది వృషపర్వునికూఁతురు శర్మిష్ఠ యనునది కారణాంతరంబున నా కిది కన్యాద్విసహస్రసమేత యై దాస్యంబు సేయుచుండు నని వానిం జూచి చూచి మానసంబున మరులు కొని యి ట్లనియె. 261

శా. నాపాలింటిశుభావహుండ వినుమా ♦ నాప్రార్థనావాక్య మా
కూపంబు న్వెలలించునాఁడ గ్రహము ♦ ఖ్యుం డర్కుఁడే సాక్షిగా
నాపాణిగ్రహణం బొనర్చితివి గా ♦ న భర్త వై తి దే
వా పెక్కేటికిఁ బెండ్లియాడి దయ దై ♦ వారం గటాక్షింపుమా. 262

వ. శర్మిష్ఠం దొట్టిపే రందఱును దేవకన్యలుం బోనివారు నా వెంటన వచ్చి నీకు దాస్యంబు సేయ నీవు దేవేంద్రవైభవం బనుభవింప వచ్చు ననిన నతం డనును. 263

క. క్షత్త్రియుఁడ నేను బ్రాహ్మణ, పుత్త్రిక వీ వెట్లు పెండ్లి ♦ పొసఁగెడు మనకుం
ధాత్త్రిం సంభృతధర్మ, క్షేత్త్రంబుగ నేలునేన ♦ చెడు టుచితంబే. 264

తే. కోపితుం డైనవిప్రుండు ♦ ఘోరదావ, వహ్నికంటె హాలాహల ♦ ప్రతతికంటె
సర్పవక్త్రకంటె దురాపుఁడెప్డు ♦ తపసుఁడు గానఁ, గడఁకఁ సకలప్రపంచంబు ♦ గాల్చివైచు.

వ. నీతండ్రి శుక్రాచార్యుండు ప్రళయాంతకప్రతిమానుం డతం డీధర్మవ్యతిక్రమంబు నెఱింగె నేని నన్ను నారాష్ట్రంబును భస్మావశేషంబు గావింపక పోనండు నావుడు దేవయాని యది యట్టుల యైన భార్గవుం డిది ధర్మావిరుద్ధం బని నన్ను నీ కిచ్చినపుడు పరిగ్రహింపు మని తత్క్షణంబ దైత్యాచార్యుని రావించుటయును. 266

తే. బ్రహ్మతేజంబు దిక్కులఁ ♦ బ్రబలుచుండ, భార్గవుం డటఁ జనుదెంచి ♦ ప్రతిగృహీత,
వందనార్ఘ్యావిధానుఁ డై ♦ నందనికడ, సర్వవృత్తాంతమును విని ♦ చనునదనున. 267

ఉ. నేర్పున దేవయాని గురు ♦ నిం గని యి ట్లను నాహుషుం డితం
డేర్పడ నాకరంబు గ్రహి ♦ యించెను దొల్లిట దాన నీకుఁ దై
పేర్పడ నట్టివీని విడి ♦ వేనిని గై కొనఁ బోవ నీతనిం
గూర్పవె నాకు ధర్మవిధిఁ ♦ గోరిక లీరిక లెత్త భర్తగన్. 268

వ. అనిన శుక్రాచార్యుండు నిజపాదాక్రాంతుం డై నిలిచియున్న యయాతిం జూచి యి ట్లనియె. 269

యయాతి దేవయానిం బెండ్లియాడుట.

ఉ. నాహుషరాజ నాసుతను నాఁ డలనూత వెలార్చునప్పుడే
బాహువు సాఁచి తత్కరముఁ బట్టితి కావున భర్త వైతి సం
దేహము లేదు ధర్మనిహతిం గలదోషము నో వరంబు హ్వా
ద్వాహము నీకు నిచ్చితిని దన్విని గైకొను ధర్మపత్నిగన్. 270

ఉ. ఎల్లలుగాఁ జతుర్వారిధు లీధర నేలెడుపుణ్యమూర్తి నా
కల్లుఁడు వచ్చె నాసుత మహావిభవంబున రాజపత్ని యై
యెల్లశుభంబులుం గొనెడు నేను గృతార్థుఁడ నో యయాతి యీ
పల్లవపాణిఁ జెల్లఁ గొలువం దగునీబిడఁ బెండ్లియాడుమా. 271

వ. అని దైత్యగురుండు వారి నొప్పించి వారి రువురకుం బరమోత్సవంబున వివాహంబు చేసి శర్మిష్ఠం జూపి యిది వృషపర్వునికూఁతురు దీనిని శయనమ్మునం దక్క తక్కుం గల సర్వవిషయంబులందు దేవయానిం బలెఁ జూచునది యని నానావిధ చీని-చీనాంబరాభరణాదు లరణంబు వెట్టి యంపిపుచ్చుటయు నతండు వారితో నిజపురంబు జరిగి దేవయాని నంతఃపురంబునందును దదనుమతంబున శర్మిష్ఠ నశోకవనికాసన్నగృహంబునందు నునిచి దేవయానితో నిచ్ఛావిహారంబులం దేలుచుం గ్రమంబున యదుతుర్వసు లనుకొడుకులం గనియె నంతఁ బెక్కువత్సరంబులకు యావనవతి యగుశర్మిష్ఠ ఋతుమతి యై యొక్కనాఁడు తనమనంబున.

మ. పడఁతు ల్వేలు భజింప రాజసుత నై పాలేటిరాచూలి నాఁ
బాసున్నం జెంది తలిర్చునేను నుడిగంపుందాసి నై యుంటి నా
సకుచుం బ్రాయము సోయగంబు సొగసుల్ భావంబు లావణ్యము
య్యడవిం గాచినవెన్నెలల్ గన పతిం బ్రాపింప కిట్లుండుటల్. 273

మ. విరిగా జవ్వన మెల్ల మారిపోసం విద్ధాత్మ నై నిచ్చలున్
బతిలేఁ ల్లలపోసి పోసి యొకతెం బల్యంకిభాగంబునన్
నతితాం బ్రశులు జాలువాజఁ బులకల్ చాలంగ రాలో దగుల్
మితిమీఱం గలవించుచున్ బ్రదుకు నె మ్మిన్నీడఁ గా వేఁగితిన్. 274

చ. ఉరగఁలుబ్రాతె నాలు మగఁ డొక్కటి నాఁ బెన వేసి కేఁబవల్
విరివిలుకానిపోరులచ వింద మిదీరఁగ నాని తేలుచుం
గరము కుమారులం గనిన కామినిజన్మమె జన్మ మన్న ని
స్సిగ్గొ మగమో మెఱుంగక కృశించెదు బానిస జన్మ మేటికిన్. 275

యయాతి శర్మిష్ఠం గలయుట.

వ. అని విరాళిం దురపిల్లుచున్నసమయంబున దానిపూర్వపుణ్యవశంబున నటకు యయాతి యుపవనదర్శనలాలసుం డై యొక్కరుండ వచ్చిన నెఱింగి శర్మిష్ఠ కరకమలంబులు మొగిచి యి ట్లనియె. 276

మ. జమునింటం గలవాని నైన జను లిచ్ఛం జూడఁగా నోపి యుం
స్రు మహారాజ భవద్గృహాంతరమునం దుం గల్గువామాక్షులన్
గ్రిమముం దప్పి కనంగఁ జాల రెవ రే కాలంబునం గాని ప్రా
ణము లాశించినవార యేని తలఁప న్నృత్యర్థికాలోపమా. 277

క. కులశీలరూపయౌవన, ముల నెప్పినదాన దోష ము లెఱుంగను నేఁ
దెలిసి నను నేలుకొనఁ దగుఁ, జెలిమిం గరుణాలవాల శ్రితజనపాలా. 278

క. నావొలికసానికి విభుఁ, డై యుండినవాఁడు నాకు నట్లన యగుఁ గా
దే యవనీశ్వర ననుఁ గరు, ణాయతమతిఁ బ్రోవ నలవ దా ఋతువేళన్. 279

ఉత్సాహము. అన యయాతి యనియె నీదు నంద మొప్పు చందముం
గని యెఱింగి యుంటిఁ గాని కావ్యుఁ డప్పుడు నీదుపా
త్తును బరిత్యజింపు మనఁడె తోయజాక్షి దాని కే
ననుమతించి యెట్లు బొంక నగును నాకుఁ జెప్పుమా. 280

తే. ప్రజలకుఁ బ్రమాణ మగురాజు పద్మనేత్రి
రాజు నగునేను సమయంబు రహిఁ జెడంగ
నడువఁ గాఁ జాల నర్థుల కడుగ నిచ్చు
వ్రతము విడ నోప నెట్లొకో నలయుఁ దెలియ. 281

వ. అనుటయు శర్మిష్ఠ యి ట్లనియె. 283

క. పరిహాసంబుల గోద్విజ, పరిరక్షణముల వివాహ వరగతుల సతీ
పరిహృతులఁ బ్రాణహతులన్, బొరిఁబొరి సత్యాపహరణ ముఁ బొంక నగున్.

వ. అని ధర్మశాస్త్రంబు గావున వివాహవిషయంబున నైన నసత్యదోషంబునం బొరయనేర దనిన నతండు నియ్యకొని దాని యభిమతంబు గాడఁ గూర్చి చనియె నంత శర్మిష్ఠ గర్భంబు దాల్చి. 284

క. కడు వేరు చేసి రనుచున్, బడిబడి నద్దేవయాని పడఁతు లడుగుడున్
వడి వచ్చి మహాముని యొక్కఁడు ఋతుమతి నన్నుఁ గలసి కలిగించెఁ గృపన్.

వ. అని పలుకుచుండునంతఁ గొంతకాలంబున కంజాతముఖి రాజీవనిభలోచనుం డగు నెక్కొడుకుం గాంచుటయు విని దేవయాని వానిఁ జూడ వచ్చి కామ

లుబ్ధవై వృజినం బి ట్లేల చేసి తని భర్జించి పలికిన శర్మిష్ఠ వినయంబు దోఁప
ని ట్లనియె. 286

తే. ఋషి యొకఁడు ధర్మవేత్త దా • నిటకు వచ్చి
కోరఁబడి నాకు వరమిచ్చె • కొడుకు నిచ్చెఁ
గామమునఁ జేసి యన్యాయ • కార్య మేను
జేసియుండను సత్యంబు • చెప్పితిఁ జుమి. 287

ఆ. అనిన దేవయాని • యను నాద్విజునిగోత్ర, నామముల నెఱుంగ • నాకు వాంఛ
గలదు నాఁగఁ దేజ • వలన నినుఁడుం బోలె, వెలుఁగు నతని సడుగ • వెఱచితి నమ.

వ. అని పలికిన విశ్వసించి దేవయాని నీకు శుభం బగుఁ గాత మని దీవించి గృహం
బరిగె నంత శర్మిష్ఠయు నారాజువలనఁ గ్రమక్రమంబునఁ మఱియు నిద్దఱఁ గొడు
కులం గనియె వారు మువ్వురును ద్రుహ్యాను పూరు లనం బరఁగి రపు డొక్క
నాఁ డ దేవయాని పతితో నుపవనంబునకు వచ్చి యట దేవరూపులై యాడు
కొనుచున్న కుమారులం జూచి విస్మయంబు నొంది పతితో ని ట్లనియె. 289

తే. దేవపుత్త్రోపములు వీరు • తేజరిల్లు, చున్నవారలు మువురు వీరు • గన్నవారొ
చెప్పుము నినుఁ బోలి యుండిరి • నృపవరేణ్య, బొంక బోకుండఁగఁ బోవక • పోలిపట్లు.

వ. అని యంతం బోక కుమారులం జేరఁ బిలిచి. 291

మ. తెలియం జెప్పుఁడు బిడ్డలార మిము న • ర్థిం గన్నవా రెవ్వరో
కుల మేదో స్థల మేదియో విపఁగ నా • కుం గోర్కె మో సెత్తె నాఁ
జెలివిం ద్రిజ్జని సాఁచి చూపిరి యయా • తి న్వారు శర్మిష్ఠ పే
రలె మాతండ్రియుఁ దల్లి యఁచు నెవ రూ • రం జేరి భాషించుచున్. 292

ఆ. అని యనంతలోన • నామువ్వురును వచ్చి, తండ్రిమీఁద బడిర • తండ్రి వారి
నాదరింపఁ డయ్యె • నా దేవయాని చెంగట మెలంగుచుండఁ • గరుణ విడిచి.

క. జనకుం డాదరియింపఁ, దనయులు కడు చిక్కఁ గొనుచుఁ • దల్లికడకు వే
చని వింతయుం గనుంగొని, తనమనమున నమ్మి శుక్రి • తనయ గనలుచున్. 294

వ. శర్మిష్ఠం జూచి యి ట్లనియె. 295

శా. ఓసీ దాసివి నీవు నావశమునం • దుం డిట్లు నా కెంత యే
దోసంబుం బొసఁగింపఁ జేసితి కదే • దుర్జాతివై గక్కసీ
కాసం బైనఁ దలంప వైతి ప్రభుతా • గర్వంబు ని న్వీడ దే
సీ సీ చీఁకటితప్పున న్వెలపు నీ • చిత్తంబునం దోఁపదో. 296

నెల సుద్దియగుమోము • చెలువంబుఁ దొలఁగింపఁ, గలమేటిముసతలు • దెళ్ళము లయ్యె

తే. నొసలు వడవడ వడఁకుచు • బడుగుపడియె, శిరము కరము కంపంబునఁ • దిరుగఁ జొచ్చె
మాట గాద్గదికంబున • మాటు వడియె, నరయనంత యయాతిక • చ్చెరువు దోఁప.

వ. ఇట్లు వృద్ధతముండై యయాతి శుక్రాచార్యుం జూచి యిట్లనియె. 306

ఆ. దేవయానియందుఁ • దీఱదు విషయేచ్ఛ, భోగతృప్తి గాన • భూసురేంద్ర
ముదిమి దాల్ప నోప • సదయుండవై ప్రసా, దమ్ము సేయనయ్య • తనయ నెంచి.

వ. అని ప్రార్థించినం బ్రసన్నుండై నేను మృషావాదిం గాఁ జాల నలయునేని నీముదిమి నీకొడుకులం దొకని కిడి వానిజవ్వనం బీవు గొని విషయతృప్తుండవై వానిజవ్వనంబు వాని కిమ్ము వాఁడె నీరాజ్యంబున కర్హుండును వంశకర్తయు నని కరుణించిన యయాతి దేవయానీసహితుండై నిజపురంబునకుం జని జ్యేష్ఠపుత్త్రుం డగు యదువుం బిలిచి యిట్లనియె. 308


యయాతి పుత్త్రులకు శాపంబిచ్చుట.

క. నా యీ వార్ధకముం గొని, నీయౌవన మిమ్ము నాకు • నెఱి వేయేఁడుల్
పోయిన వెండియు నిచ్చెదఁ, బాయని విషయేచ్ఛ గీఱఁ • బడ సుకుమారా. 309

ఆ. అనుచు యదువు నీకు • నగునయ్య యిట్లాడ, ఘోరజర భరించు • కొమ్మటంటి
పండ్లు చివ్రక వళులు • వాడెను మీసా ల్వెల్లఁ, బడఁగ వడఁక బడలు • నడఁగ లేను.

ఆ. నన్ను నొకని విడుము • నలువురుపుత్త్రులు, కలరు మఱియు నీకుఁ • దెలియ నడుగు
మన్నఁ డింటిఁ దనదు • జవ్వన మిడి నీదు, ముదిమిఁ గైకొనంగ • మదిఁ దలంచు.

తే. అనిన నలఁ డీవు నాహృద • యంబువలన, నయ్యు నాకోర్కె నెఱవేర్ప • వైతి కాన
నని నీవు నీసుతులు రా • జ్యార్హు లగుచు, నసము గొన కుండెదరు గాత • మని శపించి.

వ. తుర్వసుం బిలిచి తనమనంబు వెతెంగింపుటయు నతండును. 313

క. కామోపభోగతృప్తుఁడ, వై మెలఁగిన నీకె తృప్తి • యలవడ కున్నన్
గోముతుఁడ నే భరింపం, గా మతి సేయుదునె బుద్ధి • గప్పెడుముదిమిన్. 314

ఆ. అని యయాతి కోపంబ • వయ్యు నామాట పా, లింప వయితి కానఁ • బెంపు వీడి
నీవు ప్రజలు లేక • నిరతంబు పశుధర్మ, భూత మైన మ్లేచ్ఛ • జాతిఁ బడుము. 315

వ. అని శపించి ద్రుహ్యుం జేరి తొంటియట్ల చెప్పిన నతండును. 316

క. బలమున్ రూపము బుద్ధియుఁ, బలుకులవై భవముఁ జెఱచు • పాపపుజర నేఁ
దలఁ దాల్ప లే నజస్రము, పొలఁతుల భోగించుబుద్ధి • పోలే దింకన్. 317

వ. అనిన నీవు సామ్రాయుండవయి రథాశ్వగజగర్దభాదులం బాలించుచుంటయుఁ బల్లకు లెక్కుటలు లేక యెపుడు నుడుపల్లవసంతారులం గలసి యరాడభాజి యన విఖలుండ

వయియుంతు మని యనువుం బిలిచి తనమనోరథం బెఱింగించిన నతండును. 318

ఆ. ముసలి యైనవాఁడు • నిసువు వోలె సదన్న, మశుచి యగుచు భోజ • నాదికముల
నిత్యకర్మములను • నెఱపంగఁ జాలఁడు, గాన ముసలితనముఁ • బూన లేను. 319

వ. అనిన నీవు నీసంతానంబువారును గర్మత్యాగు లై ముదియునంతవఱకు నుండక జవ్వనంబునన చత్తురుగాక యని తిట్టి కడఁగొట్టుపట్టి యగుపూరుం జేరఁ బిలిచి యిట్లనియె.

మ. ప్రియపుత్త్రుండవు నీవు మేటి వగుచుం • జేకొందె యొత్తండ్రికో
ర్కియుతుం డై శిశుఖుండ వేఁ గావ్యుఁడు జరా • భారంబు పైఁ గప్పె వి
ప్రియమై తీఱదు భోగవాంఛ యది నా • వృద్ధత్వ మీ వూని నీ
ప్రియతారుణ్యము నాకు ని మ్మొసఁగెద • న్వేయేండ్లకు న్వాంఛయున్. 321

వ. అనినఁ బూరుం డిట్లనియె. 322

ఉ. తల్లిని దండ్రిని న్గొడుకు • దైవసమానులఁ గాఁ దలంచి వా
ర్వెల్లిరీతిఁ జెప్పినటు • చేయుట ధర్మువు గాన నగ్నిలోఁ
ద్రెళ్ళు మనంగఁ ద్రెళ్ళెద న • రిప్పితిఁ గూలు మనంగఁ గూలెదం
దెల్లముగా జరాభరము • నేఁ గొను టెంతటి దయ్య భూవరా. 323

తే. సాహసంయుక్త మగునదె • వార్ధకంబు, నేను గొందు నాజవ్వన • మీవు గొనుము
హృదయసంజనితేష్టము • లెల్లఁ దీఱ, విషయతృప్తుండ వగుము పృ • థ్వీశ తేజ. 324

క. అను నాహుషుండు వానిం, దనకౌఁగిటఁ గ్రుచ్చి యెత్తి • తనయుఁడ నావే
యని బుజ్జగించి నీవే, మనుజేంద్రుఁడ వగుదు వనుచు • మన్నించె నయన్. 325

వ. అని యుపలాలించి కావ్యుం దలంచి తత్ప్రభావంబునఁ దనముదిమి వాని కిచ్చి వాని
తారుణ్యంబు దాను బుచ్చుకొని. 326

సీ. తరుణవయస్కుఁ డై • తనరి యయాతి ధ, ర్మవిరుద్ధముగఁ గా • మాదు లందె
హవ్యకవ్యంబుల • నమరులఁ బితరులఁ, దనిపి యిష్టార్థముల్ • జనుల కొసఁగి
యన్నపానంబుల • నతిథుల నర్చించి, చారచోరుల పేరు • జగతిఁ బాపి
ప్రజల బిడ్డలఁ బోలెఁ • బరికించి మాటలఁ, బురుహూతుఁ డన నొప్పి • ధరణి నేలి

తే. నందనోద్యానవనభూమి • యందుఁ జైత్ర, రథమునందు సుమేరుభూ • మిధరశృంగ
మందు విశ్వాచి యనుసుర • సుందరాంగిఁ, గూడి క్రీడించి భోగి యై • నాఁడ నొప్పె.

వ. ఇట్లు వేయేండ్లు యథేష్టంబుగఁ గామోపభోగంబు లనుభవించి పరితృప్తిం జెంది యొక్కనాఁడు పూరుం బిలిచి యిట్లనియె. 328

చ. వినుము కుమార కామములు • వీఁగవు భోగము లేక నేఁటం
దనిసితిఁ గోఁడెకాఁడ నయి • తత్పరతారహితుండ నైతి నీ

క. సుజనులవాగాయుధములు, గజిబిజి యొనరించి పరునిఁ ॥ గాఱియ వెట్టుం
   ద్రిజగములందును నీవా, సుజనుల కెగ్గులు పొసర్పఁ ॥ జూడకు మెపుడున్. 349

ఆ. పూజ్యు లైనవారిఁ ॥ బూజింపు మల్లన, మాట లాడ నేలుఁగు ॥ మోటు నడవు
   నడకుఁ బోకు మిత్తు ॥ వే కాని యాచింప, కెంత లెంత లైన ॥ యేని తనయ. 350

వ. అని బోధించి యయాతి తాను దాపసపరివృతుండై తపోవనంబునకుఁ జనియె నంత.

తే. యదువునలన యాదవవంశ ॥ ముదయ మయ్యెఁ
   దుర్వసునివలన యవనుల్ ॥ ద్రుహ్యువలన
   భోజు లనువులన మ్లేచ్ఛ ॥ రాజు లైరి
   పౌరవాస్వయ మయ్యె న ॥ పూరువలన. 352

వ. అని చెప్పి వైశంపాయనుండు వెండియు. 353

క. ఓజనమేజయ నీ వెం, దై జయ మందితివొ పౌర ॥ వాన్వయ మిది సృ
   ష్ట్వజనులు వొగడ వేలెం, డ్లిజగతిఁ రాజ్య మేలు ॥ మెంతయుఁ బేర్మిన్. 354

వ. అవధరింపు మట్లు తపోవనం బరిగి యయాతి నిష్ఠాగరిష్ఠుండై నియమవ్రతంబులఁ గందమూలఫలాశనుండును శిలోంఛవృత్తిజీవనుండును నై వానప్రస్థాశ్రమవిధానం బున నగ్న్యారాధనంబు గావించుచుఁ బితృదేవతాతర్పణంబు లొనరించుచు నతిథి పూజలం జేయుచు నిట్లు వేయేండ్లు గడిపి. 355

సీ. అతఁడు ముప్పదియేఁడు ॥ లబ్భక్షుఁడై యుండి, నెఱి నొప్ప వాఙ్మనో ॥ నియతి దనర
   వాయుభక్షుం డయి ॥ వర్ష మొక్కం డొక్క, కడ నుండి తపియించెఁ ॥ గడఁకతోడఁ
   దనరి పంచాగ్నిమ ॥ ధ్యమున ఘోరతపంబు, సలిపె సంవత్సర ॥ మలయ కెపుడు
   నేకపాదస్థితుం ॥ డై కరునలి మొక్క, యాఱునెలల్ తప ॥ మారఁ జేసె

ఆ. నంతఁ దనయొనర్చి ॥ నట్టితపంబున, స్వర్గమొంది యచోటు ॥ సాధ్య సిద్ధ
   ఎను మరు త్సుపర్వ ॥ నరపూజితుం డయి, యధివసించె మిగుల ॥ నధికుఁ డగుచు.

వ. అట్లు దేవలోకంబున నుండి బ్రహ్మలోకంబునకుం జని యందు దీర్ఘకాల ముండి వెం డియు నొక్కయవసరంబున దివంబునకు నచ్చి యున్నప్పుడు దేవేంద్రుం డతని కిట్లనియె. 357


యయాతి నింద్రుండు స్వర్గభ్రష్టునిం జేయుట

శా. సన్యస్తుండవ వైయె సమస్తధరణీ ॥ సామ్రాజ్యభారంబునన్
   విన్యస్తనిత్రదీక్ష దక్షమతి వై ॥ వేయేండ్లు ఘోరాటవిన్
   వన్యేభప్రతిమానుఁడై విడక యే ॥ భాస్వత్తపం బానితో
   ధన్యాత్ముండవు దేవలోకములు సం ॥ దర్శింప నై తెన్నఁగన్. 358

వ. అనిన యయాతి గర్వించుచు వాని కిట్లనియె. 358

క. ఏమినచింతు సురేంద్రా, సామాన్యమె నాతపంబు సరిపోలం గా
మామనుజులు మీదివిజులు, నామునిముఖ్యులును జాల • రన నవసరమే. 360

వ. అని పలికిన నలుకమెయి నింద్రుండు నీవు తపోభిమానంబున మహామును లంతవారి నవమానించితివి కావునం బరిక్షీణపుణ్యుండ వైతి దేవలోకంబున నిక నుండ రాదన్యలోకంబునం బడు మనిన నావహుషుం డట్లయేని నన్ననుగ్రహించి సద్భవనంబునం బడ వరంబు ప్రసాదింపు మనిన నింద్రుం డట్ల యగుం గాత మీ వాసత్సంగతిం బడి యుండి వెండియు మే లందం గలవు పొమ్మని త్రోయుటయు నతండు సూర్యపథంబునుండి కసురయంబునం బడుచుండ నక్షత్రలోకంబున నివసించి యున్న రాజర్షివర్యులగు నష్టకాదు లగిసి సూర్యాగ్నిసదృశతేజోవిరాజమానుం డగునితం డిట్లేల నచ్చుచుండెనో యని వితర్కించుచు నభ్యుద్గతులై నీ వెవ్వండ వెం దుండి యిందుల కేమినిమిత్తంబున నచ్చుచుంటివి భయంబు దక్కి చెప్పు మని మఱియును. 366

క. స్వర్లోకంబున నుండిన, ముల్లోకము లేలునింద్రు • ముఖ్యుల భయముం
దెల్లముగ లేదు నీ కిటం, జెల్లెడిని బ్రతిష్ఠ నిజము • చెప్పం దలంపుమీ. 362

వ. అని నిసర్గస్నేహంబున నడిగిన నతండు వారి కిట్లనియె. 363

ఉ. ఏ నహుషాత్మజుండం గడు • నెన్నికం గంటి యయాతి నా ధరన్
న్మాసనసనాథుండనై యశము • నం జనుపూరుని గన్నవాండ నెం
తేనితపంబు చేసి చని • యింద్రముఖామరలోకముల్ మహా
మానులయంతవారి కవ • మానము గాం బచరించినందునన్. 364

క. దేవేంద్రుండు క్రుద్ధుండై, దేవర్షిపథంబులందుం • దిరుగుచు నుండన్
నీవు దగ వంచుం బలుకంగ, బోవుదు నేం గ్రింది కల్ప • పుణ్యుండనగుచున్. 365

తే. వయసునం జేసి నేం బెద్ద•వాండం గాన, వినతి మీ కొనర్పంగ లేదు•విద్యచేతం
దపముచేతం బుట్టుకచేతం•దగి యెవండు, పెద్ద యగు వాండె పూజ్యుండు•ద్విజులలోన.

తే. అనిన నష్టకుం డను వృద్ధుం • డైనమాత్రం, బెద్ద గాం జెప్ప నొప్పునే • పెద్ద యనంగ
నలరి పూజ్యుండౌ జదివిన•యట్టివాండు, తపము గావించినట్టిండు•ధరణియందు. 367

చ. అనిన యయాతి యి ట్లనియె • నార్య సమస్తము నస్తమై చెడున్
వినయము లేక గర్వమున • విక్కుడువానికిం గిల్బిషంబునన్
ఘనులనుం గల్గ దింతయు ను • గర్వము నే మును పుణ్యమూర్తినై
పొనరియుం గావరంబునను • బోకడం బెట్టితి నట్టిపుణ్యమున్. 368

నాయీనాదురదృష్టము విని, పాయనిగరువమున నుండు ♦ వాఁడైన వివే
కాయత్తచిత్తకమలుం, డై యెలమి గలాఁడ యగుచు♦నభినుతిఁ గాంచున్. 369

సీ. ధన మెంతయేనియు ♦ దక్షిణ గా నిచ్చి, వరయజ్ఞము లొనర్చి ♦ నఁజాలువాఁడు
నిపుణుఁ డౌ గురు నొద్ద♦నిఖిలవిద్యలయందు, నయమున శిక్షితుం ♦ డయినవాఁడు
సాంగవేదంబు ల♦ధ్యయనంబుఁ గావించి, జగము మిథ్య యటంచుఁ ♦జదువువాఁడు
శ్రమ కోర్చి సతతంబు♦సత్తపంబున మేను, శుష్కింపఁ జేయుచు ♦ సోలువాఁడు

తే. మది నలముకొన్న యజ్ఞానమదము లడఁచి, క్షణికమాత్రమయగునిహసౌఖ్యమెల్లఁ
దెగడి దేవలోకంబుల♦ తెరువు వట్టి, పోయి సుఖయించు నెప్పుడు♦పొసఁగ నచట.

మ. ధనమును విద్యయుం గలిగి ♦ తాన ఘనుండ నటంచు నెంచుచున్
ఘనులను జెంద నాఁకుటయె ♦ కాక ఖలుం డెద దైన్యముం గనుం
గాని వెలవండు సజ్జనుఁడు ♦ కొంత భయంపడుఁ బాపకార్యముం
బొనరుప దైవమే సతత ♦ ముం బలవంతము నా నెఱింగెడున్. 371

ఆ. కష్టసుఖము లెపుడుఁ ♦ గావడికుండలు, కష్ట మైనయపుడు ♦ నష్టిఁ గుంది
సుగమమైనయపుడుఁ♦దగఁబుష్టి మానొంది, కలఁగఁ డెపుడు సుజనుఁ♦డలరుచుండు.

ఆ. భయము లే దటంటి ♦ భయ మేమిటికి నాకు, దైవ మెట్లు చేయఁ♦దలఁచె నట్లు
నడచుఁ జేతబడిని ♦ నాకిమ్మునఁ నే, బద్ధుఁ డగుదుఁ గాని ♦ పార్థివేంద్ర. 373

వ. అనిన నష్టకుం డి ట్లనియె. 374

శా. క్షేత్రజ్ఞుండవు బోలె ధర్మములు సం ♦ క్షేపంబుఁ గా నెంతయోఁ
బ్రాప్తం బై తగురీతిఁ బల్కితివి సం ♦ భావించి మ మ్మెల్ల నో
క్షేత్రక్షత్త్రేశ్వర యెంతకాల మట నే ♦ చందంబునన్ గీర్తికిన్
బాత్రుం డై తివు దివ్యలోకముల నె ♦ ప్పం జెప్పు మిప్పట్టునన్. 375

వ. యయాతి యి ట్లనియె. 376

సీ. సార్వభౌముఁడనై ర ♦ సావలయం బేలి, యే నూర్ధ్వపదమున ♦ కేగి యచట
వేయివత్సరములు ♦ వేడుకమై నుండి, యవల దేవజగతి ♦ కరిగి యందు
శతయోజనాయత ♦ మతిరమణీయ మై, వేయిద్వారంబుల ♦ వెలయుచున్న
వృత్రారిపురమున ♦ వేయేండ్లు నివసించి, వెనుకఁ బితామహు ♦ పీఁడు నంది

తే. విశ్రుతానందమున నందు ♦ వేయియేండ్లు
నిలిచి వేలుపు లెల్లరుఁ ♦ గొలుచు చుండ
నిచ్చనచ్చినలోకము ♦ లేఁగి కంటి
దేవతాప్రభావము నంది ♦ తేజరిల్లి. 377

చ.*అనఁగి వియచ్చరుల్ గొలువ • నచ్చరచేడియలతోడఁ గూడి నం
దనవనసీమఁ జక్కనయి • తావి గుబుల్కొనఁ జేయుపూవులన్
దనరినపారిజాతముల • దాపునఁ గోరినరూప మొంది యే
పునఁ బదిలక్షలేండ్లు బలు • పోకలఁ బోవుచు నుంటి దంట నై. 378

వ. అట్లానందనవనంబునందుఁ బెద్దకాలం బానందంబున దగులు వడి యున్న నన్నుం జూచి దేవదూత యొక్కరుండు కినిసి చెడు మని ప్లుతోచ్చస్వరంబున మూఁడు మాఱు లుచ్చరించె దానం జేసి నేను బరిక్షీణపుణ్యుండనై యందుండి క్రిందికిం బడునంత నంతరిక్షచరులు నాకై జాలిం బడుచుండ విని నాకు సత్సంగతిం బడు తెరువు సూపుఁ డని యడిగిన వారు మీయజ్ఞభూమిం జెప్పిరేను ధూమాగ్రంబున హవిర్గంధంబు పట్టి యిది యజ్ఞభూమి యని నిర్ణయించుకొని వచ్చితి ననిన నష్టకుం డిట్లనియె. 379

క. కృతయుగమునందుఁ గలిగిన, క్షితిపతులం దెల్లఁ గీర్తిఁ • జెందినవీ వా
క్రతుభుజులలోక మందియు, క్షితిపై నిటు పడుట లేల • చెప్పుము దానిన్. 380

వ. అనిన యయాతి యిట్లనియె. 381

మ. ధనహీనుం డగువాని నీజగమునం • దాయాదుఁ డే నెయ్యుఁడేఁ
దనవాఁ డేని గణింపఁ డింతయు నెడం • దన్ మత్స్యు లెట్లగ్గి పోఁ
బొరింపం గమకింతు రట్లమరులున్ • బుణ్యంబు క్షీణించి పో
మనుజుం బట్టి పడంగఁ ద్రోతు రనుకం • పాశూన్యులై మిన్నునన్. 382

వ. అట్లు ద్రోయంబడినవా రెందుఁ బడి యెట్టివా రగుదు రని యడిగిన వానికి యయాతి వెండియు. 383

ఉత్సాహము.‡క్షీణపుణ్యుఁ డైనవాఁడు • చెన్నుఁ దఱిగి మాటికిన్
ప్రాఁకి పడఁగి వగచుకొంచుఁ • గాను నరక మట్టియుం
క్షోణితలమునందుఁ బడి ము • సుంగు వెట్టి క్రోష్టుపుల్
ద్రోణముల్ మొనంగ నైన • దొడ్డమేన నుండెనన్. 384

తే. అని యయాతి వచించిన • నష్టకుండు, కంకగోమాయుఖండిత • కాయము లయి
మరలఁ బుట్టఁగలుగుటయెట్లు మహీతలమున, నరక మెట్టిది తెలియనా • నతియొసఁగుము.

వ. అనుటయు నతండు. 386

తే. ఒడలు విడఁ గర్మవశమునఁ • బడసి మఱియు, క్షితితలంబునఁ జేసిన • చేతకుఁ దగ
ఫల మనుభవించుఁ బెక్కేండ్లు • తెలియలేక, జీవి నరకము నా నది • చెప్పఁ బడియె.

---

* అనఁగు=కలయు. ‡ ద్రోణము=మాలకాకి.

సావుడు నష్టకుండు నర ♦ నాథునిఁ గన్గొని యిట్లు వల్కె నో
దేవ ధరిత్రి నట్లు నడి ♦ తేజము దూలినజీవి నాశ మై
పోవక చచ్చి యుఁ మరలఁ ♦ బుట్టుట యెట్టిది గర్భజంతు వై
చేవ వహించు టెట్టియది ♦ చెప్పుము నాకు సవిస్తరంబు గన్. 338

చ. అనుడు యయాతి ప్రాణముల ♦ నందినపువ్వులుఁ బండ్లుఁ గాయలున్
దిన నగునట్లు పూరుషుని ♦ దేహమునం దొగి మూఁటి పేర్కొ మై
చని ఋతుకాలమందు నది ♦ చానలశోణితమందు గర్భ మై
పౌన రెడు గర్భవాయుగతిఁ ♦ బొందుచుఁ దన్మృదులాశయంబునన్. 389

క. అందున్న గర్భమునకున్, బొందుగ సూక్ష్మాంగకములు ♦ పుట్టియు వాయు
స్పందమున నాఁడునాఁటికి, మందముమందము ప్రవర్ధ ♦ మానంబు లగున్. 390

తే. శుక్ర మెచ్చైనఁ బురుషుఁ డౌ ♦ శోణితంబు
హెచ్చయిన స్త్రీ యగున్ రెండు ♦ నెసకమెసఁగ
సమత నొంద నపుంసకుం ♦ డమరు శుక్ల
భిన్నమునఁ జేసి కవ లౌచుఁ ♦ బేర్మిఁ గంద్రు. 391

తే. అట్లు విగ్రహ మగుగర్భ ♦ మంత మర్త్యుఁ
డగుచు జనియించి శ్రుతి శబ్ద ♦ మక్షి రూప
మును రసన రసమును ఘ్రాణ ♦ మును గంధ
మంగిమున స్పర్శ మెద భావ ♦ మరసికొనును. 392

వ. అనవుడు మృతుం డయిన మనుష్యుండు దహింపంబడి వినాశనం బందు నట్టివాఁడు
త న్నెట్లు తెలిసికొనం గలుగు ననిన వెండియు. 393

తే. ప్రాణ మేగిన దేహంబు ♦ వదలి దేహి, పుణ్యమో పాపమో తన ♦ ము న్నిడికొని
శ్వసనమార్గానుసారి యై ♦ చని వసించు,నితరగర్భమునం దని ♦ యెఱుఁగు మనఘ.

వ. పుణ్యంబునం జేసి దేవాదిపుణ్యజన్మంబును పాపంబునం జేసి క్రిమికీటాదిపాపజన్మం
బునుం బొందఁ గలుగు ననిన నతండు మనుష్యుం డెద్దాన నుత్తమలోకంబులం
బడయుఁ జెప్పు మనిన నాహుషుండు. 395

చ. శమము దమంబు శ్రద్ధయును ♦ సత్యము దానమునుం దపంబు భూ
తములయెడం దయారస మె ♦ దం గలయుత్తముఁ డొన్న నుత్తమో
త్తమముల నూర్ధ్వలోకములఁ ♦ దాఁ గొను నెప్పుడు మేటి యంచు గ
ర్వము పడువాఁ డధోగతికిఁ ♦ బొల్పడి యుండు నటంచు నెంచుమా. 396

చ. చదివితి విత్తముం గలదు ♦ సత్కులమందు జనించితిన్ శుభ
ప్రద మగుకీర్తిఁ గంటి ననుఁ ♦ బార్థివు లెల్లరు గౌరవింతు రం

చెప గరువంబునం బరుల • కింత వమానము గల్గఁ జేసెనే
నది జగ మంత యై నరుస • కాపద గూరుచు నిందు నందు నుఁ. 397

క. మెప్పులకుఁ జేయుదానం, బెప్పుడు నిష్ఫలమ యగుచు • నీలోకమునం
జెప్పఁ బడుఁ గాన వానికిఁ, గొప్పతనం బిహము పరముఁ • గూడ నశించున్. 398

తే. సర్వసంగంబులను రోసి • శాంతుఁ డగుచు, భావమున నిర్మలంబగు • బ్రహ్మమరయు
జనుఁడు మేన్యాసి యాబ్రహ్మ • మునను గలసి, శాశ్వతానందనిర్వాణ • సౌఖ్యమొందు

వ. అంత నష్టకుం డాశ్రమచతుష్టయం బెట్లనుష్ఠింపవలయు నెఱంగింపు మనిన యయా
తి యు. 400

తే. గురువునకు మున్న లేచి యు • గురునిపనులు, చెప్పకయమున్న చేసియుఁ • జెప్పినట్లు
చదివియును నింద్రియంబుల • సతము గెలిచి, యుండఁ దగు బ్రహ్మచారి మే • లొందనెంచి

క. తగినవిధంబునఁ బడసిన, దగుధనమునఁ బేర్మి దాన • యజ్ఞాదు లొగిన్
దగిలి పొనరించి సంతృ, ప్తిగ నతిథులఁ గొలిచి గేస్తు • విఖ్యాతిఁ గొనున్. 402

తే. మునియు వనవాసి యై పాప • మునఁ దొలంగి, యుంఛవృత్తిని జీవించు • చుండి పరుల
నడుగ కాహారనియమంబు • నంది యున్న, సిద్ధి నొందు వానప్రస్థుఁ • డిద్ధరిత్రి. 403

తే. సర్వసంగపరిత్యాగి • సర్వసముఁడు, సకునిగ్రహమున నొంటి • సఖిలదేశ
ములఁ దిరుగువాఁడు భిక్షాన్న • మున శరీర, యాత్ర నడుపువాఁ డెసఁగుస • న్యాసియనఁగ.

వ. ఆసన్న్యాసంబును గుటీచక బహూదక హంస పరమహంస లన నాల్గుతెఱంగులు త్రిషవణస్నానంబును జతుర్థయామభైక్షాశనంబునుం జేయుచుఁ బుత్త్రమిత్త్రాదిమైత్త్రిం దవిలి యుండుద్విజుండు కుటీచకుండు కర్మశ్రద్ధాపరుండు బహూదకుండు సంయతాత్ముండు హంస పెన్న యయినం బెద్ద యయిన విరక్తుండు పరమహంస త్రిదండభిక్షాపాత్రశిక్యకమండలుధర్మపవిత్త్రంబు లైదును గుటీచకబహూదకులు ధరించి గాయత్త్రియుఁ బ్రణవంబును నష్టాక్షరియు జపియింప వలయుఁ ద్రిషవణస్నానంబులు హంసపరమహంసలకుం గర్తవ్యంబులు కుటీచకుండు నిందాస్తుతులం బలుకక యేకాంతంబున నష్టాంగయోగనిరతుండును జతుర్థయామభైక్షాశనుండు నై పుత్త్రగృహంబున నైన నిలువ నగు బహూదకుండు నిస్సంగుం డై యొకచోటన నిలిచి యుండక కుటీచకధర్మంబుల నెల్ల నాచరించునది హంస యేకదండవిధానంబు శిఖామాత్రవిహీనుం డై బహూదకసమధర్మంబుల శుచి యై సర్వభూతసముం డగునది పరమహంస శిఖాయజ్ఞోపవీత వివిహీనుం డై దండమాత్రధారి యై కర్మముల తెరువుఁ బోక విరక్తుం డై యుండునది జ్ఞానంబునం గాని కైవల్యప్రాప్తి లేదు గావున సన్న్యస్తుండు

జ్ఞానంబు సంపాదించునది ప్రాణంబు జపించుచుండునది కాని చో బతితుం డగు నని యెఱుంగునది. 405

చ. అని వచియించి నాహుషుం డ ♦ నంతజనంబున గ్రిందికిం బడన్
జనుటయు నష్టకుండు గని ♦ సర్వరుచిం డయ్యెద వేటి కొండు కో
టారుననో నీకుం బోవ దగు ♦ యుండిన దెక్కడ నేని చెప్పు మో
జనునా నా నతం డతని ♦ సన్నిధికిం జనుదెంచి యిట్లనున్. 406

తే. ఏ బరితోషంపుణ్యుండ ♦ నిద్ధరిత్రి, నరకమునం గూలం బడుచుంటి ♦ నన్ను లోక
పాలు రదె వేగిరింపుచు ♦ జాలి పెట్టు, మండి రస నష్టకుండను పడ ♦ సుండు మనుచు 407

వ. నా కూర్ధ్వలోకంబు లెన్ని గలవు నున్న వని విని యున్నవాడ నవి యన్నియు నే నిచ్చె నీకు దానంబు చేయుచుంటి నీవు తత్ప్రభావంబునం జేసి పడకుండు మనిన యయాతి యి ట్లనియె. 408

చ. ధరణీసురుండు గాక మఱి ♦ దానము గైకొన బ్రహ్మవేత్తనై
పరంగను గాని పార్థివుండ ♦ పాత్రుండు గాండు నరేంద్ర మున్ను నే
సురలకుం బోనివిప్రులకుం ♦ జూచి యొసంగితి నేనవేలు మా
వరనులమం దనుశ్రుతము ♦ నచ్చెడుధర్మము దాంట నేర్తునే. 409

వ. అంతం బ్రతర్దనుండు యయాతిం జూచి నాకుం గలలోకంబు లెల్ల నీ కొసంగితి వానిం గొని పడకుండు మని యొసంగు వెండియు. 410

మత్తకోకిలము. నిన్నుం బోలిన రాజ నైన యిట్టు ♦ నీదుపుణ్యఫలంబులం
గొన్న నిందున్నడె నొడుం గా నిది ♦ కూడ దెప్పటి కిట్లు నీ
కున్న నుండిన నుంగుం గావుత ♦ మొప్పు దానిక నెట్టిదున్
బున్న మేదినియు పాప మేదినియు ♦ పోలం జూచి పొసర్ప నా. 411

వ. అంత వసుమంతుండు యయాతిం గని నే నుషదశ్వునిపుత్త్రుండ వసుమంతుం డను వాండ నాలోకంబు లెల్ల నీ కొసంగితి దానంబు పరిగ్రహింప నిష్టంబు గా దేని నా కొకతృణమాత్రం బిచ్చి పుచ్చుకొమ్మని పలికెను. 412

క. విను నే నధర్మకృతికిన్, మనమున శంకింతు నిట్లు ♦ మతి చెడి కొనుటన్
జననాథ చనునె శిశు న, య్యనుచు నే నిట్టు చేసి యెఱుంగ ♦ నొక్కపుడేనిన్. 413

వ. అంత శిబి యనురాజేంద్రుం డతనిం గని నే నుశీనరునిపుత్త్రుండ శిబి యనువాండ నీకు దానక్రయంబు లిష్టంబులు కావ యేని నాలోకంబులు నీ కూరక యిచ్చితిం బుచ్చుకొను మనిన నాహుషుం డను. 414

చ. అవి మనకై సమాగతము ♦ లైనవిమానము లెన్ని నింకమీ
రవభృథ మాచరింపు డను ♦ రయంబున బోవుద మంచు దెల్పినం
బ్రవిమలచిత్తులై క్రతువు ♦ మాప్తి నొనర్చిరి భూరిదక్షిణల్
భువి గలవిప్రకోటులకు ♦ బోల నపూర్వముగా నొసంగుచున్. 425

వ. అనంతరంబ. 426

ఉ. పాత్రులు నాహుషుండు నిజ ♦ భాగ్యవశంబున జేసి యట్లు దౌ
హిత్రులసంగతిం దనక ♦ హీన మహత్త్వము రాగ వారితో
మిత్రసమద్యుతి న్మెఱయు ♦ మేల్మివిమానము నెక్కి దిక్కులన్
గాత్రరుచుల్ వెలుంగ జనె ♦ క్ష్మాతలమున్ విడి స్వర్గధామమున్. 427

వ. ఇది యయాతిపవిత్రచరిత్రం బనిన విని నైమిశారణ్యవాసు లవ్వలివృత్తాంతంబు సెప్పు మని సూతు నడుగుటయును. 428

ఆ శ్వా సాం త ము .

మ. ఇలపై జేసినకర్మలేశమున గో ♦ న్నేం డూర్ధ్వలోకంబులన్
ఫలముం బొంది జనుండు వెండియు నిలన్ ♦ బ్రాపించి ప్రాపంచికం
బులు గష్టంబుల డిందు నందు నటు లై ♦ పుట్టున్ నాకు రానీక నీ
విలసద్రూప మొసంగి ప్రోవవె దయన్ ♦ వీక్షించి విశ్వేశ్వరా. 429

గద్యము. ఇది శ్రీమదధునాతనోభయకవిమిత్ర వేంకటయజ్వాగ్రపుత్త్ర
సమారాధితవిబుధరాజ శ్రీపాదకృష్ణమూర్తి కవిరాజ
ప్రణీతం బయిన శ్రీకృష్ణభారతంబునం
దాదిపర్వంబునం జతుర్థాశ్వాసము.
శ్రీ. శ్రీ. శ్రీ.



శ్రీ

శ్రీబాలాత్రిపురసుందర్యై నమః.

# శ్రీకృష్ణభారతము

ఆదిపర్వము—పంచమాశ్వాసము.



పాదాబ్జచితివిశే
షాపాదితలోకవిస్మయ ◆ శ్యామలజనక
శ్రీపావనవంశవ్యక్త
శ్రీపదరత్నాధికార ◆ శ్రీపరమేశా. 1

పూరువంశక్రమము.

వ. అక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లనియె నిట్లు యయాతి స్వర్గంబునకు నిర్గమించె నని చెప్పిన విని జనమేజయుండు వైశంపాయనుం జూచి. 2

చ. విను నలతుఁడు మహీశుఁ డయి ◆ విశ్రుతి గాంచి పూరువంశ్వయం
బున మొగి వంశకర్తలయి ◆ పొంపిరివోయిన వైభవంబునన్
గొనరిన మత్పితామహుల ◆ పూర్వచరిత్రము చెప్పవే యనన్
మునివృషభుండు వాని కను ◆ మోదము మూదలకొల్పి పల్కెఁగన్. 3

క. పౌరవవంశవిభూషణ, పూరుఁడు యయాతి యట్లు ◆ భూపతి యగుచున్
సాంమతి రాజ్య మేలెను, పౌరవవంశంబు వాని ◆ వలనం బొడమెన్. 4

వ. తద్వృత్తాంతంబుఁ జెప్పెద నాకర్ణింపుము. 5

మ. సురనాథుం బురుడించు వైభవమునన్ ◆ శోత్రిల్లి పూరుండు మున్
ధరణీంద్రుండయి తండ్రిఁ బోలి గిరమా ◆ దక్షత్వముం గాంచియుం
దరుదారంగిఁ బ్రవీరుఁ డీశ్వరుఁడు రౌ ◆ ద్రాశ్వుండు నా నొప్పను
వ్వగు సత్పుత్త్రులఁ గాంచె నందు మునుఁ డై ◆ వాల్చెం బ్రవీరుం డిలన్. 6

వ. ఆప్రవీరునకు శౌరసేనియందు మనస్యుండు పుట్టె వానికి సౌవీరియందు శక్తుండు సంహననుండు వాగ్మి యనుమువ్వురు పుట్టిరి రౌద్రాశ్వునకు మిశ్రకేశి యను నప్సరసయందు ఋచేయ్వానుప్రభృతులు పదుగురుపుట్టిరి ఋచేయుఁ డక్షేయుఁడు కృకణేయుఁడు స్థండిలేయుండు వినేయుఁడు జలేయుఁడు తేజేయుఁడు సత్యేయుఁడు ధర్మేయుఁడు సన్నతేయుఁడు నాఁ బడిరి అందు ఋచేయ్వానుఁ డనాధృష్టి యనం బరఁగుచుండు. 7

క. దివి నమరేంద్రుని తెఱఁగున, భువి మనుజేంద్రుండు లోక • పూజితుఁ డగుచున్
దవిలి జగ మేలె విద్వ, త్ప్రవరుఁడు సుజనుండు వీర్య • వంతుం డగుటన్. 8

వ. అయ్యనాధృష్టికి మతినారుండు పుట్టె. 9

ఆ. అతఁడు రాజసూయ • మశ్వమేధముఁ గోలెఁ, గ్రతువు లెన్నియేని • గడఁకఁ జేసి
పరమధార్మికుండు • సురరాజతుల్యుండు, నాఁ బ్రశస్తికెక్కె • నాల్గుకడల. 10

వ. అమ్మతినారునకుఁ దసుండు మహానుండు సతిరథుండు ద్రుహ్యుండు ననునలువురు పుత్త్రులు పుట్టి రందుఁ దసుండు రాజై ప్రసిద్ధి వహించి కాళింగియందు నీలినుండను వానిం గనియె నతనికి రథంతరియందు దుష్యంతుండు శూరుండు భీముండు ప్రవసుండు వసు వను నేవురు పుట్టి రందు దుష్యంతుండు సార్వభౌముండై గండు మిగిలి లక్షణ యనుదానియందు జనమేజయుం డనువాని శకుంతల యనుదానియందు భరతుం డనువానిం గనియె నాభరతునివలన భారతవంశం బభ్యుదయంబు నొందె ననిన జనమేజయుండు. 11

తే. మాకులోన్నతి కాకరం • బై కరంబు, దనరు భరతుని జన్మంబు • వినఁగ నిచ్చ
గలిగెఁ దన్మూల మగుశకుం • తలచరిత్రిఁ, దెలియ నాసతి యీయవే • సలలితాత్మ.

వ. అనిన వైశంపాయనుం డిట్లనియె. 13

దుష్యంతునిచరిత్రము.

మ. కురువంశాభరణాయమానుఁ డయి పే • ర్కొ నొప్పి దుష్యంతభూ
వరుఁ డోజోజితభాస్కరుం డగుచు దీ • వ్యద్బాహువీర్యంబునం
బరిపంథిక్షితినాథులం గెలిచి తే • వన్ సర్వసర్వంసహన్
బరిపాలించె నిరీతిగా నిఖిలధ • ర్మంబుల్ ప్రవర్తిల్లఁ గన్. 14

మ. చతురంభోధిపరీతభూవలయ మా • క్షత్రాన్వయోత్తంసుఁ డు
న్నతిఁ బాలింపఁగ వర్ణసంకరకరుల్ • నష్టోన్నతాచారులుం
గృతపాపుల్ గతపుణ్యులుం గలుగ రొ • క్కంతే నధర్మం బిలా
గత మై కానఁగ రాదు ధర్మమయ మై • కన్పట్టు నెప్పట్టునన్. 15

క. ధనధాన్యసమృద్ధము లై, జనపదములు సర్వసౌఖ్య • సమధిగతము లై
కనుఁగొనఁగ సొమ్యె దుష్యం, తనరేంద్రుఁడు రాజ్య మేలి • తనరెడువేళన్. 16

ఆ. జారచోరభయము • క్షామడాంబరభయం, బెఱుఁగ రవనిలోన • నెల్లప్రజలు
ధర్మనిరతు లగుచుఁ • దనరి రా దుష్యంత, చక్రవర్తి రాజ్య • శాసనమున. 17

వ. అట్లు ధర్మపరిపాలనంబున జగంబు ప్రవర్తించు చున్నసమయంబున. 18

మ. ఒకనాఁ డమ్మహీవల్లభుండు మృగయా ♦ ప్రోల్లాస మేపారఁ గా
లికనివ్వీఁగనివేగముం గలుగుబ ♦ ల్తేజీలతేరెక్కి తె
క్కొను నావేఁటకు లేగుదేఁ బలువురుం ♦ గట్టాయితంబై మహో
త్సుకతం గానకు నేఁగి పెన్మెకములన్ ♦ శోధించి వేధించుచున్. 19

మ. బలుతాఁ జాపముగఁ బీటవెట్ట నుసిఁగా ♦ ల్పన్ సింగముల్ బోనిగా
గిలపుంగుక్కలు రెంపు రెంపుకడలం ♦ గీటెట్టుచుం బట్ట గా
సలకంతే సనకాశ మీక కడిమి ♦ న్సవ్వించు చెవ్వారి కిం
జల మెక్కించెడుపంది దూఁటగతుఁడై ♦ చానేసె తాఁ డమ్మునన్. 20

క. వెడవేటుం బడి కోల్పులి, వడిఁ గాం డ్రపి పాఱె యొకనిఁ ♦ బట్టుడుఁ గని వ్రే
ల్మిడిఁ జని వీఁకం బెబ్బులి, నడిదంబున నడిచె నొడయఁ ♦ డాగా యనఁగన్. 21

క. ఆఁకొన్నసింగ మొక్కఁడు, వీఁకం బతిమీఁదఁ బడుడు ♦ విచ్చింగత్తిన్
లోకులు మెచ్చఁగ దానిం, దేఁకువ జెడఁ గోసె నొడలు ♦ తిలలంతలుగన్. 22

క.*మెఱచఱచి పఱచుమృగముల, నఱిముఱిఁ బేరెములు వాఱు ♦ నట్టిమృగములం
గఱకఱిఁ గవిసినమృగముల, మెఱిసె విభుం డడవి శౌర్య ♦ మృగముగఁ జేసెన్. 23

వ. ఇట్లు వివిధమృగంబుల సంహరించుచుఁ బత్త్రిసంగంబున నాతండు పదాతులం దలఁ
డచి రథవేగంబునం గడుదవ్వు వోయి ముందట. 24

కణ్వాశ్రమవర్ణనము.

మ. కనియెన్ సర్వమహీశ్వరేశ్వరుఁడు వే ♦ డ్క న్మాలతీతీరమం
దనఘాచారమునీంద్రహోమాహుతిగం ♦ ధాకీర్ణదిక్కూలమున్
వినివృత్తోస్త్రగేయతివైరిము జగ ♦ ద్విఖ్యాతసద్వారమున్
ఘనమాహాత్మ్యవిహారి ముగ్రిభవనం ♦ తారమ్ముఁ గాంతారమున్. 25

క. కని తదనుభావమునకున్, మనమున హర్షించి మించి ♦ మనుజేశ్వరుఁ డ
వ్వనముదరి నింత మసలెం, గనుఁగవనుం బండు వైన ♦ కరణిఁ దలఁపమున్. 26

చ. అలసి నిజాశ్రమంబునకు ♦ నైన మహీపతి కెల్లభూజముల్
చలువల నీనునీడ లిడఁ ♦ జల్లనిగాలి పథిశ్రమంబు వోఁ
జలిపె వనప్రియాళి తగు ♦ స్వాగతము ల్పచరించెఁ జల్కులుం
దెలియఁ బ్రియోక్తు లాడె నతి ♦ థిన్ గృహభర్తలు నోలెఁ గీరిమె. 27

చ. అలరులతాపురంధ్రులు శు ♦ భావహ మావిధి నొందఁ గోరుభూ
తలపతికిన్ శినం బొసరఁ ♦ దద్దయు సేసలు చల్లెనో యనన్

* మెఱుకు=నిర్మూలముచేయు.

శిష్యు ల్గొల్వఁగ నున్నకణ్వమునులన్ ♦ సేవించి పో నిమ్మహా
ఋష్యావాసముఁ జేరితిం దరుణి వా ♦ రెం దేగిరో చెప్పవే. 48

ఉ. నావుడు నావరాంగన మ ♦ నంబున మెచ్చుచు నిట్లు పల్కె నో
దేవ మహాప్రభావ విను ♦ దేవసదృక్షుఁడు నాదుతండ్రి తాఁ
బూవులుఁ బండ్లుఁ దేర నన ♦ భూమికి నేగె క్షణంబు వేచి తే
నీ విట సత్కృతిన్ గనరు ♦ నింపుగఁ గల్గెద వంచుఁ బల్కినన్. 49

ఉ. కాశ్యపు లింట లేమి విని ♦ కన్నియమిన్నను గన్నులార నా
కాశ్యపవల్లభుండు గని ♦ కంజముఁ బోలెడుదానిమోమునున్
వశ్యమహౌషధం బనఁగ ♦ వచ్చెడుదానికడానిమేను ని
ర్దైశ్యము గానిప్రేముడి మ ♦ దిం గలఁగింపఁగ దాని కిట్లనున్. 50

క. ఎవ్వరికూఁతుర వెవ్వతె,వివ్వనమున కేల వచ్చి ♦ తీసోయగమున్
జవ్వనము నీకుఁబుచ్చెను,నివ్వృత్తాంతంబు వినఁగ ♦ నిష్టము మాకున్. 51

క. ఇనుమును నయస్కాంతముబలెఁ, గనుఁగొనిన నీదుమేను ♦ కంజదళాక్షీ
నను గరఁచి నాదుహృదయం,బును నాకర్షించెఁ జెప్పు ♦ ము భవద్విధమున్. 52

క. అనవుడుఁ గియ్యనివచనరి,చపల శకుంతల వచించె ♦ జగతీనాథా
మునివంద్యుఁడు కణ్వమహా,మునికన్య శకుంతలాఖ్యఁ ♦ బొనరినదానన్. 53

వ. అనుటయు నతండు తనమనంబున.. 54

చ. మునిసుత నే నటం చిది న ♦ ముత్సుకతం దలంచె న్నిజంబుగా
మునిసుత యేని నామనము ♦ పోవఁగ నేటికి దీనిపైఁ బరాం
గనపయిఁ గాక యిట్టిమతి ♦ కన్నియపై మదిఁ జూపి పాపి నై
తినె యిట సందియం బడఁగఁ ♦ దెల్పెదనో యని దాని కిట్లనున్. 55

క. భగవంతుఁ డూర్ధ్వరేతసుఁ,డగుకణ్వున కెట్లు కూఁతు ♦ వైతివొ కదవే
తెగి తనువు చెడిన వ్రతముం,దగవిడువఁ డతండు నిజము ♦ దెలుపుము తరుణీ. 56

వ. అని యడుగుటయు నమ్మగువ మొగమ్మునఁ జిఱునగవు మొలక లెత్త మెత్తన
నిట్లనియె. 57

శకుంతలావృత్తాంతము.

ఆ. మనుజనాథ యొక్క ♦ మునినాథుఁ డొక్క నాఁ,డరుగుదెంచి నన్ను ♦ నరసి దీని
పుట్టు వెట్లు నీకుఁ ♦ బుత్రిక యగు టెట్లు, చెప్పు మనుచుఁ దండ్రిఁ ♦ జేరి యడిగె. 58

వ. అడిగిన వాని కక్కాశ్యపులు చెప్పినచొప్పు చెప్పెద నవధరింపుము. 59

సీ. సృష్టికిఁ బ్రతిసృష్టి • చేసి బ్రహ్మర్షి యై, కౌశికుండు తపించు • కాలమందు
దేవేంద్రుఁ డెంతయు • దేవురించుచు వాని, తపమునఁ దనలక్ష్మి • తలఁగు ననుచు
నప్సరోగణముల • సత్యభిఖ్యను గొన్న, మేనక యనియెడు • దానిఁ బిలిచి
వినుము విశ్వామిత్రుఁ • డనువాని కనుఘోర, తపము చేయుచు నుండె • నిపుడు వింటె

ఆ. నీవు వోయి వాని • నేమంబు సెడ మోహ, పాశబద్ధుఁ డగుచు • బడలుపడఁగఁ
జేసి రమ్ము నాకుఁ • జింత దీర్పు మనంగ, నులికి పడుచుఁ బడుచు • పలికె నిట్లు. 60

శా. విశ్వామిత్రుఁ డమర్షవర్షితమహా • విఖ్యాతికిం బాత్రుఁ డై
విశ్వామిత్రుఁడు వీతిహోత్రుఁ డగుచున్ • వీర్యంబునం దోఁగి యీ
విశ్వం బెల్ల నడంపఁ జాలు నతనిన్ • వీక్షింప నాయట్టికే
నిశ్వాసంబు నిగుడ్చు రన్న నలఁతిన్ • నే నెంత వృత్రాంతకా. 61

సీ. ఎవ్వాఁడు రాజయ్యు • నిద్ధతపంబున, బ్రహ్మర్షి యై మహా • ప్రతిభఁ గాంచె
నెవ్వాఁడు కొడుకుల • నెల్లఁ గూల్చి వసిష్ఠు, సతతంబుఁ బగ వట్టి • కుతిలఁ గుడిపె
నెవ్వాఁడు తన పేర • నెపుడు నిండినపుణ్య, తర నది ధరఁ బుట్టి • ప్రసరఁ జేసె
నెవ్వాఁడు చుక్కల • నెదురఁ బ్రతిశ్రవణముఁ దొట్టిరెక్కల • గుమి నొనర్చె

తే. నెవ్వఁడు స్వర్గచ్యుతుం డగు • నెడఁ ద్రిశంకు, నిలిపెఁ బడకుండ మఱి పల్కి • నింగి నొక్క
స్వర్గము రచించి తనమహా • త్త్వంబువలన, నతఁడు సామాన్యుఁడె త్రిలో • కాధినాథ.

చ. మునికృతశాపదగ్ధుఁ డని • మున్ను త్రిశంకు నిరాకరించి నీ
వును నినుఁ బోలు నిత్రిదశ • పుంగవులుం గన గాధిపట్టికిన్
మనమున జంకి కొంక కల • మాలసవంబున సోమపానముం
బొనరిచి వచ్చినారు కద • పో సుతపోధనుఁ డాతఁ డల్పుఁడే. 63

ఉ. అట్టిమహాతపస్వి మది • కాగ్రహ మింత తగు నేని లోకముల్
మట్టుపడన్ దహించెడి న • మస్తదిశావలయంబుఁ ద్రిప్పెడిన్
మెట్టి యడంచెడిన్ ధరణి • మేరువు గోటను జిమ్మివై చెడిన్
గట్టెడిఁ జంద్రసూర్యులను • సింధుల నన్నిటి నింకఁ బెట్టెడిన్. 64

చ. ఎరగలియే మొగంబు యముఁ • డే నెఱనాలుక చంద్రసూర్యులే
పరుసనికన్ను గ్రుడ్డు లయి • పర్వ వెలింగెడువానిచారలోఁ
జొరఁబడ మృత్యుదేవతయు • సోముఁడు భీముఁడు గోలె నెల్లరున్
నిరతము పిచ్చలింతు రన • నే నవలా నొకలెక్కదాననే. 65

వ. అయినను దేవరాజశాసనంబు గావునం బోయి వచ్చెదం గాని నాకు మలయానిల
కంతువసంతాదులు తోడు గావలయు ననిన నింద్రుం డట్ల యగుం గాక యని వా

రిం దోడిచ్చి దాని వీడుకొలిపి యదియు నెదియుం బలుక కనిపించుకొని పయనంబై విశ్వామిత్రాశ్రమంబునకు వచ్చి యచ్చటఁ బరమతపం బున్నవానిం జూచి నమస్కరించి తత్సన్నిధానంబున. 66

ఉ. యెల్లెన నందియల్ మొరయఁ గా నిల మెట్టుచు నల్లనల్లఁ బెం
పుల్లసిలంగఁ గోయిలవలె హూయనామముం దలఁపించి పాడుచున్
మెల్లనఁ దీఁగెఁ జొంపముల మే సమరించుచుఁ బూలు గోయుచుం
జల్లనిపూట లాడుచును సాగెఁ గోరిక నాట నాడుచున్. 67

వ. ఇట్లు పలుదెఱంగులం బసి విహరించుచున్నసమయంబున. 68

ఉ. కమ్మనిమావిపూవులను గాలువ కట్టడు తేనె లాని జుం
ఘుమ్మని తేంట్లు వాడెఁ గడు సొంపలరార నిగుళ్లు మేసి కో
కొమ్మని కంఠఁగోయిలలు కూసెను చిల్కలు గోరువంకలున్
ముమ్మరి మైనపండ్లు దిని మొత్తముగా వగఁ బల్కె నత్తఱిన్. 69

చ. మలయనగాగతానిలము మారుఁడు మారుఁడు నన్న రేఁపఁ బ
చ్చిలి లలనాంగసౌరభముఁ జేకొని కౌశికునాశ్రమంబునన్
సలుగడఁ గ్రమ్మఁ జేయుచు నారతముం జలపట్టి దానిమై
వలువను దూలఁ జేసె నది వారనిసిగ్గునఁ గూరి యుండఁగన్. 70

ఉ. నాలికిఁ బుట్టమల్లెగురఁ గా నలమేనక మేన దంతయుం
గోలఁగ నమ్మునీశ్వరుని ముంగిటఁ గట్టినయట్లు లయ్యె న
న్నేళ నతండు దానికుచ వీథి విహారము సేయుచూపులం
జాలి మరల్పఁ బోవ మది జాఱి పడెన్ వడి జాలిఁ దూలఁగన్. 71

క. అద నెఱిఁగి పదనుశరముల, మదనుఁడు చలపాది యగుచు మదమున మునిపై
వెదలంటఁ దిగిచి యేసెన్, జిదురుప లై నెమ్మనంబు చెడి చేడ్పడఁగన్. 72

వ. అయ్యవసరంబున. 73

క. ధృతి సెడి తపము న్విడివడి, యతివరుఁ డమ్మెంచుఁబోఁడి సంటం దివిరెన్
గుతుకమున నదియు నాతని, మతి వట్టి మెలంగె గతికి మాఱొడ్డ ననన్. 74

వ. అట్లన్యోన్యబద్ధానురాగంబున నభిప్రాయంబు లేకీభూతంబు లైన వెనుక వా రిరువురును గలసి మెలసి మెలంగుచుఁ బెద్దకాలం బానందంబునం గ్రీడించి రంత వారికీకన్నియ యుద్భవించుటయు మేనక దీని నానదియొద్దనం బడవైచి కృతకృత్యయై స్వర్గంబునకు నిర్గమించెఁ గౌశికుండును గౌశికపరిభూతుం డై హిమవంతంబునకుం జనియె నంత. 75

మ. పలలాశిన్ మృగముల్ కుమారిక నటన్ ♦ భక్షించునో యంచు మి
క్కిలి చింతిల్లి శకుంతముల్ గవిసి కో ♦ ర్కిం జేసి కాపాడ ప
క్షులతోఁ గప్పి మెలంగుచప్పు డటకున్ ♦ గార్యార్థ మేఁ బోయి ప
క్షులలో నుండినదానిఁ దెచ్చి నిసు వం ♦ చుం బ్రేముడిం బెంచితిన్. 76

క. తొలుత శకుంతంబులు మృగ, ములబాధలు గలుగకుండఁ ♦ బాదివినకతనన్
దెలియం బెట్టితిని శకుం, తల యని పే రీమె కపుడు ♦ తాపసవర్యా. 77

వ. అని మఱియును. 78

ఆ. కన్నవాఁడు మఱియు ♦ నన్నంబు వెట్టిన, వాఁడు భయ ముడిపిన ♦ వాఁడు ముగురు
తండ్రు లతివలకును ♦ ధర్మశాసనమున, నిట్లు కూఁతు రయ్యె ♦ నిది మునీంద్ర. 79

మ. అని మాతండ్రి వచించె నమ్మునికి ము ♦ న్నద్దాన నే నిమ్మహా
మునికిం గణ్వునకుం గొమార్తె నయితిం ♦ బోలింప నిమ్మాన్యునియుం
జనకుం డయ్యెను నాకు లోకనుత నా ♦ చారిత్ర మిట్లేను మున్
వినినట్లే వినిపించితిం దెలిసికో ♦ విశ్వంభరాభర్తకున్. 80

వ. అనిన నంతరంగంబున నెంతయు సంతసించుచు దుష్యంతుం డయ్యింతి కిట్లనియె.

దుష్యంతుఁడు శకుంతలను వరించుట.

మ. పరదారాభిముఖంబు గాక నియతి ♦ న్వర్తించునా చిత్త మో
తరుణీరత్నమ నీపయిం దవిలె నం ♦ త న్నీవు కణ్వర్షికూఁ
తుర వంచుం దెలియ న్వగం బొగిలె నెం ♦ తో పాపపుంగల్మికిం
మరలన్ క్షత్త్రియపుత్త్రి వంచు విన నా ♦ నందాబ్ధి నోలాడెదన్. 82

వ. అని మరులుకొని ప్రశంసించుచు మఱియును. 83

చ. దిరిసెనపుష్పమో యనుగ ♦ తిన్ మృదులం బగునీదుమేను దు
ష్కర మగుకాఱుకోసఁ బడి ♦ వాడె బడల్పడ నారఁ గట్టి పె
ల్లరుచిగఁ గూరలం దిని మృ ♦ గాదులచెల్మిని డిందనేటికో
తరుణి నను న్వరించి విత ♦ తంబుగ వైభవ మంద రాదొకో. 84

క. క్షత్త్రపరిగ్రహ వగుటన్, క్షత్త్రియునకు నాకుఁ గూర్చు ♦ సతి వై నిఖిల
క్షత్త్రియకాంతాంచిత వై, ధాత్రిన్ సామ్రాజ్యసుఖవి ♦ తానము గొనుమా. 85

మ. మగఱాలా మగఱాలఁ గట్టునగలా ♦ మాణిక్యపుంబేరులా
సొగసుం గుప్పెడుగొప్పముత్తియములా ♦ సొన్నంపుఁజేలంబులా
తగుకాశ్మీరపుసాల్వులా మదికి మో ♦ దం బిచ్చు నాణెంబులా
మగువా నీ కవి యిష్టమో తెలుపు సా ♦ మ్రాజ్యంబునే నిచ్చెదన్. 86

క. గాంధర్వంబున నిచ్చట, గంధద్విరదేంద్రగమన ♦ కలయుము నన్నుం
బాంధవ్య మడుగ జంకకు, గాంధర్వము శ్రేష్ఠతమము ♦ గద పెండిలులన్. 87

వ. అనిన లజ్జావనతవదన యై సుందరదన మందస్మితపూర్వంబుగా ని ట్లనియె. 88

క. స్త్రీస్వాతంత్ర్యము లేమిన్, మాస్వాములవారు వచ్చి ♦ మనలకు నీకున్
సుస్వాదువృత్తి నిచ్చిన, నోస్వారాట్పూల్య నన్ను ♦ నొందుము వెనుకన్. 89

వ. అనిన దుష్యంతుం డాశకుంతలదిక్కు మొగం బయి బ్రాహ్మము దైవ మార్షము ప్రాజాపత్య మాసురము గాంధర్వము రాక్షసము పైశాచము నని వివాహంబు లెనిమిదివిధంబు లందు గాంధర్వరాక్షసంబులు రాజుల కుత్తమంబు లయి విరాజిల్లుం గావున నన్ను గాంధర్వంబునం బెండ్లియాడు మిది యమంత్రకం బై రహస్యంబునం గాం గలయది గావున నిందుం దనకుం దాన కాని దాసంబునకు గతియుం జుట్టంబులును లే రని వెండియును. 90

చ. అతివ మదీయమానస మ ♦ దంతయు నీపయిం జిక్కెం దాళ లే
నతనుశితాస్త్రపాతమున ♦ నక్కట నాతను వెల్లం దాపసం
యుత మయి వేగుచుండెం దెగు ♦ నో యనుసందియ మయ్యె జాగు లే
కతిమధురంబు నీదునధ ♦ రామృత మిచ్చి యనుగ్రహింపవే. 91

వ. అనిన శకుంతల యి ట్లనియె. 92

మ. జగతీనాయక నీవు చెప్ప నటు లౌ ♦ శాస్త్రం బొప్పినన్ సమ్మతం
బగుం గానీ సమయుం బొకండు విను నా ♦ యం గైనపుత్త్రుండు రా
జుగ నీపిమ్మట నిమ్మహీతలమునం ♦ జూపట్టున ట్లైన నా
దగుపాణిగ్రహణం బొనర్ప నగు లే ♦ దా కాదు సంగం బిటన్. 93

వ. అని పలికిన దుష్యంతుం డట్ల యగుం గాత మని వరం బొసంగి గాంధర్వవివాహంబునం బరిగ్రహించి దానితోం దనయభీష్టంబు నెఱవేర్చుకొని వెనుక నాయొద్దకు నిన్నుం దెప్పించుకొందు నని యొప్పించి వీడ్కొని తనమనంబున మునివలనిభయంబు శంకించుచు నిజపురంబునకుం జనియె నంతం గొంతసేపటికిం గులగురుం డగుకణ్వుండు వచ్చి లజ్జావనతవదన యై యున్నశకుంతలవృత్తాంతం బంతయు దివ్యజ్ఞానంబునం దెలిసి సంతసిల్లి దాని కి ట్లనియె. 94

క. తల్లీ యుక్తము చేసితి, వెల్లవిధంబులను దగిన ♦ హృదయేశ్వరునిం
దెల్లముగం గొంటి లోకం, బెల్లం బాలించుపుత్త్రుం ♦ బెసం గను నీకున్. 95

వ. అంత శకుంతల తండ్రిశిరంబునం గలఫలాదిభారంబు దింపి పాదప్రక్షాళనంబు చేసి సేద దేర్చి యి ట్లనియె. 96

తే. తండ్రి నేను వరించితి ♦ ధర్మమూర్తి, యైనదుష్యంతభూపతి ♦ మానసమునఁ
గినియ కాతనిపై మీరు ♦ నెవరు సూప,వలయు ననుచును బ్రార్థింతుఁ ♦ బ్రాంజలి నయి.

వ. అనవుడుఁ గణ్వుండును వానియెడఁ బ్రసన్నుండ నయి యున్నవాఁడ నీ వేదే నొ
క్కవరంబు వేఁడు మిచ్చెద ననిన నామెయు. 98

క. పౌరవకులసంభవుఁ డగు, నారాజేంద్రుండు ధర్మ ♦ మం దుండుటకున్
ధారుణిరాజ్యము దిర మై, కోరిక లిడుచుండ కేను ♦ గోరితి వరమున్. 99

శకుంతలకు భరతుండు పుట్టుట.

వ. అనిన నత్తం డట్ల యగుం గాత మని యనుగ్రహించె నంత శకుంతల దుష్యంతప్ర
సాదంబున. గర్భవతి యై మూఁడువర్షంబులు సిరుమోసి యొక్కనాఁ డొక్కశుభ
ముహూర్తంబున సూర్యాగ్నిసదృశదేహుం డగుసుకుమారుం గనియెఁ గణ్వుండును
జాతకర్మాదిసత్క్రియాకలాపంబులు నిర్వర్తించె నంతఁ జక్రవర్తిలక్షణలక్షితుం డగు
నక్కుమారుండును దినదినప్రవర్ధమానుం డయి యాఱేండ్లయీడు వచ్చి యున్న
యప్పుడు. 100

మ.* అతిఘోరం బగుకాననలోన శరభ ♦ వ్యాఘ్రేభసింహాచ్ఛభ
ల్లతతిన్ బ్రేల్మిడిఁ బట్టి తెచ్చి భుజవే ♦ ల్లదుర్వారిశక్తి న్మునుల్
స్తుతియింపంగ నిజాశ్రమాంతికతరు ♦ స్తోమంబునన్ దామెనన్
బ్రతిబంధించుచు నెక్కుడయ్యెను బల మొ ♦ ప్పన్ శైశవక్రీడలన్. 101

వ. ఇట్లు సర్వసత్త్వంబుల దమియించుటం జేసి యందఱుఋషు లతనికి సర్వదమనుం డను
పే రంకించి రంతఁ గణ్వుండు నతిమానుషం బగువానివృత్తంబునకుఁ జిత్తంబునం బ్రీతి
నొందుచు వీఁడు యౌవనరాజ్యార్హుం డయ్యె నని శకుంతలం బిలిచి యి ట్లనియె. 102

క. సతులకుఁ బుట్టినయిండ్లన్, సతతంబు మెలంగుచుంట ♦ చన దది గానన్
బతికడకు నిన్నుఁ బుచ్చెద, సతి కేడ్గడ పతియ సూవె ♦ జగతిఁ గుమారీ. 103

శకుంతల దుష్యంతునిపాలికిం బోవుట

వ. ఈసర్వదమనునితో నీవు నీపతిపాలికిం బోయి సుఖం బుండు మని చెప్పి యొప్పించి
తనశిష్యుల కప్పగించుటయు వా రప్పతివ్రతం దోడ్కొని దుష్యంతునిపాలికిం జని
నివేదించి వచ్చి రంత నట శకుంతలయు మంత్రిసామంతాదిపరివృతుం డగుసమ్మహా
రాజుం గాంచి తొంటియనురాగాను లతనియందుం బొడగనక తనమనంబున. 104

చ.‡ ఎఱుఁగనివాఁడ పోలె నిటు ♦ లేలొకొ చూచెనుఁ గ్రూరదృష్టి న
న్నెఱచెనొ పెద్దద వ్వగుట ♦ మాట యొకింతయు లేదు కోపి యా

* దామెన = పెక్కుతలుగులుగల నిడివిత్రాడు. ‡ కఱటులు = వంచకులు.

నెఱిఁగి యెఱుంగన ట్లభిన ♦ యించునొ మించినదాని కెంచునో
కఱటులు నూతనప్రియులు ♦ గారె నరేంద్రులు నమ్మవచ్చునే. 105

ఉ. అవసరమైనచోఁ దగిన ♦ యట్టుల పల్కుచుఁ గార్యసిద్ధి గా
నవల న దంతయు న్మఱచి ♦ నట్లు నటించుచు మాయఁ బూని కా
దవు నన కూరకుండియు నొ ♦ కప్పుడు చాల విరుద్ధ మెంత్రు భూ
ధవు లకటా మధుద్రవము ♦ దద్దయుఁ బూసినకత్తు లెన్నఁగన్. 106

వ. అయిన న్వచ్చి మిన్న కేగం బాడి గాదు గావున నన్నుం గన్నకొడుకు నెఱింగించెదం
గాక యని రాజుదిక్కు మొగం బై. 107

శా. నాఁ డాకణ్వమునీంద్రునాశ్రమమున ♦ న్గాంధర్వధర్మంబునన్
బ్రోడా నీవు గ్రహించినట్టిసతి నీ ♦ పుత్త్రుండు వీఁ డప్డు నా
తోడం జేసినబాసఁ జేసి యిటకుం ♦ దోతెచ్చితి న్వీని నీ
ఱేఁడు మెచ్చఁగ యౌవరాజ్యమునకున్ ♦ ఱేనింగఁ జేయంగదే. 108

క. అనవుడు నెఱిఁగియు నెఱుఁగని, చెనఁటివలె న్మలఁగి యతఁడు ♦ చెలియకుఁ దా ని
ట్లనియెన్ నిన్నే నెఱుఁగను, జను మెక్కడిదాన వీవు ♦ చదువ కనృతముల్. 109

వ. అనినం జేష్టలు దక్కి యక్కొమ్మ నివ్వెఱపడి కొండొకతడ వుండియుం గటాక్ష
పాతంబులఁ గాల్చునది వోలె దుష్యంతుం జూచి మున్నీరయినకన్నీరు కరతలంబున
నొత్తుకొనుచు దుఃఖామర్షసమన్వితంబుగా ని ట్లనియె. 110

ఆ. ఎఱిఁగి యెఱిఁగి యిట్టు ♦ లెఱుఁగ ని న్ననుచు ని, శ్శంకముగ వచింపఁ ♦ జన్నె నీకు
నొరు లెఱుంగ రెవ్వ ♦ రొక్కరుండ న టంచుఁ, దలఁచి తప్పు వలుక ♦ ధర్మ వగునె

మ. పవలుం రేలును సంధ్య లాత్మయును దే ♦ వవ్రాతముల్ భూమియున్
బవనుం డగ్నియు నప్పు లాకసము భా ♦ స్వచ్చంద్రధర్మాదులుం
దవులంబట్టి యెఱుంగుచుంద్రు నరువృ ♦ త్తంబుం గనుంబ్రామి పో
నవునే యెవ్వరికైన నిందఱును సా ♦ క్ష్యం బీయరే నాకుఁ గన్. 112

తే. అనిశముం గర్మసాక్షి యౌ ♦ నంతరాత్మ, కెవఁడు భిన్నప్రవర్తకుం ♦ డవును వానిఁ
బట్టి పాపంబులం బడఁ ♦ గొట్టి యముఁడు, గాఱియం బెట్టు లేశంబు ♦ కరుణ లేక.

క. మనుజున కర్ధశరీరం, బనఁ దగియుఁ ద్రివర్గమూల ♦ మై భార్య యిహం
బునఁ బరమున మిత్త్రం బగు, జననాయక సాధ్వి నన్నుఁ ♦ జన్నె తెగడన్. 114

సీ. ఇంటియాతనికి న ♦ నేకాపదలు వాపి, యలరించునట్టి ది ♦ ల్లాలు సూవె
పతి కనంగదశాప్ర ♦ తతి దాఁక నీక ని, రతిసౌఖ్య మిమునది ♦ సతియు సూవె

మగనికి నీరేడు ♦ జగములందు న్నిద్ధ, మగుకీర్తి కగునది ♦ మగువ సూవె
ప్రాణనాథునకుఁ గై ♦ వల్యసంప్రాప్తికి, సదన మైనది ప్రాణ ♦ సతియ సూవె
తే. పనుల దాదికరణములఁ ♦ బరమమంత్రి
భోజ్యములఁ దల్లి రతి రంభ ♦ భూమి క్షమను
రూపునను లక్ష్మి యనఁగఁ జే ♦ రొప్పనుచు నిల గృ
హస్థు నేలెడు సతి గేస్తు ♦ రాలు సూవె. 115
ఆ. ప్రేత మయినవాని ♦ వెంట నెవ్వియు రావు, పెండ్లియాడినట్టి ♦ వెలఁది గాక
కాన సర్ధకార్య ♦ మైన మిత్త్రం బైనఁ, గూర్చుచుట్ట మైనఁ ♦ గులసతి సుమి. 116
క. తానే తనసతికడుపున, సూనుం డయి పుట్టుఁ గాన ♦ క్షోణీస్థలి నా
సూనునిఁ దల్లిం బురుషుఁడు, మానసమునఁ దల్లి యనుచు ♦ మన్నింపఁ గున్. 117
చ. పిలువనిపేరఁటంబునకు ♦ వెంగలి యై చనుఁ దెంచె నంచు నీ
కులసతి నన్నుఁ జుల్కఁ గనుఁ ♦ గోఁ దలఁపోయుదు వేమొ నా మొఱల్
దెలిసియు నిట్లుపేక్షఁ గొని ♦ తెంపరి వై నిరసింప నెంచి తం
కిలి యగుఁ జుమ్మి దీన మది ♦ కిం గలమాటయ నీకుఁ జెప్పితిన్. 118
తే. వినుము దుష్యంత గరిత నే ♦ వేఁడుచుంటి, నానుడులు నమ్మి కై కొన ♦ వేని నన్ను
నీశిరము నూఱువ్రయ్యలై ♦ నేలఁ ద్రెళ్లు, నిప్పుడ యథార్థ మిది యని ♦ చెప్పుచుంటి.
మ. సతిగర్భాశయమందుఁ జొచ్చి వెనుకన్ ♦ జన్మించుఁ బుత్త్రుండు నాఁ
బతి దావన్ సతి జాయ నాఁబడె జగ ♦ త్ప్రఖ్యాతికిం బాత్ర మై
సుతుఁ డున్ సంతతి కాలవాల మగుచుం ♦ జూపట్టె వంశీయులన్
బితలం బూర్వుల నుద్ధరించుఁ దెలియన్ ♦ పృథ్వీతలాధీశ్వరా. 120
క. పున్నామనరకమందలి, బన్నంబులఁ జివుక నీక ♦ వరతనయుం డై
త న్నుద్ధరించుఁ గావున, నెన్నంబడుఁ బుత్త్రుఁ డనుచు ♦ నిలలో నధిపా. 121
సీ. అవనిఁ బితృపితామ ♦ హాదులతో నపు, త్త్రకుఁడు నైరుణ్యంబు ♦ దఱిఁగి పరఁగు
ధనధాన్యపశుదార ♦ ఘనమాన్యహర్మ్యాదు, లకట యపుత్త్రకు ♦ నకును వితియ
కనుఁగొన ధర్మార్థ ♦ కామమోక్షాదులు, పుత్త్రరత్నము సూవె ♦ పూరుషునకు
నిలఁ బురుషాపత్య ♦ మేడేడుతరముల, వారికిఁ దారక ♦ బ్రహ్మ మరయఁ
తే. గాశి నైనను బుత్త్రుని ♦ కడన నైన, మడియ మోక్షము కంతలా ♦ మలక మనరె
వేయు నేటికిఁ బుత్త్రుల ♦ వెలయఁ గనక, వేఁగుపాపులజన్మంబు ♦ విగతఫలము. 122
క. ధరణిఁ బితౄణనివృత్తికి, వరతనయుఁడె మూల మట్టి ♦ వానిని వీనిం
గరుణించి నాటిసత్యము, దిరముగ నొసరింప వలవ ♦ దే నరనాథా. 123

చ. తనహృదయంబునం బొడమి తానె కుమారుఁడు నాఁ బ్రసిద్ధమై
దనరెడువానియందు నగుఁ దండ్రిగుణంబులు లక్షణంబులున్
దనయునిమంచిచెడ్డలకుఁ దండ్రియె కారణ మట్టివానినిం
గని ముకురంబునం దనమొగంబును గన్గొనినట్లు పొంగెడున్. 124

తే. ధూళిధూసరితాంగుఁడై తొడరు కొడుకుఁ, దండ్రి పరిరంభణ మొనర్చి తగ సుఖించు
నిట్టిముద్దులబిడ్డ నీ యొడకు వచ్చి, యిచ్చఁ గనుచున్న దరయ మాన వేమి రాజ. 125

ఉ. చీమలు గ్రుడ్లు వెట్టి పెర సీమల కేఁగెడుపట్ల వానిపైఁ
బ్రేమను వీడి పో మనసు వెట్టఁగ లేక తదండకోటులన్
మోములఁ బూని మోచుకొని పోయెడు నీయెడ నీవు మాత్ర మీ
కోమలగాత్రుఁ బుత్త్రుఁ గనుఁ గొని మది సేయవి దేమిచిత్రమో. 126

తే. పుత్త్రగాత్రపరిష్వంగ మునకు మించి, సుగము గలిగించువస్తువుల్ జగతి లేవు
మూఁడువర్షంబులును నీరు మోసి కంటిఁ, గొడుకుఁ గౌఁగిట నిడి సుఖంపవలము దేవ.

తే. పూరుకులసంభవుం డగు పుత్త్రుఁ డితఁడు, డశ్వమేధశత మొనర్చు ననల నను చుఁ
బ్రసవకాలమునం దశ్రు వాణి పలికె, నధికుఁ డగువీఁడు నీదుఃఖ మపనయించు.

వ. అని మఱియును. 129

క. మృగములఁ దఱుముచు నీ వా, మృగయుఁడవై వచ్చి మున్ను మృగయార్థము పెం
పగుబుష్యాశ్రమమున నా, దగునాతిథ్యంబుఁ గొంటి వది మఱచితివో. 130

మ. ఘను సౌమ్యాష్టిక సృష్టిఁ జేసినవశిం బ్రస్వామి యమ్మేనకాం
గనయందున్ హిమవన్నగంబునఁ దగం గన్నట్లునుం బిమ్మటన్
ఘనశాపాయుధధారి కణ్వముని వేడ్క్యం బెంచిన ట్లీవునున్
వినియున్నాఁడవ కా యెఱుంగి సనుటల్ నృత్తంబె రాజోత్తమా. 131

మ. హృదయేశా తొలిబాముసం దలరి నే నేపాప మార్జింతునో
మొదలం దల్లియుఁ దండ్రియు న్విడువఁ బెం పున్విడితిన్ నాథుఁడున్
వదలుం బిమ్మట నాథ్వ పుత్త్రవతి యున్ సత్కాంతయున్ లేక స
న్మదయన్ బోయెద నేను గిర్మగితిపా తై చింత లేదింతయున్. 132

క. సామేను విడిన విడ నా, నీమేనే పుత్త్రుఁ డితఁడు నెఱి నీబుమతన్
సోమాన్వవాయభూషణ, ప్రేమించి పరిగ్రహింప వే స్వస్తి యగున్. 133

వ. అని పలికిన దుష్యంతుండును. 134

దుష్యంతుఁడు శకుంతలను నిరాకరించి స్వీకరించుట

మ. అనృతం బాడఁగఁ జొచ్చి తిట్లు విన నా • హా కొల్వుకూటంబునన్
నిను నీపుత్త్రునిఁ దొల్లి చూచి యెఱుఁగన్ • నీ వేడ నే నేడఁ బెం
డ్లనఁగా నేడ సమస్తమున్ మృష భవ • ద్వ్యాహార మో దుష్కృతీ
విన నచ్చెం జుమి వేశ్య కైతి వని నీ • వే పల్కుటన్ నిక్కమున్. 135

ఉ. దుస్సతె ఱంగునన్ బలిసి • దోర్బల మేర్పడ నున్నవీని నేఁ
గన్నకుమారుఁ డంచుఁ గనుఁ • గప్పి వచింపుచుఁ జూపఁ దెచ్చితే
సన్నుతగాత్రి పల్కు లివి • చాలును బుంశ్చలిపుత్త్రి వౌట వేల్
పన్నితి సన్నిధిన్ విడిచి • వచ్చినమచ్చునఁ బొమ్ము పొమ్మికన్. 136

వ. అని భర్జించి పలికిన నులికి యలుక వొడమ శకుంతల దుష్యంతునిం జూచి యిట్ల నియె. 137

మ. అతిసూక్ష్మంబు లనన్యదృష్టములు నా • వంతల్ పరచ్ఛిద్రముల్
ప్రతిపాదింపఁగ నేర్తు వెంతలయినం • బాటించి నీఛిద్రముల్
మతి నైనం గనఁ బోవు నా దయినజ • న్మంబున్ భవజ్జన్మమున్
క్షితిపై నెవ్వ రెఱుంగ రంతరముఘ • క్కం జెప్పఁగా నేటికిన్. 138

తే. ఆనగింజకు హేమాద్రి • కైనయంత, భేద మగు నీకు నాకును • నే దివమునఁ
దిరుగఁగల నీవు ధరణిపైఁ, దిరుగువాఁడ, వెవరిపుట్టువు మోపాని • వెతకఁగొమ్ము.

చ. కలహము కోరి కాదు విను • కల్గినమాట నిదర్శనార్థమై
తెలిపెద నేఁ గురూపియు న • దిం దనమోమును దర్పణంబునన్
దెలిసినదాఁక సుందరుఁడ • నే ననుకొంచు రమించు నాయు వే
కులజుఁడు వానిజన్మమున • కుం గతి యెయ్యది నీ వెఱుంగవో. 140

మ. తనకున్ మాఱుగ నున్నకన్నసుతునిం • దా దున్న యంచుం గినన్
వినరానట్టులు తిట్టు నేజనకుఁ డా • విజ్ఞానశూన్యున్ జగ
జ్జనులే కాదు సమస్తదేవతలు స • శ్రాంతంబు నిందింతు రా
తనిలక్ష్మీవిభవంబు మాయు గొదిలోం • దన్ డాయు దుశ్శ్లోకముల్. 141

తే. తనదువంశంబు వృద్ధికిఁ • దనయు నుత్త, మోత్తమునిఁ గాఁగఁ జెప్పుదు • రుత్తమునను
లతనికిఁ దనఁ బిత్రృణ మ•య్యది వోలంగు, నట్టివానిని నామాన్యుఁ•డనఁగఁ దగునె.

ఆ. కూపశతముకన్న • వాపి యొక్కఁడు మేలు, వాపిశతముకన్న • నరిమ క్రతువు
క్రతుశతంబుకన్న • సుతుఁ డొప్పఁ దత్సుత, శతముకన్న ఘనము • సత్య మరయ.

క. ఒకవేయి నశ్వమేధము, లొకవంకను సత్య మొక్క ♦ డొకవంకను దూ
నికఁ గోలఁ గట్టి తూఁచినఁ, బ్రకటముగా సత్యమంద ♦ భార మధిక మగుఁగన్. 144

ఉ. నిత్యము సర్వతీర్థముల ♦ నిష్ఠ మునుంగుట సర్వవేదముల్
శ్రుత్యనుకూలతన్ వినుట ♦ స్రుక్కక తపం బొనరించుచుండుటల్
సత్యముతో నొకింతయును ♦ సాటి యొనర్పఁగ రావు గావునన్
సత్యముకన్న మిన్న యనఁ ♦ జాలినధర్మము లే దొకింతయున్. 145

క. ధరణి నసత్యముకన్నన్, గురుతరకిల్బిషము లేదు ♦ కువలయనాథా
నిరయములపాలు గాకుము, జరిగిన దంతయును నీదు ♦ స్వాంతమ యెఱుఁగున్. 146

క. నామాట నమ్మవేనియు, నీమదికిం దోఁప దేని ♦ నే నిదె విడి మా
భూములకుఁ బోవుదానన, కోమలమతి సుతుని వీనిఁ ♦ గొను మనుకంపన్. 147

ఉ. నీ కగునియ్యలంతిధర ♦ ణిం గొను మం చిపు డీయకుండినన్
నాకొఱ కెల్లభూముల న ♦ నారత మేలెడుఁ జక్రవర్తి యై
వాకొనె నభ్రవాణి మును ♦ వాసవముఖ్యులు సాక్షు లై వినన్
నా కిట దిక్కు లే దని మ ♦ నంబునఁ జింతిల నింత యేనియున్. 148

వ. అని పలికి యింతయు ఫలంబు గానక శకుంతల నితాంతసంతాపితాంతఃకరణ యై కనుల నీరు నెట్టుకొనుచు నాశాలతం ద్రెంచి కొమరుం దోడికొని వెడలి పోవం దలంచి యున్న యవసరంబున. 149

చ. కొమరుఁడు వీఁడు నీకును శ ♦ కుంతలకుం భరియింపు మీతనిన్
సమయము సత్యముం బలికె ♦ సాధ్వి శకుంతల దీని నేలు మీ
కొమరుని యౌవరాజ్యమున ♦ కుం బతి సేయుము తొంటిబాస మై
సుముఖుఁడ వై మెలంగు మిఁక ♦ సూనుఁ డిలన్ భరతాఖ్య నొప్పెడున్. 150

వ. అని దివ్యవాణి యెల్లరు వినం బలికిన విని దుష్యంతుండు నంతనాసభాస్తారులదిక్కు మొగం బై. 151

ఉ. వింటిరె సభ్యులార యిటు ♦ వీనులవిందుగ నభ్రవాణి నే
నొంటరి నీమెఁ గన్యనని ♦ యొద్ద వివాహముఁ జేసికొంటి నేఁ
గంటిఁ గుమారు వీని ననఁ ♦ గా దని లోకము కంటగించునో
గెంటన మాడునో యనుచుఁ ♦ గేరడము ల్పచరింతు నింతకున్. 152

వ. అని పలుకుచుం గొడుకుం దిగిచి కౌఁగిలించుకొని మూర్ధాఘ్రాణంబు చేసి మొగంబు పుణుకుచు శకుంతల నతిప్రణయగౌరవంబున సంభావించి యిట్లనియె. 153

చ. ఒరులకు నేరికిం దెలియ ♦ కుండిన వో నినుఁ బెండ్లియాడితిం
బరు లెవ రెట్లు కా దనుచుఁ ♦ బల్కుదురో యనుభీతి నిట్లు నీ
చరిత జగం బెఱుంగఁ బరు ♦ సంబులు వల్కితి నల్కఁ బూనకో
గరితరో తప్పు సైచి ననుఁ ♦ గారుణికత్వముతోడఁ జూడవే. 154

తే. స్త్రీస్వభావంబునం జేసి ♦ తెలియ కీవు, నన్నుఁ దెగడితి వలుక నె ♦ న్నెన్నొ వలికి
కలికి నీపయిఁ బ్రణయంబు ♦ కలదు గాన, నవి ప్రియంబుల యై శాంతి ♦ కమ్మె నాకు.

వ. అని యూఱడం బలికి పుత్త్రునకుం దండ్రి సేయ నగుజాతకర్మాదివిధు లెల్లం జేసి భరతుం డని పేరు వెట్టి వాని నప్పుడ యౌవరాజ్యమం దభిషేకించి దుష్యంతుండు పెద్ద కాలంబు సామ్రాజ్యసుఖం బనుభవించి రాజర్షి యై తపోవనంబున కరిగె నంత. 156

భరతాదిరాజులవృత్తాంతము.

చ. భరతుఁ డిలాతలేశుఁ డయి ♦ బాహుబలంబున నెల్లఱేండ్లఁ బెం
పరుగ జయించి గోవితత ♦ మహాహయమేధముఁ దొట్టి పెక్కు ల
ధ్వరము లొనర్చి కణ్వముని ♦ పంపునఁ బెంపున సార్వభౌముఁ డై
తిరుఁ డయి చక్రవర్తి యయి ♦ తేజరిలెన్ ధర వంశకర్త యై. 157

ఉ. భూరిధనంబు దక్షిణగ ♦ భూసురకోటికి నొసంగి జన్నముల్
ధారుణి వేనవే ల్సలిపి ♦ ధన్యతఁ గాంచి యతండు కణ్వునిం
గోరి భజించి తత్కరుణ ♦ కు న్నెల వై కులకర్త యై తగెన్
భారతు లై రి తత్కులము ♦ నం బ్రభవించినవార లెల్లరున్. 158

మ. తనపే రన్వయమందు ముందు వెనుకం ♦ దక్కొత్తువా రందఱున్
గానఁ బెంపొందినవానిసంతతిని చే ♦ ర్కొన్నొప్పి రింద్రోపముల్
మనుజేంద్రు ల్మునిచంద్రసన్నుతు లసా ♦ మాన్యప్రభావోదయుల్
ఘను లిభ్యు ల్మను పెక్కు రందఱు నశ ♦ క్యం బెన్నఁగా నేరికిన్. 159

వ. అందు ముఖ్యు లగుకొందఱం జెప్పెద నవధరింపుము. 160

శా. ఆదౌష్యంతి నిజాంగనాత్రయమునం ♦ దత్యంతమోహంబుతో
నాదిం గాంచి కుమారులం దగరు నా ♦ కన్నంతఁ దన్మాత లా
మైఁ దొమ్మండ్ర యమక్షయంబునకు నం ♦ పం జాలి రాతేఁడు నా
పైఁ దా నెన్ని భుమన్యునిం గనె భర ♦ ద్వాజప్రసాదంబునన్. 161

వ. ఆభుమన్యునకు దివిరథుం డనువానివెనుకఁ బుష్కరిణి యనుదానియందు సుహోత్రుండు సుహోత సుహవిస్సు సుయజుస్సు ఋచీకుండు ననుపుత్త్రులు పుట్టి రందు సుహోత్రుండు రా జై రాజసూయాశ్వమేధాదిమహాధ్వరంబు లనేకంబు లొనరించె.

శా. ఆరాజేంద్రుని రాజ్యపాలనమునన్ ♦ హాస్త్యశ్వసంపూర్ణమై
సారాచారసమంచితం బయి మహాం ♦ చచ్చైత్యయూపాంకితం
బై రాజిల్లె మహామహీతలము దే ♦ వాధీశ్వరుం డేల ది
వ్యారంభంబుల నెప్పుమం దనరునా ♦ నాకంబుచందంబునన్. 163

వ. ఆసుహోత్రునకు నైక్ష్వాకియందు నజమీఢ సుమీఢ పురుమీఢు లనుమువ్వురు పుట్టి రం దజమీఢునకు ధూమిని నీలి కేశిని యనుముగురుమగువ లందు ధూమినికి బుక్షుండును నీలికి దుష్యంతపరమేష్ఠులును కేశినికి జహ్ను ప్రజన రూపణులును బుట్టి రందు దుష్యంతపరమేష్ఠులసంతతివారు పాంచాలురును జహ్నుసంతతివారు కుశికులు నాఁ బడిరి ప్రజనరూపణులకుం బెద్ద యగుబుక్షునకు రథంతరికూఁతునందు సంవరణుండు పుట్టి మీసఁ గూటస్థుం డయ్యె నతండు రాజ్య మేలుచున్నసమయంబున క్షామడాంబరాదులవలనఁ బ్రజాక్షోభంబు పుట్టి దేశంబు వలసపోయె నప్పుడు. 164

మహాస్రగ్ధర. సరవిం బాంచాలదేశే ♦ శ్వరుఁ డెసఁగి దశా ♦ క్షౌహిణీసేనతో సం
వరణున్ జన్యంబులో నో ♦ ర్వాఁగ నతఁడు గడున్ ♦ వాసివోఁ బాసి దేశం
బనివారిం బొంది నామా ♦ త్యసుతహితకళ ♦ త్రాప్తుఁడై సింధుదేశాం
తరభూభృద్దుర్గభూమిం ♦ దను నెఱియ నొగిం ♦ దాఁగి కాలంబు వుచ్చెన్.

వ. ఇట్లు సింధునదీపరిసరారణ్యంబున వలసపోయి యున్నభారతుల కట వేయేండ్లు కడచి నప్పుడు. 166

ఉ. వారియెడం బ్రసన్నుఁ డయి ♦ వచ్చె వసిష్ఠమునీంద్రుఁ డాతనిన్
వారితభక్తి మ్రొక్కి ముని ♦ వర్య మముం గరుణించి మాకు నీ
ధారుణిరాజ్యసంపదలు ♦ దక్కఁగఁ జేయ ననుగ్రహింపవే
కోరి భవత్పదంబులను ♦ గొల్చి భజించుచు నుందు మెప్పుడున్. 167

చ. అతులితభక్తి నట్లనఁగ ♦ నమ్మునిముఖ్యుఁడు వారికిం బురో
హితుఁ డయి కార్యము ల్నడప ♦ నేతదనూనఫలంబునన్ నిజా
హితులను దోలి సంవరణుఁ ♦ డెప్పటిఁ బెంపుపరింగి తేజునన్
క్షితిభృదధీశ్వరుం డగుచుఁ ♦ జెన్నలరారెను జక్రవర్తియై. 168

క. మును భరతుఁ డున్నపురమున, ఘనుఁ డాసంవరణుఁ డుండి ♦ కడుదక్షిణలన్
దనరినబహుళాధ్వరములు, పొనరించి ప్రశస్తిఁ గాంచె ♦ బుధు లగ్గింపన్. 169

వ. అట్టిసంవరణుండు సూర్యపుత్త్రి యగుతపతిం బెండ్లియాడి దానియందుఁ గురువుం గనియె నతనిపేర నీకురుజాంగలదేశం బై కురుక్షేత్రంబు పుణ్యక్షేత్రం బయ్యె నతనికి

వాహిని యనుదానియందు నవిక్షిత్తు నభిష్యంతుండు చైత్రరథుండు ముని జనమేజయుండు ననునేవురు పుట్టి రవిక్షిత్తునకుఁ బరిక్షిత్తు శబలాశ్వుఁడు నాదిరాజు విరాజు శాల్మలియు నుచ్చైశ్శ్రవుండు భంగకారుండు జితారి యనునెనమండ్రు పుట్టి రందుఁ బరిక్షిత్తునకుఁ గక్షసేనుఁడు నుగ్రసేనుఁడుఁ జిత్రసేనుండు నింద్రసేనుండు సుషేణుఁడు భీమసేనుఁడు ననువారు పుట్టిరి జనమేజయునకు ధృతరాష్ట్రుఁడు పాండుఁడు బాహ్లికుఁడు నిషధుఁడు జాంబూనదుఁడు కుండోదరుఁడు పదాతి వసాతి యనునెనమండ్రు పుట్టిరి రాజైనధృతరాష్ట్రునకుఁ గుండికుఁడు హస్తి వితర్కుఁడు క్రోధుఁడు కుండినుండు హవిశ్శ్రవస్సు నింద్రాభుఁడు భుమన్యుండు ననునెనమండ్రును బ్రతీపుఁడు ధర్మనేత్రుఁడు సునేత్రుఁడు ననుముప్పదురును బుట్టిరి ప్రతీపునకు దేవాపి శంతను బాహ్లికులు పుట్టిరి దేవాపి ప్రవ్రజితుం డగుటం జేసి శంతనుండు రాజై గంగాదేవియందు భీష్ముం గనియె ననిన జనమేజయుండు వైశంపాయనున కిట్లనియె. 170

తే. గంగకును శంతనుని కెట్లు ♦ సంగమంబు, గలిగె వారికి భీష్ముండు ♦ గలుగు టెట్లు
ధార్తరాష్ట్రులు పాండవుల్ ♦ ధరణిఁ బుట్టు, టెట్టియది చెప్పు మనఘ తం ♦ డిట్టు లనియె.

మహాభిషునిచరిత్రము.

మ. లసదిక్ష్వాకుకులంబునం బొడమి లో ♦ కానిర్జితారాతి యై
మిసిమిం గన్న మహాభిషుం డఖిలభూ ♦ మిం బొంది తా నశ్వమే
ధసహస్రంబును రాజసూయశతముం ♦ ధాత్రీస్థలిం జేసి పై
ననపుం గల్మిని స్వర్గముం గొనియె నిం ♦ ద్రాదుల్ ప్రశంసింపఁగన్. 172

తే. అంత సుర లెల్ల నొక్క నాఁ ♦ డబ్జభవుని, గొలువుకూటంబునకుఁ బోయి ♦ మెలఁగుచున్న
యపుడు రాజర్షులందు మ ♦ హాభిషుండు, కలసి సేవించు చుండె న ♦ క్కాలమందు.

శా. గంగాదేవియు బ్రహ్మఁ గొల్వ నలకుం ♦ గాంతాకృతి న్వచ్చి మే
లొయ్యంగా రంగి మెలంగు చుండఁ బవనం ♦ బున్నాఁడు దెంచెం దదీ
యాంగం బందు మనుంగునుం దొలఁగెఁ బై ♦ నందున్నవా రెల్ల న
గ్నం గన్గోఁ దగ దంచు వాంచి మొగముల్ ♦ గప్పెట్టి రప్పట్టునన్. 174

క. శంకింప కప్పు డన్నది, నంకిలి విడి చూచె నమ్మ ♦ హాభిషుఁ డతనిన్
జంకెంచి పలికె విధి నీ, వొంకము చెడ మర్త్యమందుఁ ♦ బుట్టు మటంచున్. 175

వ. ఇట్లు శపించిన విరించిం గాంచి మహాభిషుండు భయవినయంబు లభినయించుచు నమస్కరించి ప్రార్థించినం గరుణించి యతండు వెండియు. 176

ఉ. ఎవ్వతె నీదుమానసము ♦ నిట్టి యెడం గలఁగించి నించె నా
జవ్వని మర్త్యలోకమున ♦ జన్మము నొందిన నిన్నుఁ గూడి మేల్

నివ్వటిలంగ నుండియును • నీయెడ కప్రియమాచరించుఁ దా
నవ్వల శాపమోక్ష మగు • నంచు నెఱుంగుము నాఁగ నాతఁడున్. 177

చ. ఇలఁ గలయెల్లరాజుల ము • నీంద్రుల డెందమునం దలంచి వా
రలయుదరంబునం బొడను • రా దని రోసి మహానుభావుఁ డై
వెలసిన యాప్రతీపపృథి • వీతలనాథునిఁ గోరెఁ దండ్రి గా
నలువయు నట్ల యా నవె మ • నంబున నక్కటికంబు దోఁపఁగన్. 178

ఆ. నదియుఁ దన్నుఁ జూచి • మచ్చిదిట్ట చెడి యున్న, వానిఁ జూచి తనదు • మానసమున
వలచి మరలుకొనుచు • కొలువుకూటము వీడి, మరలి పోయె మింటి • తెరువు వట్టి.

వ. అట్లు పోవునది ముందఱ వసిష్ఠశాపంబున నష్టరూపు లై వచ్చునష్టవసువులం గని యి ట్లనియె. 180

## గంగావసువులసంభాషణము

ఆ. అన్నలార మీర • లున్నతి విడి యొందు, చోటి కిట్టు లరుగ • నేటి కయ్యె
నాఁగ వసువు లనిరి • మాగతి యే మని, నుడువ వచ్చు నమ్మ • కడలికొమ్మ. 181

చ. జనని వసిష్ఠమౌనివరు • శాపమునం భువిఁ బుట్టనై వగం
గొని యిటు పోవుచుంటి మెట • కో మముఁ దేర్పఁగ దిక్కు నీవ నీ
ఘనకరుణాకటాక్షమునఁ • గల్గెను మాకు శుభంబు పాల ముం
చిన మఱి నీళ్ల ముంచిన వ • చింతను భారము నీది సుమ్మికన్. 182

చ. తెలిసి మహాభిషుం డలప్ర • తీపున కయ్యెడు శంతనుండు నాఁ
గలికిరో నీకు వానికిని • గల్గు సమాగమ మట్టిపుణ్యమూ
ర్తుల రగుమీకుఁ బుట్టెదము • దోసపుఁబుట్టువు పుట్ట లేము మ
మ్మెలమిని జూడు మన్నఁ జడ • లేఁటుఁ గావుత మంచుఁ బల్కుచున్. 183

ఆ. మఱియు వసువు లనిరి • మముఁ బుట్టినప్పుడె, నీళ్ళ వ్రేయు మవని • నిలుపకుండ
దీన నచిరమునన • దేవలోకావాప్తి, మాకుఁ గలుగు ననిన • మానవతియు. 184

క. మీకోరినట్ల యయ్యెడుఁ, గా కొకకొడు కైన నిలువఁ • గా వలదె ధరం
గై కొని దీర్ఘాయువు నా, కాకురుముఖ్యునకుఁ బ్రీతిఁ • గాకరుఁ డగుచున్. 185

వ. అనిన వా రవ్వా! మాయొక్కొక్కరితురీయార్ధంబుఁ దాల్చి వీర్యవంతుండును దీర్ఘాయుష్మంతుండు నపుత్త్రకుం డగుపుత్త్రుం డొక్కరుండు కొన కుండు నని వా రిట్లు గంగతో సమయంబు చేసికొని యథేచ్ఛం జని రంత నిట. 186

### గంగ ప్రతీపునికడకు వచ్చుట.

చ. తనయులకై ప్రతీపవసు ♦ ధాతలనాథుఁడు గంగయొడ్డునన్
మునుకొని నైష్ఠికుం డయి తప ♦ మ్మొనరించుచు నుండ గంగయున్
సనవిలుకానిరాజ్యరమ ▸ నా రమణీమణి యై ప్రియంబు పెం
పునఁ జనుదెంచి కొంచ కెదఁ ♦ బొందెఁ గుణాఢ్యుదక్షిణాంకమున్. 187

చ అరసి ప్రతీపుఁ డద్భుతము ♦ నంది తలోదరి నీ వెవర్తు లో
నరిమర లేక నాకుఱువు ♦ నందు వసించితి వేల నావుడున్
సురనది నేను నీసుగుణ ▸ శోభితమూర్తిని జూచి వచ్చితిన్
దరుణిఁ బరిగ్రహించి వసు ▸ ధావర నన్ను ననుగ్రహింపవే. 188

ఆ. మానవేంద్ర వినుము ♦ నే సలంతిని గాను, కానరానిదానఁ ♦ గాను పరుల
కాడిపోసికొనఁగ ▸ నైనదానను గాను, దేవకన్య నన్నుఁ ♦ దెలిసికొనుము. 189

వ. అనిన నతం డిట్లనియె. 190

ఆ. అగ్నిసాక్షికముగ ♦ నగునాలిఁ గాదని, తరుణి నన్య నంట ♦ ధర్మవిప్ల
వంబు గాదె యేక ▸ పత్నీవ్రతుఁడ నైన, నన్ను నిట్లు చెనక ♦ నాయ మటనె. 191

వ. ఇదియునుం గాక నీవు కామినీభోగ్యం బయిన వామాంకంబు విడిచి యపత్యోచితం బయిన నాదక్షిణాంకం బధిష్ఠించితివి గావున నీవు నాకుం గోడలి వగు మని యొడం బఱిచిన నది యౌ నని యదృశ్య యయ్యె నంతఁ గొంతకాలంబున కాప్రతీపునకు సునందయందు మహాభిషుండు నందనుం డై పుట్టి శాంతి నైనసంతానంబు గావున శంతనుం డను నాఁ బ్రఖ్యాతి వడసె నంతరంబ. 192

ఉ. తండ్రియు శుక్లపక్షహిమ ▸ ధామునిగోమున వృద్ధిఁ బొందె గో
వాంద్రకు నుద్ది యైనగుణ ▸ వంతుని శంతనుఁ జూచి యెంతయేఁ
దీంద్ర గలాఁ డటంచును మ ▸ దిం గను సంతస మంది రాజ్యమా
గంద్రకుఁ గట్టి తా నవలఁ ♦ గానన మేఁగుచు వాని కిట్లనున్. 193

చ. వినుము కుమార ము న్నొకప ♦ విత్రచరిత్ర జలేజనేత్రి నన్
గనుఁగొని వచ్చి నావలనఁ ▸ గాంచె వరం బలదివ్యకాంత నిన్
గనుఁగొన వచ్చు వచ్చిన నొ ♦ కానొకయింతయు నడ్డు వల్కక కా
మెను గయికొమ్ము నానొసవు ♦ మీఁకును మంత శుభంబు గల్గెడున్. 194

వ. అని చెప్పి యొప్పించి తాను దపోవనం బరిగె నంతరంబ. 195

శా. రాజై శంతనుఁ డంత నెంతయును శౌ ♦ ర్యం బొప్ప నిప్పృథ్వి నా
రాజుల్ గొల్వఁగ రాజసూయమఖముల్ ▸ ప్రఖ్యాతిమైఁ జేసి వి

భ్రాజత్తేజము నొంది యింద్రునకుఁ బో ♦ ల్ప న్వచ్చి ధర్మాత్ముఁ డై
జేజే వెట్ట జగజ్జనుల్ ప్రబలె ను ♦ శ్రీవైభవోపేతుఁ డై. 196

క. శంతనుఁడు రాజ్య మేలుచు, సంతతమృగయావిహార ♦ చతురుం డగుచున్
కాంతార మేగి యొకనాఁ, డెంతయు శ్రీమ గంగచెంత ♦ నేగుచుఁ బ్రీతిన్. 197

శా. కాంచెం గాంచనభూషణాంబరలస ♦ త్కాయప్రభాభాసితన్
గాంచీనూపురకింకిణీనినదమా ♦ ర్గప్రాప్తహంసావళిన్
జంచచ్చారుపయోధరోపరినట ♦ త్సంపూర్ణహారాంచితన్
గాంచచ్చంచలచంచరీకనయనన్ ♦ బద్మాననన్ బద్మినిన్. 198

గంగాశంతనులసమయము.

వ. కాంచి తనుభావంబునకు భావంబునం దలరి మందస్మితసుందరవదనారవిందుండై మృదు
మధురస్వరంబున దాని కిట్లనియె. 199

మ. కలికీ నిర్జరకన్యవో భుజగివో ♦ గాంధర్వివో యక్షివో
విలసన్మానుషివో వరాప్సరసవో ♦ విద్యాధరాబ్జాక్షివో
తెలియం జాలను గాని నిన్నుఁ గన నెం ♦ తేఁ గంతుసంతాప మ
గ్గల మయ్యెం దయ చేసి నాకు సతి వై ♦ కామించి ప్రేమింపవే. 200

వ. అనిన విని గంగాదేవియు నంతరంగంబున నుప్పొంగి శంతనునకు సంతోషపూర్వంబు
గా ని ట్లనియె. 201

చ. అమరసమప్రభావనిల ♦ యా ననుఁ గైకొన నెంతువేని నా
సమయము విన్ము నే నెటులు ♦ సల్పిన నట్లుడిగింప కుంట యే
సమయమునందు నప్రియము ♦ సల్పక యుంటయు నిష్ట మేని నీ
కు మహిషి నై ప్రియంబునను ♦ కోరిక లీరిక లెత్తఁ గూర్చెదన్. 202

వ. సమయభంగం బైననాఁడు నిన్నుఁ బెడఁబాసి పోవుదు దీనికి నీ వంగీకారంబు చేసి నన్ను
వరింతు ననిన నతండు విరాళిం గొన్నవాఁడు గావున నొడంబడి గాంధర్వంబున
బరిగ్రహించె గంగయు నంగనవోలెం గూడిమాడి హావభావాదుల నతని నలరించు
చుండె నంతం గొంతకాలంబునకు. 203

మ. వసువుల్ పుత్రకు లై క్రమంబున జనిం ♦ పన్ వారి నట్టే దయా
రసహీనాత్మక యై నదీజలములన్ ♦ రాజీవపత్రాక్షి లో
నసువు లొవ్వఁగఁ జేయ వేయుటలు క ♦ న్నారంగ వీక్షించియున్
వసుధాధీశ్వరుఁ డామె వోవుననుచున్ ♦ వారింపఁ డింతేనియున్. 204

గంగకు భీష్ముండు పుట్టుట

క. ఇటు తేజస్వి వసువుల స, ప్తుల నిలాలక ఫుట్టినపుడె • కూల్చుచు నున్నం
తట నష్టమునకు వోడమినఁ, గటకటఁ బడి శంతనుండు • కాంతకు ననియెన్. 205

ఉ. కానక కన్నకందువులఁ • గానక నీ విటు చంపుచుంటి వే
లే నను రింత సేయనియును • లేదొకొ నీమదిఁ బుత్త్రఘాతినీ
నే నిటు చూడ లేను సుతు • నిట్ జ్వలనార్క సమాన తేజునిన్
వీనిని వీడ నోప నిఁక • నెవ్వెటు లైనను సమ్మతించితిన్. 206

వ. అని పుత్త్రమోహంబున వారించి యప్రియంబులు పలుకుటయు నామెయును. 207

సీ. సమయభంగిం బమ్మెుఁ • జనియెడ నే జహ్ను, కన్య దేవహితంబుఁ • గాంక్షఁ జేసి
నిను వరించితి వీర • లెంమ్మాగ్రజు వసువులు, వరుస వసిష్ఠుశా • పమునఁ జేసి
బడసి మర్త్యంబునఁ • బ్రభవించువారయి, నన్నుఁ బ్రార్థించిరి • కన్న లగుచు
నేఁ గృతార్థులఁ జేయ • నిటు వారిఁ గచిరమో, క్షమ ప్రసాదించితి • జనవరేణ్య

గీ. యీతఁ డష్టమవసువు నీ • కింపు గూర్చ, పుత్త్రుఁడై లోకహితుఁ డయి • భూతలమునఁ
బెద్దకాల వించుఁ • బేర్మిఁ గాంచు, నని వచించిన శంతనుం • డనియె నిట్లు. 208

గీ. వసువుల వసిష్ఠుఁ డేటికి • వగ శపించె, బుట్టుతో వారు ముక్తులై • పోవుటకును
నష్టముఁ డితండు కలకాల • మలరుటకును, గారణం బేమి యనుచు నిట్లు • గంగ వలికె.

చ. వరుణుని కాత్మజుం డయి • ప్రభం బ్రభవించి వసిష్ఠనామ ని
ర్జరవరవందనీయుఁ డయి • సాధ్వి నొకర్తుకఁ బెండ్లియాడి భా
సురసురశైలపార్శ్వమున • సొంపగునాశ్రమమందుఁ బెంపఁ బం
బరుదుగఁ జేయు మండ సభ • వాజ్జభవాదులు మెచ్చ నిచ్చలున్. 210

వసిష్ఠుఁడు వసువుల శపించుట.

క. ఏసమంత్రసు పృథుప్రు మొదలుగ, ననఘులు వసువులు సభార్యులై • యపు డటకున్
జని మెలఁగు చుండ నొక్కని, వనితామణి యొంటిఁ గొంత • వడి చని యెదుటన్.

సీ. మగతాలపాలు డీ • లఁగఁ జేయఁగాఁ జాలు, మిసిమిమై మిఱుమిట్లు • విసరుదానిఁ
బాలు కాలున గట్టి • పాఱఁగా నేల టీ, రాకెషు పంబాడుఁ • గందుదాని
పింద్రనీలముత్తిళ్కు • లీనుకాటుకకన్నుఁ, గవరుచు ల్వనులందుఁ • గలుపుదానిఁ
బంటవలంతికై • పట్టినవింజామ, రమ్మనుసోగివా • లమ్ముదాని

తే. నపుడ కని బిడ్డతోనున్న • యట్టిదాని, ననయ మంభా యనుచుఁ గను • నఱచుదాని
వేల్పుటావునుబోనిలేఁ • బెయ్య నల్ల, వనిత వీక్షించె నేత్రప • ర్వంబుగాను. 212

వ. ఇట్లు వీక్షించి దానిసుందరత్వంబునకు విస్మయంబు నొంది తనమగని కెఱుంగం జూపుటయు సయ్యష్టమవసువును. 213

మ. వనజాక్షీ యిది దక్షపుత్త్రి సురభీ ♦ వామాక్షికిం గశ్యపుం
డనుబ్రహ్మర్షికి బిడ్డ యై పొడమి లో ♦ కైకాభివర్ణ్యప్రభా
వనిధానం బయి పాల్చు నందిని యనన్ ♦ బ్రహ్మణ్యుఁ డౌనవ్వసి
ష్ఠునకున్ వేలిమిపడ్డ దీనిఁ గనినన్ ♦ శోషించు దోషావళుల్. 214

క. మరియును విను మోగరితా, ధరణిజనుల్ దీనిపాలు ♦ ద్రావిర యేనిన్
స్థిరయౌవను లై ఘను లై, పరఁగుచు నుండెదరు సువ్వె ♦ పదివేలేఁడుల్. 215

వ. అని దానివృత్తాంతంబు సెప్పిన నత్తలోదరి కౌతూహలాయత్తచిత్త యై జీవితేశున కిట్లనియె. 215

గీ. క్షితి నుశీనరుకూఁతురు ♦ జితవతి యను, తన్వి నాప్రియసఖి నేను ♦ దానిఁ గూర్చి
దానఁ గావున నీహోమ ♦ ధేనువుఁ గొని, తెమ్ము సకి కిచ్చి పుచ్చెద ♦ నెమ్మిఁ జేసి.

వ. అని ప్రార్థించినం బ్రభాసుండును బ్రణయినీప్రియచికీర్షం జేసి శంకింపక తక్కినుం గలవసువులం బురికొల్పికొని వారితో దానిం జుట్టుముట్టి పట్టుకొ[illegible]యె నంతం గాంతారమ్మున ఫలమ్ములు దేరఁ బోయినవసిష్ఠుండు వచ్చి నందినిం గానక కాననంబుఁ గలయ వెదకి దివ్యజ్ఞానంబున వసువు లపహరించుట యెఱింగి తలఁగనికోపతాపంబునం గట్టుకొని మర్త్యంబునం బుట్టుదురు గాక యని వారిని శపించె నంత వారును. 218

మ. ఘనపాపంబునఁ జేసి హోమసురభిం ♦ గైకొన్న యవ్వేల్పులున్
మునిశాపం బది యంతయు న్విని వగ ♦ న్నోర్నెత్తియు న్మొత్తుకొం
చు నయంబుం గొని గోవు నిచ్చి మునికిన్ ♦ జోతల్ సమర్పించి నే
ర్పునఁ బ్రార్థించిరి తప్పు సైఁపు మని క ♦ న్నుం గాళ్లునుం బట్టుచున్. 219

వ. ప్రార్థించినం గొంత ప్రసన్నుం డై వసిష్ఠుండు వారి కిట్లనియె. 220

గీ. నేలఁ బుట్టియు మీ రింత ♦ కాలమునన, శాపమోక్షముఁ బొందెద ♦ రోపి యీప్ర
భాసుఁ డెంతయు నపకృతిఁ ♦ జేసెఁ గానఁ, బెద్దకాలము మర్త్యుఁ డై ♦ పేర్మిఁ గాంచు.

వ. అని యథేచ్ఛం జనియె నప్పుడు వారు నాకడ కరుదెంచి దుఃఖించుటం జేసి నే నిప్పు డిట్లనుగ్రహించితిఁ జిరంజీవి యగునిక్కుమారుం డాప్రభాసుం డని గంగాదేవి గాంగేయునితో నంతర్ధానంబు నొందె నంత శంతనుండును గాంతావిరహసంతాపితచిత్తుం డై హాస్తిపురం బరిగి. 222

వ. అంత నాబాలునితో నాలుగువర్షంబులు గడపి యొక్కనాఁడు వేఁటకుఁబోయి యమునా నదీతీరంబున నొక్కరుండ పోయి విహరించుచు నట నపూర్వదివ్యగంధం బాఘ్రాణించి దానితెఱం గెఱుఁగఁ గోరి చెలువుగడం గలయఁ గ్రుమ్మరుచు నొక్కచో నోడఁ గడపు మత్స్యకన్నియ నొక్కతెం జూచి దాని కిట్లనియె. 232

శంతనుఁడు సత్యవతిం జూచి మోహించుట.

చ. ఎవతెవు నీవు నీయునికి ♦ యెట్టిది యిట్టులు కోమలాంగి వై
ననయఁగ నోడఁద్రిప్పఁ బని యేమి ♦ నరుల్చుట కేమికారణంబు సెప్పవే
కువలయనేత్రి నాపృథుల ♦ కోరిక నీకిటు లెత్తి నాపికా
ననమొగ మెత్తి చూచి లల ♦ నామణి యిట్లని పల్కెఁ గుల్కుచున్. 233

ఆ. దాశరాజుబిడ్డఁ ♦ దండ్రినియోగంబు, నెల ధరించి యిట్లు ♦ ధర్మబుద్ధి
నోడఁ గడపుచుంటి ♦ నోపురుషశ్రేష్ఠ, గంధవతి యనంగఁ ♦ గ్రాలుదాన. 234

చ. అనుపమ సుందరాంగి దానిమ్మెదు ♦ లాంగికసౌరభమున్ స్మితాననం
బును విచలద్విలోకనము ♦ లుప్తమనోహరదేహసౌష్ఠవం
బును సువిలాసముం గని ప్ర ♦ మోదముతోఁ దై మరులంది సుందరీ
మణి పరికించి యేర్కొనుచు ♦ నాకు వివాహ మొనర్చ నెంచుమీ. 235

క. నాప్రియ నావనితామణి, భావజసమరాప యిట్లు ♦ భావ్యమె కన్యం
గావున నిటు జనకాజ్ఞం, బోవలయుం గాఁ జన్నే ♦ బుద్ధిం దెలియన్. 236

వ. అనిన శంతనుం డట్ల యగుం గాక యని దాశరాజుకడకుం జని తనమనోరథం బెఱిం గించుటయు నతండును. 237

క. కన్నియ యగుచుం బుట్టిన, దన్నంతన నరుని కయ ♦ నగు యున్నది గా
కెన్నంగఁ గన్నతండ్రికిఁ, జన్నె తనయుంటియుంద ♦ నతి మాఁగింగన్. 238

క. నీయట్టిరాజు నాకుం, బాయక జామాత యగుట ♦ భాగ్యమ యైనం
జేయఁ దగు సమయ మొక్కఁడు, నాయనుగుం గూఁతుఁ బడయ ♦ నచ్చిక యేనిన్.

వ. అనిన నతం డది యెట్టిది చెప్పుము చెప్పిన నయ్యది చేయం దగినయేని చేయుదు ననిన నతండు వెండియు. 240

క. నాకూఁతునకుం బుట్టెడు, నాకొమరుఁడె నీకు వెనుక ♦ నవనీభరముం
జేకొనునట్లుగఁ జేయం, దేకువ గల దేని నీకు ♦ దేవేరి యగున్. 241

వ. కానినాఁడు కానేర దనిన శంతనుం డెద్దియుం బలుకనేరక వానిచేతం బ్రతిహత మనోరథుం డై మరలి కరిపురం బరిగి తరుణిం దలంచుచు నితాంతచింతాజ్వరసంతప్త

చిత్తుం డై యొండు తెఱుంగక యన్నులమిన్న కన్నుఁగవకుం గట్టినట్టుగా నుండుటయు. 242

చ. ప్రియమునఁ జెంతఁ జేరి కడు • బిగ్గఁ దన్నుఁ గవుంగిలించె నా
ప్రియ యని మేన్ నెఱుంగ కొఁగి • వెంగలి చేతులు సాఁచి పట్టి పెం
బయలు గవుంగిలించి తమి • వాతెఱకై తన నోరు మొగ్గి యే
మియుఁ గనరామికిం దెలిసి • మిక్కిలి గాసఁ బడెన్ విరాళియై. 243

చ. సరగున లేచి యాకసము • సందిటఁ జేర్చెడు మోవిపానకం
బరయఁగ మోముఁ ద్రిప్పుఁ బ్రి • యంబున నేమియొ పల్కరించెడున్
జనచరుఁ జూచెదుం గినిసి • సోలెడుఁ ద్రావెడు సవ్వడిం గడున్
విరహము నొందెడుం దెలివి • వీఁగ సహింపదురంతచింతయై. 244

వ. ఇట్లు కామార్తుం డై పరితపించుచు దేహస్మారకం బెఱుంగ కున్నాఁడని యెఱింగి యున్నసమయంబున నొక్క నాఁడు తండ్రిపాలికిం జని గాంగేయుండు చేదోయి మోడ్చి యి ట్లనియె. 245

మ. ప్రతిపక్షుల్ వశవర్తు లైరి ముదలన్ • వా రౌదలం దాల్చి సం
తతము న్నిన్ను భజింతు రీతులనుచుల్ • దల్పంగఁ బో రేప్రజల్
చతురంభోధిపరీతభూవలయమున్ • స్వారాజ్యముం బోలె నీ
తతబాహాబలరక్షితం బయి చనున్ • ధాత్రీతలాధీశ్వరా. 246

ఉ. ఎందుఁ గొఱంత లే దరయ • నింతయు నెంతకు నీవ మేటి వై
పొందినకీర్తిఁ బొల్చెదవు • పో ధరణీంద్రుఁడ విట్టి నీకు లో
డెంద నొకింత కారణము • డెందమునం బొడకట్ట దిట్టిచోఁ
గుంది కృశింతు వాత్మజున • కుం బదులాడ వి దేమి చెప్పుమా. 247

వ. అని నిర్బంధించి పలికినం గొడుకునకు శంతనుం డనును. 248

ఉ. ఇందుకులంబునందు జని • యించి మహేంద్రసమానవైభవం
బందితి నిన్ను వంటిజగ • దాఢ్యగుణోత్తరుఁ బుత్త్రుఁ గంటి నిం
కెందుఁ గొఱంత లే దనుచు • నీ యనుమాట యథార్థ మైన నే
నందనిమ్రానిపండులకు • నఱ్ఱులు సాఁచితి నోయిపుత్త్రకా. 249

వ. అని మఱియును. 250

మ. మనయీవంశమహార్ణవంబునకు సం • పత్కారుఁ డై నీ వొకం
డని చెప్పం దగినట్టిపుత్త్రుఁడవు నీ • యభ్యాసమో సంతతం

ఉ. వేగమ పోయి కాశిపురి ♦ వీథులనిండ స్వయంవరార్థమై
మూఁగిసరాజలోకషులు ♦ ముం దయి కన్గొని మందయానలన్
వేగురును న్వాసంగ నిదె ♦ నే నదిపుత్త్రుఁడఁ గన్నెలం గొనం
గాఁ గనునిచ్చ వచ్చితిని ♦ గండరగండలు గం డెదుర్పఁగన్. 268

క. అనుజుల కై నే నీముగు, రను బలిమిమెయిన్ స్వయంవ ♦ రమ్మున నిదె కై
కొనుచుంటి సడ్డగింపుం, డనుచుం గన్నియల నరద ♦ మం దెక్కించెన్. 269

వ. అతఁ డంతం బోవ కుచ్చస్వరంబున. 270

క. కొని చనుచు నుంటి క్షత్త్రియ, జనధర్మం బిది యటంచు ♦ శక్తి గలారల్
మునుకొనుఁడు రింపు చెండెద, నని తేరుం దోలుకొనుచు ♦ నరుగం జొచ్చెన్. 271

వ. అట్టిసమయంబున. 272

సీ.* నిలు నిలు మనువారు ♦ కలగుండు పడువారు, కనుబొమ లుమ్మడివడఁ ♦ గనెడువారు
నవ్వుడు గఱచువారు ♦ నరివాయి గొనువారుఁ, జేవురు నాఁ గన్నుఁ ♦ జేయువారు
బుజ మప్పళించు వా ♦ ర్గదబిజి పడువారు, పటపటధ్వని పంటఁ ♦ బరపువారు
గసనఁ గొలుకువారు ♦ రథము లెక్కెడివారు, చఱచి యొండొరుఁ బిల్వ ♦ నాగువారు

గీ. నాయుధమ్ములు గొనువారు, నఱచువారు, పఱచువారును జఱచువా ♦ రఱచువారు
నిలుచువారును గలఁచువా ♦ రలఁచువారు, నైరి యటనున్న ప్రజ లెల్ల ♦ రాష్టణమున.

మ. చతురంగోద్ధతవాహినీకలితుఁ డై ♦ చర్చించి నానావని
పతు లొక్కుమ్మడిఁ జుట్టుముట్టి పురుష ♦ వ్యాపార మేపార భా
రతునిం దెట్టలు గట్టఁ గొట్టి రశని ♦ ప్రాయాస్త్రపాతంబులన్
బ్రతి లే కప్పుడు వారికిం దుములసం ♦ గ్రామంబు భీమం బగున్. 274

మ. పదివేలుం బదివేలబాణములఁ దీ ♦ వ్రస్ఫూర్తి నేకాకి యా
నదిపుత్త్రున్ రథరథ్యసూతసహితున్ ♦ గట్టల్కఁ బి ట్టేసి ప
ట్టుదలం గట్టిగ నార్చుచుం గనలి యా ♦ టోపించి దీపించి యు
ర్వ్యాదివే ల్సేసెను వానినెల్ల నతఁ డ ♦ ధ్వ న్లాఘవం బేర్పడన్. 275

చ. అటు తమబాణము ల్నడుమ ♦ నట్టయి పోవుట కీసుఁ జెంది వా
రటుమట నంపవాన గురి ♦ యన్ గిరివోలెఁ గుమూద్వహుండు నుం
దిటపడి మూఁడుమూఁడుకమఁ ♦ దీవ్రశరంబుల నెల్లవారి ను
త్కటగతి నేయ తేం డ్లడరి ♦ కప్పి రొకొక్కరు భీష్ము నేనిటన్. 276

---

* అఱచు = 1 కూయు, 2 పిలపించు. కలఁచు = (ప్రజను) కలఁగఁజేయు. అలఁచు = (ప్రజను) శ్రమపఱుచు.

శ్రీ

శ్రీబాలాత్రిపురసుందర్యై నమః.

# శ్రీకృష్ణభారతము

ఆదిపర్వము—షష్ఠాశ్వాసము.



మంత్రమాతృకాదిమ
హామంత్రోపాసకామ♦లాంతర్వర్తీ
సోమార్కానలతేజ
స్తోమాంచితభూరిమూర్తి♦ సూర్యజ్ఞకీర్తీ. 1

ధృతరాష్ట్రపాండురాజాదుల యభివృద్ధి.

వ. అక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లనియె నట్లు ధృతరాష్ట్రపాండురాజవిదురు లనుముగ్గురుకుమారులుం బుట్టి పెరుఁగుచున్నంత. 2

సీ. కురుభూమి యెల్లను♦ సురభూమి లాగునఁ జెల్లెఁ, దృణజలకాష్ఠసమృద్ధి గలిగె
జగతి ముక్కారు సస్యసమేత మై యొప్పె, నెల మూఁడువానలు♦ నిలిచి కురిసె
వనము లెల్లను ఫలవంతంబు లై క్రాలెఁ, బాఁడిపంటలు చాలఁ♦ బ్రబలి యుండెఁ
బ్రజలు ప్రజావృద్ధి♦ రుజ లేక పొలిచిరి, పురము లెల్లను లక్ష్మి♦ నెరవు లయ్యెఁ
తే. గలహ మనుమాట కలలలోఁ♦ గలసి పోయె, ధర్మకర్మము లెల్లెడఁ♦ దగ నెలంగె
నీతిబాధలు చూపక♦ నీతి నిలిచెఁ, జెనుగు లుడిగోయె సంపదల్♦ పుష్టి నొందె. 3

మ. సిరిగల్ సంపద కాలవాల మగుచుం♦ జెన్నారు చుట్టియా
కురుదేశంబున నేలునుం బవలులున్♦ క్షోణీంద్రులుం దొట్టి యి
ల్లరగేహంబులఁ బెట్టుఁడీ తినుఁడి లీలం గ్రోలుఁడీ యన్న పల్
కర మాలింపఁగ నయ్యె నెయ్యెడల లో♦కఖ్యాతికిన్ స్థాన మై. 4

ఉ. లే రధమప్రవర్తకులు♦ లేరు దరిద్రులు లేరు దుర్జనుల్
లేరు పరాపవాదకులు♦ లేరు నృశంసులు లేరు జారులున్
లేరు ఖలస్వభావులును♦ లేరు వితంతులు లేరు పాపులున్
లేరు సతీవిదూషకులు♦ లేరు జడుల్ కురుభూమి నత్తఱిన్. 5

మ. *పరరాష్ట్రంబుల గెల్చి భీష్ముఁడు కడున్ బాహాబలం బేర్పడన్
గురురాజ్యంబు దలిర్పఁ జేసి తను లోకు ల్మెచ్చ ధర్మంబు నాఁ
వర మాచక్రము చుట్టువాఱుకొనఁ గాఁ బాలించె నక్కాలమం
దరయన్ స్వర్గపురంబు నాఁగఁ గురురాజ్యం బొప్పె నప్పట్టునన్. 6

చ. కొడుకులఁ బోనిమువ్వురను గూడ నదీసుతుఁ డోమి వారి కే
ర్పడ నుపనాయనాదికశుభక్రియల న్ఘటియించి విద్య నే
ర్పుడుఁ దగ వారి లధ్యయనముం బొనరించియు జవ్వనంబునన్
దడయక రాజవిద్యల జితశ్రము లై యెలరారి రెంతయున్. 7

తే. రాజనీతిశాస్త్రములు పురాణము లితిహాసములు వేదములును వేదాంగములును
వారికె యథార్థవిజ్ఞాన మారసికొన, నైనయట్టులు నేర్వంగ నయ్యె నపుడు. 8

తే. అంగబలయుక్తి ధృతరాష్ట్రుఁ డతిశయిల్లె, నస్త్రబలశక్తిఁ బాండురాజధికుఁ డయ్యె
నర్థబలశక్తి విదురుఁ డత్యధికుఁ డయ్యె, నాపగాసూతిరక్షణోపాయమునను. 9

పాండురాజపట్టాభిషేకము.

శా. సత్యాం బానుమతి న్నదీసుతుఁడు రాజ్యం బేలుచున్ రాజు గా
జాత్యంధు న్నిలుపంగ రా దనుచుఁ బ్రజ్ఞావంతుఁడున్ లోకస
న్మత్యర్హుండును విజ్ఞుఁ డైన విదురున్ యోజించి సర్వంసహా
నిత్యైశ్వర్యమునందుఁ బాండునృపతి న్నిల్పెం బ్రభుత్వప్రభన్. 10

ఉ. ‡శాంతనవప్రతిష్ఠితరసావలయాధికరాజ్యసంపదన్
వంతువ దలేక పాండునగనాథవతంసము పట్టభద్రుఁ డై
శాంతమతిన్ సమస్తనృపశాసను మాధృతరాష్ట్రునందు న
శ్రాంతముఁ బెట్టి యేలెను బ్రజం బ్రజ వోలె నిజానురక్తమై. 11

వ. ఇట్లు పాండురాజు తండ్రిం బోనిభీష్మునను శాసనంబున నన్న కనురక్తుం డయి లోకో
త్తరమహోత్తరంబు గాఁ బూజ్యసామ్రాజ్యం బేలుచున్న సమయంబున గాంగేయుండు
విదురుం జూచి యి ట్లనియె. 12

చ. మనకుల మొందు రాజకులమండన మై నుడికార మంది యుం
డెను ధరఁ దొంటినుండియుఁ గడిందియశంబున నింకఁ బైఁ బయిన్
వనధివలెం గడుం బ్రబలుభంగిని నీవును నేనుఁ జేయ నౌ
ఘనమతి వీవు నీతలఁచుకార్యము సమ్మత మెల్లవారికిన్. 13

*గురురాజ్యము = గొప్పరాజ్యము. ‡ వంతు = సామ్యము, లేక పోటి.

తే. సుబలసుతయును గుంతిభోజునిసుతయును, మనకులంబునఁ గోడండ్రు గను దలిర్పఁ
దగినకన్నియ లని వింటి దాని కేమి, చెప్పెదవొ చెప్పు మనుటయు నప్పు డతఁడు.
క. నీవే తల్లివి తండ్రివి, నీవే గురుఁడవును మాకు నీవాక్యమ్మే
భావింప వేదవాక్యము, గావున నీ వరసి చేయఁగాఁ దగు నదియున్. 15

ధృతరాష్ట్రునివివాహము.

వ. అంత భీష్ముండును. 16
క.*భగనేత్రహరుని హరునిన్, దగ నారాధించి సుతశతముఁ గొన వరి మం
దగ నమ్యె సుబలసుత నా,సుగుణవతిం దేర మనకు శుభ మగు ననుచున్. 17
తరువోజ. అని దూతముఖమున నాసుబలునకు నది యెఱిఁగించిన నతఁడు జాత్యంధుఁ
డనుచు లో సందియ మంది కులంబు ననము వృత్తము నెంచి యాంబికేయునకుఁ
దనయ నీయఁ దలంచెఁ దరుణియును విని తల్లిదండ్రులమాట దాఁటంగఁ బోక
తనకన్నుఁగవకు వస్త్రముఁ గట్టుకొనియెఁ దనరఁ బతివ్రతాతత్పర యగుచు. 18
తే. అంత నక్కన్యఁ దోడ్కొని యామెతమ్ముఁ, డయినశకుని మహాభూతి హస్తిపురికి
వచ్చె ధృతరాష్ట్రుఁడును భీష్మువచనమునను, బెండ్లి యాడెను గాంధారిఁ బేర్మితోడ.
వ.‡ మఱియు నతండు నాగాంధారిసహోదరు లయినసత్యవ్రత సత్యసేన సుదేష్ణ సంహిత
తేజశ్శ్రవ సుశ్రవ నికృతి శుంభ సంభవ దశార్ణ యనుపదుండ్ర నమ్మహూర్తంబునన
పెండ్లియాడి పిదపఁ గాలాంతరంబున గాంగేయుండు స్వయంవరరంగంబులం గెలిచి
తెచ్చినకన్యాశతంబునుం బరిగ్రహించె నంత. 20
తే. పతికి ననుగుణముగ నేత్రపట్టముఁ గొని, పతిపరాయణ యగునాసుబలునిపట్టి
సన్నుతాచారశీల యై జగతి నొప్పెఁ, గౌరవులగౌరవమున కాకరము గాఁగ. 21
వ. అనంతరంబ. 22

కుంతీచరిత్రము.

శా. విద్యావంతుఁడు వీర్యవంతుఁడు నతోర్వీకాంతుఁడుం గాంతిమ
ద్వేద్యస్వాంతుఁడు పాండురాజు తన కత్యర్థిన్ రూపశీలాదులన్
హృద్యం బై నకళత్రముం దలఁచి కుంతిం గుంతిభోజాత్మజన్
సద్యస్స్వాలక్కృతస్వయంవరమునన్ సానందుఁ డై చేకొనెన్. 23
వ. అనిన జనమేజయుండు కుంతిచరిత్రంబు చెప్పు మనిన వైశంపాయనుం డిట్లనియె. 24

---

* మూ. ఆరాధ్యవరదం దేవం భగనేత్రహరం హరం (భారతము) ‡ ధృతరాష్ట్రుఁడు సత్యవ్రతాదులఁ బదుండ్రను దక్కినకన్యాశతంబునుం బెండ్లియాడినట్లు కొన్నిప్రతులలో లేదు.

సీ. శూరసేనుం డను • శూరుండు యదువంశ, జాతుండు వసుదేవ • జనకుఁ డతఁడు
తనకన్నకన్నెఁ బృ • థాదేవి మేనత్త, సుతుఁ డైనకుంతిభో • జునకుఁ బ్రీతి
నిచ్చెఁ బుత్త్రిక గాఁగ • నెలనాఁగ నెల నాఁగఁ, బెరుఁగుచు నాభోజు • నిరవునందు
నమ్మహాత్ము మతిథుల • కభ్యాగతులకును, బెట్టు నవ్వారిగాఁ • బితృనియుక్తి
తే. నప్పు డొకనాఁడు దుర్వాసుఁ • డనుమునీంద్రుఁ, డతిథి యై రాఁగ నిష్టమృ • ష్టాన్నతర్ప
ణాదినానావిధోపచా • రాంచితులఁ, బ్రీతుఁ గావించె సతిని నా • వెలఁదిమిన్న. 25

వ. అమ్ముదితచేతకుం జేతంబునఁ బ్రమోదితుండై దుర్వాసుం డామె కొక్క మంత్రం బనుగ్రహించి దీన నేయే వేల్పుం దలంతు వాయావేల్పు వచ్చి నీకుం బుత్త్రదానంబు సేయుచుండు నని యర్థేచ్ఛం జనియె నంతం గొంతియు నమ్మంత్రశక్తి యెఱుంగం దలంచి చాపలంబున నొక్కనాఁ డుదితుండై లోచనగోచరుం డైనదివాకరు నాహ్వానంబు సేయుటయు. 26

మ. ఉదయార్కారుణబింబమధ్యగతుఁ డై • య్యుగ్రన్ భానుభోభాగముల్
పొదల న్నిండ సహస్రధా తనురుచుల్ • పూఁబోఁడిచెంతన్ శుభ
ప్రదుఁ డై వేఁడివెలుంగు రాఁగ ముదమూం • పం బొల్చి బింబోష్ఠితో
నిదె నే వచ్చితి నేమి కావలయు నా • కేర్పడం జెప్పవే. 27

వ. అనిన వెఱఁగుపడి గడగడవడంకుచు నమ్ముగుద కేలుఁదోయి మొగిచి. 28

క. ఒకముని కరుణించెను నా, కొకమంత్రము తత్ప్రభావ • మూహించుట కే
నకలంకమూర్తి నినుఁ గా, నక పిలిచితిఁ దప్పు సైఁచి • ననుఁ గావఁ గదే. 29

ఆ. అబల నెఱుఁగ లేమి • నపరాధ మొనరింప, నధికు లెల్లవారి • నాదరించి
కాచి పుత్తు రెపుడుఁ • గన్నియఁ గరుణించి, తప్పు సైఁప • నీకుఁ • దగును గాదె. 30

వ. అని దీనవదన యై మ్రొక్కు నక్కన్నియం గాంచి దివాకరుండును. 31

క. *ఎఱుఁగుము దుర్వాసుఁడు నీ, కెఱిఁగి కెడఁద నొచ్చి యిచ్చె • నీకీమంత్రం
బఱిగొఱ గా నిదె లోనన్, వెఱ పుడుగుము నన్నుఁ బిలిచి • వృథ సేయుదువే. 32

గీ. †అనుడు వార్ష్ణేయి బెగడి లో • కైకమిత్ర, గుణము గా దిది కన్యకుఁ • గొడుకు వుట్టఁ
జుట్టలును దల్లిదండ్రులు • చూచి నగుదు, రేమి సేయుదు వాదు నే • నెట్లు పడుదు. 33

వ. అని ప్రార్థించినం బ్రసన్నుం డై ప్రద్యోతనుండు కన్యాత్వంబు దూషితంబు గాకుండ వరం బిచ్చి దాని ననుగ్రహించి కలసె నంత. 34

* అఱిగొఱ — న్యూనము. † వార్ష్ణేయి — వృష్ణికులసంభవ; కుంతి.

కర్ణునిజన్మము.

సీ. పాలబుగ్గలవాఁడు ♦ పసుపునిగ్గులవాఁడు, పున్నమనెలఁ బోలు♦మోమువాఁడు
వాలుఁగన్నులవాఁడు ♦ వ్రేలుచేతులవాఁడు, చుట్లు వారిన లేఁత♦జుంజువాఁడు
మొలకనవ్వులవాఁడు ♦ చిలుకముక్కులవాఁడు, డంబైన తొగరుగ♦డ్డంబువాఁడు
ముద్దుగుల్కెడువాఁడు♦ముచ్చటాకారువాఁడు, ముక్కుపచ్చలు దేరు♦మురువుకాఁడు
తే. కాలుసేతులు గదలించి ♦ కూయువాఁడు, కనులఁ బిటబిట్లు గొలుపుచుఁ♦దనరువాఁడు
కవచకుండలభూషలు ♦ గలుగువాఁడు, పుట్టెఁ జన్నారి పొన్నారి♦పట్టివాఁడు. 35

వ. ప్రభాకరుండును దానికి మగుల కన్యాత్వం బొసంగి దివంబున కుద్గమించె నప్పుడు. 36

చ. అరుణగభస్తి భూతలము♦నందుఁ దలిర్చెననోఁగఁ దేజునం
గరిమ వెలుంగుచుండు కడు♦కర్ణుఁడు వాని జగం బెఱుంగు న
వ్వరసుతుఁ గాంచి కుంతి తన♦వారికిఁ దలవంపు లందు నోఁ
గగముఁ దలంక చేయఁ గల♦కర్జముఁ గూర్చి చింత సేయుచున్. 37

క. తనయునిచాలముఁ దాఁపఁగ, మనమునఁ దలపోసి ముక్కు♦మంజసయందున్
దనయు నిడి గూఢచారింబున నొంటి నైనఁ బుత్త్ర♦మోహము విడుచున్. 38

తే. కన్నకసు పైనఁ గొంకరు ♦ కలుష మనరు, గాలి ప్రోవులు వెట్టుదు ♦ రోలి బొంక
జంకరింతైన నాశల♦లగ్గె విడుటి, రెంతసాహసురాండ్రైన ♦ నింతు లౌర. 39

వ. అట్లు జలంబులం బడియు దైవబలంబునఁ బానికి కానీనుండు కొట్టుకొని పోవుచుండ నొక్కచో సూతుం డొక్కరుండు వానిం బట్టుకొని పోయి రాధ యనుతనభార్య కిచ్చి పుత్త్రునిఁ గాఁ జేసికొని పెంచె వసునివహంబుతోడం బుట్టినవాఁడు గావున వసుషేణుం డనం బరఁగి కానీనుండు రాధేయుండై సూతగృహంబునం బెరిఁగి పెద్దవాఁడై సర్వశస్త్రాస్త్రవిదుండై సూర్యునారాధించుచుండి గింతుమిగిలి మహాదాత యనం బేరు వడసి కాలక్రమంబునం గారణాంతరంబున సహజకవచకుండలంబులు కర్తనము చేసి విప్రరూపుం డగువిబుధేశ్వరవల్లభున కిచ్చినకతనఁ గర్ణుండు వికర్తనుండు నాఁ బడియె నంత నిటఁ గుంతిభోజుపురంబున. 40

పాండురాజు కుంతిం బెండ్లియాడుట

మ. *సొగసుం గుల్కెడువాలుఁగన్నులును దే♦జుం గుల్కు నెమ్మేను నిం
పగుపాయంబును గల్గి కన్నియలకె♦న్నా కైన యక్కుంతినిం
జగతీనాథులు కొందఱీ మ్మనుచు భో♦జక్ష్మావరుం గోరుచుం
డగఁ జర్చించి స్వయంవరంబు ననుమహేం♦ద్రుం జాటె దేశంబులన్. 41

* కుల్కు = వెదఁజల్లు.

చ. ధరఁ గలరాజులెల్లరు ముదంబునఁ బొందుచు వచ్చి రాస్వయం
వరమున కమ్మహీవరులవర్గమునందు సురేంద్రుఁడో యనన్
సురుచిరకాయకాంతులను సూరెలవారలఁ గప్పి యొప్పునా
భరతకులప్రదీపకునిఁ బాండునిఁ గన్గొని కుంతి యెంతయున్. 42

తే. కలఁగి మనమునఁ గామవికారమునను, గళవళము నొంది సర్వాంగకంప మొదవ
సిగ్గు దిగ్గనఁ బయికొనఁ జేరి పూలదండ పాండుభూజానిస్కంధమున వైచె. 43

ఆ. ఆస్వయంవరమున కాగతు లగుమహీకాంతు లెల్లఁ జనిరి కుంతిభోజుఁ
డుత్సవం బొనర్చె నొసరి శచీపురందరు లనఁగఁ దగిరి దంపతు లట. 44

శా. అంతం గుంతిని దోడుకొంచుఁ గురువంశాధీశ్వరుం డెంతయే
సంతోషంబును వైభవంబు బొదలన్ సైన్యంబు వెన్నంటి రా
దంతీంద్రాఖ్య జగత్ప్రసిద్ధ మయి మోదం బిచ్చుప్రోలేగి శు
ద్ధాంతంబం దట నిల్చెఁ గాంత జగ మత్యంతంబు హర్షింపఁగన్. 45

శా. గంగానందనుఁ డంత నెంతయును వేడ్కం బాండుభూజానికిన్
శృంగారంబుల కాలవాల మయి వాసిం గన్నవే యొక్కక
న్యం గళ్యాణ మొనర్ప నెంచి బహుసేనావారముల్ గొల్వ నే
గెం గీర్త్యం జనుమద్రదేశమున కక్షీణప్రతాపంబునన్. 46

మాద్రివృత్తాంతము.

ఆ. శాంతనవుఁడు రాఁగ శల్యుఁ డాబాహ్లీకపుంగవుం డెదురుగఁ బోయి తోడు
కొని నగరికి వచ్చి తనరఁ బూజించి యాగమనకార్య మడిగెఁ గౌతుకమున. 47

చ. అడిగిన భీష్ముఁ డిట్లనియె నార్య శుభంబును గోరి వచ్చితిం
బడుచు భవత్సహోదరిని బాండుమహీపతి కిమ్మటంచు నే
నడుగుచు నుంటిఁ జుట్టరిక మందఁగ మాకును మీరు మీకు మే
మెడపక యుంటి మందు మది నెంచి మముం గరిమం గ్రహింపుమా. 48

సీ. అనుడు మద్రేశ్వరుం డనియె నోయనఘ మీకన్న మా కధికులు గలుగ రైన
నాచార మొకఁడు మాయన్వయంబునయందుఁ దొంటినుండియుఁ గల్గియుంటవినరె
తప్పైన నొప్పైన దాని నుల్లంఘింప, నే నుత్సహింప నెంతైనఁ గాని
యిది యంతయును మీర యెఱుఁగుదు రిమ్మని,మి మ్మనుగుటయును మేర గాదు

తే. మాకు ధర్మము ముఖ్యప్రమాణ మదియు, కాన సందిగ్ధ మింతయుఁ గలుగకుండ
నుత్తరం బిందుఁ జెప్ప లేకున్నవాఁడ, ననిన దేవవ్రతుఁడు వాని కనియె నిట్లు. 49

మ. ఇది ముఖ్యం బగుధర్మ మంచు విధి దా నే మున్ను వాకొచ్చె నిం
దొదవం బోవ దొకింతదోషమును నీ వూహింపు మియ్యర్థ మె
ప్పుడు నా రాదు కులాగత మ్మగుట భవ్యం బంచుఁ దా నిచ్చె న
న్నదిపుత్రుండు చిరత్నరత్నధనధాన్యవ్రాతము న్వానికిన్. 50

వ. మఱియును వేనవేలుగజాశ్వరథవస్తువాహనసముత్కరంబు సుంకువ నెట్టిపెట్టి మద్రేశ్వరుండు సంతసించుచు నలంకరించినమాద్రిం దెచ్చి భీష్మున కిచ్చుటయు నతం డామెం దోడ్కొని హస్తిపురంబునకు మరలి వచ్చి. 51

తే. అంత దైవజ్ఞనిర్మిత మైనశుభముహూర్తమున నాపగాసూనుఁ డొప్పి శల్యు
చెల్లెలగుమాద్రినిం బెండ్లి చేసెఁ బేర్మి, రాజసమతేజునకుఁ బాండురాజునకును. 52

శా. కుంతీమాద్రులు భక్తితత్పరత మైఁ గొల్వంగ దేవేరులై
కంతుండో యనఁ నొప్పి పాండుధరణీకాంతుండు రాజిల్లుచున్
సంతోషంబున నుండె సంతిపురిలో సౌఖ్యంబు సంధిల్ల న
త్యంతేష్టంబునఁ జేసి ముప్పదినిశల్ తా మంతఁ దా మేఁగఁగన్. 53

వ. అంత. 54

తే. దేవకుం డనుమహిపతి దెలుచుకన్యఁ, బారసవిఁ దేరఁ బుచ్చి భూపాలు రెల్ల
మెచ్చ మందాకినీసూనుఁ డిచ్చఁ జేసెఁ, బెండ్లి నీతికోవిదుఁ డైన విదురునకును.

తే. రూపయౌవనసంపన్న యైన పరఁగిన, పారసవియందు విదురుఁ డపారవినయ
యుతుల నన్నిటఁ దనుఁబోలు నున్నతులను, గనియె సుతులఁ దా నవ్వాలి కాలమందు.

క. అంబాలికేయుఁ డత్తఱి, నంబలకును మ్రొక్కి భీష్మునను మతిఁ గొని శౌ
ర్యంబున బహుచతురంగబలంబులతోఁ జైత్రయాత్ర లలి సలుపఁ జనెన్. 57

పాండురాజు దిగ్విజయము సేయుట.

మ. కరు లశ్వంబులు తేరులుం భటులు లసంఖ్యాకంబులై సర్వతః
పరిపూర్ణం బనుభూరివాహినులతోఁ బాండుక్షమావల్లభుం
డురుతేజంబున సర్వదిగ్విజయ మియ్యుర్విం గొనం బోవుచున్
బరరాష్ట్రంబులు పిచ్చలించి కర మొప్పం గట్టనై లోఁ బడెన్. 58

క. మునుమున్న తమకు నపకృతిఁ, బొనరించినయద్దశార్ణభూపతుల దురం
బున గెలిచి పాండుభూపతి, తనసేవలు బలసి కొలువఁ దరలి యథేచ్ఛన్. 59

ఉ. రాజగృహంబునన్ మగధరాష్ట్రము నేలుచునుండి క్రొవ్వునన్
రాజుల నుత్తమోత్తముల రాయిడి వెట్టుచునట్టిదీర్ఘు ఘో

చా నొసర్చితి కాన నీవును • జాన నంటినయప్పు డీ
మేను వాయఁ గలాఁడ వం చని • మిత్తివాతఁ బడెదు వడిన్. 81

వ. అట్లు పడి విలపింపం దన్నుఁ గొనుచుం జచ్చినమృగంబులఁ జూచి పాండురాజు
కరంబు నిర్వేదించి. 82

తే. యాయజూకాన్వయంబున • యందుఁ బుట్టి, నేని సదసద్వివేకి యా • నేని సుకృత
కర్మము లొనర్చె నేని భూ • కాంతుఁ డేని, కామమోహితుఁడై నదు • ర్గతులఁ బడఁడె.

వ. తొల్లి యగస్త్యుండు రాజులకు మృగవధము దురితంబునం బొరయ నేరదని చెప్పినను.

క. కుంటిం దెవులుం గొంటుం, బెంటిని బెనఁగొన్నదాని • వెఱఁ బడుదానిం
గంటకు మొనసినదానిం, గంటకుఁడై మృగము నేయఁ • గా దనరె బుధుల్. 85

చ. హిమకరుఁ డాదిఁగా జగతి • నెన్నిక కెక్కినభారతాన్వవా
యమునఁ బవిత్రజన్మమున • నై నరనాథుఁడ నైన నేను ను
త్తము లగుపూరుముఖ్యుల ను • దారయశస్కులఁ బోల నేర కీ
క్రమమున సంచరించుచు న • కార్య మధర్మము సేయఁ బోలునే. 86

ఉ. అక్కట ధర్మమూర్తి యన • నై తగువానికిఁ బుట్టి బాల్యమం
దెక్కినకామతాపమున • నిగ్గెను దండ్రి తదీయజాయయం
దక్కమలాక్షుఁడే యనఁగ • నైనఋషీంద్రున కేను బుట్టి యీ
చక్కి నశించితిన్ వ్యసన • సంహతి సంహృతమానసుండ నై. 87

చ. వ్యసన మపాత్రశాత్రవ మ • వశ్యము దాన నశించు మానవుం
డసమయమంద నే నిఁక గృ • హస్థసుఖంబుల నుజ్జగించి యే
వ్యసనములందును న్మనము • వాఱఁగ నీయక మంచిచెడ్డలం
దు సమగతిం గ్రహించి నిలు • తున్ భయదూరపథానువర్తి నై. 88

పాండురాజు ప్రవ్రజితుం డయి శతశృంగమున కేగుట.

వ. అని పలుకుచు విరక్తుం డయి సర్వసంగములు విడిచి సర్వభూతసమచిత్తుండై ముని
వృత్తి నవలంబించి వనంబుల నాకలంబుల నుదరపోషణంబు చేసికొనుచు బ్రహ్మా
నందరసైకపానపరవశుండ నై కాలంబు గడపెదం గాక యని నిశ్చయించి కుంతీ
మాద్రులం జూచి మీరు కరిపురంబున కరిగి నాతపోవృత్తి నునికి సమస్తబంధుజనం
బులకుం దెలియఁ జెప్పునది యనిన వారును. 89

తే. ఆర్తుఁడై యున్నఁ బతి తాను • నార్త యగుచు
ముదితుఁడై యున్నఁ దానును • ముదిత యగుచుఁ

క. విడి మూఁడుగులును శయ్యలు, నడవులలో వేఁట లాడ నతివలతోడన్
వడిఁ బోయి యంద యుండెను, విడువక శస్త్రాస్త్రసమితి వీర్యం బెసఁగన్. 70

తే. ప్రతిదినంబును బరిజనప్రతతిచేత, వనికి రాజోపభోగ్యముల్ పనిచి పాండు
రాజుఁ బరమోచితోపచారములనరయుచుండెధృతరాష్ట్రుఁ డేమఱకుండనపుడు.

వ. ఇట్లు వనవాసవ్యాసంగంబునం జేసి పాండురాజు సతీసమేతుండై హిమవన్నగదక్షిణ
పార్శ్వంబునందును మహాసాలవనంబునందును విహరించుచు నొక్కనాఁ డొక్క
ప్రదేశంబున. 72

క. తమిఁ బెనఁగులాడుమృగమిథునముఁ గూలఁగ నేసె నేనునారాచములన్
శమ మింత లేక మృగయునిక్రమమున నక్కురువిభుండు కఠినాత్ముండై. 73

వ. అప్పు డల్పావశిష్టప్రాణం బయి పడి విలపించుచున్న యిఱ్ఱి మనుష్యవాక్యంబుల
రాజున కిట్లనియె. 74

పాండుని మృగము శపించుట.

చ. నరవర కామమన్యుపరినద్ధహృదంతరు లైన శేముషీ
విరహితు లైనఁ బాపరతి విక్కుఁడువా రయినన్ నృశంసముల్
నిరతము వీడి యుండెద రనింద్యచరిత్రులవంశమందు నా
నరులకు నిట్లు చిత్తచలనం బగుట ల్కడుఁజిత్ర మక్కటా. 75

క. నను వధియించినదానన్, ఘనతరకిల్బిషము నీకుఁ గాదె నరేంద్రా
మనమున నిట్లు తలంపవు, నినుఁ బొందఁగ నిచ్చగించునే శ్రేయంబుల్. 76

తే. అనుడు నతఁ డను రాజుల కరివధంబు, మృగవధంబును ధర్మ మై నెగడు మున్న
గస్త్యుఁడును సత్త్ర మొనరించుకాలమందు, వేఁటలాడుచు మృగవప వేల్చె వింటె.

వ. ఇది ధర్మ్మ వని యెఱుంగక నీవు నన్ను మోహంబునం జేసి గర్హించుచుంటి విట్లు తగ
దన మృగంబు వెండియును. 78

చ.*సమయము వేచి విద్విషులఁ జంపుదు రట్లు మృగంబులన్ భవ
త్క్రమ మటు గాదు నామృగిని గట్ట రమించెడుపట్టున న్ననున్
భ్రమసి వధించి తారయుచు భల్లములం జనవల్లభా గత
క్షమఁ డెవఁ డిట్లు చేసెడి మృగంబులఁ జంపెడివాఁడ యేనియున్. 79

క. పౌరవవంశజుఁడవు నీ, వారయ నీ కిట్టికర్మ మనురూప మొకో
క్రూర మయశస్య మధమము, భారత నీ వగుదె సుగతిపథ మందంగన్. 80

మత్త. ఏను గిందమఁ డన్మునీంద్రుఁడ నిట్టు లీమృగరూపమున్
బూని పెంటిని బొందుచుండఁగ బోయవోలె ఖలుండవై

* కట్ట=గర్భముధరింప.

చా నొసర్చితి కాన నీవును • జాన నంటినయప్పు డీ
మేను వాయఁ గలాఁడ వం చని • మిత్తివాతఁ బడెఁ వడిన్. 81

వ. అట్లు పడి విలపింపం దన్నుఁ గొనుచుం జచ్చినమృగంబులఁ జూచి పాండురాజు కరంబు నిర్వేదించి. 82

తే. యాయయజూకాన్వయంబున • యందుఁ బుట్టి, నేని సదసద్వివేకి యా • నేని సుకృత కర్మము లొనర్చె నేని భూ • కాంతుఁ డేని, గామమోహితుఁడై నదు • ర్గతులఁ బడఁడె.

వ తొల్లి యగస్త్యుండు రాజులకు మృగవధము దురితంబునంబొకయ నేరదని చెప్పినను.

క. కుంటిం దెవులుంగొంటుం, బెంటిని బెనఁగొన్నదాని • వెఱఁ బడుదానిం గంటకు మొనసినదానిం, గంటకుఁ డై మృగము నేయఁ • గా దనరె బుధుల్. 85

చ. హిమకరుఁ డాదిఁగా జగతి • నెన్నిక కెక్కినభారతాన్వవా యమునఁ బవిత్రజన్మమున • నై నరనాథుఁడ నైననేను ను త్తము లగుపూరుముఖ్యుల ను • దారయశస్కులఁ బోల నేరక క్రియమున సంచరించుచు న • కార్య మధర్మము సేయఁ బోలునే. 86

ఉ. అక్కట ధర్మమూర్తి యన • నై తగువానికిఁ బుట్టి బాల్యమం దెక్కినకామతాపమున • నిగ్గెను దండ్రి తదీయజాయయం దక్కమలాక్షుఁడే యనఁగ • నై నఋషీంద్రున కేను బుట్టి యీ చక్కి నశించితిన్ వ్యసన • సంహతి సంహృతమానసుండ నై. 87

చ. వ్యసను మహాత్రశాస్త్రవ మ • వశ్యము దాన నశించు మానవుం డసమయమంది నే నిఁక గృ • హస్థసుఖంబుల నుజ్జగించి యే వ్యసనములందును న్మనము • వాఱఁగ నీయక మంచిచెడ్డలం దు సమగతిం గ్రహించి నిలు • తున్ భయదూరపథానువర్తి నై. 88

—●●◆ పాండురాజు ప్రవ్రజితుం డయి శతశృంగమున కేగుట. ◆●● —

వ. అని పగచుచు విరక్తుం డయి సర్వసంగములు విడిచి సర్వభూతసమచిత్తుండనై ముని వృత్తి నవలంబించి వనంబుల నాకలంబుల నుదరపోషణంబు చేసికొనుచు బ్రహ్మ నందరనై కపానపరివశుండ నై కాలంబు గడపెదం గాక యని నిశ్చయించి కుంతీ మాద్రులం జూచి మీరు కరిపురంబున కరిగి నాతపోవృత్తి నునికి సమస్తబంధుజనం బులకుం దెలియఁ జెప్పునది యనిన వారును. 89

తే. ఆర్తుఁ డై యున్నఁ బతి తాను • నార్త యగుచు ముదితుఁ డై యున్నఁ దానును • ముదిత యగుచుఁ

ప్రోషితుం డైనఁ దాఁ జిక్కి పొల్పు విడుచుఁ
జచ్చినను జచ్చునది కాదె సాధ్వి యనఁగ. 90

మ. సుగ మైన న్మతి కష్ట మైన సతికిన్ జుట్టంబు ప్రాణేశుఁడే
యగు లోకంబును వానితోడిద హృదిన్ మేము నిన్ బాసి పో
వగునే చత్తుము గాక మమ్ము విడకీ వారణ్యధర్మంబు లం
దఁగ నొప్పం దపియింప నొప్పు వ్రతముం దాల్పంగ నొప్పం గదే. 91

వ. అనిన వారిదృఢనిశ్చయం బెఱింగి కురుపుంగవుం డట్లేని మీరు నాయొద్దన యుండుఁ డేను వానప్రస్థాశ్రమంబునఁ గందమూలఫలాశనుండ నయి తపించుచుఁ గాలంబు గడపెదం గాక యని. 92

అతిజగతి. పుడమివేల్పుల కెల్లవి భూషణంబుల్, విడిచి యిచ్చి మఱిం గల విత్త మెల్లన్
ముడిచి బంటులచే నిడి పుచ్చె వీటన్, విడిసి యుండెమునన్నకు వేడ్కతోడన్.

వ. మఱియు నిట్లు రాజలాంఛనంబు లగు చూడామణినిష్కాంగదకుండలాదులం దీసి తన యన్న కిచ్చుటకుం బరిచారకులచేతి కిచ్చి పాండురాజు ప్రవ్రజితుం డయ్యె నని నాగపురంబునం జెప్పుమరుగాక యని వగచువారి నంపిపుచ్చి తాను దనయోషామణులతోఁ దపోవేషం బవధరించి శీతవాతాతపసహుండును ననపేక్షితక్షుత్పిపాసాతురుండును నై కదలి యుత్తరాభిముఖుం డై నాగశైలచైత్రరథకాలకూటాదులం దాఁటి హిమవంతం బతిక్రమించి గంధమాదనంబున విశ్రమించి యింద్రద్యుమ్నసరోవరంబునం గృతస్నానుం డై హంసకూటంబు గడచి శతశృంగంబుఁ జేరి తదుత్తరభాగంబున సిద్ధచారణసంఘంబులం గలసి శుశ్రూష చేయుచు నహంకారమమకారంబు లడంచి యింద్రియంబుల నిగ్రహించి ఘోరతపంబు సేయుచు నొక్కదర్శపర్వంబున దేవలోకంబుల కరిగెడు దేవర్షిగణంబులం గాంచి మీ రెందుఁ బోవుచుంటి రని యడిగిన వా రతని కిట్లనిరి. 94

పాండురాజు ఋషిగణంబులం గాంచి సంభాషించుట.

తే. నేఁడు సత్యలోకమున మునిప్రవరులు, దేవతలు పితృదేవతల్ దేవదేవుఁ
డైనపరమేష్ఠిసన్నిధియందుఁ బెద్ద, సభఁ బొనర్చెద రది చూడఁ జనుదు మేము.

వ. అనిన నతండు తాను నటఁ బో వారి ననుసరించి స్వర్గమార్గంబున నిర్గమింప నెంచి దేవీసహితుం డై యుత్తరాభిముఖంబు వట్టి కొంత చనుదెంచువానిం గాంచి ఋషులి ట్లనిరి. 96

సీ. ఇట నుండి మీఁదుగా నేగుదు మే మివె, గిరు లేరికిని బోవఁ దరము గాదు
వేనవే ల్దివ్యవిమానంబు లిం దందుఁ, దిరిగెడు నొండొంటి నొరసి కొనుచు

దారుల గెల్చి సర్వవసుధాతలము న్నిజబాహుపీఠిఁ ద
ద్భూరిభరంబుఁ దాల్చి బుభుపుంగవుఁ డో యన నేలె మేలుగన్. 116

ఉ. దిగ్విజయంబుఁ జేసి తన తెచ్చినహెచ్చినరత్నరాశి బు
త్విగ్వరకోటి కిచ్చి పృథివీధవుఁ డాతఁ డొనర్చె యాజకుల్
భృగ్వసితాదు లెన్నఁగ ననేకము లధ్వరము ల్మహోయశో
ధుగ్విధులన్ బిడౌజునకుఁ దో డని వీడనిపేరు వొందఁగన్. 117

ఆ. అతఁ డొనర్చినట్టిహయమేధమున నింద్రుఁ,డొట్టివేల్పు లెల్లతోడ దేవ
మునులు గలయ వచ్చి మనమున హర్షించి, సోమ మాని చనిరి భూమినాథ.

క.*అతనికి సతియై కాక్షీ,వతి భద్రాఖ్యం దలిర్చువనితామణి తా
రతివో లె రూపసంపద, నతికి నెం బతికి మేని కనుసీడవలెన్. 119

వ. వ్యుషితాశ్వుండును రూపయౌవనసంపన్న యగునా కన్యకయందుఁ గామ
సంపన్నుండై రాజయక్ష్మం జేసి యచిరకాలంబున ననపత్యుండై కాలధర్మంబు
నొందె నంత. 120

ఉ. భద్రయు భద్రమూర్తి యగుభర్తశవంబును గాఁగిలించి దుః
ఖద్రవమానసంబునను గ్రమ్మఁగ నెమ్మది వీడి యేడ్చె న
చ్ఛిద్రగతిన్ దిగు ల్గొనఁగ స్రుక్కిన నాసమయంబునందు ని
ర్నిద్రకృపారసంబున మునిప్రకృతుం డతఁ డాశవంబునన్. 121

వ. అంతర్హితుండై కాంతా! సంతాపింపకుము నీకు నావలన సంతానంబు లభించు
ననిన నామెయు ఋతుస్నాతయై. 122

ఆ. పతిశవంబుమీఁదఁ బడి రాసికొనుడుఁ ద,త్కర్మమునను ముగురుతనులు సాళ్వ
లును నలువురు మద్రులును బుట్టి రాసతి,కెల్ల రౌ ననంగ నిభపురీశ. 123

క. నీవు నాయు తపోబలమున, దైవానుగ్రహముకలిమిఁ దనయులఁ బడయం
గా వలయు పతులయం దన, దేవరుపడి పాండురాజు దేవికి ననియెన్. 124

క. అమకోపముఁ డావ్యుషితా,శ్వమహీపతి వానిఁ బోలఁ జాలుదు రటవే
మముబోంట్లు దాని విమువ్రుము, విమలమతి న్నాదుమాట విను మని మఱియున్.

మ.†ఋతుకాలంబులఁ దొల్లి కాంతలు సుతప్రేమన్ బతుల్ ప్రోషిత
స్థితి నుండం బరపూరుషుం గలయుటల్ సిద్ధించెడిన్ దాని ను

* కాక్షీవతి — కక్షీవంతునికూఁతురు. ఈమె మగనిశవమువలనఁ గొడుకులఁ గాంచినది. ఇది మిక్కిలి చిత్రము.  † అనుత = అతిమొదలు.

ద్ధతుఁ డుద్దాలకు శ్వేతకేతుఁ డడఁచెన్ ♦ ధర్మంబు గా దంచు నా
నుత స్వాతంత్ర్యము స్త్రీల కట్టి దుడిగెన్ ♦ జూపట్టెఁ బాపంబులున్. 126

తే. అట్టిమర్యాద జగమునం ♦ దయ్యెఁ గాన, బతి నియోగింప కెద్దియు ♦ సతి పౌనర్భ
గలుష మగు నట్లు పతినియో♦గంబు నర్భ,కునికియును దోష మనుచును ♦ మనువు పలికె.

మ.*కనుఁగో ధర్మువు గాన నెందుఁ దొలుతన్ ♦ గల్మాషపాదుండు పం
చినయంత న్మదయంతి యన్ మగువ వా♦సిష్ఠోగ్రతేజంబునన్
జను మెన్నం గనె నశ్మకుం దలఁప నం♦స్మజ్జన్మ మిట్లు ధరన్
గొనియాడం బడెఁ గానఁ బుత్త్రుఁ గని నా♦కుం గూర్పవే లోకముల్. 128

వ. అని ప్రార్థించినం బ్రసన్నవదనయై కొంతి సంతానాపేక్షం జనుచునిన దుర్వాసుం డిచ్చినమంత్రంబుప్రభావం బెఱింగించి నా కెల్లవేల్పులును వశవర్తులు నే నిప్పుడే వేల్పు నారాధింతు నాన తిమ్మనిన నెంతయు సంతోషితస్వాంతుండై శంతనుపౌత్త్రుండు నిజకాంత కిట్లనియె. 129


కుంతికి ధర్మరాజు పుట్టుట.

ఉ. ధర్మువునందు లోకము నుతం బగుఁ గావున ధర్మమూర్తి నా
ధర్ముఁ దలంపు మాత్రఁడ బుధప్రకరంబులఁ బెద్ద తద్దయున్
ధార్మికుఁ డుద్భవించెడు న♦ధర్మవిధు ల్నశియించు నిద్ధరన్
ధర్మజు కారణంబునన ♦ నాకు లభించెడు నూర్ధ్వలోకముల్. 130

క. అని మగఁ డాజ్ఞాపించిన, వనిత నమస్కృతి పౌనర్చె ♦ వలగొని పతికిన్
ఘనుఁ డా ముని కిరుణించిన,మను వారాధించి తలఁచె ♦ మ

గీ. కుంతి సంతానకాంక్షఁ గృ♦తాంతు నంత,రంగమున యా
చేయునప్పటి కొక్కి యేఁడు ♦ నెల్లె గర్భ, మా

వ. అంత నాసమవర్తియు యోగమూర్తిధరు
మానం బెక్కకొని కుంతి జపించు చోటికి వ
మనినఁ గుంతియు.

క. పుత్త్రి నొసంగుము నా కో,మిత్త్రా
ద్గాత్రం బంటెను దానం, బుత్త్ర

మ. ‡జనియించె నవరపుత్త్రుఁ డై
బొనరన్ బూష తులాయ

* అశ్మకుఁడు:—అశ్మక

బును బూర్ణం బగుసత్తిథిఁ బగలు పెంపుం గాంచి తా నష్టమం
బన మే తానభిజిన్ముహూర్తమునయం దాధర్మునంశంబునన్. 135

క. పృథ గన్నపుత్త్రుఁ డితఁడు, పృథివీశుం డగును ధర్మభృత్తులలోనన్
బృథు వగు యుధిష్ఠిరుం డనఁ, బ్రథితుం డగు ననుచు నభ్రవాణి వచించెన్. 136

మ. శతశృంగాద్రి మెలంగుసంయమివరుల్ సంతోషితస్వాంతులై
సుతుఁ డప్పాండున కుద్భవిల్లె ననుచుం జూడంగ నేతెంచి సం
సితధర్మస్థితి జాతకర్మవిధులన్ జేయించి ధర్మాత్మజున్
శ్రుతిసారోక్తుల ధర్మమూర్తియ యటంచుం జేసి రాశీస్సులన్. 137

వ. ఇట్లు ధర్మపుత్త్రోదయంబున నత్యంతానందమగ్నాంతరంగుండై పాండురాజు సుఖం
బుండె నంత నక్కడ. 138

దుర్యోధనాదులజననము.

మ. ధృతరాష్ట్రుం డటు కూర్చుతమ్ముఁడు విరక్తిం జెంది సర్వస్వమున్
ధృతి వర్జించి సతీసమేతుఁ డగుచుం దీర్ఘాటవిం జొచ్చి యా
శతశృంగాద్రికిఁ జేరఁ బోవుట భటుల్ సాక్ష్యంబు సెప్పంగఁ దా
నతిచింతాకులచిత్తుఁడై వగచి రాజ్యం బేలు చున్నంతటన్. 139

సీ. ఒకనాఁడు గాంధారి యుపచార మొనరింప, వ్యాసుండు దానికి వర మొసంగెఁ
దత్ప్రసాదంబునఁ దరుణి గుర్విణి యయ్యె, ధృతరాష్ట్రువలన సద్భుతము దోఁప
రెండువర్షంబులు నిండుగా నీ ర్మోసెఁ, గాని తాఁ బ్రసవింపఁ గలుగ దయ్యె
గ డాసుబ... త్రి కృపణ యై యేరాలు, కొడుకుఁ గంటకు లోనఁ గుమిలి కుమిలి
గొనరించుకొనె నంతఁ, జితికి మాంసపేశి చిద్రుప లగుచు
గ దాని, నెత్తేఁగి వడిగ వ్యాసుఁ డేగుదెంచి. 140
బోలునే చాలం నీ
నే నిమ్మాంసపేశిఁ సుర
జెల్వారుసంతాన మై
జేంద్రడంబు లే దింతయున్. 141
లు దెప్పించి చల్లుటయు నంత నది
డంబు లయ్యె నవి యెల్ల వేర్వేఱ
డు మిందు నూర్వురుపుత్త్రులు
ను నిర్గమించె నంతఁ గొంత
142

తే. ఘృతకుండంబులను సురక్షితముగఁ బోసరించుచుండఁ జెన్నలరారఁగ
ధృతరాష్ట్రున కగ్రసుతుం, డతనికి దుర్యోధనాహ్వయము జలపడియెన్. 143

మహాస్రగ్ధర. వితతోల్కాపాతకోటుల్ విరిసె నభమున స్వేచ్ఛఁ బెందూళిగాలుల్
శ్రుతిభేద్యంబై పిశాచాసురఖరరవ మత్యుగ్ర మయ్యె న్శివాళి
ద్భుతరీతిం గూసె రాబందులు దిరిగెఁ బురిన్ దోఁచెఁ జెంగావి నింగిన్
హుతభుక్తేజంబు మాసెన్ హుతము లుడిగె దుర్యోధనుం డుద్భవిల్లన్. 144

తే. అట్టి ఘోరనిమిత్తముల్ పుట్టినపుడు, రాసభారావమునఁ బుట్టినాసుతు విని
బెగడి మది నాంబికేయుండు భీష్మవిదుర,ముఖ్యులను విప్రముఖ్యులఁ బొసఁగఁ బిలిచి.

చ.* అవశకునంబు లయ్యెడి మదాత్మజుఁ బుట్టినవేళయందుఁ బాం
డవుఁడు యుధిష్ఠిరుండు జననంబున వీనికిఁ బెద్ద గావునన్
ధ్రువముగ రాజ్య మేలుటకుఁ దూకొను శంకకుఁ జోటు లే దిటన్
భువిఁ దదనంతరేశ్వరతఁ బొందునొ వీఁ డని సంశయించెదన్. 146

వ. అరసి వక్కాణింపుం డనిన వా రి ట్లనిరి. 147

మ. ఇవి ఘోరంపునిమిత్తము ల్దెలియఁగా నివ్వేళ జన్మించువాఁ
డవు వంశాంతకుఁ డై ధ్రువంబుగ నరేంద్రా వీని వర్జించుటే
తపుఁ దచ్ఛాంతిని గోరితేని శతపుత్త్రప్రాప్తినీ కౌను బా
మ్మవలన్ వీఁడుము వీని నొంటిఁ గులరాజ్యక్షేమ మాశించుచున్. 148

తే. కులము రక్షింప నొక్కనివలయు విడువఁ,గులము విడఁదగు గ్రామంబు నిలుపుపొంటె
గ్రామము విడఁ దగుదేశరక్షకొఱకుఁ,బృథివి యెల్లనాత్మార్థమై విడువఁ దగును 149

వ.‡ అని ధర్మశాస్త్రంబు గల దని పలికిన విదురాదులపలుకులు ధృతరాష్ట్రుండు
మోహంబున విన నోప కుండె నంత నాదుర్యోధనుండు పుట్టిన వెనుక నాఘృ
బులనుండి క్రమక్రమంబున నొక్కమాసంబులో దుశ్శాసనుండు దుస్సహా
లుండు జలసంధుండు సముండు సహుండు విందుండు ననువిందుండు దుర్ధర్షుండు
హుండు దుష్ప్రధర్షణుండు దుర్మర్షణుండు దుర్ముఖుండు దుష్కర్ణుండు కర్ణుండు వి
వికర్ణుండు శలుండు సత్త్వుండు సులోచనుండు చిత్రుఁ చిత్రాక్ష
చారుచిత్రుండు శరాసనుండు దుర్మదుండు దుర్విగా ఁడు
నూర్ణనాభుండు సునాభుండు నందుండు నుపన
సువర్మ్ముఁడు దుర్విమోచనుండు నయోబా
చిత్రకుండలుఁడు భీమవేగుండు భీమబ

* తూకొను = పూను. ‡ ఈ

బును బూర్ణం బగుసత్తిథిఁ బగలు పెం♦పుం గాంచి తా నష్టమం
బన మే లౌనభిజిన్ముహూర్తమునయం ♦ దాధర్మవంశంబునన్. 135

క. పృథ గన్నపుత్త్రుఁ డీతఁడు, పృథివీశుం డగును ధర్మ♦భృత్తులలోనన్
బృథు వగు యుధిష్ఠిరుం డనఁ, బ్రథితుం డగు ననుచు నభ్ర♦వాణి వచించెన్. 136

మ. శతశృంగాద్రి మెలంగుసంయమివరుల్ ♦ సంతోషితస్వాంతులై
సుతుఁ డప్పాండున కుద్భవిల్లె ననుచుం ♦ జూడంగ నేతెంచి సం
సితధర్మస్థితి జాతకర్మవిధులన్ ♦ జేయించి ధర్మాత్మజున్
శ్రుతిసారోక్తుల ధర్మమూర్తియ యటం♦చుం జేసి రాశీస్సులన్. 137

వ. ఇట్లు ధర్మపుత్త్రోదయంబున నత్యంతానందమగ్నాంతరంగుండై పాండురాజు సుఖం
బుండె నంత నక్కడ. 138

## దుర్యోధనాదులజననము.

మ. ధృతరాష్ట్రుం డటు కూర్చుతమ్ముఁడు విర♦క్తిం జెంది సర్వస్వమున్
ధృతి వర్జించి సతీసమేతుఁ డగుచుం ♦ దీర్ఘాటవిం జొచ్చి యా .
శతశృంగాద్రికిఁ జేరఁ బోవుట భటుల్ ♦ సాక్ష్యంబు సెప్పంగఁ దా
నతిచింతాకులచిత్తుఁడై వగచి రా♦జ్యం బేలు చున్నంతటన్. 139

సీ. ఒకనాఁడు గాంధారి ♦ యుపచార మొనరింప, వ్యాసుండు దానికి ♦ వర మొసంగఁ
దత్ప్రసాదంబునఁ ♦ దరుణి గుర్విణి యయ్యె, ధృతరాష్ట్రువలన న♦ద్భుతము దోఁప
[illegible]ండువర్షంబులు ♦ నిండుగా నీ గ్రోసెఁ, గాని తాఁ బ్రసవింపఁ ♦ గలుగ దయ్యె
[illegible] డానుబ[illegible] త్రి ♦ కృపణ యై యేరాలు, కొడుకుఁ గంటకు లోనఁ♦గుమిలి కుమిలి
[illegible]నరిం మకొనె నంతఁ, జితికి మాంసపేశి ♦ చిద్రుప లగుచు
[illegible]ుగ దాని, నెత్తిఁగి వడిగ వ్యాసుఁ ♦ డేగుదెంచి. 140
[illegible] బోలునే చాలు నీ
[illegible]నే ♦ నిమ్మాంసపేశిన్ సుర
[illegible] ♦ జెల్వారుసంతాన మై
[illegible] జేంద్రంబు లే దింతయున్. 141
[illegible]లు దెప్పించి చల్లుటయు నంత నది
[illegible]డంబు లయ్యె నవి యెల్ల వేర్వేఱ
[illegible]కు మిందు నూర్వురుపుత్త్రులు
[illegible]ను నిర్గమించె నంతఁ గొంత
142

సుషేణుఁడు కుండధారుఁడు మహోదరుఁడు చిత్రాయుధుఁడు నిషంగి పాశి బృందారకుఁడు దృఢవర్మ దృఢక్షత్రుఁడు సోమకీర్తి యనూదరుఁడు దృఢసంధుఁడు జరాసంధుఁడు సదుఁడు సువాక్కు నుగ్రశ్రవుఁడు నుగ్రసేనుఁడు సేనాని దుష్పరాజయుఁడు నపరాజితుఁడు కుండశాయి విశాలాక్షుఁడు దురాధరుఁడు దృఢహస్తుఁడు సుహస్తుఁడు వాతవేగుఁడు సువర్చసుఁడు ఆదిత్యకేతుఁడు బహ్వాశి నాగదత్తుఁడు నగ్రయాయి కవచి క్రథనుఁడు కుండుఁడు ధనుర్ధరుఁడు నుగ్రుఁడు భీమరథుఁడు వీరబాహుఁడు నలోలుపుఁడు నభయుఁడు రౌద్రకర్ముఁడు దృఢరథాశ్రయుఁడు ననాధృష్యుఁడు కుండభేది విరావి ప్రమథుఁడు ప్రమాథి దీర్ఘరోముఁడు దీర్ఘబాహుఁడు వ్యూఢోరస్కుఁడు కనకధ్వజుఁడు కుండాశి విరజసుఁడు ననునూర్వురుకొడుకులును దుస్సల యనునొక్కకూఁతురును బుట్టి రంత. 150

చ.*తనసతి గర్భభారమునఁ దద్దయు గాసిలునట్టిపట్టునన్
దన కుపచారము ల్సలుపు దాని నొకానొక వైశ్యకన్యకం
గొని ధృతరాష్ట్రుఁ డత్తరుణిఁ గోరికఁ బొందెను దాని కాశర
త్తునన యుయుత్సునాముఁడు సుతుం డొదవెన్ గరణాన్వయాఢ్యుఁడై. 151

వ. ఇట్లు పుట్టినయుయుత్సుండు దుర్యోధనునకవరజుండును దుశ్శాసనాదుల కగ్రజుండు నయ్యె ననిన జనమేజయుండు వైశంపాయనునుం జూచి. 152

మ. ఘనుఁ డావ్యాసమహర్షి హర్షమున మున్ గాంధారికి న్నూఱువురే
తనయుల్ గల్గ వరం బొసంగి శతధా తన్మాంసఖండంబులన్
దనరం జేసె నటంచుఁ జెప్పితివి కృత్స్నం జెప్పు మెట్లైతి యు
ను గాతూహల మయ్యెడి న్వినఁగ నా కిప్పట్టునం జెప్పుమా. 153

నతం డతని కిట్లనియె. 154

యుఃఖండు పడఁతిగర్భమునుండి, పడినమాంసపేశి యయి జలములు
ఖండములుగఁ జలిపి కుండమ్ముల, వేఱు వేఱు లెక్క వెట్టునపుడు. 155

గాంధారి మనమ్మునం దలఁచె నా సంకల్ప మీడేఱ నీ
తికారు ... శతత మా నామీఁద నొక్కర్త స
... డ నా నోము ల్ఫలించు న్నగ
... ని యెంతే సంతసం బందుచున్. 156

157

ఉ. శతము లెక్క వెట్టి • ఘృతకుండములఁ బెట్టి,మఱియు నొకటి మిగుల • మగువఁ జూచి
నీదుతలఁపుకలిమి • మీఁద నింకొకకన్య, పుట్టఁ గల దటంచు • మునివరుండు. 158
వ. మఱియు నొక్కకుండంబుఁ దెప్పించి యం దామాంసఖండంబు వెట్టి చనియె నదియె దుస్సల యై పుట్టి కాలాంతరంబున సింధుదేశాధీశ్వరుం డగుజయద్రథునకు భార్య యయ్యె నంత నట శతశృంగంబున. 159

వాయుప్రసాదంబున భీముఁ డుదయించుట.

ఉ. ధర్మజుఁ గన్నతండ్రి ప్రము•దంబున నొక్కెడఁ గుంతిఁ జూచి యో
నిర్మలగాత్రి పుత్త్రి నొక•నిం గనఁ గోరెద దీఅ దయ్యెడిన్
గర్మఠుని న్మహాబలు నిఁ•క న్మఱియొక్కనిఁ బ్రాణికోటికిన్
శర్మదుఁ డమ్మహాబలుని•సత్కృపచేఁ గలిగింపు మింపునన్. 160
క. కరునలికిం బుట్టినయు,వ్వరతనయుఁడు వీరలోక•వందితుఁ డగుచున్
గురుకులరక్షకుఁ డై నృప,వరవరదుం డగు జితారి•వర్గుండు నగున్. 161
క. అని పలికిన వనజేక్షణ, మనమున హర్షించి మించి • మంత్రపరనముం
బొసరించి వాయుదేవునిఁ, బ్రీణితించుచుఁ బిలిచి భక్తి • బ్రార్థించుటయున్. 162
చ.*వడి గలఱింకవారువము • వాసిగ నెక్కి వగన్ ప్రభంజనుం
డడరుచు వచ్చి కుంతిహృద•యార్థ మట న్నొఅవేర్చి పోయె న
మ్మడఁతి యుఁ దత్ప్రసాదగరి•మంబున గర్భిణి యయ్యె మాసము
లడచినవెన్క నొక్కశుభ•లగ్నయుతం బగువాసరంబునన్. 163
ఉ. భీముఁడు భీమవిక్రముఁడు • భీమునిఁబోనిబలాఢ్యుఁ డై సుతుం
డామరుదంశ మూని ధర•యందు జనించిన జాతకర్మముల్
భూమిసురుల్ వొనర్చి రట • మున్ను కడంగి వృకోదరుండునున్
భీముఁడు భీమసేనుఁ డని • పేర్లఁ శరీరిణి పెట్టె వానికిన్. 164
క. బుసుతఁడు పుట్టిననాఁడులఁ, గను నబ్బుర మొక్కఁ • డయ్యెఁ గాంచ కుమారున్
దొడ నిడికొని యుండఁగఁ బెన్,వడి గాం డ్రని వాల్మీకంబు • వచ్చెం బయికిన్.
సుగంధి.‡ పైకి వచ్చు చుండునంతఁ • బొందుభూవిభుండు పెం
గాక దాని నేసి త్రోసి • కాచెఁ గొంత నంతలోన్
వీఁక నంతలోనఁ గొంతి • వీఁగి ప్రమాన్పడంగ లో
కై కవీరుఁ డక్కుమారుఁ • డట్టె జాఱెఁ గ్రిందికిన్. 166

* వగ=విలాసము. ‡ వీఁగు=చలించు

వ. ఆబాలపాతంబునం జేసి తాలు చూర్ణం బయ్యె నది చూచి పాండురాజు విస్మితుం డై కొడుకు నెత్తికొని సంతసించుచుండె. 167

క. ఇట మారుతి పుట్టినదిన, మట దుర్యోధనుఁడు పుట్టినట్టిదినం బొ
క్కటి యయ్యెఁ గాని కతిపయ, ఘటికలభేదంబు గలిగెఁ గాలంబునకున్. 168

వ. అంతం బాండురాజు జగదభినందితుం డగుమహోత్కృష్టనందనుండు తన కెట్టు పుట్టఁ గలుగునో యని విచారించుచు మహర్షులమంతనంబున దేవేంద్రు నారాధించువాఁడై కుంతికిం జెప్పి తానునుం దీక్ష వట్టి యొక్కసంవత్సరంబు నియతవ్రతంబునఁ దపం బాచరింప వాసవుండు ప్రత్యక్షుం డై త్రిలోకవిజయుం డగుపుత్రుండు పుట్టు నని సతిం డు నిష్టార్థసిద్ధి యగు నని సంతుష్టుం డయి సతి కెఱింగించి తదర్థంబు నియోగించుటయు నయ్యోగిని యోగీంద్రదత్తమంత్రప్రభావంబున దేవేంద్రు నామంత్రించుటయు నంత. 169

ఇంద్రప్రసాదమున నర్జునుం డుదయించుట.

సీ. గరుడగంధర్వకిన్నరముఖ్యదేవతా, నరు లిరుగడ బరాబరులు సేయ
నింబుగా సరసగానంబు గా నారద, తుంబురుప్రభృతులు వెంబడింప
రింభోర్వశీప్రముఖాంభోజముఖులు సం, రంభనాట్యారంభమును భజింప
దురిమునం దెగి స్వర్గపురగతు లగువీర, పురుషవరుల్ తనసరస నిలువఁ

తే. బగఁగుచింతామణీహారభరముతోడ, గమ్ము గమ్మనుపారిజాతమ్ముతోడఁ
బ్రథితరత్నవిరాజితరథముతోడ, నెదుట సాక్షాత్కరించె నాత్రిదశవిభుఁడు. 170

వ. ఇట్లు సాక్షాత్కరించి కుంతిభోజాత్మజకు నాత్మజు ననుగ్రహించి స్వర్గమునకు నిర్గమించె నంతఁ దత్ప్రసాదంబున. 171

ఉ. ఉత్తరమార్గమధ్యగతి నుండ గ్రహంబులు నాలు గుచ్చమం
దుత్తరఫల్గునీప్రథమపాదను గౌరవవంశవర్ధనుం
డు త్తరకోసలాభరణుఁ డున్నతతేజుఁడు సర్వరాజలో
కోత్తరుఁ డుద్భవించె దివిజోత్తరుసంశమునం గుమారుఁ డై. 172

వ. ఆసమయంబున. 173

సీ. వీఁడు శక్రాదుల నోడించి ఖాండవ, వనము వైశ్వానరార్పణ మొనర్చు
వీఁడు భూతేశునితోడ డీకొని మెప్పు, వడసి పాశుపతాస్త్ర మొడిసి తెచ్చు
వీఁడు దివ్యాస్త్రముల్ గూడ దేవప్రీతిఁ, గాలకేయాదులఁ గూలఁ ద్రోయు
వీఁడు దిగ్విజయంబు పోఁడిమి ధర్మజు, రాజసూయాధ్వరరాజి ననుచు

ఆ. వీఁడు రిపులకుఁ దన • వాఁడిపోఁడిమిఁ జూపి, భూతతృప్తి సేయు • భూతలమున
వీఁడు కార్తవీర్యు • నీడు వచ్చుట నొప్పు, నర్జునుండు నాఁగ • నూర్జితుండు. 174

క. అని దివ్యవాణి గగనం,బున నుండి వచించెఁ గుంతి • భోజాత్మజకున్
వినఁబడ విశదంబుగ నవ,వనదారవమృదుగభీర • వాగ్గుంభనలన్. 175

మాలిని. సురలు విరులవానల్ • సోనలై కుప్పఁగూరన్
గురిసిరి ధర యెల్లన్ • దుందుభిధ్వాన మొప్పెన్
బరఁగె దివిజకన్యా • వామలాస్యంబు లుర్వీ
సురవరపరమాశీ • సూక్తినాదంబు లెచ్చెన్. 176

క. శతశృంగంబునకుఁ బ్రజా,పతులును దిక్పతులు ఋషులు • వసువులు రుద్రుల్
క్రతుభుజులు వచ్చి మెచ్చిరి, శతమఖసుతుఁ డుదయ మైన • సమయమునందున్. 177

క. దివినుండి పార్థు నరయఁగ, భువికిం డిగినట్టివేల్పు • మూఁకల నెల్లన్
బ్రవిమలమతు లచటిముని,ప్రవరులు మాత్రమ యెఱింగి • పడి రచ్చెరువున్. 178

వ. పాండురాజు నట్లు మూర్తిత్రయంబుఁబోని పుత్త్రత్రయంబు వడసి త్రిభువనరాజ్యంబు వడసిన ట్లులంబున సంతసిల్లుచుండి మఱియుఁ బుత్త్రలోభంబునం జేసి కుంతి కెఱింగించిన నామె వాని కి ట్లనియె. 179

క. ఆపదలన్ ముగురకుఁ బైఁ, బాపలఁ గన వచ్చు ననుమఁ • బలుకం బడ లే
దీపయి నయ్యూమ స్వైరిణి,యై పంచముఁ గనినఁ దెలియ • నగు బంధక యై. 180

వ. అది యట్టిది కావున ధర్మజ్ఞుండ వగు నీ విట్లు ధర్మాతిక్రమణంబుగా నపేక్షించి పలుకుట భావ్యంబు గా దనిన నతండు నౌఁ గాత మని యుండె నంత మాద్రియుం దనయందు సంతానంబు లేమికి నంతరంగంబున నెంతయు సంతాపించుచు నొక్కనాఁ డేకాంతంబున నిజకాంతున కి ట్లనియె. 181

మాద్రికి నకులసహదేవులు పుట్టుట.

మ. అకటా యే మని చెప్పుదాన హృదయే • శా నాదుసంతాప మే
నొకనో మైనను నోఁచనట్టిచెడు గై • యుంటిం గదా తొంటిపు
ట్టుకఁ గాకుండిన రాచకన్నె నయి గో • డుం జెంది ఘోరాటవిన్
సుకముం గానక యుండియు న్వ్రతలకుం • జోకై ప్రవర్తింతు నే. 182

వ. అనియు మఱియును. 183

శా. *ఏరా లక్కడఁ గాంచెఁ బుత్త్రశతకం • బీకుంతి నాతోడిదై
ఘోరారణ్యమునందు కుందుచును గో • ర్కుల్దీర సత్పుత్త్రులన్

---

* జని = జన్మము.

నీరాజత్కృపఁ గాంచె ముప్పురఁ గన • న్నే నెందునుం గాక శో
కారణ్యానలపాత నైతి జనియుఁ • వ్యర్థంబుగా నక్కటా. 184

వ. అని వగచుచుం గంట నీరు వెట్టుకొనుచున్నమాద్రి నూఱార్చి పాండురా జిట్లను. 185

ఉ. ఇంతయు నేల యుంగుదు సతీ తలపోయుచు నుంటి నీకునున్
సంతతి గల్గఁ జేర్మి కొన సాఁగు నటంచును గాన నంతయుం
గొంతికిఁ జెప్పి నీకుఁ గొమరుల్ ప్రభవించెడునట్లు చేసెదన్
జింతిల కుండు మానతియుఁ • జెప్పినచొప్పునఁ జేయ నొప్పెడున్. 186

వ. అని యూఱడించి కుంతిం బిలిచి రహస్యంబున. 187

చ. మడఁతిరొ నీవు మువ్వురఁ గుమారులఁ గంటివి గాని వెండియున్
బడయఁగఁ జిత్త మానయిఁ • బంపను దప్పని నిన్ను మాద్రికిం
గొమరులమీఁదఁ బ్రేముడి యెగుం గద నీ కది కూర్చఁ గాన న
ప్పడఁతికి నిం దయం గనుపు • పండఁగఁ జేయవె నాకుఁ బ్రీతిగన్. 188

ఆ. అన్న కిన్నసుతులయుం దిర్వదవపాలి, కేని నోఁచ వలదె • నేను నృపతి
నెంద బైన నాకు • నీకఁ జాలు సుతు లను,మాట లేదు సిరికి • లోటు లేదు. 189

వ. అని కుంతి ననునయించి నీవు నాసత్యులప్రసాదంబు మాద్రికిం గలుగఁ జేయు మ
నామె సమ్మతించి సపత్నికి మంత్రోపదేశం బొసంగుటయు నామె తత్ప్రభావంబ
నయ్యశ్విదేవతలయనుగ్రహంబు వడసి. 190

క. సుకుమారులఁ గవలం గనె, సుకుమారాంగులను దస్రజుల వారలకున్
నకులసహదేవు లనియెడు,ప్రకటితనామములు దివ్యవాణి వొసర్చెన్. 191

తే.*పాండుపుత్రకు లొక్కొక్క వత్సరంబు,గడువు గలిగి పుట్టియు వారు • గనఁగ నైదు
వత్సరంబుల వత్సలపగిది నుండ, నందమునఁ జందమున నొప్పి • రద్భుతముగ. 192

వ. ఇట్లమరవరప్రసాదంబున యుధిష్ఠిరభీమార్జుననకులసహదేవు లనునేవురం బడసి తనకు
దేవరూపు లగుపుత్రులు వొడముటకుఁ బాండురాజు పరమానందభరితాంతరంగుండై
యుండె నంత. 193

తే. బాలకులు వారు శతశృంగపర్వతమున, నలరుఋషులకు వారిపత్నులకు నెల్ల
యెడల నల్లారుముద్దుగాఁ • గడిమి గలిగి, పెరుఁగుచుండిరి చక్కని • పెంపువలన. 194

* శ్లో॥ అనుసంవత్సరంజాతా అపి తే కురునందనా।
పాండుపుత్రా వ్యరాజంత పంచసంవత్సరా ఇవ. (సం.భా.)

చ.‡ మఱియును మాద్రికై సుతులమాట వచించినపాండురాజు నే
ర్పెఱుఁ గని కుంతి చాలు నిఁక • దీనికి బిడ్డలు పుట్టి రవ్వలన్
మఱకువ నన్నుఁ గేరు నని • మానసమందు భయంబు పుట్టె నా
నెఱి చెడకుండ నివ్వరము • నీ వొసఁగం దగు నంచు వేఁడెదన్. 195

వ. అనిన నతం డౌఁ గాత మని యుండె నంత. 196

వసంతఋతువర్ణనము.

సీ. మావిపూఁదేనెల • మత్తిలి యలిగాయ,కాళి సుస్వరముల • నోలిఁ బాడె
శుకశారికాదిస•చ్ఛకునసంతానమై ,తాళికాళి ఘనశ•బ్దములఁ బలికెఁ
జిగు రాని పోగ రెక్క • చిరరవంబున వన,ప్రియకోటి కాహాఁ • బ్రీతిఁ బట్టె
తెక్క లల్లార్చుచు • నొక్కొక్కటఁ గొలఁకుల, హంసకాంతాళి నా•ట్యరీతి లాడె
తే. నట్టియామని సంతస • మావహిల్ల, మన్మథోత్సాహజనకుండు • మాధవుండు
సొగసులకు నెల్లఁ దానక • మగుచు నెపుడు, వెలయుచున్నట్టివనలక్ష్మిఁ • బెండ్లియాడె.

ఉ. కమ్మనిమావిపూవులను • గాలువఁగట్టుమతేనె లాని ఝుం
ఝుమ్మని తేంట్లు వాడెఁ గడు•సొం పలరార నిగుళ్లు మేసి కో
కొమ్మని గండుఁగోయిలలు • గూసెను జిల్కలు గోరువంకలున్
ముమ్మరు మైనపండ్లు దిని • మొత్తముగా నగఁ బల్కె నత్తఱిన్. 198

మ. చిలుక ల్గోరలు తేంట్లుఁ గోయిలలునుం • జీఁగాబులుం [illegible]ల్గులున్
బలగం బెల్లెడఁ జుట్టుకాటుకొన తే•వం జిల్కమా వెక్కి తే
పులున న్మాపులుఁ దుంటవింటఁ బువుఁదూఁ•పు ల్గూర్చి పూవిల్తుఁ డా
చెలికాఁ డామని తోడు సూప జగముం • జెండాడె నప్పట్టునన్. 199

వ. అట్టిసకలశృంగారసమాగమం బగువసంతాగమంబునఁ బాండురాజు మాద్రీసహితుం
డై పర్వతప్రాంతోపవనశృంగారం బరయ నరిగి యచ్చట. 200

ఉ. కారుమెఱుంగుఁదీవ యొ చొ•కాటపుమేలిపసిండిబొమ్మయో
మారునిదీపి యో మరు ల•మర్చెడుజాతిసుమంపుబంతి యో

‡ తా. పాండురాజు మఱియును మాద్రికిఁ బుత్త్రులు పుట్టునట్లు చేయు మని కుంతిని గోరఁగా నామె పాండురాజుతో మాద్రి కిద్దఱు పుట్టిరి చాలును ఈమీఁద నన్ను మించి నన్ను తిరస్కరించు నని నాకు భయము. (అనగా నొకమాఱె కిద్దఱు పుట్టిరి. మఱియొకమాఱె కిద్దఱుపుట్టిన మాద్రికి నలుగురుపుత్త్రు లగుదురు, నాకు ముగ్గురే యని యభిప్రాయము.) కావున నాగొప్ప చెడకుండునట్లు నన్నిట్లు కోరకుండుట యనువరము నా కొసంగు మని వేఁడుచున్నదాన నని తాత్పర్యము.

కోరిక లూఱఁ జేయుమరు • కోలల రయ్యు లేక వసంతలక్ష్మి యా
నా రమణీయకాయరుచి • సల్వఁగుచెల్వను జూచి మత్తుఁడై. 201

క. కురుపుంగవుఁడు శాపము, పరికింపక మాద్రి వలదు • వల దనుచుండన్
సరకుగొని నిలక బలిమిన్, మరుబారికి సగ్గ మగుచు • మానినిఁ గలసెన్. 202

పాండురాజుమరణము

క. హతవిధిచోదితుఁ డై సర, పతి కలసినయంతమాత్రఁ • బ్రాణము విడువన్
బతిఁ దాఁ గౌఁగిట నిడికొని, సతి యేడ్చెం గురరి వోలె • జ్ఞాతుల మద్రువన్. 203

వ. దానియాక్రందనధ్వని విని వెఱచఱచి కుంతి కొడుకులతోడం బఱచి వచ్చి చచ్చి పడి యున్నపాండురాజుం జూచి. 204

శా. హాహా చచ్చితి నంచు నానృపతిపై • నస్త్రాహతోర్వీజ మ
ట్లూహింపం బడి యేడ్చి యేడ్చి తుద కి • య్యో నాసవిత్రీ మహా
ద్రోహం బయ్యెఁ గదే నను న్విడిచి యీ • దుర్గంబు రాఁ జెల్లునే
దేహంబు న్విడె నీతఁ డింక మన మెం • దేఁ బోయి జీవింతుమో. 205

వ. అని మఱియును. 206

స్వాగతము. మాద్రి లెమ్ము విడుమా జనభద్రున్, భద్ర మీసుతులు • బాలకు లెల్లన్
భద్రకాళివలెఁ • బార్థివుతో నే, నద్రిరాజమున • నాడుచునుందున్. 207

వ. అని యేడ్చుచుం బలికిన నులికి మాద్రి యి ట్లనియె. 208

క. వల దుడుగు మన్న మిక్కి లి, బలవంతము చేసి యిట్లు • వడె నితఁ డకటా
తల వ్రాసె నిట్లు హతవిధి, తలఁగం జాలుదుమె మనము • తలక్రిం దైనన్. 209

చ. తరుణి నితాంతకామపరి • తప్తను దృప్తి యొకింత లేనియీ
నరవరుచే వరింపఁ బడి • నం జెడుకొనను జూప నైనదు
శ్చరితను బిడ్డలన్ మనుపఁ • జాలను గోరిక దీఱ వీనితో
నరిగెద నారితేఱినగు • ణాఢ్యవు నీ విలుదీర్చు చుండుమా. 210

క. అని కుంతి మ్రొక్కి కొడుకుల,కును దీవన లిచ్చి మాద్రి • కువలయపతితో
మునికృతఘోరచితాగ్నిం, దను వెరియం జొచ్చి జీవ • నంబులు వాసెన్. 211

పాండవులు హస్తిపురంబు సేరుట.

మత్తకోకిల. అంత మూఁగినమౌను లెల్లరు • నాసతీసుతషట్కమున్
స్వాంతమందు దయారసం బొద • వం గముంగొని పాండురా
జంతయు న్విడి కాలధర్మము • నందె నక్కట వీరి నా
దంతిపట్టణ మందుఁ జేర్చుట • ధర్మ మంచుఁ దలంచుచున్. 212

వ. మాద్రీపాండులకళేబరశల్యంబులు సంగ్రహించుకొని కుంతినిం బాండవులం దోడ్కొని బయలుదేరి కురుజాంగలంబునకు వచ్చి పురద్వారంబు దఱియం జొచ్చి తమరాక భీష్మాదుల కెఱింగింపుం డని దౌవారికుల నంపిపుచ్చుటయు వారునుం బేరోలగం బున కరిగి. 213

ఉ. వేలకు వేలు చారణులు • వేదవిదు ల్మును లేగుదెంచి యీ
పౌరులున కేము వచ్చితిమి • పోయి వచింపుఁడు పూరువంశభూ
పాలురతోడ నంచు మముఁ • బంచిరి పార్థివులార వారు చే
చే లని తోఁచె మా కనుచుఁ • జెప్పిరి యెల్ల రెఱుంగ నొప్పఁగన్. 214

వ. అట్లు చెప్పినం బరమాశ్చర్యభరితాంతరంగు లై భీష్మవిదురసోమదత్తబాహ్లికధృతరాష్ట్రులును దుర్యోధనాదులును సత్యవతీకౌసల్యాగాంధారులును మఱియునుం గల పౌరులును బురోహితపురస్కృతు లై కదలి పురద్వారంబుకడకు వచ్చి ఋషిసమూహంబులఁ గాంచి తలలు వంచి నమస్కరించి యప్పుడు భీష్ముండును వారి కర్ఘ్యపాద్యాదుల నభ్యర్చించి. 215

క. ఇదె రాజ్యం బిదె రాష్ట్రం, బిదె పరిజన మేము ప్రజలు • ఋషులారా యు
ష్మదధీన మనుచుఁ బలికెన్, సదమలమతి నెల్లవారు • సమ్మద మందన్. 216

వ. అంత నొక్క వృద్ధతముం డగు జటాధరుండు ప్రత్యుత్థానంబు సేసి మహర్షులయనుమతంబున భీష్మాదులతో ని ట్లనియె. 217

తరువోజ. వినరయ్య పాండుభూ • విభుఁ డిటనుండి • వెడలి కాంతలతోడ • వేడ్క నైఁబోయి
వన మెల్లఁ దిరుగుచు • వడి శతశృంగ • పర్వతంబున యందు • వాసంబు చేసి
ఘనతపం బొనరించి • క్రతుభుజులవర • కరుణచేఁ గుంతికిఁ • గడపట మాద్రి
కిని మువ్వురను శుభా • కృతుల నిర్వురనుఁ • గృతులఁ బుత్రులఁ గని • కృతకృత్యుఁ డయ్యె.

వ. అని పాండవుల వేర్వేఱం జూపుచు మఱియును. 219

సీ. ధర్మాంశజుం డయి • ధర్మస్వరూపుఁ డై, తేజల్లు నితఁడు యు • ధిష్ఠిరుండు
పవనసంభవుఁ డయి • భువనస్తుతోర్జుఁ డై, వెలుఁగొందు నీతఁడు • భీమసేనుఁ
డమరేంద్రజుం డయి • సమరప్రసిద్ధుఁ డై, దుర్జయుం డగు నీతఁ • డర్జునుండు
నాసత్యజనితుఁ లై • నవకోమలాంగు లై, లలి మించు వీ ర్నకు • లసహదేవు
తే. లిందఱును వైదికాధ్యయ • నేద్ధమతులు, భారతాన్వయభూషణుల్ • భద్రయశులు
భీష్మవిదురుల కప్పన • వెట్టఁ వీరిఁ, దెచ్చినారము మును లే • మిచ్చటికిని. 220

ఉ. ఏ మిట వీరిఁ దెచ్చుటకు • నేమికతం బని యందు రేమొ యీ
భూమిధవుండు పాండునృప • పుంగవుఁ డిందఱ నిందుఁ బెట్టి తా

నామెయి మాద్రితోడ దివిజాలయ మేగఁ జితాగ్ని వెట్టఁగా
నే మయినార మందుఁ బదునేఁడుదినంబులు దాఁటె నేఁటికిన్. 221

వ. అని మఱియు నీబాలకులం జేకొని కురువృద్ధులు రక్షింతురు గాక యని చెప్పి తాము తెచ్చినయస్థిపంజరంబుల వారికిం జూపి యివి మాద్రీపాండులశరీరంబులు వీనిం గొని ప్రేతకార్యంబు ప్రవర్తింపఁ జేయ వలయు నని మహర్షు లంతర్ధానంబు నొందిరపు డెల్లరును బాండురాజమృతికిఁ బరిపరివిధంబులఁ బరితపించుచుండి రంత. 222

చ. సమతపోవ్రతంబులను బాండుమహీపతి పంచదేవతా
వరవరసుప్రసాదవిభవంబునఁ గన్నకుమారు లిప్పు డి
ప్పురమున కేగుదెంచి రఁట మచ్చటఁ జూత మటంచుఁ బౌరు లొం
డొరులను బిల్చుకొంచుఁ జని యొప్పఁగఁ జూచిరి పాండవేయులన్. 223

మ. ఉదితార్కోపమతేజు లేగురును వీ రూహింప దేవాంశజుల్
త్రిదశుల్ కావున వంటికాంతి గలవారిం గంటకుం జాలువా
రొదవ న్వింటిమె యిక్కుమారులె సమస్తోర్వీభరం బూఁనఁ జా
లుదు రాకారవిలాససాసగరిమ లోవెలింప నిట్లొప్పనే. 224

వ. అని వార లెల్లరుం బ్రశంసించుచుండ ధృతరాష్ట్రుండు విదురున కిట్లనియె. 225

మాద్రీపాండులకళేబరములకు సంస్కారము చేయుట.

చ. నగనగ నేటి కోవిదుర పాండుఁడు కాంతుఁడు పుత్రవంతుఁడై
తగి దివి కేగె నాతనికి దత్సతి మాద్రికిఁ బ్రేతకార్యముల్
తెగిలి పొసఁగ్ప మెంతయు నుతంబుగ రాజ్యవిభవంబు పేర్చడన్
మొగి ధనధాన్యము ల్బహుసమూహములుం దగు దాన మీయఁగన్. 226

వ. అని నియోగించిన నతండును. 227

మ. ప్రభుమర్యాదల కింతయేనియును లోపం బెన్న రాకుండఁ గా
విభవం బేర్పడఁ బాడె గట్టి యటపై బ్రేతాస్థులం బెట్టి పూల్
సుభగద్రవ్యము లంబరంబులు మణిస్తోమంబులుం గప్పి వం
శభవుల్ మంత్రులు నెత్తఁ గొంచుఁ జనియెన్ సంస్కారముం జేయఁగన్. 228

మ. ఘనవాదిత్రము లెల్లఁ బోరుకొన వెన్కం జేరి పెద్ద ల్ఘనం
ధనముం జల్లుచు నుండఁ బౌరులును వెంట న్మోఁగ శ్రౌతాగ్నులన్
గొని ఋత్విక్కులు మున్ జనన్ శిబికఁ జేర్కొ నొప్పగంగాతటం
బునకుం జేర్చి పొసర్చి రెల్లకురుసోముల్ పైతృకం బంతయున్. 229

వ. ఇట్లు భీష్మాదులు పదిదినంబు లుండి పాండురాజునకు ధర్మోదకాదికార్యంబులు నిర్వర్తించి బ్రాహ్మణారాధనంబును దానధర్మంబులును నడపించి తండ్రికై మెండుగ దుఃఖించుచుండుపాండవేయులఁ దోడ్కొని కరిపురంబున కరిగి వారి నూరార్చుచుండి రంత నొక్కనాఁడు కృష్ణద్వైపాయనుండు వచ్చి యెల్లవారికిని దుఃఖోపశమనంబు చేసి సత్యవతికి రహస్యంబుగ ని ట్లనియె. 230

చ. సుగ మిఁకమంచికాల మది • చూచుచు నుండఁగఁ బోయె నింక రాఁ
దగినది చెడ్డకాల మతి • దారుణ మారయ నాఁడునాఁటికిన్
బొగడఁగ నైన సధర్మములు • పోవు నధర్మము లెచ్చు నుర్విపై
నగుజను లెల్లఁ బాపములయందు మెలంగుచు నుందు రమ్మరో. 231

ఉ. క్రూరులు ధార్తరాష్ట్రు లతి • దుర్మతచిత్తు లధర్మవృత్తు లా
చారవిహీను లార్యజన • సంగవిరక్తు లాత్మవైరులున్
వీరలకారణంబున భు • విం బ్రభవించు నెగుల్ కులంబునన్
మీరలు దానిఁ జూడక క • మింపుఁడు కాన దపింప నింతటన్. 232

వ. అని యుపదేశించి చనిన సత్యవతి దాని భీష్మున కెఱింగించి తదనుమతంబునఁ గోడండ్రం దోడ్కొని తపోవనంబున కరిగి కాలాంతరంబునఁ గాలధర్మంబు నొంది వారితోఁ బుణ్యగతికిం బోయె నంత నిట. 233

ఉ. ఆకురునాథునాజ్ఞ నిగ • మాంచితచౌలముఖోక్తసత్క్రియల్
గైకొని యొప్పి పాండవులుఁ • గౌరవు లొక్కతెఱంగువార కా
లోక మెఱుంగఁ దండ్రినుడి • లోన మెలంగుచు నాటపాటలం
దాఁక యొకింత లేక కుతు • కాకరులై యిగురొత్తి రర్తిమన్. 234

భీమునిబాల్యక్రీడలు.

మ. జవసత్త్వంబుల లక్ష్యభేదముల ని • చ్చాక్రీడలన్ మేటి యై
పవనప్రోద్భవుఁ డెల్లరం గడచి దు • ర్వారాతిగర్వంబు పెం
పు వడ న్నూర్వురు నొక్కఁడై నఁ దమ యే • పు ద్వేషాలోకంబై బడిం
దవులం దోలెడు నొక్కపెట్టునఁ బడుం • డ న్నప్పుడుండ్ర స్పర్ధన్. 235

సీ. ఓల లాడెడువేళ • నోలిఁ బెక్కండ్రఁ బై, నెక్కించుకొని నీళ్లఁ • దక్క మునుచుఁ
బలువురు చెట్లెక్కి • పండ్లు గోయుచు నుండఁ, బండ్లతో వడిఁ బడఁ • బాఁదుఁ దన్ను
నెదుర నాడుచునున్న • పదుగురతో నొంచుఁ, గూఁత వేటునఁ బడఁ • గొక్కువెట్టు
బెక్కండ్ర సందిట • నొక్కులాడుచు గాస, వెట్టినట్టులు పీల్చి • పిప్పి వెట్టు

తే. నట్లు క్రీడించునపుడు బాల్యంబుకతన, ధార్తరాష్ట్రశతంబు నాధూర్తు భీముఁ
డుద్ధతిం జూపుఁ గాని దుర్బుద్ధిఁ గాదు, దాన బాధితు లైరి భూజానిసుతులు. 236

వ. అంత దుర్యోధనుండు దుండగీఁ డగుభీమునకు సహింపం జాలక దురాలోచనం జేసి.

ఉ. వీఁడు మహాబలుండు పృథివీస్థలి వీనికి మాఱు వచ్చెఁగా
నేఁడును లేఁడు సింహమునకొ త్తగు తేజున వీనిబారి నా
తోఁడులు నేను సిగ్గు వడి దొడ్డతనం బఱి త్రుంగ నయ్యె నీ
నాఁ డొకకాలరాత్రివగసంబునఁ జిక్కినయట్ల యయ్యెడిన్. 238

తరలము. బలమదోద్ధతుఁ గుంతిమధ్యముఁ బట్టి చాటునఁ జంపి దు
ర్బలుని ధర్మతనూజు బల్మిని బంది బంధితుఁ జేసి త
మ్ముల ద్రోలి నిరంకుశంబుగఁ బొంది రాజ్యము సర్వభూ
తలము నేలెద నేన నాభుజదర్ప మేర్పడ నేర్పునన్. 239

వ. అని పాపాత్ముం డగునాదుర్యోధనుండు భీమునిం జంప నిరంతరం బంతరం బన్వేషించుచు నొక్క నాఁడు జలక్రీడార్థ మని గంగాకూలంబునఁ బ్రమాణకోటి యనుప్రదేశంబునఁ బటకుటీరంబులు వేయించి ప్రయాణంబు ప్రకటించె నంత. 240

## దుర్యోధనుఁడు భీముని గంగలోఁ ద్రోయుట.

ఉత్సాహము. కురుకుమారు లెల్ల నటకుఁ గోర్కి మీఱఁ జని జలాం
తరమునందుఁ జల్లులాడి తారు ధౌతవస్త్రముల్
పరఁగఁ దాల్చి మెసవి సంజ పడఁగ నలసి యుండుటన్
వరుసగా గుడారములను బండుకొనిరి నిద్రమై. 241

మ. దివసాంతంబునఁ జల్లులాటవలనన్ దేహాధికశ్రాంతి రా
నపుడున్ సాక్షిప్రమాణకోటికడ బద్ధాగ్రప్రదేశంబునం
బవమానాత్మభవుండు మేన్ మఱచి గుర్వట్టంగ నిద్రించె నె
త్తవుడున్ జల్లనిగాలి సోఁక నట దేహాయాసముం దీఱఁగన్. 242

వ. తత్పూర్వంబున. 243

తే. ఖలుఁడు దుర్యోధనుఁడు విషకలిత మైన, మద్యమును దెచ్చి త్రావించె, మఱుఁగు వెట్టి
దాన నిశ్చేతనుఁడు మరుత్సూనుఁ డపుడు, చచ్చినట్టులు పడియుండె శ్వాస మెడల.

వ. ఆసమయంబున సుయోధనుం డాడ లెఱుంగనిభీమసేనునిం బట్టి లతాపాశంబుల నంటఁ గట్టి తా నాస్థలంబునుండి జలంబులం బడఁద్రోచె నంత నిస్సంజ్ఞుం డగునాతండు.

చ. పడి పడునంత సజ్జలము పట్టున మున్గి భుజంగవాసమం
దడరెడునాగులం దఱియ నయ్యవి యెల్లను జుట్టుముట్టి పె

స్ఫుట విషదంష్ట్రులం గఱచె ♦ వానిని జంగమ మైనతద్విషం
బెడయఁగఁ జేసె వానిమెయి ♦ కెక్కినస్థావరకాలకూటముల్. 246

ఉ. దానఁ బ్రబోధితుం డగుచు ♦ ధర్మతనూజునితమ్ముఁ డంగమం
దైనగుణాతిబంధన మ♦హాంకృతి మీఱఁగఁ ద్రెంచి కించు లై
మేనికిఁ జుట్టుకొంచుఁ గడి♦మిం గొని యుండినసర్పకోటులన్
జా నడిచెన్ గరంబులను ♦ జాఁచి యవక్రపరాక్రమంబునన్. 247

వ. అంత హతశేషపన్నగంబు లెల్ల వాసవోపముం డగువాసుకికడకుం బఱచి యతని వృత్తాంతం బంతయు నెఱింగించిన నాతండు సకలసరీసృపపరివృతుం డై యటఁ జని భీమపరాక్రముం డగుభీమసేనుం జూచు చుండె నప్పుడు. 248

తే. ఆర్యకుం డనునాగరా ♦ జాత్మజాతకొమరుకు కొమరుఁడు వానిఁ ♦ గూఁతుకొడు కైన
గొంతికొడు కని భీముని ♦ సంతసమునఁ, గౌఁగిటను జేర్చె వాసుకిఁ ♦ గాంచి పలికె.

వ. వీఁడు నాదౌహిత్త్రదౌహిత్త్రుండు కుంతిపుత్త్రుం డని తెలియఁ జెప్పిన విని నాగరాజు ప్రీతుం డై వీనికి వలసినంతధనరత్నసమూహంబు నొసంగునది యని యార్యకుం డతని కిట్లనియె. 250

నాగలోకంబున భీముఁడు రసపానము చేయుట.

చ. ఘనుఁ డగునీతఁ డీనియెడఁ ♦ గాఁగవ ముండినయేని వీనికిన్
ధనములతోడ నేమి యిఁకఁ ♦ దక్కినవస్తులతోడ నేటి కో
ప్రణుతమతీ త్వదీయ మయి ♦ భాసిలుచున్నది కుండమందు మే
ల్లని పదివేలయేన్గులబ♦లం బిడుసిద్ధరసంబు దానినిన్. 251

క. తనియఁగఁ ద్రావ నిమ్మని, మనమున సర్థించి నాదు♦మనుమనికి బలం
బొనగూడఁ జేయఁ గోరుచు, వినుతించుచు నుంటి నిన్ను ♦ విశ్రుతకీర్తిన్. 252

ఆ. నాగరాజు దాని ♦ కొఁ గాత మనుటయు, నాగు లెల్ల స్వస్తి ♦ నడపి రపుడు
ప్రాఙ్ముఖంబుగాఁగఁ ♦ బవనాత్మజుఁడు శుచి, యగుచుఁ గూరుచుండి ♦ యానె రసము.

తే. లీల్పసను నొక్కకుండ గాఁ ♦ బీల్చి కుండ, లెనిమిదిటఁ ద్రావి కొనిభీముఁ ♦ డెసక మెసఁగ
నప్పవరదత్త మగుదివ్య♦శయనమందు, నొక్కటను బండుకొని సుఖ♦సుప్తుఁ డయ్యె.

మ. ఇట దుర్యోధనుఁ డట్లువాయుసుతునిన్ ♦ హీనాత్ముఁ డై త్రోచి సం
తట లోనం గృతకృత్యుఁ డైతి ననుచున్ ♦ సంతోషముం బొంది వే
గుటయున్ భీముఁడు ముందు వోయె మన మే♦గుం బెండ్లిగా నిండ్ల కే
గుట మే లం చని చాటి భ్రాతృశతమున్ ♦ గొంచుం జనెన్ వీటికిన్. 255

తే. వేకువన మేలుకొని పాండవేయు లచట, భీమసేనునిఁ గానక • బెగడువడుచు
నలుగడలు రోసి ధార్తరాష్ట్రులపలుకులు, విశ్వసింపుచుఁ బ్రోలికి • వెడలిపోయి. 256

వ. ఉన్నయప్పుడు యుధిష్ఠిరుండు. 257

ఉ. తల్లికి మ్రొక్కి యోజనని • తమ్ముఁడు భీముఁడు కాన రాఁడు మే
మెల్లప్రదేశము ల్వెదకి • యెందును గానక యిందుఁ జూడ నా
నుల్లముతోడ వచ్చితి మ•యో యిట నైనను లేఁడు వచ్చి తా
నిల్లకుఁ బోయెనో యెచటి • కైనను బంపితొ నీవు చెప్పవే. 258

చ. అనుటయు డిల్లపోయి హృద•యంబున నాయమ తల్లడిల్లి నా
తనయ వృకోదరుం డిటకుఁ • దా నరుదేఁ డెట వోయె నొక్కొ నా
మనము తలంకుచుండె నను•మానము హెచ్చి పెరింగె వాని నీ
యనుజులు నీవును న్వెదక • యత్నము చేయుఁడు సత్వరంబుగన్. 259

వ. అని పలికి విదురుని బిలువ నంచి భీమసేనుండు గానంబడమి నెఱింగించి యి
ట్లనియె. 260

చ. ఖలుఁ డగుధార్తరాష్ట్రుఁడును • గంటకుఁ గంటక మట్లు భీమునిం
దలఁచును రాజ్యలుబ్ధుఁ డగు • తా నెద సిగ్గఱి యున్ననీచుఁ డై
చలమున నుంట నెందులకు • సందియ మందఁడు చంపి యుండె నో
తలఁకుచు నుంటి నావుడును • దత్త్వవిదుం డగునాతఁ డిట్లనున్. 261

శా. తల్లీ తల్లడ మంద కాత్మజుల మో•దం బొప్ప రక్షింపు మీ
సల్లాపంబు లెఱింగె నేని మఱియున్ • జాల్ముండు వాఁ డేపఁగా
నుల్లంబందుఁ దలంచు నీకొడుకు లా•యుష్మంతు లం చెన్ని ము
న్నెల్లం బ్రొసరించె వ్యాసముని దా•ని న్విశ్వసింపం దగున్. 262

వ. నీకుమారుండు నింతన వచ్చి నీకు సంతోషంబు గూర్పఁగలం డని చెప్పి నిజగృహం
బునకుం జనియెఁ గుంతియుఁ జింతాకులస్వాంత యై నిజనిశాంతంబున వేగించుచుండె
నంత నక్కడ. 263

మ. రసపానంబున నైనమత్తత జగ•త్ప్రాణాత్మజుం డట్లు మే
నిసుమంతేని యెఱుంగ లేక పడిన•ట్లే పండి తా నేమనా
ళ్లిసుం బిమ్మట నష్టమాహమున మే•ల్కాంచుం బ్రకాశించె నా
రస మెల్లం దగ జీర్ణ మై బలము వ•ర్ష్మంబందు వ్యాపింపఁగన్. 264

క. నాగులు లేచినభీముని, యోగక్షేమముల నరసి • యోకురువర నీ
వ్రాగినసిద్ధరసంబున, నాగాయుతబలుఁడ వై మ•నం గల వవనిన్. 265

వ. అని మఱియును. 266

శా. నీకై శోకము నొందు చుండు రచట • న్నిభ్రాతలు న్మాతయుఁ
మాకు న్విందవు మెక్కి- పొ మ్మనుచుఁ బ్రే•మం దాస మాడించి లో
కైకేద్యంబు విషాపహం బయినర•క్షాబంధముం జేసి శ్రీ
మాకారుం డగువానికి న్మనున ది•వ్యాస్నంబు గల్పించియుఁ. 267

వ. మంగళాశాస్యప్రవచనంబులఁ బ్రహ్మాష్టాంతిరంగునిం జేసి సర్వాలంకారాలంకృతుం డగు నతని నాగలోకంబునుండి పై కెత్తుకొని వచ్చి తొంటివనంబున విడిచి చని రనంతరంబ. 268

తే. లేచి భీముఁడు సలుగడ • సూచి పురికిఁ, బయన మై వచ్చి తల్లికి • వందనంబు
సలిపి యన్నకు మ్రొక్కి- త • మ్ములను గ్రుచ్చి, కౌఁగిటను జేర్చె నెంతయుఁ • గౌతుకమున.

వ. వారును వానిం గౌఁగిలించుకొని తమమంచికాలంబుఁ బ్రశంసించుకొనుచుండి రప్పుడు భీమసేనుండు తనతల్లికి నన్నదమ్ములకును దుర్యోధనుదుశ్చేష్టితంబును నాగలోకసమాచారంబును జెప్పె నప్పుడు ధర్మతనయుం డీపరిమార్గంబు నెవ్వరికెనిం దెలియ నీక మీ రెల్లరు నేమఱ కుండుడు గావుత మని ప్రబోధించి తాను దనతమ్ములం గూడి యప్రమత్తుం డయి యుండె నంత దుర్యోధనుండును భీమసేనపునరాగమనంబునకుఁ జూపోపక పరితపించి కర్ణశకునిదుశ్శాసనాదులతో దురాలోచనంబు చేసి మఱియు ననేకాభ్యుపాయంబుల నప్పాండవుల హింసింపం దొడంగె నప్పుడు. 270

—•—• దుర్యోధనునిదుష్కార్యములు. •—•—

చ. మఱి యొకనాఁడు క్రూరుఁ డగు•మానవనాథుఁడు పంప సూతుఁ డొ
కొఱకు మహోగ్రసర్పములఁ • గున్కిన భీముని సర్వసంధులఁ
గఱవఁగఁ జేసెఁ గాని యుర•గంబులకోఱలు వానిమేనికో
ల్వోలకఁగ లేక పోయెను బ•విం జెదపుర్వులు గొట్టఁ జాలునే. 271

తే. కఱచునంతన మేల్కొని • గాలికొనకు, సమరి కడకాలఁ బాముల • సమయఁ జేసి
చఱచె నఱచేత సారథిఁ • జచ్చె వాఁడు, ముక్కులను నోట నెత్తురు • గ్రక్కుకొనుచు.

క. మఱియొకనాఁ డన్నంబున, గుఱువిషముం గలిపి పెట్టెఁ • గురుపతి దానిం
గఱువలిపట్టి మెసంగె న, చిర మమృతమువోలె నదియుఁ • జీర్ణం బయ్యెన్. 273

వ. మఱియు ని ట్లనేకవిధంబులఁ దమకు దుర్యోధనాదులు చేయునెగ్గు లన్నియుఁ బాండవేయు లెఱింగి లగ్గు లని తలంచి వారిపై నమర్షం బూనక విదురుండు చెప్పిన చొప్పునం బ్రవర్తిల్లుచుఁ గురుపితామహానుమతంబునఁ గృపాచార్యునొద్దఁ గౌరవులతో విలువిద్యం గఱచుచుండి రనిన జనమేజయుండు వైశంపాయనున కి ట్లనియె. 274

ఆ. కురుకుమారు లెల్లఁ బరమాస్త్రవిద్యలు, ద్రోణుఁ డనెడుగురునితోడఁ జదివి
రనుచు విందును గృపుఁ డనఁగ నెవ్వఁడు మాకు, వానిచరిత దెలుప వలయు నిపుడు.

వ. అనిన వైశంపాయనుం డి ట్లనియె. 276

## కృపాచార్యులవృత్తాంతము.

మ. తనయుం గౌతముఁ డా మునీంద్రుఁడు శరద్వంతుండు నా వానికిన్
దనయుం దమ్ములతోడఁ బుట్టి శ్రుతుల న్వల్లింప కస్త్రావళిం
గనువేడ్కం దపమున్న నింద్రుఁడు భయాక్రాంతాత్ముఁడై తత్తపం
బును వారింపఁగఁ బుచ్చె జానపది యన్ పూఁబోఁడి సచ్చోటికిన్. 277

సీ. క్రతుభుగంగన దానిఁ గని శరద్వంతుండు, మనసిజాహతుఁ డయి తనువు మఱచె
సంత రేతఃపాత మగు టెఱింగి యతండు, విల్లమ్ములను విడి వెడలి పోయె
నది శరస్తంభమునం దొల్కి ద్వివిధ మై, పుత్త్రుఁడుఁ బుత్త్రియుఁ బొడమి రందు
నపుడు శంతనుఁ డట కరుదెంచి వారిని, గొనిపోయి కృపఁ బెంచుకొనియె దానఁ

తే. గృపుఁ డను కృపి యనుపేళ్ల నయ్యిరువు రొప్పి, రంత నాశరద్వంతుండు నటకు వచ్చి
వారు తనకన్నవా రని నోరఁ జెప్పి, తనయు నుపనీతుఁ జేసె సద్ధరణిసురుఁడు. 278

మ. విలసత్ప్రజ్ఞుఁ గృపుండు విప్రులకడ న్వేదంబులు న్శాస్త్రముల్
లలితార్థప్రతిపాదకంబులుగ నెల్ల న్నేర్చి విద్వాంసుఁ డై
నెలయం దండ్రికడం జతుర్విధధను ర్వేదంబు సాంతంబుగాఁ
దెలియ న్నేరిచి చూచుచుండఁగనెఁ బ్రఖ్యాతిం బొల్చె నాచార్యుఁ డై. 279

మ. పితృపుత్త్రప్రతిమానుఁ గౌట నతనిం బ్రేమించి పూజించి భా
రతవంశోత్తరుఁ డైన భీష్ముఁ డటఁ బౌత్త్రవ్రాతము న్వానితో
శ్రుతి మొప్ప న్విలువిద్య నేర్వఁ బనుపం జుల్కం గృపాచార్యశి
క్షితు లై కౌరవపాండవుల్ దొలుత వాసిం గాంచి రొక్కింతగన్. 280

వ. మఱియును వారికి ధనురాచార్యుం డగుద్రోణునివృత్తాంతంబు సెప్పెద విను మని
వైశంపాయనుండు వెండియు. 281

## ద్రోణునివృత్తాంతము.

శా. పద్వేషోపరతాంతరంగుఁడు భరద్వాజుండు నా మౌని గం
గాద్వారంబున కేగి స్నానము దగం గావించుచుండంగ సం
పద్వామాక్షి యనన్ ఘృతాచి యటకున్ వయ్యాళికై రాఁగ నా
విద్వద్వంద్యుఁడు దానిఁ జూచి విగళద్వీర్యుం డనార్యుండు నై. 282

వ. అనినం బరశురాముం డి ట్లనియె. 294

మ. ఎలమిన్ రత్నము లాదిగాఁ గలధనం బెల్లన్ సమర్పించి వి
ప్రుల కీభూతల మెల్లఁ గశ్యపునకున్ మున్నిచ్చితిం దానధా
రలు వోఁగన్ దపమున్ననాకడ శరీరం బస్త్రశస్త్రంబులుం
గల విం దేది యభీష్ట మో తెలుపు మేఁ గాదాడ నీ కిచ్చెదన్. 295

చ. అనవుడు సస్త్రశస్త్రములయంతటిపాటిధనంబు లోకమం
దొనర దొకండు సర్వజగదుస్నుత దాని ననుగ్రహింపు నా
కని భృగురాముచేత మహితాస్త్రములు న్వెలువిద్యయుం గ్రమం
బునఁ గృతకృత్యుఁ డై పడసి పోయె ఘటోద్భవుఁ డింటికిం గంతటన్. 296

ద్రోణుని ద్రుపదుఁడు నిరసించుట.

క. తనబాలసఖుఁడు ద్రుపదుఁడు, మును చేసినబాసకలిమిఁ బోషించెడుఁ ద
న్నని పాంచాలము చని యా,తనిఁ గని తనరాక దెలిపి తగ ని ట్లనియెన్. 297

ఉ. బాలసఖుండ నిన్నుఁ బెడఁబాయక యెప్డు మెలంగువాఁడ నీ
కోలి మహోపకారముల నుండెడువాఁడఁ గలావిశేషముల్
చాలఁగ నిన్నుఁ గూడి కిలచక్కఁ నెఱింగినవాఁడ నోయి పాం
చాలుఁడ వచ్చినాఁడ నని సాగఁగ ద్రోణుఁడ నన్నెఱుంగుదే. 298

వ. అని పలికిన ధనమదాంధుం డై విని సహింపక ద్రుపదుం డి ట్లనియె. 299

ఉ. ఎక్కడివాఁడ వోరి ధనహీనుఁడ కాఱులు పల్కఁ జొచ్చి తీ
వెక్కడ నే నిదెక్కడ సయింప సఖిత్వముఁ గొంట దెక్కడీ
యుక్కువఁ దారిద్ర్య మొకయింత యెఱుంగక నేస్తకాఁడ నే
నక్కట సర్వమి మ్మనుచు నాడెదు దొంగతెఱంగు దోఁపఁగన్. 300

క. బిచ్చపుబాపనితో నే, నెచ్చట సఖ్యంబు చేసి యెఱుఁగను బో పొ
మ్మిచ్చటికి కైపను నింకిట, వచ్చితివేఁ బిండివెట్టివై చెడ నిన్నున్. 301

తే. పేదవిప్రుఁడ వీవు భూవిభుఁడ నేను, నీకు నాకును నెయ్య మన్ వాకు నాకు
లోకమున సిగ్గు వెంచెడుఁ గాక మాఱు, పలుక కెం దేని బొమ్ము వే నిలక యిచట.

ద్రోణుఁడు హస్తిపురికి వచ్చుట.

వ. అని దురాఢ్యైశ్వర్యగర్వంబునం గన్ను గానక పలికినపలుకులు విని ద్రోణుం డవమానామర్షఘూర్ణమానమానసుం డై యెద్దియుం జేయ నేరక పుత్త్రమిత్త్రకళత్త్రాగ్నిహోత్రాదులతో మగిడి కరిపురంబున కరుగుదెంచి శ్యాలకునియింటఁ బ్రచ్ఛన్నంబుగా విడిసి

యుండె నాసమయంబున నపు డపుడు కృపాచార్యానంతరంబున నశ్వత్థామ తన్నొరు లెఱుంగకుండఁ గురుకుమారులనెల్ల శస్త్రంబుల దిద్దుచుండ నిట్లు కొన్నిదినంబులు గడచినవెనుక నొక్కదినంబున. 303

చ. *కురుసుతు లెల్లరుం బురికిఁ • గొంతసమీపమునందుఁ జేరి మ
త్సరమున నొండొరుం గెలువ • దండమునం గోణిబిల్లఁ గొట్టుచుం
గర మరుదంద నాడుకొను • కాలమునం దలపీట మీఁదికిం
సరగున లేచి చెంగట నె•సంగు నొకానొకనూతిలోఁ బడెన్. 304

ఆ. పడినదానిఁ బైకి • వెడలఁ దీయఁగ లేక, మొసలు వంచి నూతి•యొసఁగు చూచు
చున్నయపుడు బసుగు•గోడమి బాపఁ డొకండు, వచ్చి వారు పడిన•పాటు చూచి.

క. భరతాన్వవాయజాతులు, ధరణీశ్వరపుత్త్రు లీరు • తగు నేమీ ర
ట్లురక కను చుంట వీటన్, సరగున వెడలింప లేక • చాలఁ గ్రాలు బళి. 306

వ. అని పరిహసించుచు నిజాంగుళీవేష్టనంబునుం దీసి పడవైచి వాని నొక్క యిషీకప్రయోగంబునఁ గూపంబునుండి వెడలఁ దిగిచి కుమారుల కొసంగుటయు వారెల్ల విస్మయంబునొంది పోయి గాంగేయున కెఱింగించిన నతం డతనిఁ దెండని వారి కాజ్ఞ యొసంగె వారును మరలి వచ్చి ద్రోణుం దోడుకొని పోయి చూపిన భీష్ముండును. 307

క. అనురూపుఁ డయినగురుఁ డితఁ, డని మనమున నుత్సహించి • యనుమీ రెవరో
ఘను లిటకు రాఁగ హేతువు, వినఁ గోరుచు నున్నవాఁడ • విప్రవరేణ్యా. 308

వ. అనిన ద్రోణుం డి ట్లనియె. 309

క. భారద్వాజుఁడ ద్రోణము, కారణమున ద్రోణుఁ డనఁగఁ • గ్రాలినవాఁడన్
గౌరవుల కెల్ల గురు వగు, శారద్వతుఁ డతఁడు నాకు • శ్యాలకుఁ డరయన్. 310

సీ. వసుగనై యగ్నివే•శుఁ డనుమునీంద్రుని కడ ధనుర్వేదంబుఁ • గఱచునాఁడు
సహపాఠియై యిష్ట•సఖుఁడైన ద్రుపదుండు, తాను పాంచాలేశుఁ • డైన నాకు
నొలికంతు నర్ధరా•జ్యుల నెల్ల నని చెప్పి, పోవ నే గేస్తునై • పుత్త్రుఁ గంటి
ధనము లేమిఁ గుటుంబ•మును భరింపఁగ నస, తుష్టుండ నయ్యు ధ•నార్థి నగుచు

తే. పృషతసుతు నొద్దకేగి స•న్నెఱుఁగఁ జెప్ప, వాఁడు రాజ్యమదంబునఁ • బాడి దప్పి
కన్ను గానక యవమాన•మున్నఁ జేసి, నన్నుఁ దెగడిన నిట వచ్చి•నాఁడ నేను.

* గోణిబిల్ల = పీట; యవాకారప్రాదేశమాత్రకాష్ఠము. దీనిని హస్తమాత్రదండమున మీఁదిమీఁదికిఁ గొట్టి బాలురు క్రీడింతురు. "క్రీడంతోవీటయాతత్ర" (సం. భా.) వీటను గోణిబిల్ల యనియు గోటీబిల్ల యనియు గోణికఱ్ఱయనియు గోదావరిమండలమున వాడుదురు.

చ. మునివరవంశమందు జనిఁ ♦ బొందుట దుష్టపరిగ్రహంబు సే
యను మది రోసి మో మెఱుఁగ ♦ నట్టిధనాఢ్యులపాల వేఁడికో
లనుచిత మంచు మాని కొడు ♦ కాఁకలి కేడ్వ మదిం గలంగి నేఁ
జనఁ దగుమిత్రమే యని వె♦సం జని యిట్లయితిం గురూద్వహా. 312

ఉ. *కల్గినపిండిసీ ల్లెపుడుఁ ♦ గమ్మనిపా లని క్రోలునాసుతుం
డా ల్గలవారిబిడ్డ లపు ♦ డప్పుడు పిండినపాలు గ్రోలుచో
మూల్గుచు నేడ్వ నుడ్లు నను ♦ బ్రయ్యఁగఁ దిట్టఁగ లేమి కోడి నే
నల్గుల మేగఁ బాఁడిపసి ♦ నైన నతెం డిసు నంచు నెంచితిన్. 313

వ. అనినం గురుపితామహుండును. 314

క. నిను నే నెఱుఁగుదు రాముని,కును మించినమేటి వీవు ♦ గుణసంపదఁ ద్రో
ణాఖ్యుని రాఁ దలంచు చుండఁగ, ఘనభాగ్యముకతన నీవ ♦ కన్పట్టితిటన్. 315

ఆ. ఇల ధనాంశసంబు ♦ సలుపఁ దక్రియలకై, విసుగఁ దిరిగమునిరు ♦ పేద కరయఁ
బెన్నిధాన మింటి ♦ పెరటిలో దొరికిన, కరణి నీవు మాకు ♦ దొరికితివుడు. 316

క. కౌరవ్యులకుఁ గలవిత్తము, ధారుణిరాజ్యంబు వస్తు♦తతు లన్నియు నో
భూరిప్రభావ నీవియ, వీ రల్లను నీదుప్రజలు ♦ వే యేమిటికిన్. 317

వ. నీ వీకురుకుమారుల కెల్ల నస్త్రగురుండ వై మాయింట సకలోపభోగంబు లను
భవించుచుఁ బూజనీయుండ వై సుఖం బుండు మని. 318

చ. తనియఁగ వాని కక్కురుపి♦తామహుఁ డిచ్చె నొసఁగి ధాన్యముల్
ధనములు వస్తువాహనము♦దాయములున్ వరదివ్యసౌధము
న్మనుమల నెల్ల నప్పన మొ♦నర్చె శరాసనవిద్యలందు వీ
రిని గృతికృత్యులై మెలఁగు♦రీతి నొనర్పుము విప్రపుంగవా. 319

వ. అని భీష్ముండు చెప్పిన ద్రోణుండు నప్పాండవధార్తరాష్ట్రాది కురుకుమారుల నెల్ల
నంతేవాసులుగాఁ బరిగ్రహించి కరిపురంబున నివసించియుండె నని శౌనకాదు
లవ్వాలికథ చెప్పుమనుటయు. 320


ఆశ్వాసాంతము.

మ. విభవాధిక్యముతోఁ బ్రభుత్వగతితో ♦ విద్యావిశేషంబుతో
శుభసంపర్కముతోఁ బ్రభాగరిమతో ♦ శుద్ధస్వభావంబుతో

---

* అల్గులము — బాధ.

ఋభురాట్సంపదతోఁ దలిర్చుననఘుఁ • శ్రీచంద్రమౌళీశ్వర
ప్రభుచంద్రుం గరుణించి ప్రోవఁ గదె శర్వా సర్వలోకేశ్వరా!. 321

గద్యము. ఇది శ్రీమదఘునాథనోభయకవిమిత్ర వేంకటయజ్వాగ్రపుత్ర
సమారాధితవిబుధరాజ శ్రీపాదకృష్ణమూర్తి కవిరాజ
ప్రణీతం బయిన శ్రీకృష్ణభారతంబునం
దాదిపర్వంబున షష్ఠాశ్వాసము.

శ్రీ. శ్రీ. శ్రీ.



శ్రీ

శ్రీబాలాత్రిపురసుందర్యై నమః.

# శ్రీకృష్ణభారతము

ఆదిపర్వము—సప్తమాశ్వాసము.



మన్మార్కండేయమ
హామునిపరమాశ్రమక్షమావాసలస
ద్భూమిసుపర్వప్రణుతా
సామాన్యమహాప్రభావ సదమలభావా! 1

ద్రోణుఁడు కుమారుల కెల్ల విలువిద్య గఱపుట.

వ. అక్కథకుండు శౌనకాది మహామునుల కిట్లనియె నట్లు ద్రోణుండా కుమారుల నెల్ల శిష్యులుగాఁ బ్రతిగ్రహించి సంతోషితస్వాంతుం డై యేకాంతంబున వారితో ని ట్లనియె. 2

శా. మీ రెల్ల న్విలువిద్య నేర్పరులుఁ గా మే లెంచి కావింతుఁ గా
ర్య మ్మొక్కం డగు నాకు నిం దెవఁ డొనర్పం జాలుఁ జెప్పుం డనా
దమ్మం గా దనునట్లు వాంచి మొగముల్ దా రున్న నయ్యర్జునుం
డమ్మౌ నేను బొనర్పఁ జాలుదు ననెన్ సానందచిత్తంబునన్. 3

క. అని పూని పలుకుకుంతీ,తనయునిఁ బ్రియమునఁ గ్రుచ్చి తనకౌఁగిటిలోఁ
గొని శిరము పుడికి మూర్కొనె, ధనురాచార్యుండు సమ్మదంబున పేర్మిన్. 4

వ. అనంతరంబ ద్రోణుండు కురుకుమారుల కెల్ల విలువిద్య గఱపుచుండె నది విని యాదవవృష్ణిభోజాంధకాదులు నెల్లదేశంబులరాజపుత్త్రులును వచ్చి వారితోఁ గలసి విద్యం గఱచుచుండి రంత. 5

క. రాధేయుఁడు విలువిద్యం, బోధింపంబడుచు నింద్రపుత్త్రునితోడన్
గాథల కెక్కం గైకొనె, నాధృతరాష్ట్రజునికూర్మి నధికస్పర్ధన్. 6

క. శరలాఘవసౌష్ఠవముల, గురుతరశస్త్రాస్త్రవిద్యఁ గోవిదు లెన్నన్
నరుఁ డధికుఁ డగుచు గురునకుఁ, బరమప్రేమానుబంధబంధురుఁ డయ్యెన్. 7

తే. కొడుకునకుఁ దండ్రి మిక్కిలి కూర్చి విద్య, చెప్పెడిని గాన గురుపుత్త్రు నెప్పుడు విడ
కింద్రపుత్త్రుఁడు మెలఁగుచు నెల్లశస్త్ర,విద్యలను నేర్చె ద్రోణుని విశ్రుతకృప. 8

చ. ఎవరును లేనిచో సుతున కెక్కువ నేర్పెడుఁ గాత మంచుఁ దా
నవలకుఁ బుచ్చ నెంచి గురుఁ డందఱకున్ జలువాటికుండలన్
దవుపెనువాత నొప్పెసఁగు దానిని సూనున కిచ్చి మీ రొగిన్
బ్రవిమలవారి నించుకొని రా వలయు న్నది కేగి నావుడున్. 9

ఆ. కొమరులెల్లఁ బోయి కొనుచుండ జలములు, వడిగఁ గుండ నిండ నడచె ద్రోణి
ఫాల్గునుండు కుండి వారుణాస్త్రంబున, నించి వాని ననుసరించె నపుడు. 10

మ. గురుశస్త్రాస్త్రసమంచితుం డగుచు నా కుంతీసుతుం డొప్ప న
గ్గురువర్యుం డెపుడుం దమంబునను గై కోఁ బెట్ట కాక్రీడి కో
గిర మన్న న్వాని సూతుఁ డట్టులు మెలంగెం గట్టి యొండొక్కరా
తిరిలో సాపడుచుండ నట్టి మలఁగెం దీపంబు వాతాహతిన్. 11

వ. అప్పు డాచీఁకటియందు నతం డెప్పటివలె నలవాటున నన్నంబు నోటియందుఁ బెట్టుకొని విద్యలెల్ల నిట్లభ్యాసవశంబునం బడయ సాధ్యంబు లని నిశ్చయించి.

ఉ. చీఁకటిలోన నేయుటలు చెచ్చెర నేరిచి యొక్కరాత్రిఁ బెం
జీఁకటి నొక్కలక్ష్యము రచించి శరంబుల నేయఁ జొచ్చినన్
వేఁకపుశింజినీధ్వనిని విన్న ధనుర్గురు వేగుదెంచి లో
నాఁకఁ దొఱంగి మెచ్చి బిగియం దనకౌఁగిటఁ జేర్చి యిట్లనున్. 13

శా. నీకంటెన్ ఘనుఁ డెవ్వఁ డస్త్రమున నీ నిర్మాణముం దెచ్చటన్
లేకుండం బొనరింతుఁ జూడు మిదె నా నిర్నిద్రసామర్థ్య మో
పాకారిప్రభవా యటం చతనికిన్ ఐంద్రాద్యాదియుద్ధంబులున్
లోకాతీతశరప్రయోగవిధులున్ ద్రోణుండు నేర్పె న్దయన్. 14

వ. మఱియు గజాశ్వరథాదులయందును గదాసితోమరప్రాసాదులయందును నానావిధవ్యూహరచనాభేదనాదులయందునుం బ్రవీణుం గావించె నిట్లు కుమారుల నందఱ నారితేఱం జేయుచున్న చాపాచార్యులప్రసిద్ధి విని. 15

ఏకలవ్యునిచరిత్రము.

పంచచామరము. హిరణ్యధన్వుఁ డన్నిషాదు నేకలవ్యుఁ డన్సుతుం
డరిప్రమాపణోపయోగ మస్త్రవిద్యఁ గోరి రా
గురుండు వాని శిష్యుఁ జేసికో నిరాకరింప వాఁ
డరణ్యమందు మంటిద్రోణు నాపి నేర్చె విద్యలన్. 16

ఆ. గుఱియుఁ బట్టుదలయు • గురుభక్తియును గల్గి, విడక పూని పనికిఁ • గడఁగి రేని
పృథివియందు నెంత•లెంత లైనను నిర్వహింప వచ్చు జనుల • కిది నిజంబు. 17

సీ. ఇట రాకుమారు లొ•క్కట నందఱును గురు,ననుమతి వేఁటకై • చనిరి వనికి
నపు డొకసారమే•యము దప్పి యేకల,వ్యునిఁ జూచి మొఱఁగిన•నులివ్రువలన
నలిగి వాఁ డేనువా•లమ్ముల దాని మో,మున నేసి తోలిన • నదియు బెదరి
కఱకుటమ్ములతోడఁ • గడువడి నచ్చుడుఁ, గని వారు విస్మయం•బును బొంది

తే. యిట్టు లొకయమ్మ వేసిన • ట్లేసెఁ బెక్కు
లక్కజమ్ముగ వాఁ డెవఁ • డొక్కొ యనుచు
వనము నల్లడ గోయుచు • వచ్చువార
లమలతల మగు నొక్క డి•వ్యాశ్రమమున. 18

చ. కని యొకమంటిబొమ్మ కడఁ • గాళుల మ్రొక్కుచు లక్ష్య మేయుచుం
డు రేఁపువానిఁ గాటుకను • దాఁటిన నల్లని మేనివానిఁ జేఁ
బనుపడు విల్లు నమ్ము గల•వాని మృగాదుల మేను లెల్లఁ దు
త్తునియలు సేయువానిఁ బులి•తోలు ధరించినవాని వానినిన్. 19

వ. ఇట్లు కని వారు వానికరలాఘవంబున కచ్చెరువడి మెచ్చుచు నీ వెవ్వండ వని
యడిగిన వాఁ డి ట్లనియె. 20

క. ధనురాచార్యునిశిష్యుఁడ, ధనదుని కెన యగుహిరణ్య•ధన్వునిసుతుఁడన్
వనచరసేనాసహితుఁడ, ననఘుఁడ నే నేకలవ్యుఁ • డనియెడువాఁడన్. 21

వ. అనిన వారు వాని నెఱింగి కరిపురంబునకు మరలి చని ద్రోణున కది యంతయుం
జెప్పి రప్పుడు రహస్యంబుగ నర్జునుం డాచార్యున కి ట్లనియె. 22

శా. నీకు న్మించినవార లీజగమునన్ • లేకుండ విల్విద్యలన్
సాకల్యంబుగఁ గూర్తు నంటి రిట మున్ • నాకంటె మీకంటె నీ
లోకవ్రాతముకంటె మించినబలా•ఢ్యుం డొక్కరుం డొప్పు నే
నీకంటెం గనుఁగొంటి శిష్యుఁ డట వాఁ • డీమీకు సత్యవ్రతా. 23

వ. అనిన నదరిపడి ద్రోణుం డతనితో నెఱుకుకడ కరిగిన నతం డతని కెఱఁగి నేను
మీశిష్యుండ నిట్లారాధించి విలువిద్యలం గఱచితి ననిన గురుం డరుదంది యది
యట్టిదయేని నాకు గురుదక్షిణ యి మ్మనుటయు నతండును. 24

క. ధనమా పశుధనమా పరి,జనమా వనమా కళత్ర•జనమా కాదే
నను వగునావిగ్రహమా, కొనుఁ డిచ్చెద నెద్ది యైన • గురుదక్షిణగన్. 25

ఉ. నావుడు నివ్వె యెవ్వియును • నాకుఁ బ్రియంబులు గావు దక్షిణా
న్నీవిడు దేనిఁ గొంక కిడు • నీకుడిచేతిది పెద్దవ్రేలు నా
దేవుఁడు లేక సత్యనియ•తిం దనబొట్టనఁ గొట్టి యిచ్చె మే
ధావి నిషాదుఁ డమ్మొలకుఁ • దాఁ జెడె నర్జునుఁ డుత్సహింపఁగన్. 26

క. తనరూపుఁ గొలిచి విద్యా,ఘనుఁ డగునయ్యేకలవ్యు నట్లు • గావించి గురుం
డనుమానింపక ద్రోహం, బని శిష్యున కిడినభాస • యది చెల్లించెన్. 27

తే. అపుడు ధర్మజుఁ డతిరథుఁ • డై మెలంగె, భీమదుర్యోధనులు గదా•భీము లైరి
నకులసహదేవులును ఖడ్గ • నలువుపడిరి, ద్రోణసుతకర్ణులఖిలాస్త్ర•ధుర్యు లైరి.

చ. అతులితకీర్తిశాలి యగు•నగ్గురుతుల్యతరోపదేశప
ద్ధతి విలువిద్యలం దయినఁ • దద్దపరిశ్రమకౌశలంబునన్
స్తుతమతిసౌష్ఠవంబునను • దోర్బలశక్తిని యుక్తి రక్తిఁ దా
నతిరథవర్యుఁ డయ్యె నరుఁ • డందఱిలోఁ బరుఁ డై వరుండు నై. 29

మత్త. ధూర్త భీమునిభీమవిక్రమ•దోర్బలప్రతిపత్తియున్
గార్తవీర్యునిఁ బోలునర్జును•కార్ముకాదికశక్తివి
స్ఫూర్తియుం గని పాండవేయుల•పోఁడిమి న్మది సైఁప కా
ధార్తరాష్ట్రులు వంత వందిరి • తద్దయుం గలుషాత్ము లై. 30

ద్రోణుఁడు తనశిష్యులం బరీక్షించుట.

సీ. అంత వారలవిద్య • యంతయుఁ బరీక్షింప, నరసి ద్రోణుం డొక్క•యవసరమున
వృక్షాగ్రమున శిల్పి•కృతమైనకృత్రిమ,భాసంబు లక్ష్యంబు • పదిలపఱిచి
యది భాస మేయుఁ డే•ననినప్డు డాకఁ డొక్కఁడు, డందఱు సన్నద్ధు•లై నిలుఁ డని
మున్న ధర్మజుఁ జీరి • మును పక్షిఁ జూపి నా,పలుకులు విని వెనుక•వలయు వేయ
తే. వృక్షశాఖాగ్రమున నున్న•పక్షిఁ జూడు
మనినఁ జూచితి నెల వేమి • యనుఁడు గురుఁడు
క్రమముగా వృక్షమును నన్ను • భ్రాతృవరులఁ
జూతు వే యన నాతండు • చూచితి ననె. 31

క. అది విని గురుఁ డాధర్మజుఁ, బదరుచు నీదృష్టి సెదరెఁ • బద పద లక్ష్యం
బిది యేయ నేరవింకిట, మది సెడినం బనులు సేయ • మనుజున కగునే. 32

వ. అని యిట్లొక్కొక్కరుం గాఁ గురుకుమారాదికుమారుల నెల్లరం బిలిచి యడిగిన వారు ధర్మజుండు సెప్పినట్ల చెప్పుటయు నంత నవ్వాలఁ గవ్వడిం బిలిచి వారి నడిగిన ట్లడిగిన నతం డతని కిట్లనియె. 33

ఉ. పక్షిశిరంబు మాత్రె మది ♦ పారఁగఁ జూచితిఁ దచ్ఛరీరమున్
వృక్షము మిమ్ముఁ దమ్ములను ♦ వీక్షణముం బొనరింప లేదు నా
కీక్షణమందు నాజ్ఞ యిడుఁ ♦ డేయఁగ నా గురుఁ డేయు నావుడున్
దక్షుఁ డతండు తక్షణమ ♦ ధారుణిఁ గూలఁగ నేసె భాసమున్. 34

వ. ఆచార్యుండును వానియచలదృష్టికి మెచ్చి గ్రుచ్చి కౌఁగిలించుకొని వీనిచేత ద్రుపదగర్వాపహరణం బగు నని సంతసించు చుండె నంత నొక్కదివసంబున. 35

శా. గంగాస్నానము సేయుచుండ గురుక్రీడాగ్రాహంబు నీ
టం గన్గొంట కగోచరం బగుచుఁ బట్టం దా సమర్థుండ యు
య్యుం గంజోద్భవవంశజుండు వడి రం భో దీని వీడింపుఁ డం
చుం గౌరవ్యులఁ బుచ్చె వా రవశతన్ జూడంగ నున్నంతటన్. 36

ఉ. చాపగురుండు వల్కునుడి ♦ జానుగులం బడినంతలో ధను
ష్ప్రాప్రతిహస్తుఁ డై నరుఁడు ♦ సత్వరుఁ డై చనుదెంచి యేనువా
ల్తూపుల నేసి కోలమ్మసలిఁ ♦ దుత్తునియల్గ నొనర్చి ద్రోణు న
య్యాపదనుండి కాచె జను ♦ లందఱు నివ్వెఱఁ గంది చూడఁగన్. 37

వ. అధనుర్గురుండు వానిచేతకును దనయందలిప్రీతికిని జేతంబునం సంతసించి వాని కప్పుడు బ్రహ్మశిరోనామాస్త్రంబు ప్రయోగోపసంహారంబులతో నుపదేశించి యి ట్లనియె. 38

క. నన్నీయస్త్ర మగస్త్యుం, డన్నయవిదుఁ డగ్నివేశుఁ ♦ డనుముని కిచ్చెన్
సన్నుతుఁ డతఁ డిచ్చెను నాకు న్నే నిచ్చితిని నీకుఁ ♦ గుతుక మెలర్పన్. 39

మ. ఇది దివ్యాస్త్రము దీనిమానవులపై ♦ నేయంగ రా దెప్పుడున్
గదియు స్వల్పులమీఁద వేయఁ బడి లో ♦ కంబుల్ దహించుం గడున్
త్రిదశారిప్రతిమానశత్రుభయ మే ♦ తేరం బ్రయోగింప నౌ
నిది సామాన్యము గాదు లోకవిదితం ♦ బింద్రాత్మజా వింటివే. 40

### కుమారాస్త్రవిద్యాప్రదర్శనము.

వ. అనంతరంబ బాగురుం డారాజన్యకుమారులధనుర్విద్యావైశద్యమంతయు గాంగేయ విదుర కృప సోమదత్త బాహ్లీకాదులసమక్షంబునం జూప నెంచి ధృతరాష్ట్రు ననుమతంబు వడసి యొక్కనాఁడు విదురపరిష్కృతసువిశాలరంగప్రదేశంబున నెల్లవారును బ్రేక్షకు లై యథోచితస్థానంబుల విశ్రమించి యుండ శుక్లమాల్యాంబరధరుం డై తా నశ్వత్థామతోడం బ్రవేశించి తన వెంట ననుక్రమంబుగా

రంగం బలంకరించిన కురుకుమారుల కెల్ల నాజ్ఞాపించిన వారును ధనుర్బాణతూణీర పాణు లై. 41

సీ. వివిధాస్త్రశస్త్రముల్ • వేర్వేఱు పేరులఁ, బేర్పడ లక్షించి • వేయువారు
దృఢముష్టిలాఘవ•స్థిరసౌష్ఠవంబులు, చూప తెన్నఁగ వేడ్కఁ • జూపువారు
గజవాజిరథయాన•గతులఁ బోరాటంపుఁ, గ్మతులఁ గౌశల మెఱఁ•గించువారు
పరశుపట్టసగదా•ప్రాసాసికుంతాది, నైపుణ్య మెంతయుఁ • జూపువారు
ఆ. నగుచు ద్రోణశిష్యు•లందఱుఁ దమతమ, యస్త్రశస్త్రభుజబ•లాదికౌశ
లమ్ము సూపి రెల్ల•రమ్మకచెల్ల మే, లనుచు గురునిశిక్ష • కలరి మెచ్చ. 42

వ. ఆసమయంబున. 43

మ. త్రిదశప్రస్ఫుటబాహుగర్వపరిపూ•ర్తిన్ భీమదుర్యోధనుల్
గదలం ద్రిప్పుచు రంగమధ్యమున వీఁ•కం బొల్చి పెల్చన్ మహా
మదమాతంగములట్లు తాఁకి మిగుల•న్మాత్సర్య మెచ్చ న్సభా
సదు లత్యద్భుత మందఁ జూపిరి రణాం•చచ్ఛక్తిసామర్థ్యముల్. 44

క. ఒండొరులగదాహతులన్, మెండగుహుంకృతులు గలసి • మేదిని యెల్లన్
నిండి భయంకరరవ మై, గుండియ లవియంగ నయ్యెఁ • గురుభూప్రజకున్. 45

వ. విదురుం డాసంరంభం బంతయు గాంధారీధృతరాష్ట్రులకుం దెలియం జెప్పుచుండె నప్పుడు రంగభంగభయంబున ద్రోణుం డశ్వత్థామం బంచి వారించి తాను రంగమధ్యగతుం డై వాదిత్రంబు లుడిగించి మేఘగంభీరస్వనంబున నిట్లనియె. 46

ఆ. కొడుకుకన్న నాకుఁ • గూర్చుప్రియశిష్యుఁ, డింద్రసుతుఁడు వాని•సాంద్రచాప
కౌశలంబు చూడఁ • గలరు మీ రెల్లరు, ననినయంతలోన • నర్జునుండు. 47

మ. హరినీలప్రతిమానదేహరుచు ల•య్యాశావకాశంబు గ
ప్ప రణత్కాంచనకింకిణీకలితచా•పం బూని రంగస్థలాం
తరమం దొప్పె సువర్ణకంకటము మే•నం గ్రాల సేంద్రాయుధో
త్తరకాలాంబుద మో యన న్వివిధవా•ద్యంబు ల్కడున్ మ్రోయఁగన్. 48

## అర్జునుని విద్యాప్రభావము.

ఉ. వీఁడె మహేంద్రసంభవుఁడు • వీఁడె సమర్థుఁడు శస్త్రవిద్యలన్
వీఁడె సమస్తధర్మనిధి • వీఁడె ఘనుండును వంశకర్తయున్
వీఁ డిట సస్త్రకౌశలము • వేడుకఁ జూపెడు నంచుఁ జూప ఱం
దాడుచు నుండఁ గొంతి ముద•మందెఁ గుమారనుతిప్రసంగతిన్. 49

క. అది విని ధృతరాష్ట్రుం డభ్యుదయం బగునర్ణవంబా ◆ కో యన దివమున్
విదళనము సేయునటు రవ మిది యే మని విదురు నడుగ ◆ ని ట్లను నతఁడున్. 50

ఆ. పాండునందనుండు ◆ పార్థావరజుఁ డగు ఫాల్గునుండు విండ్ల ◆ బలువుఁ జూపఁ
గడఁగి రంగభూమి ◆ నడర జనస్తోత్ర రభస మిదియ సూవె ◆ ప్రభులలామ 51

వ. అనిన ధృతరాష్ట్రుండు. 52

క. ధన్యుండ ననుగృహీతుఁడ మాన్యుఁడ రక్షితుఁడ నైతి ◆ మనపాండవు లి
ట్లన్యజనాసాధ్యు లసామాన్యులు నై రనుచు విస్మ ◆ యామాత్రిన ధాత్రిన్. 53

వ. అని మఱియు నీపృథారణిసంభూతపాండవాగ్నిత్రితయం బఖిలశాత్రవకులారణ్యదాహకంబు గా కుండ దని పొగడుచుండఁ బాండవమధ్యముం డాచార్యునాజ్ఞ వడసి.

మ. అనలాస్త్రంబున ఘోరవహ్నియును మే ◆ ఘాస్త్రంబునం గారుమ
బ్బనిలాస్త్రంబున హోరుగాలియును దీ ◆ వ్యద్వారుణాస్త్రంబునన్
ఘనవాఃపూరము పర్వతాస్త్రమున ధా ◆ ల్లల్లించుచుం జూప తె
ల్లను మే ల్మే లని మెచ్చ నేర్పుకలిమిన్ ◆ లక్షింపఁ గాఁ జేయుచున్. 55

శా. అంతర్ధానముఖాస్త్రము ల్వఱపి తా ◆ నంతర్హితుం డయ్యెఁ గొం
డంతై కొంతయి కొంతకొంత యయి యొ ◆ య్యప్పే రథస్థుండు నై
కొంతన్ ధూర్గతుఁ డై మహీగతుఁడు నై ◆ కుప్పించి యొప్పించుచున్
వింత ల్సూపెఁ బృథాతనూజుఁడు జను ◆ ల్విభ్రాంతు లై చూడఁగన్. 56

చ. పఱచుమెగంబుమోఱ నొక ◆ వాడిశరం బడరించినట్టు లే
కఱకుశరంబు లింపలరఁ ◆ గాఁ బఱఁగించియుఁ ద్రాట ద్రేల నై
యిఱు కగుగోవిషాణమున ◆ నిర్వదియొక్కశరంబు లేసియున్
జుఱుకున నస్త్రకౌశలముఁ ◆ జూపె జనాళి కతండు మెండుగన్. 57

వ. ఇట్లస్త్రవిద్యావైశద్యం బంతయుం జూపి పురందరనందనుండు జనుల కత్యానందం బాపాదించుచున్నంతఁ గర్ణుండును దనవిద్యావిశేషంబు లెల్లఁ బ్రకటింప సమకట్టి రంగద్వారంబుకడ నిలిచి భీమంబుగా భుజాస్ఫాలనంబు సేయుటయును. 58

### కర్ణుని విద్యావైశద్యము.

సీ. బ్రహ్మాండభాండంబు ◆ పటపటఁ బగిలెనో, భూమండలం బెల్లఁ ◆ బూరటిలెనొ
కులపర్వతం బేది ◆ కూలెనో విడివడి, ప్రళయానలము రేఁగి ◆ పడెనొ యేమొ
మింట సూర్యుఁడు దెగి ◆ మంటిపైఁ బడియెనో, పుష్కలావర్తముల్ ◆ పొంగె నొక్కొ
బిట్టు సాగర మొక్క ◆ పెట్టున బ్రీలెనో, పిడుగుల మొత్తంబు ◆ పడియె నేమొ

తే. యనుచు నెల్లరుఁ దద్ధ్వని • మఱియు వినఁగ
బాండవులు ద్రోణుపిఱిఁదికిఁ • బాఱఁ జనిరి
కురుకుమారశతంబు ని • ర్వ్యాజగతి దోఃప
బలసి దుర్యోధనునిమేటి • మఱువు సనిరి. 59

వ. ఆసమయంబున. 60

ఉత్సాహ. సహజకవచకుండలములు • జాను మీఱుబిల్లు మ
స్సహాశరంబులును ధరించి • సర్వశస్త్రవిద్వరుం
డహహ నాఁగ ద్వాదశాత్మ • నాత్మజుండు రోదసీ
కుహర మెల్ల మేనికాంతి • కుదిరి నిండ నొంపుగన్. 61

క. అర్ణవగంభీరుం డా,కర్ణాంతవిశాలనేత్ర • కమలుండు జగ
త్కర్ణాభరణోన్నతగుణా,పూర్ణుఁడు కర్ణుండు రంగ • భూమిం బొలిచెన్. 62

క. నడగొండ వోలె రవిజుఁడు, నడచుచు గురువులకు నెఱఁగి • నలుగడఁ జూడ్కుల్
విడఁబాఱ నరసి నరునకుఁ, గడువడి ని ట్లనియె మేఘ • గంభీరరుతిన్. 63

శా. ఓనాకేశ్వరజాత యిప్పు డిట నే • మో చేసితిం బెద్దపా
టోనే బల్విలుకాఁడ నిందఱును న • న్నే మెచ్చి రం చెన్నుకో
కీనీచేసినయంతయుం బ్రతియుఁ జై • నెంచేసియుం జేయువా
రీనేలం గల రింతమాత్ర గరువం • బెక్కించుకో నేటికిన్. 64

క. ఆపలుకు సవ్యసాచికిఁ, గోపోద్రేకంబు సిగ్గు • గురువుల కతిసం
తాపముఁ గురుపతికిం బ్రియ, మాపాదించె మఱి చూప • ఱచ్చెరుపడఁగన్. 65

లయవిభాతి. అంత గురునాజ్ఞ గొని • యారవికుమారుఁ డవు •
డర్జునుఁడు చూపినమ • హాస్త్రవిధు లెల్లన్
బంతమునఁ జూపుటయు • వానిని సుయోధనుఁ డ •
పారదయఁ గౌఁగిలిడి • భ్రాతృవర నాకో
సంతసమునం గలిత • సఖ్యుఁడవ వై ప్రియము మెఁ •
సంగఁ గురురాజ్యరమ • సాకఁ దగు నా నా
గొంతితొలిచూలికొఱ • కుం దపరి యట్టుల య •
గుం గురువిభూకరుణ • కు న్నిలయ మైతిన్. 66

వ. అని మఱియును. 67

చ. కురువర యింతమాత్ర మది • కోరిక దీఱదు నాకుఁ బార్థుతో
దుర మొనరింప నిష్ట మన • దుష్టసుయోధనుఁ డడ్డ మేని నా

సరస సమస్తభోగము లు జయశ్రీయు నొందుము బంధుకోటికిన్
గరము ప్రియంబుగా నెడముకాలిడి వైరులనెత్తిఁ బెట్టుచున్. 68

వ. అప్పుడు ధార్తరాష్ట్రశతమధ్యంబున నచలంబు వలె నున్నకర్ణుం జూచి యర్జునుండు తన్ను దూఱిన క్లెంచుచు నిట్లనియె. 69

క. పిలువని పేరంటముగాఁ, బలువ సభాస్థలుల నిట్లు పలికెదు దీనన్
ఫల మనుభవింతు నాస్త్రకోలఁదు లెత్తింగెదరు గాక కురువృద్ధు లిటన్. 70

వ. అనినఁ గర్ణుండును. 71

—— కర్ణార్జునులద్వంద్వయుద్ధము. ——

ఉ. మాటలఁ జూపుదే తగవు మాలి పరాక్రమ మున్నయేని నీ
వేటులఁ జూపఁగా వలవదే యిపు డీ వెడఁగా యెఱుంగవో
పోటరు లెల్లరుం జూడఁగ వోలి నో కిరీటి గాని పిల్వఁ గా
నేటికిఁ గోటరి బ్రాహ్మతి నే నిది ధర్మపు గాదె చూడఁగన్. 72

వ. అని గర్వంబున నధిక్షేపించుచు నిష్ఠుర గురుసమక్షంబున నీశరంబు శరంబుల హరింతు నని వారిం గదియ నాచార్యానుమతంబు వడసి యున్నం భ్రాతృవోదితుం డగు నర్జునుండును గురుననుమతంబు వడసి ప్రతిఘటించి రంగమధ్యంబున నిలుచుటయు సుయోధనోపలాలితుం డగుకర్ణుండును. 73

మ. వరపార్జన్యము నాఁగ వోసి సరుపైఁ బాలంగి నేయ స్వయం
కరణీమూలము సంభవించి జగముం గప్పెం దదర్కక్షణాం
తరమందు న్నుతుఁ గాన కంతయును భీతస్వాంత యై కుంతి నం
దుని నాను న్విదురుండు దేర్చె సభయోత్తుల్యల్కు చున్ భక్తిమై. 74

వ. అప్పుడు ధార్తరాష్ట్రులు కర్ణుఁ డున్నవలనను గురుకృపభీష్ము లర్జునుఁ డున్నవలన నుండ రంగం బంతయు రెండుపాయలై యుండె నంత. 75

చ. తిమిరము లెల్లెడం గవిసి దిక్కులు గానక సుక్కి యున్నయ
న్నముచినిషూదనాత్మజుఁ డనంతధృతిం బవనాస్త్ర మేసి మే
ఘములబెడంగు వాసి కుతుకం బొనరించె జనాళి కెల్ల నా
సమయమునందుఁ గుంతి మది సాధ్వస మొందె సుతప్రియంబునన్. 76

వ. అంత సర్వధర్మవిదుం డగుకృపుండు కర్ణు నుపలక్షించి యి ట్లనియె. 77

చ. తలఁపఁ గులీను లై నన్నృపతిల్లజు లెల్లరు నీచజాతితోఁ
బలుపరు. ద్వంద్వయుద్ధము ప్రశస్తకులుం డగుపార్థుతో ననిం

దలపను దేని నీదుతలి • దండ్రులగోత్రముఁ జెప్పు చెప్పినన్
దుల యని తోఁచెనే ననికిఁ • దూకొను నీతఁ డెదిర్చి నీ కటన్. 78

వ. అనిన వివర్ణుం డై కర్ణుండు సిగ్గునం దల వాంచి యుండె నప్పుడు దుర్యోధనుండు కృపునిదిక్కు మొగం బై. 79

చ. కులమును శౌర్యమున్ బల మ • గుం బ్రవిధంబులు రాజు పేర్మికిన్
దలఁపగ రాజు గావరుఁ • దాఁకెడ యేని నరుండు తేజునన్
మొలఁగెడునిట్టికర్ణునకు • మే లగు నంగమహీశ్వరత్వమున్
గలుగఁగఁ జేసెదన్ గనుఁ డ • ఖండమహావిభవంబు పెంపునన్. 80

వ. అని యప్పుడ మంత్రవిదు లగువిప్రులచే నంగదేశంబునకు రాజుగా సేచి పేకంపించుటయు.

—— దుర్యోధనుఁడు కర్ణున కంగరాజ్య మిచ్చుట. ——

క. *అభిషిక్తుం డై కర్ణుఁడు, విభవసమృద్ధిం దలిర్చి • విభుఁ గని నే నో
యిభపురవల్లభ దీనికిఁ, బ్రభవంబున నే మొనర్తుఁ • బ్రతికృతి యనియెన్. 82

తే. అనిన దుర్యోధనుఁడు కర్ణు • నరసి పలికె, నాకుఁ బ్రతికృతి యొనరింప • నీకు మంచి
యేని సఖ్యంబుఁ గోరితి • ని మ్మన నతఁ, డ ట్లగుత మనె హర్షించె • నతఁడు మదిని 83

వ. అట్టిసమయంబున హర్షపరవశుం డై సూతుండు పరదంబు డిగి వచ్చి కొడుకుం గౌఁగిలించుకొని రాజ్యాభిషేకజలంబులం దడిసి యున్న వానిశిరంబు మరల నిజానందబాష్పంబులం దడుపుచుండుటయు నతం డతనిఁ బితృగౌరవంబున వందనప్రణామంబు గావించె నది యంతయుం గనుచున్న భీమసేనుండు కర్ణుని సూతపుత్రునిగా నెఱింగి నగుచు ని ట్లనియె. 84

తే. సూతసుతా నీకుఁ గోచిత • రీతిగాఁ బ్రతోదముం గొని గర్వమును • వోలఁ దోడఁగ
వలయునే కాని నృపకుల • తిలకుఁ డైన, యర్జునునితోడ నని సేయ • నగునె నీకు. 85

క. మరి యంగరాజ్యలక్ష్మియు, నరదంబులు దోలునీ క • నర్హంబ మహా
ధ్వరపూతపురోడాశము, గురుజనులకుఁ గాక మొఱుఁగు • కుక్కకుఁ బోలెన్. 86

వ. అనిన వెల్ల నై రాధేయుం డధరంబు చలింప నిట్టూర్పు నిగిడించుచు మిన్ను చూచు చుండె నంత నాగ్రహోద్రేకంబున దుర్యోధనుండు తమ్ములనుండి వెడలి వచ్చి భీమున కి ట్లనియె. 87

ఉ. ఓరివృకోదరా యిటు ల • యుక్తము లాడఁగ నీకుఁ జెల్లునే
శూరుఁ డితండు నీచకుల • జుం డనరాదు బలంబె పెద్దగాఁ

* పరిభవము — పరాక్రమము.

చేరుగొనంబడుం గలశ • జెబ్బులి లేటికిఁ బుట్ట దారయన్
శూరులజన్మము న్నదుల•సొంపగుజన్మ మెఱుంగఁ బోలునే. 88

సీ. ఇంద్రాయుధము వజ్ర • మెమ్మునఁ బుట్టదే, నీటఁ బుట్టఁగ లేదె • నిగిడి వహ్ని
బమ్మదేవర బ్రాహ్మఁ•డమ్మికిఁ బుట్టఁడే, సురసేనదొర తెల్లు•చూలు గాఁడె
కుంభమందు నగస్త్య•సంభవం బెసఁగదే, శుకముని కొడవఁడే • శుకమహర్షి
ద్రోణుండు కలశమం•దు జనింపఁ డయ్యెనే, కృపుఁడు శరస్తంభ•కృతుఁడు గాఁడె
తే. యవని క్షత్రాన్వయోద్భవు • లైనవారు, కౌశికాదులు విప్రు లై • క్రాలఁ బోరె
వేయు నేటికి మీజన్మ•వృత్తములును, నిట్టియవి గావె భీమ నీ • వెఱుఁగ వలదె. 89

ఉత్సాహము. కవచకుండలములతోడఁ • గలిగె నితఁడు ప్రాకృతుం
డవు ననంగ వశమె నీకు • నట్టియీమహాత్ముఁ డం
గవిషయమ్ముకండ యేలఁ • గాదు సర్వభూతలం
బవల నేలుటకును జాలు • ననుచు నీ వెఱుంగుమా. 90

ఆ. నాకుఁ గూర్చునట్టి•లోకైకవీరున, కితని కంగరాజ్య • మిచ్చినాఁడ
నేను జేసినట్టి•దీనిఁ గా దనువాఁడు, గలిగినపుడు చూడఁ • గలను బొమ్ము. 91

వ. అని పలికినసమయంబున నాసభామధ్యంబున సాధువాదానుసంబంధం బగుహాహాకారరవం బుప్పతిల్లె మెంసుకొనియె సప్తదహస్కరుం డస్తంగతుం డగుటయు సానుజుం డగుదుర్యోధనుండు కర్ణునికై దండం గొని కరదీపికాసహస్రంబు వెలుంగ రంగంబు వెడలి చనియెఁ బాండవులును గృపవిదురద్రోణభీష్మాదులతో నిజనివాసంబుల కరిగి రంత. 92

ఆ. బళిర కర్ణ మేలు • బళిర దుర్యోధన, బళిర పార్థ యనుచుఁ • బ్రజలు విరిసి
వేఱువేఱ తారు • వేవేతెఱంగులఁ, బొగడుకొనుచుఁ జనిరి • పురములకును. 93

మ. ఘనతేజంబున నంగనాథుఁ డగునా•కర్ణుండు వర్షీయుఁ డై
చనుపుత్త్రుం డని గొంతి పోల్చి మది హా•ర్షంబందె దుర్యోధనుం
డును దన్మైత్రినిఁ జేసి పార్థువెఱఁ దో•డ్తో నీఁగె నాసూతపు
త్త్రున కేవాఁడును జాలఁ డంచు యమపు•త్త్రుం డెంచెఁ జిత్తంబునన్. 94

కురుకుమారులు ద్రుపదుం బట్టఁ జనుట.

వ. అనంతరం బాచార్యుండు కృతాస్త్రు లగుకురుపాండవాదిశిష్యుల నెల్ల రావించి మీరు నాకు గురుదక్షిణగాఁ బాంచాలవిషయాధీశ్వరుం డగుద్రుపదుం బట్టి యిం డనని వా రెల్లను నంగీకరించుటయు నంత. 95

మ. చతురంగధ్వజినీసహస్రములతో • శస్త్రాస్త్రసంపత్తితో
ధృతరాష్ట్రాత్మజు లెల్లరుం రథికు లై • దివ్యాత్త్వతానంబునన్
గతివేగంబున నేఁగ యేఁగ యనుచుం • గాంపిల్య మన్నామకో
క్షితినాథాగ్రణివీడు ముట్టిరి నిజ•స్థేమంబు దీపింపఁగన్. 96

వ. పాండవేయులు ద్రోణసహితు లై రథంబు లెక్కి వారిపిఱుంద నరిగి రంతఁ బాండవ మధ్యముం డాచార్యున కి ట్లనియె. 97

శా. మేమే శూరుల మంచుఁ గౌరవులు దు•ర్మేధాతిగర్వంబునన్
దామే సోమకుఁ బట్టుకొందు మనుచున్ •దర్పంబునం బోయి రా
హా మీకు న్సహపాఠి గా యతఁడు వీం•డ్రా చేరు వా రమ్మహో
ద్దాముం జూచెదఁ గాక వీరిబలమున్ • దర్పంబు శౌర్యంబునున్. 98

వ. అని ప్రశంసించుచుండఁ బాంచాలపురం బరక్రోసుదూరంబుగఁ దత్తీయం బొచ్చి రంతకు ముున్న చని దుర్యోధనదుశ్శాసనకర్ణవికర్ణజలసంధాదులు నానాసేనాపరివృతు లై పురంబు ముట్టడించి రణభేరి వేయించుటయుం బాంచాలుం డాభేరీభాంకారనిక్వణం బాలకించి కల్పాంతకల్పగభీరభైరవుం డై బాణాసనంబు దొడిగి ధనుర్బాణతూణీరపాణి యై గదాదండంబు భుజాదండమండితంబుగా నమరించి సర్వసన్నద్ధుం డై సేనలం గూడి భేరీధ్వానపూర్వకంబుగా రథాధిరూఢుం డై సంగ్రామరంగంబునకుం బోయి చుట్టు ముట్టడించిన కౌరవసేనావాహినిం జూచి సహజసముత్పాటనామర్షితహర్యక్షాధ్య క్షులుం బోలి కనలి సింహనాదంబు సేసె నంత వారు సవారితశౌర్యగాంభీర్యధైర్యస్థై ర్యంబులం బొలివోక నిలిచి యెదిరించి రప్పు డుభయసైన్యంబు లుభయస్థైర్యమ్ములనుఁ బూర్వాపరపారావారంబులం బోలి తాఁకె నట్టి సమయంబునఁ బాంచాలుండును. 99

చ. అరుణకరంబులుం జూఱ గ్ర•వంతయుఁ జోటును లేనియట్లు మేల్
శరములు వర్షముం గురియు•చక్కిని నెక్కడఁ జూడఁ దాన యై
యగదముఁ ద్రిప్పుచు న్మిఱుపి•ట్లుగ నందఱు కన్నిరూపు లై
కురుబలసాగరంబుఁ బడిఁ • గొట్టి కలంచెను మందరంబు నాన్. 100

తే. పరశుపట్టసముసలము•ద్గరగదాసి,తోమరాద్యాయుధమ్ముల•తోడ ద్రుపద
నాగరికులెల్ల నలిరేఁగి • మూఁగికొనుచుఁ, గౌరవుల నెల్ల నేసిరి • కసిమసంగి. 101

—••◆ అర్జునుండు ద్రుపదుం బట్టి తెచ్చుట. ◆••—

శా. ఆదుర్యోధనముఖ్యకౌరవులు ధై•ర్యస్థైర్యశౌర్యంబులం
బ్రాదుర్భూతగుణాస్త్రశస్త్రము లాగిం • బాంచాలుపై నేయ న

య్యాదిత్యప్రతిమానతేజుఁ డెడ నయ్యస్త్రావళిం ద్రుంచి బా
*హాదర్పంబున మించి యాడె నట భీమాలాతచక్రక్రియన్. 102

వ. అట్టితుములయుద్ధంబునం బాంచాలుబాణవృష్టికి నిలువోపక ధార్తరాష్ట్రు లెల్లరును వెల్లఁబోయి వెఱచఱచి పఱచి వచ్చుటం జూచి విద్యాప్రౌఢాచార్యున కభివందనంబు చేసి యుధిష్ఠిరాదుల నట నుండఁ బ్రార్థించి తనకు భీమసేనుండు సేనాగ్రచరుండును గవలు చక్రరక్షకులుగా సంరంభించి విజృంభమాణశౌర్యంబునం గదలి రథనేమినిస్స్వనంబున ధరణీధరంబు లదర నడచి మందరగిరిధరింబోయనం ద్రుండ సేనాసముద్రమధ్యంబునం జొచ్చి యసాధారణవిక్రమక్రమంబునం బరాక్రమించుచుండె నప్పుడు. 103

ఉ. దండధరుండు నాఁ బరఁగి దండధరుం డయి భీమసేనుఁ డు
ద్దండపరాక్రమంబున రథంబులు నేన్గులు వాహనంబులుం
బిండిగ మొత్తి మొత్తి గజవీరము తుంగమదంబు సొచ్చిన
ట్లుండినసేనలం గలఁచి యోహరిసాహరిఁ బాఱఁ ద్రోలుచున్. 104

క. భీమగదాఘాతములన్, భూమిం బడె నెత్తు రొల్క భూరికరిఘటా
స్తోమంబులు వజ్రాహతి, భూమీధ్రములట్ల లోకములు ఘటిల్లన్. 105

క. గోరాలుఁ బెడవి గోళ్ళుల, నేఁగిదిం జేతికోల నేయుచుఁ ద్రోలున్
గోపమున నాయుధంబునుఁ, దాఁగిదిం గరుల భటుల దయ్యాలఁ దోలెన్. 106

వ. ఆసమయంబున. 107

శా. కల్పాంతస్ఫురదర్కభైరవనభఃక్రోధతామ్రాక్షుఁ డై
వేల్పుంజోదుకుమారుఁ డాద్రుపదరాడ్వేదండతండంబులన్
మేల్పత్త్రిప్రకరంబులన్ రథహయామేయాసిలం దూపులం
గెల్పుం దెల్పెడుసింహనాదములతో గిట్టించె నప్పట్టునన్. 108

మ. భలగంబుం బడలించి తోలుటరునిం బాంచాలురున్ సృంజయుల్
బలదర్పంబున వచ్చి తాఁకి శరము లర్పించిన న్గ్లేసి ది
క్కులు ప్రాయం గడు నార్చి పేర్చిన మహాక్రోధంబునం బార్థుఁ డ
మ్ములమొత్తమ్ముల ముంచి వారిఁ దఱిమెం బోరిఁగి పాఱ న్వడిన్. 109

చ. మఱి లేళ్లఁ గోలుపులిమాడ్కిని మూఁకలఁ దోలుసగ్గుడుం
దగఁ పఱప నా దుర్ముఖుండు తమ్ముఁడు సత్యజితుం డెదిర్చి నూ

* అలా కాలవి.

అనునిశితాస్త్రముల్ వదల • నన్నిటి నన్నరుఁ డర్ధమార్గమం
దెగఁగ నేసి యూసునఁ బదేనుశరంబుల మొత్తె నాతనిన్. 110

మ. విరథుండు న్విగతాస్త్రుఁడు న్వివశుఁడు • న్విత్రస్తచిత్తుండు నై
నరనాథానుజుఁ డంత వెన్నిడి చనన్ • బాంచాలుఁ డుక్కెక్కి స
త్వర మయ్యర్జునుమీఁద వాఁడిశరము • ల్వర్షించి హర్షించినన్
నరుఁ డుగ్రుం డయి రేఁగి వానిఁ గడిమి • న్వారించె వాల్తూపులన్. 111

ఉ. *శంబరమన్మథుల్బలె వెసం • ద్రుపదార్జును లొడ్డి పోరువా
నంబర మెల్ల బాణమయ • మై ధర యెల్లను బీనుఁగెంటలై
సంబర మయ్యె నయ్యెడ వి • శాలయశస్కుఁడు పార్థుఁ డగ్ని మే
లంబున వాని విల్విఱుగ • లాగున నేసి కడంక నార్చుచున్. 112

శా. పాంచాలుండు మహాంతువిల్లు గొని క్రో • ధస్ఫురజ్జ్వాలనేత్రుఁడై
పంచాస్త్రంబుల సూతకేతుహయచా • పంబు ల్వడిం గొట్టినన్
గించిద్ధాసవిలాసవక్త్రుఁ డగుచుం • గీర్వాణరాట్సూతి వా
ల్గాంచు నావివిధంబు లీఁగి కుతుకం • గు ల్వొట్టఁ దప్పైనికుల్. 113

క. †హాహాకారములతోఁ బ,ద్మాహిని యంతయును జెదరి • దశదిశలను సం
దేహ మొకింత యెఱుంగక, నోహరిసాహరిని బఱచె • నార్చుచు భీతిన్. 114

తే. శత్రుదుర్జయుఁ డర్జునుఁ • డాత్రపడెను, ద్రుపదునిం బట్టి బంధించి • పోవఁ గొంచు
సింహనాదము సేయుచుఁ • జెలఁగి వచ్చి, గురువునకు దక్షిణగ నిచ్చెఁ • గరము పేర్మి.

వ. ఆచార్యుం డర్జునుచేతకుం బ్రీతుండై ద్రుపదుం జూచి పరిహసింపుచు ని ట్లనియె. 116

శా. ఓహోహో యెవరయ్య మీరు ద్రుపదా • ఖ్యు ల్భూమిభృద్వర్గ్యులే
మీహంకారము మీప్రభుత్వమదముల్ • మీరాజ్యగర్వంబులున్
స్వాహాకారము నొందెనే కటకటా • బంధంబె మీబోంట్లకి
ట్లూహింపం బెకిరంపుబాపవిలసం • బుల్లంబునం దోఁచెనే. 117

క. అని బాలసఖుం డగుటన్, గనికరమున నుల్లసంబు • కడఁగా ద్రుపదుం
జను మని బహూకరించుచు, ననిచెం ద్రోణుండు విప్రు • లలుక నగింబే. 118

వ. ఇట్లు పరిభూతుం డై విముక్తుం డగుద్రుపదుండు సిగ్గుపడి దానికిఁ బ్రతీకారంబు సేయ నెంచి పుత్రార్థియై బ్రాహ్మణుల నారాధించుచు ఘోరతపంబు సేయు చుండె నంత నిట నాచార్యుం డర్జునుం గాంచి యి ట్లనియె. 119

---

* సంబరము = తొగిరపాటు. † ఓహరిసాహరి = తండోపతండముగ. సందేహ మొకింత యెఱుంగక = పాతిపోఁగూడదని సందేహింపక యని యభిప్రాయము.

‡ తరువోజ. విలువిద్యకుం దగ • వేడ్క దక్షిణను • బెట్టితి వెంతయుఁ • బ్రీతిగా నిపుడు
బ్రహ్మశిరమును • బడసితి కాన • వలయు దక్షిణ వెట్ట • బంధులయెదుటఁ
గలదు దానికి నొండు • కలద నే మున్ను • కడఁగినప్పుడ నన్నుఁ • గలయు మియ్యదియె
యలరుదక్షిణ యన్న • నౌ నని వెనుక • నతని కహిచ్ఛత్ర • మనుదేశ మిచ్చె. 120

## ధర్మరాజయౌవరాజ్యాభిషేకము.

వ. అంత నాసంవత్సరాంతంబున. 121

క. ధృతరాష్ట్రుఁడు గాంగేయప్రతిబోధితుఁ డగుచు యౌవ•రాజ్యమ్మున వి
శ్రుతధర్ము ధర్మజు స్థిరమతు నభిషేకించె జనులు • నోఁచి భజింపన్. 122

ఉ. ప్రావిలుకాండ్రబాణములు • భూతవరంబు లనర్ఘరత్నముల్
నా వసుధాస్థలంబున స•నాతతముం గొనియాట కెక్కుచుం
జేవమెయిం జతుర్దిశలఁ • జెల్లినభూపతు లవ్వనంబు లీ
నేర్పరు నన్నదమ్ము లొకఁ•డే యన నొప్పిరి పాండునందనుల్. 123

తే. ఆర్జనంబున నానృశం•స్యమున శౌర్య,ధైర్యముల సహిష్ణుత ధృతి•స్థైర్యములను
సౌహృదంబున ననుకంప • శమదమముల,ధర్మజుఁడు పేరుఁ బెంపునఁ • దండ్రి మించె.

క. అసియుద్ధగదాయుద్ధవి,లసనంబులయందు నవ్వ•లన్ శ్రీబలరా
మునుశిక్షితుఁ డై భీముం, డనవ్యుఁ డనుపేరు వడసె • నఖిలధరిత్రిన్. 125

మ. శరసంధానవిమోక్షలాఘవములన్ • శస్త్రాస్త్రలక్ష్యంబులన్
సురరాణ్ణందను నేఁడు బోలు నెవఁడుం • జూడంగ లేఁ డంచు ని
ధరణీచక్రమునందు నెల్లకడలం • దర్కృత్తువిఖ్యాతి సు
స్థిరశౌర్యోన్నతుఁ డై సఫాల్గుణుఁడు భా•సిల్లెం బరాజయ్యుఁ డై. 126

క. హయయుద్ధాతివిశారదుఁ, డయి నకులుఁడు దనరె భ్రాతృ•సనుచరుఁ డగుచున్
నయవిద్యానిపుణుం డై,చయదుర్జయుఁ డగుచు నలరె • సహదేవుండున్. 127

క. వీరవరేణ్యులు పాండు,క్ష్మారమణునిసుతులు వారు • సమరంబున సౌ
వీరుం దునిమిరి తండ్రికిఁ, బోరంగా వశము గాని • పోటరి మేటిన్. 128

క. పదివేలగజంబుల కై, గదతో భీముండు తోడు•గా నరివరులన్
ద్రిదశేంద్రసుతుఁడు మార్కొని, కదనంబుల విజయ మందె • ఘనతేజమునన్. 129

చ. నలువురుతమ్ములుం బుడమి•నాల్గుచెఱంగుల నున్నరాజులన్
గెలిచి సుమిత్రుని న్విమలు•ని న్యవనేశ్వరుఁ బాఱఁ ద్రోలి భూ

‡ అహిచ్ఛత్ర మనుదేశ ముత్తరహిందూస్థానమందుఁ గలదు దాని నవ్వల నర్జునుండు జయించి గురువునకు దక్షిణగా నిచ్చె నని తెలియం దగు.

తలమునఁ గల్గువిత్తసముదాయ ముదారతఁ దెచ్చి యిచ్చినన్
మెలఁగె యుధిష్ఠిరుండు కడిమిన్ నిజరాష్ట్రము పెంపు సేయుచున్. 130

కణికుఁడు ధృతరాష్ట్రునకు రాజనీతిఁ జెప్పుట.

వ. అంత ధృతరాష్ట్రుండునుం బాండవేయులదినదినప్రవర్ధమానమహోన్నతికిం జూపోపక రేలు కంటికిం గునుకు రామిం గొక్కుచు నొక్కనాఁడు మంత్రాలోచనపరుం డగు కణికుం డనుసౌబలమంత్రిం బిలిచి యి ట్లనియె. 131

క. అలఁతులు నోలిఁ గఁరంబడి, తెలియఁగఁ దమవారి పెంచి దినదినవృద్ధిం
జెలఁగెడుదాయలయునికికి, జలుపఁగఁ దగు నెట్లు దానిసరణిఁ దెలుపవే. 132

వ. అనినం గణికుం డతనియభిప్రాయం బెఱింగి నేను గొన్ని రాజధర్మంబులు సెప్పెద విన నవధరింపు మని యి ట్లనియె. 133

మ. ధరణీశుం డగువాఁడు దండధరుచందంబుం గొనం బోలుఁ గా
కరయన్ శాంతుఁడ వై స్వభావమృదులస్వాంతంబున న్వాఁడి సే
కఱతిం బూనిన వానిలక్ష్య మిసుమం తైనం బ్రజల్ సూడ రే
కరముం గట్టరు కూడుగుడ్డలకు ని క్కట్టై చెడున్ వాఁ డొగిన్. 134

మ. ఇదిగో చంపెద నంచుఁ బౌరుషమునే వీక్షింపఁ గాఁ జేయుచున్
మది నొక్కింతయు జాలి లేక రిపుల న్మర్దింపుచు న్నిత్యమున్
వదలం బోవక భీకరత్వమును భూపాలుండు వర్తించినన్
బెదరుం జెంది భజింతు రెల్లరును మే ల్పొందెసు న్వానికిన్. 135

క. తనఛిద్రము వెలిపుచ్చక, పరునిఛిద్రము లెఱిఁగి కార్యమూఢి మెలఁగుమన్
మనుజేంద్రుఁడు రాజ్యాంగములను గూర్మమురీతి లోన డాఁపఁగ వలయున్. 136

క. అలఁతి యని దాయ తమలో, మెలఁగఁగఁ బని కిరుణఁ దలఁచి మిన్నక నిల రా
దలఁతు లగునగ్గికణములు, పొలమునఁ బడి వనము లెల్లఁ బొడ వడఁగించున్. 137

క. తులువ యని తోలఁచి పాఁబా, లలఁతి గదా యనుచు నున్న నరి భీకరుఁ డౌ
ములు సగము పుచ్చి నిలిపిన, బలుగణ ముదయించి నేలఁ బడ మిడ కగునే. 138

చ. పగతు రలంతు లై చెడి విపద్దశ నుండిన యప్డు పెట్టులేఁ
బగ మొదలంటఁ బో నలుపఁ బాడె సమాశ్రితు లం చుపేక్ష గా
దగములచాటునం దృణము లందు నణంగియు వేఁటకాఁడు తా
మృగమును నమ్మఁ జేసి వధియించును గా కఘముం దలంచునే. 139

మ. వరసామాదులచే వశంవదుఁడు విశ్వాసాతిపాత్రుండు నై
శరణుం జొచ్చినయేని దాయ కరుణాస్వాంతుండు గా కంతయున్

దురితంబుం దలపోయ కుర్విపుడు త న్మూలంబును న్నాకే మై
తొరఁగం జేసి మెలంగ నొప్పు నిలయం దుర్ ముప్పు లే కెప్పుడున్. 140

తే. పగఱ నెప్పు డుపేక్షింప వలవ దగ్ని,హోత్రముల యజ్ఞముల నజినోత్తరీయ
ములజటావల్కలముల నీభూజనులను,బోలె నమ్మించి వంచింపఁ బోలుఁ బతికి.

క. దీనాలాపము లాడిన,యేనిం జేఁ జిక్క నట్టి కృతవిద్వేషుం
బూని వధింపఁగ వలయుం,గాని దయం జూపి విడువఁగా రా దెపుడున్. 142

క. తలకి యగునంతకుఁ బగతుఁగు, గుఱుకొని మిత్రుండు వోలెఁ గూడి మెలంగున్
దలకి యగుడు సర్ప మట్టులు, గఱచి నరుం జంపి తనపగం దీర్చుకొనున్. 143

చ. సమయము వచ్చుదాఁకఁ దమజాతికి నెగ్గొనర్చుదాయనే
నమిత్రదయారసంబునను రేఁదల మోయుచు నంత మ్రుచ్చటం
బమరిచదారి వైచినటు నాతని నైచి పగుల్పఁగా నగుం
గ్రమమున నగ్నిఁ గాల్ప నగుఁ గత్తుల మొత్తి వధింపఁగా నగున్. 144

మ. ఇవి దాయాదులపట్ల ధర్మములయో నల్లప్పుడున్ సర్వశ
త్రువులన్ రాజులు సామభేదములచేఁ ద్రుంగింపఁగా నెంత్రు నా
నవి యేరీతి నమర్చి శత్రువులసంహారంబు గావింపఁగా
నవునో దానియథాస్వరూపమును నీ వాడంగదే మిత్రమా. 145

వ. అని ధృతరాష్ట్రుం డడిగినఁ గణికుండు నీయర్థంబు దేటపడ నొక్కకథ గల దాకర్ణింపు
మని వెండియును. 146

కణికుఁడు చెప్పినకక్కకథ.

చ. కల దొకనక్క దానికి వృకంబును ముంగిస వాల్మికంబు గం
డెలుకయుఁ దోడునీడ లది యెల్లపుడున్ వనులందు మెట్టుచున్
బలిసినయిఱ్ఱిఁ జూచి యొకనాఁడు మెసంగఁ దలంచి దానిమై
పొలసు వశంబు గామిఁ దలపోయుచు నెయ్యురతోడ ని ట్లనున్. 147

చ మనకు నశక్య మీమృగముమాంసము మెక్కుట లైన నొక్కసా
ధనము విచింతు నియ్యెలుక దానిపదంబులు పండినప్పు డ
ల్లనఁ గొఱుకంగ నొప్పు నవలం బులి వేగ్రిమ్మడిఁ బట్టి చంప నా
మన మలగంగ నందఱము మానక పొట్టలు నించుకొ నగున్. 148

వ. అని బోధించిన మూషకంబు మృగంబు కాలు కొఱికి కుంటిం జేసె నపుడు వ్యా
ఘ్రంబు దానిం బట్టి చంపె నంత జంబుకం బామృగకళేబరం బరసి సంతసిల్లి మీ

రెల్లరు కృతస్నానులై వచ్చి భక్షింపుఁ డేను మీరావచ్చునంతకు దీని రక్షించుచుండెద
ననిన నవి వల్లె యని పోయి వచ్చునంతలో నది యెంతయుఁ జింత నభినయించు
చుండునంత దొలుదొల్త శార్దూలంబు వచ్చి దానిం జూచి యిట్లనియె. 149

తే. బుద్ధిమంతుఁడ వీ వరయ ♦ బద్ధసఖుఁడ, యేల చింతించుచుంటి వీ♦లీల మనము
దీనినంజూసు కిసుపారిఁ ♦ దిని ముదమున, నా విహారము సేయుద ♦ మనుడు నదియు.

వ. విషాదం బభినయించుచు ని ట్లనియె. 151

క. జలమాడఁగ నేగుచు న,య్యెల్లురకలరా యిట్లు వలికె ♦ నిహిహీం మీామీా
బలములు విత్తి మృగరాజులు, సలఁతులు నేఁ దెచ్చి మీాకు ♦ నశేసం బెనుడుగ.152

వ. అని మృగంబుం దాను జంపితి ననుకారణంబునం గర్వించి పలికె దానం జేసి నాకీమాం
సంబునం దిష్టంబు పోడమకున్న దనిన శార్దూలంబును. 153

క. సీ సీ మీా రీనంజుడిఁ, కాసింతురె యేమొ కాని ♦ యీమాంసంపను నే
కోసితి నాభుజశక్తిం, జేసి భుజించెద నటంచుఁ ♦ జెచ్చెరఁ జనియెన్. 154

వ. అంత మూషికంబు వచ్చిన దానికి జంబుకం బి ట్లనియె. 155

ఉ. మూషికరాజ వింటె మను♦ముంగిసమాటలు లేడిమాంసమో
దోషము చేఁదు నుండుఁ దినఁ ♦ దోఁపదు నీవు సముజ్ఞ యిచ్చితే
మూషికము న్భుజింతు నని ♦ పోయెను నా విని సంభ్రమించుచున్
మూషిక మూర్చ్ఛుచుం బఱచి ♦ పోయి నొకండుబడె నొక్కలోఁగలోన్. 156

వ. అంతఁ దోఁడేలు వచ్చినం గని జంబుకంబు. 157

శా. నీపై వ్యాఘ్రము కోపగించె మిగుల ♦ న్నే నెంతగాఁ జెప్పినన్
గోపం బాపుకొనంగ లేక తుదకుం ♦ గుర్వెట్టి ఘూర్ణిలుచున్
నాపైఁ గన్నెఱ సేసి పోయె నిదె కా♦న న్వచ్చు నొక్కింతలో
నీపైఁ బోలినయట్లు చేసికొను మిం ♦ దేఁ శ్రేయ లే నేమియున్. 158

వ. అనిన వృకంబు వెఱచి తోఁక ముడిచి పఱచె నంత నకులంబు వచ్చిన మనవా రెల్లరు
నాబలంబున కోడి మృగమాంసంబు నాకు విడిచి పోయిరి నీవు లావు గలదాన వేని
న న్నోడించి కొను మని నక్క వలికిన నదియును. 159

తే. మెకములకు రాజు వృకము నె♦లుకి లరాజు, నిను గెలువ లేక పోయె నా ♦ నీవు మేటి
వేను నీతోడఁ బోరుట ♦ కిచ్చగింప, ననుచు ముంగిసయును బోయె ♦ననవోలు వాసి.

వ. అప్పు డాజంబుకమారెనక్క యొక్కం డామృగమాంసంబు యథేష్టంబుగా భక్షించె
నట్లు సమయానుకూలసామదానభేదదండంబులు నాలుగున సాధనంబులుగా నుప

యోగించుకొని కార్యనిర్వాహకుం డై సమహామహీశ్వరుండు వర్థిల్లుచుండు నని వెండియు. 161

తే. భీరుని న్భయపెట్టియు • శూరుఁ గేలు, మొగిచియును లోభిఁ గోరిన • మొత్త మిచ్చి యు నలఁతిఁబరాక్రమించియు • నొడయఁ డరులఁ, గై వసము చేసికొనఁ దగుఁ • గౌరవేంద్ర.

తరు. మఱియొకండు వచింతు • మనుజేంద్ర వినుము • మహా మిత్రుఁ డైనను • మన్నింప నైన గురుఁ డైనఁ దనకన్న • గొప్ప కైనఁ దమ్ముఁ • డగ్రజుఁ డైనను జనకుం డైనఁ దనకు నరిపదంబున నున్న • నభయ మిచ్చి ధన • మొసఁగ పఱచియు విష • మమరఁ బెట్టియును సిరిఁ గోరువాఁడు హింసింప వలెఁ గాని • చిత్తమం దెపు డుపేక్షింపంగ రాదు.

క. మఱువఁ గార్యాకార్యము, లెఱుఁగక పెడత్రోవఁ ద్రొక్కు • నే గురు నైనన్ వెఱవక దండించుట యే, నెఱి యని తెలియంగ వలయు • నేర్పరి కవనిన్. 164

సీ. *కోపించి యును దన • కోపము వెలిపుచ్చ, కపుడు నవ్వుచు మాట • లాడ వలయుఁ దఱి వేచి దాయాది • దానిఁ దప్పనియప్డు, తొడిఁబడఁ బడి వానిఁ • ద్రుంప వలయు వధియింపఁ దగినట్టి • వానిగృహంబున, వెనుగేయ కాలంబు • వెట్ట వలయుఁ గత్తిక నెఱి వచ్చు • చిత్తంబులోఁ బైకి, మెత్తనిమాటల • మెలఁగ వలయు

తే. సిరి నభిలషించువాఁడు దా • నొరులపట్ల
వినయ మభినయించుచు వంగి • వినుతి సేసి
పాదముల వ్రాలి తియ్యని • పలుకు పలికి
మొదుఁగునది నైచ్యమున కోర్చి • యుండ వలయు. 165

క. తల మోచుచున్న శత్రువు, నలఁ ద్రుంపక యున్న వాఁడు • తాడిలెఱఁగునన్ బల మఱి మూలఁ జేర్చెడ, నలఁతులఁ బోకారుల మించ • నైన మిన్న యగున్.

ఆ. విశ్వసింపఁ దగిన • విందు నైనను విశ్వసింప రాదు దాన • సిలుగు గలుగు శంక లేనిచోట • శంకింప నగు నభ, యమును గోరుచున్న • యట్టివాఁడు. 167

క. తనమనము కత్తి కైత్తయి, తనరంగాఁ జేసి మాట • తెఱే వడునెడలన్ ననకన్న మృదుల మనిజను, లనుకొను నట్లుగను మెలఁగ • నగు రాజెపుడున్.

ఆ. ప్రాణసంకటంపుఁ • బనుల నధిష్ఠించి, భద్రముల నరుండు • పడయఁ బోఁడు పగఱ నమ్మరాదు • ప్రాణసంకట మైన, మంత్రరక్షణంబు • మఱువఁ జనదు. 169

తే. పరులమర్మముఁ జీల్పక • పగఱఁ గూల్చ, కధికదారుణకర్మము • లాచరింప కవనినాథుఁడు శ్రేయము • లందఁ బోఁడు, భూతదయతో మెలఁగుమత్స్య • ఘాతియట్లు.

---

* తొడిఁబడు = తొ ంపడు.

చ. అరివధ మాచరించి జయ మందఁ దలంచినతేఁడు వేఁడుకన్
గురుతరసైన్య మర్థమును గూరిచి పోరున కుత్సహింపుచున్
దారకొనినట్టి కార్యమును దూలఁగ నీక ముగింపఁ జేయుచున్
బరులకుఁ గాలకాలుఁ డను భంగి మెలంగఁగ నొప్పు నెప్పుడున్. 171

తే.*దండమును బొంది కవిసిన దాయ నెవఁడు
మించి దండింపక యనుగ్రహించి పుచ్చు
నాతఁ డెటు లైన మృత్యువు నందు నిక్క
మశ్వతరి గర్భమును బోలె నవనియందు. 172

ఆ. అడవి నిడినవహ్ని యట్లు సహాయసంపత్తి నరుఁడు ప్రబలి పగఱ నెల్ల
సంగరమున గెలిచి జయ మంది తనకోర్కి, సఫల మందుగతిని సలుపుకొనును. 173

వ. అని మఱియును. 174

చ.† కురువర నీవు చేయు నొగ్గనాడినవానిఁ జేయు మీమొదం
బురపురలాడి నీకుఁ దల ముక్కలు వచ్చెడువుంతఁ బోకు ము
క్వర నినుఁ గాచుకొమ్ము బల వంతులు పాండుకుమారు లెంతయున్
సిరి చెడ నీడ లే కవలఁ గుంతిలువాఁడవు గాకు మారిగన్. 175

వ. అని యుపదేశించి కణికుండు చనియె నంత ధృతరాష్ట్రుండును గుంతాజ్వరసంతప్తచిత్తుం
డయి యుండె నపుడు భీమార్జునకులసహదేవులపరాక్రమంబులకును ధర్మరాజ
యౌవరాజ్యాభిషేకంబునకును లోన సహింప నోపక దుర్యోధనుండు కర్ణశకుని
దుశ్శాసనులతో మంత్రంబుండి నానావిధాభ్యుపాయంబులఁ బాండవేయుల హింసిం
పుచుండె వారును విదురుననుగ్రహంబున నాపత్పరిహారంబు గావించుకొనుచు నుండి
రక్కాలంబున. 176

పౌరులు పాండవులం బ్రశంసించుట.

చ. పురజను లెల్లరున్ సుగుణభూషణభూషితు లైన పాండుభూ
వరవరపుత్త్రకుల్ములవాసి సభాభవనంబులందుఁ జ
త్వరములయందుఁ బొందుపడ వల్లెలు వేయుచు నెల్లచోలన్
ధరణి విభుత్వముంగుఱిచి తారు ప్రశంస యొనర్తు రొందఁగాదుల్. 177

ఆ. పుట్టుగ్రుడ్డి గాన మును ధృతరాష్ట్రుండు, రాజ్య మొందఁ డయ్యెఁ బ్రభువు నాన
తం డెసంగు టట్లు తా ధ్వజుఁడు ముందు, విడిచెఁ గాన మరలఁ బడయఁ డతఁడు.

---

* అశ్వతరి = గాడిదకును గుఱ్ఱమునకును బుట్టినది, కంచరగాడిద; ఇది గర్భమును ధరించెనేని వృశ్చికా దులవలె నశించు నని తేలుచున్నది. † పురపురలాడు = మిక్కిలియు పీకులపడు.

నప్పాండుదాయాద్య ♦ మిప్పు డీపాండవప్రవరులు గడిమి నైఁ ♦ బడసె నేని
సతతపుత్త్రుఁడు మతి ♦ యతనిపుత్త్రుం డొగిఁ, బాండవంశజుల్ ♦ ప్రభువు లగుదు

తే. రేము మాపుత్త్రపౌత్త్రాదు ♦ లెల్ల రాజ్యహీనులము నై బడల్పడి ♦ యెల్లప్రొద్దు
పరుల సేవించి కుడుచుచుంగ ♦ వలసి వచ్చు, నట్లు గాకుండ దయఁ జూడ ♦ వయ్య తండ్రి.

వ. ఇది యిట్లు గాక. 189

క.* మును నీవ రాజ్యభారం, బును గొంటివ యేని నీదు ♦ పుత్త్రుల మగుమే
మును రాజ్యార్హుల మై బల్మిని గొందుమ యవశ్య మైన ♦ మిడిజన మధిపా. 190

క.† అని కొడుకు నొడువుపలుకులను, విని కడుకుని తెలుపుధర్మ ♦ విధు లరసి మదిన్
మును వెనుకలాడ నించుక, కొని తలఁచి కడుదవ్వహించు ♦ కొడుకున కనియెన్. 191

ధృతరాష్ట్రునిదురభిప్రాయము.

ఉ. భారతవంశభూషణుఁడు ♦ పాండుఁ డసంశయమహీమహేంద్రుఁడై
కౌరవపూజ్యరాజ్యరమఁ ♦ గైకొని చీఁకని నన్ను లోకు లీ
తీరునఁ జూచినం దనమ ♦ దిం గలభక్తిస దెల్ల నాపయిం
జేర్చి సర్వపూజ్యుఁ డయి ♦ చెన్నలరారెఁ గుమారశేఖరా. 192

ఆ. పాండురాజుఁ బోలి ♦ పాండవులును ధర్మ, పరులు వీరులోక ♦ వరులు లోక
హితులు సుగుణవంతు ♦ లతులితారంభులు, వారి నెట్లు నే సు ♦ వలయుఁ దండ్రి. 193

క. పిత్రుపైతామహ మగునీ, క్షితిరాజ్యము నుండి మజ్జి వి ♦ శేషసహాయ
ప్రతిపత్తి గలిగి మెలఁగెడు, సుతులన్ వెడలించు టెట్లు ♦ సులభము తండ్రీ. 194

మ. ధరాధీశుం డగుపాండురాజువలనం ♦ దా రెల్లసామంతులున్
వరసేనాసచివప్రధానపురుషుల్ ♦ బంధువ్రజంబుం బ్రజల్
భరియింపం బడి రెల్లరాజులును మున్ ♦ వా రందఱు న్వారినిం
బరమేష్ఠస్థితిఁ జూచుచుండఁ దనుజ ♦ న్మా యిట్లు నీ కేక్కెన్. 195

ఆ. పాండురాజువలనఁ ♦ బాలింపఁబడినయా, ప్రజలు పక్షపాత ♦ భరితు లగుచుఁ
జంప కుందు రెట్లు ♦ సకలబంధులతోడ, నిట్టు లున్నమనల ♦ నెట్టు లైన. 196

వ. అనిన నతనియభిప్రాయం బెఱింగి దుర్యోధనుండు. 197

తరళము. ఇది యెఱింగియు కాడ లోకుల ♦ కెల్లయర్థము లిచ్చుచున్
మది గరంగఁగ గారవించుచు ♦ మంచిమాటలు చెప్పుచుం

---

* మిడిజనము = మిడిసిపాటు గలజనము. † కొని = సరిపడి, అనఁగా గొడుకుమాట కిష్టపడి యని యభిప్రాయము; ఇట ధృతరాష్ట్రునకుఁ బాండవులను వెడలించుట యిష్టమే కాని యది సులభసాధ్యము గా దని తనయభిప్రాయము కొడుకునకు మఱియొకతీరున వెల్లడించినాఁడు.

బదిల ముంటిని వార లెల్లరు మత్సహాయులు సైన్యసం
పదయు దుర్గము మంత్రివర్గముఁ బట్టి యుండెడు నాదెసన్. 198

వ. అయిన నిపు డంతకుం బని లేదు మృదుమధురమార్గంబునన కొంతకాలము కుంతీసహితంబుగాఁ బాండవేయుల వారణావతంబున నుండఁ బుచ్చినం జాలు నీప్రకృతిజనపదులు తదాసక్తు లుడిగి మనకు రాజ్యంబు సుప్రతిష్ఠితం బయినవెనుక వెండియుం దోడి తెత్తు మనినం గొడుకునకుఁ దండ్రి యి ట్లనియె. 199

శా. ఈయర్థంబ తలంపు సేయుదును నే నేప్రొద్దు లోలో నభి
ప్రాయం బియ్యది దుష్టమాటఁ జులకన్ నాకు విప్పఁ బో నెవ్వ గాం
గేయుంగీరసగాతమార్యవిదురుల్ కీడెంచి కా దందురు కౌం
తేయు ల్మీరును వారి కొక్కటఁ డెటు లొంటిం బుచ్చునో వారలన్. 200

వ. అనిన దుర్యోధనుండు వెండియు. 201

సీ. వినవయ్య నీమాట విని శాంతనవముఖ్యు, లాడఁబడుదురు దీని కొండు గాదు
సము లయ్యు వారు నాజలివార గురుసూతి, నా కిష్టసఖుఁ డయి వీఁక నుండుఁ
గొడుకునకుఁ దండ్రి వడుఁ జుట్ట లగువారి, కై కృపుండును నాదుకడన యుండు
మధ్యస్థుఁ డగుట న న్మన్నించు భీష్ముండు, విదురుఁ డె ట్లుండినఁ గొదవ లేదు

ఆ. పాండురాజుతోంటి భక్తిఁ దలంచి త
త్తనయులందుఁ గరుణ తగుల నీక
తలఁగఁ జేసి నిద్ర మలఁచు నాహృదయశ
ల్యము సముద్ధరింపవయ్య తండ్రి. 202

వ. అని యనేకవిధంబులఁ బ్రార్థించినం బ్రసన్నుం డై ధృతరాష్ట్రుండు నేను నీయిష్టక్రమంబునం బ్రవర్తించెదం బోయి రమ్మని దుర్యోధను నంపిపుచ్చె నని జనమేజయునకు వైశంపాయనుండు చెప్పె నని చెప్పిన విని నైమిశారణ్యవాసు లవ్వలివృత్తాంతంబు చెప్పు మని సూతు నడుగుటయును. 203

ఆశ్వాసాంతము.

చ. బుడగవలెన్ క్షణార్థమునఁ బోవుశరీరము నమ్మి యెన్నియో
నిడుమల కోర్చి సౌఖ్య మన నేమొ యెఱుంగక రిత్తవోయెడున్

---

* బుడగ = బుగ్గ, బుద్బుదము. ఈరూపము కోశదృష్టము గాకున్నను గోదావరిమండలమున వాడుటంబట్టి ప్రయోగింపఁ బడియె.

జముఁ డయి మర్త్యుఁ డ త్తెఱఁగున • బడ నీయక నన్నుఁ బ్రోవు నీ
యమగుల మొ్రొక్కి నీ గృతుల • నర్చన చేసెద నోపరాత్పరా. 204

మ.*నిను సేవించెడువాఁడఁ గాన మదిలో • నీప్రాపు నే నమ్మి నే
ననుమానింపక భారతార్ణవము నీ•హంజేసి యేతద్విధం
బున నీఁదం గడగట్టినాఁడను భవ•త్కారుణ్యానుకంపోడుపం
బౌనరం బారిము నొందఁ జేయఁగదె న • న్నార్మిక జగద్వల్లభా. 205

గద్యము.

ఇది శ్రీమదఘునాతనోభయకవిమిత్రి వేంకటయజ్వాగ్రిపుత్ర
సమారాధితవిబుధరాజ శ్రీపాదకృష్ణమూర్తి కవిరాజ
ప్రణీతం బయిన శ్రీకృష్ణభారతంబునం
దాదిపర్వంబున సప్తమాశ్వాసము.
శ్రీ. శ్రీ. శ్రీ.



* ఈహా = పూనిక. ఉడుపము = ప్లవము, తెప్ప.

శ్రీ

శ్రీబాలాత్రిపురసుందర్యై నమః.

# శ్రీకృష్ణభారతము

## ఆదిపర్వము—అష్టమాశ్వాసము.

### జతుగృహపర్వము.



కృష్ణాసరిదావృత
లోకోత్తరముక్తినగర లోలుభ భూపా
లోకల్పితస్తుతిప్రియ
లోకేశ్వర లోకపాల లోకాధారా. 1

ధృతరాష్ట్రుఁడు పాండవుల వారణావతంబునకుఁ బుచ్చుట.

వ. అవధరింపు మక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లనియె నట్లు కొడుకు నంపిపుచ్చి ధృతరాష్ట్రుండు ధనమానప్రదానంబులఁ బ్రకృతిప్రధానవర్గంబు వశపఱుచుకొని తన మంత్రివర్గంబుచే వారణావతంబు సకలసంపత్కరం బనియు నివాసరమణీయం బనియుఁ బాండవులు వినం బొగడించి వారి కందుఁ దగులంబు పుట్టించి వెనుకం గొన్నాళ్ల కొక్కనాఁడు పాండవేయులం బిలిచి గారవించి యిట్లనియె. 2

మ. అమరద్వీపవతీతటంబున నరేంద్రావాసయోగ్యం బగున్
రమణీయం బగు వారణావతపురీరత్నంబు నే వింటిఁ జుం
డమరేంద్రప్రతిమానవైభవముతో నం దుండి కొన్నాళ్లు దా
నములున్ ధర్మములుం బొనర్చి మరలన్ రా నొప్పు మీ రందఱున్. 3

వ. అని శాసించిన వానియభిప్రాయ మయ్యుధిష్ఠిరుండు దనకుం దగుటం జేసి యట్ల యగుం గాత మని యంగీకరించి భీష్మవిదురద్రోణ బాహ్లీక సోమదత్త కృపాశ్వత్థామ భూరిశ్రవస్సుల కెఱింగించి మాన్యు లగు బ్రాహ్మణులకును హితు లగుపురోహితులకును బ్రియు లగుపౌరులకును గాంధారికిని మ్రొక్కి ధృతరాష్ట్రశాసనంబున మేము మాపరిజనంబుతో వారణావతంబునకుఁ బోవుచుంటిమి మీ రెల్లరును బ్రసన్నమనస్కుల రై మమ్ము దీవించి యంపి పుచ్చుఁ డని వారియాశీర్వాదంబు లంది సానుజుం డై జననిం బురస్కరించుకొని కృతప్రయాణుం డయ్యె నంత

దుర్యోధనుండు కరంబు సంతసిల్లి పురోచనుం డనునిష్టసచివుం బిలిచి వాని కేలు పట్టుకొని లాలించుచు రహస్యంబున ని ట్లనియె. 4

—◆ దుర్యోధనుఁడు పురోచనునిచే లక్కయిల్లు చేయింపఁ బంచుట. ◆—

తే. ప్రాణమిత్త్రమ వసుపూర్ణ ◆ మైనయీధ,రాతలము నాది యై యొప్పు◆రీతిగా నొ
నర్పఁ దగు దీవు నీకన్న ◆ నాకు లేఁ డొ,కండు విశ్వాసికతముండు ◆ ధ్రాతలమున. 5

క. నామంత్రము రక్షింపుము, నామిత్త్రమ నీవు నేర్పు◆న న్నారిపులన్
భూమిం బ్రదల్లఁగఁ జేయుము, నామంత్ర మింతయు నెఱిఁగి ◆ నడపఁ గడఁగుము నా. 6

తే. వారణావతమునయందు ◆ వామదేవు,నుత్సవ మొకంటు కల్పించి ◆ ప్రోత్సహించి
పాండవుల సంపిపుచ్చె భూ◆పాలుఁ డట్లు, నరిగి వా రుత్సవంబున ◆ నచట నుండ్రు. 7

న. అది కావున. 8

తే. పాండవులకన్న నీవు ము◆న్వారణావ,తమునఁ జని లక్కయిల్లొండు ◆ దనరఁ జేసి
వారి నందుఁ బ్రవేశింపఁ ◆ బంచి పిదప, కాన నుండఁగఁ జిచ్చిడి ◆ కాల్పి రమ్ము.

వ. అని పంపినం బరమవిశ్వాసపాత్రుం డగు పురోచనుండును వేగంబునం బూన్చిన రథం బెక్కి వేగంబ వారణావతంబున కరిగి నగరోపాంతంబున నాయుధాగారంబు దరి ననన్యభేద్యంబుగా శణసర్జరసఘృతతైలలాక్షావ్యామిశ్రం బై సమృత్తికావిశేషంబు నను జతుదారుపుంజంబునను రమణీయంబుగా విశాలచతుశ్శాలంబు నిర్మించుచుండె నంతఁ బాండవులును గొన్ని దినంబులు నడచిన వెనుక గంధవాహబాంధవంబు లైన మహాసైంధవంబులం బూన్చిన కనకరథంబు లెక్కి విదురాదికురుపుంగవులు తమ్మనుసరింపఁ గరినగరంబు బయలు వెడలి యప్పుడు పౌరులు వారిం జూచి దుఃఖించుచుండ నందుఁ గొందఱు బ్రాహ్మణులు నిర్భయంబున. 10

—◆ వారణావతంబున కరుగుపాండవులం జూచి పౌరులు దుఃఖించుట. ◆—

సీ. ధృతరాష్ట్రుఁ డింతటి◆పతితాత్ముఁడో కాక, వెతఁ బాండవులఁ బుర◆వెడల నడచె
పితృధనం బగుకురు◆క్షితి యుధిష్ఠిరునకుఁ, దగు నొకం డనుభయ◆మతి గయ్యో
నిది యధర్మ మటంచు ◆ నెఱిఁగి తాళధ్వజుం, డంపుచో నేల వా◆రింపఁ డక్కా
ఖలుఁడు దుర్యోధనుం ◆ డలరుపీఁటల కట్టి, నేఁచిచ్చు వెట్టి తా ◆ నేఁచు నొక్కొ

ఆ. పాండురాజు వెనుకఁ ◆ బ్రజల కీడెదు తండ్రి
పోలె మనుచు ననుచుఁ ◆ గ్రాలుచుండ
నిట్లు వచ్చె మనము ◆ నితనితోఁ బోత్తుము
గృహము లేల మనకు ◆గృహిణు లేల. 11

ఆ. మును విచిత్రవీర్యుఁ డనుఁ బాండుఁడును రాజు,లైరి మనకుఁ దండ్రు లట్టి రిపుడు
పాండుఁ డరుగ వాని బాలురఁ గని సైఁప, లేక యుండె నకట చీఁకునృపతి. 12

క. మన మందఱ మీదుష్కృతిఁ, గనుచుం గరినగరి నుండఁ గలమే యీయిం
డ్లను విడి ధర్మజుఁ డేచటికిఁ, జను నచటికి చనుట యొప్పు నఁగుఁ బలికింపన్. 13

వ. అని పౌరులెల్లఁ దెరలి తన్ను వెంబడించుటయుం గని ధర్మరాజు వారి వారించుచు ననునయపూర్వకంబుగా ని ట్లనియె. 14

ఆ. తండ్రిపంపు సేఁత తగవు గావునఁ బోయి,వత్తుమయ్య మేము పౌరులార
మీరు మాహితంబుఁ గోరిన దీవించి, మఱవ కిండ్ల కిపుడు మఱలుఁడయ్య. 15

క. మీవలన మాకుఁ గార్యము,గావలసినయట్టియదను గలిగిన యేనిన్
మావలన వచ్చి ప్రియములు, గావింతురుగాక యిపుడు కరుణింపుఁ డెదన్. 16

వ.*అనినం బౌరు లెల్లరు వల్లె యని వారి నాశీర్వదించుచు వలగొని పురంబున కె ట్టకే మఱిడి చని రప్పుడు సర్వభాషావిశారదుండును ధర్మజ్ఞుండును నగువిదురుండు సర్వజ్ఞుం డగుయుధిష్ఠిరుం జూచి యొరులు వినినం దెలియ కుండునట్లు మ్లేచ్ఛోక్తి భూయిష్ఠవాక్యంబుల ని ట్లనియె. 17

— విదురుండు పాండవులకు లాక్షాగృహవృత్తాంతం దెలియఁగించుట. —

తే. నీతిశాస్త్రానుసారిణి యై తనర్చు
పగఱప్రజ్ఞ యెఱింగి యెవ్వాండు పోదలు
వాఁ డవలఁ గల్గ నైనయుపాయముల కు
పాయములఁ జూచి చేయుంగి వలయు నెపుడు. 18

సీ.† విను మలోహంబును దనుపరికర్తనం,బును నగుసితశస్త్రమును నెఱింగి
వాఁడు దానికిఁ బ్రత్యుపాయ మారసికొన్నఁ, బగవారిచేఁ జంపఁబడఁడు నిజము
కాఱడవి దహింపఁ గలవహ్ని లాఁగలోఁ, గల్గియుండిన నెల్కఁ గాల్ప లేదు
చెవులును దన్నును దెలియు గుర్తిడికి, ధృతి లేనివాఁడు భూతికిఁ దొలంగు

* ఇట విదురుఁడు ధర్మజునితోఁ జెప్పినవాక్యములు సాంస్కృతికము లైనను లుప్తార్థకవికృతవర్ణపద నిబద్ధంబు లై యుండుటం జేసి మ్లేచ్ఛోక్తి యని వ్యవహరింపంబడియె.

† కర్తయుండిన ఘ్రిపియుండిన. 18, 19 పద్యములు:— ఈకారుగవాక్యములలో నహితుఁడు పురోచనుఁ డనియు నలోహాశస్త్రము లక్కయి ల్లనియు నేదు సారంగమునఁ దూటి యగ్నిఁ దప్పించుకొనున ట్లనఁగా లక్కయింటిచుట్టులు చిమ్మపెట్టనున్నపుడు మీరే చిమ్మ పెట్టి సొరంగము దూటి వెలికిఁ బోవలె ననియు వెలికిఁ బోయినపుడు నక్షత్రములవలన మార్గములు తెలియు ననఁగా నితరమార్గమునఁ బోవుదుసు గాని హస్తినాపురమునుగూర్చి రాఁవల దనియు నట్లు చేసిన శత్రువులచే మీరు పీడింపఁబడక యుందు రనియు మొదలైనసంగతులు ధ్వనించుచున్నవి.

తే‡. సహితుఁ డిఱేఁడునలోహజ ♦ మైనశస్త్ర
మొఱిఁగికొని తాను వానిపై ♦ నిడఁగ వలయు
నే దిల సారంగమునఁ దూఱి ♦ యేర్చు నగ్ని
వలనఁ దప్పించుకొనునట్లు ♦ వలయుఁ దొలఁగ. 19

ఆ.*బయలు వెడలి నడచు ♦ వానికి మార్గముల్, తెలియు భములవలన ♦ దెసలు దెలియు
నాత్మ చేసడంచి ♦ యైదింటిఁ బీడింపఁ, బడక యుండు నరుఁడు ♦ పుడమియందు. 20

వ. అని విద్వదగ్రగణ్యుం డగువిదురుం డిట్లు చెప్పిన యుధిష్ఠిరుండు తెలిసినది నీచెప్పి నట్లు చేయుదు నని ప్రత్యుత్తరం బిచ్చె నంత నతండు వారి నాశీర్వదించుచు వీడుకొని వీడునకుం జనియె నప్పుడు కుంతి కొడుకుదిక్కు మొగంబై. 21

క. విదురుం డేగుచు నీతో, విదితంబుగ నేమొ చెప్పె ♦ వింటిమి మేముం
దుద మొదలు దెలియలే దే, నది సేయుదు నంటి నీవ ♦ దేమి తనూజా. 22

వ. అనిన నజాతశత్రుం డుతల్లి కిట్లనియె. 23

చ. విదురుఁడు డొంకండు మమ్ముఁ గని ♦ పెంచినపాండునిఁ బోనివాఁడు మా
కొదవెడునాపదల్ దొలఁచ ♦ నుండినవాఁడు గదమ్మ తల్లి దు
ర్మదుఁ డగుధార్తరాష్ట్రుఁ డొక ♦ మాత్ర పురోచనుచేత లక్కయిల్
పొదలిచి చిచ్చునన్ మనల ♦ బూది యొనర్చునఁటమ్మ వింటివే. 24

పాండవులు లాక్షాగృహంబునం బ్రవేశించుట.

వ. మఱియు నతండు దానినుండి మనము వెడలునుపాయంబును జెప్పి రాఁగల యపాయమ్ములకుఁ బ్రతీకారమ్ము లగునుపాయమ్ములును జెప్పి పుచ్చెద నని చెప్పి చనియె ననిన విని కుంతి విదురునిం గొనియాడె నంత వారు కతిపయప్రయాణంబుల వారణావతంబుఁ దఱియం జొచ్చి తమ్మెదుర్కొనినపౌరుల నాదరించుచుఁ బురోచనపురస్సరంబుగాఁ జని రోహిణీనక్షత్రయుక్తఫాల్గుణశుక్లాష్టమీదినంబున సకలాలంకారాలంకృతంబై నానాజనాకీర్ణంబైనపురంబునం గలరాజభవనంబునం బ్రవేశించి పురోచనపరికల్పితభోజనభాజనశయనాసనాదులం దనియుచుఁ బదిదినంబులు గడపి వెనుకం బురోచననివేదితంబును శివాఖ్యాశివంబును నగుచతుశ్శాలం బనుగృహంబునఁ బ్రవేశించి దానినిర్మాణంబున కచ్చెరుపడి మెచ్చుచు నందు నివసించి యుండి రంతనొక్కసమయంబున సకలధర్మమర్మజ్ఞుం డగుధర్మజుం డేకాంతంబున భీమసేనున కిట్లనియె. 25

‡ ఏదు = శలలము, ముండ్లపంది. * భములవలన — నక్షత్రములవలన; ఐదింటిని = పంచేంద్రియములను.

తే. మూరుకోసు మిందుఁ జత్వాజ్య • ములను గూడి
నట్టికొ్రవ్వ్వాసన గొట్టు • నరయ నీమ
హాభవనరాజ మింతలో • నగ్నిఁ గాల్ప
ననువు పడ గడ్డిగాదము • లొనరుపఁబడె.

మ. ఇది మాయాగృహ మెల్లకుడ్యములునున్ • వీక్షింప లాక్షారసా
స్పదతైలాప్లుతముల్ పురోచనునిశి • ల్పం బొప్పు నాగ్నేయమై
విదురుం డగ్నిభయంబుఁ జెప్పె నిచటన్ • విశ్వాసముం జేయ రా
దావపుం గిష్టము లీపురోచనునిచే • నెక్కంతకాలంబునన్. 27

ఆ. ఈపురోచనుండు • పాపి గాన సుయోధనునకు వశుఁడ యగుచు • మనకుఁ గీడు
సేయ వేచి యుండె • నీయుదంతం బెల్లఁ, దెలిసికొంటి విదురు • వలన మున్న. 28

క. అనినన్ వడముడి యిట్లను, ఘనమతి యిది యగ్నిభయము • గలయది యైనన్
మన మిటు నుండఁగ నేటికి, మును పుండినచోట నుండఁ • బోలదె చెపుమా. 29

చ. అనిన యుధిష్ఠిరుండు మన • మాత్రిపడం దగ దిట్లలెంగియున్
మనపినతండ్రి సెప్పినక్రమంబున నేమఱకుండ మిందుఁ బా
పునికృతి దేలునంత కిటు • వ్రావఁ బురోచనుఁ డీరహస్య మే
గె ననుచు నెట్టులే మనల • గిట్టక బల్మిన పట్టి కాల్చెడున్. 30

ఆ. పీఁ డధర్మకృతికి • వెనుదీయఁ డితరుల,వలనినిందలకును • దలఁకఁ డెడఁదఁ
గాన బుద్ధిహీనుఁ • డైన యట్టిఁడు సుయోధనునివశమునంద • తనరుచుండు. 31

ఉ. కౌరవు లిట్లు పాండవులఁ • గాల్చిరి నా వినియు న్నదీసుతుం
డేరినిఁ గాదనం డని న • రేంద్రు నియల్కఁ దానకంబు కా
నేరఁడు వృద్ధు లేరయిన • నేరము పల్కినఁ బల్క వచ్చు నిం
దే రెఁడు లన్న నేమిఫల • మిగ్గతి నంతయుఁ జన్నపిమ్మటన్. 32

ఆ. మనము దాహశ్ఛితి • మతియొందువోటికిఁ, జనుదుమేని చార • జనమువలన
నరసి రాజ్యలుబ్ధుఁ • డైనదుర్యోధనుం, డెల్లరన్ వధించు • నెగిచి పట్టి. 33

తే. పదవి గలయట్టిపురుషుఁడు • పదవిలేని,వాని నసహాయుఁ డసహాయు • వసుసహితుఁడు
వసురహితుని నిర్జించు ని • వ్వసుధయందు,ధ్రువముగా నెట్టివెఱవేని • తొడరి పన్ని.

ఉ. లావు గలాఁడు గాన మన • లం గొని వేఁచు సుయోధనుం డొగిన్
గావున నమ్మిన ట్లిచటఁ • గాలము పుచ్చుచు నిప్పురోచనున్

* వావిరి నంటె వేఁటలనెపంబున నిచ్చలు మోసపుచ్చుచుం
జేవ మెయిన్ మెలంగుదము చీఁదఱ వోవఁగ నప్రమత్తతన్. 35

తే. వేఁట దిరుగుటవలనను బాట లెఱుఁగ, నగుఁ బలాయితుల మగుచు నరుగునపుడు
భూబిలము చేసికొందము పురజనులకు, నెఱుఁగకుండ మనల నగ్ని యేర్చకుండ.

క. అని పలుకుచు ననుజన్ములు, జననియుఁ దనసుడిన నిలువ జతుగేహమునం
దనిశంబు జాగరూకత, గాని మెలఁగె యుధిష్ఠిరుండు కుశలుం డగుచున్. 37

వ. ఇట్లు కొంతకాలంబు గడచిన వెనుక నొక్కనాఁడు విదురప్రేరితుండై కుశలుండను
ఖనకుం డగు నొక్కసుహృద్వరుండు వచ్చి పాండవులం గని వివిక్తంబున. 38

క. ఖనకుఁడను విదురమిత్త్రుఁడ, నను మీకడ కనుప వచ్చినాఁడ వడిఁ బురో
చనుఁ డీకృష్ణచతుర్దశిఁ, దనరు నిశీథమున నగ్ని దరికొల్పు నిటన్. 39

లాక్షాగృహదహనము.

వ. నాఁటివిదురప్రతిపాదితమ్లేచ్ఛోక్తు లిట విశ్వాసకారణంబు లని సాభిజ్ఞానవచనంబు లెఱింగించిన ధర్మనందనుండు నిన్నమే యెఱుంగుదుము నీవు సుహృదుఁడ వనియు నాప్తుఁడ వనియు సమర్థుండ వనియు మావిదురుండు చెప్పియుండె నీయందు మా కొండువిధంబు లేదు మేము విదురునకుంబలె నీకును గావలసినవారము దుర్యోధనుశాసనంబునఁ బాపాత్ముఁ డపురోచనుండు మమ్ము నేఁచుటకు వేచి యున్నవాఁడు వహ్నిభయంబు గలుగ నీప్రాకారం బతిక్రమించుట శక్యంబు గాదు నీ వి యుపాయంబునకుం దగు నుపాయంబు చేసి మమ్ముద్ధరింపఁ బ్రయత్నింపు మనిన నతండు పరిఘాదుల నుక్కఁ బెట్టువాఁడుంబోలెఁ బరివర్తించుచు నెవ్వరు నెఱుంగకుండఁ బవలెల్లం గాలువలు పురోచనునితో వేఁటలాడ నేగియున్నప్పుడా జతుగృహమధ్యంబునుండి వెలువడునట్లొక్క సొరంగంబు నిర్మించి భూసమంబుగా నున్న దానిముఖంబునఁ దెలియకుండునట్లొక్క కవాటంబుఁ గట్టి దాని మెట్టం గంతయుఁ బాండవేయుల కెఱింగించిన వారును భయంబు దీఱి పురోచనుని నమ్మినట్లు నటించుచు నొక్క పరివత్సరంబు నివసించి యుండిరి పురోచనుండును బాండవులు తన్ను నమ్మియుండిరని సంతసించుచుండె నది యెఱింగి యుధిష్ఠిరుండు తమ్ములం జూచి మన మిప్పుడు వీని వంచించి పోవుట మంచి దని తలంచుచుంటి నని వచించె నంత నాచతుర్దశిదినంబురాత్రి కుంతీదేవి దానాపదేశంబున బ్రాహ్మణసమారాధనంబు గావించుటయు నట వారణావతంబునం గల స్త్రీపురుషు లెల్లరును వచ్చి

* వావిరి = అనుగతి; చీఁదఱ = ఉపద్రవము.

యథేష్టంబుగ భుజించి చనిరప్పు డన్నార్థినియై యొక్కనిషాదవనిత తనయేవురు పుత్త్రులతో నట వచ్చి భుజించి కాలవశంబున మద్యపానపరవశయై జతుగృహబహిరంగణంబున నొడలెఱుంగకుండఁ జచ్చెనో యనఁ బడి నిద్రవోయెఁ బురోచనుండును నయ్యర్ధరాత్రంబునం జిచ్చు వెట్టువాఁడై యట నొక్కచో నిద్రితుం డయ్యె నవుడు గాలి మిక్కిలిగఁ గొట్టుచుండ భీమసేనుండు లేచి యన్నదమ్ములం దల్లి బిలంబులోని కనిచి నాయుధాగారం బగులాక్షాగారంబు నలుగడ ననలంబు దరికొనం జేసి తానును బిలమార్గంబునఁ బ్రవేశించి తనవారి నెల్లరఁ గ్రమంబున బిలంబు వెలువరించి నిశావశంబున నడువనేరకున్నం దల్లి నఱకడ నిడుకొని ధర్మజార్జునుల భుజయుగంబునం జెక్కించుకొని నకులసహదేవుల నుత్సంగంబుల నెత్తుకొని సాంకేతికస్థలమున ఖనకునకుం దమకుశలం బెఱిఁగించి పాదఘాతంబున ఱాలు చూర్ణంబుగా మహానిలవేగంబున నారాత్రిశేషం బంతియు నడచి కడు దూరం బతిక్రమించె నంత నిట వారణావతంబున. 40

క. నలుగడ ననలము దరికొని, కులకుల జతుగృహము కుప్ప ♦ గూలి వెలింగెన్
గలవస్తులతోడ నిషాదులతోడఁ బురోచనాఖ్య ♦ దుష్టునితోడన్. 41

ఉ. జాతుషగేహ మగ్నినల ♦ సాత్కృత మయ్యెమునప్పు డప్పురీ
జాతులు వచ్చి చూచి కడు ♦ సంభ్రమ మందుచుఁ బాండవేయు లీ
రాతిరి వేళ నియ్యనల ♦ రాశిఁ బడల్పడిరో యటంచు న
త్యాతతభీతి భస్మచయ ♦ మంతయు నెంతయుఁ బాయఁ ద్రోయుచున్. 42

పౌరులు దుఃఖించుచుఁ దద్వృత్తాంతము ధృతరాష్ట్రునకుం జెప్పుట.

చ. కొడుకులతోడ దగ్ధమయి ♦ కూలినచెంచెత బూదిపాములోఁ
బడి కనిపింపఁ గుంతియును ♦ బాండవులే యని దుఃఖితాత్ములై
కడుఁ బలవించుచున్ జనులు ♦ కౌరవు లిట్లొనరించి యుందు రె
ప్పుడుఁ గలహింతు రిప్పరమ ♦ పూరుషపంచకమందు వారయో. 43

మ. అకటా సర్వసమర్థుఁడై నదిసుతుం ♦ డప్పాపులం బట్టి కో
యక వా రాడిన దాటగా నడచున ♦ ట్లాలించి ధర్మంబు గా
నక యుంటెం ధృతరాష్ట్రుఁ డాత్మజులక ♦ న్నం గ్రూరుఁడై పాండవాం
తకుఁ డయ్యెన్ విదురుం డొకండు గుణి యై ♦ నం దాన నే మయ్యెడిన్. 44

వ. అని దుఃఖించుచుండ వారిం గూడి దుఃఖించువాఁడపోలె ఖనకుం డాభస్మచయంబు వాయఁ ద్రోయుచు నెవ్వరికిం దెలియనట్లు బిలముఖంబు పాంసుచ్ఛ

న్నంబు గావించి కరిపురంబున కేగి పాండవులకుశలగమనంబును బురోచనుపంచత్వంబును విదురునకుం జెప్పె నంతఁ బ్రభాతంబున బయలువెడలి వారణావతపురవాసులు పోయి నీఱొనరు చేయించినలక్కయింటిలోఁ బాండవులునుం గుంతియుం గాలి పంచత్వంబు నొందిరని ధృతరాష్ట్రునకుం జెప్పె. 45

క. నీకోరిక ఫలియించెను, నీకుం బాండవులఁ దగులఁ • బెట్టితి వింక నీ
వే కురురాజ్యం బేలుము, చేకొని భోగముల నెల్లఁ • జిరకాలంబున్. 46

వ. అని సర్వియంబుగఁ దెగడి పోయిన నెల్లవారును దుఃఖించి వారికి నుత్తరలోకక్రియలు చేయించిరి దుర్యోధనాదులును బురోచనుపోకకు శోకించి రట్లు పాండవులును బ్రభాతం బగునంతలో గంగానదీపరిసరంబునకుం జేరుటయు నట విదురప్రేషితుం డగుపురుషుం డొకడు పొడకట్టి పాండవులం గని నన్ను విదురుండు పుచ్చె నే నిదె గంగం దాఁటించునావం దెచ్చితి మీరు నాటిమ్లేచ్ఛోక్తుల నన్ను నమ్మి నావపై నధిష్ఠింపుఁడు విదురుండు మిమ్ముఁ గౌఁగిలించుకొని మీకు విజయ మగుఁ గాత మని చెప్పు మనియె ననిన వారు వానిమాటలు విశ్వసించి వానితో నా నావ నెక్కి గంగం దాఁటి నక్షత్రగణంబులం జేసి దారి దెలిసికొనుచు దక్షిణాభిముఖులై ఘోరారణ్యంబు వట్టి ప్రచ్ఛన్నవేషంబులం బోవుచు క్షుత్పిపాసాపరవశులై నడవనేర కున్నవారి నందఱ ముందరియట్ల భీముం డెత్తుకొని గమనవేగంబున వనంబునం గలుగంబు లెల్ల జవజవలాడ షష్టివర్షమతంగజంబువలె నడచుచు సాయాహ్నంబునకు నల్పమూలఫలోదకంబు నుగ్రక్రూరసత్త్వభయంకరంబు నగు నొక్కవనంబుఁ జేరి యందు సంధ్య మిక్కుటంబై దిక్కు లెఱుంగ రాక చిక్కనగు వృక్షంబులం గప్పు వడి యంధకారబంధురంబై యుండినపుడు తృష్ణాపీడితులును నిద్రాపరవశులు నై యున్నతనవారి నొక్కమఱ్ఱికడ నునిచి మీ రిట విశ్రమింపుఁడు నే నెందేఁ జని పానీయంబులు వెదకి తెచ్చెద నని సారససంచారారవంబులంబట్టి గవ్యూతిదూరంబునం గలజలాశయంబునకుం జని కృతావగాహుండై కడుపు నిండ నీళ్లు ద్రావి యచ్ఛిద్రోత్తరీయంబునం గొన్నినీళ్లు మూటగట్టుకొని మరలి వచ్చునంతలో నొడ లెఱుంగక పడి నిద్ర పోవుచున్న తల్లి నిజ సహోదరులం జూచి యత్యంతదుఃఖాక్రాంతచిత్తుండై తనమనంబున. 47

భీముఁడు నిద్రితులైనజననీసోదరులం గని చింతిల్లుట.

చ. కటకట యేమి చెప్పెదను • గాలవిపర్యయ మెట్టివారికిం
దిట చెడి కష్టము ల్వడక • తీరదు సర్వనరేంద్రవందితో

త్కటకురువంశభూషణు లు•దారయశస్కులు వీర లిట్లు సం
కటపడి నిద్రవో వలసెఁ •గా మిడిసేలను గంప్లు లొత్తఁగన్. 48

చ. అయముగ వారణావతము•నందుఁ దలిర్చుహంసతూలికా
శయనములందుఁ బండుకొని • చాల శ్రమంపడి నిద్రవోవు వీ
రయుగము మహీతలంబున మ•హాశిలలందు శయించి యుండ నీ
నయనయుగంబుఁ జూడఁగన • నాకయి వ్రాసె విధాత యేమనన్. 49

చ. అలఘుఁడు కుంతిభోజునకు • నాత్మజవై వసుదేవుచెల్లలై
సలలితకీర్తికాముఁ డగు•శంతనుభూపతిసూతికోడలై
కులపతి పాండుభూవిభున•కున్ సతివై తగి మమ్ము వంటిబి
డ్డలఁ గని పొల్చుతల్లి కక•టా! యిటు కాలనుఁ బంప నయ్యెనే. 50

చ.*ఇతఁడు సమస్తలోకముల • నేలఁగఁ జాలినవాఁడు ధర్మజుం
డితఁడు త్రిలోకనాథుఁ డగు•నింద్రునియంతటివానిపట్టి వీ
రతులితతేజు లశ్వినుల•యంశములం బ్రభవించి రిందఱి
ట్లతగులువోలెఁ గాడుపు•లందుఁ బడంగనుఁగొందు నక్కటా. 51

క. పాపాత్ముఁడు ధృతరాష్ట్రుఁడు,మా పోషక వెడల నడిచె • సుతు లనక మముం
గాపురుషుఁ డేర్చఁ బో నెట్లో పడి బ్రదికితిమి విదురు•నుతరకరుణన్. 52

వ. అని కోపాటోపంబున దుర్యోధను నుద్దేశించి. 53

శా. ఓరీ దుష్టనరాధమా! బ్రదికి తో•హో నిన్ను రక్షించె దై
వారంభంబు యుధిష్ఠిరాజ్ఞయును లే•దా నీవు నాబాహుయు
గ్మారూఢోగ్రగదాభిఘాతమున నేఁ•డా నాఁడె చూర్ణాయితా 54
కాప్రభవుఁడై నశింతు వికనేఁ • గైకోలుగా నుండుమా.

వ. అని క్రోధసందీప్తమానసుండై కరంబులు పిసికికొనుచు దుర్యోధనాదులం దూ
లుచు నిద్రితులైన భ్రాతృవరులం జూచి నిట్టూర్పు నిగిడించుచు దీనమనస్కుండై
వీరికి నిద్రాభంగంబు సేయ నేల తమంతఁ దార మేల్కని దప్పి తీర్చుకొందురు గాక
యని తాను గను మూయక జాగరూకుండై యుండె నంత నచ్చటికనతిదూరంబున.

హిడింబవధపర్వము.

సీ. కాలాంబుదశ్యామ•కాయుండు దారుణాకారుండు క్రూరుండు • ఘోరతరుఁడు
దంష్ట్రాకరాళవ•దనుఁడు పింగాక్షుండు, మాంసాశనుఁడు దుష్ట•మార్గవర్తి

* అతగులు = దుర్బలులు.

లంబజంఘుఁడు లసల్లంబోదరుఁడు దృఢదీర్ఘబాహుఁడు జగద్భీషణుండు
శంకుకర్ణుఁడు ఖరస్నిగ్ధశిరోరుహుండు, నుద్ధతస్కంధగళోచ్ఛ్రియుండు
తే. సాలభూజోన్నతుండు విశాలవక్షుఁ, డక్షయాహీనబలశౌర్యశిక్షితజన
సంఘుఁ డంతకప్రతిముండు సర్వలోక, రూక్షణుండు హిడింబుఁ డన్ రాక్షసుండు.
ఉ.*సాలమహీరుహంబునువిశాలమహోన్నతసౌధమందు నా
భీలతరాగ్నిఁ బోలుచుఁ ♦ వేఁపఁ బలాశను గూరుచుండి ఎ
ల్మాలలు సూచుచుం భరతముఖ్యుల నారసి మేను వెంచి కే
శాలి విదుర్చుచున్ భుజము లార్చుచుఁ బేర్చుచు నావులించుచున్. 57
క. మానుషగంధాఘ్రాణము, మానస ముగుళింపఁ జేయ ♦ మాంసపిశితం
బీనాఁటి కబ్బె నని య,త్యానందంబునను బొంది ♦ యనుజకు ననియెన్. 58
ఉ. వారిదె మానవుల్ వెఱ రవంతయు లేక మదీయ ఘోర కాం
తారముఁ జేర వచ్చి వటధాత్రిరుహంబుకడన్ శయించి రి
చ్చారితిఁ జంపి తె మ్మిటకు ♦ సారెఁ గవోష్ణపుఁబచ్చినెత్తు ర
వ్వారిగఁ ద్రావుచుం బొలసు వాచవి చేసెదఁ బొట్ట నిండఁగన్. 59
వ. అసిన నల్లె యని మానుషాదిని యతిత్వరితగతిం బాండవు లున్నచోటి కొక్కింత
యెడగా నరిగి శయనించినవారిం జూచి. 60


హిడింబ భీమునిఁ జూచి మోహించుట.

మ. త్రిదశాబ్దంబులవాని యౌవనలసద్దేదీప్యమానాంగసం
పదఁ బొల్పొందినవాని బాహుబలసామర్థ్యంబుఁ గైకొన్నవా
ని దృఢాత్యున్నతవిగ్రహంబు గలవానిం గోడగోవానినిన్
ద్రిదశస్తంబోనివృకోదరుం గని తమిన్ విభ్రాంతయై క్రాఁగుచున్. 61
తే. మరుఁడు నన్నేఁపఁ గడఁగె నీపురుషవరునిఁ
గనినయదిగోలె నన్న యే కరణిఁ గాని
వీనిఁ గలయక మాన నే వెఱవు పన్న
మైన నకి కింతకన్నఁ బ్రియంబు గలదె. 62
వ. అని చింతించి కామరూపిణి యగుహిడింబ వేషంబు మాఱి మనుష్యస్త్రీరూపంబు
ధరించి మందహాససుందరవదనారవిందయై మందగమనంబున మరున్నందను డాయ
వచ్చి స్మితపూర్వంబుగా ని ట్లనియె. 63

* పలాశ = మాంసాశి.

చ. *పురుషవరేణ్య! మీ రెటకుఁ బోవుచు వచ్చితి రెవ్వరయ్య దు
స్తర మగు నిమ్మహాటవి నిశాంతమునం బలె విశ్రమింతు రిం
దరమరలేక రేయి గన నయ్యెడ రాక్షసులుం బిశాచముల్
దిరిగెడి నా నెఱుంగరొకొ తెంపున నింతగ సాహసింతురే. 64

వ. అనిన భీమసేనుం డలక్ష్యము సేసి నీ వెందులదాన వెందు రా నేల తొలఁగి పొమ్మనిన హిడింబ వెండియును. 65

ఆ. ఇది హిడింబుఁ డనఁగ నెసఁగు రక్కసి యింటి, నేను వానిచెలియ నైనదాన
నతఁడు మిమ్ముఁ జంప నంపిన వచ్చి ని, న్నరసి మరులుకొంటి నడుగుచుంటి.

మ. ‡రతిరాజాపహృతస్వభావనగుచున్ బ్రార్థించితి న్నిన్నిటన్
సతిగాఁ జేకొని నన్ను సాఁకు మటులైన న్నీకు రక్షోభయం
బతుకం బోదు మదగ్రజుం డసురుఁడు దేవాధిపు నైనన్ బలా
న్వితుఁ డబ్బారిని మన్కి పుట్టుటయె వెండిన్ దండికొండంతనున్. 67

వ. నేను కామచారిణిని నిన్నొక్క నిమేషంబున నెందుకడకుం దోడ్కొని పోవం గల నన్ను వరింపు మనిన భీముండును. 68

తరళము. ఒడ లెఱుంగక నిద్రవోవుచు నున్నతల్లిని దోడులన్
విడిచి రాక్షసభోజనంబుగ వెట్టఁగా మహాత్ముఁడై
పడఁతి పొందగులంబునం బడి పాసి యేగునె యెట్టివా
పుఁడును నైనను బెక్కు లేటికిఁ బొమ్ము చక్కటి రక్కసీ. 69

క. అనుడు హిడింబయు భీమన, మునయం దటులేని ప్రీతి బోధింపుము దు
ష్టునిబారినుండి యందఱ, ఘనజనముఁ దొలఁగఁ జేయఁగల నన నతఁడున్. 70

మ. ఎవఁడో రక్కసుఁ డేగుదెంచు నని లో నింతేనియున్ జంకుచున్
భవదుక్తిం గడియించి నోపవలా! వాఁ డొక్కఁడే కాదు పో
భువనంబుల్ పదునాల్గు నొక్కఁ డగుచుం బోరాడఁగా వచ్చినన్
జవసత్త్వంబులు చూపి పుచ్చెదను బెల్పొం బంపు మజ్జాల్మునిన్. 71

వ. అని భీముండు విజృంభించి పలుకుచున్న సమయంబున. 72

భీమసేనహిడింబాసురులయుద్ధము.

సీ. కొఱవిఁ ద్రిప్పు గతి గుండ్రనై మిడిగ్రుడ్లు, చండ్రనిప్పుల నుప్పవేండ్ర ముమియ
నెలవంక లిరువంక సెలవుల లంకెల, ట్లాయి కోఱ లడుగ స్ఫులింగార్చు లీనఁ

* నిశాంతము = ఇల్లు. ‡ అబ్బారిని మన్కి యిఁట: అనఁగా వానిబారిఁ బడి బ్రతుకుట కొండంతవానికైన వెండియుం బుట్టుటయె యని తాత్పర్యము.

ప్రజ్వలజ్జ్వలనవేల్లజ్జ్వాలికను బోలి, ప్రేలునాలిక మృత్యుభీతిఁ జూపఁ
గడఁదికాటుకకొండ నడకించుచుండుమేన్, గొరికిచీఁకటిపిండుఁ గనుచు నుండ

తే. గుసుగుజుంజులువెంట్రుకల్ గడుసువాఱ
మొరసుదేరిన భ్రూకుటుల్ ముసులు వడఁగఁ
గ్రోధతామ్రాక్షుఁడై వచ్చి గుఱగుఱ మని
పటపటం బండ్లు గొఱుకుచుఁ బలలభోజి. 73

వ. మానుషి యైనహిడింబం జూచి మండిపడి యి ట్లనియె. 74

శా. ఏమే కామిని నాదుపంపు విడి నీ వీచక్కి బీ తేద నీ
భూమిం జాగు పౌనర్భవుం బితని నినుం బోకార్తుము న్నంచు భీ
మామర్షంబునఁ జేవుఱింపఁగ మొగం బాభామపై దాఁకెఁగా
స్వామీ చచ్చితిఁ బ్రోవుమం చది నెఱన్ వాతాత్మజుం జేరుడున్. 75

ఉ. భీముఁడు భీమవిక్రముఁడు భీతిఁ దొలంగుము భామినీ నినుం
బ్రేమ భరింతు నంచు నెదిరించి నరాశను నిల్వు నిల్వు మీ
కామిని గిట్ట రాదు ననుఁ గాఁ గలవాఁడవ యేని దాఁకి న
న్నీమన మెల్లఁ జూపు నినుఁ ద్రెళ్ళఁగ నేసి జగంబుఁ గాచెదన్. 76

మ. అని జృంభించినఁ గాలరుద్రనిభుఁడై రాక్షసుం డాక్షణం
బునఁ బెల్లేచి జగం బెఱుంగ నగునా మూర్ఖాలం బ్రలాపంబులా
మనుజక్షుద్ర పరాక్రమం బయినఁ రా మాయించి నిన్నగ్గినిం
దనియం దార్చెదఁ బచ్చినెత్తురులు చేతఃప్రీతి గా నిత్తఱిన్. 77

క. అని మల్లచఱచి భీమునిఁ, గొని నుఱుము బాహువెత్తుకొని రాక్షసుఁడున్
దనవారినిద్ర చెడు నని, యనుజులఁ దవ్వారము వట్టి దవ్వం గొన్పెన్. 78

ఉ. అష్టధనుఃప్రమాణ మెడ యై పడ వానిని బట్టి పెల్చ మి
తృప్తమృగేంద్రుఁ డల్పతర కృష్ణమృగంబును బోలె నీడ్చినన్
దుష్టనిశాచరుం డలిగి దోస్సల మేర్పడ భీముఁ గౌఁగిటం
బిష్టము సేయవో యనఁగ బిట్టగలం బిగియించె నొంచుచున్. 79

క. భీముఁడు విదిర్చి పైఁ బడి, భీముఁడొ యనఁగ వానిఁ బిడికిటఁ బొడిచెన్
దీమసము చెడక రక్షస్స్వామియును గంపుమిగిలి సమ మొనర్చెన్. 80

శా. హాహాకారము పుట్ట నయ్యిరువు రుగ్రాకారులై వీరులై
బాహాబాహిఁ గచాకచిం బెనఁగుచుం బాదాహతిం భూరుహ

* వ్యూహంబు ల్ధరఁ జెల్లు సాల్వడి పడన్ ♦ భూరిభయోగ్రంబు నా
సాహంకారత మల్లయుద్ధమును జే♦యం జొచ్చి రత్యుద్ధతిన్. 81

క. ఎడ యగుచు న్నడగొండలు, వడిఁ దాఁకినయట్లు పిడుగు ♦ పడినట్లు నెపం
బడరంగ వార లొండొరుఁ, గడు నార్చుచుఁ దాఁకి రెల్ల♦కడ లద్రువంగన్. 82

వ. అమ్మహారావంబు విని కుంతియు సంతానంబును మేలుకొని హిడింబం జూచి నివ్వెఱపడి నీ వెవ్వరిదాన వని యడిగిన నది యి ట్లనియె. 83

తే. ఇది హిడింబాసురునివన ♦ మేను వాని
చెలియలను మిమ్ముఁ జంపి తే ♦ నలుకఁ బంప
వచ్చి తడసితి మీవాని ♦ వలచి యంత
నసుర తా వచ్చెఁ బో రగు ♦ నదిగొ కనుఁడు. 84

వ. అనిన విని యుధిష్ఠిరాదు లుదరిపడి లేచి పరస్పరజయాభికాంక్షులై కట్టుకొని కర్షించుచు ఘోరయుద్ధంబు సేయుచున్నవారిం జూచి రప్పు డలసినవాఁడుం బలెఁ గనుపట్టుగాలిపట్టి కుచ్చైస్స్వరంబున నర్జునుం డి ట్లనియె. 85

క. అన్నా యలసితి వే నిదె, నిన్నుం గలయంగ వత్తు ♦ నిమిషములో నా
మిన్నక కనుచుండుము నీ, విన్నిచుఁడు చిక్కె నా కిఁ ♦ కెక్కడ బ్రదుకున్. 86

వ. అని భీముం డుత్తరం బిడిన నర్జునుండు. 87

మ. త్రొలిరాత్రిం దలపడ్డవాఁడ మనికిన్ ♦ దోస్సార మేపార గే
గల దొక్కించుకయంత యింతకును లో♦కంబుల్ ప్రశంసింప నీ
ఖలునిం దున్మఁగ లేదు పోరు తుదియై ♦ కన్పట్టె దిం దుండి య
వ్వలఁ బో నా నిట నిల్వఁ గాదు మనకున్ ♦ వాలాయ మాలింపుమా. 88

ఉ. ‡మోసగుదెంచు రౌద్ర మను♦మూరుత మెఱ్ఱలువాఱె నింగి పీం
డ్రిసమయంబునం దతిశ♦యింతురు చేయక కాలయాపనం
బీసురవైరి బీరమున ♦ నేసి వధింపుము వేగిరింపు మో
భాసురమూర్తి నా నతఁడు ♦ పావకుఁడో యనునట్లు మండుచున్. 89

చ. దురమున నేర్పు పెంపునను ♦ దోర్బల మేర్పడ వీతసత్త్వుఁ గా
సురరిపునిం బొనర్చి నగు♦చుం బిశితాశి మెసంగి మాంసముల్

---

* సాల్వడి=నిస్సారమై. ‡ మోసు = మొలక; అగుదెంచు — అగు; (అనఁగా మొలక యెత్తు) రౌద్రి మనుమూరుతము = రుద్రిదేవతాకమయిన ముహూర్తము. ఇది తెల్లవాఱునపుడు వచ్చును «రౌద్రి ముహూర్తేరక్షాంసి" యని చెప్పుటచే రాక్షసుల కది బలవత్తరమైనకాలము.

సారెదిగఁ జియ్యపట్టి త్రను•చుం గడకాళ్లొని నూఱుమార్లొగిన్
గిరగిరఁ ద్రిప్పి కొట్టె నిల•నెత్తురు ముక్కుల నోట నొల్కఁగన్. 90

క. ఇలఁ బడిన నసుర వడిఁ గొని, తల చేతులు కాళ్లు నుదర•తల మంటుకొనం
జలుపుచు ముద్దగఁ గోలె, మ్మలుకఁ బెటిల్లనఁగ విఱిచె•నటఁ దునిసి పడన్. 91

భీముఁడు హిడింబఁ బెండ్లియాడుట.

వ. అట్లు చచ్చినహిడింబుం జూచి యుధిష్ఠిరుండు సంతోషంబునం బ్రశంసించుచు భీమసేనుం గౌఁగిలించుకొనియెఁ దమ్ములు నతని నతిభక్తిం బూజించి రప్పుడు వారందఱుం గదలి చనుచుండఁ దన్ననుసరించినహిడింబం జూచి వృకోదరుండు నీవు మాయావిని వైరరక్కసవు మాతోడ రావలవ దుడుగు మట్లు గాకున్న నీవును మీయన్నదారిం బోవుదు వనినం గటకటం బడి ధర్మరాజు తమ్మున కిట్లనియె. 92

క.*అలఁగియు నెప్పు డబలపై, నలుగం దగ దలుగఁ దగును•నహితుపయి నొడల్
దిలకించుకంటె ధర్మువుఁ, దిలకించుట పాడి యిట్లు•తెగఁ బడ నగునే. 93

వ. అనుచున్నతఱి హిడింబ కుంతికి నమస్కరించి యిట్లనియె. 94

సీ.†అలుకఁబోండ్లకుఁ దుంట•విలుకాని వెత మెంతుఁ, బారలు నాకదిమీకొ•మరుసికతనఁ
బతి గానినాఁకు నే•నితనికై పడి చత్తు, నెలమి నాప్రాణముల్•నిలుపవమ్మ
కన నేను బోనరింపఁ•గానికార్యము లేదు, కరుణ నాసేవను•గయికొనఁ దగు
నా కనాగత మెల్లఁ•జేకొనం దెలియును, గల దిండ శాలిహో•త్రునిలనివాస

తే. మందు మీరున్నచో వ్యాసు•లరుగుదెంచి
సలుపు మీకు హితోపదే•శంబు మీరు
నవల సౌఖ్యంబు నందెద•రనుచుఁ బలుక
నందఱును జాల సంతస•మంది రపుడు. 95

వ. కుంతి దాని కంఠరంగంబున సంతసిల్లుచు భీమున కిట్లనియె. 96

తే.‡అన్న! మీయన్నయును నేను•నన్నమాట
పాటి సేయుము గరిత నీ•పడఁతిమిన్న

---

* అలఁగు = శ్రమపడు. అలుగు – కోపము చేయు, ద్రోహము తలఁచు. తెగఁబడు – తెగించు. (పురుషుఁడు శ్రమపడినను స్త్రీపైఁ గోపింపరాదు, శత్రువుపైఁ గోపింప నగు; తనశరీరముఁ జూచుకొనుటకంటె ధర్మువు చూచుట న్యాయము, ఇట్లు సాహసించుట తగ దని ధర్మజునివాక్యము.)

† పారలు = పార్లు, ఇట హిడింబ శాలిహోత్రునిలనివాస మున్న దనియు వ్యాసు లచటికి వచ్చి మీకు హితోపదేశంబు చేయు ననియుఁ జెప్పినట్లును, శాలిహోత్రాశ్రమ మున్నట్లును గొన్ని ప్రతులలో లేదు. తత్సమీపమున నొకనగర మున్నట్లును వ్యాసుఁ డట నున్నపాండవులకడకు వచ్చినట్లున్నది.

‡ ధర్మరాజే భీము నొడంబఱిచి హిడింబను బెండ్లి చేసినట్లు కొన్నిప్రతులలో నున్నది.

నొందు దలఁపక పాండవా♦భ్యుదయ మొంచి
యగ్రనందనుఁ గనుము ప♦రిగ్రహించి. 97

వ. అనిన నొడంబడి వడముడి మీవచనంబునం జేసి దీనిం బుత్త్రదర్శనం బగుపర్యంతం బరిగ్రహించి పవల్లు దీనితో విహరించుచు రేలు మీకడన యుండెద ననియె నంత నెల్లరు శాలిహోత్రునాశ్రమంబునకుం జని రాత్రిశేషంబు పుచ్చి మఱునాఁ డరుణోదయంబున నచటిసరోవరంబునం గృతస్నానులై మునిచేతం బూజితు లగుచు నట వనస్పతితలంబున విశ్రమించి సుఖంబుండి రాసమయంబున. 98

వ్యాసుండు ప్రత్యక్షంబై పాండవులకు హితోపదేశంబు చేయుట.

క. *కాలాంబుదమో యన నెఱిఁ, గ్రాలుచు సంతాపిపుత్ర♦గాత్రకు లగు న
య్యైలులకు నావ్యాసుఁడు, పోలఁ బ్రత్యక్షమయ్యెఁ ♦ బూన్కి ప్రేమన్. 99

క. వచ్చినమునిఁ గని పాండవు, లిచ్చో విచ్చేయుఁ డనుచు ♦ నెఱఁగుచుఁ బీఠం
బిచ్చి సపర్యలచేఁ బూర్తి, పొచ్చెము లేకుండఁ గొలిచి ♦ పొలిచిరి భక్తిన్. 100

వ. అప్పుడు వ్యాసభట్టారకుండు పాండవేయులం జూచి యిట్లనియె. 101

చ. ఖలు లగుధార్తరాష్ట్రు లలు♦కం బొనరించినపాపకృత్య మేఁ
దెలిసి హితోపదేశమునఁ ♦ దెల్పఁగ వచ్చితి మిమ్ముఁ గష్టముల్
గలుగుఁ బురాకృతంబున నెం♦కా నొకవేళ న వెల్ల సౌఖ్యదం
బుల యగు దేనికి న్వగవఁ ♦ బోలదు మీ కిఁక లగ్గ యయ్యెడిన్. 102

ఆ. §ఇచట శాలిహోత్రు♦నిష్ఠ పంబున, నయ్యెఁ గొలను దీని♦యందలిజల
మాని రేని జనుల ♦ కాఁకలిదప్పులు, కలుగ విది నిలంగ ♦ నలరు పోటు. 103

వ. ఇట మీ రొక్కమాసం బారు లెఱుంగకుండఁ గార్యస్థులై యుండి పిమ్మట నేకచక్రపురంబున భూసురవేషంబులం గొంతకాలంబు నివసించి మదాగమనంబు ప్రతీక్షించునది యని చెప్పి మ్రొక్కి వేఁడుకొనుకోడలిం జూచి. 104

క. కొఱ లేదు నీదుకొడుకులు, కొఱమాలినవారు గారు ♦ కోవిదవర్యుల్
నెఱి మీఱి రిపుల దురమునఁ, బొఱివుచ్చి స్వరాజ్యమునకుఁ ♦ బొలిచెద రతివా.

క. నీకొడుకు ధర్మసుతుఁడు, డీకొని మముఖ్యుండు తమ్ము♦లేపురి బలిమిన్
జేకొని రాజ్యధురంబు న, నేకక్రతువులు బొనర్చి ♦ యొసకం బెసఁగున్. 106

ఆ. ఇనుమ గుడుచుచుంటి ♦ మిపుడు మే మని కుందఁ
బోకు మీకుమారు ♦ లాఁక దొఱఁగి

* ఐలులు, పౌరవులు, భారతులు, తాపత్యులు, కౌరవులు, పాండవు లని, వీరువ్యవహరింపఁబడుదురు.

§ ఈవ్యాసవాక్యము కొన్నిప్రతులందు లేదు, అట నగరమున నొక బ్రాహ్మణునింట నిలిపిన ట్లున్నది.

వైభవమునను బిత్రు+పైతామహం బగు
రాజ్య మనుభవింతు + రమణి మెఱయ. 107

వ.* అని హిడింబం జూపి యిది కమలపాలికి యనం దగి భీమసేనునకు మహాసత్త్వసం
పన్నుం డగు నెక్కొడుకుం గాంచు నత్తఱిని మీ కాపత్సమయంబుల నుపక
రించు నని యంతర్హితుం డగుటయు వా రటఁ గలమానులతో ధర్మశాస్త్రంబు
లెల్లం జదువుచు సుఖంబుండి రంత. 108

—— హిడింబయందు ఘటోత్కచుండు పుట్టుట. ——

చ. అనిలజుఁ డాహిడింబను య+థావిధిఁ గ్రహించి దానితో
వనములఁ బర్వతంబుల న+పారసరోవరతీరభూములన్
ఘనతరనిమ్నగాపులిన+ఖండముల న్విహరించె నప్పుడ
వ్వనిత కుమారునిం గనియె + వజ్రనిభాంగుని శత్రుభంగునిన్. 109

వ. సద్యోగర్భంబునం బుట్టి కామరూపధరుండును బరాక్రమసంపన్నుండు నైనవాఁడు
కచము లేనిఘటమువంటిశిరము గలవాఁడు గావున ఘటోత్కచుండు నాఁబడి
తండ్రులకు దండప్రణామంబు చేసి తలంచినప్పుడ వత్తు నని వారియనుమతంబు
నడసి తల్లిం దోడ్కొని యుత్తరాభిముఖుం డయి చనియె నంతఁ బాండవులును
నటం గొంతకాలం బుండి పయనంబై కొన్నిదేశంబు లతిక్రమించి నదీనదవనం
బులు దాఁటి చని యేకచక్రాగ్రహారంబు లోచనగోచరం బగుటయు నట. 110

—— బకవధపర్వము. ——

చ. జడలును నల్కలాదులు నె+సంగ ధరించి శ్రుతుల్ పఠించుచున్
వడుగులవృత్తిఁ జేకొనిన+వా రయి పోయి పురంబు సొచ్చి య
ల్లెడఁ గలయందఁ గ్రుమ్మరి యొ+కానొకవిప్రుని యింట నిల్చి పె
ల్లడరెడునాఁకటం బ్రతిగృ+హంబును భిక్షము దెచ్చి యిచ్చుచున్. 111

క. కుంతియు నాభిక్షాన్నము, వంతులుగాఁ జేసి సాము + వడముడి కిడి పై
వంతుం దానుం దక్కఁగ, నంతతియుం దినుచు నాళ్లు + సాగించి రటన్. 112

తే. అఖిలభూమండలాఖండ+లాత్మజాతు, లైనపాండవు లేవురు + నంబతోడ
నచట భిక్షాశనము చేసి + రక్కట కట, పలుక నేటికి విధి యెంత+ప్రబలమొక్కొ.

క. తమగుణములచే నన్నగ,రముఁ గల ప్రజల కెల్ల + రాగం బొదవన్
గ్రమమునఁ బ్రియదర్శనులై, విమలగతిం దవిలి పాండు+వేయులు వేడ్కన్. 114

వ. ఇట్లు వా రందుఁ గొంతకాలం బున్నంత నొక్కనాఁడు. 115

* ఇదియును గొన్నిప్రతులలో లేదు.

చ.*కొడుకులు బిచ్చమెత్తఁ జన ♦ గొంతి వృకోదరుతోడఁ గూడి య
విడిసినవిప్రగేహమున ♦ వెన్నడి యుండినయంతలోనఁ బె
న్నవ్వడి నొకపెట్ట గొల్లుమని ♦ పట్టఁగ నార్తరవంబు పుట్టినం
గడు నెద దద్దఱిల్లి పృథ ♦ గాదిలిపట్టిని జూచి యిట్లనున్. 116

మ. మనలం జుట్టలఁ బోలె నిన్నిదినముల్ ♦ మన్నించి ప్రేమించుచుం
దనయింటం బికిరంబు రానిమొడలం ♦ దాఁ బెట్టి పోషించె నీ
మునితుల్యుండు మహీసురుం డితని కే ♦ మో కీడు వాటిల్లెనో
యన నార్తధ్వని యయ్యెసుం దనయ నీ ♦ వాలించితే దానినిన్. 117

క. చేసినమే ల్మఱువనమియుం, జేసినదానికిని బదులు ♦ సేతయు హెచ్చుం
జేసి నొలఁగుటయుఁ దనుజ,న్మా సామాన్యంబు మధ్య ♦ మం బుత్తమమున్. 118

క. ఉపకారికి నుపకారము, సుపరిష్కృతిముగఁ బొనర్పఁ ♦ జూచుట యుచితం
బిపు డీవిప్రునకుం బ్రత్యుపకృతిగా నెగులు దీర్ప ♦ నూనవె తండ్రీ. 119

ఆ. అనిన భీముఁ డనియె ♦ నమ్మ యయ్యాపద, యేమొ తెలిసి తెలుపు ♦ మేను దాని
నెట్టి దైనఁ గాని ♦ పట్టి నాభుజశక్తిఁ, దీర్చి పుత్తు నీకుఁ ♦ దేజుఁ దెత్తు. 120

వ. అనినం గుంతి యట్లగుం గాత మని వానితో నటఁ జని నితాంతశోకసంతమసం
బునం బడి కూఁతుం గొడుకుం గట్టికొని బెట్టు సంతాపించువిప్రదంపతులం గని
పిలిచియుం బ్రతివచనంబు గాన కున్నంత విప్రుండు. 121

ఏకచక్రపురంబున బ్రాహ్మణునిదుఃఖప్రకారము.

శా. ఈసంసార మసార మార్తికర మా ♦ హీనోగ్రఘోరక్రియా
వాసం బిందలిజీవితంబు చపలా ♦ ప్రాయం బనర్థప్రదం
బీసంయోగవియోగదుఃఖము లిసీ ♦ యేప్రొద్దు సంసారినిం
గాసిల్లం బొనరించి నారకమహా ♦ కష్టంబులం గట్టెడున్. 122

క. జీవితమున దుఃఖం బగు, జీవితమున నగును జ్వరము ♦ జీవితమున నా
నావిధబాధలు గలిగెడు, జీవితమే చేటు వెతలు ♦ చేకుఱుకతనన్. 123

చ. ధనము సుఖప్రదం బనిన ♦ దాని గణించుట కొండుదుఃఖమున్
మనుచుట కొండుదుఃఖమును ♦ నాశనమందు మఱొండుదుఃఖమున్
జననమె సర్వదుఃఖముల ♦ సంగతికిం గుదు రందు సంసృతిన్
గన నగువానిదుఃఖము లిఁ ♦ కం దలపోసికొనంగ శక్యమే. 124

---

* పట్టఁగ=ప్రారంభింపఁగ; అనఁగా మొదట గొల్లుమని ప్రారంభమయి యార్తధ్వని పుట్టె నని యభిప్రాయము.

తే. జనుల కగుదుఃఖములకును • శాంతి గలుగు,నింతవై భాగ్య ముండిన • యంతమాత్ర
నాలుబిడ్డలతో నున్న • యట్టినాకు, సది లభించుట యెక్కడి • దక్కట కట. 125

మ. *అకటా! మృత్యుముఖోపమాన మగుని • ర్యాగంపుగ్రామంబునం
దిఁక నుండం దగ దాఁటి పోద మని ము • న్నే నెంతబోధించినన్
వికలస్వాంతత నెన్నఁడు న్వినవు దే • వీ! జన్మభూమీచ్ఛ మా
మఘకర్మం బయి వచ్చె నాపద దొలం • పం గాక యీనాఁటికిన్. 126

క. †కొడుకును గూఁతును నేనుం, బడతియు నిబ్బారినుండి • బ్రతికెడువెఱవుం
బొడవంగఁ జేయ నెవఁ డగుఁ, గడుఁ గర్మవిపాక మిట్లు • కడ ముట్టింపన్. 127

చ. అనలుఁడు సాక్షిగాఁ బరిణ • యం బగుదాని మదర్థకాయమై
తనరినదాని సాధ్వి యగు • దాని బ్రజావతి యైనదాని భూ
జననుతయాయజూకకుల • సంభవయై తగుదాని దీనినిన్
దనుజునివాతఁ ద్రోయుటకుఁ • దా నయి నే నెటు సాహసించెదన్. 128

క. వడుగున కీయం బున్నియ, మిడుకన్నియఁ బితరు లెల్ల • నెడఁద ముదంబుం
బడ దౌహిత్రు నొసంగెడు,బుడుతిన్ రాక్షసుఁడు మెసఁగఁ • బో విడఁ గలనే. 129

క. పున్నామనరకమందలి,బన్నంబులఁ జివ్వక కుండఁ • బడసినపుత్త్రున్
నన్నుద్ధరించువీనిని, గ్రన్నన గా నసురతిండిఁ • గా నిడ నగునే. 130

ఆ. కొడుకుఁ గూఁతు నాతి • విడువంగ నోప నే, బడుగ నసురివాతఁ • బడుదు నాకుఁ
బ్రదుకునందు నాస • వదలెను దీని వీ,రలను గాచుఫలము • గలుగఁ గలదు. 131

వ. అని కృతనిశ్చయుండై యున్నబ్రాహ్మణునకు బ్రాహ్మణి యి ట్లనియె. 132

చ. ‡ఎఱిఁగి యెఱింగి యిట్లు వగ • పేటికిఁ జేయఁగ భూసురేంద్ర నీ
యెఱుఁగనిధర్మ మేది కల • దెప్పటికే మృతి తప్ప నోటు నేఁ
జిఱుతుకఁ గాను సంతతిని • జెంది భజించితి నెల్లసౌఖ్యముల్
తఱిపడఁ జచ్చియుం బతిహి • తం బొనరించుట లెస్స గావునన్. 133

క. పతి కన్న మున్న చచ్చిన, సతి కిహముం బరము గలదు • జగతిం గానన్
మతిచేసి నే నరాశను,గుతికం జొఱఁ బోవుదానఁ • గుల మలరంగన్. 134

తే. ఆపదర్థము ధనరక్ష • యగును ధనము, వలన దారల రక్షింప • వలయు ధనము
వలన దారలవలనను • సలుప వలయు, నాత్మరక్షను ధర్మజ్ఞుఁ • డగుజనుండు. 135

* అఘము = పాపము. † పొడసూపన్ = ఉదయించుఁగా. ‡ తఱిపడు = ఒత్తుడుపడు.

చ.*పురుషున కొందఱే సతులఁ • బొందఁగ వచ్చును ధర్మసంగతిన్
గరిత కొకండ పూరుషుఁడు • గాదని యొడ్లను గట్టుకొన్నచో
దురిత మనంతమై నరక•దుఃఖము లందెద నేను బోయినన్
మరల నొకర్తుకం దడవి • మంగళసూత్రము గట్ట నొప్పగున్. 136

ఉ.†కావున నన్నుఁ బుచ్చుటది • కార్యము వెండియు ధర్మపత్నిని
న్నీవు గ్రహించి ధర్మముల • నిల్పుము కావుత మీవు నోయిసం
దేవురు వుట్ట బిడ్డలును • నేనుఁ దరాకిజలక్షయంబునం
జేవఁ దొఱంగి దైలుపడు•చేఁపలఁ బోలుదు మెన్నిభంగులన్. 137

క. పసుపుం గుంకుమ కాటుక, కుసుమంబులు గలిగి కాంత • కొమరులచెంతన్
వసుమతి విడిచిన దానికి, నెసగెడు నుత్తమములైన • యుభయలోకంబుల్. 138

వ. అని మహాదాస్యవనాయంబుగ నున్నతల్లిం జూచి దుఃఖించుతండ్రిం జూచి కూఁతు రి
ట్లనియె. 139

తే. ఒరులకుఁబడ వలసినే • నుండఁగాన, పసురభోజ ముగ నిచ్చి • యశ్వయంబు
నిలుపుఁడీ రున్న దౌహిత్రు•లురఁ గలరు, గోడ కలిగినఁ జిత్రముల్ • కోటి గలవు.

వ. అట్టియెడ నొకొను కొని, త్రణాంబు చేతఁ బట్టుకొని వారి నూరార్చుచు. 141

క. అక్కా! తల్లీ! తండ్రీ!, పోక్కంగా వలదు నేను • బోయి దనుజునిం
జక్కాడి వత్తు బ్రేల్మిడి, నిక్కత్తిం గీని కింత • యేటికిఁ జెపుఁడా. 142

కుంతి బ్రాహ్మణు నూఱడించి బకునొద్దకు భీము నంపుట.

వ. అని వానియవ్యక్తవచనంబుల నేడ్పులో నింతి సంతసించుచు నెల్లరుం గట్టుకొని
యున్నసమయంబునఁ గుంతీదేవి చెంతఁ జేరి. 143

క.‡చచ్చిన వారికిఁ బ్రాణము, వచ్చెనన ట్లమృత మొలుకు•వచనంబుల నీ
చిచ్చునకు మూల మెయ్యది, గ్రచ్చఱ వచియింపుఁ డేనుఁ • గలఁ దీర్పంగన్. 144

వ. అనిన నామె కాగృహపతి యిట్లనియె. 145

సీ. అమ్మ! యే మందు మా•యూవడి మానుమం,బునఁ దీర్ప రాని దీ•ప్రోలిచెంతఁ
గొండగట్టునఁ • గలఁడు బకుం డను,రక్కసుం డొక్కరుఁ • డుక్కు మిగిలి
నగరవాసుల నెల్ల • నమలు చుండఁగ వాని, తోకసమయము చేసి • సూరివార
లిరువదిబారువ్రు • తెసఁగ శాల్యన్నంబు, దండెనుపోతుల • నొంటనరుని

తే. దినదినం బిలువరుస నీఁ • దిని యతండు, తనిసి బాధింపఁ డిటఁ బెద్ద•తడవు నుండి
నెగులు దీర్పంగ నిట రాజు •నేఁడయ్యె, జనులు జన్మభూమిని విడఁ • జాల రైరి. 146

* తడవి=వెదకి. † దేవురు=దైన్యము. ‡ చిచ్చు=తాపము.

క.*ఇలువరుస మాకు వచ్చెం, బ్రఖ్యాయమువలె నేఁటి కొంటి • బాలుని వీరిఁ
ఖలువాతఁ ద్రోయఁ జాలను, వెలలెద నటె దేహయాత్ర • విడ్చి నే తల్లీ!. 147

వ. అని తలపోయునాతనికిఁ గుంతియు. 148

క. ఈ యాపదఁ దొలఁగింపుము, పాయుం జేఁ గంటి దీనిఁ • బతిఁ బొనుపుఁ బంఁ
జేయకుఁడు మీమనంబులఁ, గాయుఁడు సుఖంబు నిజము • సంతసమునుండిరిఁ. 149

చ. ఒకఁడొకఁడు కొడుకులాఁతురుగ • నుంటిరి నీవు కుటుంబినై భవ
త్సుకరుణ నింతకాలము సుఖంబుగ • నుంటిమి మేము మానసుల్
వికలత లేక తీర్పు నగు • వింటిరె యెవ్వరు నాకుఁ బుత్రులుం
దొకరుఁడు నీకుఁ గాఁ బనిచి • యొద్దను జేకొని పోవు నిబ్బలిన్. 150

వ. అనిన విని నోడి బ్రాహ్మణుండు చెవులు మూసికొని. 151

చ. హరిహర యెట్టి పాపకము • గాడఁగ వింటిని బ్రాహ్మణుండ నై
మరణము వచ్చు నంచు మది • మాలి భయంబు బ్రాహ్మణోత్తముం
బరమపవిత్రుఁ బ్రీతిఁ దనుజు • నాకును ద్రోయఁగ సమ్మతించి మ
ర్త్యవసురేంతంబు దా నిహప • రంబులకుం జెడిపోవ నేర్తునే. 152

తే. ఆత్మనైనను నాత్మజు • నైన బ్రాహ్మ, ణార్థము త్యజింపఁగ నగు నంచు • నార్యులందు
రాత్మహత్యాతిపాతక • మైనఁ గాని, బ్రహ్మహత్యకంటెను పెద్ద • వడదు తల్లి. 153

నందిని. ధరణీసురుని భీతి • దాఁగినవానిఁ, బరమాతిథిని వేఁడి • వచ్చినవానిఁ
శరణాపన్నవానిని • జంపు నిహంబుం, బరముఁ జెడు నటంచుఁ • బల్కిరి ధీరుల్. 154

వ. కావున బ్రాహ్మణహింస కేను సమ్మతింప నోప ననినఁ గుంతియును. 155

క. నామది మెట్టిన యగుటన్, భూమిసురవధము సహింపఁ • బోవక తెత్ర
త్సామతి నాసుతు విడువం, గా మతి చేసితిని జువ్వె • తాన్మనునివర్యా. 156

చ.‡ఇఁక నొకమాట మేటియు స • హింపఁ బలుండును మంత్రసిద్ధుఁడున్
సకలనరాశనాంతకుఁడు • నాసుతుఁ డాతనిఁ గిట్ట నోపునే
బకుఁడు గికుండు నే నెఱిఁగి • పంచెద నంటిని గాని కన్నత
ల్లికి శతపుత్త్రు లుండినను • లెక్కకు నొక్కఁడు వీడ నుండునే. 157

క. నాకొడుకుఁ దాఁకి యింతకు, బ్రేఁకపుఁ దేజమున జగతి • వెలసెనరక్షో
లోకము లెక్కకు మిక్కిలి, యై కూలుటఁ గంటి నిది ర • హస్యము తెలియన్. 158

వ. కావున నీ విందు సందియంపడ కుండు మని యొడంబఱిచి భీమసేనుం బిలిచి బ్రాహ్మ
ణకార్యం బెఱింగించి నీ వియ్యాపద దలఁగింపఁ బెట్టి నామనఃప్రియంబు సేయు మనుడు

* అటె:—సుఖమును దెలుపునవ్యయము. ‡ కిట్టు = సమీపించు.

నతం డట్ల యగుం గాక యని యెల్లరు సంతసిల్లి రంతఁ గొంతసేపటికి ధర్మరాజార్జున నకులసహదేవులు వచ్చి యుత్సాహవర్ధనుం డగుభీము నుపలక్షించుచుండ విస్మితుండయి యుధిష్ఠిరుండు తల్లి కేకాంతంబున నిట్లనియె. 159

ధర్మరాజు తల్లితో భీము నంప వల దనుట.

మ. జననీ! భీమునిసంతసంబు గన నా ♦ శ్చర్యం బగు న్నేఁడు వే
నినొ చక్కాడెదు నాఁగఁ దోఁచెడిని తాఁ ♦ నే పూనెనో లేక నీ
వనుమానింపక పూన్చితో తెలియ రా ♦ దన్నం బృథాదేవి యి
ట్లను నేఁ బంచితి బ్రాహ్మణార్థ మసురా ♦ హారంబుఁ గాంపోవఁగన్. 160

వ. అనిన దుఃఖితుండై యుధిష్ఠిరుండు వెండియు. 161

సుగంధి. ఎంతసాహసంబు చేసి ♦ తెంతదుష్కృతంబు నీ
వింతవాని భీమసేను ♦ నిట్లు వమ్ము సేయఁగా
నంతరంగ మొప్పెనో క ♦ దమ్మ యొడ్డబిడ్డకై
చింత లేక కన్నబిడ్డఁ ♦ జిల్పు నెంతు వక్కటా. 162

వ. ఇది లోకాచారవిరుద్ధంబు నని మఱియును. 163

సీ. ఇతనిబల్మిన కాదె ♦ జతుగృహంబునఁ గాక, నడిరేయి మనము వె ♦ ల్వడఁగఁ గంటి
మితనిబల్మిన కాదె ♦ చితి నెట్ట నున్నపు,రోచనుఁ జచ్చిన ♦ నేఁచఁ గంటి
మితనితాల్మిన కాదె ♦ ప్రతిఘటించుహిడింబు,పెనువాతఁ బడ కిట్లు ♦ మనము మంటి
మితనికల్మిన కాదె ♦ కితవుల ధార్తరా,ష్ట్రులఁ దోలి రాజ్యంబు ♦ నిలుప నుంటి
తే. మిట్టి మాభీమసేనుని ♦ మ్రొట్టు పెట్ట, నెంచుచుంటివి పొరుగింటి ♦ కించ వాప
తోఁకి భరముస సీబుద్ధి ♦ కాఁకఁ జెంది, మంద మయ్యెను గాక యే ♦ మందు నమ్మ. 164

చ. అనవుడుఁ గుంతి యిట్లనియె ♦ నాత్మజ నీ వనినట్లు వెఱ్ఱినై
పనిచినదానఁ గాను బకు ♦ వాతఁ బడన్ మనభీమసేనునిన్
గనుకిలి బుద్ధిపూర్వకము ♦ గా నుపకారము నెంచి పంచితిన్
మనల ననుగ్రహించి దయ ♦ మంచినవిప్రునిరక్షణార్థమై. 165

ఆ. ఒరులు తనకుఁ జేసి ♦ యున్నమే లెన్నవక, దానికన్న నధిక ♦ మిమము గాఁగఁ
దా నొరుల కెనంతు ♦ తగ నొనర్చునో వాఁడు, పొగడఁ బడును సకల ♦ భువనములను.

ఆ. ఒకఁడ లక్కయింటి ♦ నుండి యిందఱ మోచి, తెచ్చెఁ గాఁబుటడవిఁ ♦ బెచ్చు పెరిగి
తిరుగు నాహిడింబుఁ ♦ దొలిచె నాగాయు,తబలుఁ డితఁడు జంకఁ ♦ డగదు తండ్రి.

ఆ. వీనిశక్తి యెఱిఁగి ♦ మాసవాశనుఁ గూల్చి, విప్రవరుల నేఁగి ♦ వీడఁ గలుగు
ననుచు నిట్లు చేసి ♦ తిని క్షత్రియుండగు, వాఁడు పరులబాధ ♦ వాప వలదె. 168

క. బుధులకు నుపకృతి చేసిన, నృధ వోవదు తత్ప్రసాద•విధి మీఁ గెనఁగుం
బృథివీశ్వరేశ్వరత్వము, నధికైశ్వర్యంబు నాయు•రారోగ్యములున్. 169

క. పుట్టినయప్పుడ క్రిందన్, మిట్టిపడం జేతినుండి • మీ తమ్ముఁడు తా
గుట్టయు నుగ్గయ్యెను నా, పట్టి బెగడకుము గాలి•పట్టికి నింకన్. 170

వ. అనిన ధర్మరాజుండు తల్లిధర్మబుద్ధికి నుల్లంబున సంతసిల్లి తానుం దమ్ముని నియోగించె నంత భీమసేనుండును బలిభక్తసమయంబున నాయింటిబ్రాహ్మణులం బిలిచి యి ట్లనియె. 171

భీమసేనుండు బలిం గొనిపోయి బకుం జంపుట.

శా. భిక్షాన్నంబుల రాత్రి నాకసుపు నా•భీభాగము న్నిండ లే
దత్తీణాక్షుధఁ జేసి నిద్రయును లే • దత్యంతముం దన్నితిన్
గుక్షి న్నింపఁగ నన్న మోపుదురయేఁ • గూర్పుంతు నా కట్టులేన్
రక్షోనాథుని గిట్టఁ జేసి ప్రజలన్ • రక్షింతు నే నీక్షితిన్. 172

సీ. అనిన నాబ్రాహ్మణుం • డలరి పుట్లకొలంది, వండి కొల్లన్న మా•వడముడి కిడె
నిష్టమృష్టాన్న సం•తృప్తుఁడై మారుతి, బకునికై బలి గల•బండి నెక్కి
రక్కసుం డున్నెడ • కొక్కింతయెడ గల్గి, నిలిచి యెలుం గెత్తి • పిలిచి పేర
నంతలో నాయన్న•మంతయుఁ దినుచుండె, నరసి రాక్షసుఁడు తా•మ్రాక్షుఁ డగుచుఁ

తే. గనలి యాఁకటఁ గనకనఁ • గడుపు మండ
నౌడు గఱచి మే న్వెంచి కొం • డంత యగుచు
భీమరూపంబుతో నుగ్రుఁ • డై మెలంగి
భీముఁ గదిసి యిట్లని పల్కె • భీషణముగ. 173

ఉ. ఏఁడుర నీవు నన్ నరి కొ • కింతయు సేయక పొద్దు పుచ్చి తీ
నాఁ డిటు లేల యెల్లిదము • నాకడ రా కిట నెల్లు లిచ్చుచుం
గూడు మెసంగుచుంటి విది • కూడునె నాకయి కాదె దుర్మతీ
చూడుము నీకుఁ గాలుపురిఁ • జూపెద నే నని హుంకరించుచున్. 174

క. పెదమొగము వెట్టి కుడిచెదు, వడముడి వీఁపునను బొడిచె • వడిఁ బిడికిట నా
తఁడు వానివలను జూడక, కుడు పుడుగక నగవ కున్నఁ • గ్రుద్ధుం డగుచున్. 175

ఆ. రెండుచేతు లెత్తి • కొండ మోఁదినయట్లు, పిండి యగు నటంచుఁ • బృష్ఠమందు
మోఁదె దాఁ భీముఁ • డాదెసఁ జూడక, నగుచు కుడుచు చుండె • మిగులకుండ. 176

వ. అంత నారాక్షసుండు క్రుద్ధుండై యొక్కమహావృక్షంబు పెఱికి కొనివచ్చి తాఁకు దెంచె నంతలో నన్నకూటంబు దిని జలోపస్పర్శనంబు చేసి భీమసేనుండును గండుమిగిలి

తాను నొక్కమహావృక్షంబు దెచ్చి పెచ్చుపెఱిగినమచ్చరంబున మల్లచఱచి పేర్చి యార్చుచు. 177

ఉ. వీఁడు హిడింబముఖ్యులను ♦ వ్రేల్మిడిఁ ద్రుంచినవాఁడు భీముఁ డీ
జాడ నెఱుంగ కిట్లు పెలుచం బెదరించుచు నుంటి కొంటి య
ట్లాడఁగ నీఁడు మర్త్యపలలాదుల నొయ్యనఁ జయ్య బట్టి తీ
వ్రాడనిఁ బాడనుంచు మెట్లు ♦ లుందువొ చూతువు రాక్షసాధమా. 178

వ. అనుచు నొండొరులు గడువం దాఁకి యొక్కింతయొక్కలంబుగా నొక్కవడి వృక్షయుద్ధంబు చేసి మల్లయుద్ధసన్నద్ధులై. 179

ఉ. ఒండొరు బాహుయుగ్మములు ♦ నొయ్యనఁ బట్టుచు నీడ్చి త్రోయుచున్
గుండెలు వ్రీల గ్రుద్దుచును ♦ గొట్టుచుఁ బట్టుచు బిట్టగల్చుచున్
మెండుగఁ బోరుచుండ ననె ♦ మేదిని గ్రక్కదలె న్మహోజవుల్
పిండిగ నయ్యెఁ ద్రాళ్ళు తుమురు ♦ పెల్లగు దెంచెను దర్పదాహతిన్. 180

వ. అప్పుడు. 181

క. పొడ నెట్టి వానిఁ గ్రిందం, బడవైచి వృకోదరుండు ♦ పదములఁ దాఁచెన్
వడి ఆప్పు వాఁడు గనుకొని, పొడిచెన్ వక్షమున భీము ♦ ముష్టిఘాతములన్. 182

ఉ. పోటున హింససత్త్వనిగఁ ♦ బోలిచి భీముఁడు రెండుచేతులన్
బోటరి నైన గ్రసించి బసఁ ♦ బొంపిరి వోఁ గటికంఠదేశముల్
మీటి పడంగ నైచి కిడిమిం బొడిచె న్వెను వ్రీల జానుచేన్
బాటున వాఁడు నెత్తురు లవారిగఁ గక్కుచుఁ జచ్చె నార్చుచున్. 183

ఆ. కొండ విఱిగి నేలఁ ♦ గూలెఁ జందాన
బసుఁడు నేల గూలఁ ♦ బడినయపుడు
దెసలు బూరటిల్లఁ ♦ దేలిపోవమున
నులికి వచ్చి యటను ♦ పలలభుజులు. 184

క. గడగడ లాడుచు నప్పుడు, నడివడిఁ బరిజనముతోడఁ ♦ వచ్చి వడకుచుం
బడి తెలివి మాలి యుండెను, మిడిపోతులమూఁక లెల్ల ♦ మేదినిమీఁదన్. 185

వ. భీమపరాక్రముం డగుభీమసేనుండు వచ్చి భయంపడువారి కభయం బిచ్చి యిట్లనియె.

తే. ఎప్పుడును మీర లిప్పురి ♦ పింకమీఁద
మానవుల జోలికిం బోక ♦ మాను నలయు
నట్లు గాకున్న మీరలు ♦ నిట్ల యగుదు
రనుచుఁ దెలియంగ వారల ♦ కాన తిచ్చె. 186

తే. బకునిచుట్టంబు లగునర♦భక్షు లెల్ల
రట్ల యగుఁ గాక మఱి యేఁ బ్రోవు♦మనుచు సమయ
మును బొనర్చి గమించిరి ♦ మ్రొక్కుచు నల
నాఁటనుండి యయ్యె పట్టణ ♦ మూఁడె నవల. 188

వ. అంత భీమసేనుండును భీమబలంబున బకాసురుని కళేబరంబు దిగిచికొనుచు వచ్చి పుర ద్వారంబుకడం బడవైచి యెవ్వరు నెఱుంగకుండ విడిదికిం జని యది యంతయుం బ్రాహ్మణుండు వినం దనవారికెల్లం జెప్పి యుండె నంత నమ్మఱునాఁడు. 189

ఉ. చెప్పఁగఁ గొండవోలెఁ బుర♦సీమను నెత్తుట దొప్పఁ దోఁగి యుల్లస
ద్భావయనంబులుం గలుగు♦నాసురదేహంబు భీ
తావహమై కనంబడఁ ♦ బట్టణవాసులు గుంపుగుంపులై
పోవుచుఁ జూచి వచ్చుచును ♦ బొందిరి భీతియుఁ గౌతుకంబునున్. 190

వ. ఆబకాసురసంహారం బెవ్వరు చేసిరో యని వెఱఁగుపడుచు నాఁటివంతు గలబ్రాహ్మణు నెఱింగి వానియింటికిం జని యేమున్నవృత్తాంతం బత్యతిమానుషం బెవ్వరు చేసి రని యడిగిన నతండు పాండవులం గప్పుపుచ్చుచు వారి కిట్లనియె. 191

ఉ. ఏం దనుచుం దలారి తెగు♦న న్వినిపించి చనంగ మేము దు
ర్దాంతదురంతదుఃఖమునఁ ♦ దద్దయు నేడ్చుచు నుండునంత భీ
మంతుఁ డొకండు మంత్రసిద్ధుఁ డగు♦బ్రాహ్మణుఁ డొక్కఁడు వచ్చి విప్రదుః
ఖాంతము సేయ మే బలి న♦కాంతకుచెంతకుఁ గొంచుఁ బోయెనన్. 192

తే. నానిమిత్తభయంబును ♦ మాను మనుచు
మమ్ము నూరార్చి బకున కి♦న్నమ్ముఁ గొనుచుఁ
బోయె నామహామహుఁ డిట్టి♦పురుషకార
మొనరుపఁగఁ బోలు మనయూరి♦వనటఁ దీఱ. 193

వ. అని చెప్పిన వారందఱును బరమానందకందళితహృదయారవిందులై. 194

ఉ.*బ్రాహ్మణమాత్రుఁడే యతఁడు ♦ బ్రహ్మవిదుం డగుమంత్రసిద్ధుఁ డా
బ్రాహ్మణుకారణంబునను ♦ రాక్షసబాధ వొలంగె నంచుఁ దా
బ్రాహ్మణు లాదిగాఁ గలుగు♦వారలు మెచ్చుచు వానిపేరునన్
బ్రహ్మమహంబు చేసి రట ♦ బ్రాహ్మణవర్యనివాసనంబునన్. 195

---

* బ్రహ్మమహంబు=బ్రహ్మోత్సవము; పూర్వకాలమునందును బ్రజలు తమకు మేలు గలిగినప్పు డుత్సవములు చేసికొనునాచారము కల దని తెలియం దగు.

క. పాండుకుమారులు నప్పురి, మెండగుగౌరవముతోడ ♦ మిసిమిం గోని తా
రుండిరి బ్రాహ్మణునింటన్, నిండుమనంబులను నెమ్మి ♦ నివ్వటిలంగన్. 196

ఆశ్వాసాంతము.

ఉ. నీకరుణాకటాక్ష మది ♦ నిల్చినవారల కెంత లాపదల్
పోకడఁ బెట్టఁగా గలిగి ♦ పూర్ణయశంబును సర్వసౌఖ్యముల్
చేకొనఁ గల్గెదున్ జగతి ♦ లే రెవరు న్నినుఁ బోలువారు లో
కైకగురూ భజించెదను ♦ గైకొని ప్రోవవె నాదుకావ్యమున్. 197

క. నిను భజియింపఁగ నాకున్, మనమునఁ సుస్థైర్య మొసఁగి ♦ మా యేలిక వై
వినుతింపఁబడుచుఁ బేర్మిం, బొనరెడు శ్రీచంద్రమౌళిఁ ♦ బ్రోవుము దేవా. 198

గద్యము.

ఇది శ్రీమదఘనాతనోభయకవిమిత్ర వేంకటయజ్వాగ్రపుత్త్ర
సమారాధితవిబుధరాజ శ్రీపాదకృష్ణమూర్తి కవిరాజ
ప్రణీతం బయిన శ్రీకృష్ణభారతంబునం
దాదిపర్వంబునం దష్టమాశ్వాసము.
శ్రీ. శ్రీ. శ్రీ.



శ్రీ

శ్రీబాలాత్రిపురసుందర్యైనమః.

# శ్రీకృష్ణభారతము

## ఆదిపర్వము—నవమాశ్వాసము.

### చైత్రరథపర్వము.


కర సుగుణాగణాకర
లోకావనదక్ష సర్వ లోకాధ్యక్షా
ప్రాకామ్యాదివిభూతి
ప్రాకటపరమోన్నతప్రభావా దేవా. 1

ధృష్టద్యుమ్నద్రౌపదులయుత్పత్తిప్రకారము.

వ. అక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లనియె నట్లు బకాసురసంహారంబు గావించిన వెనుక పాండవేయులచరిత్రంబు చెప్పు మనిన జనమేజయునకు వైశంపాయనుం డిట్లనియె. 2

తే. బ్రహ్మవేషంబు లనువడఁ బాండవేయు
లచటివిప్రులతోడ వేదాధ్యయనము
సలుపుచుం గొన్నిదినములు నిలిచి యుండి
రంత నొకనాఁట నొకవిప్రుఁ డరుగుదెంచె. 3

వ. తమయున్నయింటి కతిథియై వచ్చి విశ్రమించి యున్నవానిం గాంచి కుంతియు సంతానంబును వాని నుపాసించి సఖ్యంబు వడసి. 4

క. ఏయేదేశంబులు గని, రాయాదేశములవింత లారయఁగ మదిం
బాయదు కౌతూహల మది, యోయయ్య తెలియఁ జెప్పుమో మా కనుడున్.

వ. బ్రాహ్మణుం డిట్లనియె. 6

సీ. ఆసేతుశీతాచలాంతరం బగుభూమి, నంతయుఁ జూచితి నార్యులార
యేదేశమున వింత లిపుడు చూడఁగ రావు, పాంచాల మనుదేశ మెంచఁ దగియె
నాదేశనాథున కగ్నికుండంబున, నుద్భవించెను గూఁతు రద్భుతముగ
నయ్యయోనిజకు స్వయంవరోత్సవ మిప్డు, ప్రస్తుతింపఁగఁబడు నిస్తులముగ

తే. ననిన నచ్చెరుపడి వార ♦ లగ్నికుండ
మందుఁ బుట్టుట యెట్టి ద ♦ యిందువదన
తత్స్వయంవర మెట్టి దం ♦ తయును మాకు
నాన తిం డని వేఁడ ని ♦ ట్లనియె నతఁడు. 7

తరువోజ. అవని భారద్వాజుఁ ♦ డాద్రుపదుండు ♦ ననుఁగు లవ్వల నతం ♦ డాతని చేత
నవమానితుం డయి ♦ హస్తినాపురికి ♦ నరిగి చాపాచార్యుఁ ♦ డై గెండుమిగిలి
నననభుక్పతిసూతిఁ ♦ జగఁ బుచ్చి ద్రుపదు ♦ సంగరంబునఁ గట్టి ♦ శాసించి విడువ
నవమానవెప్పుఁ డై ♦ యతఁడు గెలిపింప ♦ నయ్యెనా నిదియెల్ల ♦ నరసినయదియు.

వ. అట్లు పరిభూతుం డై సపాంచాలుండు ద్రోణుం జంపునట్టిపుత్త్రికని నర్జుననకుం దేవి
యగునట్టిపుత్త్రికనుం బడయం గోరి గంగాతీరంబునం దపంబు సేయుచుఁ దిరిగి
తిరిగి యొక్క బ్రాహ్మణాగ్రహారంబున యాజోపయాజు లనునాశ్వపుల నుపాసించి
వారి కిట్లనియె. 9

శా. పాంచాలేశుఁడఁ గౌరవాస్త్రగురుఁ డై ♦ భాసిల్లు ద్రోణుండు న
న్నొంచ న్నొంచెఁ బరిభవించి మిగులన్ ♦ హీనత్వముం జెందితిన్
బ్రాంచద్బ్రహ్మపదం బనుత్తమును ద్రో ♦ ణాచార్యచాపంబు దీ
పించుం బో పడదత్తిదీక్ష మగుచున్ ♦ క్షీణంబు లౌ నస్త్రముల్. 10

ఆ. అతని సంహరింప ♦ నగుమహాతేజంబు, గలకుమారు నొకనిఁ ♦ గవ్వడి కిడఁ
దగుకుమారి నొకతె ♦ జగతీసుపర్వుల,తపమువలనఁ బడయఁ ♦ దలఁచినాఁడ.

వ. బ్రాహ్మణాగ్రహారంబులునుం దపోవనంబులునుం దిరిగి తిరిగి యనురూపునిం బడయఁ
జాలక విసికి వేసారి నాపురాకృతసుకృతంబునం జేసి మిమ్ముఁ బడయం గంటి నా
నోము ఫలించెఁ గృతార్థుండ నైతి మీకు నూఱుకోట్లగోవుల నొసంగెద నాకోర్కిం
దీర్ప ననుగ్రహింపుఁ డని ప్రార్థించిన వారు వానిచే యజ్ఞోపకరణంబులు సమకూరఁ
బుత్త్రికామేష్టిం జేయించి హోమాంతంబున రాజపత్ని యగుపృషతిం బిలిచి
దేవీ నీకుఁ గవలు పుట్టెఁ గల రిది గ్రహింపు మనిన నామెయు. 12

ఆ. మోము గడుగ లేను ♦ మునుఁ గొన్న మెపూఁత
పోవ నాడ లేదు ♦ భూసురేంద్రు
లార వేచి యుండుఁ ♦ డాహావిస్సును శుచి
గలుగ వచ్చి కొందుఁ ♦ గవలఁ గందు. 13

వ. అనిన యాజోపయాజులును. 14

మ. అభిమంత్రించినయాహవిస్సు నిమిషం • బైనన్ వృథా యుండ రా
దిభరాడ్గామిని రమ్ము రానియెడఁ బో • నిమ్మెట్లు గా నున్నదో
శుభ మట్లయ్యెడు నంచు సంస్కృతహవి • స్సున్ వేల్చె రయ్యగ్నిలో
విభవం బేర్పడ నంతలోన హుతభు • గ్విఖ్యాతకుండంబునన్. 15

క. వరకవచకిరీటంబులు, కరవాలధనుశ్శరాది • కమహాస్త్రములున్
బరఁగ రథారూఢుండై, వరతనయుం డుద్భవించె • వహ్న్యంశమునన్. 16

వ. అంత మఱియును 17

మ. అలరెన్ సుందరి యిందుబింబముఖి దీ • వ్యద్బింబతుల్యోష్ఠి స
ర్వాలసల్లక్షణలక్షితాసితశరీ • రప్రోక్త సుశ్రోణి ని
స్తులకేశాంత సురక్తపాణితల సం • స్తోత్రార్హరక్తాంఘ్రి వ
క్రిలలద్భ్రూయుగ రక్తనేత్ర సుదతీ • రత్నంబు రమ్యాకృతిన్. 18

తే. అట్లు పుట్టినవారల • యందుఁ గొడుకు, జనకశోకాపహారుం డయి • చంపు గురునిఁ
గూఁతు జగదేకకీర్తిత • యై తలిర్చు, ననుచు నెల్లరు వినఁ బల్కె • నభ్రవాణి 19

తే. ధృష్ట మనఁగను శౌర్యము • తెలియ ద్యుమ్న
మన ధనాధిక్య మది గల్గి • యయ్యెఁ గానఁ
దనయుఁ డెసఁగె ధృష్టద్యుమ్నుఁ • డనఁగఁ దనయ
కృష్ణవిగ్రహ గావునఁ • గృష్ణ యయ్యె. 20

వ. ఇట్లు లబ్ధసంతానుండై ద్రుపదుండు సంతసిల్లి యాగంబు పరిసమాప్తి నొందించె
నంత దినదినప్రవర్ధమానుండై ధృష్టద్యుమ్నుండు కృతసంస్కారుండై. 21

మ. ధనురాచార్యుని చెంతఁ జేరి విలువి • ద్యం గోరినం దన్నుఁ జం
పఁ జన్మించినవాఁ డయిన జగతిం • బ్రఖ్యాతికిన్ లోప మౌ
నని శంకించి యమోఘనీయ మగు దై • వారంభము న్నమ్మి ఛా
త్రునిఁగాఁ జేకొని వానికిం గఱపె నా • ద్రోణుండు శస్త్రాస్త్రముల్ 22

ద్రుపదుఁడు ద్రౌపదికి స్వయంవరంబు ప్రకటించుట.

వ. అనంతరంబ ద్రుపదుండు తనకన్య వివాహసమయోపపన్న యగుట యెఱింగి. 23

చ. జననుతు లైనపాండవులు • జాతుషగేహమునందు దగ్ధు లై
రని వినుటం బరాక్రమజి • తాఖిలశాత్రవవర్గుఁ డింద్రనం
దనునకు దేవి గా వరుసఁ • దాం బొనరించెదుభాగ్య మబ్బ ద
య్యెను మఖజాత నొడ్డ కెటు • లీయఁగ నేర్తు నటంచు ఖిన్నుఁడై. 24

వ. హితపురోహితమంత్రిసామంతామాత్యులతో విచారించుచున్నసమయంబున నతనిపురోహితుం డి ట్లనియె. 25

మ. ధరణీశా! యిపుడే నుపశ్రుతినిమిత్తంబుల్ దగం జూచితిన్
గురువంశాభరణాయమానులకు లగ్గుల్ గాని లే వెగ్గు లా
వరసంజాతులు పాండవేయు లమరావాసంబునం గాకిల
న్బరమానందము నందుచుండి రిట కేతెన్సన్నవత్తు రెం దుండియున్. 26

వ. ఇయ్యుపశ్రుతిం జేసి చెప్పినమాట తప్ప నేరదు తొల్లి శచీదేవికి బృహస్పతి దేవేంద్రాగమనంబు దీనం జెప్పె నిప్పు డొక్కస్వయంవరం బిటం జాటం బంపు మనిన నూఱడి ద్రుపదుం డట్లు కావించె నాస్వయంవరంబు నేఁటికి రెండునెలలపదునేనుదినంబుల కగుపౌషమాసశుక్లపక్షంబున రోహిణీనక్షత్రయుక్తాష్టమి నగు నని మఱియును. 27

మ. గొనయుం బెక్కిడఁ దివ్యు లెవ్వరికిం గూడం దురారోహమై
ఘనతం జెందినవింట నేన్ శరములం గన్గొన దవ్వై దివిం
దనరం బంగరుమత్స్యయంత్రముఁ దెగన్ వైవంగ నిర్మించె న
జ్జననాథుం డట వచ్చుచుండి రఖిలక్ష్మాపాలురు న్వేడుకన్. 28

వ. అని చెప్పి యాబ్రాహ్మణుం డరుగుటయుం బాండవులును ద్రౌపదీనామంబు విన్నది మొదలెల్లరును శల్యవిద్ధులైన ట్లస్వస్థచిత్తులై యుండి కాంపిల్యనగరంబునకుం బోవ నున్నవారియభిప్రాయం బెఱింగి కుంతి యి ట్లనియె. 29

మ. *ఒకచో నెప్పుడు వీడ కున్న సలుపా నొండొక్కచో నేగ మా
నకచిత్తం బగుఁ బెద్దకాల మిట దీమం బయ్యెఁ బాంచాలముల్
సుకముం గూర్చెడు నంచు వింటిని మహీశుండుం గడుం ధార్మికుం
డిఁక నిం దుండక పోద మందులకు మీ రేమందు రీమాటకున్. 30

వ. అనిన నెల్లరునుం దల్లీ మేము నీపంపునం బ్రవర్తిల్లువారము కాని యొండు గా మని తమ నిశ్చయ మాగృహపతికిం జెప్పి యొప్పించి యున్నసమయంబునఁ గృష్ణద్వైపాయనుండు ప్రత్యక్షంబై ప్రీతిపూర్వకంబుగా ని ట్లనియె. 31

పాండవులు ద్రుపదపురంబునకుఁ బ్రయాణమగుట.

క. రాజద్ధర్మము మీరు వి, రాజిల్లెడుచోట నెడక రాజులు సయిపన్
బూజార్హు లయినవిప్రులఁ, బూజింపుఁడు మీకు శ్రేయముసు యశము నగున్.

వ. అని మఱియును. 33

* దీమము = ఇల్లు.

చ.* ఒకమునికన్య ఘోరతప ♦ ముండి శివుం దనియింపఁ జేయఁ గాం
తకును బ్రసన్నుఁడై వర మ♦తం డొసఁగం దయఁ జూడ నామెయున్
సుగుణుని భర్త నిమ్మనుచుఁ ♦ జూచియుఁ జూడమి నేను మారలన్
సకియరొ! నీకు నేగు రని ♦ శంకరుఁ డానతి యిచ్చె నామెకున్. 34

సీ. ఇపు డామె పాంచాలు♦నింటఁ గృష్ణ యనంగ, వెలసె మీ రటఁ బోవు♦ఫలము గలుగు
నని బాదరాయణుం ♦ డరిగినఁ బాండవు, లంబాపురస్కృతు ♦ లగుచుఁ గదలి
యెడతెగని ప్రయాణ ♦ మెపుడు సేయుచు గంగ, నర్ధరాత్రమున సో♦మాశ్రయమున
దీర్థ మాడెడుబుద్ధి ♦ పార్థుండు మున్నయి, కొఱవిఁ ద్రిప్పి చను నం♦దఱును నడచి

తే. రపుడు గంధర్వుఁ డొక్కఁ డా♦యారవంబు, విని సహింపక క్రుద్ధుఁడై ♦ వింటినారి
మ్రోఁగఁ జేయుచు హుంకార♦మెగుదేర, వాని కిట్లని పల్కె గం♦భీరఘనోక్తి. 35

మ. ఎవ రోహో నరు లింత ప్రొద్దిచట రా♦నేలో జలక్రీడలం
దవుఁ గాంతాజన మీసమీపమున నే♦నంగారపర్ణుండఁ గాం
డవల న్నావనసీమ దాఁటుచు నెడం♦బై మర్త్యులా దేవదా
నవు లైనం జొరఁ జూడ నోపుదు రెటన్ ♦ వాక్రుచ్చె వివ్వచ్చుఁడున్. 36

మ. నసుగేయు న్నడ నోమువారు భయసం♦త్రస్తాత్మకుల్ దుర్బలుల్
పుడమిం బాహుబలాఢ్యు లెవ్వరు వెలం♦బొందంగఁ బోనేరికిన్
నసువం జొచ్చితి మిప్పు డేము తగి యుం♦ట న్వైరిపా మ్మానముల్
జడధు ల్కాననలు న్నెల్లు నియదితో యీ♦స్వర్గంగ దుర్గర్వగా. 37

గంగానదీమహత్వము.

మ. పరఁగం దొల్త హిరణ్యగర్భునిశుభ♦వ్యాపారపాత్రంబున
స్వరపీఠం బయి పిమ్మట న్హరికి సం♦త్పాదోదకం బై యనం
తర మీశానునిశీర్షభూషణము నై ♦ తర్వాత శ్రీజహ్నుస
ద్వరకన్యామణి యై ప్రవర్తిలెను నీ♦భాగీరథీగంగయే. 38

తే. పరమపావని యీగంగ ♦ వరసుమేరు,పృష్ఠమం దమరావతి ♦ యెట్టయెదుట
దేవతాస్త్రీపురుషసేవ్య♦యై వెలుంగు, నరయ మందాకినీసమా♦ఖ్యను వహించి. 39

తే. మేరుపృష్ఠమువలన నీ♦సౌరతటిని, నలుదెఱఁగుల నవతరించె ♦ నిలకు నసిత
యలకనంద చతుర్భద్ర ♦ యమరగంగ, యనఁగ సర్వపాపాపహ ♦ యగుచుఁ దనరి.

సీ. ఇది భగీరథుఁడు తపం ♦ బాదర వేఁడిన శివు,జడనుండి హిమవంతు♦కడను బడియెఁ
బడి నేలఁ బెకలించి ♦ పాతాళమున కేఁగి, నిలిచి ముజ్జగములఁ ♦ వెలయుచుండె

* చూచియుఁ జూడమి = అత్యాదరముచేత నైనయవిమర్శమున నని భావార్థము.

సాగరు లెఱువది • వేగు రీజాహ్నవీ, సంపర్కమున నాక • సరణిఁ గనిరి
శాపదగ్ధుల కెల్లఁ • బాపము ల్వాప నీ, నది తక్క యొక్కటి • పొదల దెందు

తే. నిందు నెన్నెనితీర్థము • లెసక మెసఁగు, సర్వకలుషాపహంబు లై • గర్వితాత్మ
సర్వసామాన్యధన మయ్యె • జాహ్నవి యిది, నాది యనుచుంటివే యిట్లు • నీది చెపుమ.

తే. అట్టిగంగాతరంగిణి • యందు నాఁడ, వచ్చి మే మీవు వల దన్న • వాక్యములకు
జడిసి వెడలువారము కాము • వెడలు మీవ, వెడఁగ వెఱపింప వచ్చి తె • వ్వాఁడర నీవు.

అర్జునుం డంగారపర్ణునిం జయించుట.

వ. అనిన నంగారపర్ణుం డతికుపితుం డై నానావిధనిశాతసాయకమ్ములు ఱొక్కమ్మడిఁ గవ్వడిపై నేయుటయు నతండును సుగహస్తిహస్తానుకారం బై నతనదక్షిణహస్తంబునం దలికొఱవిం ద్రిప్పుచు వాని నెల్ల సమయన వారించి వాని కి ట్లనియె. 43

క. నీవెఱపించుట లస్త్రము, లేవియునుం దెలియనట్టి • హీనులకడ నా
మానవసంస్కృతాస్త్రులకడ, వే విరియుం జూవె నురువు • విరిసినరీతిన్. 44

మ. అనలాస్త్రం బిది యగ్నిదేవుఁ డిడె ము • న్నావేల్పుతాపోజ్ఞ కా
తని సేవించి గ్రహించె నంతట భర • ద్వాజుం డతం డగ్నివే
శున కిచ్చెం గరుణించి ద్రోణులకుఁ దే • జుం గూడ నాతం డొసం
గెను వా రిచ్చిరి నాకుఁ జూడు మని య • గ్ని న్వానిపై నేయుచున్. 45

క. ఆగ్నేయాస్త్రము పైఁ బడ, భగ్నరథుం డైన వాఁడు • బమ్మరిలుచు ను
ద్విగ్నుం డై ధరఁ బడఁ దల్లగ్నంబున వానిఁ బట్టి • లాగి నరుం డున్. 46

వ. ప్రాణావశిష్టుం డై నవానిశిరోరుహంబులం బట్టి యీడ్చుకొని వచ్చి ధర్మజునకు నివేదించుటయు నంతలో వాని సహధర్మిణి కుంభీనస శరణార్థిని యై వచ్చి పతిదానంబు సేయుం డని ప్రార్థించిన ధర్మజుం డర్జునుం దిలకించి యి ట్లనియె. 47

ఉ. తమ్ముఁడ వీఁడు బమ్మరిలె • దానికిఁ గా విడు వీని మానినీ
సమ్మదవర్తి శరణ్యమన రు • జం బడువాని యశోవిహీను వీ
ర్యమ్మునఁ గానివానిఁ గొని • రాజులు సంపఁగ రాదు నాపుడున్
సమ్మతి నర్జునుం డతని • జాడఁ గనుంగొని నవ్వి యి ట్లనున్. 48

క. కరుణాసముద్రుఁ డిక్కురు, వరుఁడు నినుం గాచి పుచ్చెఁ • బరమప్రీతిన్
వగవర్ణి నిమూలమునన్, ధర బ్రదికితి వింక వెఱకు • నా సతఁ డనియెన్. 49

ఆ. ఏఁ బరాజితుండ • నింక నంగారపర్ణ తను దాల్పఁ జిత్ర • రథుఁడ నగుదు
నీదుచెలిమిఁ గోరె • నీకిత్తు చాక్షుషి, యనెడువిద్య నోఁచి • కొనుము దాని. 50

క. ఇది తొల్లి మనువులవలనన్, విదితంబుగ సోముఁ డెఱిఁగె ♦ విశ్వావసుఁ డా
సదయుని దయఁ గొని నా కిడె, ముదమున దీనం బ్రపంచ♦ములు చూడ నగున్. 51

క. ఒకకాల నిలిచి నేలన్, బ్రకటంబుగ నాఱునెలలు ♦ వ్రత మొనరింపన్
సుకులీనుఁ డెఱుఁగఁ గలఁ డీ,సుకృతం బగు విద్య నీకుఁ ♦ జాలఁగ నొసఁగుదున్. 52

వ. మఱియు నింద్రవజ్రశకలసముద్భవంబు లగునాజానేయగంధర్వంబుల మీ కేవురకు నేనూఱిచ్చెద నివి త్రిలోకరక్షణోపాయసాధనంబులలో నుత్తమసాధనంబు లనిన నర్జునుం డిట్లనియె. 53

ఆ.*మిత్రకోటి నిన్ను ♦ మెలపితి మాఱు లైన, శ్రుతము విద్య ధనముఁ ♦ బ్రతి యొసఁగక
యొరులవలనఁ గొనఁగ ♦ నొప్ప మే మనుటయుఁ, జిత్రరథుఁడు వలికెఁ ♦ జిత్రఫణితి.

ఆ. అనువు లిడితి కాన ♦ నశ్వము లిచ్చెద, ననలబాణమందు ♦ నాసఁ జేసి
చాక్షుషి నిడ నెంతు ♦ సఖ్యం బపేక్షింతు, నాఁగ నర్జునుండు ♦ నగుమొగమున. 55

వ. నీకు నాగ్నేయాస్త్రం బొసంగెద మాకు వలసినప్పు డశ్వంబులమాత్రము గొను వార మీసఖ్యం బెప్పుడుఁ జిరం బుండుఁ గాత మని మఱియును. 56

ఆ. ఎఱిఁగి యెఱిఁగి మమ్ము ♦ నే లయ్య పరమధార్మికుల బ్రహ్మవిదుల ♦ నకుటిలులను
నుదరి పలికి తట్టు ♦ లొనరింతు మే మెద్ది, చెప్పు మనిన నతఁడు ♦ చెప్పె నిట్లు. 57

ఉ. మీరలు పాండునందనులు ♦ మీసుగుణంబుల నేను విందు నా
నారదముఖ్యసన్మును ల♦నాగతముం బ్రకటింప ధర్మసం
చారకులార! మి మ్మెఱుఁగఁ ♦ జాలినవారు జగత్త్రయంబునన్
లేరు పురోహితాగ్ను లవి ♦ లేమి మిముం బరుసంబు లాడితిన్. 58

వ. అని మఱియును. 59

క. కామాతురు లగుచుండియుఁ, గామినులం గూడి నరులు ♦ గానరు ధర్మం
బే మి మ్మెఱిఁగియుఁ బదవితి, సామాన్యమె కాముశక్తి ♦ చర్చింపంగన్. 60

మ. ద్విజుఁడు న్వేదము వేదియుం గలుగు♦నుర్వీనాథుఁ డెవ్వానికే
నజితుం డాతని ధిక్కరించుటకు నిం♦ద్రాదుల్ గినం జాల రీ
గజరు న్వేదవిదు న్సమస్తసుగుణ♦ప్రాంచద్యశఃకాముని న్
ద్విజవంశోత్తమునిం బురోహితునిఁ గా♦వింపంగ ల గ్గయ్యెడిన్. 61

తపతీసంవరణోపాఖ్యానము.

క. తాపత్యుఁడ వగునీ విట, నాపేఁచ మడంపఁ గలిగి♦నాఁడ వధికుఁడై
కాపురుషు లెవ్వరేనియు, నోపుదు రే నిన్నుఁ జూడ ♦ నో పృథివీశా. 62

* శ్రుతము = శాస్త్రము; విద్య = బ్రహ్మవిద్య (జ్ఞానము).

వ. అనినం గుంతీమధ్యముం డేము కౌంతేయులము మమ్ముం దాపత్యు లనుట యె
ట్టిది చెప్పు మనిన గంధర్వుండు వెండియు. 63

చ. భరతకులంబునం బొడమి ♦ బాహుబలంబున నొప్పినట్టిసం
వరణుఁడు రాజ్య మేలుచు శి♦వంబుగ ము న్నొకనాఁడు వేఁటకై
యరిగి నగన్ వనాంతరము♦నం దొకరుండ మెలంగుచుం గనెన్
దగుణనిజాంగసౌష్ఠవజి♦తత్రిదశాంగన నొక్కకన్యకన్. 64

వ. ఇట్లు త్రిజగదేకసుందరి యగు నిందువదనం గని తన డెందంబున. 65

ఆ.*తపనుశిఖను బోలుఁ ♦ దనువిలాసంబునఁ, గాంతిగరిమ చంద్ర♦కళను బోలు
రవియు నెలయు నేక♦రాశిఁ జేరి రటంచు, సకియకురులు నాకు ♦ సాక్ష్య మిచ్చు. 66

సీ. పృథివీపతికి నాకుఁ ♦ బెరిమఁ గూర్పంగ నిట్లు, లలిమించు త్రిభువన♦లక్ష్మి యేమొ
వనవైభవము సూచు♦మనమునఁ బతిఁ బాసి, తిరుగుచుండెడిరతి♦దేవి యేమొ
సుడిగొట్టున న్మొగు ♦ ల్విడి వడిఁ బడి నేల, దేఁకులాడుమెఱుంగుఁ♦దీఁగ యేమొ
వనచరుల్ బంగరు♦బ్రునఁ జేసి నిల్పిన, వరవనదేవతా♦ప్రతిమ యేమొ

ఆ. మొదలికాంతి నెల్ల♦కడలు వెలింగించుఁ, బొసఁగఁ బైఁడిపూఁతఁ ♦ బూసినట్లు
కలిగి యుట్టిదానిఁ ♦ గని విని యెఱుఁగ నేఁ, గలికిమిన్న దేవ♦కన్య యేమొ 67

వ. అని వితర్కించుచు నితాంతకంతుసంతాపదోదూయమానమానసుండై తదీయ
రూపలావణ్యగుణవిశేషంబులం జేసి కదల నేరక మోహపరవశుండై తదంగసౌకు
మార్యంబునంద దృష్టి నిలిపి దాని కిట్లనియె. 68

మ.‡ వెలఁదీ! యెవ్వరిదాన వెవ్వతెవు నీ♦పే రేమి యెందుండి యి
ప్పొలముం జేరితి వొంటి నోట గానక♦పూర్వోదోటనుం బోలె న
వ్వలతేనిం గికురించి వచ్చురతి వ్రా♦వాఁ డంప నిం దున్నవా
రల నేఁచం జనుదెంచుపూములికి నో♦రా రమ్మ వాకి మ్మిగిన్. 69

మ. సొగసుం గుల్కెడునిన్నుఁ బోల రెవరుం ♦ జూడంగ మర్త్యాంగనల్
దగుకీర్తిం గొని యున్నదేవవనితల్ ♦ నాగోత్తమాబ్జాననల్
జగదత్యద్భుతభూషణంబ వగునీ♦సౌందర్యవారాశిలో
మొగిఁ గానంబడ రాక మున్గిరి గదే ♦ పూర్ణేందుబింబాననా. 70

వ. అని పలికినం బలుక కున్న ఖిన్నుండయి పరితపించుచు నించుక తత్కరుణాస్మిత
కటాక్షవీక్షణంబు తన మోమున దాఁకిన ట్లగుటం జేసి మఱియును. 71

* ఇందుఁ గురు లమావసనాఁటిచీఁకటికంటె నల్లగా నున్న వని యభిప్రాయము.

‡ ఓట = భయము, సంకోచము.

మ. తరుణీరత్నమ! నేను సంవరణుఁ డన్ • ధాత్రీతలాధీశుఁడన్
ధరణిం బుట్టి యెఱుంగ నిట్టిది నినుం • దర్శించి దైన్యంబునం
బరితాపంబును బొందితిన్ స్మరశరో • త్పాతంబునం గీడు గా
కరతిం దేర్చవె కూర్చవే కరుణ నీ • గాత్రానుషంగంబునన్. 72

వ. అని బహువిధంబులం బలుకుచున్న సమయంబునం దపతియు మేఘంబుచాటు మెఱుంగుఁదీఁగియుం బోలె సర్వసమక్షమునం దంతర్ధానంబు నొందుటయు నిందుకులశేఖరుం డగుసంవరణుండును నున్మత్తుని తెఱంగున దాని నన్వేషించుచు వనం బెల్లం గ్రిమ్మరి కానక నిశ్చేష్టుండై యొక్కముహూర్తం బుండె నంత నామె మరలఁ బ్రత్యక్షంబై తనకై పరిపరివిధంబులం బరితపించునతనిం జూచి స్మితపూర్వకంబుగా నిట్లనియె. 73

క. వల దిటులు రాజచంద్రమ, పలుతెఱఁగుల నన్నుఁ గూర్చి • పలవించుచు మో
హలతాబద్ధుఁడవై వడి, నిలఁ బడ నేమిటికి లెమ్ము • హిత మెఱిఁగింతున్. 74

తే. కన్నియకు లేదు స్వాతంత్ర్య • మెన్న నీవు
నన్నుఁ గామించు టిది తప్పు • నిన్ను నేన
తగుదు నని పెండ్లియాడుట • తప్పటంచు
సకలధర్మజ్ఞుఁడవు నీ కె • ఱుక తలంప. 75

మ. తపనుం డై త్రిజగత్ప్రదీపకుఁడు నై • తళ్కొత్తు వేవెల్గు నా
కుపమాతీతకృపారసం బొసఁగ నై • యొప్పం గదే తండ్రి యై
తపతీనామము దాల్తు నే నవరజం • దర్కింప సావిత్రికిన్
నృపలోకాగ్రణి నాకుఁ గూరుతువయే • ని న్వేఁడు మవ్వేలుపున్. 76

తే. అతఁడు నీ కిచ్చు ననుఁ బెండ్లి • యాడ వచ్చు
నీకు నాకును దాంపత్య • మీకొన నగు
మనమనోరథ మీడేఱు • ననుచుఁ దపతి
మెఱుఁపు మెఱసినచందాన • మింటి కెగసె. 77

సీ. *అంత నమ్మహికాంతుఁ • డత్యంతచింతాకులాత్ముఁడై పడి మూర్ఛ • యందు మునుఁగ
నప్పుడు ముఖ్యామాత్యుఁ • డరయుచు నట వచ్చి, శీతలోదకముల • సేదఁ దేర్చఁ
బుడమిఱేఁ డగ్గిరి • మూర్ధంబునం దిను, నిష్ఠమైఁ గొల్చి వ • సిష్ఠుఁ దలఁచె
నమ్ముని ప్రత్యక్ష • మై విని యంతయు, మింటితెలువరిఁ గన • మీఁది కేగ

* మింటితెలువరి=సూర్యుఁడు; ఇనుఁడు = సూర్యుఁడు, రాజు.

క. మీరు వసిష్ఠుం బోలిన, ధీరుని ధర్మార్థవేత్త • ధీమంతుని లో
కారాధ్యుం బురోహితుం గాఁ, గోరి భజింపంగ వలయుఁ • గురువంశముఖ్యా. 84

వ. అనిన నర్జునుండు వనౌకసు లగునా వసిష్ఠవిశ్వామిత్రుల కైన వైరనిమిత్తం బేమియో విన వలతుం జెప్పు మనిన నతం డతని కిట్లనియె. 85

విశ్వామిత్రుండు వసిష్ఠుని హోమధేనువుం బట్టుట.

మ. అలరుం దొల్లిటఁ గాన్యకుబ్జమున వి•శ్వామిత్రవిఖ్యాతభూ
తలనాథుం డలగాధిపుత్త్రుఁ డతిమే•ధావి ధాత్రాలి పాలించె ని
స్తులశౌర్యంబున నేల నాకుశికపు•త్త్రుం డొక్కనాఁ డున్నిద్ధయేన్
బలముల్ గొల్వఁగ వేఁట కేఁగి మరుకాం•తారప్రదేశంబునన్. 86

క. మృగముల వధియించుచుఁ గడు, దగ గొని గాధేయుఁ డలసి • తన్సైన్యములో
మొగి నెట్టి నెట్టి చేరెన్, దెగువమెయిం దా వసిష్ఠు•దివ్యాశ్రమమున్. 87

వ. వసిష్ఠుండు నతిథి యై వచ్చిన కౌశికు నాదరించి యర్ఘ్యపాద్యాదుల నర్చించి వానికి వానిపరివారంబునకును నభిమతాహారంబు లొసంగు మని తన నందినిం బంచుటయు నాహోమధేనువు చతుర్విధామృతాన్నంబులును సామృతరసాయనంబులును ననుగణాంబులుం గురిసి వారినెల్లఁ దృప్తులం జేసి యున్నసమయంబున విశ్వామిత్రుండును.

తే.*ఉన్నతము లాలు పృథులు లై • దన్నుఁ గలిగి, కప్పుకన్నులు నరశంకు•కర్ణములును
బెద్దపొదుఁగును గొమ్ములు•మొద్దికయును, గలిగి మెలఁగెడునందినిం • గాంచె నిచ్చ.

చ. పొడుగుశిరంబు కంఠమును • బుచ్ఛమునుం జనుకట్టు గంగడో
ల్దొడలును బెద్దకన్నులు నుదు • క్రొవ్వులు గలలక్షణంబులం
బడసి మనోహరామలశు•భప్రదకాంతిఁ దలిర్చుచున్న తేఁ
దోసకును జూచి దానిఁ గొన • దుష్టమతిం గొని యూని క ట్లనున్. 90

చ.‡యతివర! నీకు గోగణస•హస్రము నొంతెను రాజ్య మొంతె ను
న్నతమతి నిచ్చి పుచ్చెదను • నా కిడు మీ వరహోమధేనువుం
గుతుకము పుట్టె నాఁ జిడిపి•కుత్తికి సంతసంబు రాజ్యముల్
మతి చెడి వీఁడుకో నగుదొ • మానవనాయక నీవు వెఱ్ఱివో. 91

క.§యతులకు మా కేశిక నీ, వినోదమే విడుతు నెట్లు • వేలిమిపడ్డన్
పితృదేవాతిథిజనులకుఁ, బ్రతిదినము దృప్తి గని•పాలఁ గలుగున్. 92

వ. అదికావునఁ దీనికి నొడంబడ నని నలిగి విశ్వామిత్రుండు. 93

* ఉన్నతములాలు — శ్లో. శిరోగ్రీవాసక్థినీచ। సాస్నాపుచ్ఛమధస్తనా॥ శుభాన్యేతాని ధేనూనా। మాయతాని ప్రచక్షతే: పృథుపార్శ్వైరు = శ్లో. లలాటంశ్రవణే చైవ। నయనద్వితయం తథా। పృథూన్యేతాని శస్యంతే। ధేనూనాంపుంగవసూరిభిః ‡ చిడిపికుత్తి — అల్ప ధేనువు. § వేలిమిపడ్డ = హోమధేనువు.

క. విగ్రహము ననుగ్రహము స,మగ్రంబుగఁ జేయ నోపు మనుజేంద్రుఁడ నే
నాగ్రహ మెఱుఁగనివిప్రుఁడ, విగ్రహమున బలిమిఁ గొందు విడవే మొదవున్. 94

వ. అనిన వసిష్ఠుండును. 95

క. బ[illegible]ండవు నీ వే, బలహీనుఁడ బ్రాహ్మణుండఁ బ్రతిఘటియింపం
[illegible] విడ నా కిష్టము, గలుగదు నీతోఁ [illegible]చినట్లు గాఁ జేయు మిఁకన్. 96

వ. అనిన నదరిపడి విశ్వామిత్రుం డాజగన్మిత్రునిహంసచంద్రప్రతీకాశ మగుహోమ ధేనువుం బట్టుకొన బలంబులం బంచిన నది పట్టిన నెట్టనం గశాదండతాడనంబులం బడియుం దడఁబడి హంభా యని కరం బఱచుచు సర్వభాషావిద్వరిష్ఠుం డగువసిష్ఠుని కడకుఁ బఱచి వచ్చి యి ట్లనియె. 97

స్రగ్ధర. తాతా నాప్రాప్తిహీనత్వము తమకెలనం దల్చునో నేల సాయం
ప్రాతర్హోమాదినిత్యవ్రతముల హుతభుగ్జ్వాలల న్నాదుపాలన్
నేతిన్ వేల్వంగఁ బున్యాన్వితనయి సుగతి న్నిల్తు నం చున్ననా కా
ప్రీతిం దక్కంచె నయ్యో విధిబలము కదన్ వెక్కసం బెన్న నాహా. 98

చ. ఖలులు ననుం గశాభిహతిఁ గాఱియ నెట్టను పేక్ష సేయుటల్
దలఁపఁగ ధర్మమే మునికులప్రవరా నను వీండ్ర కిచ్చితే
తెలుపు మనం గలంగక మదిన్ముని నీ వనునట్లు కాదు నే
బలియుఁడఁ గాను బ్రాహ్మణుఁడ వాఁడు బలాఢ్యుఁడ యేమి సేయుదున్. 99

వ. అని చెప్పినం దా నదర్తి యని యెఱింగి మునిహోమధేనువు తనవత్సం బట్టుచున్న బలంబుల కలిగి సలిరేఁగి మోరయుం దోఁకయు నెత్తికొని సైన్యమధ్యంబున మధ్యందినమార్తాండమూర్తి యుం బోలె నై చూడ రాక చిందఱవందఱలాడుచు సంగవిక్షేపంబున నుప్పొంగి వాలధివలన సంగారివృష్టిఁ గురియుచు నెల్లరం దల్లడిల్లఁ జేయుచు నడ నప్పుడు దానిపుచ్ఛంబువలనఁ బల్లవులును బొదుఁగువలన ద్రావిడులును శకులును యోనిదేశంబువలన యవనులును మూత్రపురీషంబులవలన శబరులును బార్శ్వంబులవలనఁ బౌండ్ర కిరాత కాంభోజ దరద సింహళ బర్బర వశ చిబుక పులింద చీన హూణ కేరళులును ఫేనంబువలన మఱియు నానావిధమ్లేచ్ఛజాతులును కోట్లకోట్లు పుట్టి వివిధవిధాయుధంబులం ధరించి విశ్వామిత్రుండు పంచుచుండ వానిబలంబులం జుట్టుముట్టెనంత. 100

ఆ.*అలబలంబు లెల్ల నలి రేఁగి ప్రతిబల,ములను నేమమముగు లలుకఁ బెరిఁగి
యలబలంబు గాఁగఁ గలఁచి పాఱఁగ వాని,నాజిఁ బోలె మూఁడు యోజనములు.

* అలబలము = కలకలము.

ఆ. అలుకఁ గుశికతనయుఁ • డాగ్నేయ మైంద్రంబు, వారుణంబుఁ బోలె • వఱలు నస్త్ర
ములు వసిష్ఠుమీఁదఁ • బూని వేయ నతండు, దండమునన వాని • దాని నడఁచె.

వ. అంత. 103

చ. ఘన మగునా ప్రభావమును • గాధిజుఁ డారసి వెల్లనై యిసీ
యనుకొని బ్రాహ్మ్య మెనబల • మక్కజ మంచుఁ దలంచి రాజసం
బును మహిరాజ్యము న్విడిచి • పోయి విరక్తిఁ దపోవనంబునం
దనయము నిల్చి బ్రహ్మఋషి • యై కొనియెం బహుదివ్యశక్తులన్. 104

శక్తి కల్మాషపాదుని శపించుట.

వ. అట్టి కౌశికుండు పూర్వవైరంబున వసిష్ఠుతోడం గలహించుచున్నవాఁ డగుటం జేసి రంధ్రాన్వేషణంబు సేయుచు నిక్ష్వాకువంశసంభవుండును సుదాసపుత్త్రుం డగు కల్మాషపాదు యాజ్యకారణంబున నాశ్రయించె నంత నతం డొక్కనాఁడు మృగయార్థ మరణ్యంబున కరిగి నానావిధమృగంబుల వధించి వచ్చుచు నేకమార్గమధ్యంబున దగఁగొని క్షుధార్తుండై యున్న వసిష్ఠపుత్త్రశతాగ్రజుం డగు శక్తిం గని రాజ్యమదాంధ్యంబునం దొలంగు మని రాజు బ్రాహ్మణునకుం దొలంగ నగు నని తొలంగ కున్న వానిం గశాభిహతుం జేయుటయు నతండు మండిపడి నీ విది మొదలు రాక్షసుండువోలె మనుష్యపిశితం బశనంబుగా నుండు మని శపించె నంతను మున్న కల్మాషపాదుం డొక్క బ్రాహ్మణునకు మనుష్యమాంసాశనంబు వెట్టించిన నతం డతని రాక్షసుండవు కమ్మని శపించియుండె మఱియు విశ్వామిత్రుం డొక్క రాక్షసుం బిలిచి వాని పై నావేశింపఁ జేసె నంతఁ గల్మాషపాదుండు రాక్షసుండై యొండెఱుంగక పరిభ్రమించుచు విశ్వామిత్రప్రేరణంబున శక్తిం దొట్టి వసిష్ఠపుత్త్రుల నూర్వురం జంపి పులి పశువులం జంపి తినునట్లు తినిన వసిష్ఠుండు సమర్థుం డయ్యును విశ్వామిత్రున కలుగక పుత్త్రశోకంబున నోడ లెఱుంగ కాత్మహత్యం జేయంగా నెంచి. 105

సీ. మేరుకూటంబు నెక్కి • ధారుణిం బడుడును, దూలరాశియుఁబోలెఁ • దుర్లి మేను
ఘోరదావానల • పూరంబు సొచ్చెను, జండనచర్చ్య నాఁ • జల్ల నయ్యె
గళమునఁ బెనుఱాయి • గలుగఁ గడలి దూఁకఁ, దరఁగలు నురువు నా • దరికిఁ జేర్చెఁ
గాలకూటముఁబోని • గరళంబు మ్రింగిన, నమృతపానముఁబోలె • నలర నయ్యెఁ

తే. బాశములఁ గట్టుకొని నదిఁ • బడిన నదియుఁ
బాశములు ద్రెంచి తేర్చె విపాశ యయ్యె

*హైమవతిఁ బడ నది మెట్ట • యగుచు శతవి
ధముల విద్రుత యయ్యె శ•తద్రు వనఁగ. 106

వ. ఇట్లన్నిపాట్లు పడియు నప్రాప్తమరణుం డయి విసిగి నిజోటజంబునకు వచ్చు వాఁడు శక్తిస్వరంబుపోలె సమ్మృతోపమానంబై షడంగాలంకృతంబై స్వచ్ఛం బయిన వేదాధ్యయననిస్వనంబు విని వెనువెంట నంటి వచ్చుకోడలి శక్తిపత్ని నదృశ్యంతిం జూచి యిట్లనియె. 107

తే. పుత్రి మును శక్తిముఖమునఁ • బుట్టినట్టి
శ్రుతిరవముపోలె సాంగమై • శ్రుతిహితముగ
వినఁగ వచ్చెను వేదాధ్య•యనరవంబు
వేని దిది చెప్పు మనుటయు • వెలఁదిమిన్న. 108

క. నీకొడుకు శక్తిగర్భము, నాకుక్షిం గలిగియుండె • నవనవశక్తిన్
వాకొను వేదాధ్యయనం, బీకరణిం బదియు రెండు•నేఁడులుసుతగన్. 109

వ. అని చెప్పిన వసిష్ఠుండు నేను పౌత్రముఖంబు సూచి కృతార్థుండ నయ్యెద నని నివృత్తమరణావ్యవసాయుం డయి యుండె నంత. 110

వసిష్ఠుండు కల్మాషపాదు ననుగ్రహించుట.

తరు.‡మనుజాశనుండు క•ల్మాషపాదుండు• మలసి వచ్చుడుఁ జూచి • మది నదృశ్యంతి
కినుకనిం బడ మాని • కనలుచు వాని • ఘనమంత్రజలములఁ • గడఁకఁ బ్రోక్షింప
మునిశాపమును బాసి • పౌనరి వాఁ డౌని • మ్రొక్కి సుదాసుని•పుత్త్రుఁడ నేను
మునివర మీచేత • మును యాగకర్మ•మును బడసినవాఁడఁ • బ్రోవుము కరుణ.

వ. అనిన వసిష్ఠుం డింక నైన బ్రాహ్మణావమానంబు సేయక పురంబున కరిగి సుఖం బుండు మనిన నతండును. 112

క. మునివరుని నుడిన మెలఁగెద, మునుకొని బ్రాహ్మణులసేవ • బొనరించెద నో
మునివర పిత్రాణ మీఁగం, దనయునిఁ గరుణింప మిమ్ముఁ • దగ నర్థింతున్. 113

వ. అనిన నతం డట్లగుం గాత మనిన నతికుతుకంబునుం బొంది యతం డాతనితో నయోధ్యాపురంబునకుం జని పట్టభద్రుండై ప్రజల నలరించుచు సుఖం బుండె నంత. 114

క. పతియాజ్ఞ వడసి యాత్రని,సతి భక్తిం జేసి మాని•చంద్రునిఁ గూడెన్
మితి మీఱ కతఁడు దానికి, సుతునిం గరుణించి చనియె • స్తుతిపాత్రుండై. 115

* హైమవతి:—ఇది యొకనది.  ‡ కినుకని = సంభ్రమము. మలసి = ఉద్రేకించి.

వ. గర్భవతి యగు నా రాజపత్ని యెంతయు నర్భకుం బడయం జాల కొక్క యశ్మంబున గర్భంబు మోఁదుకొనియె దానం జేసి పండ్రెండవయేఁట నశ్మకుండను నాఁ గొమరుండు పుట్టి పౌదన్యం బనుపురంబు నిర్మించి ప్రకాశించె నంత. 116

తే. *అట నదృశ్యంతి గనెఁ బుత్రు నమలగాత్రు, శక్తిఁ బోలినవాని సువ్యక్తశక్తిఁ దాత వానికిఁ బొనరించె జాతకర్మ, ముఖము లగుసత్క్రియల నెల్ల మునివరుండు.

వ. గర్భస్థుండై తండ్రితండ్రిఁ బరాసుఁ గాకుండఁ జేసెఁ గావున నతండు పరాశరుం డని పేరంది జగత్ప్రఖ్యాతిం గొనియె నంత. 118

వసిష్ఠుండు పరాశరుని కౌర్వునికథ చెప్పి శాంతచిత్తుం జేయుట.

ఆ. ఆపరాశరుండు నభివృద్ధిఁ గొని తండ్రి, చావు దెలిసి కోపభావుఁ డగుచుఁ దపము సేసి లోకతతి నేర్తు నని యున్నఁ, బౌత్రు నాఁగి తాత పలికె నిట్లు.

సీ. కృతవీర్యుఁ డనురాజు క్రతువులధన మెల్ల, భృగువంశజుల కిచ్చి పోయె దివికి నతనిదాయాదులు పతులై నిజార్థముల్, భార్గవుల్గొని రని పట్టి చంపి గర్భస్థు లాదిగాఁ గలవారి నెల్లర, వధియింప నం దొక్క వారిపత్ని తనగర్భ మూరువునం దొనిపిన నెఱిఁగి వా, రది చీల్ప నేతెంచు నంతలోన

తే. నూరువులనుండి యౌర్వుఁ డనఁ భూరితేజుఁ
డభ్యుదయ మంది భూపుల నడఁచి వారిఁ
బిత్రుపితామహముఖబంధుమృతికి వగచి
లోకములు గాల్పఁ దపియించె భీకరముగ. 120

వ. అట్టియవసరంబునఁ బితృలోకంబునుండి పితృపితామహాదులు వచ్చి వాని కిట్లనిరి. 121

శా. ‡మాకై యిట్లు జగత్త్రయంబుఁ బొలియింపం బోలునే నీకు మే
మేకాలంబు నిటన్నిలంగ మది లేకేగం దలం పూని పై
లోకంబుల్ గన నంత నాత్మహతిఁ గల్గుం గల్మషం బంచు నీ
సాకుం బన్ని వధింపఁగాఁ బడితి మిచ్ఛం దీని కింతేటికిన్. 122

క. మాకుం గూర్తువ యేనిన్, లోకానుగ్రహకరముగ లో నిట్టిపగం
గైకొనక తపము వీడుము, నీకుం బుణ్యమును గీర్తి నెగడు ధరిత్రిన్. 123

వ. అనిన నౌర్వుండు వారల కిట్లనియె. 124

ఉ. పాపులపాపవర్తన మపారము గా విని తత్పరాభవం
బోపి సహింపలేక యిటు లుండియుఁ గోపమహానలంబు మే

* పరాసువు = చచ్చినవాఁడు. ‡ ఏకాలంబును = ఎల్లకాలమును.

నాపదమస్తకంబుగ స♦హర్నిశము న్దహియింప శాంతి కే
నీపగిదిం దపం బొగి వ♦హించితి దానికి నేమి సేయుదున్. 125

క. పట్టినపట్టును విడి వడిఁ, జెట్ట యగుచు మంచిపనిని ♦ జేయఁ జనని వాఁ
డెట్టిఁడ యయినను వానికిఁ, బుట్టునె ధర్మార్థకామ♦ములు గురులారా. 126

క. తెలిసియుఁ దీరుచుశక్తిం, గలిగియు ఖలు లొరులఁ బెట్టఁ ♦ గలహింసలు దాఁ
దొలఁగింపఁ బూనఁడేనియు, ఖలుఁడై జనుఁ డఘముపాలు ♦ గాఁడే తెలియన్. 127

ఉ. కావున నాతొడంగుపని ♦ కాఁ గలయట్లు తపోనలంబు లో
కావళి నేర్చు మాను మను♦సృష్టిభవద్వచనంబు మీఱి నేఁ
బోవనియట్లు చూచి పితృ♦పుంగవులార ప్రసన్నుఁడై దయన్
నావుడు వార లిట్లనిరి ♦ నవ్వుచు లోకహితంబు పెంపునన్. 128

ఆ. జలములందు లోక♦జాలమ్ము లగుఁ గాన, జలధి నీదుకోప♦జాతవహ్ని
ప్రతిన కిడుము నాఁగ♦నతఁ డట్లు కావించె, నదియు నౌర్వ మనఁగ♦ నచ్చోట నిలిచె.

వ. నీవు నౌర్వునట్ల శాంతుండవై లోకహితుండ వగు మనినఁ బరాశరుం డుపసంహృతక్రోధుండై తపఃప్రయత్నంబు మాని సర్వరాక్షససంహారంబుగా నొక్కసత్త్రయాగం బొనర్పం గడంగి బాలవృద్ధసమేతంబుగా సర్వరాక్షసులం దహించుచుండ నదియును గ్రతుపులహపులస్త్యాదిసంప్రార్థనం జేసి యుపసంహరించి తన్నియోగంబున నయ్యగ్ని హిమవత్పర్వతోత్తరపార్శ్వంబునందలిమహావనంబునఁ బడవైచె నది నేఁటివఱకుఁ బ్రతిపర్వంబునందును రేఁగి పాషాణవృక్షరాక్షసాదుల భక్షించుచుండు నని చెప్పిన విని యర్జునుం డంగారపర్ణునిదిక్కు మొగంబై. 130

తే. పడతిఁ గల్మాషపాదుండు ♦ బ్రహ్మవిదుఁడు
గురువసిష్ఠున కేటికిఁ ♦ గూర్చె నతఁడు
కారణము లేక యాకొమ్మఁ ♦ గలసె నెట్లు
తెలియఁ జెప్పుము నాకు సం♦దియము దీఱ. 131

వ. అనిన గంధర్వుం డతని కిట్లనియె. 132

మ. ఘనుఁ డాశక్తి శపింప నట్లసురుఁడై ♦ కల్మాషపాదుండు తా
వనులన్ మెట్టుచు నాఁకట న్వెదకుచున్ ♦ భక్ష్యంబు నొం డొక్కచో
టను గ్రీడించెడువిప్రదంపతులఁ బ♦ట్టన్ రాఁగ వా రాతనిం
గని భీతిం గొని పాఱి రార్చుచును లో♦కం బెల్ల దద్దిరఁగన్. 133

ఆ. అట్లు పాఱుమిథున♦మందుఁ బూరుషుఁ బట్టి, వలదు విడు మటంచు ♦ వానిభార్య
యేడ్చుచుండ వాని ♦ మృగమును బులివోలెఁ, జంపి తినియె నంత ♦ సాధ్వి పొగిలి.

వ.*కామార్తులమై క్రీడించుమ మిట్లు చేసి నాభర్తం జంపి భక్షించితివి కావున నీవు నీభార్యం గూడునప్పు డిట్లు కూలుదు వని శపించి యాయాంగిరసి వాఁడు చూచు చుండ వహ్నిప్రవేశంబు గావించె నక్కారణంబునం గల్మాషపాదుండు వసిష్ఠుం బ్రార్థించి వానివలన వంశవిచ్ఛేదంబు గాకుండఁ బుత్త్రిం గలిగించుకొనియె నని చెప్పిన నర్జునుండు వెండియును. 135

ఉ.‡చూచితి వెల్లవోటులను సోదరతుల్యుఁడ వీవు మాకు వే
దోచితకర్మకాండమున కొజ్జగ నేద్విజవర్యుఁ జొప్పునో
చూచి వచింపవే యనుఁడు జోత్తిలి చిత్రరథుండు వల్కె ను
త్కోచకతీర్థమందు మెలఁగు న్ముని ధౌమ్యుఁ డతండు చెనంగెడున్. 136

తే. అనుచు వచియింప నర్జునుం డలరి వాని
కిచ్చు నిచ్చి యాగ్నేయాస్త్ర మేము వెనుక
వలయునప్పుడు గొందు మశ్వముల నంత
దనుక నీకడ నుండని మ్మనఘచరిత. 137

పాండవులు ధౌమ్యునిఁ బురోహితునిఁగా వరించుట.

సీ. అనుచు నాచిత్రరథునితోడ సఖ్యంబు, వాటించి వానికి స్వస్తి వలికి
వీడ్కొని పాండవుల్ వేడ్క భాగీరథీ,తీరమార్గంబునఁ దివిరి పోయి
యుత్కోచకమునందు నొగిఁ దపించుమునీంద్రు, దేవలభ్రాతను దివ్యమూర్తి
ధౌమ్యునిఁ గని మ్రొక్కి తమపురోహితునిఁగా,వరియించి వేఁడ సంవ్వరియశుండు

తే. వారి శిష్యులఁగాఁ గొని వన్యకంద,మూలఫలములఁ బూజించెఁ బూరువంశ
భవులు సర్వ మెఱింగించి పడసి వానిఁ, దారు కృతకృత్యులైనట్లు తలఁచి రాత్మ.

వ. అంత నప్పాండవు లప్పురోహితుం బురస్కరించుకొని. 139

స్వయంవరపర్వము.

తే. కదలి కాంపిల్యపురమును గనఁగఁ బోవు,వారు ముందటఁ గొందఱు బ్రాహ్మణప్ర
వరులఁ గని మీరు లెందుల కరుగుచుంటి, రనిన వారికి వా రిట్టు లనిరి తెలియ. 140

మ. వరపాంచాలవిభుండు కన్యకకు నుద్వాహంబు సేయన్ స్వయం
వరముం బ్రస్తుతి సేసె నేఁ డచటికిన్ వాంఛ న్సమస్తావనీ
శ్వరులు న్వత్తురు భూరివైభవముతో వర్తించు నం దెల్లభూ
సురులుం దృప్తిగ సాపడంగ నగు నంచుం బోదు మే మాడకున్. 141

* ఆంగిరసి = అంగిరస్సుకూఁతు. ‡ జోత్తిలి = రంజిలి.

క. మీరును వత్తురయేనిం, గోరిక దీఱంగ శుభముఁ గనుం జూడ నగుఁ గా
వారిజముఖి దైవకృపం, గోరి వరించిన వరించుఁ గొను మి మ్మొకనిన్. 142

వ. అని ప్రశంసించువారలతో వారును గూడి చనుచు నమ్మార్గంబునఁ గృష్ణద్వైపా
యనుం దర్శించి నమస్కరించి తదనుజ్ఞాతులై కదలి రమణీయంబు లగువనంబులును
సరోవరంబులును జూచుచుఁ గతిపయప్రయాణంబుల, గాంపిల్యంబు సొచ్చి యొక్క
కుంభకారశాలయందుఁ ద మ్మెవ్వరు నెఱుంగకుండ బ్రాహ్మ్యవృత్తి నాశ్రయించి
భైక్ష్యంబెత్తుకొని నివసించి యుండి రట ద్రుపదుండును. 143

మ. అనిఁ ద న్నొల్చినపాండవేయులకు నీ ♦ యం గన్యకన్ గాం క్షి యా
గ్నిని జన్మించినదాని నొడ్ల కిడఁగ ♦ న్నెమ్మిం దదన్వేషణం
బుకై యంత్రము నాకసంబునను బో ♦ ల్పం బొందఁ నిర్మించి దీ
నిని నేయం గలవాఁడు పార్థుఁ డొరుఁడే ♦ నిం జాలఁ డం చెంచుచున్. 144

క. వి ల్లెక్కుడి యంత్రము మ్మిలఁ, ద్రుళ్లి పడ నేయునట్టి ♦ యోర్పులయుతుఁడే
యల్లుఁ డగు నాకుఁ గృష్ణా, వల్లభుఁ డై యనుచుఁ జాటఁ ♦ బంచె నృపుఁడున్. 145

క. అది విని భూపతు లెల్లన్, మదమున యంత్రమ్ము నేసి ♦ మదవతిఁ గొనున
మ్మునముం నొందొరుఁ గడవఁగ, నద నని చని రాస్వయంవ ♦ రాంగణమునకున్. 146

వ. మఱియు నాస్వయంవరోత్సవదిదృక్షు లైనపౌరజానపదులును బ్రాహ్మణులును ఋషు
లును దక్కినవారును జని పురంబునకు పూర్వోత్తరదిగ్భాగంబున సమస్థలంబునఁ జతుర
స్రంబును జందనచర్చితంబును రత్నపుష్పాదిసమలంకృతంబును నగురుధూపవాసితం
బును సుఖారోహణవిశాలశిలాసోపానవిరాజితంబును మణికుట్టిమవిభూషితంబును
నసంబాధశతద్వారంబును ద్వారతోరణమండితంబును మహాసనపరిచ్ఛదంబును సకల
జనమనోహరంబు నగునప్పాంచాలీస్వయంవరరంగంబున యథోచితస్థానంబుల విశ్ర
మించి గిప్ప డప్పాండవులును బ్రహ్మసమూహంబుతో నం దొక్కచోటఁ గూరు
చుండి పాంచాలునై భవంబు ప్రతీక్షించుచుండి రాసమయంబున. 147

మ. మెఱుఁగుఁగ్రొంగ్గొ తెఱంగునన్ మెఱయుచున్ ♦ మే లాడ నాకృష్ణ యే
డైఱ దీపించుమనోజసాయకము నా ♦ దేదీప్యమానప్రభం
దెఱవ ల్గోల్వకుఁ బుష్పమాలఁ గొని రా ♦ దీవించి మంత్రంబులం
గొఱ లేకుండఁ బురోహితుం డొనరిచెం ♦ గ్రొంబెండ్లిసంస్కారముల్. 148

వ. అంత వాద్యత్రంబుల వారించి నిస్తరంగసాగరంబువలె నిశ్శబ్దమ్మగురంగమధ్యంబున
నిలిచి ధృష్టద్యుమ్నుం డెల్లరు విన నుచ్చస్వరంబున ని ట్లనియె. 149

చ. నరవరులార యీధనువునం గొనయం బమరించి లక్ష్యమి
య్యురపదితూపుల న్వివర మారయ కిందుల నుండి యేయుచున్
ధరణిఁ బడంగఁ జేసినయుదారుఁడె నాసహజాత కృష్ణకున్
వరుఁ డగు లెంక చేవ గలవారలు పూనుఁ డాకం డాకంమునన్. 150

వ. అని తనచెలియలిదిక్కు మొగంబై తల్లి ధరణీతలంబునం గలరాజు లెల్లరు నీస్వయంవరంబున కిడె వచ్చి యున్నవారు వీరిం జూడు మని కులగోత్రనామంబులు నిరూపించుచు దుర్యోధనదుశ్శాసనాదికురుకుమారశతంబును గర్ణాశ్వత్థామసోమదత్తాదులను శకుని విరాట శల్య జయద్రథ బృహద్రథ శిశుపాల జరాసంధ గాంధారాదిదేశాధీశులను రామ కృష్ణాక్రూర సాత్యకి సాంబ ప్రద్యుమ్నోద్ధవానిరుద్ధాదియదువృష్ణిభోజాంధకప్రవరులను వేఱువేఱం జూపి. 151

రాజు లెల్లరు విల్లు మోపెట్ట నోడుట.

క. ఇం దెవ్వం డీలక్ష్యముఁ, బొందుగఁ దెగ నేయువాఁడొ పో నీవు వరిం
పం దగినయట్టివాఁ డెపు, డిందఱు జూడంగ నతనికి నిడి పూదండన్. 152

మత్తకోకిలము. అంత రాజకుమారు లెల్లరు నాయితం బయి లేచి వే
వంతు లాడుచు నేను నే నని వాసి కెక్కినవాఁడ సా
మంతుఁడ న్మను నైతు లక్ష్యము మల్లఁ డంచు నొకళ్లొక
ళ్లింతికై మరు లంది మిత్రము లేవి పూనిరి వైరముల్. 153

మత్తకోకిలము. *అమ్మహోత్సవదర్శనాగతులై విమానము లెక్కి యొ
య్యమ్మనన్ వసుసిద్ధసాధ్యులు మర్త్యులున్ ఖచరుల్ సురల్
సమ్మదంబునఁ జూచుచుండి రజస్రమున్ సురదుందుభుల్
ముమ్మరమ్ముగ మ్రోఁగె సోమకుప్రోలిపైఁ బయి నత్తఱిన్. 154

మ. నివురుల్ గప్పిననిప్పులుం బలె ద్విజానీకంబుమధ్యంబునం
దవులం గాత్రముల న్విభూతి దనరన్ మై తేజోర్జితి బ్రహ్మర్షిపుం
గవులో నాఁగ సభాస్థలంబునను వేడ్కం గూరుచున్నట్టి పాం
డవులం గృష్ణుఁ డెఱింగి తద్గతికి లోనం బొందె నానందమున్. 155

వ. రాజనందను లందఱును సుందరీసందర్శనంబునం గందర్పబాణపాతాపేతజ్ఞానులై తమ్ముఁ
దా మెఱుంగ నేరక కోరికం జేసి క్రమక్రమంబున. 156

మ. విలు మోపెట్టఁగఁ బోయి డగ్గఱుచు దోర్వీర్యం బవార్యంబుగా
బలిమి న్మోపెట్టఁగ లేక హుమ్మనుచు నాగర్వం జొచ్చి బిట్టార్చుచున్

* సోమకుఁడు = ద్రుపదుఁడు. సోమకుప్రోలు = పాంచాలరాజధాని యగుకాంపిల్యము.

దళమై చెమ్మట లూర హారములు వి । చ్ఛిన్నంబులై రాల బెం
డులమై మేనులు దూలఁ గూలఁబడి రం । దుం గొంద ఱెం దందుఁగన్. 157

మ. ఇది మాయాధను వేరికేని గొనయం । బెక్కింప రా దేయ రా
దది వైహాయసయంత్ర మేటికి వృథా । యాసంబు వేరాన సి
గ్గొదవం జేయు నటంచు డాయక యమే । లూహింపుచుం గొంద ఱ
చ్చెదురున్ వేగమ వీడి పోయిరి నిరా । శాపాంసులై వీండ్లకున్. 158

తే. కృష్ణబోధితులై యదు । వృష్ణిభోజ,ముఖ్యు లెల్లరు విముఖులై । మొనయ రైరి
సజ్యకర్మంబునకు సాల్వ । చైద్యపాండ్య, ముఖులు మోపెట్ట నోడి యు । పహసమిఁ బడిరి.

ఉ. అందఱు నట్లుగాఁ దెలియ । నారసి సూతసుతుండు కర్ణుఁ డా
నందము నొందుచుం జని ఘ । నం బగుశౌర్య మవార్యమై చనన్
ముందఱ నున్నవిల్లుఁ గొని । మోపిడి తూపులఁ గూర్చి నున్న నో
నంపలివాని లచ్చెరువు । నందిరి లక్ష్యము నేసె నన్నమతిన్. 160

తే. అపుడు ద్రౌపది సన్నద్ధు । డైనకర్ణు, సరసి యుచ్చైస్స్వనంబున । ననియె నిట్లు
సూతు నీతని వరియింప । నీతఁ డిపుడు, యంత్రమత్స్యంబు నేసిన । యట్టి డైన.161

వ. అని పలికిన విని కర్ణుం డేమియుం బలుకఁ జాలక హేళిం జూచుచు ధనువు విడిచి చనియె నంత. 162

సీ.*చేదినాథుం డగు । శిశుపాలుఁ డరిగి విల్, కయి నంటఁ బోయి మోఁ । కటిలఁ బడియె
మద్రేశుఁ డగుశల్య । మహిపతి వి ల్లెక్కిడఁగఁ బోయి కాళ్లు వి । ఱుగఁగఁ బడియె
ఘనుఁడు జరాసంధ । మనుజేశ్వరుఁడు విల్లు,కడ కేగి గిరిచో లెఁ । గదలఁ డయ్యె
ధరణీంద్రు లెల్ల రా । ధనువుఁ గన్గొనినంత, నోడ లెల్ల జవజవ । వడకఁ బడిరి

తే. మఱియు రింగమునం గల । మనుజు లెల్ల, సంభ్రమంపడుచుండిన । సమయమందు
బ్రహ్మమండలి నుండిన । ఫాల్గునుండు, విల్లు మోపెట్టఁ దలపెట్టె । నుల్లమందు. 163

వ. అప్పుడు ధృష్టద్యుమ్నుం డెలుం గెత్తి యిట్లనియె. 164

క. విలు మోపెట్టఁగఁ జాలిన, బలయుతు లీకొలువునందుఁ । బరికించినచోఁ
గలరే కలిగిన వారలు, నిల నేటికి రండు దీని । నిం బూనుఁ డొగిన్. 165

—●●◆ అర్జునుండు విల్లు మోపెట్టి మత్స్యయంత్రముఁ దెగనేయుట. ◆●●—

వ. అనిన రాజు లెల్లరు ధనుస్సజ్యకర్మంబున వినివృత్తులై యున్న నర్జునుం డగ్రజానుమతంబున సంభ్రమించి లేచి విప్రసంఘంబులనుండి వెలువడి విజృంభించి మల్ల

* మోఁకటిల్లఁబడు = మోఁకాళ్లు నేల కాన ముందఱికి ఒఱగఁబడు.

చుచుటయును నచటిబ్రాహ్మణు లెల్ల సంప్రస్థితుం డగుపార్థుం జూచి కృష్ణాజినంబు లెగురవేసికొనుచు నార్చుచు ముదాన్వితులు విమనస్కులునై వార లొండొరుం దమలోన. 166

సీ. శల్యప్రముఖు లైనఁ ♦ జాలనిదాని కీ,నటు వక్రతాస్త్రుఁ డీ ♦ వ్వరుసఁ గడఁగ
నితనిమూలమ్మున ♦ నీవిప్రజాతికి, నపహాస్యము ఘటిల్లు ♦ ననవరతము
సింహసంహననుఁ డీ ♦ క్షితిసురుం డెంతయు, సజ్యకర్మంబున ♦ శక్తి గలఁడు
క్షాత్రబలం బెంత ♦ ధాత్రిఁ దపశ్శక్తి, కలభార్గవుని పెంపు ♦ దలఁప వలదె
ఆ. మనకుఁ బోలె శక్తి ♦ దనరనినాఁ డేల, యిట్టిపనికిఁ బూను ♦ నే నటంచు
నితఁడు మత్స్యయంత్ర ♦ మేసి విజయ మంది, బ్రహ్మజాతి కెల్లఁ ♦ బ్రతిభఁ దెచ్చె.

శా.*బాపం డంచును నీనినిం బరిహసింపన్ రాదు జుం డింతలో
బాపం డాజమదగ్నిసంభవుఁడు జంపన్ లేదె ము న్నాజులన్
భూపవ్రాత మగస్త్యుఁ డంబుధిజలంబుల్ సర్వముం ద్రావఁడే
లోపంబే ద్విజశక్తి కెం దయిన నీలోలుండు మేలొందెడున్. 168

చ. అనుచు ద్విజు ల్వచించుతఱి ♦ నర్జునుఁ డాధనువుం బ్రదక్షిణం
బునఁ జని పట్టి లోఁ గురుల ♦ మ్రొక్కి మహేశ్వరునిం దలంచుచున్
గొనయము నెక్కు వెట్టి చిఱుగోలల నేనిట నశ్రమంబునన్
జన మది నివ్వెఱంపడి ప్రశంస యొనర్పఁగ నేసె యంత్రమున్. 169

క. నిమిషాంతరమున నాఝ, ద్రమునుండియ నేలఁ బడియెఁ ♦ దగ మొరయుచు యం
త్రము జయజయశబ్దముతో, నమరులు పుష్పములు గురిసి ♦ రాసమయమునన్.

క. కోలు వెల్లఁ గలకలధ్వను, లలరెం దుందుభులు మ్రోసె ♦ నవనీసురులుం
బలుపోకడలం బోవుచుఁ, జెలగాటము లాడి రపుడు ♦ చేలలు గదలన్. 171

వ.† శతాంగాదివాదిత్రంబులు మొరసె వందిమాగధస్తుతిశబ్దం బబ్దద్వారంబు నిండుకొన నపుడు ధర్మనందనుం డానందంబు నొందుచు నకులసహదేవులతో విడిదకరిగె నిట ద్రుపదుండును సకలసేనలతో నర్జునసహాయుండై యుండె నంత. 172

ఉ.‡ ద్రోవది యంత్రమత్స్య మొక ♦ తూఁకునఁ గూలుటఁ జూచి సంతసం
బావహిలంగఁ బొంగి నడ ♦ యాడెడుబంగరుబొమ్మ వోలె నై
పూవులదండఁ జేకొనుచుఁ ♦ బోయి నరు న్వరియించె నాతఁ డ
ద్దేవిని గొంచు విప్రులు నుతింపఁగ రంగము వీడె వేడుకన్. 173

వ. అది చూచి సైఁపం జాలక భూపాలు రెల్లరును గోపావిలచిత్తులై. 174

---

* లోలుఁడు = మిక్కిలియిచ్ఛగలవాఁడు. † అబ్దద్వారము = ఆకాశము. ‡ తూఁకు = పూనిక.

స్వయంవరాగతు లగురాజు లెల్లరను సంక్షోభించుట.

చ. కలయఁగ నేచి రేఁగి యలు♦గంబడి వెంబడి వార లెల్లరుం
బిలుచుట లేల రాజులను ♦ బ్రీతి భజించుట లేల మున్నిటన్
ఖలుఁ డగుసోమకుండు సుతఁ ♦ గానక విప్రున కీయ నుండి తాఁ
బలువురఁ జిన్నపుచ్చె ననిఁ ♦ బట్టి వధింతము వీనిఁ బుత్త్రితోన్. 175

చ. సురసభఁ బోలునీసభను ♦ జూడఁగ నీమెకు రాజు లెవ్వరున్
దొరకకపోయిరో యిటులు ♦ తొట్రిలి చేసె స్వయంవరంబు భూ
సురులకుఁ జెల్ల దిష్టయిన ♦ సుందరి తా మనలోన నేరినే
నరసి వరింప కుండిన ర♦యంబున దీనిని వేల్త మగ్నిలోన్. 176

తే. బ్రాహ్మణుఁడు పార్థివులకు లో♦భమునఁ గాని
చాపలంబునఁ గాని యీ♦సరణి విప్రి
యముఁ గొనర్చినయేని వా♦రతనిఁ జంపఁ
దగదు సర్వస్వ మర్పింపఁ ♦ దగును భక్తి. 177

వ. ఇంక నైన నిట్టిపరాభవంబు స్వయంవరంబుల రాకుండ స్వధర్మంబు గాపాడుట మనకుఁ బాడి యని కుపితులై నానావిధాయుధంబులు ధరించి ద్రుపదునిపైఁ బడి రతండును విత్రస్తుండై విప్రులమఱువు సొచ్చెఁ జొచ్చిన వారును వాని నోడకుండు మని తమతమదండాజినంబు లెత్తుకొని ప్రతిఘటించినం జూచి విజయుండు నగుచు మీ రోసరిల్లి చూచుచుండుం డని వారి వారించి ప్రతిబలంబులపై ఘోరనారాచంబు లడరించుచున్నంతఁ బ్రభంజననందనుం డొక్కమహావృక్షంబు వెఱికికొని వచ్చి తమ్మునకు సహాయుం డయ్యె నయ్యవసరంబున వాసుదేవుండు బలదేవునిం జూచి యి ట్లనియె. 178

శా. తాలప్రాంశుశరాసనప్రథితుఁడై ♦ తళ్కొత్తువాఁ డర్జునుం
డాలంబుం బొనరింపఁ జెట్టు గొని యు♦న్నాతండు వాతాత్మజుం
డాలో నేగినగౌరవర్ణుఁడును దో♦డై నట్టిరుం బాండుభూ
పాలాగ్రేయకుమారుఁడుం గవలు దే♦వా నీవు పోలించితే. 179

క. జతువేశ్మానలమున నా, హుతికిం గా కిట్లు నిజస♦మున్నతశక్తిన్
బ్రతికి బయల్పడి యుండిరి, సుతులును బృథ యనుచు వింటిఁ♦ జుమ్ము మహాత్మా.

క. అనవుడు నివ్వెఱపడి తన, మనమున హర్షించి ముసలి ♦ మనపుణ్యమునన్
గనుఁగొంటిమి నేఁ డనలంబునఁ బ్రదెల్లిర యన్నవారి ♦ మొగి మనవారిన్. 181

వ. ఆఘమయంబున. 182

ఆ. అనిఁ బొనర్పవచ్చు • నట్టివిప్రులఁ మున్న, వచ్చు నిందు శంక • వల దటంచు
రాజు లెల్లఁ గలఁగి • తేజ మీఱఁగ విప్ర, వరులమీఁదఁ బడిరి • వడిగ వడిగ. 183

కర్ణార్జునశల్యభీములద్వంద్వయుద్ధము.

ఆ. జనులు సూచుచుండ • శరవేగమున వచ్చి, బలిమి సూతజుండు • పార్థుఁ దాఁకె
హృదయశల్య మట్టు • లెదిరి శల్యుండును, వాతసూతిఁ దాఁకె • వాఁడి మెఱయ.

మ. ఘనశస్త్రంబుల ముంచి మించి నరునిం • గర్ణుండు నొప్పింప నొ
య్యనఁ గోపంబున నర్జునుండు వడిఁ • బ్రత్యస్త్రంబుల న్నొంచి క
ర్ణుని సర్వావయవంబుల న్శరములన్ • జొప్పించి కాలాగ్నిరు
ద్రునిరౌద్రంబున నుగ్రమూర్తి యగుచుం • దోఁపన్ భయభ్రాంతుఁడై. 185

చ. రవిజుఁడు మెచ్చి పల్కె సుర • రాజతనూభవుఁ జూచి భూసుర
ప్రవర భవత్ప్రభావ మని • వార్యము శౌర్యధురంధరుండు నా
దవిననున్ రణంబునను • దాఁక సమర్థులు లేరు వేఱ వా
సవుఁడును గేశవుండు భృగు • సత్కులజుండు నయుండు దక్కఁగన్. 186

వ. బ్రాహ్మణవేషధరుండ వైన నీ వెవ్వండ వని యడిగిన వాని కర్జునుం డి ట్లనియె.

క. నే నీచెప్పినవారల, లోన నెవ్వఁడఁ గాను వీర • లోకస్తుత వి
ద్యానిపుణుండ ద్విజుండను, గాన నినున్ వడి జయింపఁ • గలవాఁడ ననిన్. 188

వ. అనిన నతండు బ్రహ్మతేజం బజేయం బని తలంచి రణవిముఖుం డయ్యె నంత.

శా. మద్రేశుండును భీమసేనుఁడు నొగిన్ • మత్తేభయుగ్మంబు నా
రౌద్రం బేర్పడ మల్లయుద్ధము నొన • ర్పం జొచ్చి రప్పట్టునన్
సాద్రీంద్రంబుగ దద్దరిల్లె విపులా • చక్రంబు హాహాకృతిన్
ముద్రింపంబడె రంగ మెల్ల నచటం • బుట్టెన్ భయోత్పాతముల్. 190

తే. అపుడు జగజెట్టి యగు గాడ్పు • టనుఁగుఁ బట్టి
పట్టి శల్యుని నిలఁ ద్రెళ్లఁ • వైచెఁ ద్రెళ్లి
చాపునకుఁ దప్పి శల్యుండు • సనియెఁ దొలఁగ
నుర్విసురు లెల్లఁ గని నవ్వ • రొక్క పెట్టి. 191

మ. కలనం గర్ణుని మద్రనాథు నెదురం • గా రాముఁడుం గృష్ణుఁడున్
బలుఁడున్ భీముఁడు ఫాల్గుణుండు గురుఁడుం • గా కేఁపు శక్తుండు భూ
తలమం దీద్విజు లేరొ కాని త్రిజగ • త్ప్రఖ్యాతిమై నొప్పు యో
ధుల నెల్లన్ బెగడించుచుండి రిచటన్ • దోర్దర్ప మేపారఁగన్. 192

వ. అని ప్రశంసించుచు. 193

చ.*అలిగి మహీంద్రు లెల్లరు మహాహవదోహలమత్తచిత్తులై
కలఁగి మహీసురుల్ బలెను గన్పడి పీరతిమానుషక్రియల్
సలిపి రలంతులం బడరు చంపుద మొండెను జత్తు మొండె లెం
డొలుకుఁడు పీరిపై శరము లొక్కట నోసరిలంగ నేటికిన్. 194

తే. అనుచు సన్నద్ధు లగువారి నరసి కృష్ణుఁ, డితరదుష్కరమగుకార్య మిచటఁ జేసి
కడిఁది ధర్మమునం గానంబడియెఁ గృష్ణ, వీరి తప్పేమి మీ కిటఁ బోరు టేమి.

వ. అని బోధించి వారిసంరంభం బుడిగిన వారును ధర్మపాశబద్ధులై చేయున దేదియును లేక నిజదేశంబులకు నిర్గమించి రంత భీమార్జునులు ద్రౌపదీసహితులై బ్రాహ్మణులతో జనసంబాధంబునుండి తొలఁగి వచ్చియున్న యంత నట. 196

——భీమార్జునులు ద్రౌపదిం దెచ్చి తల్లికి నివేదించుట.——

క.‡తడసిరి భిక్షాకాలము, గడచెను బుత్త్రకులు రాని కారణ మేమో
జడు లెఱిఁగి ధార్తరాష్ట్రులు, విడిఁ బడిరో మునులనుడులు విపరీతములో. 197

వ. అని కుంతి సంతాపించుచుండ సుప్తజనప్రాయంబై మేఘసంప్లుతం బగుటఁ జేసి దుర్దినం బైన నాఁటియపరాహ్ణసమయంబున. 198

తే. కవలతో ధర్మజుఁడు వచ్చె నవల భీమ, పార్థులును యాజ్ఞసేనితో వచ్చి భిక్ష
తెచ్చితి మటంచుఁ దల్లికిఁ దెలుప నామె, చూడకే రేవు రనుభవించునది యనియె.

మత్తకోకిల. అంత లోచనగోచరం బగు నాసతీమణి నెంచి లో
గొంతి సంభ్రమ మంది ధర్మజుఁ గూర్చి పల్కెఁ గుమార నే
నింత యుక్తి గన కిట్లు వల్కితి నేమి సేయుదు లోకమం
దింత కెన్నఁడు లేని దియ్యది యెట్లు ధర్మము సెప్పుమా. 200

వ. అనినం గొండొక విచారించి యుధిష్ఠిరుండు తల్లి నాశ్వాసించి తమ్మునికి ట్లనియె.

తే. విజయ నీవు జయించి తివ్వెలఁది మున్న, నగ్నిసాక్షిగ నుద్వాహ మగుము నీవు
పృథివిఁ గలవార లెన్నఁగ విధివిధమున, ననుడు నర్జునుం డన్నకి ట్లనియె నపుడు.

మ. ఇది ధర్మంబునకు న్విరుద్ధ మగుఁ గాదే సన్నధర్మంబునం
దుఁ దగులొక్క నొనరించుటల్ దగును మాన్యుల్మెత్తురో దీనినిన్
మొదల న్నీవు వవలన్ వృకోదరుఁడు నేను న్వెన్క మాద్రేయులున్
బొదలం బెండిలియాడ నస్థలము నాబుద్ధి న్విచారించినన్. 203

వ. మఱియు మే మెల్లరము నీయాజ్ఞానువర్తులము నీవు ధర్మజ్ఞుండవు ధర్మంబు దప్పకుండ నరసి మనకును బాంచాలాదులకు యశస్కరం బగునట్లు గట్టడ సేయుము. 204

* ఒలుకుఁడు = చల్లుఁడు. ‡ విడి — క్రోధము లేక పరాక్రమము. పడిరో = పైఁబడిరో.

చ. అని వచియించు చున్నసమ♦యంబున నేవురిదృష్టి ద్రౌపదీ
వనజదళాక్షియందు నిలు♦వంబడి చిత్తము లుత్తలంపడన్
మనసిజతాపఖిన్ను లయి ♦ మానతి యుండిరి వారు తప్పద
వ్వనితకు భర్త లేవు రని ♦ వ్రాసిన దేవునిశాసనం బిలన్. 205

వ. అట్లందఱు నిందువదనయందు బద్ధానురాగులై యుంట యుధిష్ఠిరుం డెఱింగి వ్యాసవచనంబులు సంస్మరించుచు నన్యోన్యభేదంబు గలుగకుండం జేయ నెంచి తమ్ములదిక్కు మొగంబై. 206

క. పరమేష్ఠివినిర్మితియుం, గురువులశాసనము గల దగుటచే మన మే
వుర మిత్తరుణీమణినిం, బరిణయవిధిఁ బడఁతిఁ గాఁగఁ ♦ బడయుద మనియెన్.

వ. ఆవచనంబున కెల్లరును వల్లె యని సంతసిల్లి యుండి రయ్యవసరంబున. 208

మ. *బలభద్రుండును గృష్ణుఁడు న్వీడనిసం♦బంధంబునం జేసి లో
నొలవం బ్రేముడిఁ జూడ వచ్చి ప్రవరం♦బు ల్వల్కుచుం గుంతికిన్
దెలియ న్నయ్య మజాతశత్రునకు భ♦క్తిన్ మ్రొక్కియుం దక్కనుం
గలవార్మ్రొక్కఁగఁ గౌఁగిలించుకొని వే♦డ్క న్నేమ మాలించుచున్. 209

వ. సుఖోపవిష్టులై యున్నవారిం జూచి యుధిష్ఠిరుండు. 210

ఉ. †గిట్టనిధార్తరాష్ట్రులకుఁ ♦ గేవలపాపుల కింతదప్పఁగా
నెట్టుల యుంట లగ్గనుచు ♦ నెవ్వరెఱుంగనిభంగి నుంటి మే
మిట్టియెడన్ మముం దెలియ ♦ నెట్టులు చాలితి రీరు నావుడున్
నెట్టన నవ్వి కృష్ణుఁ డను ♦ నెయ్యము వియ్యము తియ్య మేర్పడన్. 211

ఉ. దాఁచిన నగ్నితేజ మది ♦ దాఁగనియట్టులు మీరు దాఁగ మీ
రాచరికంపురేవలు ప♦రాక్రమము న్వెలి గాక డాఁగునే
చూచితి మత్స్యయంత్ర మొక♦శూరుఁడ యే నటు లేయ శక్తుఁడే
నీచకృతాగ్నిదాహమున ♦ నెంజలి నేఁగితి రింక మే లగున్. 212

క. మీ రిపుడు గుహాంతరమునఁ, జేరినవహ్నులను బోలి ♦ చెన్నఱి యున్నం
దీరి వెలింగెద రింకం, గోరికలు ఫలించు మీకుఁ ♦ గురువరులారా. 213

---

* ప్రవరము = కులగోత్రాదికము. పెద్దలకు గురువులకు నభివాదనముచేయునప్పుడు గోత్రనామాదికం బెఱింగించుట శిష్టాచారము, శాస్త్రము.

† గిట్టని = అనుకూలింపని. నెట్టన = అనివార్యముగ. నెయ్యము = స్నేహము, ఇంపు. వియ్యము = చుట్టఱికము. తియ్యము = ప్రియవచనము, ప్రియము.

వ. *అని ముచ్చటించి మేము పోయివచ్చెద మని సెలవు పుచ్చుకొని వారు విచ్చేసి
రంత నట ద్రుపదుండు దన కల్లుం డయినవాఁ డెట్టివాఁడో యని విచారించి ర
మ్మని పనిచిన ధృష్టద్యుమ్నుం డొరు లెఱుంగకుండ వారివెనువెంట నాభార్గవ
నివేశనంబునకుం బోయి యట నొక్కచో నక్కియుండి తత్తద్విశేషాంశంబు
లెల్ల నరసి తండ్రికడకుం జనిన నతం డతని కిట్లనియె. 214

సీ. §అన్న మాచెలియ లెం ♦ దరిగె నెవ్వఁడు దానిఁ, గొనిపోయె నెగ్గతిఁ ♦ దనరియుండెఁ
గడజాతిశూద్రుండు ♦ గాని కరదుఁ డైన, కోమటి గాని కై ♦ కొనరు గద వె
యడుసుకాల్ నానెత్తిఁ ♦ బడదుగదా చిన్ని, మల్లెపూ విడముగా ♦ వల్లకాట
వాఁడు సవర్ణుఁడై ♦ వఱలువాఁడా లేక, యుద్రిక్తవర్ణుఁడై ♦ యొప్పువాఁడ
ఆ. పురుషసింహుఁ డైన ♦ నరునితో సంబంధ, మంద నేను బేర్మిఁ ♦ గందు నొక్కొ
పాండురాజసుతులు ♦ బ్రతికియుండిరో కన్నెఁ, గొన్నవాఁ డెవండొ ♦ కొడుక చెపుము.

## వైవాహికపర్వము.

వ. అని యడిగినఁ గొడుకు తండ్రి కిట్లనియె. 216

సీ. ‡నరనాథ వినుము వా ♦ రిరువురుఁ గృష్ణతో, నిర వేగి యొకయవ్వ ♦ కెఱుఁగఁ జేసి
రామె వారిజనిత్రి ♦ యని తోఁచె నట మఱిఁ, గలరు మూవురు సోద ♦ రులును బోలె
నవల నెల్లరు భిక్ష ♦ కరిగి తెచ్చినదాని, నవ్వాపంపునఁ గృష్ణ ♦ యతిథుల కిడె
సాఁబా లొకఁడు కడ ♦ సా మెల్లరును దిని, శయనించి రిల దర్భ ♦ శయనములను
ఆ. కథలు సెప్పుకొనిరి ♦ రథగజాశ్వాదులఁ, గూర్చి యస్త్రశస్త్ర ♦ ఘోరయుద్ధ
ములనుగూర్చి దానఁ ♦ దెలియు నత్యుత్తమ, క్షత్రియాన్వవాయ ♦ జాతు లనుచు.

ఉ. ఆయతలోహితాక్షుఁ డొకఁ ♦ డగ్నిలిఁ గార్ముక మెక్కు వెట్టి యం
త్రాయితమత్స్య మేసి భుజ ♦ దర్పము పేర్పడఁ గర్ణునోర్చె నా
పై యముఁడో యనంగఁ దగు ♦ వాఁ డొకఁ డుర్విజ మూని శల్యునిన్
బాయఁగఁ జేసి గెల్చె నని ♦ వారల నీవు నెఱుంగుదే కదా. 218

మ. మనకోర్కుల్ ఫలియించెఁ బాండవులు భీ ♦ మం బైనదావానలం
బునకుం దప్పి మెలంగుచుండి రనుచున్ ♦ భూభాగమం దెందు నే
వినుటంబట్టియు యంత్రి మేసి కడిమి ♦ న్వ్రేల్గొందుటం బట్టియున్
ఘనవాగ్జాలముఁ బట్టియుం దెలియ నౌఁ ♦ గౌంతేయు లంచు న్మదిన్. 219

* నక్కి = ఒదిగి. § కరదుఁడు = కప్పమిచ్చువాఁడు. అడుసుకాల్ నానెత్తిఁబడదుగదా = అనఁగా హీనుఁడు నా కల్లుఁడై యపఖ్యాతిరాలేదుగదా యని యభిప్రాయము. శ్లో. కచ్చిన్నశూద్రేణ నహీనజేన, వైశ్యేనవా. కరదేనోపపన్నా। కచ్చిత్పదంమూర్ధ్నినపంకదిగ్ధం, క్వచిన్నమాలా పతితా శ్మశానే. సవర్ణుఁడు = కులీనుఁడు. ఉద్రిక్తము = ఉద్రేకించినది. ‡ జనిత్రి = తల్లి.

వ. అనినం బరమానందభరితాంతరంగుం డై ద్రుపదుండు మఱియు వారి నెఱుంగం గోరి తనపురోహితుని రావించి పంచుటయు నతం డటం జని వారిం గాంచి తన్నెఱింగించి యి ట్లనియె. 220

ద్రుపదుండు పాండవులం దనయింటికి బిలిపించుకొనుట.

మ.*కులగోత్రంబు లెఱుంగ వేఁడి మిముఁ గన్గొ నెంచి నన్ బుచ్చె భూ
తలనాథుం డెవరయ్య మీరు జతుసంస్థాయంబునం బాండవే
యులు ఘోరాగ్నికిఁ దప్పి రంచు వినిన ట్లూహింతు మే మింతయుం
దెలియం జెప్పి కుతూహలార్ణవమునం దేలింపుఁడీ సోమకున్. 221

తే. ద్రుపదునకుఁ బాండుభూపతి దొడ్డసఖుఁడు
వానికోడలిఁ గాఁ దన కైనకూఁతు
నరుని కిడుకోర్కి యగు నది జరగెనేని
హితము పుణ్యము సుకృత మం చెంచు నతఁడు. 222

మ. అని వాక్రుచ్చుచు నిల్చి యున్నయతనిన్ హర్షంబునం ధర్మనం
దనుఁ డీక్షించి సమీపవర్తి యగువాత్రప్రోచ్ఛవుం బిల్చి యీ
యనఘుం డాద్రుపదప్రియుం డితని కర్ఘ్యం బిచ్చి పూజింపు మ
న్న నతం డా సని పూజ చేసె మిగులన్ భక్తిం బ్రదర్శింపుచున్. 223

వ. అట్లు పూజితుం డై సుఖాసీనుం డై యున్నద్రుపదపురోహితుఁ జూచి యుధిష్ఠిరుం డి ట్లనియె. 224

క. మ మ్మెఱుఁగ నేమి సేసెదు, నమ్మనుజేశ్వరుఁడు మత్స్యయంత్ర మ్మేయన్
సమ్మతి సుత నిచ్చెద ననె, సొ మ్మయ్యెను మాకు దాన సుదతి యిఁ కేలో.

క. కులగోత్రంబు లెఱింగెదు, తలఁ పేటికిఁ బుట్టె ద్రుపదధరణీంద్రునకున్
ఫల మేమి దాన నింతయు, దెలియఁడు పో తనదుప్రతిన తె న్నెఱుఁగఁ డొకో.

వ. అని మఱియును. 227

ఆ. కులము గుణము లేని బలహీనుఁ డకృతాస్త్రుఁ, డట్టివిల్లు దివిచి యంత్ర మేయఁ
గలఁడె యొరుఁడు నరుఁడు గాన మీరాజు స, ఫలమనోరథుండు తెలియ నేల.

వ. అనిన విని పురోహితుం డరిగి ద్రుపదున కెఱింగించిన నతండును. 229

సీ. పలువిధంబులరథంబుల నిచ్చి తనసుతుఁ, బాండవులం దేరఁ బంచుటయును
వారు రాజోచితభూరిరత్నరథంబు, లెక్కి ద్రుపదునింటి కేగుదెంచి

* జతుసంస్థాయము = లక్కయిల్లు.

*కానుక ల్వట్టిన ♦ కలవస్తువులలోన, సాంగ్రామికంబులు ♦ సంతరించి
చదురునఁ దమజాతి ♦ కొదవునాసనముల, నాసీను లైరి వి♦లాస మొప్పఁ
తే. కప్పడంబులుఁ గోలలుఁ ♦ గడవసములుఁ, గలుగువారిని ద్రుపదుండు ♦ గాంచి వారి
రాజలక్షణముల నెంచి ♦ రాజపుత్త్రులనుచుఁ గడు సంతసించుచు ♦ ననియె నిట్లు.
చ. నరవరులార మీరు సుగు♦ణప్రథితప్రబలప్రభావు లు
త్తరులరు మీప్రవర్తనవి♦ధం బరయ న్మరి సందియం బగున్
ధరణిసుపర్వులట్లు వసు♦ధం దిరుగాడెడు దేవముఖ్యులో
నరపతివంశజాతులరొ ♦ నాకు నెఱుంగ వచింపుఁడీ దయన్. 231
ఆ. నిజము వలుకరయ్య ♦ ద్విజకులోత్తములార, మీరు కృష్ణకొఱకుఁ ♦ గోరి యిట్లు
ధరణిఁ బొడమినట్టి ♦ దైవతంబుల యేమొ, విని వివాహకరణ♦మును బొనర్తు. 232
క. నాభాగధేయ మెంతయు, శోభావహ మయ్యె నిపుడు ♦ చూడం జూడం
బ్రాభవ మెచ్చెను మీరు మ,హాభాగులు నాదుభావ ♦ మలరింపుఁ డిటన్. 233
మ. అని ప్రార్థించిన ధర్మరాజు కరుణా♦యత్తైకచిత్తంబునన్
జననాథాగ్రణి వైమనస్యమునకుం ♦ జర్చింప నీ కింత యేఁ
బని పే దేటికిఁ దాఁప క్షత్త్రియుల మా♦పాండుక్ష్మాజానికి
న్ననరుం గూర్చెనునట్టిపుత్త్రుల మిట ♦ న్నిక్కంబు వాక్రుచ్చితిన్. 234
ఆ. ఏ యుధిష్ఠిరుండ ♦ నితఁడు భీముఁ డితండు, నరుఁడు వీరు కవలు ♦ నగరిలోని
కరిగినట్టితల్లి ♦ యగును గుంతీదేవి, యనుచుఁ దమ్మెఱుంగ ♦ నానతిచ్చె. 235
క. మాకుం గురుఁడవు నీ వికఁ, నీ కల్లుర మైతి మే మ♦నింద్యచరిత్రా
నీకోరిక సిద్ధించెను, బోకార్పుము చింత లెల్లఁ ♦ బూర్ణప్రజ్ఞా. 236
వ. అని తెలియం జెప్పుటయు. 237
చ. ‡ద్రుపదుఁడు హర్షబాష్పములు ♦ దొప్పలుదొరలు రాలఁ గౌతుక
వ్యపగతసంజ్ఞుఁడై తగి ర♦వంతన తెప్పిలి వారిఁ గౌఁగిటం
గృపఁ గదియించి గద్గదిక ♦ మెచ్చఁగ నిట్టటు మాటలాడుచున్
దపనునిదిక్కు మ్రొక్కుచును ♦ దట్టుచు చేతులు నెట్టకేలకున్. 238
వ. నాభాగ్యవశంబునం జేసి లక్కయింటఁ జిచ్చునం జొచ్చి వచ్చినమిమ్ముఁ జూడఁ
గంటిఁ గృతార్థుండ నైతి నని సంతసించి కుంతికి నమస్కరించి వచ్చి సర్వవృత్తాం

---

* కలవస్తువులు = ఉన్నవస్తువులు. సాంగ్రామికంబులు = యుద్ధసంబంధమైనవి. సంతరించి = సంగ్రహించి. కప్పడంబులు = చినిఁగినవస్త్రములు. కోలలు = దండములు. కడవసములు = తోళ్లు.

‡ అత్యంతసంతోషమునం దిట్లు పిచ్చిచేష్టలు చేయుట స్వభావసిద్ధము.

తంబును విని వారి నాదరించి బంధుజనసమక్షంబున నిట్లనియె. 239

క. శుభలగ్నంబున నర్జునుఁ, డభినవమన్మథుఁడు దా స్వయంవరలబ్ధన్
శుభచరితన్ ద్రౌపది నతివిభవంబునఁ బెండ్లియాడు విధివిహితముగన్. 240

వ. అనుడు ధర్మరాజేను బెండ్లియాడిన వెనుక భీమసేనుండు నవల నర్జునుండు నంత నకులసహదేవులును బెండ్లియాడ వలయుం గాని తొలుత నర్జునుం డెట్లు పెండ్లియాడు ననిన ద్రుపదుండును. 241

క.*ఇది లెస్స ధర్మమార్గం, బది పోకడపెట్టవలయు నసనాదుహితన్
న్ముదమున నీవ గ్రహింపుము, సదయులు మీ రెవ్వరైన సమ్మత మగుటన్. 242

వ. అనిన నతం డట్లని నేనొక్కరుండ కా దిక్కన్య మే మేవురము బెండ్లియాడుదు మిది మాపరదేవతానియోగం బలంఘ్యం బనిన నివ్వెఱపడి ద్రుపదుండు వెండియును. 243

చ. ఒకనికి నెందఱేని సతు లుండుట గల్గును శాస్త్రదృష్ట వా
నొక్క తెకుఁ బెక్కురైనపతు లుండుట గల్గదు నీవు లోకవై
దికపరధర్మమహాపుఁడవు దీన నధర్మము సేత పాడియే
సకల మెఱింగియు స్మృతి విచారము సేయుము లోక మొప్పఁగన్. 244

వ. ఇది యశ్రుతపూర్వంబు దీని మనమందఱమును గలసి నేఁ డెల్లి విచారించి నిర్ణయింత మను నంతలోన. 245

ద్రుపదునికడకు వ్యాసమహాముని వచ్చుట.

మ. తతమధ్యందినతీక్ష్ణభానుకరసంతప్తోష్ణకాలాధ్వగో
న్నతసంతాపనివారకం బగుచుఁ గాంతం బొల్చుకాలాబ్దమో
ప్రతిభం బెందెను నాఁగ సంశయపరిభ్రాంతాత్ములన్ వారిఁ దే
ర్చుతమి న్వచ్చెను బాదరాయణుఁడు సంశుద్ధాత్ముఁ డచ్చోటికిన్. 246

వ. ఇట్లు వచ్చిన నమ్మునికి నెల్లరునుం బ్రత్యుత్థానాభివందనాదు లాచరించి సుఖాసనాసీనుం జేసి యప్పు డప్పాంచాలుండు కృతాంజలి యై యిట్లనియె. 247

చ. తననుడి యెల్లలోకముల ధర్మువు శాస్త్రము నట్టిధర్మనం
దనుఁ డితఁ డిప్పు డాకొమరితం దమ రేవురుఁ బెండ్లియాడఁగాఁ
జను నను నెందునే నొకతపస్వికిఁ బెక్కురు భర్తలుండుటల్
గన మిది శాస్త్రదూష్యమటు గన్గను మీ రిది తీర్చి ప్రోవరే. 248

వ. అనినం గృష్ణద్వైపాయనుం డింక మీమీయభిప్రాయంబు లెఱుంగ నభిలషించుచున్నవాఁడం జెప్పుఁ డనిన ద్రుపదుండు వెండియు. 249

* పోకడపెట్టవలయు ననఁగా — పోఁగొట్టు మని నేను చెప్పను.

తే. ఇది యధర్మము లోకమం । దెవ్వ రాచ,రించినది గాదు శాస్త్రమం । దెంచి యున్న
యదియుఁ గాదు విరుద్ధ మం । చంతరాత్మ, నెంచుచుంటి నే నిటు సంశ । యించుచుంటి.

వ. ధృష్టద్యుమ్నుం డి ట్లనియె. 251

తే. అన్న తమ్మునిభార్యను । సంటు టరయ, సత్ప్రవర్తన మన రాదు । జగతి ధర్మ
సూక్ష్మగతి యె ట్లగునో కాని । చూడఁ గృష్ణ, యెదుగురిభార్య కాఁ గూడ । దని తలంతు.

చ. అనవుడు ధర్మజుం డనియె । నార్య మదుక్త మధర్మ మై విసం
దరున తొల్లిటం జటిల । నాఁబడుగౌతమి కోరి యేడ్వురన్
మునులను బెండ్లియాడె నటు । పొందెఁ బ్రచేతసులం బదుండ్రను
న్మునిసుత వార్క్షి యన్ సతి య । పూర్వము గాదు పురాణ మి ట్లగున్. 253

వ. ఇదియునుం గాక. 254

ఆ. ధరణి గురులవాక్య । ధర్మశాస్త్రము గాదె, గురుల కెల్ల నేఁటి । గురువు తల్లి
తల్లి యనినమాట । దాఁట నోపము గీని, భిక్ష నోలె ననుభ । వింపుఁ డనియె. 255

వ. అది యట్టిద కావున నే నిది పరమధర్మం బని తలంచుచున్నవాఁడ ననినఁ గుంతి
యి ట్లనియె. 256

క. కనుఁగొని ధర్మంపుఁదెఱం,గునఁ జెప్పె యుధిష్ఠిరుండు । గురుమతి నటు లా
ననృతముగ నాకు భయ మగు, ఘన మై నే దానినుండి । కడవన్ వలదే. 257

వ. అనిన వ్యాసభట్టారకుండు ద్రుపదుం జూచి యి ట్లనియె. 258

తే. ఏది సనాతనధర్మ మె । య్యది హితంబొ, దానినే కాని పలుకఁడీ । ధర్మతనయుఁ
డిత్రఁడు నీయమ పలికిన । యుట్టిపలుకు, లెన్నఁడు నసత్యమును బొంద । విది నిజంబు.

వ. రాజా దేవ నీకుం గలసందియంబుఁ దీర్చెద నిమ్మని యెల్లరు నంద నిరీక్షించు
చుండుఁ డని నియమించి ద్రుపదునితో లేచి యొండొక్క యేకాంతం బోయి నీకూఁతు
పూర్వజన్మవృత్తాంతంబు విను మని యి ట్లనియె. 260

వేదవ్యాసుఁడు పంచేంద్రోపాఖ్యానము చెప్పుట.

సీ. ఇంద్రసేన యనంగ । నెసఁగెడుసతి తొల్లి, మౌద్గల్యుఁ డనుమౌని । మగువ యగుచు
ఘనకర్మవశమునఁ । గాంచె భర్త కుష్ఠరో,గావృతుం డై వికృ । తాంగుఁ డైన
నేవగింపక వాని । యెంగిలిఁ గుడుచుచు, సేవించుచుండెను । జీవితేశుఁ
డలరి నీకిష్ట మే । మనుగు మిచ్చెద ననఁ, నామె యి ట్లను నాకుఁ । గామభోగ

తే. తృప్తి దీఱదు నీ వేను । తీరు లగుచు, సుందరాకృతి ననుఁ బొందఁ । జూడు మనుచు
నత్రఁడు దనతపశ్శక్తి న । ట్లగుచుఁ బెద్ద,తడవు రమియించె దానితోఁ । దనివి గలుగ.

వ. అంత మౌద్గల్యుండు నత్యంతవైరాగ్యమ్మునం జేసి యమ్మించుఁబోఁడిం బరిత్యజించి మహోన్నతవ్రతంబుఁ బూని తపింపం బోయె నంత. 262

సీ. ఇంద్రసేనయు భోగతృప్తిఁ గానమిఁ గుంది, పరమేశ్వరుని లోన భక్తి నిలిపి
నిత్యసత్యవ్రతనిష్ఠాగరిష్ఠ యై, జీవితేశ్వరుఁ గోరి చేసెఁ దపము
ప్రత్యక్షమగు నీశుఁ బతిదాన మిమ్మని, యేనుమాఱులు గోర నీశ్వరుండు
కాంతరో నీకు జన్మాంతరంబునయందు, నగుదురు పతు లేగు రధికబలులు

తే. వారు దేవాంశభవులు నీకోరికలను, దీర్పం జాలువారును భూరితేజు
లనుచు నానతి యిచ్చిన వనజముఖియు, నబ్బురం బంది హరునకు ననియె నిట్లు.

క. సతి కేవురు పతు లగుటది, కతలం బెట లేదె దైవ గలిగెను గానం
బతిభక్తియు ధర్మమునుం, గతి దప్పనియట్లు నాకుఁ గరుణింపఁ గదే. 264

వ. అనిన నట్ల యగుం గాత మని వరం బొసంగి హరుం డప్పుడ పోయి నుపగంగాతీరంబున నున్న పురందరుం దోడితెమ్మని చెప్పఁ జెప్పిన నప్పడఁతి మృడునకుం బ్రదక్షిణంబు చేసి యటఁ జని వారి నన్వేషించుచుండె నంత నైమిశారణ్యంబున. 265

మ. శమనుం డధ్వరదీక్షితుం డయి మహాశాంతిం బ్రజాకోటిఁ జం
పమి నీమర్త్యు లమర్త్యులైనఁ గని సైఁపన్ లేక దేవళ్లు దా
రమరజ్యేష్ఠునిపాలి కేగి మొఱ సేయంగా నతం డయ్యుదం
తము నాలించి మఖాంతమందు యముఁడే తత్కార్యముం దీర్చెడున్. 266

క. యమవాయువాసవాశ్విను,లమహాంశములన్ ధరాతలంబునఁ బురుషో
త్తము లేవురై పరిపాలిన్, సమయింప నొసర్తు రడలఁ జన దిఁక మీకున్. 267

వ. అనిన నూరడిల్లి వా రెల్లరును యమసత్రసదనంబునకుం జని రప్పు డింద్రుండు మందాకినీసమీపంబున మార్గగమనంబు సేయుచుండి జలమధ్యంబున నిజాశ్రుబిందుపాతంబునం గాంచనకమలంబులం బుట్టించుచు నేడ్చుచున్ననాలాయని దైనయింద్రసేనం జూచి సమీపించి నివ్వెఱపడి నీ వెవ్వరిదాన వేల యేడ్చెద వే నింద్రుండ నిన్నుఁ గామించితి ననిన నమ్మించుఁబోఁడి వాని కిట్లనియె. 268

క. నామొఱ్ఱ వినియు నన్నుం, గామించి భరింపబుద్ధిఁ గలదేని సురే
శా! మాఱాడక నాతో, రా మతి సేయుమి యనన్ సురప్రభుఁ డంతన్. 269

వ. వల్లె యని దానిపిఱుందం జనువాఁడు ముందట సుందరగిరిరాజకందరముఖంబునం దరుణీమణితోఁ బాచికలాడునొక్కతరుణుం గని కనలుచు. 270

మ. త్రిజగన్నాథుఁడ నేను సర్వమును నాదివ్యప్రభావంబునన్
వృజినంబుం బెడఁబాసి భాసిలెను దేవేంద్రుండ నన్నానకీ

రజతాద్రీంద్రమునందు గద్దెపయి గర్వం బంది గౌరీ యనన్
గజచర్మాంబరుఁ డఱ్ఱు సాఁచి కనియెం గన్నెఱ్ఱగా నంతటన్. 271

సీ.*తిగకంటిచూపునఁ దెరలంగఁ బడునింద్రుఁ, డెగి కన్యచేఁ బట్టి తేరఁ బంచి
హరుఁ డను నోరి యీగిరిగహ్వరము తెర్చి, చొరి రమ్ము నా హరి చొచ్చి యందుఁ
దనరూపు గలకాంతిఘనుల నలువురఁ గాంచి, నివ్వెఱపడియున్న నవ్విభవుఁడు
వీరు నీకో యనువారె పో నినుఁబోలె, గర్వింప నీగుహఁ గట్టినాఁడ

తే. వీర్యగర్వాలు మీ రెల్ల వెడలి మనుజ,యోనిఁ బుట్టి సపత్నులఁ బూని చంపి
రండు మీకేవురకు నిది రమణి యగుత,మనుచుఁ బంచెను దేవకార్యంబుపొంటె.

వ. అని శపించిన విశ్వభుక్కు భూతధాముఁడు శిబి శాంతి తేజస్వి యనున య్యేవు రింద్రులును మేము ధర్మానిలశక్రాశ్విసుల తేజంబు లవధరించి భూతలంబునం బుట్టెద మ ట్లనుగ్రహింపు మని నతం డట్లవుం గాత మని పలికి తాను వారలం గూడి పురాణపూరుషుం డనంతుం డజరుం డగు నారాయణుని కడకుం బోయె నతండును వారి నందఱ నట్లుగా నిర్దేశించి తనశిరంబునుండి సితాసితంబు లగు రెండు కేశంబులఁ దీసి యిచ్చె వానివలన రోహిణీదేవకులకు రామకృష్ణులనం బుట్టి రంత నింద్రులును యుధిష్ఠిరభీమార్జుననకులసహదేవు లనం బుట్టిరి శ్రీదేవి యయిననాలాయని యాజ్ఞసేని యై నీయజ్ఞవేదియందు వారి భార్య యై తనమేనివాసన క్రోసుదూరంబు వ్యాపింపం బుట్టె నిదె పూర్వదివ్యదేహంబులతో నున్నవీరిం జూడు మని దివ్యర్షి తెల్లజుండు దివ్యదృష్టి నొసంగిన ద్రుపదుండును. 273

ఉ. భూషణభూషితాంగములు భూరితరోన్నతదివ్యదేహముల్
రోషపరీవృతేక్షణములుం గలవేల్పుల నేవురన్ రమా
వేషముఁ దాల్చి వారికడ వెల్గుసతిం గని విస్మయంబు సం
తోషము సంభ్రమంబు గొని త్రుళ్లి పడెన్ మునిపాదపీఠకన్. 274

వ. కృష్ణద్వైపాయనుండును వాని లేవ నెత్తి కూరుచుండం బెట్టి పాంచాలా యిది యిట్టిద కాన నీ పాంచాలిం బాండవేయుల కిచ్చి పాణిగ్రహణంబు సేయింపు మిది దైవాధిష్ఠితం బని చెప్పి యొప్పించి వానితో నెప్పటిచోటికి వచ్చి ధర్మజున కి ట్లనియె. 275

ఆ. పుణ్యదినము నేఁడు పూర్ణచంద్రుఁడు పౌష్య
యోగయుక్తుఁ డయ్యె నుచితవిధుల

* తెరలంగఁబడు = కలఁగఁబడు. తెర్చు = తెరవఁజేయు.

యాజ్ఞసేనిఁ బెండ్లి • యగుఁడు మీ రేవురుఁ
గ్రమ మెసంగఁ గౌతుకము వొసంగ. 276

వ. అంతఁ బాంచాలాధీశ్వరుండును గరం బనురాగంబునఁ బురం బలంకరింపం జాటుటయును. 277

ద్రౌపదీవివాహమహోత్సవము.

సీ.*అంతరాంతరముల • నారాజమార్గంబు, నలువుగా సమ్మార్జనంబు సేసి
సలుకెలంకులయందుఁ • జలువ లీనఁగఁ జాలు,పన్నీటఁ గలయంపి • పరఁగఁ జల్లి
యాచతుష్పథముల • నరుఁగులు కస్తూరి, నిస్తుగా గోముఖ • శ్రీ నొనర్చి
కనులపండువు గాఁగఁ • గవఁబడఁగాఁ బండు, ముత్యాలపొత్రవుల • ముగ్గు వెట్టి
తే.‡మేలురత్నాలతోరణా • లోలిఁ గట్టి, పట్టుపవలుగ రే యెల్ల • నట్టె మాఱ
నన్ని దిక్కుల యంత్రదీ • పాళిఁ గట్టి, పురముఁ గైసేసి రెల్లెడ • ముదము గదుర. 278

తే. పల్లకీ లందలంబులు • భద్రకరులు, తేరు లశ్వంబు లుష్ట్రముల్ • వీరభటులు
దారులఁ గ్రందడింపఁగఁ • దేరిపురము, పట్టఁ బగ్గము లేకుండఁ • బరఁగె నపుడు.

వ. పదంపడి ముదంపడి ద్రుపదవసుంధరాధురంధరుండు పురోహితమంత్రిసామంతాదులమంతనంబునఁ దోరణస్తంభాయమానశాతకుంభరంభాకుంభినీరుహసంభృతంబును నిఖిలమణిగణఖచితకనకకలశాదిదివ్యప్రభాభాసమానంబును బాణిపీడనక్రియారంభసంభారసంభ్రమత్పురోహితప్రముఖనిఖిలజనకలకలరవాలంకృతంబును నగునొక్కరమణీయభద్రోదవసితాభ్యంతరంబున మాణిక్యకలితస్వర్ణపరిణయమంటపంబున నుచితవస్తుపరికరపరిపూర్ణంబు గావించి పుంభానుపుంఖశంఖమృదంగభేరీపటహకాహళఢక్కాద్యఖిలతూర్యనిక్వాణంబులు రాణ తెసంగఁ గల్పితానల్పసంతోషకలితరాజలోకంబుల కోలాహలంబులు వొసంగ వధూవరులకు మంగళాభిషేకంబు లొనరించి భూసురాశీర్వాదనాదంబుతో రోదసీకుహరంబు నిండ సాలంకృతు లగువారి మణిగణఖచితకౌతుకపీఠికాతలంబున నాసీనులం జేసి బ్రహ్మసదృశుం డగు నామ్యుండు పురోహితుండై పుణ్యాహవాచనాదిసంస్కారప్రముఖవిధ్యుక్తక్రమక్రియాప్రయోగంబు సలుపుచుండ శుభముహూర్తంబునం గ్రమక్రమంబున యథావిభవవిస్తారంబుగా నర్చించి మధుపర్కంబొసంగి పితృదేవతాప్రీతికరంబుగా ధారవోసి సాలంకృత కన్యాదానంబు చేయుటయును బాండవేయులు ననుక్రమంబుగా ద్రౌపదీపాణిగ్రహణం బొనరించి రనంతరంబ.

తే. వరులు పాణిగ్రహణవిధి • జరపునపుడు, మరుఁడు మున్నేయ నోఁ దూపు • పరఁగుచున్న
ములుకు లెల్లను వెలికి రాఁ • దలలు సూపె, ననఁగఁ బులకాంకురంబులు • దనరెఁ జెలికి.

* గోముఖము = అలుకుట. ‡ దీనియందలిదీపములు పూర్వకాలమునందు నుండె నని తెలుపుచున్నది.

క. తెరచీర లెత్త నైదువ, లిరువురు మోములను జూచి • రింపుగఁ దలఁబ్రాల్
శిరముల నిడికొని రంతట, వరు లామెకుఁ దాలి బొట్లు • వగఁ గట్టి రొగిన్. 282

క. సతిపతు లప్పుడు దగ నా,హుతులన్ వేల్చి రరుణార్చి•హుతభుఙ్ముఖమం
దతులితపలాశశాఖా,తతులన్ దధిలాజలన్ ఘృ•తంబున నంతన్. 233

క. జాయాపతులకు బంధువు, లాయా దేశాధినాథు • లధికాంబరభూ
షాయోపాదికవస్తువు, లాయా పెళ్లిఁ జదివించి • రటఁ గిట్నముగన్. 284

క. కృతదాసు లైనపాండు,క్షితినాథాత్మజుల కనిచెఁ • గృష్ణుండు మహో
న్నతమణిమయభూషాతతు, లతులితవస్త్రాశ్వముఖము • లగువస్తువులన్. 285

వ. ఇట్లు గుహ్యోక్తక్రమంబున వేఱువేఱ నేవురకు వివాహంబులు నిర్వర్తించి పాంచాలుం డల్లురకుం గూఁతునకు ననేకమణిభూషణంబులును జీనిచీనాంబరంబులును బరిమ్ములు వాహనమ్ములు రథమ్ములు లోనగునానావిధవస్తుసముదయంబరణంబుగా నిచ్చి భూసురాదులకు సంపూర్ణదక్షిణ లొసంగి పాండవసంబంధంబునం జేసి భయంబు దక్కి సంతోషార్ణవంబునం దేలుచుండె నప్పుడు. 286

చ. కొడుకులుఁ గోడలుం దన క•కుంఠితభక్తిని మ్రొక్కినం గడుం
గడు ముద మందె కుంతి బిగి•కౌఁగిట నెల్లర గ్రుచ్చి యెత్తి నా
కొడుకులు శత్రులం గెలిచి • కోడలితోఁ గురుజాంగలంబునన్
గడుకొని పట్టభద్రు లయి • కౌతుక మందుచు నుండ్రు గావుతన్. 287

వ. అని కోడలిదిక్కు మొగంబై. 283

ఉ. పూవులఁ దావివోలె నిజ•పూరుషపంచకమందు భక్తిమై
నీవు మెలంగుచున్ విడక • నిచ్చలు మచ్చిక మీఱ రాజసూ
యావభృథాతిపూతతను•వై ఘనవైభవ మంది పొందుగన్
బావనమూర్తులన్ సుతులఁ • బల్వురఁ గాంచి తలిర్పు మమ్మరో. 289

తే. అఖిలభూమండలాధిపుఁ • డైనమగని,తోడ రాజ్యాభిషేక మీ • వాడి వాజి
మేధమున ధర్మపత్నివై •సాధుజనులఁ, బ్రోచుచు సుఖంపు నూఱేండ్లు•రాచతేవ.

వ. అని మఱియు ననేకవిధంబుల నాశీర్వదించె నంత. 291

మత్తకోకిలము.*అల్లనం జగ మేలుపాండవు • లల్లురై తనయింటిలో
నల్లటంబుగ నుంటఁ జేసి మ•హీశ్వరుం డగుసోమకుం
డెల్లభూపతికోట్ల కైన సు•రేశ్వరాదుల కైనఁ దా
నొల్లఁబోవక రాజ్యవైభవ • మొప్ప నొప్పెసఁగెం గడున్. 292

* సోమకుండు = సౌమకి యని కొన్నిప్రతులయం దున్నది.

ఆ.*ఇట్లు పాండవేయు ♦ లెంతయు ముదమున, వెలఁదిమిన్నఁ గృష్ణఁ ♦ బెండ్లియాడి
శ్వశురగృహమునందు ♦ విశదవైభవమున, మెలఁగుచుండి రెల్ల ♦ రెలమి నొంది.
వ. అనిన విని నైమిశారణ్యవాసు లవ్వలివృత్తాంతంబు సెప్పు మని సూతు నడుగు
టయును. 294

ఆశ్వాసాంతము.

మ. నను సృష్టించిన బ్రహ్మకైనఁ దలఁకన్ ♦ నల్కాంతయు న్నెమ్మన
మ్మున నాచేసినకర్మలేశముసకే ♦ ప్డున్ జంకుదుం గాని స
న్మునిలోకస్తుత నీవు తద్గతులకు ♦ న్మూలంబ వౌట న్భయం
బున భక్తిన్ భజియింతు నిన్ను సతతం ♦ బు న్నన్ను రక్షింపవే.

గద్యము.

ఇది శ్రీమదఘనాతనోభయకవిమిత్రి వేంకటయజ్వాగ్రిపుత్ర
సమారాధితవిబుధరాజ శ్రీపాదకృష్ణమూర్తి కవిరాజ
ప్రణీతం బయిన శ్రీకృష్ణభారతంబునం
దాదిపర్వంబున నవమాశ్వాసము.

శ్రీ. శ్రీ. శ్రీ.



* విశదము = స్పష్టమైనది.

శ్రీ

శ్రీబాలాత్రిపురసుందర్యై నమః.

# శ్రీకృష్ణభారతము

## ఆదిపర్వము—దశమాశ్వాసము.

### విదురాగమనపర్వము.



పారాశర్యవచో
వ్యాపకవః భారతేతిహాసస్తుతి ని
త్యాపాదనాదికేష్ట
వ్యాపారసమేతి లోక•వారాతీతా. 1

వ. అక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లనియె నట్లు మహావైభవంబున వైవాహితు లయినపాండవేయు లాద్రుపదునింట నున్నసమయంబున దేశాధీశ్వరు లెల్లను నాప్తు లగుచారులవలన సర్వవృత్తాంతం బంతయు నెఱింగి పరమాశ్చర్యభరితాంతరంగు లై. 2

మ.* విలు మోపెట్టి విసారయంత్రముఁ దెగన్ • వేయంగఁ బాంచాలిసే
లలిఁ జేపట్టినవాఁడు పార్థుఁ డఁట కేల్ • వృక్షముం బూని రా
జుల నోడించినవాఁడు భీముఁ డఁట మేల్ • సూపట్టెడిం బాండుపు
త్త్రులు లాక్షాగృహమందుఁ జచ్చి రన నై • శోప్పోడ నిట్లొప్పటన్. 3

ఉ.§ చిచ్చునఁ దెళ్ళ నేయుటకుఁ • జేసినచేఁతలు మెచ్చెఁ జీకురా
జచ్చ నతండు పుత్త్రునకు • నెచ్చినక్రూరుఁ డెఱింగి యింతయున్
నొచ్చుకొనంగఁ బోక కృపణుం డన నైనసదీసుతుండునున్
నిచ్చలు నిందకర్హు లని • నీతివిదుల్ తలపోయుచుందురే. 4

పాండవులు బ్రదికియుండి రని విని కౌరవులు చింతించుట.

వ. అని ప్రశంసించుకొనుచు నిండ్లకుం జని రంత దుర్యోధనుండును విమనస్కుం డై కర్ణాశ్వత్థామశకునికృపాదులతో మరలి వచ్చుచుం బాండవులు బ్రదికియుండి రనుట

* విసారయంత్రము = మత్స్యయంత్రము.

§ చీకురాజు = గ్రుడ్డిరాజు, ధృతరాష్ట్రుఁడు. నొచ్చుకొను = పశ్చాత్తాపపడు.

కత్యంతదుఃఖంబు నొంది కుందుచుఁ బురోచను నిందించుచు హస్తినాపురంబుఁ
జేరె నంత విదురుండును బాండవులద్రౌపదీకళ్యాణాభ్యుదయంబు విని కరంబు
సంతసించుచు ధృతరాష్ట్రునికడకుం జని. 5

చ.*కురుకులనాథ నీసుతులు • కోరిక లిరిక లెత్త నిత్తఱిన్
గగ మభివృద్ధి నొంది కుతు•కంబున నుండిరి నాఁగ నంబికా
వరసుతుఁ డుత్సుకుం డగుచు • వారిజలోచన కృష్ణ దా స్వయం
వరమున నాత్మనందనుని • వాసి వరించె నటంచు నెంచుచున్. 6

క. మేలిమిబంగరుసొమ్ము, ల్వేలకు వే ల్వెట్టి లోక•విఖ్యాతయశుం
డై లలిఁ జనుపతితోఁ బాం, చాలిం దోతెమ్ము నాదు•సముఖమ్మనకున్. 7

వ. అని యాజ్ఞాపించిన విదురుండు వెండియు. 8

చ. సుతులు సుయోధనాదు లని • చూచుచు నుంటివ యేమొ కాదు స
న్నుతమతు లైనపాండవు ల•నూనమహత్త్వముతో స్వయంవర
క్షితిఁ బాలుపొంది సర్వజన•సేవితు లై ద్రుపదాత్మజాసమ
న్వితు లయి చూడ నొప్పి రని • వింటి నరేశ్వర నేఁడు వేడుకన్. 9

వ. అని చెప్పిన నతం డంతరంగంబున సంతాపించుచు నతని కిట్లనియె. 10

ఆ. నాదుపుత్త్రు లెట్లొ • నాదుతమ్మునిపుత్త్రు, లట్ల నాకు బుద్ధి • యగును గానఁ
బలికినాఁడ నిట్లు • తెలియక కా దని, మఱియు నిట్టు లనియె • మానధనుఁడు.

క.†చచ్చినకొడుకులు వెండియు, వచ్చెద రని ద్రుపదునింట • వైభవ మెసఁగన్
పిచ్చలవిడి మెలఁగెద రని, ముచ్చట వినినంత సమ్యో • ముద మెదఁ బొదలన్.

క. అనుచును సంభాషించెడు,జనపతిఁ గని విదురుఁ డనియె • సతతము నీ కో
జనవర యిట్లు సమత్వము, పొనరుచు నుండంగ వలయుఁ • బుత్త్రులయందున్. 13

వ. అని చెప్పి చనియె నంతఁ గర్ణదుర్యోధనాదు లతనిపాలికిం జని యిట్లనిరి. 14

కర్ణదుర్యోధనులు ధృతరాష్ట్రునితో నాలోచించుట.

మ.‡ఎడ లే కెప్పుడు నీకడ న్విదురుఁ డెం•తే పట్టి పాలార్చుచుం
డుడు నే మేమియుఁ జెప్పుకొంట కద నెం•దుం గామిఁ జింతింతు మా
తఁడు దాయాదులపక్షపాతి యని చి•త్తంబందు గుర్తించియున్
నుడులే మంత్రము లంచు వానిచెలిమిన్ • గూర్తెంతయు న్వింతగన్. 15

క.§అద నిది సపత్ను లెంతయుఁ, బొదలిరి తత్తద్విధాన•ముల నెల్లఁ దగన్
మది నెంచి చేయఁగాఁ దగు, నిది తెలుపఁగ వచ్చినార • మిభపురనాథా. 16

* వాసి = ప్రసిద్ధి. † ముచ్చట = వృత్తాంతము. ‡ కూర్చు = కూడఁబెట్టు. § పొదలు = వర్ధిల్లు.

వ. అనిన ధృతరాష్ట్రుండును. 17

మ. ఇది యే నెల్ల నెఱింగి యే ట్లనుచు లో ♦ నెంతుఁ ముఖప్రీతి గా
విదురుం బల్కుఁడుఁ గాని కూర్చి పలుకన్ ♦ వే యేల నాచిత్త మె
ప్పుడమందు న్మనదాయలం గలఁచి వా♦పం జూ మమార్గంబునం
తోఁదవ్వుం దీని కుపాయ మెద్ది తెలుపుం♦డో మీరు తెల్లంబుగన్. 18

వ. అనిన దుర్యోధనుం డి ట్లనియె. 19

సీ. పాండవుల్ పాంచాలుఁ♦ బట్టియున్నను యదు,వృష్ణిముఖ్యులు వారి ♦ కిష్టు లగుదు
రది గాన వారల ♦ కన్యోన్యవైర మె,క్కించుచుఁ బోరలు పు♦ట్టించియొండె
తెగువఁ గొంతేయమా♦ద్రేయుల కొండొండ, భేదంబు మిగులఁ గ♦ల్పించియొండె
సతికిఁ బతులయందుఁ ♦ బతులకు సతియందుఁ, దెగనిద్వేషమును సం♦ధించియొండె

తే. పొంచి భీమసేనుని వధి♦యించి యొండె
ద్రుపదుపురమున వెడలించి ♦ దుర్బలులుగ
సలిపి వారి జయింతే మిం♦ దలరు నెద్ది
దాని నొనరించునది యనఁ ♦ దపనసుతుఁడు. 20

చ. వ్యసనవశంబునం గలుగు♦వ్యగ్రతఁ బల్కితి వడ్డుకోలుగా
నసదృశు లమ్మహీపతుల ♦ కన్నటు భేదము వెట్టఁ బోలునే
నిసువులె వారు సోదరు ల♦నిం గలహింతురె వింత వుట్టునే
పస చెడి యాజ్ఞసేని పెడఁ♦బాయునె భర్తల నీకృతంబునన్. 21

మ. ధనధాన్యంబుల కాదు రాజ్య మిడినం ♦ దాఁ బాండవేయానుర
క్తిని బాంచాలుఁడు వీడఁ డెట్టికపటో♦క్తిన్ వారి భేదింప లే
మనిలపోద్భవు నేమి చేసె జడివే ♦ ట్లాయన్నియుం దొల్లిట
న్నీను మెల్ల న్నీతి విక్రమం బాకఁడు గా♦వింపంగ మే లెన్నఁగన్. 22

చ. భరతుఁడు విక్రమంబున స♦పారధరాతలమెల్ల నేలె నా
సురపతి విక్రమంబునన ♦ నూవె జయించె జగత్త్రయంబు భూ
వరు లగువారు విక్రమ మ♦వారిగ మెత్తురు నుత్తమంబు నా
నరవర విక్రమంబును బా♦నర్చి మనోరథసిద్ధి నొందుమా. 23

వ. ఇందు దండం బొక్కండ తక్క తక్కినసామదానభేదంబులు కార్యసాధకంబులు గావు గావునఁ బాండవేయులు ధనధాన్యవస్తువాహనసేనానివహంబులు మిక్కుటంబై వారు వే రూని పాదుకొనకమునుపే వారిపై దాడి వెడలి నుక్కడంచుటయె మనకుఁ గర్తవ్యము దీనికి మీ రనుమతింపుఁడు దీనం జేసి మనకు రాజ్యం

బంతయుం దక్కు నని కర్ణునివచనంబు లాకర్ణించి ధృతరాష్ట్రుం డిది లెస్స యయిన బుద్ధిమంతు లగుకురువృద్ధుల విచారించి చేయుదు మని భీష్మద్రోణకృప విదురుల రావించి కార్యం బెఱింగించి మీ రేమి చెప్పెద రనిన భీష్ముం డి ట్లనియె.

—••◆ భీష్మద్రోణులు దుర్యోధనాదులకు బుద్ధిచెప్పుట. ◆••—

సీ. విక్రమక్రమమున ♦ విగ్రహంబున శత్రు,నిగ్రహం బొనరింప ♦ నీతిపథమ
పాండవుల్ శత్రులే ♦ పరికింప వారితో, నని సేసి గెలుచుట ♦ మనకుఁ దగునె
ధృతరాష్ట్ర పాండుని ♦ సుతులును నీసుతుల్, దెలియంగ నాకొక్క ♦ తెఱఁగుకాదె
పితృధనం బగుకురు ♦ క్షితి మీకు నెట్లొ వారి, కట్లె స్వత్వమై యొప్పు ♦ నరసిచూడ
తే. నీవు జాత్యంధుఁడవు గాన ♦ నీకు రాక
వారితండ్రికి వచ్చుట ♦ వారు రాజ్య
మునకు సర్హులు తండ్రిసొ ♦ మ్మునకుఁ బెద్ద
వీవ యర్హుఁడ వది గాన ♦ నిట్లు వినుము.    25
చ. జనకునిఁ బాసి రాజ్యముప ♦ సౌఖ్యము నందనిపాండవేయులన్
దనుపుచుఁ గాచిపుచ్చు టది ♦ నాకును నీకును నీకొమాళ్లకున్
గనుఁగొన ధర్మమార్గ మగుఁ ♦ గాని విరోధముసేఁత పాడి గా
దనువున సంధి చేసి ధర ♦ యందున సా మిడఁ బాడి వారికిన్.    26
వ. ఈకురురాజ్యంబు వారలకుఁ బితృపితామహప్రపితామహాదులమూలమున వచ్చినది కాని వేఱు కా దని దుర్యోధనుం జూచి మఱియును.    27
మ. ఇది నాతండ్రిది యంచు నీ వెటు తలఁ ♦ చిట్లే తలంతెప్పుడున్
మదిలో వారును వారిదే తలఁప నీ ♦ తన్మండలం బెల్ల నీ
వెద ధర్మంబు గణింప కొంది తని నే ♦ నే కాదు లోకం బెఱుం
గుఁ దగన్ వారలఁ బిల్చి నేల సగపాల్ ♦ కొమ్మంచు నీ మే లగున్.    28
తే. శాస్త్ర మెటు లుండినం గాని ♦ సదమలాత్మ, వారు మీరును సమముగా ♦ భూరిరాజ్య
మనుభవించుటపాడియై ♦ య్యదియ మాకు, హితమునపకీర్తి వోఁగీర్తి ♦ యొసఁగుఁదీన.
చ. తనయశ మెంతదాఁక వసు ♦ ధ న్విదితం బగు నంతదాఁక న
జ్జనుఁ డలనాకమం దలరి ♦ సౌఖ్యములం దులఁ దూఁగు చుండు నం
చును నపకీర్తి వానిఁ జెడఁ ♦ జూచి తుద న్నిరయంబు గట్టు నం
చును మనశాస్త్రము ల్దెలుపుఁ ♦ జు మ్మిది ని వెఱుఁగం దలంపుమా.    30
ఉ. *సీకిది మంచికాల మని ♦ నేను దలంచెదఁ గుంతి పాండవుల్
నీకతనన్ మహాగ్నిఁ బడి ♦ నీల్గి రటంచు దలంచి నిన్ను నీ

* నీల్గు — ఈలుఁగు, చచ్చు.

లోకము ప్రబుద్ధుఁ డిట్టిదని ♦ లో నది వాయఁగ వాపు మిత్తికిం
గాక మెలంగుచుండి రని ♦ కాఁ గలవాఁడవ యేఁ దలంపుమా. 31

ఉ. ప్రాణముతోడ వారలిల ♦ వర్తిలుచుండఁగ వారిపైతృకం
బైన ధరిత్రి వజ్రధరుఁ ♦ డైనను నెత్తుకొను గాఁడు చేకొనన్
గానక నీవు పాండవులఁ ♦ గాదనుచుంటివి నాదుబోధచేఁ
జానుగఁ జేర్చితేనియును ♦ సౌఖ్యము నీ కగు నోసుయోధనా. 32

వ. అనిన సంతసిల్లి ద్రోణుండు ధృతరాష్ట్రున కిట్లనియె. 33

చ. శ్రుతిహితవాక్యముం బలికెఁ ♦ జూనె నదీసుతుఁ డిట్లు నాకు స
మ్మత మది గానఁ బాండునికు♦మారులపాలికిఁ బుచ్చి నెయ్యురన్
హితవచనంబులం దనియ ♦ నిచ్చుచుఁ దోడ్కొని వచ్చి వారికిన్
సత మగురాజ్యభాగము నొ♦సంగు మెసంగుము పేర్మి పెంపునన్. 34

ఆ. సేనతోడ దుస్స♦హను వికర్ణుని, ద్రుపదపురము పుచ్చి ♦ కృప దలిర్పఁ
దోడరి పాండుసుతులఁ ♦ దోడ్కొనితెచ్చి వారల, నాదరింప వలయు ♦ నవనినాథ. 35

వ. ఇదియె నీవు పాండవులపట్ల ననుసరింపవలసినవిధానం బనిన నాకర్ణించి కర్ణుం డిట్లనియె.

కర్ణుఁడు భీష్మద్రోణులఁ దిరస్కరించి పలుకుట.

చ. కౌరవరాజ యీకడను ♦ గౌరవ మందుచు మంత్రులట్టి రై
చేరినవీరు శ్రేయమును ♦ జెప్పక యుండిన నంతకన్న ని
ద్ధారుణి విస్మయం బగువి♦ధాన మొకం డెది యుండు నద్దిరా
నై రికిఁ గూర్పువీ రనిన♦వాక్య మవిశ్వసనీయ మారయన్. 37

ఆ.*మూఁడుకాళ్లమునసి ♦ లోడి కలను సేయ, వాఁడు చెడినఁగాని ♦ వీఁడు చెడినఁ
గాని తమకుఁ దగిన♦కరణి వల్కుదు రీశు,హితవుఁ గోరి పలుక ♦ రిది నిజంబు. 38

సీ. రాజగృహం బను♦రాజధానిం దొల్లి, నగు నంబువీముఁ డన్ ♦మగధరాజు
తన కూర్పు పుచ్చుట ♦ దక్కఁ బనులు లేక, ప్రెగడపై సర్వముఁ ♦ బెట్టి యుండె
నపుడు మహాకర్ణ ♦ యనెడు నాప్రెగ్గడ, తానె రాజై వాని♦ధనము నొడిచి
ఘనుఁడై విభుత్వంబు ♦ గొని తదంగనలతో, నైశ్వర్య మంతయు ♦ నపహరించి

తే. పూజ్యసామ్రాజ్యమును గొని ♦ బుద్ధి నెంచెఁ, గాని విధివిహితం బగుఁ ♦ గాన నందు
నేఁడమ్యోను వాఁ డట్లు ♦ పేరు విహితి, మఱి రాజ్య మెనం డెట్టు ♦ లయినఁ జెడదు.

వ. అహితుం బిలిచి రాజ్యంబు పంచిపెట్టు మనునిట్టివా రహితులం బోలుహితు లనిన
నలిగి కుంభసంభవుండు కర్ణు నుపలక్షించి. 40

* కలను = యుద్ధము.

ఉ. సూతజ! నీవు మాయెడలఁ • జూపినదోష మెఱుంగ వచ్చె నే
మీతఱిఁ బాండవేష్టత వ•హించి వచించితి మంచు నెంచి తో
హో తగ వాడినట్ల వినఁగ • నొల్లక కాదనుచుంటి విట్టు లే
దీ తమ కెల్లవారికిని • దిష్టనఁ గూర్చుట తెట్టుఁ జెప్పుమా. 41

క. *హితవుం బలికెడుహితుఁడవు, పతికి నహితంబు పలుకు•బడుగులమా మే
మితికర్తవ్యవిమూఢుఁడ, వితరులు నీహితము వినరె • నిహాహిం చెడరే. 42

క. నేనును భీష్ముఁడుఁ జెప్పిన, దానిని గాదనుచు నీవు•దానిని మొఱఁగం
గా నెద చేసిరయేనియు, నూఱురు కౌరవులు చెడక • మహి నింతిరిలోన్. 43

వ. అపుడు విదురుండు ధృతరాష్ట్రున కి ట్లనియె. 44

విదురుండు ధృతరాష్ట్రునకు హితవు చెప్పుట.

మ. మనుశాస్త్రంబునఁ బాండవేయులకె సా•మ్రాజ్యంబు సిద్ధించు నై
నను లోకోత్తరుఁ డైన శాంతనవుఁడున్ • ధర్మజ్ఞుఁ డ్రోణుండునున్
మనకున్ క్షేమముఁ గోరి చెప్పి రిటు మం•దప్రజ్ఞులుం గుత్సితా
మనకర్ణాదులమాట నమ్మి చెడ కా•మంత్రింపు మప్పార్థులన్. 45

తే. హితము చెప్పెడువారు లే•రెవరు నీకు, ద్రోణభీష్ములకన్న నీ•త్రోవ నీవు
గన్నకొడుకులు తమ్ముఁడు•గన్నకొడుకు, లొకటిగా నెంచి పిలిపించి • యోము వారి.

క. పెద్దలు వయసునఁ బ్రజ్ఞం, బెద్దలు విద్దెలను గాన • భీష్మద్రోణుల్
బుద్ధులు సెప్పిరి మన కా, సుద్దులు వేదములు నాఁగఁ • జూడఁగ వలయున్. 47

వ. అని మఱియును. 48

సీ. ‡సవ్యసాచికి మాఱు • సంగరంబున నిల్వ, శక్రాదులకు నేని • శక్య మగునె
నాగాయుతబలుండు • నాఁ బడు భీముండు, పెల్లు రేఁగిన భూమి • పెల్లగిలదె
యాశ్వినేయాంశజు • లాయము లని మొనఁ, బడ శత్రుసేనలు • బడలుపడవె
ధర్మస్వరూపుఁ డౌ • ధర్మజుం డలిగిన, ముల్లోకములు భస్మ • మునకు రావె

ఆ. యట్టివారితోడ • నని సేసి నీసుతుల్, బ్రదుకుననుచు నాస•పడెడువారె
కానఁ గానిమాటఁ • గలఁగోసఁ దలఁపక, వారితోడ మైత్రి • వలయు మనకు. 49

మ. బలదేవాచ్యుతసాత్యకిప్రభృతులుం • బాంచాలురుం బుత్త్రులున్
దలఁపం బాండవపంచవహ్నులకు ను•ద్యద్గంధవాహాభు లై

---

* బడుగులు = అశక్తులు. ఇతికర్తవ్యవిమూఢుఁడు = ఎట్లు చేయవలెనో తెలియనివాఁడు.

‡ యములు = కవలు, నకులసహదేవులు.

చెలులై చుట్టములై యమాత్యవరులై • సేవించి ప్రేమించుచుం
గలయన్ శాత్రవలోకదాహమును వేడ్కన్ వారు గావింపగే. 50

వ. అశక్తదుర్జనత్వంబునం ద్రుళ్లిపడునీదుష్టాత్ముల దుర్బోధనంబులం దగిలి పాండవుల తోడం గలహింపం బూనునీకొడుకు వారించి పిలువం బంచి వారిపాలు వారి కిచ్చి లక్కయింటఁ జిచ్చు వెట్టించి తనదుర్యశంబు పాండవుల కిపు డనుగ్రహంబు సూపి తనుజలంబునం గడిగికొమ్మనిన సమ్మతించి ధృతరాష్ట్రుం డి ట్లనియె. 51

మ. కురువృద్ధుల్ గుణావృద్ధు లెట్లనెదరో • క్కొ చూత మం చంటిఁ గా
కరయం గౌరవులందుఁ బాండవులయం • దావంతభేదంబు నా
కరణాంతఃకరణంబునం గలుగునే • కానిండు మీ రెల్లరున్
గురువుల్ మీవచనంబు వింటి ననినన్ • దోషంబు లే దింతయున్. 52

క. ఏ నంతబుద్ధిహీనుఁడఁ, గా నప్పాండవులఁ ద్రోయఁ • గడఁగను మీప
లుక్కానితిఁ జేకొని వారికిఁ, గా నిచ్చెద నర్ధరాజ్య • ఖండముఁ బ్రీతిన్. 53

ధృతరాష్ట్రునికంపున విదురుండు పాండవులకడకు వచ్చుట.

వ. అని పలికి పాండవులం దోడి తేర విదురుం బుచ్చుటయు నతం డతనిశాసనంబునఁ గతిపయజనంబుతో నటఁ జని పాంచాల బలదేవ వాసుదేవ పరివృతులై యున్నపాండవులం గని పాదాక్రాంతులై పూజించిన వారిం గౌఁగిలించుకొని ప్రణయంబున ని ట్లనియె. 54

ఆ. కొడుకులార! మీకుఁ • గుశలమే విగతామ,యులుగ మెలఁగుచుండ్రె • జ్వలనరాశి
వలన ముక్తులై స•వలఁతుల మిముఁ గంటి, బ్రదికి కనులు గలుగు•ఫలముఁ గొంటి.

వ. అని పునఃపునరాలింగనములు సేయుచున్నసమయంబున యుధిష్ఠిరుండు కృతాంజలిపుటుండై వినయంబున ని ట్లనియె. 56

క. తండ్రీ నీదయవలనన్, వేండ్రం బిసుమంత పడక • వెడలితి మట నే
వాండ్రుం గోలరు నిన్నుం, దండ్రియుఁ దల్లియును నీవ • తలఁపఁగ మాకున్. 57

వ. అంత విదురుండు సర్వజనసమక్షంబున ద్రుపదునిం జూచి ధృతరాష్ట్రప్రభృతులు నీ కుశలం బడిగి రని చెప్పి మఱియు. 58

మ. ధరణీంద్రా విను నీదుబాంధవము పొం•దం గల్గుటన్ హస్తినా
పురమందుం గలవార లందఱును స•మ్మోదమ్మునం బొంది ర
క్కురునాథుండును గోడలిం గొడుకులం • గుంతీమహాదేవినిం
బరికింప న్మది నెంచి తేరఁ బనిచెం • దా నన్ను నీపాలికిన్. 59

క. పుర మెల్ల వీరిఁ జూడం, బరితపియించెడిని గానఁ ♦ బరమోత్సుకతన్
నరవర పుత్తెంచుత నీ,వా పుత్త్రికతోడఁ బాండు♦వరపుత్త్రకులన్. 60

చ. అనవుడు యజ్ఞసేనుఁ డహహా సమవర్తివి ధర్మమూర్తి వీ
వనిశముఁ బాండవేయులప్రి♦యంబున నుందువు నీదురాక ని
య్యనఘుల కిష్టసిద్ధి యగు ♦ నంటకు సందియమా? ప్రయాణముల్
మనమున నాకు నిష్ట మిఁక ♦ మాధవునిష్టము నెట్టు లుండునో. 61

క. నావుడు వసుదేవాత్మజుఁ, డావిదురుఁడు ద్రుపదుఁ డిట్టు ♦ లిష్టత వలుకన్
భావమున నెందు దలఁపక, పోవుటయే నాకు నిష్ట♦మును శుభకరమున్. 62

వ. అనిన యుధిష్ఠిరుం డిట్లనియె. 63

క. గురువులు మాకున్ విదురుఁడు, మురహరుఁడును ద్రుపదభూవి♦భుండును మే మీ
గురువులశుభానుమతమునఁ, గరిపురి కరిగెదము బంధు♦జనాపేక్షన్. 64

వ. అంత విదురుండు కుంతీమందిరంబునకుం జని వందనం బొనరించి తనరాక నివేదించిన
దీవించుచు నద్దేవియును. 65

చ. కనుఁగవ హర్షబాష్పములు ♦ గాలువగట్ట మఱందిఁ జూచి యి
ట్లనియె మహాత్మ నీ దగుద♦యన్ గొడుకుల్ జతుగేహదాహశ
త్రునివలన విముక్తు లయి ♦ ద్రౌపదిఁ బెండిలియాడ నైరి యిఁకన్
బొనరఁగఁ జేయుభాగ్యమును ♦ బూనితి వీ వని చెప్ప నేటికిన్. 66

తే. అనిన విదురుండు వల్కె నో♦యమ్మ నీమ
హత్త్వమునఁ జేసి పాండవు ♦ లధికహర్ష
మంది పైతృక మగురాజ్య♦మందుఁ బొదలఁ
గలరు బందుగులం గూడి ♦ కలఁత విడి. 67

విదురుండు పాండవుల హస్తిపురికిం దోడ్తెచ్చుట.

వ. అంత ద్రుపదుం డల్లురకుం గూఁతునకు ననేకమణికనకవస్త్రవాహనాదు లరణంబు వెట్టి తక్కినవారికినిం గట్టఁ బెట్టి యంపిపుచ్చుటయు నప్పాండవులు పైనంబై ద్రుపదు వీడ్కొని తల్లిని ద్రౌపదినిం దోడ్కొని కతిపయసేనాసమేతుం డై ధృష్టద్యుమ్నుండు వెంట నంట బలరామకృష్ణవిదురసహాయు లై సుఖప్రయాణంబుల హస్తిపురికిం జేర వచ్చుటయు విని ధృతరాష్ట్రుండు కృపద్రోణవికర్ణచిత్రసేనుల నెదుర్కోలు సేయం బుచ్చిన వచ్చినవారు చేయునుత్సవాదుల కలరి మహోత్సాహంబునఁ బురప్రవేశంబు సేసి రాసమయంబున. 68

మ. మనకావించినపుణ్యలేశమున నీ♦భూమండలాధీశనం
దను లేతెంచిరి వెండి పాండుధరణీ♦నాథుండు జీవించి వ
చ్చినయ ట్లయ్యెడి సంతసంబు మదికిన్ ♦ జీవించి ప్రేమన్ మనూ
అనయుం బీకురురాజ్య మేలుచు నిటన్ ♦ హాళిం బ్రవర్తించుతన్. 69

వ. అని పౌరు లెల్లరుం బ్రశంసించుచుండఁ బాండవులు ధృతరాష్ట్రశాసనంబున రాజభవనంబునకు వచ్చి భీష్మాదికురువృద్ధులకు మ్రొక్కి వారు దీవించినం బ్రతిగ్రహించి దుర్యోధనాదికురుకుమారులం గలసి సుఖంబుండి రంతఁ గొంతకాలంబునకు నొక్కనాఁడు ధృతరాష్ట్రుఁడు పాండవులం బిలిచి కృష్ణభీష్మద్రోణవిదురకృపాదులసమక్షంబున ని ట్లనియె. 70

—రాజ్యలాభపర్వము.—

ఉ. ఈకురురాజ్యమందు సగ ♦ మిచ్చితి మీకుఁ గుమారులార మీ
రీకడ నున్నఁ బోరగును ♦ నేమియు వివేకవిహీను లాత్మజుల్
కాఁక వహింప రెందులకుఁ ♦ గాని మనంబున నై భవంబునుం
జేకొని యొండుచోట నివ♦సింపుఁడు పెంపుఁడు రాజ్యసంపదన్. 71

తే. రాజధానిగ ఖాండవ♦ప్రస్థపురము
సలుపుకొని సర్వజనులకు ♦ సమ్మతముగఁ
బూజ్యసామ్రాజ్య మేలుఁడు ♦ పొం డని యమ
తనయు నభిషిక్తుఁ జేసి తాఁ ♦ బనుచుటయును. 72

వ. వారును విదురభీష్మాదులయనుమతంబునఁ గుంతీకృష్ణాసహితులై రామకృష్ణపురస్సరంబుగా ఖాండవప్రస్థంబునకుం జని యట ద్వైపాయనప్రతిష్ఠితంబును బవిత్రీకృతంబు నగు నొక్క విశాలరమ్యప్రదేశంబున విశ్వకర్మచే నింద్రవరుణకుబేరాదులపురంబులకన్నఁ గరంబు వన్నె కైనపురం బొండు నిర్మింపం జేసి దాని కింద్రప్రస్థ మనుపేరు వెట్టి రది యును. 73

—ఇంద్రప్రస్థపురవర్ణనము.—

మ. బయ లంటం జనునున్నతం బయినవ♦ప్రంబున్ సముద్రోపమం
బయి భీమం బగుఖేయముల్ నగసదృ♦క్షానూనసౌధంబులున్
వియదాలింగితరత్నగోపురములున్ ♦ విఖ్యాతవాపీసర
శ్చయము ల్దివ్యవనంబులుం గలిగి మె♦చ్చ న్వచ్చె స్వర్గం బనన్. 74

తే. అలరుఁ బురి సోమసూర్యవీ♦థుల నటునిటుఁ, దురగరథహస్తిపత్తులు ♦ దిరుగ నెపుడు
నిలిచి శ్రీపురుషోత్తము ♦ ల్నిజబలమున, లీల నాడెడుచతురంగ♦పాళి యనఁగ. 75

తే. గోపురము నాఁపునాపుర ♦ గోపురములఁ, జెలఁగుసౌవర్ణసాలభం ♦ జికలు ప్రోలి
మేలుసింగారమును జూచి ♦ మేను మఱచి, భ్రమానుపడి యున్నయచ్చర ♦ చాన లనఁగ.

చ. మగఁ డగునయ్యపాంపతి క్ర ♦ మంబున గ్లా యునయించు నెప్పునన్
గగనతరంగిణీమణి ప్ర ♦ కాశిలి తత్సుసౌధకుట్టిమ
స్థగితవిభూషలస్రవద ♦ దభ్రపయస్తత యై పతివ్రతా
త్వగరిమ నెల్లవారలును ♦ వర్ణన మూనఁగ మాన కుండెనన్. 77

చ. పౌనరన్ రాజనముల్ పయస్సులను నె ♦ ప్పుం బెంచు నయ్యేఖిలం
దనిశక్రీడలు సల్పుస్త్రీలకు నెడ ♦ ల్లం దాసుగంధంబు వీ
డి నదీతోయములందుఁ గల్వలను లా ♦ డెం గా న సౌగంధికా
ఖ్యను బెం పొందెను గల్వ లట్టు లగు స ♦ త్సాంగత్య మెవ్వారికిన్. 78

వ. ఇట్లు మహోత్తరం బగునింద్రప్రస్థపురంబున మహేంద్రవైభవంబునో వ్యాసవాసు దేవానుమతుం డై సానుజుం డగుధర్మతనూజుండు ధౌమ్యపురస్సరభూసురాశీర్వాద నాదంబునుం దూర్యనినాదంబునుం బోరుకలుగ నొక్క సుముహూర్తంబునం బ్రవేశించి యథావిభవవినయంబున రామకృష్ణాదిబంధువర్గంబు నంపిపుచ్చి. 79

చ. నలువురుతమ్ములుం దనకు ♦ నాలుగుచేతులు గా మహీజనుల్
గొలుచుసురల్ల వీడదివి ♦ కుంఠసు గా నిజపత్ని లక్ష్మి గా
నలలితరాజ్యపాలనము ♦ సర్వజగత్పరిపాలనంబు గా
నలరె యుధిష్ఠిరాచ్యుతుఁ డ ♦ నంతయశంబునఁ బట్టభద్రుఁ డై. 80

ఉ. పాఁడియుఁ బంటయుం గలిగి ♦ బల్విరులం దులఁదూఁగుమంత్రినా
త్తేఁడు సభార్యుఁ డై తగుత ♦ తిం గురియ న్నెల మూఁడువాన లే
గోడును లేక భూప్రజకుఁ ♦ గోరుసుఖంబులు దొప్పఁదోఁగఁ గాఁ
బాడిగ రాజ్య మేలుచును ♦ భాసిలుచుండె మహీతలంబునన్. 81

ఉ. ఆనగరీలలామమున ♦ సద్దమరేఁ జని యాలకించినన్
జానుగఁ దోఁచు శాస్త్రముల ♦ చర్చయు సర్చితవేదసారమున్
గానివస్తువుం గనెదు ♦ గాథలబోధము సాధుసంస్తుతుల్
జ్ఞానకథాప్రసంగములు ♦ సంతతమున్ ద్విజరాజవీధులన్. 82

తే. పరఁగఁ బెంమూఁడుజాతుల ♦ వారియిండ్ల
నాలకింపఁగ నగు ధర్మ ♦ మరయ నలయు
క్షితిఁ బసులఁ గాచి న్యాయ మా ♦ ర్జింప వలయు
బ్రాహ్మణులఁ గొల్వ వలయు నన్ ♦ పలుకు లచట. 83

వ. ఇట్లింద్రప్రస్థపురంబున యుధిష్ఠిరుండు ప్రకృతిప్రధానజనానురంజనంబుగా సామ్రాజ్యం జేలుచు సుఖం బున్నసమయంబున. 84

క. పారదశారదనారద, హీరదరసమాంగకాంతు లెసఁగి వెలుంగన్
భూరిదయామయుఁ డగునా, నారదుఁ డరుదెంచె ధర్మనందనుసభకున్. 85

క. అరుదెంచినమునివరునకుఁ, గురుకులవల్లభుఁడు తమ్ములుగూడుకొని దానున్
జటిలాయుగంబునకుఁ జాఁగిలి, పరిచర్యలొనర్చి వినయపరుఁడై కొలిచెన్. 86

వ. అమ్మునియుఁ బ్రణతులై యున్నవారిం బ్రియమ్మునఁ గూరుచుండ నియోగించి స్వాగతంబు నుడివి కుశలం బడిగి సద్గోష్ఠీవిశేషంబులం బ్రొద్దుపుచ్చుచుం దనకు మ్రొక్క వచ్చినద్రౌపదిం గీవించి లోనికిం బోనం బంచి పాండవులతో నేకాంతంబున నిట్లనియె. 87

మ. కురునందనోత్తరులార యేపురకు వినాశం బత్నిమొక్కర్తయై
పరఁగం ద్రోవది గానికారణమునన్ వైషమ్యమై లోఁ బర
స్పరవిద్వేషము పుట్టునే వినుఁడు వాల్లంటెకెం బోరి మున్
సురవిద్వేషులు మిత్తివాతఁ బడి రా సుందోపసుందుల్ పగన్. 88

వ. అనిన విని ధర్మనందనుం డాసుందోపసుందులవృత్తాంతంబు సెప్పు మనుటయు నారదుండును. 89

నారదుఁడు సుందోపసుందోపాఖ్యానము చెప్పుట.

సీ. కలరు తొల్లి హిరణ్యకశిపువంశమున ని,కుంభునిపుత్త్రిలు జంభనిభులు
సుందోపసుందు లన్ మందభాగ్యులు పర,స్పరబద్ధసఖ్యులు భ్రాతృవరులు
కుడుచునప్పుడు దాని కుడుచునప్పుడు నొకఁ, డొకఁడుగా నెప్పుడు నుండఁ బోరు
తలఁప నొక్క రేకొ రెండు తనువులుగాఁ జేయఁ,బడినట్టు లూహింపఁ బడుచునుండు
తే. వారు త్రైలోక్యవిజయంబు వడయ నెంచి,ప్రథిత మగుచిక్క వింధ్యపర్వతమునందుఁ
దపము గావించి రొగిఁ బెద్దతడవు గాఁగ, క్షుత్పిపాసల కింతయు సోలకుండ. 90

ఆ. కాలిబొటనవ్రేల నేల నిలంబడి, చేతు లెత్తి పయికిఁ జత్తనిశ్చ
లతను జెప్ప వేయ కతులితనిష్ఠమై, వారు స్థాణువు లనఁ బరఁగి రచట. 91

తే. మేసిమాంసముఁ గోసి యమ్మేటిమగలు, హోమ మొనరించుడును గడు భీమముగను
ధూమమును గ్రక్క వింధ్యాద్రి తోడఁదోడ, సకలజగదుపప్లవ మయ్యె సంతతముగ.

వ. అత్తపంబున నగునుగ్రతాపంబున జగంబు లెల్లఁ దల్లడిల్లుచుండం గని వాణీవల్లభుం డయ్యసురతల్లజులకడకుం బోడచూపి వరంబు వేఁడుం డనిన వారును. 93

ఉ. వారిజసూతికిం గడు న•వారిగ మ్రొక్కి యొనర్చి మేము నీ
వారము నీకు మాపయిఁ గృ•పారస ముండిన యేని మాయమైఁ
గోరినరూపుల న్మెలఁగి•కొంచు బలాఢ్యుల మై మహాస్త్రముల్
చేరఁగఁ జావు లేనిగతిఁ•జెల్లెడునట్లు ననుగ్రహింపవే. 94

వ. అంత నప్పితామహుండు వారి కిట్లనియె. 95

ఉ. లోకములన్ జయించుటకు•లోనఁ దలంచితి రీరు గావునన్
మీ కమరత్వ మొక్కఁ డది•నే నిడ నెంచను గాని మీరు న
న్నీకడఁ గోరుకొన్నయవి•యెల్ల నొసంగితి మీ రజేయులై
లోకములన్ మెలంగుఁ డని•లోకపితామహుఁ డానతిచ్చినన్. 96

తే. వారలిట్లని రెల్లన•వారిజభవ, మిసిమిఁ గొనియున్నమాలోన•మేము కాక
లోకముల నేరికేని జంప•రాక యుండ, వర మొసఁగ నిచ్చగింపవే•కరుణఁ జేసి. 97

వ. అని ప్రార్థించినం బరమేష్ఠి యట్ల యగుఁగాత మని పలుకుచు సత్యలోకంబునకుం బోయె నంత వారును వారిజాసనదత్తవరంబునం జేసి గర్వించుచు నిజపురంబున కరిగి నానావిధసేనాసమూహంబులం గూర్చుకొని కదలి పోయి ముల్లోకంబులం జయించి యింద్రాదు లకింద్రులై గింసుమిగిలి యుండి రాసమయంబున దేవత లెల్లరును దల్లడంపడి బ్రహ్మకడకుం జని మొఱ్ఱవెట్టిన నతం డది యంతయు నంతరంగమునం దెఱింగి విశ్వకర్మం బిలిచి జగంబుల కెల్ల వలఁపు గొలుపఁ జాలు నొక్కచక్కని చక్కఁదఁబోఁడిం జేయు మని యాజ్ఞాపించె నతండును దన నేర్పు పెంపున నెల్లరత్నంబులం గలసారంబు తిలప్రమాణంబుగ నేకరించి పరమోత్తమాంగనం జేసి తెచ్చె బ్రహ్మయును దానిం జూచి విశ్వకర్మశిల్పంబున కచ్చెరువడి మెచ్చుకొని దానికిఁ దిలోత్తమ యని పేరు పెట్టి నీవు సుందోపసుందులకడకుం బోయి వారి వంచించి రమ్మని పంచినను నక్కొమ్మ వల్లె యని పలుకుచుఁ బోవ నెంచి వారికందఱకుఁ బ్రదక్షిణంబు గావించె నప్పుడు. 98

చ. కొలువునఁ గల్గినట్టిసుర•కోటులమోములు దానివంకకున్
గలకలలాడుచుం దిరిగెఁ•గౌతుక మెంతయు నెయ్య నెమ్మదిన్
వలగొనునప్డు శంభునకు•నాలుగుమోములు నాల్గుదిక్కులన్
గలిగెను వజ్రికిన్ మొలచెఁ•గన్నులు కాయమునందు నెందునన్. 99

వ. అట్లు దేవసభకుఁ బ్రదక్షిణంబు గావించి తిలోత్తమ బ్రహ్మయనుజ్ఞ వడసి భూలోకంబునకుం బయనం బయ్యె నంత నట సుందోపసుందులును వింధ్యాచలప్రాంతవనం

బున నిచ్ఛావిహారంబులం జేయుచుండి రవ్వడచ్చటికిఁ దిలోత్తమ వచ్చి సమీపప్రదే
శంబునఁ బుష్పాపచయంబు గావించుచుండె నాసమయంబునం గని వా రిరువురును
గామమోహితులై నన్ను వరియింపుము నన్ను వరియింపు మని దానిసవ్యదక్షిణ
కరంబులు వట్టుకొని ప్రార్థించుచు నిది నాసతి నీకుఁ బూజ్యురా లని సుందుండు
నిది నాసతి నీకు మఱంద లని యుపసుందుండును బలుకుకొనుచున్నం దిలోత్తమ
వారి కిట్లనియె. 100

క. ఇరువురు నొకతఱి నన్నుఁ, వరియించితి రాసఁ జేసి నదలక మీలో
వగబలుఁ డెవ్వఁడో వానిఁ, బరికించి వరింతు శౌర్యబలనిధులారా. 101

వ. అనిన వా రిరువురు పూర్వస్నేహానుబంధం బంతయుం దెగఁ జేసికొనుచు సహామహ
మికం గలయంబడి పోరి పోరి పరస్పరగదాభిఘాతంబుల నేలం గూలి ప్రేతలోకాతిథు
లై రని చెప్పియును. 102

క. కాంతాకారణమ్ములకొఱ, కెంతలు నెంతలును మిత్రు లేవియుఁ జెడి లో
కాంతరగతులై పోయిరి, వింతలె నానుడులు మోహవిభ్రమ మనదే. 103

వ. పువ్వునుం దావియుం బోలె నవినాభావసంబంధబంధురం బైన మీసహోదరస్నేహాను
బంధంబున కవిప్రియభయంబు లీద్రౌపదికతంబున గాకుండ నొక్క సమయంబు చేసికొం
డనిన వారు నట్లె యని యమ్మునితల్లజుసమక్షంబున. 104

ఉ. *ఏవురు నొక్కొకబ్దమున నీసతిఁ బొందను బొంది యుండ నా
తావున కేఁగు గాని పెఱ దప్పియునుం జొరకుండనుం బ్రమా
దావృతచిత్తుఁ డై చొరెనయేని యతండు ద్వాదశవర్షతీర్థచ
ర్యావహితాత్ముఁ డై తిరుగునట్టును మాసమయంబు సెల్లెడిన్. 105

వ. ఇట్లు పాండవులచే సమయంబు చేయించి నారదుం డంతర్హితుండగుటయు వా రది
తమకు హితోపదేశంబుగాఁ దలంచి సంతసించి రంతఁ గొంతకాలంబునకు. 106

## అర్జునవనవాసపర్వము.

మ. అకటా! నావరహోమధేనువుల మోహావేశచిత్తంబునన్
సుకులీను ల్గనుచుండ గోఁచికొని దస్యు ల్పోతి రో దుష్టశి
క్షకులారా! కరుణాళురార! కరుణన్ గావింపరే ప్రోవరే
సుకవీంద్రు న్ననుఁ గావరే సుకృతముల్ శోధింపరే పాపముల్. 107

క. అని యాక్రోశధ్వానము, తన చెవులం బడిన నింద్రతనయుండు గడున్
వనరుచు సంభ్రమమున నటఁ, జని విప్రునిఁ గాంచి వినియె సర్వము తెలియన్. 108

* అర్జునుఁడు పండ్రెండుమాసములు తీర్థయాత్ర చేసినట్లు కొన్నిప్రతులయందుఁ జెప్పఁబడియున్నది.

వ. అర్జునుం డావిప్రున కిట్లనియె. 109

చ. అడలకు మయ్య నే నిదె క్ష♦ణార్ధములోపలి నీదుహోమపుం
దొడుకులఁ దెచ్చి యిచ్చెదను ♦ దుచ్ఛులు మ్రుచ్చుల మచ్చమాపి నా
కడిమిని జూడు శిష్టులను ♦ గాచి నికృష్టుల రాచి లోకమం
దడరుకురుప్రవీరులవ♦రాన్వయసంభవు న న్నెఱుంగవే. 110

వ. అనిపలుకుచు నార్తత్రాణపరాయణుం డగునారాయణప్రియుం డాయుధాగారం బున ద్రౌపదితో ధర్మజుం డుంట యెఱింగియు నటఁ దనకుం బోవుటం జేసి ధర్మ హాని యైన దనకు వనవాసంబు వచ్చినను జచ్చినను సమ్మతంబ బ్రాహ్మణదుఃఖంబు వాపుటయె పరమధర్మం బని తలంచి లోనికిం జని ధర్మజున కెఱింగించి ధను ర్బాణంబులు పుచ్చుకొని బ్రాహ్మణుని వెంటం జని మ్రుచ్చుల సంహరించి గోధనం బాయన కిచ్చి మరలి వచ్చి యుధిష్ఠిరుం గని నమస్కరించి నాచేసినమర్యాదాతి క్రమణంబునకుఁ బ్రాయశ్చిత్తంబు సేసికొన ననుగ్రహింపు మనిన నతం డిట్లనియె.

చ. ఎఱుఁగక బ్రాహ్మణార్థమున ♦ ని ట్లొనరించితి ధర్మలోప మిం
దిఱుకదు భారతాన్వయుల ♦ కెప్పుడుఁ జెప్పఁగ దుష్టశిక్షయే
నెఱి గలధర్మ మిందున న♦నేకవిధాఘము లేగుఁ గావునన్
మఱలుపు మాప్రియత్నము కు♦మార పునీతుఁడ వైతి వెన్నఁగన్. 112

తరువోజ. అనిన ధనంజయుం ♦ డటు లైనఁ గాని ♦ యపవాదభీతిఁ బ్రా♦యశ్చిత్తముగను
ఘనతీర్థసేవకై ♦ కదలుట ధర్మ♦కార్యమ్ము న న్నను♦గ్రహదృష్టిఁ జూడు
మనుచుఁ బ్రార్థించి త♦దనుమతి వడసి ♦ యార్యుల కెల్ల న♦య్యది యెఱింగించి
వనవాసవరదీక్ష ♦ వడసి సద్విజులు ♦ వడిఁ ద న్ననుసరింపఁ ♦ బయనమై నడచి.

వ. నానావిధనదీనదంబులందలిసకలతీర్థంబులు సేవించుచుం బోయి పోయి. 114

ఉలూపి యర్జునుం జూచి మోహించుట.

క. గంగాద్వారంబున వర,గంగానదిఁ దీర్థమాడి ♦ కడుభక్తి మహా
త్తుంగతరంగములం బితృ,పుంగవులకుఁ దర్పణములు ♦ పొనరించి యటన్. 115

ఆ. గంగ వెడలి యగ్ని♦కార్యంబు దీర్పంగ, సంతరించి యున్న ♦ సమయమందు
నాగకన్య యొర్తు ♦ నరుఁ గాంచి మరుబారి, కగ్గ మగుచు నెంచె ♦ నాత్మ నిట్లు.

శా. అవురా! కన్నులు తమ్మి రేకులకు మా♦త్రై శ్రీనివాసంబు తా
నవు నూనూఁగుమీసముల్సొగసు కిం♦డ్లై పౌరుషం బందు నే

ల్చెవులున్ శ్రీలకు నుద్దులై కనులతోఁ జెల్మిం బొనర్పం బళీ
కవు నాకాశమ యై మృగేంద్రముల వేడ్కం బ్రోవఁ జాల్పాపురే. 117

చ. పరిమళ మొల్కుచుండు తెగ బారెఁడు నల్లనిసోగ వెండ్రుకల్
వరుసలుదీరు షట్పదరిఁ బన్నగఁ బోవఁగఁ బాఱఁ ద్రోలు బం
గరుజిగినెమ్మొగంబు నెఱిఁ గ్రాలెడు వెన్నెలతేని దూఱు భా
స్వర మయి చేరలం గొలువ వచ్చును హెచ్చును పీనినేత్రముల్. 118

మత్త కోకిలము. కొండపిల్లలు పీనిమూఁపులు కోటతల్పు వెడంద యై
యుంతువక్షము బాహుయుగ్మ మయోమయార్గళ మై మహో
ద్దండసంగరశత్రు సాధ్వసదంబు లై కనుపట్టెన్
విందుగాఁ గుతుకంబు గూర్చెడు నీలవేణుల కెత్తుటన్. 119

వ. అని తమకంబున నభివర్ణించుచు మోహపరవశ యై తనతిరస్కరిణీవిద్యం జేసి
వానిం బట్టి తిగిచి నాగలోకంబునకుం గొనిపోయిన నతం డట నెప్పటివలె నగ్ని
కార్యంబు దీర్చి యెదుట నున్ననాగకన్యం జూచి నీ వెవ్వరిదాన వి ట్లేల సాహ
సించితి వనిన నది వినయమ్మున ని ట్లనియె. 120

క.*ఐరావతకులజుం డగు, కౌరవ్యునికన్య నేను గామవివశ నై
కోరికఁ దెచ్చితి నిను నెన,రారం గను మే నులూపి యనియెడుదానన్. 121

వ. అనిన నర్జునుం డి ట్లనియె. 122

ఉ.‡ద్వాదశవార్షికవ్రతము ధర్మజుపంపునఁ జేయఁ బూని నా
నాదిశలందుఁ గొందుపడి న ల్వాగుతీర్థము లెల్ల మెట్టి ని
ష్ఠాదృతి నున్న న న్నిటు కటా చెఱు పుంటివి నీమనోరథం
బీడినమంద తీర్పుటకు నే నెటు నేరుతుఁ జెప్పవే చెలీ. 123

క. నావ్రతము నానవితామణి, భావమునన్ మెచ్చి నీదుపకమవ్రతమున్
నే విని యెఱుఁగుదు సమయము, ద్రోవదికారణమువలనఁ దొడఁగితి కాదే. 124

ఆ. దాన నైనవ్రతము గాని మానవనాథ, బ్రహ్మచర్య మనుట పాడి గాదు
సకలధర్మములును జర్చింపఁ బ్రాణదా,నముకసదు లన వినమె నరేంద్ర. 125

చ. కరుణఁ దొఱంగి నన్ గలయఁగా మదిసేయవ యేని జూచుచో
మరణము నొంది నీపెతలమార్గము వట్టెదఁ జిత్రగుప్తుఁ డన్

---

* నన్నయాదులతెలుఁగులం దులూచి యని యున్నది. కారణము మృగ్యము.

‡ అదృతి = ఆదరము.

చ.*కురువృషభుండు పాండునకుఁ ◆ గూర్చుకుమారుఁడ సర్వధర్మవి
ద్వరుఁ డగుధర్మపుత్త్రునకుఁ । దమ్ముఁడ శస్త్రకలావిదుండ నో
నరవర నేధనంజయుఁడ ◆ నాఁబరువాఁడ భవత్కుమారి నీ
తరుణిని గోరితిం గరుణఁ ◆ దార్కాణనఁ జేయవె నాకు నాప్పుడున్. 132

మత్తకోకిలము.† ఆతఁ డిట్లని పల్కు ధన్యుఁడ । నైతి నోకురువీర నా
కూఁతు నిచ్చెదఁ గాని ని న్నొక ◆ కోర్కెఁ గోరుదు దాని కీ
వీతఱి న్మది సమ్మతించితి ◆ వేని మాకులమం దను
స్యూత మై యరుదెంచుధర్మము ◆ నొప్పఁ దప్పక నిల్చెడున్. 133

వ. అది యెట్టి దంటివేని వినుము. 134

తే.‡పరఁగె మాకులమందుఁ బ్ర ◆ భంజనుండు, నాఁగ నొక్కఁ డతండు సం ◆ తానకాంక్ష
నభవునిం గూర్చి తపియింప ◆ నతఁడు వొల్చి, జనన మందు నొక్కొక్క ప్ర ◆ సవ మొసంగె.

వ. దానం జేసి మావంగసంబువారి కొక్కొక్కప్రసవంబు గలుగుచుండె నా కీపుత్త్రిక యొక్క
తయుఁ గులోత్పాదిని యై జన్మించుటం జేసి దీని నేను బుత్త్రునిఁగా భావించుచుంటి
నిది యిట్టిద కావున. 136

తే.§దీనియందు నీ కొదవిన ◆ సూను నస్మ, దన్వయవివృద్ధి కొసఁగు మి ◆ య్యదియ శుల్క
మిచట నీ కిచ్చుగిల దేని ◆ యిట్లు చేయ, బాస యిడి కన్నెమిన్నను ◆ బడయు మనఘ.

చ.¶అనవుడు సమ్మతిల్లి నరుఁ ◆ డత్తరుణీమణిని న్వివాహ మై
మనసిజరాజ్యవైభవము ◆ మానినితోఁ గడుఁ జెంది పొంది పెం
పున నట మూఁడువర్షములు ◆ పుచ్చి సతీమణి నీరు మోయుటల్
గనుఁగొని మామకుం దెలిపి ◆ క్రన్నన నేగెను దీర్థసేవకున్. 138

వ. ఇట్లు చని ధనంజయుండు దక్షిణసముద్రతీర్థంబు లెల్ల నాడుచు సౌభద్రతీర్థంబున
స్నానంబు సేయ సమకట్టి యున్నసమయంబున సచివులు నుత్తరని కట్లనిరి. 139

—●●◆ పంచతీర్థవృత్తాంతము. ◆●●—

చ వలనదు నీటిలోఁ దిగఁగ ◆ వాసవనందన యిల్లు సల్లిలీ
జలముల సంచరించు నిట ◆ స్నాన మొసర్పఁగ నెంతవారును
దలఁకెదరు త్యజింతు రీసుమహి ◆ తం బగుతీర్థము గానఁ బైదెసల్
వెలుపలనుండి మ్రొక్కికొని ◆ వేఱొకచోటికిఁ బోదు రెప్పుడున్. 140

* తార్కాణము = కదియు. † ధర్మము = ఆచారము. ‡ జననము = కులము. § ధర్మశాస్త్రము లెట్లున్నను
దౌహిత్త్రునిఁ బుత్త్రునిఁగా స్వీకరించునాచారము తొల్లియుం గల దని దీనం దెలియఁబడుచున్నది.
¶ మూఁడుమాసము లని నన్నయభారతమం దున్నది.

వ. మఱియు నిట్టిభయంబునం దగిలి యీదక్షిణసముద్రతీరంబున నగస్త్య పౌలోమ
కారంధమ భారద్వాజంబు లనునాలుగుతీర్థంబులు గలవు జగత్ప్రసిద్ధంబు లగునిప్పంచ
తీర్థంబులును నూఱేండ్లనుండి యుగ్రగ్రాహగృహీతంబు లై జనవర్జితంబు లయ్యెఁ
గావున నీవు సాహసింపకు మనిన సవ్యసాచియు. 141

క. తైర్థికుఁడ నై సనాథతీర్థంబుల నాడ కునికిఁ ♦ దెలియ నుచితమే
తీర్థపదులార వెఱఁగొని, వ్యర్థుఁడ నై పోవఁ జూతుఁ ♦ డని తెగువ మెయిన్. 142

క. దిగి నీట మునిఁగి విమలం, బగుచిత్తముతోడ స్నాన ♦ మాడుచు నుండన్
దగిలె మహోగ్రగ్రాహము, మిగులఁ జని భీభత్సుకాళ్లు ♦ పట్టుకొనుటయున్. 143

తే. బలపరాక్రమవంతుఁ డా ♦ పార్థుఁ డంత, బాహుబలమున దానిని ♦ బట్టి తిగిచి
గట్టునం బడ వైచె న ♦ ప్పట్టునందు, మొసలి పడు చయ్యె నబ్బుర ♦ మెసక మెసఁగ.

వ. అర్జునుండును దివ్యాప్సరోరూపంబున నున్నదానిం జూచి నివ్వెఱపడి నీ వెవ్వరిదాన
వి ట్లేల యున్నదాన వనిన నది యి ట్లనియె. 145

సీ. వాసవాత్మజ నేను ♦ వర్గ నాఁ బరఁగుదు, రను నా చెలులు నల్వు ♦ రనుపమాంగు
లే మెల్లలోకముల్ ♦ గామించి తిరుగుచు, నీలోకమున నొక్క ♦ ఋషిని గాంచి
తత్తపోవిఘ్నత ♦ త్పరత మై మెలఁగిన, నలిగి యమ్ముని మమ్ము ♦ నపలఁ దిట్టె
దాన నేము మొసళ్ల ♦ మై నీట ని ట్లుంటి, మెంతవ వ్వయ్యెనో ♦ యెఱుఁగ రాదు

తే. అమరముని చెప్పె శాపమో ♦ క్షమును మాకుఁ, బాకశాసని నీవు పో ♦ కై కవినుత
నన్నుఁ బోలెను నాసఖు ♦ ల న్నలుపురఁ, గాచి రక్షించి పుణ్యంబు ♦ గాంచవయ్య.

వ. అనిన నతం డట్ల కాక యని వర్గ చెప్పినట్లు సౌరభేయి సమీచి బుద్బుద లత యను
వారి నలువురకుం గ్రమంబున శాపమోక్షంబు ప్రసాదించి స్తోత్రపాత్రుం డై చిత్రాం
గదకుఁ బుత్త్రుండు పుట్టుట విని వానిం గని పోవ మణిపూరపురంబునకు మగిడి వచ్చి
బభ్రువాహనుం డనువానిం దనమామ కిచ్చి వెనుక వారి వీడ్కొని గోకర్ణాదిపుణ్య
తీర్థంబులం జూచుచుఁ జని పశ్చిమసముద్రతీర్థంబులు సేవించుచు బ్రభాసతీర్థంబునకుం
జనుటయును. 147

చ. నరుఁ డిలఁ దీర్థయాత్రలఁ బొ ♦ నర్చుచు వచ్చి ప్రభాసతీర్థభూ
పరిసరమందు మెట్టు నని ♦ వార్త నిజాప్తులు సెప్ప ద్వారకా
పురి విని తత్పరత్వమును ♦ బొందఁ జనార్దనుఁ డందుఁ బోయి భూ
సురవ్రతుఁ డై నఫాల్గునుఁ ♦ జూచి ముదంబడి వాని కి ట్లనున్. 148

ద్విపదము. తడ వయ్యె నిన్నుఁ జూచి ♦ ధర్మాత్మవతాని
కను దేశములు చూడఁ ♦ గలిగె వచ్చితివె

యెడఁద బ్రియంబు బయ్యె ♦ నిట రాక వించుఁ
దోడికొని పో నిచ్చ♦తో వచ్చినాఁడ. 149

## సుభద్రాహరణపర్వము.

వ.*అని యభినందించి పూజితుం డై వానిం దోడ్కొని రైవతకాచలమ్మునకుం జని నాఁటిరాత్రి యట శయనించి మఱునాఁ డరుణోదయంబున నతనిచే యతివేషంబు వేయించి తనరథం బెక్కించుకొని ద్వారకాపురంబునకు నిర్గమించి తనయింటం బెట్టుకొని యుండె నంతఁ గొంతకాలంబునకు రైవతకోత్సవంబు ఘోషింపంబడుటయును.

భుజంగప్రయాతము. మృదంగాదితూర్యాళి ♦ మిన్నంది మ్రోయన్
విదేశీయు లాబాల♦వృద్ధంబుగా న
ప్పదస్థు ల్మహోత్సాహ♦వర్ధిష్ణు లై స
మ్ముదం బొప్ప నం దేగి ♦ పూజించి రద్రిన్. 151

వ. మఱియు రేవతీరమణుండు నుగ్రసేనుండును సత్యకుండును సాత్యకియు హార్దిక్యుండును నుద్ధవుండు నక్రూరుండును బ్రద్యుమ్నుండును సాంబుండును సారణుండును గదుండును విదూరథుండును జారుదేష్ణుండును లోనగుయదువృష్ణిభోజాంధకప్రవరు లెల్ల నవలాలం గూడి పోయి రైవతకోత్సవంబు ప్రవర్తింపుచుండి రప్పుడు. 152

క. నరనారాయణు లిద్దఱు, పరివారము గొలిచి నడువ ♦ బహురత్నమణీ
పరికలితకాంచనరథ,చరము నధిష్ఠించి చనిరి ♦ వైభవ మరయన్. 153

వ. అట్లు చని నలుగడం గలయఁ గ్రుమ్మరుచున్నసమయంబున. 154

మ. జన మెల్లన్ గిరిపూజ సేయునెడలం ♦ జంద్రాస్యలం గూడి తా
నును భక్తిన్ భజియించుచున్నదానిని జగ♦న్మోహాతిసౌందర్య మం
దినదానిన్ రతిఁబోనికన్య నమరి♦స్త్రీమాన్యధన్యాకృతిన్
ధనరేఖోన్నతిసర్వభద్రను సుభ♦ద్రం గాంచెఁ బార్థుం డటన్. 155

వ. ఇట్లు కాంచి పంచబాణబాణపరంపరావిద్ధుం డై తదేకాగ్రబద్ధచిత్తుం డై ఱెప్ప వేయక చూచుచున్నగుడాకేశునిం గని నవ్వుచు హృషీకేశుం డి ట్లనియె. 156

చ. అడవుల నాకలంబు దిను♦నట్టివనేచర నీకు నిట్టిచోఁ
బడుచులఁ జూచి మోహపడు♦భావము వచ్చెను జాలుఁ జాలు నీ
నడవడి మాకునుం దెలిసె ♦ నవ్వుదు రెవ్వరు విన్న నిన్నటం
చడరినమందహాసమున ♦ హాస్యము సేయుచు నంత వెండియున్. 157

---

* యతివేషము కొన్నిప్రతులయందు లేదు.

ఆ. ఇది సుభద్ర యనఁగ ♦ నెసఁగు సారణునకు, సహజ యగును నాకు ♦ సవతిచెల్లె
లగును నీకు దీని ♦ యం దనురాగమే, నయ్య కెఱుఁగఁ జెప్పు ♦ మది ఘటింతు. 158

వ. అనిన సంతసిల్లి విజయుం డి ట్లనియె. 159

క. గోవిందునకుం జెలియలు, వావికి నామేనమామ ♦ వరసుత విలస
ద్భావసవతి సుందరవతి, భావంబునఁ గోరెఁ జనదె ♦ బావా! దీనిన్. 160

మ. అనినం గృష్ణుఁడు వల్కు నీవలపు నే ♦ నధ్యాత్మ నూహించితిన్
మును ము న్నింతుఁ బ్రయత్నముం బొసరుతుం ♦ బో కావ యేని న్స్వయం
బున రాజన్యులకున్ స్వయంవర మదో ♦ ష్షన్ బల్మిఁ గై కొంటయుం
జనుఁ గానన్ హరియింతు కాని యెటులేఁ ♦ జాలన్ సుఖం బుండుమా. 161

వ. అని పురందరనందనునకు హృదయానందంబు గావించి తదుదంతంబు రహస్యంబున
నింద్రప్రస్థంబున నున్నయుధిష్ఠిరున కెఱుఁగం బుచ్చి యున్నయప్పుడు. 162

—•—◆ అర్జునుఁడు ద్వారకానగరంబున సుభద్రకడ నుండుట. ◆—•—

మ.*బలదేవాదులు వచ్చి కొన్నిదినముల్ ♦ ద్వారావతి న్నిల్చి పో
వలయున్ మీ రని ఘాంబరీమునివరుం ♦ బ్రార్థించి శోకించుచుఁ బో
యి లలిం గృష్ణునిసమ్మతి న్నగరికిన్ ♦ శృంగారధామంబునన్
నిలువం జేసిరి భద్ర సేవ లిడఁగా ♦ నేమించి ప్రేమించుచున్. 163

మ. పరమాన్నంబులు భక్ష్యభోజ్యఫలపు ♦ ష్పంబుల్ సమర్పించుచున్
బరిచర్యల్ మిగులన్ సుభద్రి పొసరిం ♦ పన్ రామముఖ్యుల్ నిరం
తరముల్ భక్తి భజింప సర్వజనమి ♦ త్రత్వంబు సేకూర స
న్నరుఁ డాద్వారవతీపురంబునను గొ ♦ న్నా ళ్లుండె నెయ్యంబునన్. 164

ఉ. తీఁగమెఱుంగువోలె సుద ♦ తీనివహంబులతోడ నెప్పుడున్
వీఁగక కూడిమాడి తన ♦ వెంట మెలంగుచు సేవ సేయుచున్
రాగము రాఁగఁ బల్కు చెల ♦ వారుసుభద్రను జూడఁ జూడ లో
మూఁగినకూర్మి సన్నరుఁడు ♦ మోహము నెంచెను నాఁడునాఁటికిన్. 165

వ. మఱియు నతండు తనమనంబున. 166

క. పదియార్వన్నెపసిండికి, బదు లీమదిరాక్షి మేను ♦ పరికింపఁగ నె
మ్మది దీనిఁ బొందఁ గోరని, ముదివేఁదులు గలఁడె యొకఁడు ♦ మూఁడుజగములన్.

* సుభద్రికు భద్ర యనియు వ్యవహారము కలదు. కొన్నిప్రతులయందు రైవతకమునుండియే సుభద్ర నర్జునుఁడు హరించిన ట్లున్నది.

ఉ. ఈనడ లీయొయ్యారములు ◆ నీసొగ సీబలునీటు లీబెడం
గీనెఱిచూపు లీవగలు ◆ నీపస లీతగునేర్పు లీసొరం
బీనగుమోము నీతళుకు ◆ లీపెనువన్నెలు చిన్నె లెన్నఁగా
నీనవలాక చెల్లు నిది ◆ యే తురు నేలెడుబోటి కాఁ దగున్. 168

సీ.*ఈకీరవాణితో ◆ నేకతంబున మాట, లాడువాఁ డాశుకు ◆ నట్టివాఁడ
యీహరిణాక్షిచూ ◆ పెవనిపైఁ బడు వాఁడు, సారంగధరునట్టి ◆ సౌరువాఁడ
యీకోకవక్షోజ ◆ నిఱియఁ గౌఁగిటఁ జేర్చు, వాఁడు విభాకరు ◆ వంటివాఁడ
యీచక్రసుశ్రోణి ◆ నేలువాఁ డలసార్వ, భౌముసంతటిమహా ◆ ప్రతిభవాఁడ
తే. యీచెలియఁ జెట్టఁబట్టి వాఁ ◆ డీప్సితమ్ము, లన్నియును దీఱ మధురాధ ◆ రామృతంబు
లాప మాఱంగ నానెడు ◆ తాపసునకు, నీవిమోక్షమె మోక్షమై ◆ నెగడుఁ గాదె.

వ. అని యువ్విళ్లూరుమానసంబున నతండు తనమనోరథం బీడేర్చుకొన నంతరం బన్వేషించుచుండె నంత నాసుభద్రయు. 170

సీ. కాలాంబుదశ్యాముఁ ◆ గాంతిచ్ఛటాధాము, నాజానుబాహు ము ◆ హాద్రిదేహు
సంపూర్ణపూర్ణిమా ◆ చంద్రవదను గళా, సదను మహోవక్షు ◆ సారసాక్షు
నీలవక్రాలకు ◆ లీలావిశాలకు, వనితాహృదయలోలుఁ ◆ గనకచేలు
మందహాసమనోహ ◆ రుం దులసీధరు, స్థిరవీక్షణాసాధ్యు ◆ సింహమధ్యు

తే. గృతకయతిఁ గాంచి వినుకలి ◆ కతన విజయు
నందుఁ గలహావభావము ◆ లతనియందుఁ
బొందియుండుట సందియ ◆ మందుచుండి
మునికి నొకనాఁడు దా నిట్టు ◆ లనియెఁ బ్రీతి. 171

ఉ. దేవర మీరు చూడనివి ◆ దేశములుం బురముల్ సరంబులున్
లేవు ధరాతలంబున ని ◆ లింపులప్రోలనఁ బోలి పాండవ
శ్రీ వెలయింపఁ జేయునగ ◆ రిం గనుఁగొంటిరె పాండవేయులుం
ద్రోవదియుం బృథాసతియు ◆ ను న్సుఖముండిరె నిండువేడుకన్. 172

సీ. నీలంపుజాలడా ◆ ల్డీలింపఁగాఁ జాలి, మిసిమినిగ్గులఁ దేలు ◆ మేనివాఁడు
కందమ్ములం దమ్మ ◆ లం దమ్ము లనిపించు, నందమ్ము లగుకన్ను ◆ లమరువాఁడు
పున్నమజాబిల్లి ◆ పోలిక విలసిల్లి, ముద్దు లొల్కెడునగు ◆ మోమువాఁడు
మేటిమారునికొల్వు ◆ కూటంబు నా నొప్పు, డం బైనవెడదయు ◆ రంబువాఁడు

*ఇందుఁ గీరవాణిప్రభృతిశబ్దములు శుకాదిసంబంధద్యోతకములు. చక్రము = రాష్ట్రము.

తే. నవ్వురుఁ గనునూఁగునూఁగుమీ•సములవాఁడు
పిడికిటను బట్ట నిమిడెడు•నడుమువాఁడు
మేనయత్తకు వరపుత్త్రుఁ•డైనవాఁడు
నిర్జితాఖిలదుర్జనుం•డర్జునుండు. 173

చ. కటకట తీర్థయాత్రలకుఁ•గా నిల యెల్లను మెట్టఁ బోయి నాఁ
డఁట విని యుంటి వాని నెట•నైనను గంటిరె వింటిరే శుభో
త్కటగతి నింతలో మరలి•తాఁ జనుదెంచునె మేనబావ ప్ర
స్ఫుటముగఁ దొంటిసౌఖ్యమునఁ•బొందునె నా కెఱిఁగింపుఁడీ దయన్. 174

వ. అనిన విని నవ్వుమొగంబుతోఁ గవ్వడి పువ్వుఁబోఁడిం జూచి యిట్లనియె. 175

క. దేశముల నెల్లఁ జూచితి, నాశాష్టకమందుఁ గలుగు•నఖిలపురములుం
గాశియుఁ బ్రయాగ మొదలుగ, నో శశివదనా యెఱింగి•యుంటినిగదవే. 1

క. నీమేనత్తయు సుతులుం, దా మింద్రప్రస్థపురము•నం గుశలుల సు
త్రామసుతుఁ డరిగి రాలే, దా మహి నొకవార్తమాత్ర•మది వినఁబడియెన్. 1

మ. అతఁ డీలోపలఁ బశ్చిమాంబునిధిచా•యన్ ద్వారకామార్గమున్
యతివేషంబునఁ బట్టి వచ్చె ననియుం•దా నొక్క యుక్కట్టునన్
మతి లే కార్తుఁడ వై భ్రమించు ననియున్•మా నేది తచ్చింతచే
సతతంబున్ సగ మై కృశించె ననియున్•సత్యోక్తి నచ్చెం జెలీ. 1

వ. అనుటయు నమ్మాట విని మాట లేక విషణ్ణవదనయై నిట్టూర్పు నిగిడించుచున్న
దాని కతండు వెండియును. 17

క. ఏ మిది నీ కాతనిపైఁ, బ్రేమము ఘన మైనయట్లు•విఖ్యాత మగున్
గామిని కౌతుకమేని, న్నామోఁదం జూప రాదె•నరుఁ డేఁ గానే. 18

మ.*అన నాకోపన గన్నుఁ దెఱ్ఱబడ మా•యామానినిం గ్రూరదృ
ష్టిని బొమ్మ ల్ముడి వెట్టి చూచుడు మదిం•జిట్టాడుమోహంబునన్
వనితారత్నము డాఁప నేల విజయుం•డన్నేన చూవే నినుం
గనునాసం జనుదెంచినాఁడ నిటు న•న్గామించి ప్రేమింపవే. 1

వ. అని పలికి విజయుండు పిరాళిం బడి చెనకం జూచిన సుభద్రయు మొగంబు
వాంచి మానముద్రం గాంచి కొంచెంబు గానిసిగ్గున దిగ్గునం దొలంగి కలంగుచు
గన్యాంతఃపురంబునకుం బఱచి మదనవేదనాభరంబునం బరితపించుచుండె ని
నర్జునుండును నితాంతకంతుసంతాపసంతప్తచిత్తుండై తత్తఱంపడుచుండె నత్తఱి

* కోపన = కోపముగలది.

అర్జునుఁ డింద్రప్రస్థమునకు సుభద్రం దోడ్కొని పోవుట.

శా. అంతర్ద్వీపమునందు నుత్సవము సేయం బూని ద్వారావతిన్
సంతోషంబున నున్న యెల్లప్రజలున్ • సంకర్షణాదుల్ సనం
గాంతుం డంతకు మున్న చెప్పుట నెఱుంగన్ రుక్మిణీసత్య లా
వంతం గొంకక తెచ్చి యిచ్చిరి సుభద్రాబ్జాక్షి సన్యాసికిన్. 183

వ. వాసవాత్మజుండును వాసుదేవాభ్యనుజ్ఞాతుండు గావున సుభద్ర గాంధర్వవిధిం బరిగ్రహించి యతివేషంబు విసర్జించి సర్వసన్నద్ధుండై రుక్మిణీసత్యభామలయును మతంబు వడసి సుభద్రాసహితంబుగా భద్రరథాధిరూఢుండై యింద్రప్రస్థంబునకుం బ్రయాణంబై కదలి చనియె నప్పు డప్పురద్వారంబున. 184

తరళము. నగరరక్షకు లర్జునుం గని • నాతిం దొంగిలి పోవు నీ
నగవిభేదిసుతుండు దా నిది • న్యాయమే కనుచుంచుటల్
నగధరుండును రాముఁడు న్విని • నం బ్రమాదము వచ్చు నం
చగణితంబుగ మూఁగి మూఁకగ • నాఁగి రార్చుచు నేయుచున్. 185

వ. పురందరనందనుండును వారి నందఱ నొక్క యిషీకంబునం దఱలించి పాఱం దఱిమి వాయువేగంబున రథంబుఁ దోలుకొని పురంబు వెడలి చనియె నంత యథాయథ లగువారు పోయి సభాపాలుర కెఱింగించిన వారు దుందుభిధ్వానంబున యతివేషధరుం డయినధనంజయుండు సుభద్రం జెఱగొని పోయె నని యంతర్ద్వీపంబున నున్నవారి కందఱకు నెఱుంగ శబ్దంబులు వలికించుటయు నక్కడ. 186

సీ. జలకమాడెడువారు • జలకమాడెడునట్లె, కలివిలిపడి లేచి • కదలి చనిరి
నిదురవోయెడువారు • నిదురవోయెడునట్లె, గజిబిజిపడి చూచి • కదలి చనిరి
కూడు గుడుచువారు • కూడు గుడుచునట్లె, కళవళపడి త్రోచి • కదలి చనిరి
నిలిచి యుండినవారు • నిలిచి యుండెడునట్లె, గలిబిలిపడి యేచి • కదలి చనిరి
తే. వృష్ణియదుభోజకులమహా•వీరు లెల్లఁ, బెల్లు రేఁగినరణభేరి • విన్నమాత్ర
సర్వసాధనముల నల్ల • సంతరించి, యుద్ధతిని గూడి యుద్ధసన్నద్ధు లైరి. 187

హరణాహరణపర్వము.

క. అపుడు బలదేవుండు వాసుదేవుం జూచి యి ట్లనియె. 188

చ. *ఋషివలె వచ్చి క్రుమ్మరుచు • నెవ్వరు లేనియెడం గ్రహించి తా
భషకము హవ్యముం బలె సుభద్రను దొంగిలె దొంగకోడి క

* దొంగకోడి = ఇటఁ గోడియై గౌతముని వంచించినయింద్రుఁ డని తెలియం దగు.

ల్మషమున నైన వాఁ డొకఁడు • మాధవ నీవిది యే మెఱుంగవో
హ్యాపితుఁడ వయ్యె దేమిటి కు • పేక్షకుఁ గాలమె నాఁగఁ బోలునే. 189

**ఉత్సాహము.** నిన్నుఁ జూచి మేము వాని • నిక్కువంపుయతిని గా
నెన్ని పూజ సేసినార • మింతవింత గలుగునే
తిన్నయింటివాసములను • దీసినట్లు కన్నియం
గొన్నవాఁడు కులవిహీన • కుండు వాఁడు చూడఁగన్. 190

**చ.** కురుకులపాంసనుం డయిన • క్రూరుఁడు వాఁ డటు నిన్ను నన్ను నీ
గురులఁ దృణీకరించి మన • గోడి దొలంచి బలాత్కరింపుచున్
దరుణి గ్రహించి పోయె నిది • తామరసాక్ష తలంచి చూడ నా
శిరమునఁ దన్నినట్ల వగఁ • జేసెను రోసము రాక యుండునే. 191

**క.** అని బలదేవుఁడు క్రోధించిన విని కృష్ణుండు లోనఁ • జెఱునగ వడరం
గని యన్న కిట్లు వలికెను, దనియం ధర్మార్థసంయు • తము లగునుడులన్. 192

**సీ.** భరతవంశాగ్రణి • పార్థుఁడు తన మేనమఱఁదలిఁ గొంట వ • మాన మగునె
రాజులకు స్వయంవ • రము సెప్పినది కాదె, కన్నె నమ్ముకొనంగఁ • గలమె మనము
నాక కాదిది సర్వ • లోకమ్ములకును సమ్మత మగుఁ గాని దు • ర్మతము గాదు
శక్రాదిసుర లైన • సంగ్రామమున నోర్వఁ, జాలఁ బో రానవ్య • సాచి నేచి
**తే.** యతనితోఁ బోరి యోడింతు • మనెడునిట్టి
దురభిమానము మీ రెల్లఁ • దొఱఁగుఁ డింక
మంచిచుట్టఱికము వచ్చె • మన కటంచు
సంతసించుచు నటఁ జూడఁ • జనఁగ నొప్పు. 193

**వ.** అని బోధించి వారి నెల్ల వారించె నంత నటఁ గౌంతేయుండును సంతతప్రయాణం
బుల నింద్రప్రస్థపురంబునకుం జని ధౌమ్యధర్మజభీమాదులకు మ్రొక్కి కవలం
గౌఁగిలించుకొని సుభద్రచేఁ గుంతీద్రౌపదులకు మ్రొక్కించి పరమానురాగం
బున సుఖంబుండె నంత. 194

**మ.** చెలియల్ మేనమఱందియుం గలసి వ్రా • పిన్ ఖాండవప్రస్థమం
వెలయం బొందుచు నుండి రంచు విని సం • హృష్టామలస్వాంతు లై
బలరాముండును కృష్ణసాత్యకులునున్ • బంధువ్రజంబుం భటుల్
గొలువన్ వచ్చి రటన్ శతాంగములతో • గోరత్నభూషాళితోన్. 195

**వ.** యుధిష్ఠిరుండును వారిరాక విని నిజానుజవర్గంబుతో నెదురుకొని వారి నెల్ల సంభా
వించి విడిదల నుంచి పూజించి నగరం బలంకరింపం బంచి పంచకరహితశుభముహూ

ర్తంబున ధౌమ్యయాజకంబుగా సుభద్రార్జునులకుఁ బాణిగ్రహణోత్సవంబు నిర్వ
ర్తించె నంత బలభద్రుఁడు సుభద్రకు నర్జునునకుం దక్కనుంగలవారికిని
నానావిధచీనిచీనాంబరాభరణాదులును రథహస్తిపత్తితురగశతసహస్రంబులును దాస
దాసీజనశతంబులును మఱియు ననేకచిత్రవస్తుసముదాయంబులును నరణం బొసంగి
పాండవులచేఁ బ్రతిసత్కారంబు వడసి విడువనికూరిమిం గొన్నిదినంబు లుండి కృష్ణు
నట మఱికొన్నినాళ్లుండ నియమించి వారి వీడ్కొని సపరివారుం డై ద్వారావతీ
పురంబునకు నిర్గమించె నంతఁ గొంతకాలంబునకు. 196

మ.*తగ నీ ర్కోసి సుభద్ర గాంచె సుతర।త్నంబుం బ్రభారత్నమున్
జగదేకప్రథితోన్నతామలయశ।స్సారున్ మహావీరు నా
శుగసంధానవిమోక్షణాద్యధికద।క్షున్ సారసాక్షున్ లస
న్మృగరాణ్మధ్యు మహారథాతిభయదా♦నీకాహితాసాధ్యునిన్. 197

క.‡జన్యముల నభీతియు నతి,మన్యువునుం గలుగుకతన ♦ మాన్యుం డగునా
ధన్యుం డభిమన్యుం డను,నన్యాసాధ్యాభిధాన ♦ మంది తలిర్చెన్. 198

చ. అరణికి నగ్నిపోలె సతి ♦ కట్లు సుతుం డుదయించి మించినం
గురుకులరాజశేఖరుఁడు ♦ గొంతిసుతుండు యుధిష్ఠిరుండు భూ
సురులకు వేనవేల్ ధనముఁ ♦ జూడఁగ నొప్పినగోసహస్రముల్
వరిమతి నిచ్చి ధౌమ్యు లక్ష్య♦ణం బొనరించెను జాతకర్మమున్. 199

క. మేనల్లుఁడనుం గృష్ణుఁడు, సూనునకుం బలెను సకల।శుభకర్మములన్
మానుగఁ బొనరించి దయా,స్థానం బై గారవించెఁ ♦ దద్దయుఁ బేర్మిన్. 200

మ. ఎలజాబిల్లిక్రియంగున న్నరిసుతుం ♦ డింపొంది నానాఁటికి
న్వలుక న్నేరిచి ముద్దుబిడ్డఁ డగుచు ♦ న్శాస్త్రంబులు న్వేదముల్
వెలయన్ ధౌమ్యులు దిద్ద నేరిచి ధను।ర్వేదంబు నాంతంబుగాఁ
దెలియం దండ్రికడం గ్రహించి ఘనుఁ డై ♦ తేజెన్ జగం బెన్నఁగన్. 201

తే.§దశవిధంబు చతుష్పాద♦విశద మమల
మగుధనుర్వేద మంతయు ♦ నర్జునుండు

---

* భావ్యర్థంబు నిట్లు చెప్పుట కవిసమయము గాని యనౌచిత్యము కాదు. ‡ మన్యువు=కోపము.

§ చతుష్పాదములు:—శ్లో. మంత్రముక్తం పాణిముక్తం ముక్తాముక్తం తథైవ చ
అముక్తంచ ధనుర్వేదే చతుష్పాదాః ప్రకీర్తితాః.

దశవిధములు:— శ్లో. ఆదాన మథ సంధానం మోక్షణం వినివర్తనం
స్థానం ముష్టిః ప్రయోగశ్చ ప్రాయశ్చిత్తాని మండలం
రహస్యం చేతి దశధా ధనుర్వేదాంగ మిష్యతే.

వాని కెఱిఁగించి తనయంత వానిఁ జేయ
నతఁడు జగదేకవీరుఁ డై యతిశయిల్లె. 202

వ. అనంతరంబ ద్రౌపదికిని ధర్మరాజభీమార్జుననకులసహదేవులవలన సంవత్సరంబున కొక్కరుండుగా గ్రమంబునఁ బ్రతివింధ్య శ్రుతసోమ శ్రుతకీర్తి శతానీక శ్రుతసేనులను పంచోపపాండవు లుదయించి ధౌమ్యకృతజాతకర్మాదిసత్క్రియాకలాపులై యభిమన్యుం బోలి వేదంబులును ధనుర్వేదంబును నభ్యసించుచున్నంత. 203

క. అల్లారుముద్దుబిడ్డలు, నిల్లాండ్రును దల్లి దారు నిద్ధవిభూతిం
దెల్ల మగురాజ్యసంపద, నుల్లసిలుచుఁ బాండవేయు లుండిరి నెమ్మిన్. 204



ఖాండవదాహపర్వము.

క. ధరణిం దోఁచె నిదాఘము, తరుశాఖాకషణజాతదవదగ్ధధరా
ధరకందరసుప్తస్థిత,పరమమృగాక్రందనంబు పరికింపంగన్. 205

మ. రవిశుష్యత్కృతభూతలోద్ధతరజోరాజిప్రకర్షంబు వృ
త్తవిశేషాధికచంక్రమత్ప్రబలవాతప్రాపితం బై వడిన్
దివికిం బాఱుచు నెల్లెడం గనఁ దగెన్ దీవ్యన్మహానాకసౌ
ధవరం బాఁగుట కెంచి తజ్జ్ఞుఁ డిడుయంత్రస్తంభపుంజంబు నాన్. 206

చ. పెటపెట వేఁగ నేలఁ గను వేఁడిమి నెండలు గాచె నగ్నులుం
జిటచిట లాడ నేర్చె వనసీమలఁ బశ్చిమవాతముల్ మహో
త్కట మయి నిప్పు లుప్పతిలఁగా వడఁగొట్టఁగ వీచెఁ గాడ్పు ప్ర
స్ఫుటముగఁ గాలుధూళి ధరిఁ బుట్టెను బెట్టుగ నట్టివేసఁగిన్. 207

వ. అట్టినిదాఘసమయంబున నరనారాయణు లిద్దఱును శీతలచ్ఛాయాతలం బపేక్షించి యమసంభవానుమతంబున యమునాతీరంబునకుం జని ఖాండవవనసమీపంబున నందనోపవనసుందరం బగునొక్కచందనవనంబున నిచ్ఛావిహారంబులం దేలుచు నొక్క చంద్రకాంతశిలాతలంబున మందమలయానిలం బనుభవించుచు నిష్టకథావినోదంబులం దగిలి యున్నసమయంబున. 208

సీ. కరఁగెడుబంగారుకరణి నెఱింగెడు, పండఁ బాఱినపెద్ద బసుగుఁ గోడలు
మట్టియూడలతీరు మఱపించు నెఱ్ఱని, వడి వెట్టఁబడినట్టి జడలమోపు
పసిరికరంగునఁ గసిమసంగి పొసంగు, వింజామరలఁ బోలి విరియుమీస
లెగువుపాపులతోడ బిగు వేగి తిరుగుడు, వడుచు నెత్తురు గ్రక్కు వెడఁదకనులు

తే. *నారచీరలు పులితోలు నలఁత గలిగి
మేఁకపై నెక్కి నడయాడ లేక మూఁడు
ముడుతలం బడి ముక్కాలి ముదుకబాపఁ
డొక్కఁ డరుదెంచె నాకృష్ణు లున్నకడకు. 209
వ. ఇట్లరుదెంచి నరనారాయణపూజితుం డయి విప్రుండు వారి కిట్లనియె. 210
క. అన్నింటికిఁ గొఱకాఁడను, నన్నగ్నింబోని బ్రాహ్మణప్రవరునిఁ గా
నెన్నుఁడు బహుభోక్తను నా, కన్నం బిష్టముగఁ బెట్టుఁడా తనియంగన్. 211
వ. అనిన నీ కెట్టిభోజనం బిష్టంబు పెట్టం బ్రయత్నింతుము చెప్పు మనిన వారి కతం డిట్లనియె. 212
చ. అనలుఁడ నాకు నిష్ట మగు నన్నము ఖాండవ మింద్రుఁ డెప్పుడున్
దనచెలి తక్షుకుం డచటఁ దా నివసించుటఁ జేసి దానిని
మనిచెను దావదాహమును మబ్బులఁ ద్రోలుచు దాన నోడితిన్
జన నటు నస్త్రవేత్తలరు నా కది మీరల నుగ్రహింపరే. 213
వ. అని ప్రార్థించినం బార్థుం డచ్చెరుపడి చిచ్చున కిట్లనియె. 214
తే. అగ్నిభట్టారకా నీకు నట్టిదివ్య, ఖాండవవనంబు గుఱించి యుండె నెద్ది
కారణము దాని వివరింపఁ గలవె యనుడు, నగ్నిదేవుఁడు వానికి ననియె నిట్లు. 215

శ్వేతకి యను రాజర్షి వృత్తాంతము.

సీ. శ్వేతకి యనురాజు చేసెను స్సత్త్రంబు, లేఁడులు పూఁడులై యొసక మొసఁగ
నందు నేనింతయు బాజ్యంపునసుధార, లపుడు నన్నుతొండంబు లంత లయ్యె
నాకారణంబున నాకు వికారంబు, తేజోవిహీనత తేటపడియె
దానఁ గ్లానిఁ గృశించి నే నేఁగ పరమేష్ఠి, పాలికిఁ గుయి వెట్టఁ జాలి పుట్టి
తే. విధియు దివ్యౌషధంబులు వివిధసత్త్వ
సముదయంబులు గలఖాండవము భుజింపు
మనిన నే నేఁచుమాఱు లారపనికిఁ గడఁగి
యోటమిని జెందితి మహేంద్రుప్రాటవమున. 216
వ. అంత నేనయ్యుదంతం బంతయుం జని మరల విన్నవించిన విరించియు నించుక విచారించి నెండిఁగియు. 217

* నలఁత=అస్వస్థత. కృష్ణులు=వాసుదేవార్జునులు.
ఈ పద్యమందు ఎరుపుచూపులు, తిరుగుడు కన్నులు, మేఁకనెక్కుట, మూఁడుముడుతలు పడుట లోనగునవి యగ్నికిని సరిపడుచున్నవి.

క. నరనారాయణు లనుమును, లిరువురు మర్త్యమున సమర•హిత మొనగూడం
బరఁగి విహరింప వత్తురు, పరబాధం బాపి నిన్నుఁ • బాలింతు రనఘా. 218

వ. నాటంగోలె నేను మీకై పెద్దకాలం బిటఁ బ్రతీక్షించు చుంటి నని కృష్ణార్జునుల కగ్నిభట్టారకుండు చెప్పె నని చెప్పిన విని జనమేజయుండు శ్వేతకివృత్తాంతంబు సవిస్తరంబుగాఁ జెప్పు మనిన వైశంపాయనుం డి ట్లనియె. 219

తే. హరిహయోపముఁ డై తొల్లి • ధరణియందు, శ్వేతకి యనంగఁ జనురాజ•శేఖరుండు
యజ్వయును దానశీలుఁడు • నై వెలిర్చె, చేసె జన్నము లెన్నేని • చెన్ను మీఱ.

వ. ప్రతిదినాధ్వరక్రియాసమారంభసంభృతాబుట్ట యగునాతం డొక్కకాలంబున ఋత్విజులం గూర్చుకొని యొడఁగగ కథ్వరం బొనరించుచుండ హోమానుహోమవ్యాకులులై చను లై వా రార్త్విజ్యంబుల నిర్వహింపం జాల మని విడిచి పోయి నపు డతండు వెండియుం గొండొకయాజకుల నతిప్రయత్నంబునం దోడి తెచ్చి యెట్టకేల కాసత్రంబు పరిసమాప్తి నొందించి మఱియును. 221

మ. శతవర్షోచితదీక్షఁ గైకొని మహా•సత్త్రం బొకం డున్నతి
స్థితిఁ గావింపఁగ నెంచి ఋత్విజులఁ బ్రా•ర్థింపంగ వా రేము స
తతముం గర్మభరంబుఁ దాల్చి భవ•దజ్ఞంబులం దుండి సో
లితి మే మిచ్చిన నింకఁ జాల మనుచునా • లీలాపహాస్యంబునన్. 222

వ. నీకు రుద్రుండు యాజకుం డగుఁ బొ మ్మనిన నతం డానాధిక్షేపవాక్యంబులం గ్రుద్ధుం డై కైలాసభూధరంబునకుం జని నిష్ఠాగరిష్ఠుం డై దీర్ఘకాలం బామహాదేవు నారాధించిన నతం డంతఁ బ్రత్యక్షం బై వరంబు వేఁడు మనుటయు శ్వేతకియును. 223

ఉ. చాఁగిలి మ్రొక్కి దేవ నను • సాకఁ దలంచితివేని నీవు నా
యాగమునందు యాజ్యపద • మంది కృతార్థునిఁ జేయు మన్న నా
యోగివరేణ్యుఁ డై నశివుఁ • డో మనుజేశ్వర ద్వాదశాబ్దముల్
వీఁగక సంతతంబుగను • వేల్చుము నీ వధికాజ్యధారలన్. 224

వ. దానం జేసి నీ కిష్టసిద్ధి యగు నవ్వల మదంశసంజాతుం డగు దుర్వాసుండు నీకు యాజకుం డగుం బొ మ్మనిన నతం డత్యంత సంతోషితస్వాంతుం డై తదనుమతంబు వడసి నిజపురంబునకు వచ్చి దేవదేవుండు చెప్పిన చొప్పునం బ్రవర్తించి దుర్వాసునియాజకత్వంబునఁ బవిత్రం బగుమహాసత్త్రంబు గావించి కృతార్థుం డయ్యె నగ్నిహోత్రుండును ద్వాదశవర్షసంతతాజ్యధారాప్లుతుం డగుటం జేసి తనకు మాంద్యంబు గలుగఁ దేజోహీనుం డయ్యె నాకర్ణింపు మట్లు ప్రార్థించుచున్నపావకుం జూచి పార్థుం డి ట్లనియె. 225

సీ. ఉత్తమాస్త్రములు నా • కున్న వెన్నేనియు, వజ్రపాణిని నోర్వ • వశము కాని
బాహువీర్యమునకుఁ • బరికింపఁ జాలిన,కోదండ మది లేని•కొఱఁత గలదు
నీకోర్కెకిం దగ • నా కొక్కమేటివి, ల్లక్షయతూణీర • మధికశక్తి
వాయువేగామలా•శ్వయుగంబు గలదివ్య,రథము కృష్ణునకు నా•యుధచయంబు
తే. నొసఁగఁ జూచితివేని యో•యసితవర్త్మ
నాగులు పిశాచములు మూఁగ • నలువు మీఱ
ఖాండవంబును నీతిండి • గా నొసర్తు
మింద్రు నంటెటివాఁ డాఁగె•నేని మేము. 226

అగ్నిదేవుఁడు కృష్ణార్జునులకుఁ గార్ముకాదు లొసంగుట.

వ. అనిన నగ్నిదేవుండు వల్లె యని వరుణుం దలంచిన నతండు ప్రత్యక్షం బై తదనుమతంబున నర్జునునకు బ్రహ్మనిర్మితం బగునుత్తమకార్ముకంబును నక్షయబాణతూణీరంబులును వివిధాయుధభరితంబును రణితరమణీయమణికింకిణీసమలంకృతంబును గపికేతనవిరాజమానంబును శ్వేతవాహనవాహ్యమానంబును సకలదిగ్విజయాధిష్ఠానంబు నగునొక్క దివ్యరథంబును గృష్ణునకు సురాసురయక్షరాక్షసపిశాచోరగప్రశమనం బయి సహస్రభానుప్రభాభాసమానం బగుసుదర్శనచక్రంబునుం గౌమోదకియు నిచ్చి పోయినం బుచ్చుకొని సర్వసన్నద్ధు లై యున్నవారిం జూచి వైశ్వానరుం డిట్లనియె. 227

మ. ఇది గాండీవము నాఁ బ్రసిద్ధిఁ జను మ • న్నీవిల్లు మోపెట్టి దు
ర్మదుఁ డై సోముఁడు గెల్చె నెల్లజగముల్ • మాత్రేగ దంభోళియే
నది దీనిం దగఁ దాఁకి భగ్న మగు జ•న్యంబందు నేర్దుగా
భ్యుదితధ్వానము విన్న శత్రులమనం • బుత్రాంతి లాగుం జుఁడీ. 228
శా. ఈచక్రం బఖిలాతిచక్రములపై • నేయంగ నొండు మండుచున్
భూచక్రంబునఁ బండెఁ బెట్టినసి యై • పోఁ జేసి వారిం బల
ప్రాచుర్యంబున జోదుచేతికి మఱల్ • భాసిల్లఁగా వచ్చు ని
త్యాచారంబుగ దీని కోప నెట నే•యస్త్రంబులున్ శస్త్రముల్. 229
తరువోజ. *అని చెప్ప విని కృష్ణుఁ • డర్జునుఁ డంత • నంతరంగంబుల • హర్షించి మిగుల
ననలునిఁ గని మ్రొక్కి • యమరేంద్రుఁ డింక • నమరగణాళితో • నరుదెంచె నేని
గొని జయింతుము నీవు • కుడిచి ఖాండవము • గొదకొని కాల్పుమీ • గొద దీఱిపోవ
ననుచు రథారూఢు•లై యుండ మండి • యనలుఁ డావన మేచ్చి • నపుడు దొడంగె.

* గొదకొని — అతిశయించి; గొద = ఆఁకలి.

—••◆ కృష్ణార్జును లగ్నిచే ఖాండవమును దహింపఁ జేయుట. ◆••—

క. కావలివారలు నగ్నిం, గావరమున నార్పఁ గడఁగఁ ♦ గని కవ్వడి కో
పావిలనయనుం డై కమ్మఁ, జేవమెయిం ద్రోచె వారి ♦ శితభల్లములన్. 231

చ.*రవిలి రవంత మై మొదట ♦ రాఁజ కృశానువు ఖాండవంబునం
దవిలి తదేకదేశగతిఁ ♦ దాఁకొని పేకొని కొంతకొంత మై
జివఁ గొని యంత కంత యయి ♦ చేకొని ప్రాఁకి క్రమక్రమంబునన్
దవమయి కల్పమందుబలె ♦ దారుణ మై వితతప్రమాణ మై. 232

ఉ. ఖాండవ మెల్లఁ దాన యయి ♦ క్రాలుచు నింగియు నేల నిండియున్
మండుచు నర్చిజాలముల ♦ నాల్కలు గ్రోయుచుఁ బ్రజ్వరిల్లుచున్
మెండుగ నార్చుచుం జగము ♦ మించఁగఁ బేర్చుచు బొబ్బరించుచున్
జండతరప్రచారమునఁ ♦ జాగె వెలుంగుచు నాశ్రయాశు డై. 233

చ. చిటచిటలామహాశబ్దమును ♦ జుమ్మని క్రమ్మెడునిస్వనంబునుం
బెటపెట వేఁగునాదమును ♦ ప్రెల్లు గుబిల్లని కూలునాదమున్
పెటిలుపెటిల్లునం బగిలి ♦ ప్రేలెడునారవము న్స్వనంబునం
బటుతర మై జగద్భయద♦భాజక మై విరిసె న్నభంబునన్. 234

తరువోజ.‡అటు లంటరానివే ♦ ల్పతిశయించుటయు ♦ నపు డగ్గితాఁకుచే ♦ నగుప్రాణభీతి
నటు నిటు పాఱంగ ♦ నైనమేకముల ♦ నాశీవిషంబుల ♦ నండజములను
బటుజవంబున బాణ♦పఙ్క్తుల నేసి ♦ పావకజ్వాలల♦పాలు గాఁ జేసి
కటకటఁ బడ కింతె ♦ కత్తియు హరియుఁ ♦ గాల్పించి రగ్నిచే ♦ ఖాండవం బెల్ల. 235

ఉ. అప్పుడు తల్లిదండ్రులును ♦ నన్నలుఁ దమ్ముల నాలుబిడ్డలన్
ముప్పిరి గాఁగఁ గట్టుకొని ♦ మోహము పెల్లున నగ్గిమంటలోఁ
గుప్పలు తిప్ప లై యులివు ♦ ఘోరతరం బయి మిన్ను ముట్ట నా
ర్పుప్పతిలంగఁ గూలి మృతి ♦ నొందె నటం గలప్రాణిసంఘముల్. 236

వ. అట్టిమహోపద్రవంబునకు దేవతలెల్లరుఁ బిల్లడంపడి పోయి సహస్రాక్షున కెఱింగించుటయు నతం డదరిపడి లోకపాలాదిసకలామరలోకపరివృతుం డై పుష్కరావర్తకాది మేఘబృందంబులతో నతిత్వరితగతి ఖాండవంబునకు వచ్చి హుతాశనోపశమనంబు గోరి వారిధారాపూరంబుగా మహావర్షంబు గురియించుటయును. 237

---

* జివ = దార్ఢ్యము. ఇట్లు గోదావరిమండలమున వాడుదురు. (వాని కింకను జివ చేరలేదు.)

‡ కటకటఁబడు = బాధపడు.

మహాస్రగ్ధర. పురుధారాపూరవర్షం • బుగ జలసమితిం • బుష్కరావర్తకంబుల్
గురియం దావంబుపై రాఁ • గురుకులవిభుఁ డు • గ్రుండ యై గాండివంబున్
గరిమన్ సారించి పై న • క్షయశరధులలోఁ • గాండము ల్గుప్పి కప్పన్
సురవర్త్మన్ బిందుపాత • స్ఫురణము ధరణిం • జూడ రా దయ్యె నొయ్యన్. 238

తే. కీర్తి చెదరక వన మేర్చు • సత్త్రశి నట
నశ్వసేనుఁడు వెలిన న • య్యహిజనిత్రి
గఱచుకొని వానిఁ దోఁకను • బఱచుదాని
శిరముఁ దెగ నేసె నరుఁ డది • దొరఁగె నగ్గి. 239

వ. అశ్వసేనునిం గూడ నేయ నున్నసుతుని శతమన్యుండు మాయామోహితుం జేసి తక్షకసుతుం డగుట నశ్వసేనుని విడిపించి. 240

ఇంద్రుఁడు కృష్ణార్జునులతోఁ బోరుట.

మ. జలదాస్త్రం బమరేంద్రుఁ డవ్విజయుపై • సంధించి యేయ న్మహా
జలదంబుల్ హరిదంతరాళముల దం • ఝూవాతసంపత్తితో
దగ నై మూఁగి ముసుంగు వెట్టి పడ నా • తం డెయ్ది వాయవ్యమున్
బలిమి న్వేసి మరల్చె మేఘసమితిన్ • బాకారి కీర్తింపఁగన్. 241

వ. అయ్యవసరంబున. 242

చ. సురగరుడోరగాదులును • సూరులు వీరులు పేర్చి యార్చుచున్
బరువడి దాఁకి కాఁక హరిపై నరుపై వివిధాస్త్రశస్త్రముల్
బరపిన వానిని న్నడుమఁ • బార్థుఁడు త్రుంచెను నొంచె వారి నా
హరియు సుదర్శనంబున న • హో యని మెచ్చ బలారి వారినిన్. 243

క. అని సురలు భయత్రస్తులు, గని మఱుపున్ జొరిన వజ్రి • తగి రా ల్గురియిం
చెను బెల్లు వాని నన్నిటిఁ, దునిమె శితాస్త్రముల నరుఁడు • దుత్తునియలుగన్. 244

వ. కొడుకుపరాక్రమం బెఱింగియు నెఱుంగ వేఁడి దేవేంద్రుండును. 245

చ. కరమున మందరాద్రితలఁ • గ్రక్కునఁ గైకొని వచ్చి సద్రుమో
త్కరమగుదానిఁ బూని కిను • క న్నిజనందనుమీఁద నేయుడు
న్నరుఁడును దోర్ద్వయాయి గల • నారసము ల్వరిగించి దానిని౦
దొలఁగ నింతి లింత లయి • తేలఁగ రాలఁగ నేసె నీసునన్. 246

వ. ఆకాలంబున నాకాశవాణి పాకశాసనుండు విన నిట్లనియె. 247

మ. నరనారాయణు లన్ పురాణమును లా • నాఁ డెల్లదైత్యావళిం
బరిమర్దించినవారు వీ రెఱుఁగవే • పాకారి నీ కొవ్వఁగాఁ

దరమే వీరలఁ బోరు మాను మను వాం♦దం దక్షకుం డుండె న
క్కురుభూమి న్విధిచోదితంబు వన మీ♦ఘోరాగ్నిపా లాటయున్. 248

తే. అనినఁ గ్రోధము విడి వడి ♦ యసురవిభుఁడు, దేవపరివృతుఁ డయి పోయె ♦ దివికి సంత
సరుఁడు నారాయణుఁడు సింహ♦నాదములను, బెల్లు చేసిరి దిక్కులు ♦ పిక్కటిల్ల. 249

ఆ. అడ్డ మొకఁడు లేక ♦ యనలుఁ డేర్చుచున్న, ఖాండవమున నుండి ♦ కదలుచున్న
కోటిఁ జక్రధారఁ ♦ గూల్చుచు హరి మయు, సముచితనుతు నేయు♦ సమయమందు.

మయదర్శనపర్వము.

క. మయుఁడును శరణాచు ధనం,జయుమఱువుం జొచ్చె నతఁడు ♦ జడియకు మనుచున్
మయు శరణాగతవత్సలుఁ, డయి కాచెం జావునుండి ♦ హరి వేఁడి దయన్. 251

క. శరణన్నవారిఁ గాచుట, కరుణానిధు లైనయట్టి♦ఘనులకు ధర్మం
బరయంగ దాని మించిన,నరధర్మం బొకఁడు కలదె ♦ వసుధాస్థలిలోన్. 252

తరువోజ. *పదియేనుదినము ల♦ప్పావకుం డట్లు ♦ పార్థదాశార్హుల♦ప్రాపునం జేసి
త్రిదశేంద్రువన మెల్ల ♦ దిగఁబడ కుండఁ ♦ దెగి దగ్ధముగఁ జేసి ♦ దివి కేగ నందుఁ
గదల లేకీల్గెను ♦ గలప్రాణికోట్లు ♦ ఘనుఁ డశ్వసేనోర♦గపతియు మయుఁడు
నదటున మందపా♦లాత్మజుల్ నల్వు ♦ రగుశార్ఙ్గకు లనన♦యార్యుల్వురుఁ దక్క. 253

వ. అనిన విని జనమేజయుండు శార్ఙ్గకు లెవ్వ రెట్లు బ్రదికి రని వైశంపాయనుం
డి ట్లనియె. 254

మందపాలోపాఖ్యానము.

సీ. మందపాలుం డను♦మాన్యశీలుఁడు తొల్లి, లలిత యతీశ్వరులతోఁ ♦ దపము నేసి
పితృలోకమునకు సం♦తతి లేనివారికి, గతులు లే వని విని ♦ సుతులఁ గోరి
పతగంబులకు శీఘ్ర♦గతి బహుప్రసవంబు, లభియించు నని తాను ♦ లకుముకి యయి
జరిత యనుపేరిటఁ ♦ బరఁగులావుక పంటిఁ, గలసి నలువురఁ బుత్ర♦కులను గాంచి

తే. వారి ఖాండవవనమందు ♦ నదలి పెట్టి
పక్షిరూపము విడి పూర్వ♦భార్య యయిన
లపితతోఁ గూడి విహరించు♦చున్నతఱి ఖాండ
వము దహింపఁగఁ జనుబృహ♦ద్భానుఁ గాంచి. 255

వ. అట్టియెడ నిట్టట్టనరానియట్లు లగ్నిభట్టారకు నగ్నిసూక్తంబులం బ్రస్తుతించి యి
ట్లనియె. 256

* అదటున = భయమున.

మ.*తెగువం జేయుమఖంబులన్ ముఖమవై ♦ దేవళ్లకున్ హవ్యమీ
యఁగ మర్త్యాళికి నన్న మీయఁగను ము♦ఖ్యుం డైనభూతంబవై
తగ నీ లోకంబుల నుద్ధరించెదుమహా♦త్మా నీవు నాపుత్త్రులన్
దగురీతిం గరుణించి ప్రోవఁగదవే ♦ దాహంబు గాకుండఁగన్. 257

వ. అని ప్రార్థించిన నగ్నిదేవుండు జరితారి సారిసృక్వ స్తంబమిత్ర ద్రోణు లనునాశా
గనుల నలువురం గాచువాఁడయి మందపాలునకు వరం బొసంగి యిట ఖాండవవన
దహనంబునకుం గడంగి యున్నసమయంబున. 258

చ.‡జరితయు నెత్తుగుడ్డు లనఁ ♦ జాలినపిల్లలఁ బెట్టి పెంచుచున్
గురుతరదావపావకము ♦ గూడుటఁ గన్గొని దుఃఖచిత్తయై
దురపిలి నంది నంది యెటు ♦ తోఁపక బిడ్డలదిక్కు సూచుచున్
దొరఁగఁగ బాష్పబిందువులు ♦ దొప్పలు దోరలు వెక్కి పొక్కుచున్. 259

తరళము. తఱియ వచ్చె నగ్గి పెచ్చున ♦ దద్దరిల్లుచుఁ జిత్తమం
దెలుక చేడ్పడ నప్పుడంతుక ♦ యెంతయేనియుఁ జింతతో
గతులు నావు కొమాళ్లు మాంసపు♦గడ్డ లట్టిరు వీరి నె
త్తెఱఁగున న్వెలయింప నేరుతు ♦ దీన నెట్టులొ దైవమా. 260

చ. కొని చన శక్తి లేదు దగ♦గొన్నకొమాళ్లను బెట్టి పోవఁగా
మనసు రాదిఁ కేమి గతి ♦ మండుచు వచ్చెను గారుచిచ్చయో
తనయులచావుకంటెఁ దొలు♦తం బడి చచ్చుట నాకుఁ బోలుఁ జ
చ్చినపయి నిట్టిదుఃఖములు ♦ జెందఁగఁ బోవు శరీరి కెందునున్. 261

వ. అని మరణోద్యమంబునం గృతనిశ్చయ యై కొమరులం జూచి యిట్లనియె. 262

ఆ. కన్నకొమరులార ♦ కరుణ యింతయు లేక, మిమ్ముఁ గన్నతండ్రి ♦ మిము భరింప
కెచటనేఁగి పోయె ♦ నిదె ముట్టు ననలంబు, మీరు లాఁగ సాగుఁడు ♦ మెల్ల మెల్ల.

వ. నేను దానిముఖంబు పాంసుపటలచ్ఛన్నంబు గావించెద మీ కగ్నిభయంబు వారియ
కుండు ననిన వారును. 264

చ. బిలమున నెల్క చంపి తిను♦బీతది నిశ్చయ మింద యుండినన్
జ్వలనము గాల్చి పుచ్చు నిది ♦ సందియ మాఱిన నాఖు నగ్గియ
య్యెలుకకుఁ జచ్చుకంటె నిది ♦ యెంతయుఁ బున్యాద మమ్మ పొమ్మ నీ
నలరిన మమ్ముఁ వంటిసుతు ♦ లయ్యెద రెయ్యెడ వంశవృద్ధికిన్. 265

* తెగువ = దాతృత్వము. ‡ దురపిలి = కలఁగి; నంది = సంతాపించి; వెక్కి = వెక్కిలివిడిచి; పొక్కుచున్ = దుఃఖించుచు.

వ. అనిన నాశార్ఙ్గియుం జేయునది యేమియును లేక బాష్పపూరితనయనయుగళ యై ప్రాణ భయంబునం బాసి చనియె నంత నాశార్ఙ్గకులును వేదబుద్ధులం బోనివాక్కుల నాశ్ర యాశు నాశ్రయించుచుం బ్రస్తుతించి. 266

ఆ.*విడిచెఁ దండ్రి మొదల • విడెఁ దల్లి యవ్వల, దిక్కు లేనిమాకు • దిక్కు నీవ కదలఁ గెలుపు లేవు • కనుగందులము మమ్ముఁ, గరుణఁ గావవయ్య • కనలునయ్య.

తరలము. అనుచు వేఁడిన నగ్నిదేవుఁడు • నాత్మ మెచ్చుచు నెంతయుం గనికరంబున వారి నల్వురఁ • గాల్ప నోపక శాంతుఁ డై చనినఁ దల్లియుఁ దండ్రి వచ్చి ని•జప్రజం గని సంతసం బునను బొందినడెందముం గొని • పొంగి రెంతయు వింత గాఁ. 268

వ. అంత మందపాలుం డాభార్యాపుత్త్రులం దోడ్కొని యచటనుండి మఱియొక దేశంబునకుం బోయె. 269

ఇంద్రుఁడు కృష్ణార్జునుల మెచ్చి వరంబు లిచ్చుట.

మానిని. ఆసమయంబున నంబురుహాసను•నానతి వేలుపుమూఁకలతో వాసవుఁ డచ్చటి కేచ్చినముచ్చట • వచ్చి హరి న్నరు మెచ్చి కడుం బ్రాసము లెవ్వరు లేరు జగంబున • మీకు వరంబుల నీయఁగ సం తోసముతో నిట వచ్చితి నిచ్చఁ బ్ర•తుష్టిగ నిష్టము వేఁడుఁ డొగిన్. 270

ఆ.†అనిన విజయుఁ డతని•యమరగురుదామరలకు, నెఱిఁగి వరము లీయ • నెంతువేని శరము లిమ్ము నాకు • వరములు నావుడు, నింద్రుఁ డాత్మజునకు • నిట్టు లనియె. 271

క. వాయవ్యాగ్నేయాదిమ,హాయుధములు నీకు నిత్తు • నవ్వల నని నా రాయణు నరు గీవించుచు, నాయమరేంద్రుండు చనియె • నాకంబునకున్. 272

అలసవృత్తము.‡అనలుఁడును ఖాండవవ•నౌషధము కృష్ణా ర్జును లనుభిషగ్వరుల•జోగమునఁ బధ్యం బనువడ భుజించి విగ•తామయుఁ డజాం డై చనియె దయ వారి కిడి • సంతసముతోడన్. 273

వ. కృష్ణార్జునులును మగిడి మయునితో నింద్రప్రస్థపురంబునకుఁ జని ఖాండవదహనవృత్తాంతం బది యంతయు సవిస్తరంబుగా ధర్మరాజాదులకుం జెప్పి సుఖం బుండి రని జన మేజయునకు వైశంపాయనుం డాదిపర్వంబునం గలకథాప్రపంచం బంతయుం జెప్పె నని చెప్పుటయును. 274

* కనలునయ్య = మండునయ్య (అగ్ని.) † వరములు = శ్రేష్ఠులు. ‡ ఈపద్యమున వైద్యసాంప్రదాయము వర్ణింపఁబడినది. జోగము = (ఔషధాది) యోగము.

క. *విని సంతసించి నైమిశ,వనవాసులు సూతుఁ జూచి । వాత్సల్యమునన్
విన నిచ్చ గలదు మాకో,యనఁ బై పర్వంబు తెలుపు । మని యడుగుటయున్. 275

ఆశ్వాసాంతము.

చ. తెలిసినయట్లు నే వరుసఁ । దీర్చి కథాక్రమ మెల్లఁ గూర్చి లో
పలఁ బదునెన్మిదై నయుప।పర్వములం దగునాదిపర్వ మి
ట్లలవునఁ జేసి నీపదము।లందు సమర్పణ మొప్పఁ జేసితిన్
బొలుపుగ స్వీకరించి ననుఁ । బ్రోవవె మ్రొక్కెద సర్వరక్షకా. 276

మాలి. నిరుపమగుణకోశా । నిత్యసత్యప్రకాశా
వరసురకలనాశా । వాసుదేవాద్యధీశా
పరిహృతభవపాశా । పాలితాశేషదేశా
సరసహృదయవేశా । సర్వలోకేశ్వరేశా. 277

గద్యము.

ఇది శ్రీమదధునాతనోభయకవిమిత్ర వేంకటయజ్వాగ్రపుత్ర
సమారాధితవిబుధరాజ శ్రీపాదకృష్ణమూర్తి కవిరాజ
ప్రణీతం బయిన శ్రీకృష్ణభారతమునందలి
యాదిపర్వము సమాప్తము.

శ్రీ. శ్రీ. శ్రీ.

ఉ. పంచమవేద మై పరఁగు।భారతమం దిటు లాదిపర్వముం
బెంచెడివో విలాసమునఁ । బెంచి కుదించెడివోఁ గుదించియున్
మంచికిఁ జెడ్డకుం గలరు । మాన్యు లటంచును బారకాప్రిక
ర్పించెను కృష్ణమూర్తికవి । విన్నను వొప్పుగఁ జేసి క్రన్ననన్.



* ఓయన = ఒయ్యన.

శ్రీ

శ్రీబాలాత్రిపురసుందర్యై నమః.

# శ్రీకృష్ణభారతము

సభాపర్వము—ప్రథమాశ్వాసము.

సభాక్రియాపర్వము.



సవితృమండలాంత
ర్వాసుం డై జగము లరసి ♦ రక్షించుమహా
బ్లాసుని సర్వేశుని నే
దోసిలి ఘటియించి మ్రొక్కెదం గనుభక్తిన్. 1

వ. దేవా దివ్యచిత్తంబున నవధరింపు మక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లనియె న
ట్లింద్రప్రస్థపురంబునఁ బాండవులం గూడి సుఖం బున్నయయ్యెం బొక్కనాఁడు వాసుదేవ
సహితుం డగునర్జునుం బూజించి కృతాంజలిపుటుం డై యిట్లనియె. 2

చ. *అసువు లొసంగి నన్ను దయ ♦ నారసినట్టిమహానుభావు లీ
రసదృశకీర్తి నాంద్రులు బలాఢ్యులు మీ కేది సేయ నేర్తు నే
ననదు న నైనఁ గాని ప్రియ ♦ మొంద దొకించుక సేయ నుంటి నే
నసురులవిశ్వకర్మ్మఁడ నసల్పసుశిల్పకళావిధిజ్ఞుఁడన్. 3

ఆ. కారుచిచ్చునుండి ♦ కాచి రక్షించిన,వారు మీకు నేను ♦ గోరి ప్రీతి
శిల్ప మేదియేనిఁ ♦ జేసి యీ నెంచితిఁ, గాన నాజ్ఞ యిండు ♦ కాదు నాక. 4

చ. అనవుడు నర్జునుం డను మహాసురతల్లజ నీ వొసర్తు నం
చనునది మాకు వచ్చె మది ♦ కయ్యెను సంతస మీవు నేము నె
ప్పును దగ నెయ్యముల్ నలిపి ♦ పొల్పుచు నుంటయ చాలు నట్టు లై
నను ననుఁ బెద్దఁ జేసి యిటు ♦ నాటఁగఁ జెప్పుచు నుంటి కావునన్. 5

తే. నా కొకింతయు నిష్టము ♦ లేక యున్న
నీదుసంకల్ప మది రిత్త ♦ గాఁ దలంప

---

* అసను = నికృష్టము, నికృష్టుఁడు.

నాకుఁ గాఁ జేయుదు నటంచు ♦ వాకొనునది
ఘనుఁడు శ్రీకృష్ణునకుఁ జేయఁ ♦ గడఁగు మయ్యా. 6

వ. అనిన మయుండు కృష్ణునిం జూచి నమస్కరించి భవదభీష్టం బానతిమ్మని ప్రార్థించు
టయు నతం డించుక విచారించి కార్యంబు నిశ్చయించి యతని కిట్లనియె. 7

క. మయ నీకుఁ బ్రియమ యేనిన్, నయవిదుఁ డగుధర్మరాజు♦నకు శిల్పకళో
దయమునఁ జేయుము త్రిజగ,త్ప్రియము నపూర్వంబు గాఁగ ♦ వేస నొక్కసభన్.

క. అది చూచి యెల్లమర్త్యులు, నిది దివ్యవిమాన మనుచు ♦ నెంతయు వేడ్కన్
మదిఁ గొంచు బ్రమసి యాడఁగఁ, బొదలింపుము దాని నీదు ♦ పోఁడిమి మెఱయన్. 9

వ. అని నియోగించిన మయుం డంతరంగంబున నెంతయు సంతసించుచుం దనకళాకౌశ
లంబున విమానప్రతిమానం బగునొక్క సభాప్రతిమం జిత్రించి చూపిన వారు నతనిం
దోడ్కొని చని ధర్మజునకు నివేదించుటయు నతం డతని గౌరవించి మించినవేడ్క
సత్కరించె నంత నమ్మయుండు నాచిత్రవిశేషంబు లెఱింగించియుఁ దదభిప్రాయాను
సరణంబుగ నపూర్వసభాభవననిర్మాణకుతూహలాయత్తచిత్తుం డై. 10

మయుండు సభాభవనమును నిర్మించుట.

ఉ. ఆహరిపంపునన్ బ్రభువు♦నాజ్ఞను గైకొని వీఁక నొక్కపు
ణ్యాహమునందు స్వస్తివచ♦నాదు లెసంగఁ గను స్మనోహరం
బై హరువొందునొక్క తల♦మందు సభాగ్రము నిల్పి శంకు వు
త్సాహముతోడ నుత్సవము ♦ సల్పెను భూసురభోజనాదులన్. 11

క. నలుగడఁ బదివేల్చేతులు, కొలతం గలదియు సమస్త♦గుణసంపన్న
స్థల మది సమచతురస్రం, బలవడిచె మయుండు సభకు ♦ ననువుపడంగన్. 12

వ. అంత నట వాసుదేవుండును గొన్నినాళ్లుండి పాండవుల వీడ్కొని సపరివారుం డై
కనకరథం బధిష్ఠించి ద్వారకాపురంబునకుం జనియె నవ్వల మయుం డర్జునుం జూచి
యి ట్లనియె. 13

తరువోజ. *పనివిని వచ్చెదం ♦ బార్థ తొల్లి వృష♦పర్వునిసభఁ బొన♦ర్పఁ జిరత్నరత్న
కనకాదిదివ్యోప♦కరణముల్ గూర్చి ♦ గరిమ బిందుసరంబు♦కడ దాఁచి యుంటిఁ
గొని తెచ్చి వానితోఁ♦గురువృషభునకుఁ♦గోర్కి దీఱఁగఁ గొల్వు♦కూటం బొనర్తుఁ
గనుఁగొన్న జను లెల్లఁ ♦ గడుఁజోద్య మంది♦ఖచరవిమానంబు♦కా యంచు మెచ్చ.

వ. మఱియును. 15

---

* పనివిను = ఆజ్ఞావశవర్తి యగు; పోవు.

ఉ. అవ్వృషపర్వుఁ డాసరము♦నం దొకపెన్గద నొక్కశంఖముం
భూవిజయంబు చేసి మును ♦ పొల్పుగ నిల్పెఁ బసిండిపూలకుం
దావల మై దృఢం బగుగ♦దన్ మనపావని కుగ్రఘోషముం
బావనదేవదత్త మగు♦వారుణశంఖము నీకుఁ దెచ్చెదన్. 16

తే. గాండివం బెట్లు నీచేత ♦ ఘనతఁ గాంచు,చున్నదియొ భీముచేత నా♦యున్నతగద
యుండెనే నట్లు పేరంది ♦ ఖండనములఁ, బూని చక్రాఙు వ్రేల్మిడి ♦ వేనవేల.

వ. అని చెప్పి యొప్పించి మయుం డుత్తరపూర్వదిగ్భాగంబు వట్టి చని కైలాసోత్తరం
బున మైనాకపర్వతంబుకడ మణిమయం బగుహిరణ్యశృంగంబునందు. 18

సీ. ఎందే భగీరథుం ♦ డేండ్లుపూండ్లుగఁ దపం, బుండె గంగానది ♦ నొందుకొఱకు
నెందే వసించి భూ♦తేశ్వరుం డీరేడు,జగముల సృజియించెఁ ♦ దగినరీతి
నెందేఁ గమంగడు ♦ నేండ్లు నిష్ఠను నర,నారాయణులు తపం ♦ బారఁ జేసి
రెందే యమాజేశ్వ♦రేంద్రాద్యముఖ్యులు, కడుసద్ధసత్రముల్ ♦ కడఁకఁ జేసి

తే. రెందు బంగరుయూపంబు ♦ లెసక మెసఁగు, వేనవే లెందు శ్రీమహా♦విష్ణుఁ డిచ్చ
ధర్మసంప్రతిపత్తికై ♦ తపము చేసె, నట్టిబిందుసరోవర ♦ మలరుచుండు. 19

ఉ. కోరిక విశ్వకర్మ యట♦కుం జని చెప్పినయట్టిదివ్యసం
భారము లెల్లఁ గూర్చుకొని ♦ భవ్యవినిర్మితి నారయన్ సభా
కారము గాఁగ నేర్పఱచి ♦ కట్టడ మష్టసహస్రరాక్షసుల్
వీరులు మోయఁ దెచ్చి నిలి♦పెన్ గురురాజపరిష్కృతక్షితిన్. 20

వ. అదియును. 21

### మయసభావర్ణనము.

సీ. తగుపచ్చఱాకట్టు♦మగఱాలగోడలు, నీలాలపనినెల♦ఱాలమెట్లు
నపరంజితో నొప్పు♦నద్దాలకిటికీలు, బటికంపునునుద్వార♦బంధములును
దమ్మికెంపులఁగ్రాలు♦తలుపులు వైదూర్య,ములజిల్గుపని గల♦వలభితతులు
పసి గలపవడంపు♦వట్రువకంబముల్, మేలిమిజాళువా♦దూలములును

తే. రతనములదివ్వెలును యంత్ర♦రచితచక్ర,వీజనంబులు మౌక్తిక♦భాజనములు
మఱియు నచ్చెరువిడుచిత్ర♦మండలములు,గలిగి కన్నులపండు వై ♦లలి వెలుంగు.

శా. నానారత్నసముత్కరస్థగితనూ♦త్నచ్ఛవ్యవత్రిభ్రాజతా
నూనానేకసువర్ణకుడ్యవిలస♦న్మోదావహాకారక
రానుస్యూతలతావితానములు హం♦సాకీర్ణపద్మాకర
స్థానంబుల్ గన నాసభాస్థలము చి♦త్తభ్రాంతిఁ గల్పించెడున్. 23

క. వరుణసభ వహ్నిసభయును, సురరాట్సభ బ్రహ్మసభయు • సోమునిసభయున్
సరివచ్చు ననఁగ నాసభ, విరచించెను విశ్వకర్మ • విన్నాణమునన్. 24

చ. అలరెడునాసభాస్థలము•నందుఁ బొనర్చె మయుండు రత్నసం
కలితసువర్ణపద్మములు • కాంచనకచ్ఛపమత్స్యచిత్రముల్
లలితమణీనిబద్ధసుత•లంబులు గల్గి వినిర్మలాంబులన్
వెలయుసరోవరం బాకఁడు • వింత జనింపఁగ నెంతవారికిన్. 25

చ. సలలితరత్నకాంచనల•సత్సువిశాలసభాస్థలంబునన్
జలములు లేనిచోట్లు జల•సంఘము లం చని యున్నచోట్లు భూ
ములు యని రత్నకాంతులు ప్ర•భూతము లై మిఱుమిట్లు గొల్పుచోఁ
బలుమరు చూచినన్ జనులు • భావములన్ భ్రమయింతు రెప్పుడున్. 26

చ.*చలువల నీనునీడలును • సౌరభము న్వెదచల్లుపూలుఁ దీఁ
గలును మనోహరంబు లయి • క్రాలెడురంగుల నొప్పునాకులుం
గలిగి నిరంతరంబుఁ గనఁ • గన్నులపండువు గాఁ దలిర్చుచున్
దొ మగుతోఁట లాసభకు • నల్గడ నిల్చె మయుండు మెండుగన్. 27

వ. ఇట్లపూర్వం బైనసభాభవనంబు సకలవిభవాభిశోభితంబును త్రిజగన్మోహనంబుగాఁ బదునాలుగునెలలు నిర్మించి దాని నాదానవవిశ్వకర్మ ధర్మరాజునకు నివేదించి వెనుక సకలశాత్రవభీషణంబు బగుగదను భీమసేనునకును నిజనినాదశ్రవణమాత్రంబునఁ ద్రిజగంబు వడఁకింపం జాలినశంఖంబు బీభత్సునకును నొసంగె నంత యుధిష్ఠిరుండును. 28

—•—◆ ధర్మరాజు సభాప్రవేశము చేయుట. ◆—•—

మ. సుముహూర్తంబున స్వస్తివాచకవిధుల్ • శోభిల్లఁ బుణ్యాహఘో
షములున్ మంగళవాద్యముల్ సెలఁగ నా•సక్తిన్ సభాంతఃప్రవే
శము గావించి ధరామరౌఘముల ని•చ్చం గొల్చుచున్ గోసహ
స్రములన్ రత్నసువర్ణకోటులఁ గడున్ • సంతృప్తులం జేయుచున్. 29

క. సోదరయుతుఁ డై ధర్మజుఁ, డాదివమున నింద్రజుఁ డేం•ద్రుఁ డన మెఱయుచు ధౌ
మ్యాదిమునీంద్రదేవాశీర్వాదము లందుచు మెలంగె • వైభవ మడరన్. 30

తే. వివిధమాంసములన్ భక్ష్య•పేయచోష్య, ఖాద్యలేహ్యంబులన్ బాయ•సాద్యనేక
భోజ్యములతోడఁ బదివేల•భూసురులకుఁ, దృప్తి గావించెఁ బాండవ•వృషభుఁ డపుడు.

వ. అయ్యవసరంబున. 32

* ఇట్లు గృహములందుఁ దోఁటలు (తోటన్ను) పెట్టునాచారము తొల్లియుం గల దని దీనఁ దెల్ల మగుచున్నది; ఇవి యట్టితోఁటలే యని తెలియం దగు.

మ. చతురంభోధిపరీతభూతలపతుల్ సద్రాజ్యపూజోన్నతుల్
చతురంగధ్వజినీసహస్రములతో సాన్నిధ్యముం గాంచి స
న్నుతముల్ నిస్తులవస్తుసంతతులు లెన్నో కానుక ల్వెట్టి హృ
ద్గతభక్తిన్ భజియించి రాగుణమణిన్ గౌరవ్యచూడామణిన్. 33

తే. సాత్యకియును సుధర్ముఁడు శైబ్యసాంబ, ముఖ్యు లగుకుమారు లప్పుడు మహంబు
నరయ వచ్చి ధనంజయు నాశ్రయించి, మించి శస్త్రాస్త్రవిద్యల మిసిమిఁ గనిరి. 34

తే. గరుడగంధర్వయక్షఖచారణులు, దివ్యాదితిసుతులు ప్రీతి వచ్చి
తుంబురుప్రముఖాప్తులై తొలఁగ కున్న, వేయుఁ బొగడి పాడిరి దివ్యగానములను.

వ. మఱియు మార్కండేయ మాండవ్య శాండిల్య కౌండిన్య మైత్రేయ యాత్రేయ కౌశిక బక దాల్భ్య రైభ్య బలివాక శిలీవాక గౌతమ కణ్వ కుత్స హారీత తిత్తిరి యాజ్ఞవల్క్య ప్రముఖమహామును లెల్లకడలనుండి వచ్చి పూజితులై ధర్మరాజసభాభవనంబున ననేకధర్మకథ లుపన్యసించి బోధించుచుండి రాసమయంబున. 35

నారదుఁడు పాండవులయొద్దకు వచ్చి రాజనీతులు సెప్పుట.

సీ.* వేదోపనిషదర్థవేత్త పురాణేతి,హాసకల్పన్యాయభాసురమతి
ధర్మతత్త్వజ్ఞుండు ధర్మార్థకామమో,క్షవినిశ్చయజ్ఞానకలితచిత్తుఁ
డంగషట్కవిధిజ్ఞుఁ డైక్యసంయోగనా, నాత్వాతిసమవాయనయవిదుండు
పంచావయవయుక్తవాక్యదోషగుణజ్ఞుఁ, డుత్తరోత్తరవక్త సత్తపస్వి

తే. కవి ప్రగల్భుండు మేధావి భువనవర్తి, సర్వశాస్త్రప్రవీణుండు సంధివిగ్ర
హాదిషాడ్గుణ్యతత్త్వజ్ఞుఁ డనఘమూర్తి, నారదుం డఖిలకలావిశారదుండు. 37

తే. మెఱుపు మొత్తంబుచందాన మింటినుండి, పంటవలఁతిమొగంబుగ వచ్చె నిచ్చ
ధర్మజునికొలువుకూటంబు దాఁ బ్రవేశి, పర్వతాదులు వెన్నంటి పలచి రాఁగ. 38

వ. ఇట్లు మహర్షిసమేతుండై వచ్చుచున్ననారదుం గని ధర్మతనయుండు తమ్ములుం దాను నతనికి బ్రత్యుత్థానంబు సేసి వినయవినమితోత్తమాంగుం డయి మ్రొక్కి తోడితెచ్చి యుచితాసనాసీనుం జేసి యర్ఘ్యపాద్యంబు లిచ్చి మధుపర్కం బొసంగ నర్చించుటయు నమ్మహర్షి సమ్మోదించి యాశీర్వదించుచు ధర్మనందనుం జూచి ప్రీతిపూర్వకంబుగా ని ట్లనియె. 39

---

* అంగషట్కము - శిక్ష, వ్యాకరణము, ఛందము, నిరుక్తము, జ్యోతిషము, కల్పము. ఐక్యము = పృథివ్యాదిరూపైకీభావము. సంయోగనానాత్వము = అసాధారణసంబంధము గలపృథివ్యాదులకున్న రూపభేదము. సమవాయము = భూతసాధర్మ్యవైధర్మ్యసాంకర్యము. పంచావయవములు = ప్రతిజ్ఞా హేతూదాహరణోపనయ నిగమనములు. షాడ్గుణ్యము = సంధి విగ్రహ యాన ఆసన ద్వైధీభావ సమాశ్రయములు.

లోకపాలసభాఖ్యానపర్వము.

చ. నరవర నీకుఁ దమ్ముల క॥నారతముం గుశలంబె నీమనం
బరమర లేక ధర్మవున॥యం దగునే ధన మొప్పఁ గూర్తువే
వెరవరి వై సుఖం బనుభ॥వింతె భవత్పితృదేవు లట్లు దో
షరహిత మార్యశస్త మగు॥చక్కని వృత్తి మెలంగుచుంటివే. 40

తే.* ఒనర ధర్మార్థకామము ॥లొంది కాకంటెఁ, గెడప కుండఁ గాలముల భా॥గించికొంటె
షట్ప్రభుగుణంబులు నుపాయ॥సప్తకంబు,గలిగి పదునాల్గుదోషముల్ ॥ తెలిసికొంటె.

క.‡ఎనిమిదికర్మంబుల నెపు, డనుసంధింపుచును బ్రకృతు ॥ లయ్యేడుహితం
బుగఁ బదునెనిమిదితీర్థము, లను గృతకృత్యతను బొంది ॥ లలి మెలఁగుదువే. 42

ఉ. అత్రము లేక భక్తు లగు॥నాప్తుల దూతలఁ బుచ్చి నేర్పునన్
శత్రుల మిత్రులం దెలిసి ॥ సంధియొ విగ్రహమో పొసర్చియున్
మైత్రిని జూపియుం దఱుల ॥ మ్రాప్పడి యుండక జాగరూకుఁడై
ధాత్రి నరేశ్వరుం డెసఁగుఁ ॥ గద్వధి నీవు గడంగు చుంటివే. 43

ఉ. మంత్రమె మూల మౌ విజయ॥మార్గము నందుట కట్లు గావునన్
దంత్రవిధిజ్ఞులుం బితృపి॥తామహముఖ్యకులక్రమాగతుల్
మంత్రులు వృద్ధవిప్రులు స॥మంచితశాస్త్రవిదుల్ కులీనులై
యంత్రములట్లు రాష్ట్రకృతు ॥ లన్నియుఁ దీర్చుచు నిన్నుఁ గొల్తురే. 44

ఆ. మంత్రివలనఁ గాని ॥ మఱి నీవలన గాని, మంత్రితార్థ మింత॥మాత్ర మైన
భిన్న మగుచు శత్రు॥భీతి గల్గదు గదా, దూత లెల్ల నీకుఁ ॥ బ్రీతులె కద. 45

* షట్ప్రభుగుణములు = శ్లో. వక్తా ప్రగల్భో మేధావీ, స్మృతిమా న్నయవి త్కవిః.
ఉపాయసప్తకంబు = సామ దాన భేద దండ మంత్రౌష ధేంద్రజాలములు.
పదునాల్గుదోషములు = శ్లో. నాస్తిక్య మనృతం క్రోధః,ప్రమాదో దీర్ఘసూత్రితా
అదర్శనం జ్ఞానవతా,మాలస్యం పంచవృత్తితా। ఏకచింతన మర్థానా,మనర్థజ్ఞైశ్చచింతనం
నిశ్చితానా మనారంభో,మంత్రస్యాపరిరక్షణం। మంగళాద్యప్రయోగశ్చ,ప్రత్యుత్థానం చ సర్వశః.
‡ ఎనిమిదికర్మంబులు - శ్లో. కృషి ర్వణిక్పథో దుర్గం సేతుః కుంజరబంధనం
ఖన్యాకరకరాదానం శూన్యానాంచ నివేశనం। అష్టకర్మాణిసంధాయ ప్రయుక్తాని మనీషిభిః.
ప్రకృతు లేడు = శ్లో. స్వామ్యమాత్యసుహృత్కోశ రాష్ట్రదుర్గబలానిచ.
ప దు నె ని మి ది తీ ర్థ ము లు — శ్లో. మంత్రీ పురోహితశ్చైవ యువరాజశ్చ భూపతిః।
పంచమో ద్వారపాలశ్చ షష్ఠోంతర్వంశిక స్తథా। కారాగారాధికారీచ ద్రవ్యసంచయకృత్తథా
కృత్యాకృత్యేషు చార్థానాం నవమో వినియోజకః। ప్రదేష్టా నగరాధ్యక్షః కార్యనిర్మాణకృత్తథా
ధర్మాధ్యక్షః సభాధ్యక్షో దండపాలస్త్రిపంచమః। షోడశో దుర్గపాలశ్చ తథా రాష్ట్రాంతపాలకః
అటవీపాలకాంతాని తీర్థా న్యాహుర్మనీషిణః.

సీ. ఒక్కఁడవును గాక • పెక్కురతోఁ గాక, మంత్రింబు నడుపుదే • మానవేంద్ర
నిద్రావశుండవై • నీరాజ్యరక్షణ, మేమఱి యుండవు • గా మహీశ
యల్పమూలమహోద•యార్థముల్ నిర్విఘ్న,ముగఁ జేయఁదొరకొంటె•పూరువంశ
ప్రారంభితార్థముల్ • ఫలియింప కుండ నడుమ శంక విడవు గా • విమలకీర్తి
ఆ. రిపుల కెపుడు నీదు•రీతి దెలియనీక, వారిరీతు లెల్ల • వరుసతోడ
నెఱుఁగఁ జాలి రాష్ట్ర • మెపుడు సురక్షితం,బుగఁ బొనర్చుచుంటె • భూతలేశ.
క. నిదురించియు నిదురింపక, సదమలగతి నపరరాత్రి•సమయములందున్
మది రాజకీయతంత్రత, బిదమిద్ధం బనుచు నిశ్చ•యింతె నరేంద్రా. 47
క. కోశాధీశుల సైన్యా, ధీశుల నీకొఁగుకులట్టి•ధీరులఁ గులవృ
త్తాశయులఁ గాక క్రొత్తల, నీశా యేసమయమందు•నే నిలుపవు గా. 48
క. అనవరతము దుర్గంబులు, ధనధాన్యయుతంబు లాయు•ధసుభరితంబుల్
వినుతోదకాన్వితంబులు,గ నొనర్చితె రిపుల నదిమి • కప్పముఁ గొనుదే. 49
తే.*మూర్ఖులగువారి వేగురఁ•బోనడంచి,పండితోత్తము నొక్కనిఁ •బడయవలయుఁ
బండితుం డర్థకృచ్ఛ్రము • వచ్చినపుడు, కాచిపుచ్చును జేని నొ•క్కరణి నైన. 50
ఆ. అదియు నిదియుఁ జూచి • యట్టిట్టు నల్లెడు, వానిఁ గాక లోక•వారవృత్త
ముల నెఱింగి యద్ద•మువఁ బోలెఁ గృతిఁ జూపు,కవిమహర్షి నీవు • గలసికొంటె.
సీ. వినయవంతుఁడు జగ•ద్విశ్రుతశ్రుతుఁడు నీ, కగుపురోహితుఁడు స•మర్చితుండె
నియమితుం డయిసవ•నీయవహ్నుల యాజ,కుఁడు వేల్చునే తఱు • లెడల కుండ
జ్యోతిషజ్ఞానచ•క్షుష్మంతుఁడై భవ,ద్దైవజ్ఞుఁ డొప్పునే • దేవునట్లు
ధన్వంతరికిఁ బోల్పఁ • దగినవైద్య•శిఖామ,ణికి ననురాగమే • నీదుపట్ల
తే. నుక్కుతునుకలఁ బోలునీ•యోధవరులు,కలన వెనుదీయ కుందురే•చలముకలిమిఁ
జెప్పఁగలరీతి సేనకుఁ • జెప్పి నడపఁ, జాలి సేనాని మిత్త్రుఁడై • చను నె నీకు. 52
ఉ. కాలములందు వేతనము • గల్గఁగఁ జేసి దయార్ద్రదృష్టిచేఁ
బోలఁగఁ జూడ కున్న బల•ముల్ మది రోసి యనర్థకార్య ము
య్యేలికకే పొనర్చుటకు • నెంచు నొకింత ప్రియంబు సూపెనే
నాలమునందు వానికయి • ప్రాణము లిచ్చును దీని నెంచితే. 53
మ. పగఱ న్మెచ్చెడువారి ముచ్చులను లో•భస్వాంతులన్ రాజకా
ర్యగతిం గూర్పక నీకుఁ గాఁ దెగినవా•రన్నం దదీయప్రజన్

* అర్థకృచ్ఛ్రము = ఇక్కట్టు, పాపము.

* వగఁ జూపించుచు నీ సన్నపెగ్గడనుడిన్ • మన్నించుచున్ భూమిపుల్

వగఁ గన్నట్లలరించుచు న్వసుమతిం • బాలింతె శాంతిసుతా. 55

తే. జ్ఞానవంతులు గుణవంతు • లైనయట్టి వారలెవ్వారైనఁ గాని వారిఁ • బనిచి తగిన

దానములఁ జేసి వారిని • దయ దలిర్చ, నరయుచుంటివె సతతంబు • నమలచరిత.

క. అనదల వికలాంగుల నయఁగని పోతె భయార్తుఁ డగుచుఁ • గలనన్ శరణం

బని వచ్చునెడిఁదిరిపునైనను గనికరమునను గాతె • నయశాస్త్రనిధీ. 56

చ. † వ్యసనములందుఁ జిక్కుకొని • వ్యగ్రత దోఁపఁగ నెల్లవేళలన్

వసుమతి సంచరించుతన • వైరి నెఱింగి త్రిభంగులం దగం

బొసఁగుబలంబులం దగిలి • పోయి సమీహితకాలమం దనిం

బస గలవాఁడవై జయము • పర్వఁగఁ జేయుచు నుంటివే నృపా. 57

చ. సమయము మీఱి క్రూరు లగు • శత్రులనిం బొనరింప నుండినన్

సము లగువారినిం బనిచి • సామము దానము భేదదండముల్

క్రమమున సాగఁ జేయుచుఁ బ • రాక్రమ మేర్పడ నెట్టులేనిఁ ద

ద్విమతుల నుక్కడంచెడువి • ధిం దెలియం దలఁతే కురూద్వహా. 58

తే. ‡ అనిశ మష్టాంగసంయుక్త • మై చతుర్విధాంచితంబైన సైన్యంబు • నుంచి కొంట

భూమిఁ బాలించువారికి • ముఖ్యధర్మ, మనుచు నీవు గ్రహించితే • మనమునందు.

తే. వ్యసనములయందు మన మెప్పు • డాన నీయ

కాయ మెఱిఁగి వ్యయంబు సే • యంగఁ దలఁతె

గురుల విప్రుల వృద్ధులఁ • గొలమువారి

నాదరింపుచు నార్జన • మంది యుందె. 60

సీ. ఆయవ్యయము లెల్ల • ననిశము పూర్వాహ్ణమున గణకులలెక్కఁ • గనఁగఁ దలఁతె

గురువృద్ధులను జాతి • వరులను ధనధాన్యముల సంగి ప్రోవంగ • బుద్ధి నెంతె

మహి నుత్తమాధమ • మధ్యముల నెఱింగి, నీకార్యములయందు • నిలుపుకొంటె

వ్యవహార మెఱుఁగని • వారలు చోరులు, జారులు నీకడ • లేరు గాదె

తే. ప్రజల కెల్లను నీవయిఁ • బ్రీతి మిగునె

క్షోణిపతులెల్లఁ గర మిడి • కొలుచుచుండ్రె

నీతిశాస్త్రము నెప్పుడు • నీవు గఱతె

తనయులకు నైనఁ జన వీక • తనరుచుందె. 61

---

* వగ = విలాసము. † త్రిభంగులు = మంత్రకోశభృత్యములు. ‡ అష్టాంగములు = శ్లో. రథా నాగా హయా యోధా పత్తయః కర్మకారకాః, రథి దైశికముఖ్యాశ్చ హ్యష్టాంగాని ప్రచక్షతే.

తే. సర్వశాస్త్రంబు లస్త్రశస్త్రములును
బ్రహ్మదండము విషయోగ విస్తృతులును
దెలిసి సకలభయంబులఁ దొలఁగఁ జేసి
రాష్ట్ర మేలుచు నుంటివే రాజచంద్ర. 62

సీ.* దేవమాతృకము నదీమాతృకము గాఁగ, ధాన్యతలం బేలుదే సంతతంబు
కర్షకాళికి లేమి గలిగిన వేడ్క శతైకవృద్ధిగా ఋణముల నిచ్చుచుండె
బాటలు నిర్మించి పట్టణంబులవోలె, సంస్కరించితె గ్రామసముదయంబు
జారచోరాగంబు జనపదంబులయందు, నామావశిష్టమై నవసి చనునె

తే. దండ్యులగువారిఁ దెలియక దండ్యులుగ న
దండ్యులం దండ్యులుగఁ జేయఁ దలఁపవు గద
ధర్మ మెడలక యుండంగ ధరణిపాల
నంబు సేయుదు గద నరనాథచంద్ర. 63

క. వార్తిక లోకం బెల్లఁ బ్రవర్తిల్లును వార్త లేక ప్రజ లంధులు నా
వార్తం బతుకరు గావున, వార్తాహరులం గ్రహింప వలతె మహీశా. 64

తే.† ధనము వేదము శ్రుతమును దార గలుగ, సుకలులై యజ్ఞములు సేసి శుద్ధశీల
వృత్తముల నొప్పి పుత్త్రుల నెత్తుటదియు, ఫల మనుభవించు టని పార్థ తెలిసికొంటె.

ఆ.‡ అనఘ! వాజపేయ మశ్వమేధము సర్వతోముఖంబువోలె స్తోమములను
సలుప మనమునందుఁ దలఁతె దాన నిహంబు, పరము నీకుఁ గలదు పార్థివేంద్ర.

ధర్మరాజు నారదునకు సభాభవనంబుఁ జూపుట.

వ. అని మఱియు నెన్నియో ధర్మంబు లుపన్యసించిన యుధిష్ఠిరుండు కృతాంజలి యై దేవ
మునిపుంగవు నారదున కిట్లనియె. 67

క. మీచెప్పినచొప్పున విని, నాచేయఁ గలంతనట్టు నట్టు నడపియు
క్లో చేయుదుఁ బెద్దలనుమ, వే చర్చింపంగ నాకు వేదం బనఘా. 68

వ. అని మఱియును. 69

---

* దేవమాతృకము = వాననీళ్లచేఁ బండెడుపైరు గలదేశము. నదీమాతృకము — ఏటినీళ్లఁ బండెడుపైరుగల దేశము. శతైకవృద్ధి = నూటి కొకరూపాయ్యము వడ్డి. ఆగము = అపరాధము.

† ఇందుఁ గ్రమాలంకారము. శ్రుతము = శాస్త్రము.

‡ వాజపేయము = పదునెనిమిదిపశువుల నేకకాలమున విశసించి వేల్చుయజ్ఞము. అశ్వమేధము = అశ్వమును విశసించి వేల్చుయజ్ఞము. సర్వతోముఖము = ఏకకాలమున నాలుగుదిక్కులను నాలు గుత్తరవేదులు నిర్మించి నాలుగుయజ్ఞములు కలిపి చేయుయజ్ఞము. స్తోమము = యజ్ఞము.

చ. భరతుఁడుఁదొట్టి పాండుజన♦పాలుఁడు దన్కఁ మహీశకర్త్రులై
పెరిమ నెసంగు మాకొలము♦పెద్దలు నోగుణధర్మపద్ధతిన్
దొరకొని నేను బోవఁ దలఁ♦తున్ మునిలోకవరేణ్య దాని కే
తెరు వెటు తప్పునో యని మ♦దిం బెగడొందుచు నుందు నెప్పుడున్. 70

తే. దేవ మిమువంటివారానుల♦దివ్యదృష్టి, మాపయిం బ్రసరించి యి♦ట్లోపి యుంట
నెట్టిఘనతరకార్యము♦లేనిఁ జేసి, వాసిఁ గాంతు మటంచు మా♦కాస కలదు. 71

వ. అని పలికి సుఖాసీనుం డై యున్ననారదుం జూచి యుధిష్ఠిరుండు వెండియును. 72

చ. సురమునిచంద్ర మీతిరిగి♦చూడనిలోకము లెన్న సృష్టిలోఁ
బరఁగవు దివ్యమూర్తులకు ♦ బ్రహ్మసమాను ల రెందు నేనియున్
గురుతరకౌతుకంబు నొడఁ♦గూర్చెడునిట్టిది గాని దీనికిం
గరిమను మించునట్టియది ♦ గాని సభం గని రేని జెప్పరే. 73

వ. అని సభం జూపుటయు నారదుండు మందస్మితసుందరవదనారవిందుం డై పాండు
నందనునిదిక్కు మొగంబు వెట్టి యిట్లనియె. 74

తే. కనకరత్నమయంబును ♦ గామచర మ,పూర్వ మిట్టిసభాస్థల ♦ ముర్వియందు
నెందునుం గని వినియు ము♦న్నే నెఱుంగ,నిందుకులవర్య యిట దీని♦కిదియ సాటి.

మ. కల వింద్రాంతకజీవనీయవిభుయ♦క్షబ్రహ్మముఖ్యప్రభా
విలసద్దివ్యసభాస్థలంబులు జగ♦ద్విఖ్యాతమాహాత్మ్యని
స్తులముల్ దేవమహర్షిసేవ్యములు సం♦తోషావహంబుల్ మహీ
వలయాధీశ విన న్మనం బగునయే ♦ వర్ణింతుఁ దద్వృత్తమున్. 76

వ. అని పలికిన నివ్వెఱంపడి సానుజుండును బ్రాహ్మణపరివృతుండు నగుయుధిష్ఠిరుండు
ప్రాంజలి యై నారదున కిట్లనియె. 77

చ.*యతివర లోకపాలురమ♦హాసభ లెల్ల వినం దలంతు నా
యతియును విస్తరంబు మఱి ♦ యయ్యయివస్తువిశేషముం దదం
చితపురుషక్రమంబును బ్ర♦సిద్ధగుణంబును సిద్ధియున్ యథా
స్థితిగ ననుక్రమంబున వ♦చింపఁ గదే యిదె నీకు మ్రొక్కెదన్. 78

వ. అని యడిగిన పాండవజ్యేష్ఠునకు మునిశ్రేష్ఠుం డిట్లనియె. 79

ఇంద్రసభావర్ణనము.

క. నరనాథ వినుము చెప్పెద, సురనాథసభాస్థలంబు ♦ శుభశిల్పకలా
విరచితము దివ్యమణిగుణ,భరితము భాస్కరసమప్ర♦భాభాస్వరమున్. 80

* ఆయతి = నిడుపు. విస్తరము = విరివి.

చ. ముదిమియు రోగమున్ శ్రమయుఁ • బుట్టఁగ నీయనియట్టి తేజునన్
త్రిదశవిభుండు తాన పొన•రించుట మించి మహాప్రభావమున్
విదితయశంబునుం గలిగి • వింతల కెంతయు నాలవాల మై
పొదలెడు నాసభాస్థల మ•పూర్వసుపర్వరమాధివాస మై. 81

వ. మఱియు నది నూటయేఁబది యోజనంబుల నిడుపును నూఱు యోజనంబుల వెడల్పును నైదు యోజనంబుల యెత్తునుం గలిగి వైహాయసంబునుం గామగంబు నై దివ్యపాదపశోభితం బై కరంబు డంబు మీఱు నాసభాభవనంబున. 82

చ. సురుచిరరత్నజాలపరి•శోభితభూషణభూషితాంగు లై
వరము లొసంగు మానికము • వాడనిమాల్యము లొప్ప నప్పురం
దరుఁడు మహావిభూతి భువ•నంబులు నిండ శచీసమేతుఁ డై
సురలు మునీంద్రులుం గొలువ • శోభిలుచుం గొలువుండు నిచ్చలున్. 83

కవిరాజవిరాజితము. సురుచిరకీర్తులు • సుందరమూర్తులు • శుద్ధులు సిద్ధులు సాధ్యులు కి
న్నరులును రుద్రులు • నాటకభద్రులు • నాకనిశాంతులు శాంతులునున్
వరమునిచంద్రులు • వైభవసాంద్రులు • వ్యాప్తమహీంద్రులతేంద్రులు నా
సురపతికొల్వునఁ • జొప్పగునల్వున • జొత్తిలు చుందురు చిత్తములన్. 84

క. గరుడులు గంధర్వులు కిన్నరులును శ్రుతిసుఖము గాఁగ • నవనవగతులన్
బరఁగించి పాడ నచ్చర, లరుదారఁగ నాడి మఘవు • నర్చింతు రటన్. 85

మ. అని వెన్నీయక పోరి యాలిగినవీ•రాగ్రేసరుల్ భక్తి పెం
పున జన్నంబులు సేసినట్టిపురుషుల్ • పుణ్యక్రియాదక్షు లై
ఘనకీర్తిం గొని యున్నసజ్జనులు లో•కం బెన్న నేతెంచి యిం
ద్రునితోడన్ సుఖియింతు రచ్చట నమ•ర్త్యుల్వోలెఁ గీర్తింప నై. 86

వ. మఱియు నాసుధర్మామధ్యమ్మున శుక్రబృహస్పతులును బ్రచేతసులును మరుత్వంతులును నగ్నిసోములును నింద్రాగ్నులును యజ్ఞవాహు లైన సప్తవింశతిపావకులును లోకపాలురును వసురుద్రాదిత్యులును నశ్విదేవతలును విష్వక్సేనుండును విశ్వేదేవతలును ధాతయు విధాతయు హరిశ్చంద్రుండును మరుత్తుండును మరీచియు వామదేవవాలఖిల్యులును సంవర్తుండును శ్రద్ధామేధాసరస్వతులును రాజర్షులును బ్రహ్మర్షులును దేవర్షులును లోనుగాఁ గలవా రనేకు లింద్రుని సేవించుచు నివసించి యుందు రిందుఁ గొందఱును భృగ్వాదులు మఱియుం గొందఱును నిరంతరంబు వచ్చి పోవుచుందు రని వెండియు. 87

క. ఏతాదృగ్విధవిభవ,ఖ్యాతం బై సకలలోక◆గణపూతం బై
వీతజరాశోకభయం, బై తనరెడునాసుధర్మ ◆ నరయుము నధిపా. 88

వ. మఱియు నింక వైవస్వతునిసభావిభవం బెట్టి దంటివేని. 89

యమసభావర్ణనము.

చ. వినుము నరేంద్ర! యామ్యము ◆ వీనగుణోనయగత్నగమ్యమున్
ఘనతరమై భవాంచితము ◆ కాంచనకుడ్యవిరాజితంబు న
న్మునిజనసేవితం బనఘ◆మున్ శతయోజనవిస్తృతస్థలం
బును శతయోజనాయత మ◆భూతవిభాపరిపూర్ణ మెన్నఁగన్. 90

క. కామగమం బై దుర్గమ,భీమం బై విశ్వకర్మ◆విరచిత మై ఘో
రామయహార మై త్రిజగ,త్క్షేమంకర మై తలిర్చు ◆ దివి నది తెలియన్. 91

ఉ.*పొందుగ ధర్మదేవతకు ◆ భూషణమై విభవాభిరామ మై
యందు వసించువారలకు ◆ నాఁకలిదప్పులునున్ జరామృతుల్
చెందవు శీత ముష్ణమును ◆ సిల్కును సీదర మెందు లేమి నా
నందము దివ్యమానుష మ◆నాగతముం దగుఁ బార్థివోత్తమా. 92

తే. జముఁ డచటఁ గొలు వయి జీవ◆జాలములకు
సుకృతదుష్కృతములఁ గల◆సొంపు దెలిసి
పుణ్యపాపఫలమ్ముల ◆ పొంత నోవ
సలుపు సమవర్తి యై శాస్త్ర◆సమ్మతముగ. 93

క. ఘనసత్కృతులు చేసి వచ్చిన,జనులకు నట సర్వసౌఖ్య◆సంధాయక మై
చను నదము పాపగతులకుఁ, గనఁ దగు నరకములఁ గూర్చు◆ఘనపద మచటన్. 94

వ. మఱియు బ్రహ్మర్షిదేవర్షిగణంబులును నగ్నిష్వాత్తాదిపితృదేవగణంబులును దివోదా
సాంబరీషనహుషనిషధాదిరాజర్షిగణంబులును మఱియు ననేకప్రఖ్యాతపురుషులును
శంతనుండును భవజ్జనకుం డయినపాండురాజును నోనుగాఁ గలవార లనేకశతసహస్రంబు
లసంఖ్యాకంబులు గాఁ గామగం బగునందు మిక్కిలి క్రీడఁజేసి యుండి వైవస్వతుని
సేవించుచుండు రింక వరుణసభావృత్తాంతంబు చెప్పెద వినుము. 95

వరుణసభావర్ణనము.

చ. ఘనుఁ డలవిశ్వకర్మ జల◆గర్భమునందు మహాసమగ్రతన్
బొనరిచె దాని దివ్యమణి◆ముఖ్యసునస్తుసముత్కరంబునన్

* సిల్కు = ఉపద్రవము. సీదరము = దారిద్ర్యము.

ఘనతరశోభితరత్నాదులఁ బ్రకాశిలి యామ్యసభాప్రమాణముఁ
గాని వెలుఁగొందుఁ సందుఁ బరఁగు నప్వరుణుండు సతీసమేతుఁడై. 96

తే. లలితవేశ్మాసనంబులు గలిగి మిగులఁ, బాండురద్యుతి నొప్పు నాభవనమునకుఁ
జుట్టి సలుగడఁ జక్కనై శుకపికాళి,శకునిమృదునాదకలితకల్పకములు పొదలు. 97

సీ. దివ్యరత్నాంబరదేదీప్యమానులు లా,దిత్యులు బలిముఖదైత్యవరులు
వాసుకిప్రముఖసర్పశ్రేష్ఠులును జతు,రంభోనిధులును గంగాదినదులు
దేహవంతంబులై దిక్కులు మహియును, గులమహీధరములు జలచరములు
గాంధర్వవిద్యాధురంధరుల్ గంధర్వ,ముఖ్యు లప్సరసలు మునులు మనులు

తే. నిచ్చలును వచ్చి సేవింతు రిచ్చగొలఁది, నైభవంబున నొప్పు సునాథమంత్రి
మంతనంబున నాసభామందిరమునఁ, గొలువుదీరి వెలుంగుఁ బెంపలరఁ బాశి. 98

ఆ. వల్లెత్రాడుదాల్పు వరసభ యిట్టిది, ధర్మరాజ యింక ధనదుసభను
దెలిసినంతవట్టు దెలిపెదఁ దద్దివ్యభ,వంబు వినుము శ్రోత్రపర్వముగను. 99

కుబేరసభావర్ణనము.

ఉ. కామగతంబు దివ్యమణికల్పితసౌధవిరాజితంబు చం
ద్రామలకాంతివిశ్రుతము హాటకనిర్మాణంబు దివాకరాభమున్
గోమలకంబళాస్తరణగుంఫితవేశ్మము రత్నదీపికా
స్తోమవిరాజితంబు సభ సోమసఖాంచితమై తలిర్చెమున్. 100

క. ధనపతి తనచేసినతప,మునఁ బడసెనుమహిమఁ జేసి మును చేసె వెడ
ల్పున డెబ్బదియోజనములు, నొనరెననిడుపునను నూఱుయోజనములు గన్. 101

క. మెఱుపులతోఁ జిత్రించిన, తెఱఁగున భాసిల్లుశిఖరదివ్యప్రభలన్
మెఱుఁగెడునాసభ తెలుపున, వఱలుచుఁ గైలాసశిఖరవైఖరిఁ గొనియెన్. 102

తే. శంఖపద్మాదినవనిధుల్ చైత్రరథము, పుష్పకంబును గలిగి సంపూర్ణవైభ
వమునఁ దేలెడుకిన్నరేశ్వరుఁడు కామునకుఁ, గూడ్రనలకూబరునిఁ గూడి కొలువుదీరు.

సీ. నందనవనలసన్మందారకుసుమగంధ, మొలయు గంధవహుండు మొలఁగుచుండ
దేవగాయకు లెల్ల దివ్యతానంబుల, విమలగాంధర్వంబు నిగుడుచుండ
మేనకాప్రభృతులు వేవే లచ్చరల్, నృత్తగీతంబులు నెఱపుచుండ
గరుడగంధర్వకిన్నరయక్షముఖ్యులు, గొలఁది మీఱంగ నుతించి కొలుచుచుండఁ

తే. బరఁగ బ్రహ్మర్షివర్యులు బలసి యుండ, స్త్రీసహస్రవృతుండయి శ్రీదుఁ డందు
సకలభూషణభూషితుఁ డై వెలిఁగి, సింహవైభవమునఁ గొలువుండు నధిప. 104

ఉ. నాకు మనోరథం బయిన • నాఁ డెపుడు స్వరమాను లంటి రా
నాకమునుండి పోయి యట • నాఁడులు వృత్తు సమస్తదేవతా
నీకముతో విభూషణమ • నీరమణీయసురాంగనానా
బ్జాకలితార్థరాడ్వరస • భాంగణదివ్యసరోదిదృక్షమై. 105

మ. ప్రమథు ల్పారిషదుల్ మునుల్ గొలువ దీ • వ్యత్ప్రాభవం బేర్పడన్
బ్రమదారత్నపరిష్కృతార్థతనుఁ డై • బాలేందురేఖాంచితో
త్తమమాణిక్యకిరీటబద్ధశిరుఁ డై • దర్వీకరేశాభూషణ
ప్రమనుం డై హరుఁ డుండు నం దెపుడుఁ ద • త్పౌలస్త్యసఖ్యంబునన్. 106

వ. మఱియుం జిత్రసేన చిత్రరథ విశ్వావసు ప్రభృతు లైనగంధర్వులును విద్యాధ
రాధీశ్వరుం డగుచక్రధర్ముండును గింపురుషాధీశుం డగుద్రుముండును రాక్షసా
ధిపతి యగుగంధమాదనుండును గుణవిభూషణుం డగువిభీషణుండును బర్వత
తుంబురుప్రముఖగాయకరత్నంబులును హిమవత్పారియాత్రాదిపర్వతవరంబులును
నందీశ్వర భృంగీశ్వర మహాకాళాది ప్రమథగణంబులును నందు మహానందంబునం
బ్రవర్తింపుచుండు రని వెండియును. 107

బ్రహ్మసభావర్ణనము.

చ. పలికితి లోకపాలురస • భాభవనంబులపెంపుసొంపు నా
తెలిసినయంతవట్టు జగ • తీవర యింక విధాతృనోలగం
బలరు జగత్త్రయప్రథిత • మై మఱి దానియథాస్వరూపముం
దెలుపఁగ నేండ్లు పూం డ్లయిన • దివ్యుల కైన నశక్య మెన్నఁగన్. 108

వ. అయిన నామెఱింగిన తెఱంగున నించుక వక్కాణించెద నాలకింపు మని
యి ట్లనియె. 109

మ. ఎపుడో దేవయుగంబునందు మును నే • నిందుండ నిచ్ఛాగతిన్
దపనుం డెల్లజగంబులం దిరుగుచుం • దా మర్త్యరూపంబునన్
గృపతో దర్శన మిచ్చి నా కజసభా • వృత్తాంతముం జెప్ప నే
నపురూపంబు సమానుషం బనఘ మా • నంచుం బ్రహర్షించుచున్. 110

వ. తద్దర్శనకుతూహలాయత్తచిత్తుండ నై తపను నర్చింప. 111

మ. భగవంతుండవు సర్వసాక్షి వధిక • ప్రజ్ఞాసమగ్రుండ వో
జగదీశా! నిను మ్రొక్కుచుంటి నను ని • చ్చం బ్రోతువే నాకు న
ట్లగువాగీశసభాస్థలం బరయ నిం • పయ్యెం దపం బేది యో
తగుమాం దేదియొ మంత్ర మేదియొ యగుం • దత్సిద్ధికిం జెప్పవే. 112

వ. అని ప్రార్థించినం బ్రసన్నుండై ప్రభాకరుండును. 113

క. విను నారద తత్సిద్ధికిఁ, బ్రణుతంబుగ వేయియేండ్లు • బ్రహ్మవ్రతమున్
బూనరింపఁ జెల్లు నవ్వలఁ, గానిపోయెద నటకు నిన్నుఁ • గుతుకం బెసఁగన్. 114

వ. అని యుపదేశించి భాస్వంతుం డంతర్ధానంబు నొందుటయు నంత నేను హిమవత్పృష్ఠంబున సమారబ్ధవ్రతుండ నై తపం బొనరించితి నంత ననంతకాలంబున నాదిత్యుండు వచ్చి నన్నుం దోడ్కొనిపోయి నా కాబ్రహ్మసభం జూపె నదియును.

ఉ. కానఁగ వచ్చు నొక్కగతిఁ • గన్గొన మాఱు మఱొక్కలాగవా
జ్మానసగోచరం బది వి•మానము నాఁ జనుఁ గామచార మై
దానిప్రమాణమున్ స్థితియు • స్థాన మెఱుంగ నశక్య మట్టిసం
ధాన మదృష్టపూర్వ మొక•నాఁటికినేని బ్రపంచకంబులన్. 116

తే. శీతవాతాతపంబులు • సిలుగు క్షుత్పి,పాసలును లేక సుఖద మై • పరఁగునాస
భాభవనరాజ మధికర•త్నాభరణవి,భాసమితిభాసమానది•గ్వ్యాస మధిప. 117

ఉ. కంబ మొకండు నేనియును • గానఁగ రాక తిరంబు నక్షరం
బుం బహుళప్రభాకలిత•మున్ ఘన మై నిజకాంతి నాకపృ
ష్ఠంబున నుండి భాస్కరు న•డంచుచు మించినదాననుండి లో
కంబులు సృష్టి చేయుచు బ్ర•కాశిలు ధాత సతీసమేతుఁ డై. 118

మ. సురసంఘంబులతో మునీశ్వరులతో • సుత్రామముఖ్యాష్టది
గ్వరులున్ శైవగణంబుతో సుతులతోఁ • గాత్యాయనిదేవితో
హరుఁడున్ గింకరకోటితో గరుడితో • నంచన్మహాలక్ష్మితో
హరియున్ వచ్చి భజించుచుందు రజునిన్ • బ్రాంచన్మహాతేజునిన్. 119

వ. మఱియు దక్షకశ్యపాదిప్రజాపతులును వామదేవవాలఖిల్యాదిమహామునీంద్రులును సనకసనత్కుమారాదియోగాచార్యులును నదితిసురసాదిదేవమాతృకలును వేదవేదాంగోపనిషదాదిమహావిద్యలును జంద్రసూర్యాదిగ్రహంబులును నింద్రాదిదిక్పాలకులును వసురుద్రాదిదేవతలును ధర్మార్థాదులును శమదమాదులును ధృతిమేధాస్మృతిప్రజ్ఞాబుద్ధులును రథంతరాదిసామంబులును వివిధశాస్త్రపురాణేతిహాసాదులును సాంగవేదాయుర్వేదంబులును క్షణలవముహూర్తదివారాత్రపక్షమాసర్తుసంవత్సరయుగాత్మకం బైనకాలచక్రంబును ధర్మచక్రంబును మఱియు స్థావరజంగమాత్మకం బైనమహాభూతంబులును మూర్తిమంతంబు లై సత్యలోకసభామధ్యంబునఁ దన్ను సేవింపఁ బరమేష్ఠి పరమానందంబునం

బొందుచు దయామయాంతఃకరణుం డై సకలజంతుజాలంబులకును దత్తత్కర్మాను
సరణంబున ఫలంబు లనుభవింపఁ జేయుచుండు నని వెండియును. 120

క. జననాథ మనుజలోకం, బున నీసభ యెట్టిదో వి♦బుధలోకములన్
ఘనుఁ డగుపితామహునిసభ, యును నట్టిద వింటె దాని♦యున్నతి తెలియన్.

చ. అనవుడు ధర్మజుం డనియె ♦ నార్య వినంబడె దేవతాసభల్
మనము ముదంపడెన్ మఱియు ♦ మాట యొకం డగుఁ బుణ్యమూర్తు లై
పొసరినపాండుభూమిపతి♦ముఖ్యులు యామ్యసభ న్మెలంగ నిం
ద్రునిసభ నాత్రిశంకునిసు♦తుం డొకఁ డొప్పుట వింటి వింతగన్. 122

ఆ. వారికన్న నతఁ డ♦వారిగా నేపుణ్య, కర్మ మాచరింపఁ ♦ గలిగి ధన్య
తముఁడ యయ్యె నింద్రు♦దండ నుండుట కిది, యింత యెఱుఁగ నాన♦తీయవయ్య.

వ. అనిన నారదుం డి ట్లనియె. 124

హరిశ్చంద్రుమాహాత్మ్యము.

మ. పరమోదారగభీరసారసుగుణ♦ప్రజ్ఞాసమగ్రుండు స
త్కరుణాంచన్మతి సత్యవాక్యనిరతా♦ఖ్యాతప్రభావుండు భా
స్వరతేజోనిధి పుణ్యసాంద్రుఁడు హరి♦శ్చంద్రుండు నా భూవరుం
డిర వొందెన్ సుకృతాన్వితాదియుగమం♦దిక్ష్వాకువంశంబునన్. 125

మ. తను బొంకింప వసిష్ఠుతోఁ బ్రతిన సు♦త్రామహాకమం దూని వ
చ్చినగాధేయున కుర్వి యెల్ల నిడి దుః♦ఖ్యాలంబునన్ దోఁగున
మ్మునిరారాపుల కెల్ల నోర్చి సతితో♦ము న్నన్నియే బన్నము
ల్గొని సత్యంబిల నిల్పికొన్నఘనుఁ డా♦లోకోత్తరుం డౌఁ జుమీ. 126

శా. సప్తాశ్వాన్వయసింధుచంద్రుఁడు హరి♦శ్చంద్రుండు ధీసాంద్రుఁ డై
ప్రాప్తానంతబలంబునన్ సకలభూ♦భాగంబులుం గెల్చి యీ
సప్తద్వీపసముద్రముద్రితధరా♦చక్రం బవక్రక్రమా
వాప్తానంతపరాక్రమంబునను రా♦జై యేలెఁ గీర్తింపఁగన్. 127

చ. అడిద మొకండు నాయముగ ♦ నన్నికెలంకుల నున్నరాజులం
గడిమి జయించి కప్పములు ♦ గైకొని వేలును గోటు లాధనం
బుడుగర గాఁగ యాజకుల ♦ కొయ్యన నిచ్చుచు రాజసూయ మన్
కడిఁదిసవం బొనర్చెఁ గడఁ♦కన్ విధిదృష్టవిధాన మేర్పడన్. 128

ఆ. ఎల్లకడలనుండి ♦ యేతెంచుబ్రాహ్మణ, ప్రవరు లమ్మహాధ్వ♦రప్రసర్ప
కాలమందుఁ గొనిన♦కనకంబు భోజనం, బింత యనుచుఁ దెలుప♦ నేరితరము.

శా. దానం జేసి యతండు పూజ్యుఁ డగుచున్ • దత్కీర్తి తేజస్వి యై
తా నారాజులకన్న మిన్న యగుచుం • దర్పింప నై యింద్రునా
స్థానంబందు మహానుభావుఁ డయి భా•స్వద్వైభవం బంది ని
త్యానందంబునఁ బొంగుచుండె సమరుం • డై వింటె రాజోత్తమా. 130

ఆ. రాజసూయ మెవరు • రాజుల నెల్లర, గెలిచి తేజ మలర • సలుపఁ గలరొ
వారు నింద్రునొద్ద • వైభవం బలరార, మెలఁగుచుండఁ గలరు • మేదినీశ. 131

క. ఘనతపము చేసి విగ్రహ,మును విడిచినమునులు జన్య•మున శత్రులతో
వెనుదీక పోరి చచ్చిన,మనుజులు సటఁ జేరికొంద్రు • మనుజాధీశా. 132

వ. అని మఱియును. 133

పాండురాజసందేశము.

ఉ.*ఇంద్రునికొల్వుకూటమున • నిద్ధయశుం డయి యుండునాహరి
శ్చంద్రుని నాలకించి యమ•సంయమనీసభ నష్టకాదిపృ
థ్వీంద్రులఁ గూడి యున్నభవ•దీయగురుం డలపాండురాజు ని
స్తంద్రుఁడ నై దివిన్ విడిచి • చాగెదునన్ను నెఱింగి యిట్లనెన్. 134

చ.‡మునివర భూతలంబునకుఁ • బోవఁ దలంచితి రే మదగ్రనం
దనునకు ధర్మరాజునకు • దర్శన మిచ్చి దయారసంబు పెం
పనునడ రాజసూయమఖ • మాసినవారు మహేంద్రలోకమం
దునికియు నస్మదాదు లిటు • లునికియుఁ దెల్ప ననుగ్రహింపవే. 135

ఉ. పుత్రులకుం బితృప్రియము • పోలిచి తీర్చుట పాడి గావునన్
బాత్రుఁడ వీవు దమ్ములు న•పారపరాక్రమనిర్జితాఖిల
క్షత్రియు లెంత చాలరు ప్ర•శస్తికి నెక్కఁగ రాజసూయమున్
ధాత్రి నొనర్పు మట్టిసుకృ•తంబున నింద్రుపదంబు నొందెదన్. 136

మ.†అని నేఁ జెప్పినయట్లు చెప్పి యతిన•ర్యా వాని కయ్యాగబు
ద్ధిని బుట్టింపుఁడు నావు డే నిలకుఁ బోఁ • దె న్నయ్యె నే నట్ల పొ
మ్మని నీకు న్వచియింప వచ్చితిఁ గుమా•రా! రాజసూయంబు తెం
డ్రిని యోగంబునఁ జేసి దేవపదము • స్నవారికిం గూర్పుమా. 137

---

* సంయమని = యమపురము. ‡ అను = ధరించు, అనఁ గాఁ జేసినవా రని లక్షణార్థము.

† తెన్ను = దీనికి మార్గార్థము కోశదృష్టమైనను దీఱుబడి యనునర్థ మిటఁ జెప్పుకొనవలయు. ‘నాకా పని చేయుటకుఁ దెన్నులేదు’’ అని గోదావరిమండలమున వ్యవహరింతురు.’

తే. అమ్మహాధ్వర మతిదుష్క•రమ్ము బహుళ
విఘ్నసంయుత మ్మెన్న యజ్ఞఘ్ను లైన
బ్రహ్మరాక్షసు లెల్ల రం•ధ్రమ్ము రోయు
నుందు రవలికాలము ఘోర•యుద్ధ మొదవు. 138

వ. ఆయుద్ధంబున నఖిలప్రజాప్రశమనం బగు నిది యంతయుం జింతించి చాతుర్వర్ణ్య రక్షణంబునం దప్రమత్తుం డవై క్షేమం బెట్లగు నట్లు చేయు మిది యంతయు నీవు న న్నడిగితివి గావునం జెప్పితి నే నింక దాశార్హనగరంబునకుం బోయి వచ్చెద నని నారదుండు ఋషీంద్రసమేతుం డై కదలి చనియె నంత ధర్మనందనుండును.

రాజసూయారంభపర్వము.

ఉ. తమ్ములుఁ దానుఁ దత్క్రతు వృం•దారతఁ జేయఁగఁ జింత సేయుచున్
బమ్మినవేడ్కతో నిజస•భాభవనమ్మునఁ గూడి యున్నమి
త్రమ్ముల సత్పురోహితుల • రాజుల మంత్రుల బంధులోకవ
ర్గమ్ముల సాదరేక్షణప•రంపరలం బొదలించి యి ట్లనున్. 140

ఉ. వింటిరె సభ్యులార ముని•విశ్వజనీనవచఃప్రకార మే
మంటిరి కన్నతండ్రికిఁ బ్రి•యం బొనరించుట పాడి బిడ్డ కి
వ్వెంటన తన్నియోగ మది • విన్నను వొప్పఁగఁ జేత దుర్ఘటం
బంటును సొంటు నొంటఁ బడు•న ట్లగుదెంచెను నాకుఁ జూడఁగన్. 141

మ. అమరావాసము తండ్రి కబ్బు నని తా • నంట న్మునీంద్రుండు జ
న్నము సేయం దలపోసి చేకొనిన నా•నావిఘ్నముల్ పిమ్మటన్
సమకూరుం గడుఘోరయుద్ధ మవనీ•చక్రంబునందుం బ్రజా
శమనం బౌఁ గద యేమి సేయుదు నిఁకం • జర్చించి వా కీయుఁడీ. 142

వ. అని డోలాయమానమానసుం డగుయుధిష్ఠిరునకు ధౌమ్యద్వైపాయనప్రభృతిప్రకృతిప్రధానవర్గం బి ట్లనియె. 143

మ. జడియం బోయెద వేల భూపతిలకా • సామ్రాజ్యపట్టాభిషి
క్తుఁడు దేవుం డగు నిట్టినీ వలఁతివొ•క్కో రాజసూయాధ్వరం
బెడ సేయన్ బని లేదు చేయుము జగం • బెన్నంగఁ దోఁబుట్లు నాఁ
బడు నత్యేతుల నాల్గుదిక్కులను ని•ల్పం బోల్ జయస్తంభముల్. 144

క. కొడుకుల కెన్నఁ బితౄణము, గడవనియది తండ్రిపంపు • గావింపనిచోఁ
గొడు కగునె వాఁడు జన్నము, గడుకొని చేయుము ప్రియమ్ము • గా జనకునకున్.

తే. రాజసూయావభృథమున • రాజవంశ,జనితుఁ డభిషిక్తుఁ డగునేని • జగతి వాఁడు
నాగుణమును బొంది సమ్రాట్టు • నాఁగఁ బేర్చి, యలరి తా సర్వజిద్యశం • బందు ననఘ.
క. సమయము మంచిది క్షత్రియ, సముదాయం బెల్ల నీకు • స్వాధీన-మగుటన్
సుమనస్సన్నుత నీ వచి,రములోనం బూను మధ్వ • రము సేయంగన్. 147
వ. అని యెల్లరు నైకకంఠ్యంబుగాఁ జెప్పిన నతండు మఱియు నవ్విషయంబ తమ్ములు మంత్రులు ధౌమ్యులు ద్వైపాయనులు లోనగువారితో మాటిమాటికిం జర్చించుచు ననిశ్చితమనస్కుం డయి కొంతవడికి విజ్ఞానం బభినయించి. 148
మ. అమరేంద్రాదులతోఁ బ్రపంచముల ని • సృష్టి రక్షించును
త్తమదైవంబు నిజప్రభావ మనువొం • దన్ ధర్మసంస్థాపనా
ర్థము మర్త్యంబున నుద్భవిల్లినజగ • న్నాథుం డజుం డవ్యయుం
డమలుం డచ్యుతుఁ డప్రమేయుఁ డనఘుం • డాతండు కృష్ణుం డగున్. 149
శా. లోకాతీతుఁడు వాసుదేవునకు నే • లోకంబునం గానఁగా
రా కున్నట్టిది లేదు నిక్కముగ నా • రాజీవనేత్రుం డెదన్
మాకుం గూర్చి గురుండువోలె నెపుడున్ • మాపాల వర్తించు నం
చాకృష్ణుఁ బ్రభవిష్ణు నాత్మఁ దలఁచెన్ • హర్షాతిరేకంబునన్. 150
వ. అంత నక్కౌంతేయాగ్రజుం డొక్కదూతం బిలిచి శ్రీకృష్ణుం దోడితేఁ బుచ్చుటయు నాతండును. 151
తే. గంధవాహబాంధవమహా • సైంధవములఁ
బరఁగురథ మెక్కి ద్వారకా • పురము వోయి
కృష్ణునకుఁ బార్థసందేశ • మెఱుఁగ విన్న
వించెఁ దననేర్పునకు జనం • బెంచి పొగడ. 152

కృష్ణుం డింద్రప్రస్థమునకు వచ్చుట.

వ. ఇంద్రావరజుండును నిందిరాసేనసహితుం డయి కదలి యతిత్వరితప్రయాణంబుల నింద్రప్రస్థపురంబునకు వచ్చి ధర్మజునకు దర్శనం బిచ్చుటయు నంత. 153
చ. అనుజులతో నెదుర్కొని ప్రి • యంబునఁ దెచ్చి సుఖాసనంబునం
దొనరఁగ నిల్పి ధర్మసుతుఁ • డొప్పుగఁ గృష్ణున కర్ఘ్యపాద్యముల్
పొనరిచి సేమ మారసి స • ముత్సుకుఁ డై ప్రియ మాడె నాతఁడున్
దనిసి యథోచితంబుగ ము • దం బిడె నందఱ కన్నిరీతులన్. 154
వ. అంతఁ గొంతవడికిఁ గౌంతేయాగ్రజుండు గదాగ్రజుం దఱిసి వినయం బభినయించుచు ని ట్లనియె. 155

చ. పనిచెను రాజసూయ మది ♦ పాండుమహీపతిపంపు సేయు మం
చును సురవైరి దీనికి వి♦శుద్ధచరిత్రుఁడు సర్వపూజ్యుఁడున్
ఘనుఁ డగురాజచంద్రుఁ డగుఁ ♦ గాని ననుం బురికొల్పి రిందఱున్
వనరుహనాభ నీపలు క♦వశ్యవినిర్ణయ మిందుఁ గావునన్. 156

ఆ. చెలిమి నొకఁడు తప్పఁ ♦ దలపోయ నొల్లఁడు
బలిమి నొకఁడు మెప్పఁ ♦ బలుకుచుండుఁ
గలిమి నొకఁడు ప్రియము ♦ గలుగ భాషించెడుఁ
బనులు వడిన జనుల♦పలుకు లిట్లు. 157

క. నీ పట్లు గాక విజ్ఞా,నావధి వై కార్య మిట్టి ♦ దని పలుకు దెటన్
గావున నిదమిద్ధ మ్మనఁ, గా వలయు మహాత్మ! నన్నుఁ ♦ గరుణించి యిటన్. 158

వ. అనిన వాసుదేవుం డి ట్లనియె. 159

క. దేవ సమస్తవిధంబుల, నీవర్హుఁడ వామఖంబు ♦ నెఱవేర్చుటకున్
భావమునఁ దెలియు దైనన్, నే వివరించెద నొకింత♦నిర్ణయవిధమున్. 160

జరాసంధపరాక్రమవర్ణనము.

వ. పరశురాముం డపగతక్షత్త్రంబుగా నిలం జేసిన నాఁటఁగోలె నైలేక్ష్వాకువంశంబులు కొన్నితక్కఁ దక్కిన వన్నియు నెన్నఁ జెడి కృత్రిమంబు లయ్యె నయ్యైలేక్ష్వాకువంశంబులవలన నేకోత్తరశతవంశంబులును యయాతిభోజవంశంబులవలనఁ జతుర్దశవంశంబులు నుత్పన్నంబు లయ్యె ని ట్లున్నసకలక్షత్త్రియకులంబుల నెల్ల నోడిచి మూర్ధాభిషిక్తుం డై జరాసంధుం డొక్కరుం డిపు డుక్కెక్కి గర్వాంధుం డయి గండు మిగిలి యున్నవాఁడు వినుము. 161

సీ. సేనాని యై వాని ♦ సేవించు ననయంబు, శిశుపాలుఁ డాగ్రహా♦శ్లిష్టుఁ డగుచు
నిరత మాతనిచక్క ♦ నిలుచుఁ గరూషాధి,పతి వక్రుఁడు ప్రధాన♦భటుఁడుగాలె
నాశ్రయించిన వాని ♦ హంసడిభకదంత,వక్త్రులు విక్రమా♦వక్రతేజు
లరయ నీమాతులుం ♦ డగుకుంతివర్ధనుం, డతనికి నెయ్యుఁ డై ♦ హితముఁ గూర్చు

తే. నీదుతండ్రి సఖుఁడు గాన ♦ నీకు మదినిఁ, గూర్చువాఁ డై భగదత్తుఁ ♦ డోర్చి మగధ
పతికి హితుఁ డయ్యె వాక్కర్మ♦గతుల నెపుడు, నతులబలశాలి భీష్మకుం♦డతనిప్రాపు.

వ. మఱియుం జేదిపతి యైన పురుషోత్తమనామంబునను వంగపుండ్రకిరాతపతి యైనపౌండ్రకవాసుదేవుండును గొవాష్కరభ నరక మురపురజత్ప్రముఖయవనాధిపతులును నన్ను ద్వేషించి వానిమిత్త్రులై సేవించుచుండి రుదీచ్యు లగునష్టాదశభోజకులంబులవారును శూరసేన సాళ్వ పాంచాల పుళింద కళింగ కుంతి కోసల మత్స్యాదిదేశంబులరాజు లె

ల్లరు నమ్మాగధునిభయంబునం బుత్త్రమిత్త్రకళత్త్రాదులతో నునికిపట్టులం బెడఁబాసి నానాదిక్కులకుం జెదరి యున్నవా రని వెండియు. 163

ఉ. *మాగధుఁ డల్లుఁడై కుటిల◆మార్గమునం బడి కంసుఁ డెంతయు
వీఁగక భోజసంతతికిఁ ◆ బీడ యొనర్పఁగఁ జూచి చూచి నే
నాగడకాని వాని నని◆మందు వధించుటఁ జేసి మాగధుం
డీగతి నాఁగ రానియటు ◆ లేచి మముం బగ నేఁచె వింటివే. 164

తే. ‡హంసడిభకులు వారుఁ గ్రే◆తాగ్నులట్లు, ముజ్జగంబుల నేర్చెడు◆పొడువు దోఁప
మధురపైఁ బడి మూఁడేండ్లు◆మమ్ము వేఁచి, వేఁచి చంపిరి బహుబలా◆న్వితు లగుచు.

వ. అమ్మహాయుద్ధంబున శస్త్రనిహతులు గానిహంసడిభకులదాడికిం దాఁకఁ జాలక యదువృష్ణిభోజాంధకప్రవరు లెల్లరు నొక్కయుపాయంబు వన్ని హంసుండు సమరంబున రామునిచే నిహతుం డయ్యె నని డిభకునకుం జెప్పి పుచ్చిన నతండును. 166

చ. అది మది నమ్మి బమ్మరిలి ◆ హంసుఁడు లేనిజగంబునం దిఁకన్
బ్రిదుకుట వ్యర్థ మంచు యము◆నాజలమందు మునింగి చచ్చె దుః
ఖద మగుపట్టివార్త విని ◆ క్రాఁగుచు హంసుఁడు నట్లు దేహమున్
వదలె బృహద్రథాత్మజుఁడు ◆ వారలు చచ్చుట నొచ్చి క్రచ్చఱన్. 167

వ. ముట్టడి విడి మగిడి మగధకుం జనియు నిజదుహిత యగుకంసభార్య ప్రేరేప మాపైఁ గోపంబు సూపుచుండె నంత మేమును మధురాపురంబునం గొంతకాలం బుండి దినదినప్రవర్ధమానం బగువారివైరంబునకుఁ దాఁకఁ జాలక సహపుత్త్రమిత్త్రకళత్త్రబాంధవంబుగా మధుర విడిచి ప్రతీచిం బట్టి వచ్చి కుశస్థలంబున రైవతకాద్రీంద్రంబున దుర్గంబు నిర్మించుకొంటి మదియును. 168

తే. మూఁడుయోజనములనిడు◆పును దదంత, రమున నేడుత్రిస్కంధము◆ లమరి నూఱు
ద్వారములు వీరవిక్రమ◆తోరణములు, గలిగి దుర్భేద్య మై దుర్గ◆ మలరుచుండు.

క. ద్వారావతి యనుపేరం, గీరింతు రందు నాంధ్రు◆ దెగి పగతురకున్
బీరము సూపుదు రెంతే, వీరులఁ జెప్పంగ నలయు◆నే నరనాథా. 170

వ. మఱియు నష్టాదశసహస్రసంఖ్యాకు లగుయదువృష్ణిభోజాంధకప్రవరులు నేకైకత్రిదశసంఖ్యాకాహుకపుత్త్రశతంబును జారుదేష్ణుండును జక్రదేవుండును సాత్యకియు నేనును రౌహిణేయుండును సాంబుండును గృతవర్మయు లోనుగాఁ గలమహారథు లెల్లరు శత్త్రుసంక్షోభాయంబునఁ బ్రవర్తించుచుండుదు మెల్లరమును జరాసంధభయంబునం బడక సుఖం బున్నవారము వినుము. 171

*ఆగడకాఁడు=అకార్యముచేయువాఁడు. ఏచు=అతిశయించు; ఏఁచు=బాధించు. ‡పొడువు=ఉన్నతి.

మ. అతినీచుం డగునాబృహద్రథసుతుం ♦ డత్యంతదర్పంబునన్
బ్రతి లేకాలముల న్మృగేంద్రము మృగ♦వ్రాతంబులం బోలె ను
ద్ధతుఁ డై రాజుల నెల్లఁ బట్టి చెఱ లోం♦దం గట్టి వేధించు నీ
క్రతుమూలంబున వానిఁ దున్మి నృపతి♦వ్రాతంబులం బ్రోవుమా. 172

చ. పశుపతికిం బ్రియంబుగ స♦వం బొనరింపఁ గడంగి రాజులన్
పశువులు గాఁగఁ జేసికొన ♦ భావమునం దలపోసి పట్టె నా
పశుసముఁ డై సమాగధునిఁ ♦ బట్టి వధించినఁ గాని రాజసూ
యశుభసవం బొనర్చుటకు ♦ నైతి యొకింతయు లేదు కావునన్. 173

చ. అనుజులు భీమసేనవిజ♦యాదులబాహుబలంబు పెంపునన్
మనుజవరేణ్య నీ కిపుడు ♦ మాగధు నొంచుట సాధ్య మెన్న సం
దునఁ జెఱ నున్నపార్థివుల♦దుఃఖము వాపినయట్టిపుణ్యమున్
ఘనసవనం బొనర్చి పితృ♦కార్యము దీర్చినపుణ్య మయ్యెడిన్. 174

వ. ఇది నాయభిప్రాయ మింక దేవరచిత్తం బెట్టిదియో విన వలతు మనిన యుధిష్ఠిరుం
డి ట్లనియె. 175

సీ. తెలియఁ బల్కితి వీవు ♦ తెలియుదు వన్నియు, నవని నీకన్న స♦మర్థు లెవరు
తెలిసి యున్నను స్వార్థ♦కలనఁ బ్రశంసింప, ససమర్థుఁ డగు నరుం♦ డన్నికడల
శమ మెంతుఁ బరి మని ♦ జడజరాసంధభ,యమ్ము శంకించు నా♦యంతరాత్మ
వీ రెల్ల నీభుజ♦వీర్యాశ్రయులు నీవు, వానికి జంకు దన్♦వాదు పడియె

ఆ. దేవ నీవును బల♦దేవభీమార్జునుల్, ఖలుని వానిఁ ద్రుంపఁ ♦ గలరొ లేరొ
యనుచు మాటిమాటి ♦ కాత్మఁ దలంకుదు, నిశ్చయించి పలుక ♦ నేర నేను. 176

ఆ. సంశయంబుఁ దీర్పఁ ♦ జాలుదు నీ విట్టి, తఱుల నడిసయపుడు ♦ తగినయట్లు
సారిసాక్షి నిప్పు ♦ సర్వకార్యములందుఁ, బోల్చికొనఁ బ్రమాణ♦భూతుఁ డైతి. 177

వ. అన విని భీమసేనుం డన్నదిక్కు మొగంబు వెట్టి యి ట్లనియె. 178

భీమసేనార్జునులు ధర్మరాజున కుత్సాహంబు గలిగించుట.

మ.*నృపుఁ డారంభవిహీనుఁ డై నడిఁ జెడున్ ♦ నిం పేద వల్మీకము
ల్లెపుడున్ దుర్బలుఁడే పతంద్రితుఁ మపా♦యోద్ధప్రయోగంబునన్
రిపులన్ మేరువు లంతలం జదిమి కీ♦ర్తిం గాంచు నొక్కింతలో
నిపు డింతేటికి మాగధుం డనఁగ వాఁ♦ డెం తయ్య చింతింపఁగన్. 179

* నింపు=సమృద్ధి; ఏదు=నశించు.

తే. నాబలంబును గృష్ణుని నయము విజయు,జయ మెఱుంగవె నీవు పూజ్యప్రతాప
మేము మూఁడగు నట్లయి యామగధజ,నాధినాథుని సాధింతు మాధి విడుము.
వ. అని పలుకుచున్నసమయంబున శ్రీకృష్ణుండు వెండియు. 181
క. భరతుఁడును గార్తవీర్యుఁడు, మరుతుఁడును భగీరథుండు మాంధాతయు నాఁ
బరఁగినసమ్రాట్టులు ము, న్నరిది భుజాబలముకలిమి నధికులు గారే. 182
ఉ.*వారికి నన్నిటం బురుడు వచ్చినసీ వసుధా నలంతివే
క్రూరుఁడు మాగధుండు నృపకోటుల మేటుల బందిఁ బెట్టి ని
ష్కారణ మట్లు వేఁచు నని జానుగులం బడ మానసంబునం
దీరనవాఁ డెవండు తనదేహమునం బ్రియ మంది యుండునే. 183
తే. శస్త్రమరణంబు క్షత్రియజాతి కుత్త
మోత్తమము గాన మమ్మంపు ముర్వినాథ
ఖలు జరాసంధుఁ దునిమి నిష్కంటకముగ
నన మిలం గందు మొండె యొండె డాఁదు మొండె. 184
వ. అనిన యుధిష్ఠిరుండు కృష్ణున కిట్లనియె. 185
ఉ. స్వార్థపరాయణుండ నయి సాహసవృత్తి వహించి మిమ్ము మో
వ్యర్థము గాఁగఁ బోన నెటు లంపఁగ నేరుతు నయ్య సర్వలో
కార్థశరీర! నీవు మన మక్షులు తమ్ములు నాకు నిట్టి మి
మ్మర్థమునందు నాసమెయి నక్కట వీడి మెలంగ నేర్తునే. 186
చ. ఖలుఁడు బృహద్రథాత్మజుని గం డడఁగింపఁగ భీమవిక్రమం
బలఁతి యము ల్కుమారు లన మర్జునుఁడు పార్థుఁడు నిక్క మిట్టివోఁ
దలపడితే నసర్థ మగుఁ దానునసేక్షణ రాజసూయమున్
నిలుపుద మూరకే కొలువి నెత్తిని గోఁకికొనంగ నేటికిన్. 187
వ. అనిన హుంకరించి ధనుష్టంకారంబు సేయుచు నర్జునుం డన్నకిట్లనియె. 188
మ. భయకృద్గాండివ మస్త్రశస్త్రచయమున్ భాస్వద్రథాశ్వంబు ల
క్షయతూణీరములున్ గపిధ్వజము లోకఖ్యాతవీర్యంబు క్ష
త్రియజన్మంబు ననన్యలభ్యములు వొందె న్నన్నుఁ జర్చింప ని
న్నియునున్ వ్యర్థము లై చనన్వలయునే నీ విట్లు వాక్రుచ్చుటన్. 189
మ. కులవీర్యంబుల వీర్యమే ఘనము వీడొక్క వీర్య మెట్టిండు నే
ములు మోసంతయుఁ జేయఁ జాలఁడు గుణీభూతంబు లై సద్గుణం

* తీరనవాఁడు — చక్కఁబడినవాఁడు.

బుల వెల్లన్ బలవంతుసందు నిలుచున్ ♦ బో వాఁడె ధన్యుండు నేఁ
గులవీర్యంబులు గల్గి యుండియు విప♦క్షుం జూచి సైఁతుం గటా. 190

క. దైన్యము మోహము జనునకు, హైన్యం బొదవించి చెఱచు ♦ నఖిలంబును రా
జన్యుఁ డగువాఁడు వానికి, సన్న్యాస మొసంగి విజయ♦సౌఖ్యము లందున్. 191

చ. వెగ టయిసం గపాయ మది ♦ వెన్క గుణం బినునట్లు మాగధుం
దగులుట కష్టసాధ్య మయి♦న న్విజయం బగు సిద్ధ మందుసన్
బగతునికట్లఁ బడ్డనర♦పాలుర నేలుఫలంబు నుత్తమం
బగుమఖముం బొసర్చుఫల ♦ మబ్బ సుఖించుఫలంబు సబ్బెడిన్. 192

అ. ఒకట నిన్ని ఫలము ♦ లొనగూడు నని నిశ్చయించి సంశయంబు ♦ డించి ముదల
యొసఁగు మేము వాని ♦ నుక్కడఁగించి వత్తుము శుభమ్ము దెత్తు ♦ మమల కీర్తి.

చ. అని విజయుండు పల్కుసమ♦యంబున వెండియు వాసుదేవుఁ డి
ట్లనియె నరేంద్రచంద్ర భర♦తాన్వయజాతుల కిట్లు వోలు నీ
యనుజులు చెప్పినట్టులు న♦యంబున మే మరిపిను సొచ్చి నే
ర్పున వధియించి వత్తు మటఁ ♦ బోరున రంధ్ర మెఱింగి పొంగుచున్. 194

ఆ. తనకు నెదురు లేమిఁ ♦ దగనిగర్వంబున, నెగిరిపడుచుఁ దన్ను ♦ నెదిరి నెఱుఁగ
కాతఁ డిపుడు మత్తుఁ♦డై యుండెఁ గాన న,య్యధము మొత్తి కూల్చు♦నదను నిదియ.

క. కూలుతు మది కాదేనిం, గూలి జరామరణరహిత♦గుణసహితం బై
పోలినవేలుపులెంకిన్, శ్రీ లంది సుఖంతు మింకఁ ♦ జెప్పఁగ నేలా. 196

వ. అని కృతనిశ్చయుం డై పలికిన వాసుదేవుం జూచి ధర్మరా జి ట్లనియె. 197

ఉ. దానవఘస్మరా విన నె♦దం బరమాద్భుత మావహిల్లెఁ దా
వానల మంటిసన్ శలభ ♦ మ ట్లిల నెట్టిఁడు నిన్నుఁ దాఁకినన్
మా నతి పోవు నిట్టియెడ ♦ మాగధు మేటిగఁ జెప్పుచుంటి వా
మానిసి బాహువిక్రమ మ♦మానుషమా వచియింపు మంతయున్. 198

వ. అని యడిగిన కృష్ణుం డాజరాసంధునివృత్తాంతంబు విను మని యి ట్లనియె. 199

## జరాసంధునిజన్మప్రకారాదికము.

చ. కలఁడు బృహద్రథుం డను నొ♦కండు పరాక్రమనిర్జితా
ఖిలనరనాథుఁ డాతఁడు మొ♦గి న్మగధాధిపుఁ డై సమస్తభూ
తల మినుఁడో యనం దటిసి ♦ తా వెలుఁగొందుచుఁ గాశిరాజక
న్యల మృదులాంగులం గవల ♦ నాదటఁ బెండిలియాడి వేడుకన్. 200

క. అయ్యిరువురందు నెయ్యం, బెయ్యెడలన్ సమత నొంద నిచ్ఛాగతులన్
సయ్యాటములం దేలుచు, నొయ్యనఁ బ్రాయంబు పుచ్చె నొకవ్రేల్మిడిగన్. 201

క. పుత్రులఁ బడయం జాల కపుత్రకులకు గతులు లేమిఁ బోలించి యతం
డాత్రిము నొందుచుఁ గ్రతువుల్, ధాత్రీసురపూజ లపుడు దగ నొనరించెన్. 202

వ. అట్లొనరించియు నలబ్ధమనోరథుం డగునాబృహద్రథుండు కడుంగడు నిర్వేదించి పత్నీద్వితయసహితుం డయి యొక్కనాఁడు. 203

చ.*అమరసతుల్యవైభవ మదంతయు మంత్రులయందుఁ బెట్టి తా
నమలతపోవనంబుఁ జని యం దొకబాలరసాలసాలమూ
లముకడ నున్నగౌతమకులప్రవరున్ మునిఁ గాంక్షివత్సుతున్
విమలునిఁ జండకౌశికుని వేడ్క మెయిం గని భక్తి మ్రొక్కుచున్. 204

క.‡వరివస్యల భజియించినఁ, బరితుష్టుం డగుచు నతఁడు పలికె నరేంద్రా
వరియింపు మిష్ట మెయ్యది, వరి మొసఁగెద ననిన మగధపతి ప్రణతుం డై. 205

చ.† కుడువఁగఁ గట్టఁ గల్గినను గొల్లగ సొమ్ములు దాల్చి పొల్చినన్
మడతుఁలపిండు గొల్చి కడు మన్ననఁ జేయుచు నంటి యుండినన్
గడఁ గొన విద్దెలం జదివి క్రాలెడువారయినం దలంపఁగాఁ
గొడుకులు లేనిమానిసులకుం గుదు రింతయుఁ గాదు నెమ్మదిన్. 206

మ. పృథివీరాజ్యసుఖంబుల న్విడి తపోవృత్తిం బ్రవర్తింప నీ
పృథులశ్రోణులతోడ వచ్చితి నిటన్ బె క్కేల తండ్రీ సుత
ప్రథితానందము గామి నిట్లయిన నేభాగ్యంబు లబ్ధించుటల్
వృథ గాదే వరి మన్య మేటికి దయ న్వీక్షించి రక్షింపవే. 207

తే. అనిన విని వారిహృదయార్థ మరసి మౌని, ధ్యాననిశ్చలచిత్తుఁ డై తెరువు నీడఁ
గూరుచుండెఁ యంత నాతనిజమునుండి, పం డొకఁడు రాలె మునియంకభాగమందు.

వ. అతం డాచూతఫలంబు పుచ్చుకొని యభిమంత్రించి రాజున కిచ్చి యిట్లనియె. 209

చ. ఫలములు లేనికాలమునఁ బండు సమీరముఁ గిర మంటకే
యిలఁ బడెఁ జెట్టునుండి యిది యెన్న సుతోదయకారణంబు పొ
మ్మలరి కృతార్థుఁ డైతి వన నాతఁడు నాతనికాల్ల నొదలన్
నిలిపి సతీయుతంబుగఁ జనె న్మొద మందుచు రాజధానికిన్. 210

* చని = పొంది. ‡ వరివస్య = సేవ.
† కడ = అంతము.

వ. ఇట్లు చని తనయిరువురుభార్యలకు నప్పండు నిచ్చుటయు వారు దాని రెండుసమభాగంబులుగా విభజించి భుజించి రాఫలప్రాశనంబునం జేసి వారికి గర్భం బై సమయకాలంబున. 211

క. ఒకక న్నొకకా లొకచే, యొకచెవి యొకచె క్కొకకురు ♦ వొకచ న్నొకమూఁ
పొకప్రక్క గలుగ మానిసి,శకలము లుదయించె రెండు ♦ సాఁబాలు పడన్. 212

చ. బ్రదికినయట్టు లై మెదల ♦ వ్రయ్యలు గన్గొని దుఃఖితాత్మ లై
సుదతులు సిగ్గుపెంపునను ♦ జూప తెలుంగక యుండ వాని న
ప్పదమునఁ బాప దాదులకుఁ ♦ బల్కుడు వారును బ్రోలిచెంగటన్
జదుకమునందు వైచి రొక ♦ చక్కన చిక్కనిచిమ్మచీఁకటిన్. 213

జర యనురాక్షసి సంధించినవిధము.

తే. ఆసమయమునందు జర యను ♦ నసుర యొకత, మాంసఖండప్రతీకాశ ♦ మనుజశకల
ములను గన్గొని భుజియించుబుద్ధి వానిఁ, గదిసి గ్రహియించె మిక్కిలి ♦ కౌతుకమున.

వ. వాని నొండొక్కచోటికి మోచికొని పోవ నెంచి వహనసౌకర్యార్థ మా రెండుఖండంబులను విధిబలప్రేరణంబునం గూర్చి పట్టి నట్టిసంయోగవిధానంబున. 215

ఉ.* వ్రయ్యలు రెండు నొక్కటఁగ ♦ వంటున నంటె కుమారమూర్తి యై
చయ్యన దిగ్గ్వజం బద్రువ ♦ సాగెకు ఘోరము గాఁగ నేడ్చె న
ప్డయ్యలి వాలకించి నృపు ♦ డంతిపురప్రజఁ గూడి తొట్రుపై
నయ్యెడ కేగ రక్కసియు ♦ నాతని మోయఁగ లేక నివ్వెఱన్. 216

ఉ. ధీరుఁడు వజ్రనాగమయ ♦ దేహుఁడు బాలుఁడు చంపి వీనినిం
గారణ సేయ రా దిచటఁ ♦ బాడిగ నుండెడిదాన నంచు మే
లాగసి మర్త్యరూపధర ♦ యై తరుణార్కుని మేఘులేఖ నా
వారక వాని మోచికొని ♦ వచ్చి నరేంద్రున కిచ్చి యి ట్లనున్. 217

క. నరవర వీఁడు భవత్సుతు, లిరువురకును బుట్టె దాదు ♦ లిట విడిచి చనం
బరికించి నాచేతం, బరరక్షితుఁ డయ్యెఁ గొనుము ♦ వరసుతు నితనిన్. 218

ఉ. నా విని నేలఱేఁడు తన ♦ నారులతోఁ గడుసంతసించు మన్
వావిరి నజ్జరం దఱిసి ♦ ప్రస్తుతి సేయుచు నిట్లు వల్కె నో
పావనగాత్రి నీ వెవ ర ♦ పారకృపారస మొప్పఁ బుత్త్రునిం
బ్రోవఁగ నై యొసంగితివి ♦ పోల్పఁగ దేవతవో వచింపుమా. 219

వ. అని ప్రార్థించినం బ్రసన్నవదన యై జర యి ట్లనియె. 220

* వంటు — అనుకూల్యము.

సీ. నరనాథ విను జరానామరాక్షసిని నేఁ, గామరూపిణి నయి గ్రాలుచుండుఁ
బూజింపఁబడుచు నీపురమునం దెప్పుడు, నొప్పుగా నివసించి యుండుదానఁ
బ్రతిగృహంబున బ్రహ్మరక్షస్సులను ద్రోలి, గృహదేవత యనంగఁ గీర్తి వడసి
కొడుకులతో నన్ను గోడపై వ్రాసిన, వారికి నభివృద్ధి వడి నొనర్తు
తే. నేను నీయింటిగోడపై నిలిచి ధూప, దీపనైవేద్యములఁ బూజఁ దృప్తి నొంది
యున్నదానను నీకు మే లెన్నుదానఁ, గాన నీసుతుఁ జేసి యీఁ గలిగె నేఁడు. 221
క. నీసుతశకలంబులు నా, చే సంధింపంగఁబడుచు శిశు వై తగె నా
చేసినది హేతుమాత్రము, నీసముదయభాగ్య మిట్లు నెగడుం జువ్వే. 222
తే. మేరుగిరి నొక్కతూకున ద్రింగఁ గలుగు, నాకు నీసుతు వస నెంత నీకు మెచ్చి
యిచ్చితిని వీఁడు జగమునఁ బెచ్చుపెఱుగు, నని పలుకుచు జర యదృశ్య యయ్యెనఁట.
వ. బృహద్రథుండును గొడుకు నెత్తుకొని వచ్చి గృహంబున జాతకునకుం జేయఁ గలకృ
త్యంబు లన్నియుం జేసి జరచే సంధింపం బడియెఁ గావున జరాసంధుం డని నామ
కరణంబు వ్రాసి తన దేశంబున నాజరాదేవతకు మహోత్సవంబు సేయుచుండుమన
ట్లాజ్ఞాపించి సుఖంబుండె నంత నక్కుమారుండును. 224
క. మాతాపితృపోషణసం, పాతమునన్ హుతహుతాశుపగిదిం జగద
ప్రీతికరుం డై భీకరుఁ, డై తనరెన్ నాఁడునాఁట నతిబలుఁ డగుచున్. 225

గిరివ్రజంబునకుఁ జండకౌశికుండు వచ్చుట.

వ. అంతఁ గొంతకాలంబున కొక్కనాఁడు చండకౌశికుండు గిరివ్రజంబునకు వచ్చిన
నెమ్మెచ్చి బృహద్రథుండు పుత్త్రమిత్త్రకళత్త్రామాత్యాదులతో నతని నెదుర్కొని
తోడితెచ్చి యర్ఘ్యపాద్యాదివిధుల నర్చించి మించినవేడ్కఁ దనసర్వస్వంబుతోఁ
గొడుకు నివేదించుటయు నతం డంతరంగంబున నెంతయు సంతసించుచు నతని
కి ట్లనియె. 226
క. నరవర తెలిసితి నంతయు, వరదివ్యజ్ఞానమహిమ వలనఁ గుమారో
త్తరుఁ డితఁ డెట్టిం డై యె, క్కరణిం దేజమున మించఁ గలఁడో వినుమా.
సీ. వరసంభవుం డగు వాఁ డీకుమారుండు, సార్వభౌముం డయి సౌరు మీఱు
వీనివిక్రమమున విమతభూపతు లెల్లఁ, గన నగ్ని మిడుతలగతి నశింతు
రిల వీఁడు ఘనులలో నెల్ల వెలుంగుల, వెలుఁగులయొకిమీని వలె వెలుంగు
దివ్యాస్త్రములు వీని దెస నదీరయములు, గిరిరాజమునబలెఁ గెరలి పోవు
తే. నదిజలంబు లపాన్నిధి నొదిగినట్లు
వీనివశవర్తు లై నృప వీరు లెల్లఁ

బడుచు రంతకాంతేశుఁ డుమా • వరుఁడు మెచ్చి
ఘనుఁ డయినవీని కొకట సా • క్షాత్కరించు. 228

వ. అని చెప్పి చండకౌశికుం డరిగిన బృహద్రథుండును గొంతకాలంబున సంబంధిబంధుజనసమక్షంబున నతిదక్షుం డగునాజరాసంధునకు సామ్రాజ్యపట్టాభిషేకంబు చేసి పత్నీద్వయసహితుండై తపోవనంబున కరిగె నంత వాఁడును.

ఆ. శివునిఁ గూర్చి తపము • చేసి యుగ్రంబుగా, వానివలన వరము • వడసి యెందు
మాఱు లేనిపగిది • మత్తిల్లి మెలఁగుచు, జగతి నెల్ల గెలిచి • జయము గాంచె.

ఉ. చెల్లఁగ శాసనం బఖిల • సీమలభూముల రాజ్య మేలుచున్
బ్రల్లదుఁ డై సమస్తజన • బాధకుఁ డై పరశస్త్రసంహతిన్
దెల్లనిహంసునిన్ డిభకు • నిన్ దనమంత్రులుగా గ్రహించి నే
నల్లునిఁ గంసునిం దునిమి • నందున నన్ బగవట్టి నెట్టనన్. 231

పంచచామరము. గిరివ్రజంబు నందు నుండి • క్రిందు మీఁదుఁ గాన కా
దురాత్ముఁ డొక్కనాఁడు త్రుళ్లి • దోర్బలంబునం గదన్
గరంబు ద్రిప్పి నూఱుయోజ • నంబులందు నున్నమా
పురంబుమీఁద వైచె నద్ది • భోగనం బడెం గడన్, 232

ఉ. గట్టిపరాక్రమంబు గల • కట్టిఁడి యయ్యును వాఁడు తేజపుం
గుట్టలువోని హంసడిభ • కుల్ గడతేఱినసేగిఁ జేసి యి
ప్పట్టున నెక్కడో యి తెగు • పక్షితెఱంగున నుండె నిట్టిచో
గిట్టఁగఁ జాలి నీతిఁ బరి • కింపుచు నుండి రుపేక్ష మాప్రజల్. 233

మ. అలబార్హద్రథు నస్త్రయుద్ధమున డా • యంజాల రెవ్వారు మున్
జెలిమిన్ శంకరుఁ డవ్వరంబు కరుణిం • చె న్వాని కట్లైన దో
ర్బలదర్పంబున భీముఁ డోర్చుఁ బ్రమటిమా • త్రన్ మల్లయుద్ధంబునన్
బలభిన్నందనురక్షణంబు బలము • న్నానీతియుం దోడ్పడన్. 234

చ. ముగురము నాత్ర మేగి బల • ముం దలపోయక ముట్టడించి య
మ్మగధపతి న్వధంతు మొక • మానిసి కొక్కఁడ చాలుఁ గానఁ బో
రొగి నగు భీముతోఁ దని • కోపు నితం డెడ నమ్మ దేని నా
దగునుడిఁ దేఱి నావశము • నం దిను మిల్లడ గాఁగఁ దమ్ములన్. 235

వ. అని కృష్ణనిశ్చయుం డయి పలికినపలుకు లాలకించి గుఱుకుచున్నతమ్ములం జూచి ధర్మతనయుండు తనమనంబున శంకించుటబు విడిచి భగవంతుం డగువాసుదేవునిదిక్కు మొగంబై వినయంబు దోఁప నిట్లనియె. 236

చ.*అతులితబాహువిక్రమవి • హారజితాహితలోక మేము నీ
క్రితులము నీవు మాప్రభువ • రేణ్యుఁడ వెన్నఁగ నీప్రసాద మే
యతగున కైన వానికి జ • యం బగు మాగధుఁ డీల్గె నింక మో
క్షితులు మహీక్షితుల్ క్రతువు • చేసి కృతార్థుఁడ వైతి నే నిలన్. 237

మ. నరనారాయణు లిట్లు కృష్ణు లగుచున్ • సల్లీలఁ బూర్వంబునన్
మరుదంశప్రభవుండు మాగధునితో • మార్కొంటకు న్వేఁగ డిం
పిరవొందున్ నిజ మైనఁ గార్యము ఘనం • బీ వ ప్రమత్తుండ వై
దురమందున్ జలమున్ బలంబు గలుగం • దోడ్తో ప్రవర్తింపుమా. 238

వ. అని వినయంబు దోఁపఁ బలికి రాజసూయంబు సేయం గృతనిశ్చయుం డై జరా
సంధ సంహారంబునకు శ్రీకృష్ణునితో భీమార్జునులం బంచుట కంగీకరించి మఱియు
ని ట్లనియె. 239

క. మిముఁ బాసి యేను మెయిఁ బ్రాణములం దాల్పంగ నోప • నలినాక్ష జయం
బమరం గయికొని సంతో,షమున నిటం బొదలునట్లు • చను దే వలయున్. 240

క. భగవంతుఁడు శ్రీకృష్ణుఁడు, దగిలి నిరంతరము మమ్ము • దయఁ గను చుండన్
దగుమాకు నెందు విజయం, బగుటకు నందియపడంగ • నవసర మగునే 241

వ. అని పలికి మీకుఁ గార్యసిద్ధి యగుం బోయిరం డని యంపిపుచ్చె నని చెప్పిన విని
నైమిశారణ్యవాసు లవ్వలివృత్తాంతంబు సెప్పు మని సూతు నడుగుటయును. 242

—•—•◆ ఆశ్వాసాంతము. ◆—•—•

మ. భువనక్షోణిసభోజలానిలములన్ • భూతంబులం జేసి యీ
భువనంబు ల్పదునాలుగు న్సలిపి సం • పూర్ణప్రభావంబునన్
సవిమర్శంబుగ నేలుచుట్టిదొగ నో • సర్వేశ సర్వజ్ఞ నే
నవినీతుండ నవజ్ఞ సైఁపఁ గదె ని • న్నర్థించి సేవించెదన్. 243

గద్యము.

ఇది శ్రీమదఘనాతనోభయకవిమిత్ర వేంకటయజ్వాగ్రపుత్త్ర
సమారాధితవిబుధరాజ శ్రీపాదకృష్ణమూర్తి కవిరాజ
ప్రణీతం బయిన శ్రీ కృష్ణభారతంబునందు
సభాపర్వంబునఁ బ్రథమాశ్వాసము.

శ్రీ. శ్రీ. శ్రీ.

---

* అతగుఁడు = దుర్బలుఁడు.

శ్రీ

శ్రీబాలాత్రిపురసుందర్యై నమః.

# శ్రీకృష్ణభారతము

## సభాపర్వము—ద్వితీయాశ్వాసము.

### జరాసంధవధపర్వము.



శ్రీకృష్ణవినుత నవభ
క్త్యాకలనైకాత్తచిత్త హరిహరముఖదే
వాకార హంస కరుణా
లోకావితలోకవార లోకాధారా. 1

**శ్రీకృష్ణభీమపార్థులు జరాసంధుఁ జంపఁ బోవుట.**

వ. అక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లనియె నట్లు ధర్మజుం డంపిపుచ్చిన శ్రీకృష్ణ భీమార్జునులు బ్రాహ్మణారాధనంబు గావించి కృతస్వస్త్యయను లై గిరివ్రజపురంబు నకుం బయనం బయి రంత. 2

తే. పయన మేగెడువార్ష్ణేయ పాండవేయు
లను గనుంగొని ధర్మనందనుఁడు వారి
ముఖవికాసము పోలించి ముదము నొంది
మాగధుం డీల్గెఁ గా యని మదిఁ దలంచె. 3

వ. అట్లు పయనం బై వారు ధర్మనందనునియాశీర్వచనంబు నొంది వీడ్కొని కురు భూము లతిక్రమించి కురుజాంగలంబునం బద్మసరోవరంబు గడచి కాలకూటశోణ గండకీసదానీరంబు లను నేఱులు దాఁటి సరయూనదిమీఁదుగాఁ బూర్వకోసలమిథిలా దేశంబులం దిరిగి మాలాచర్మణ్వతీగంగాదినదుల నుత్తరించి పూర్వాభిముఖు లై కుశచీరచ్ఛదు లై మగధదేశంబు సొచ్చి గోధనాకీర్ణంబును సంబుమంతంబును శుభ ద్రుమంబు నగు గోరథపర్వతం బధిరోహించి. 4

చ. కనిరి గిరివ్రజంబు సుమకాండసమంచితకామినీజన
ప్రణుతనిరంతరప్రథితబంధురలోధ్రవనావృతంబు కాం
చనశిఖరాగ్రభాగరుచిచర్చితరాజగృహాంచితంబు సం
జనితమృదంగవాద్యపరిశబ్దితదిగ్వలయంబు వారటన్. 5

వ. ఇట్లు కని దాని యుచ్చస్థితి కచ్చెరువడుచున్న భీమార్జునుల కచ్యుతుం డి ట్లనియె.

సీ.*ఇది గిరివ్రజపుర ♦ మిద్ద్యేనుగిరు లిటం, బెట్టనికోట లై ♦ పేరు దెచ్చె
నిట గౌతమర్షి తొ♦ల్లిట శూద్రియందుఁ గాం,క్షీవాదులం గని ♦ చెన్నుమీఱె
నంగవంగాదిరా♦జాన్వయభవులు గౌ,తమునాశ్రమంబునఁ ♦ దనరిరి మును
తత్సమీపమున లో♦ధ్రవనాళి స్వస్తిక,మణినాగముఖ్యులు♦మహిమఁ గనిరి

తే. ఋషులనదనుగ్రహమున గి♦రివ్రజమున,మాగధులు చాల ప్రబలు లై ♦మహితలమున
నేరి కవిజేయు లై పేర్మి ♦ నెసఁగుచుండి, రాజరాసంధుఁ డందఱ ♦ కధిపుఁ డయ్యె. 7

క. మనము దురాధర్షము పుర, మని తలఁకక సొచ్చి వాని ♦ నరసి నయమునన్
వినయంబు సూపి దర్పం,బునఁ దునిమి జగత్ప్రసిద్ధిఁ ♦ బొందఁగ వలయున్. 8

వ. అని చెప్పకొనుచు నయ్యన్నదమ్ములు చాతుర్వర్ణ్యసమాకులంబును మహోత్సవస మాగతజనాకీర్ణంబు నగుగిరివ్రజపురద్వారంబునుండి బార్హద్రథపూజ్యమానం బగు చైత్యకాంతరంబునకుం జని. 9

ఉ. కాదన కెల్లలోకములఁ ♦ గాఁచియవెట్టుచుఁ గ్రొవ్వి యున్నమాం
సాదవృషంబుఁ గూలిచి బృ♦హద్రథుఁ డాదృఢచర్మనిర్మితిన్
భేదము గానిభేరు లట ♦ నిల్పెను మున్నవి వింతవారు రా
మోఁదక మ్రోఁగు వానిఁ గని ♦ మూవురు మూఁటిని వ్రచ్చి రెచ్చగన్. 10

కృష్ణభీమార్జునులు గిరివ్రజంబు సొచ్చుట.

సీ. వారు బాహాబల♦ప్రస్థితు లై చైత్య,కుధరశృంగంబును ♦ గూలఁ ద్రోచి
యాద్వారమున లోని ♦ కరిగి తత్పౌరులఁ, బలుకుల బెదరించి ♦ పాఱఁ దోలి
నడివీధి నడచుచు ♦ నొడిసి మాలాకారు,వలన మాల్యంబులు ♦ వడసి తాల్చి
వరచందనాగురు♦పరిలిప్తకాయు లై, త్రేతాగ్నులకుఁ బోలి ♦ తేజరిల్లి

తే. గోష్ఠమున కేఁగుసింగంపుఁ♦గొదమలట్లు, కొలని కరుదెంచునేనుంగు♦గున్న లట్లు
కనఁ దలిర్చి జరాసంధుఁ ♦ గనఁగఁ గోరి, వాని నివసించునిలువాకి ♦ పట్టి చనిరి. 11

క. ద్విరదప్రఖ్యుల వృషభే,శ్వరసుస్కంధుల విశాల♦సాలోన్నతులన్
బురుషుల వ్యాఘ్రోరస్కుల, వరభుజులన్ గనిరి వారిఁ ♦ బ్రజ లబ్రముగన్. 12

తే. స్నాతకవ్రతులును బాహు♦శస్త్రులు నధి,కులును సింహసంహననులు ♦ లలితగమను
లైనవారలఁ గని వారి♦లోన వారు, పౌరు లెవ్వారొ వీ రని ♦ పలికి కొనిరి. 13

క. భయదములు దుర్నిమిత్తము, లయుతము లట మున్న తోఁప ♦ నాశాంతికి నై
నియమస్థుండును దీక్షితుఁ, డయి మాగధుఁ డుపవసించె ♦ నానమయమునన్. 14

* ఏనుగిరులు = వైహారము వృషభము వరాహము ఋషిగిరి చైత్యకము ననునవి.

చ. అటు చని వారుమువ్వురు జ♦నావళిఁ గూడినమూఁడుకక్ష్యలన్
దటుకున దాఁటి మాగధుని♦దండ గతవ్యథు లై మెలఁగుడున్
గుటిలత లేనిదృష్టిఁ గనుఁ♦గొంచు నతండును లేచి వారి క
ప్పటి కగునట్లు నర్ఘ్య లిడు♦వాఁ డయి స్వాగత మాఁడె వేడుకన్. 15

క. దానికిఁ బార్థుఁడు భీముఁడు, మానముఁ గొని యుండ హరి స♦మంజసబుద్ధిన్
దా ననియె వీరు నియమము, నూనిరి నడురేయిదాఁక ♦ నెల్లరు పలుకన్. 16

వ. అనిన నట్లె యని జరాసంధుండు బ్రాహ్మణవేషధారు లగువారి నల్లన యజ్ఞాగారంబున నుండఁ బుచ్చి తా నంతఃపురంబునకుం జనియె నంత నిశీథం బగుటయు. 17

తే. నడికిరే యైన స్నాతకుల్ ♦ పుడమివేల్పు
లేగుదెంచుట విని వారి ♦ కెదురు వోయి
తోడుకొని వచ్చి పూజించు♦దొడ్డవ్రతము
గలజరాసంధుఁ డప్పుడు ♦ కలవరపడి 18

వ. వా రున్నచోటికిం జని సేవించియు వారియపూర్వవేషంబులం గని విస్మితుం డై యున్నంతఁ దారు మువ్వురును స్వస్తి వలికి కుశలం బడిగిన నతండు వారి కి ట్లనియె. 19

ఉ. స్నాతకుఁ డైనవిప్రునకుఁ ♦ జందనచర్చయుఁ బుష్పదామముల్
భూతలమందుఁ జెల్ల వనఁ ♦ బోలునె మీకు విరాగవస్త్రముల్
జాతిని గప్పఁ బూనుటలు ♦ శస్త్రకిణాంకితబాహుదండముల్
చేతము విశ్వసించునటు ♦ చేయవె మీ రెవరయ్య చెప్పుఁడీ. 20

మ. వినియుంటి న్మఱి చైత్రకాద్రితటమున్ ♦ భేదించి నిస్సాణముల్
తునియల్ సేసి పథంబు గానిపథమం♦దు న్వచ్చి నిర్భీకు లై
నను నర్థించియు సర్వ్యాగం గొనక మా♦నం బంచు భాషింతు రే
పనికల్మిం జనుదెంచిరో యిటకు మీ♦ప్రారంభముం దెల్పుఁడీ. 21

వ. అనిన జనార్దనుం డి ట్లనియె. 22

మ. స్తుతవర్ణత్రితయంబునందు వెలుఁగొం♦దున్ స్నాతికిం బేము నా
వ్రతముం గొన్నద్విజప్రభూతులము పో♦ల్పం దద్విధానంబునన్
గతిభేదంబులు పెక్కు లిట్టిసిరిగలం♦కారాదులుం దద్విశే
షతటస్థంబులె కాని కావు విధిదు♦ష్టంబుల్ సికృష్టంబులున్. 23

క. వ్రతి యైనద్విజాతికి నం,చితవీర్యము భుజము నంద ♦ చెన్నలరారున్
సతతము నీ కావిధి గన, మతి యైనం దెలియు మిపుడ ♦ మాకడ నుండన్. 24

శా. ఆద్వారంబున రాక చెల్లదని మా ♦ కాగంబుగా నాడితీ
వద్వారంబున శత్రునిల్లు మఱి సు♦ద్వారంబున న్మిత్రునిల్
విద్వాంసుం డొరంగ ధర్మ మనుటల్ ♦ విద్వేషి పే విందు మా
కద్వంద్వం బగుకార్య మొండు కలిమిన్ ♦ హర్షింప మీయర్చనల్. 25

వ. అని పలికిన జరాసంధుండు నివ్వెఱపడి. 26

ఉ.*అక్కట మీకు నేను గల ♦ నైన విరోధ మెదం దలంప మీ
ముక్కును మోము నే నెఱుఁగ ♦ ము న్నొకనాఁటికి న్నెల్లు దాయనో
చక్కనిరాజధర్మమున ♦ సాగెడువాఁడ ననాగసుండ మీ
రిక్కరణి న్వచించుటకు ♦ హేతువు లే దిది మీప్రమాదమే. 27

వ. అనుటయు శ్రీకృష్ణుండు. 28

శ్రీకృష్ణుండు జరాసంధునకుఁ దమ్మెఱింగించుట.

మ. కులకార్యంబు కులోద్వహుం డొకమహా♦క్షోణీశ్వరుం డూనె నా
బలభిత్తుల్యునిసన్నియోగమున నీ♦పాల న్విజృంభింప మే
మెలమి న్వచ్చితి మీ వనాగసుఁడవే ♦ యే లయ్య భూపాలురన్
బలిమిం బట్టితి బందెఁ బెట్టితి వధిం♦పం గట్టితే మందుఁ బో. 29

క. రాజైనవాఁడు రాజుల, నాజి వధించెడును విజయ♦మందెడుఁ గాకీ
యోజం బశువులుగాఁ గొని, తేజమునను రుద్రబలులఁ♦ద్రెంపం జనునే. 30

ఆ. వృజిన మనక కష్ట♦హృదయులై సాధుస, జ్జనుల కెగ్గు సేయ ♦ సాహసించి
హింస సేయుకుడను ♦ నెల్లలోకములను, నహితు లంతకన్న ♦ నహిత మున్నె. 31

ఉ. నీకుబలెన్ సవర్ణుల గ♦ణింపక భూతిబలిం బొనర్చుదు
ర్లోకుని గ్రిందు మీఁదయిన♦లోకములం దెటనేని విందుమే
మా కిది వైరహేతు వను♦మాట ధ్రువంబు బలాఢ్యు లుత్తమ
శ్లోకులు ధర్మచారు లిటు ♦ చూచి సహింతురె పాపకృత్యమున్. 32

క. ఎపు డెపు డేయేకర్మము, లపగతధర్మముగఁ జేయ ♦ నగు నెవ్వఁడు వాఁ
డపు డపు డాయాకర్మము, లపరిష్కృతిఫలము లందు ♦ లక్షింప నిలన్. 33

సీ. ధర్మానుసారుల ♦ మగుమేము ధర్మర,క్షకు వచ్చితిమి నిన్నుఁ ♦ జంప నిటకు
జగతి నాపురుషైన♦క్షత్రియుం డెవఁడు లేఁ,డనుకొనుసీగర్వ ♦ మడఁగు నిపుడు
రణయజ్ఞదీక్షితుల్ ♦ రణరంగమున వైరి, నణఁచి స్వర్గసుఖంబు ♦ లందఁ గలరు
పురుహూతుఁ డిట్లని ♦ సురవైరులం దున్మి, ముల్లోకముల నేల ♦ ముఖ్యుఁ డయ్యె

* అనాగసుఁడు = అనపరాధుఁడు.

తే. మానగర్వంబునన్ సహామాత్యపుత్ర
బలుఁడవై పోకు మంతకనిలయమునకు
మును బృహద్రథముఖులు మాపూర్వులెల్ల
నితరులం దూఱి చెఱటలో నెత్తిగొనుము. 34

ఉ. ఓపిక నెవ్వరే మనిన నోయన కుండెడునట్టినిక్కపుం
బాప లటంచు మమ్మెడఁద భావనసేయుచు నుందు వేమొకో
దాఁపఁగ నేల నే హరి నితండు నితండును బాండునందనుల్
నీపని పట్టవచ్చితిమి నిక్కము చెప్పితి విశ్వసింపుమీ. 35

చ. పొలియక నానుడు ల్వినుము పోటరు లీముగు రెల్లరాజులన్
బాలుపుగ వేఁడుచు న్విడిచి పుచ్చుము నీ కిది బుద్ధి కాదయేన్
జలము బలంబును న్మెఱయ సంగరముం బొనరింప లెమ్ము వే
వలసలు దీసి సంయమనివాకిలిఁ గాయఁగఁ బొమ్ము సమ్మతిన్. 36

చ. అనవుడుఁ దోఁకఁ ద్రొక్కిన మహాభుజగేంద్రమునోజ రోఁజుచున్
గనలి బృహద్రథాత్మజుఁడు కన్నుల నిప్పులు రాల నాతనిన్
గనుఁగొని పల్కె నీపలుకునన్ విదితం బగు నంతయున్ జనా
ర్దన భుజవిక్రమంబు గలరాజు లరాతులఁ బట్టఁ బోలదే. 37

ఉ. క్షత్రియుఁ డైనవాఁడు తనశౌర్యము ధైర్యము వీర్య మేర్పడన్
శాత్రవులం జయించు టది సన్నుతధర్మము కాన నెల్లను
క్షత్రియులం గ్రసించి విలసద్వ్రతము న్నెఱవేర్చుచుంటి నీ
మాత్రపుమీకు నే జడిసి మాయురె వీడుదునే నరేంద్రులన్. 38

ఆ. తగరు కొండఁ దాఁక దఱిసిన ట్లీ విష్కిరములఁ బోవువీరిఁ గలసి మెలసి
వెడఁగ వగుచు నన్ను బెదరింప వచ్చితే, నిన్ను నీబలంబు నే నెఱుఁగనె. 39

మ. మును నీవారును నీవు నాకడిమికిన్ ముయ్యేడుమార్లోడి జీ
వనముం దక్కఁగఁ గొంచుఁ బాఱుట లెదం భావింపవో యట్టినీ
వ నను బిల్లను గ్రుడ్డుగోలె బెదరింపం జొచ్చితో శౌర మీ
ఘనతేజం బెది చూపు డిప్డె మిము నాఖడ్గంబుపాల్సేసెదన్. 40

తే. సేసలం గూడి సేనతో సేన గాని, మొనసి యిద్దఱితోఁ గాని ముగురతోడఁ
గాని వడి నొక్కొకనితోడఁ గాని పూని, కలసఁ బోరి జయింప నేఁ గడఁగినాఁడ.

వ. ఇందు మీ కిష్టం బెద్ది చెప్పుఁ డని గర్వించి పలికిన విని మందహాససుందరవదనార
విందుం డై గోవిందుండు. 42

ఉ. ఇమ్మహి నెందు శౌర్యనిధు । లిద్దఱు ముగ్గురుఁ గూడి యొక్కనిన్
గ్రమ్మఁట పాడి గా దొకనిఁ । గోరుము మాముగురందు మల్లయు
ద్ధమ్మున నోర్చి నిన్నతఁడు । తప్పదు నావుడు వాఁడు నాకు వీ
ర్యమ్మున నింత కైన నగు।నట్టిఁడు భీముఁడ తాఁకు దెంచుతన్. 43

వ. అని విజృంభించి మాగధుండు మరుత్నందనునితో మల్లయుద్ధం బొనర్ప నెంచి తన కొడుకు సహదేవునకు రాజ్యంబునం దభిషేకింప నాజ్ఞాపించి పురోహితకృతస్వస్త్యయనుం డై. 44

—— భీమసేనజరాసంధులమల్లయుద్ధము. ——

చ. కనకకిరీటమున్ విడిచి । క్రాలునెఱు ల్ముడి వెట్టి మేలిమిం
గనఁ దగువస్త్రము న్వెలిచి।కట్టి దృఢంబుగ మేన రక్తచం
దనమును రోచనం బలఁది । తాలిచి పూవులదండ లెంతయు
న్ననలుచు సింహగర్జన మొ।నర్చె వడిన్ భుజ మప్పళించుచున్. 45

ఉ. భీమపరాక్రముం డయిన।భీమునిఁ బిల్చుచు హుంకరించుచున్
భూమితలంబు దద్దఱిల । బొబ్బలువెట్టుచు బిట్టు మొట్టుచున్
సామజవైరిఁ జేరుకొను।సామజమట్టులు చేరి వచ్చినన్
భీముఁడు వాని కక్కజము । పేర్చెనుమచ్చున హెచ్చి క్రచ్చఱన్. 46

వ. కృష్ణకృతస్వస్త్యయనుం డయి ప్రతిఘటించి మల్లచఱచి నిలిచె నంత. 47

మ. బలదర్పాతిశయప్రకాశవిలస।త్ప్రౌఢోత్కటాంగుల్ సము
జ్జ్వలతేజోలలితుల్ వృకోదరజరా।సంధుల్ ప్రతాపాంధు లై
తొలుతం జేయియుఁ జేయియుం గలపి తో।త్తో నొండొరుల్ డాకె కే
వలబాహాయుధబోధ్ధ్యు లై పెనఁగి రా।ర్వం దిక్కు లొక్కుమ్మడిన్. 48

చ. ఒడలు విదర్చి మూఁపులు మ।హోగ్రగతిం జళిపించి బీర మే
ర్పడ భుజ మప్పళించి తొడ।పట్టుఁ దట్టి కరంబు పేరెముల్
నడచి కడంక నొండొరులు । నాగగతి న్వెస ఱొమ్ము ఱొమ్మునం
బడఁ దగిలించి మించి పెడఁ।బాయుచు డాయుచుఁ బోరి రిర్వురున్. 49

సీ. చిత్రహస్తాదులు । చేసి కక్షాబంధ,మొనరించి యెంతయు । మొనసి మొనసి
విస్ఫులింగంబులు । వెడలంగ గళగండ,హతి సశనిభ్రమ । నతికె యతికి
బాహుపాశాదులు । పచరించి పాదాహ,తశిరస్కు లై నగఁ । దగిలి తగిలి
కటికంఠములు వట్టి । కదలించి పటుముష్టి,తలముల బార్శ్వముల్ । తట్టి తట్టి

ఆ. పొడిచి కొట్టి విసరి • పడవైచి మర్దించి, మదగజంబులట్లు • పొదలి మెదలి
కదనరంగమందుఁ • గన్పట్టి రాజెట్టి, మల్లు లొక్కఁ డొకని • మలఁగి కొనుచు. 50

శా. వాయుప్రోద్భవుఁడున్ బృహద్రథజుఁడున్ • బ్రఖ్యాతరోషంబునన్
వ్యాయామాతిదృఢప్రఘూణనిభ బా•హాఘాతపాతంబులన్
గాయాకర్షణసంప్రకర్షణములన్ • గావించుఘోరారవం
బాయుర్వీస్థలి నిండి భీమ మయి బ్ర•హ్మాండంబు భేదించెఁ బో. 51

క. రణకర్కశు లగువారల, రణరంగమునందుఁ బొడము•రజ మప్పుడు ధా
రుణి యెల్లఁ గప్పి యుప్పర, మణుమాత్రము దోఁప నీని•య ట్లై విరిసెన్. 52

క. వారలఘోరసమీకం, బారయఁగ గిరివ్రజంబు•నందలివారల్
చేరిరి వేలకువే లట, నారులు పురుషులును నాక • నాలుగుజాతుల్. 53

ఉ. దారుణశబ్దపాతమున • ధాత్రీధరంబులు నుగ్గునూచ మై
ధారుణిఁ గూలునో యనువి•ధంబునఁ జూపఱు తల్లడిల్ల వృ
త్రారియు వృత్రుఁడుం దొడరి•నప్పుడు ఫ్రాలె భయంకరంబుగా
వారలసాంపరాయిక మ•పారము ఘోరము నయ్యె నయ్యెడన్. 54

శా. హాహా పుట్టఁగ నిట్లు కార్తికమా•సారంభముం దొట్టి ని
ద్రాహారంబులు నాక సంతతముగా • నయ్యుద్ధముం గ్రుద్ధు లై
బాహాబాహిఁ జతుర్దశాహములు చే•వం బోరి రానాఁటి రే
మోహక్లాంతుని మాగధుం దెలిపి భీ•ముం జీరి కృష్ణుం డనున్. 55

చ. అలసె నరాతి వీనిఁ దెగ•టార్చుట కింత ప్రయత్న మేల నా
ఘుఁ సనె నిట్టిని కలఁతు•లు న్మ్రాఁ నిల్చెడువార లట్టె నీ
చలము బలంబు నేర్పడ భు•జంబులఁ బట్టి పెనంగి వీనినిం
బెలుచనఁ జంపి మాకు నెల•మిం గలిగింపు ప్రభంజనాత్మజా. 56

వ. అనిన విని వృకోదరుం డాజరాసంధుస్థితి నెఱింగి యజితుండ యని తలంచుచుం
గృష్ణున కిట్లనియె. 57

క.*ఆఁకలి డప్పియు నెఱుఁగక, తేఁకువ చెడ కింత యేని • తెరలక బలిమిన్
జేకొని పోరుచు నైనన్, నా కనురోధింప రాక • ననుచు నరి హరీ. 58

వ. అనిన నతనిం బురికొల్పువాఁ డై కృష్ణుండు వెండియు. 59

---

* ననుచు = అతిశయించు.

### భీముండు జరాసంధుం జంపుట.

చ. త్వరపడు మీఁదనిం దునిమి వైవఁగ నీప్రవిదారణంబునన్
దిర మగు నీదుసత్త్వమును నీజనకుం డగుగాలిసత్త్వమున్
బరఁగ నెఱుంగఁ జేయు మనఁ బావని వానిని బట్టి యెత్తి పై
దిరదిర నూఱువారములు త్రిప్పి ధరం బడఁ గొట్టె బెట్టుగన్. 60

ఆ. పడిన వానిపృష్ఠభాగంబు మోఁకాళ్లఁ, బొడిచి పొడిచి నలిపి ముద్దఁ జేసి
విసరి వైచి యార్చెఁ బృథివీతలం బెల్ల, నద్రువ విఱిగి పడఁగ నద్రు లెల్ల. 61

తే. భీమునార్పు జరాసంధభీమపాత,శబ్ద మొక్కఁడు గాఁ గూడి జగతిఁ బర్వఁ
గొండ గూలెనొకో యని కుయ్యి వెట్టి, పుడమి నం దున్నవారలు భయముకొలఁది.

వ. అట్లు చంపి వృకోదరుండు మాగధునికళేబరంబు రాజకులద్వారంబుకడం బడవైచి
కృష్ణార్జునసహితుండై గిరివ్రజపురం బెల్లెడం గలయం గ్రుమ్మరియె నంతఁ బ్రభాతం
బగుటయుఁ గృష్ణుండును. 63

తరువోజ. చెఱసాలలం బడి చెఱ లందురాజసింహుల విడిపించి చెలిమియు నించి
వెఱచఱచినవారి వెఱపు వోఁ దంచి వివిధసపర్యల వేడుకం గాంచి
నెఱి మీఱుమాగధు నిచిరత్నరత్ననిర్మిత మగు తేరు నెమ్మిఁ దేఁ బంచి
వఱలుసారథ్యంబు వడయ లోఁ దలఁప వచ్చినగరుడుని వడి నిల్పె నాఁగల. 64

వ. భీమార్జునసమేతుండై తద్దివ్యరథారోహణంబు చేసి కదలి. 65

క. మున్నిరథమును దానవుఁ, డన్నరభోజనునిఁ గూల్చునపుడును జిష్ణుం
డెన్ని యధిష్ఠించి జయా,భ్యున్నతిఁ దనరారె జగము లోహో యనఁగన్. 66

వ. అట్టిదీని నయ్యింద్రుండు వసు వనుచేదిరాజున కిచ్చె నతనివలన బృహద్రథుండు వడసె
నని తద్దివ్యప్రభావం బగ్గించుచు నడచి పురోపకంఠంబున సమప్రదేశంబున విశ్ర
మించుటయును. 67

చ. పురమునఁ గల్గువారలును మోక్షితులై నమహీక్షితుల్ మహో
త్తరవిభవాభిరాముఁ డగు దైత్యనిషూదను సత్కరింప స
త్వరముగ వచ్చి మ్రొక్కి లిడ వారల నెంతయు నాదరించె నా
హరి కరుణాకటాక్షముల సంతసపైఁ బ్రసరింపఁ జేయుచున్. 68

శా. కారాగారవిముక్తులై నధరణీకాంతుల్ రమాకాంతునిన్
జారుప్రక్రియలన్ భజింపుచు జరాసంధప్రబంధంబులన్
బారీణత్వము నొందఁ జేసి మముఁ గావం జాలి తీపాంశుపు
త్త్రారంభం బది కారణంబుగ మహాత్మా! దేవకీనందనా. 69

వ. అని ప్రశంసించుచున్నసమయంబున. 70

ఉ.* ప్రెగ్గడలుం బ్రధానులుఁ బు◆రిం గలయెల్లరు నేగుదేఱఁ గా
దిగ్గనఁ జేర వచ్చి సహ◆దేవుఁడు మ్రొక్కిన వాసుదేవుఁడున్
బిగ్గఁ గవుంగిలించుకొని ◆ ప్రీతి నరాతికి నైన వానిలోఁ
దగ్గనిభీతి వాపి తన◆దండ వసింపఁగఁ జేసి వాసిమై. 71

తే. అతఁడు తెచ్చినకానుక ◆ లంది పార్థ,సహితుఁ డాకృష్ణభగవానుఁ ◆ డహితుఁ డనక
వాని కభయ మొసంగి కృ◆పాళుఁ డగుచు,మగధరాజ్యాభిషేకంబుఁ ◆ దగ నొనర్చె.

వ. అంత సహదేవాధిష్ఠితం బగురాజమండలిం దిలకించి కృష్ణుండు వెండియు. 73

చ. కురువృషభుండు ధర్మజుఁ డ◆కుంఠితతేజుఁడు రాజసూయమున్
వరమతిఁ జేయు మీ రటకు ◆ వచ్చి తదధ్వరవైభవాదికం
బరసి చనంగ నౌ ననిన ◆ నౌ నని భక్తిపురస్సరంబుగా
నరవరు లిష్టతం బలికి◆న న్వాని మెచ్చుచు వీడుకొల్పుచున్. 74

క. వీడుకొని బంధమోక్షితు, లాడం గలబంధుమిత్రు ◆ లందఱుఁ దన్నుం
గూడఁగ నింద్రప్రస్థము, వేడుకఁ జనె శౌరి భీమ◆విజయయుతుం డై. 75

వ. అంత నయ్యింద్రప్రస్థంబున. 76

ఉ. నాగరు లెల్లరున్ శమన◆నందనుతో నెదు రేగి మూఁగి లో
నాఁగనిసంతసంబున బృ◆హద్రథపుత్రుని లోకశత్రునిన్
వీఁగక చంపె భీముఁ డని ◆ వేయివిధంబుల విన్నవించుచున్
జాఁగిలి మ్రొక్కి ప్రస్తుతు లొ◆నర్చిరి భీమునిఁ గృష్ణపార్థులన్. 77

మ.† నరనారాయణ భీమసేను లపు డిం◆ద్రప్రఖ్యు ధర్మాఖ్యు భ
క్తిరతి న్మ్రొక్కిన నాతఁ డందఱుఁ బ్రియో◆క్తిం దేర్చి లాలించుచున్
బరిరంభం బొనరించె నంత హరి దే◆వా భీముఁ డమ్మాగధుం
బరిమార్చెం గడతేర్చె రాజులచెఱల్ ◆ బాహాబలప్రౌఢిమన్. 78

వ. అని మఱియును. 79

ఉ. నమ్మవు నానుడుల్ మును మ◆నంబున నెంతకుఁ గాని యుల్లడం
బి మ్మని వేఁడి తోడుకొని ◆ యేగితిఁ బుణ్యము మంచి దయ్యె నీ
తమ్ములు వీరె వెండియును ◆ దైవబలం బది యుంటఁ జేసి సౌ
ఖ్యమ్మున వచ్చి రిచ్చటికిఁ ◆ గాంచుము చెక్కు చెమర్ప దిర్వరన్. 80

---

* సహదేవుఁడు = జరాసంధునికొడుకు. † ప్రఖ్యుఁడు = తుల్యుఁడు.

క. నావుడు ధర్మజుఁడు మహా,భావా నీకృపకు మేము పాత్రుల మగుటన్
మావలన నెట్టులైనన్, భావిదితఫలంబు లెల్లఁ బొసఁగుట కరుదే. 81

వ. అని సంభావించి ధర్మతనయుండు తమ్ములం గూడి జరాసంధబంధవిముక్తులై తన్నరయ వచ్చినరాజలోకంబు నెల్ల సత్కరించి యంపిపుచ్చుటయు వారును బ్రహృష్టచేతస్కులై యుధిష్ఠిరాదులయనుజ్ఞ వడసి తమతమదేశంబులకుం జని రంత వాసుదేవుండును ధౌమ్యాదుల నామంత్రణంబు చేసి పాండవుల వీడ్కొని గిరివ్రజంబునుండి తెచ్చినదివ్యరథం బెక్కి మనోవేగంబున ద్వారవతీపురంబునకు నిర్గమించె నంత సంతోషంబునఁ బ్రజాపాలనతత్పరుండును సంవర్ధితయశుండు నైన యుష్నధర్మరాజుం జూచి తమ్ము లి ట్లనిరి. 82

దిగ్విజయపర్వము.

మ. మన కస్త్రంబులు శస్త్రముల్ బల మసామాన్యప్రభావంబునున్
ఘనతేజంబును గల్గి యుండె జగ మెన్నన్ రాజసూయంబు సే
యను రారాజుల నెల్ల గెల్చి కర మొయ్యారంబునం దేర నీ
యనుజన్ముల్ తెలియన్ సమర్థు లని నిస్నర్థించుచున్నా రెదన్. 83

మ. అనుచుం దిగ్విజయంబు సేయఁ జనువారై కోరినన్ ధర్మనం
దనుఁడుం దమ్ములఁ బుచ్చె దిక్కుల కంతన్ ఫాల్గునుం డుత్తరం
బును వాతప్రభవుండు తూర్పు సహదేవుం డంతకాశాంతరం
బును చేర్మి న్నకులుండు పశ్చిమము నేవుం జూపఁ బోనై రొగిన్. 84

అర్జునుం డుత్తరదిగ్విజయంబు సేయుట.

వ. అందు ముందు విజయునిదిగ్విజయప్రకారంబు చెప్పెద నట్లు తం డన్నచే ననుజ్ఞాతుండై యొక్కసుముహూర్తంబున స్వస్తిపుణ్యాహవాచనపురస్సరంబుగా మహాసేనం గూర్చుకొని పయనం బై. 85

చ. తెలియఁగ నగ్నిదత్త మగు దివ్యరథంబును గాండివంబు ను
జ్జ్వలవివిధాస్త్రశస్త్రములు పర్వఁగ నుత్తరదిఙ్ముఖంబుగా
వెలలి ధనంజయుండు భుజవిక్రమ మేర్పడఁగం గుళిందభూ
ములు చని తన్మహీపతుల మున్ స్వవశంబున నిల్పఁ జేయుచున్. 86

ఆ. అంతఁ గాలకూటు లానర్తులును బోర, వారి నోర్చి ప్రబలవాహినీస
మేతుఁ డగుచు నెదురు భూతలేంద్రు సుమండ,లుని జయించి కప్పమును గ్రహించి.

సీ. శాకలద్వీపంబుఁ జని ప్రతివింధ్యుఁ డన్,పార్థివు నిర్జించి భండనమున
నోడిచి సప్తద్వీపనృపతుల నెల్లఁ గ,రము లంది ప్రాగ్జ్యోతిషమున కరిగి

విడిసినప్పుడు రాజ♦వృషభుండు భగదత్తుఁ, డనువాఁడు విజయున ♦ కలిగి కలఁగి
వరసాగరానూప♦వాసకిరాతచీ,నాదియోధులతోడ ♦ ననికి మొనసి
తే. పిఱుతివియ కొడ్డి రోషంబు ♦ పెచ్చుపెఱుఁగ, నెనిమిదిదినంబు లింద్రనం♦దనుని తోడ
నాల మొనరించి యెంతయు♦నలసి సొలసి,చిఱునగవు దోఁప నరున క♦ట్లెఱుఁగననియె.
మ. బలభిన్నందన నీపరాక్రమము సం♦భావ్యంబు భవ్యంబు నీ
కెలనం బోర నెదిర్చి నిల్చుటకు నా♦కే కాక లోకాళికిం
దలమే నేను మహేంద్రమిత్త్రుఁడను మి♦త్త్రత్వంబు నీం గోరితిం
జెలిమిం జెప్పుము నీ కభీష్ట మెదియో ♦ చేయంగ నేఁ బూనితిన్. 89
ఉ. నావుడు నర్జునుం డనియె ♦ నాపితృమిత్త్రుఁడ వీవు మైత్త్రికిం
దా వగు దాశరూద్వహుఁ డు♦దారుఁడు ధీరుఁడు రాజసూయయా
గావభృథంబు సేయుటకు ♦ నయ్యెఁ దదీయమహేశ్వరత్వముం
దీ వెద సమ్మతించితివ♦యేని నరి వెట్టుము రమ్ము కొల్వఁగన్. 90
తే. అనిన భగదత్తుఁ డేను మీ ♦ కాత్మసఖుఁడ, నీవు చెప్పినచొప్పున ♦ నెగడఁ జేయు
వాఁడఁ గాని మఱొం డేమి♦ వలయు ననుచు,నంతయును దీన నయ్యెడు♦ననియె నతఁడు.
వ. *అని ధనంజయుం డతనితో సఖ్యంబు వాటించి మఱియు నుత్తరంబు వట్టి పోయి యంతర్గిరిబహిర్గిర్యుపగిరులు లోనగుగిరివరంబులం గలరాజులం గెలిచి వారిచేఁ బన్ను గట్టించుకొని వారిం గూడి చని యులూకదేశాధీశ్వరుం డగుబృహంతునితో ఘోరయుద్ధంబు చేసి గెలిచి వారివలన ధనకనకవస్తువాహనాదులం గొని యుత్తరోలూకంబుల మోదాపురవామదేవసుదామసుసంకులాదిదేశంబులవారిం జయించి దేవప్రస్థ
బునకుం జని. 92
సీ. అచట సేనాబిందుఁ ♦ డనువాని నోడించి, విష్వగశ్వునితేజు ♦ వెడల నడఁచి
పార్వతీయుల గర్వ♦భంగంబు గా నొంచి, రణకర్కశులను పౌ♦రవుల గెలిచి
నగవాసదస్యుగ♦ణముల నేడిటిఁ దోలి, బర్బరాదుల వశం♦వదులఁ జేసి
కాశ్మీరముల కేగి ♦ కలన వీరుల నోర్చి, శతమండలముల లో♦హితునిఁ గూల్చి
తే. కొని త్రిగర్తుల దార్వులఁ ♦ గోకనదుల, దరదకాంభోజలోహాశ♦బరపుళింద
పౌండ్రమాళవగాంధార♦పతుల గెలిచి, ప్రబలధన మంది ప్రాగుత్త♦రంబు వట్టి. 93
వ. చని యట నున్నఋషికులతో మహాయుద్ధంబు చేసి వారివలన శుకోదరసమంబు లగు నెనిమిదియుత్తమాశ్వంబులును మయూరసదృశంబు లగు ననేకాజానేయాశ్వంబులును గరంబు గాఁ బడసి యభిసారిపురంబున నురగావాసిని రోచమానునిం దునిమి

* బృహంతునకు బృహద్బలుఁ డని నన్నయభారతములో నున్నది.

సింహపురంబునఁ జిత్రాయుధసురక్షితంబు లగుసేనలం దోలి సుహ్మసుమాలులం దూలించి బాహ్లీకుల నేలి వనేచరు లగుదస్యులం జయించి హిమవంతంబును శ్వేత పర్వతంబును దాఁటి ద్రుమపుత్రరక్షితం బగుకింపురుషదేశంబును గుహ్యకరక్షితం బగుహాటకదేశంబును జయించి ఋషికుల్యలం జూచుచు మానససరోవరంబునకుం జని గంధర్వరక్షితంబు లగుసంచటిదేశంబులం గెలిచి వారివలన నపరిమితధనంబులును దిత్తిరికల్మాషమండూకాఖ్యహయోత్తమంబులం గరంబు గాఁ బడసి హరివర్షంబున కరిగె నట మహాకాయులును మహావీర్యసంపన్నులు లగుద్వారపాలురు ప్రహృష్టమనస్కులై సవ్యసాచిం జూచి. 94

చ. నరుల కిటం బ్రవేశము నొనర్పఁగ లే దధికార మో సురే
శ్వరసుత నీసమర్థిత పరిశ్రమునకు నెక్క జయించితో నిటన్
దొరక దొకింత నీ కెది మనోరథమో వచియింపు మిత్తు ము
త్తరకురుభూము లివ్వి ప్రవిదారణ మిం దగు టొప్ప దారయన్. 95

ఉ. నావుడు నర్జునుండు చిఱునవ్వున వారలఁ జూచి యిట్లనున్
దేవతలార మర్త్యులకు దేశము గా దనినం జొరంగఁ బో
నావసుధేశ్వరుండు భరతాన్వయుఁ డధ్వర మాచరించు సం
భావన చేసి మీరు కరపణ్య మొసంగుఁడు కొంత దానికిన్. 96

ఆ. అనిన వారు పరమహర్షంబునం బొంది, దివ్యవస్తువితతిఁ దెచ్చి యిచ్చి
రర్జునుండు వాని నన్నిటిఁ గైకొని, సంతసించె మిగుల స్వాంతమందు. 97

వ. ఇట్లర్జునుం డుత్తరదిగ్విజయంబు చేసి ధనకనకవస్తువాహాదుల నెల్ల సంగ్రహించుకొని మగిడి చతురంగబలసమేతుం డై యింద్రప్రస్థపురంబునకు వచ్చి తన తెచ్చిన వన్నియు నివేదించె నంత భీమసేనుండును. 98

భీమసేనుండు పూర్వదిగ్విజయంబు చేయుట.

మ. చతురంగధ్వజినీసమేతుఁ డయి పాంచాలంబులం జేరి త
త్పతిచేఁ బూజితుఁ డై విదేహపురముం బాలించునాగండక
క్షితిపాలాదుల గ్రేల్మిడిం గెలిచి సత్కీర్తిం దశార్ణంబులం
బతి యై మించుసుధర్మునిం గలన నోర్వం జాలి గర్వంబునన్. 99

వ. సుధర్మునిపరాక్రమంబునకు మెచ్చి వానిం దనసేనాపతిఁగా నిలుపుకొని చని యశ్వమేధేశ్వరుం డగురోచమానుం డనువాని సాంత్వనంబు గా నిర్జించి కించి ద్దక్షిణంబునం దగుపుళిందనగరంబున సుకుమారునిసుమిత్రుల వశంవదులఁగాఁ జేసికొని చేదివిషయంబునకుం జనుటయును. 100

చ. కురుపతిరాజసూయమునకు న్నరనాథుల గెల్చి వారిచేఁ
గరము గ్రహింప భీముఁ డధికధ్వజినీసహితుండు వచ్చె దు
ర్భరము తదీయతేజ మని భక్తి భజింపఁ బురాంతికోర్వికిన్
ద్వర శిశుపాలుఁ డన్నగరపాలుఁడు వచ్చె నయంబు హెచ్చఁగన్. 101

వ. ఇట్లు వచ్చినవానివలన సత్కృతుం డై పురంబున కరిగి వృకోదరుం డందు ముప్పది దినంబు లుండి పయనం బై కదలి. 102

సీ. చని కుమారం బను జనపదంబున శ్రేణిమంతుని నిర్జించి మహిమ మించి
కోసలాధిపుఁ డై విలాసవంతుం డైన, వాని బృహద్బలుఁ బూని గెలిచి
సాకేతమున దీర్ఘయజ్ఞభూపాలుని, భుజవిక్రమంబునఁ బొడిచి గెలిచి
కాశిరా జై యశోరాశి యైనసుబాహు, బాహాబలంబునఁ బాఱఁ ద్రోలి
తే. ఘనుని మల్లేశు గోపాలకక్షు నోర్చి, రాజపతిని సుపార్శ్వుని నాజి నోర్చి
మత్స్యమలదాధిపతులను మహిమ నోర్చి, విక్రమైకవిహారంబు వేడ్క సలిపె. 103

వ. మఱియు హిమవత్పార్శ్వంబున జలోద్భవంబును భట్లాటంబును శుక్తిమంతంబును మదధారంబును జయించి సోమధేయులం గెలిచి కించిదుత్తరాభిముఖుం డై పశువత్సారిభూములం బరాక్రమించి భర్గాధిపనిషధాధిపతుల నోడించి మణిమత్ప్రముఖు లగునిఖిలభూపతులం దోలి భోగవత్పర్వతంబునందలి దక్షిణమల్లుల నొల్లఁబో నేసి శర్మకవర్మకాదుల సామంబున సాధించి విదేహాధినాథుం డగుజనకజగతీపతిమైత్రి వడసి యింద్రపర్వతసమీపంబునందలి శకబర్బరాదులతోడం గూడఁ గిరాతేశ్వరుల నేడ్వుర నుక్కడంచి యంత సుహ్మప్రసుహ్మదండదండధారాదులం గెలిచి వారితో గిరివ్రజంబున కరిగి సహదేవసహితుం డయి చని కర్ణ వత్స చంద్రసేన సముద్రసేనాదివీరులం బోర జయించి పౌండ్రకవాసుదేవునిసఖ్యంబు వడసి కౌశికీకచ్ఛనిలయుం డగుమహౌజసు నితో ఘోరరణమ్ము చేసి విజయంబు వడసి వంగరాజుం భంగించి కర్వటాధిపతామ్రలిప్తులగర్వం బుడిపి సాగరానూపవాసు లగునెల్లమ్లేచ్ఛరాజగణంబుల రణంబునం గూల్చి మఱియుం గలదేశంబుల నిట్లు పరాక్రమించి దిగ్విజయంబు చేసి. 104

మ. అతిబాహాబలదర్పితుం డగునంతం దాయామహీనాథు లం
చితభక్తిం గర మందు నిచ్చిన మణీచిత్రాంబరాలంకృతుల్
వితతార్థంబులు నూఱుకోట్లు గొని కివిన్ గోత్రభిత్ప్రస్థమున్
గృతకృత్యుం డయి చేరి ధర్మజుఁ గర్పించెన్ సమస్తార్థముల్. 105

సహదేవుండు దక్షిణదిగ్విజయంబు సేయుట.

మ. సహదేవుండు చమూసమేతుఁ డయి తేజం బేర్పడన్ ధర్మదే
వహరిన్మార్గము వట్టి పోయి బలదర్పం బొప్ప నాశూరసే

ను హాసద్వక్త్రమునన్ జయించి తొలుతం దోడ్తో సుమిత్రు న్నృపో
ద్వహునిన్ మత్స్యపతిన్ వశంవదులఁ గాఁ బాలించె లీలాగతిన్. 106

తే. దంతవక్త్రు మహాబలుఁ గుంతిభోజు, గెలిచి కర మిచ్చునట్లుగా సలిపి పిదప
నపరమత్స్యనివాసుల నధికబలులఁ, గలన నిర్జించి యురి వెట్టెఁ జెలిమి నిలిపి. 107

వ. మఱియు గోశృంగపర్వతంబునం గలనిషాదుల నిర్జించి శ్రేణిమంతంబును నవరాష్ట్రం
బును గెలిచి కుంతిభోజునిమైత్రి వడసి చర్మణ్వతీకూలంబున వాసుదేవహతశేషుం
డగుజంభకాత్మజు సహదేవునిం గలన జయించి దక్షిణాభిముఖుం డై చని సేకాపర
సేకులవలన వివిధరత్నోపాయనంబుల నంది వారిం గూడి నర్మదానదీసమీపంబున
నవంతిదేశాధీశ్వరు లగువిందానువిందులం బొంది వారివిందు వడసి భోజకటపురంబున
భీష్మకునితో రెండుదివసంబులు ఘోరయుద్ధంబు చేసి విజయం బంది కోసలప్రాక్కోస
లాధిపతులం ధిక్కరించి కాంతారకనాటకేయహేరంబకాదులతోఁ బోరి కూరిమిం బడసి
ముంజగ్రామంబున మారుధునితో శౌర్యగర్వదుర్వారు లగునాచీనార్బుకు లనునాట
వికుల నెల్ల గీటడఁచి వాతాధిపుని వశంబునం గొని పౌండ్రరాజులతో నొక్కది
నంబు పోరి జయించి దక్షిణాపథంబు వట్టి చని కిష్కింధాపురంబున వానరేశ్వరు
లగుమైందద్వివిదులతో నేడుదినంబులు పోరిన వారును. 108

ఆ. వికృతి నొంది వాని ప్రకృతి కచ్చెరువడి, మెచ్చికొనుచుఁ బ్రీతి హెచ్చఁ గనుచుఁ
బాండవేయ రత్నభాండంబు లియ్యవి, పుచ్చుకొనుము చనుము పురము వెడలి.

వ. అని వారు తనకుఁ గరం బర్పించినవివిధరత్నాదులం గొని సకలసేనాపరివృతుం డయి
చని మాహిష్మతీపురంబు ముట్టడించుటయును. 110

చ. పగతునిరాక నీలుఁ డనువాఁ డలప్రోలికి ఱేఁడు వించుఁ దా
నగణితసైన్యసంపదల నారయు నై చనుదెంచి తాఁకినం
దగి సహదేవుఁ డీగక మదంబున వానిని దాఁకుదెంచె స
మ్మగలకు ఘోరయుద్ధము క్రమంబున నయ్యె భయంకరంబుగన్. 111

శా. ఆయుద్ధంబునఁ గీలి నీలునకు సాహాయ్యంబు గావించె మా
ద్రేయుం డోజ నెదిర్చి పోరునెడ నార్తిం దద్బలం బెల్ల నా
గ్నేయం బై రథహస్తిపత్తితతు లగ్నిజ్వాలలం ద్రెళ్లినం
జేయం జాలక యెద్దియుం బ్రతిమ నాఁ జెల్వేగె నాతం డటన్. 112

వ. అనిన విని విస్మితుం డై జనమేజయుండు వైశంపాయనున కి ట్లనియె. 113

ఆ. జాతవేదుఁ డిట్లు సహదేవుసేనపైఁ, గనలినట్లు శిఖలఁ గప్ప నేల
కారణంబు దీనఁ గలుగునేని వినంగ, నిచ్చ వచ్చెఁ దెలుపవే మహాత్మ. 114

వ. అని వైశంపాయనుం డతని కి ట్లనియె. 115

క. విను మాహిష్మతి యనుపురి, మును జరిగిన యట్టికథను ♦ ముద మెదఁ బొదలన్
వినిపింతు వింతకారణ, మని మన మచ్చెరువుపడఁగ ♦ పవనీనాథా. 116

తే. తొల్లి మాహిష్మతీపురీ♦వల్లభుండు, నీలుఁ డధ్వరి గావున ♦ నిత్య మగ్ని
పర్యుపాసనఁ జేయుచుఁ ♦ బ్రస్తుతింప, నలరుఁ దనకన్నకూఁతురు ♦ కొలుచుచుండ.

ఉ. ఆయమ తండ్రికన్న మును ♦ నగ్నిగృహంబున కేగి కృత్యముల్
చేయుచు నుండు నెప్పుడు ప్ర♦సిద్ధిగఁ జేతులు గట్టుకొంచు ని
ట్లోయనఁ గొన్నినాళ్లు సన ♦ నొక్కదినంబున హవ్యవాహనుం
డామెలనాఁగసుందరత ♦ నారసి కామశరాభితప్తుఁ డై. 118

ఆ. కనఁగఁ గనఁగ నతఁడు ♦ క్రాఁగి కృశానుఁ డై
వలపు దెలుపఁ దలఁచు ♦ వలను పడమి
వనిత తన్నుఁ గొలువ ♦ వచ్చి జ్వలింపు చో
వెలుఁగఁ డయ్యె విసరి ♦ విసరి విసువ. 119

తే. వ్యజనమున్ ధమనియుఁ గొని ♦ వారిజాక్షి, విసరినప్పుడు వెలుఁగక వీతిహోత్రుఁ
డోష్ఠపుటమున నుహ్వని♦యూఁదెనేని, నెలఁతఁ జెనకఁగ నోయన♦వెలుఁగుచుండు.

వ. అట్లు కామమోహితుం డయినకృష్ణవర్త్మ. 121

మ. తన కారూపుఁ దాసినిం గలయుటల్ ♦ దక్కించి సాధ్యంబు గా
దని వేదాధ్యయనం బొనర్చుచు ద్విజుం ♦ డై వేదిఁ గై సేయ వ
చ్చిన నాకన్నియ పట్టి పట్టి యలరిం♦చెన్ జాతవేదుం డటం
గని నీలుం డపు డెంతయు న్నతని శి♦క్షాపాత్రునిం జేయుమన్. 122

క. *కోపారుణితాక్షుం డై, చూపఱు బెగ డొందఁ జూడఁ ♦ జూడ న్నారయ
రూపుఁ వైశ్వానరుఁ డా,భూపతినికటముననుండి ♦ పొడువుం జూపెన్. 123

శా. నీలుండున్ భయసంభ్రమాద్భుతములన్ ♦ వీక్షించి దిక్కింపు మీ
లోలాక్షిం గరుణించి చేకొనుము నా♦లోఁ దప్పుగన్ సైఁపు మో
లీలామానుషవేష యంచుఁ దన నె♦ల్మిం బెంచుకన్నె న్నీఁ
బ్రోలం గైకొని హవ్యవాహునకుఁ బెం♦డ్లిన్ నాని కిచ్చెం దయన్. 124

—— సహదేవు నగ్ని ముట్టడించుట. ——

చ. అఁలవరిప్రసాదమున ♦ నప్పురినుండియు నప్పురంబు గ
ల్వను బరిరాజు తేరియుఁ ♦ వచ్చి, వారిని వారిసేనలన్

* పొడువు = ఉన్నతి.

మునుకొని కాల్చి పుచ్చు హుత♦భోజనుఁ డట్టి భయంబు పెంపునన్
జన రని సేయ నప్పరము ♦ శాత్రవు లెవ్వరుఁ గాని వింటివే. 125

వ. మఱియును. 126

తరళము. సొగసుకత్తెల కప్పరంబునఁ ♦ జూడ స్వైరవిహారముల్
దగును దోషము గా దటంచు ధ♦నంజయుండు వరంబు వే
డ్కఁగ నొసంగుట నాఁటగోలె స♦ట న్నెలంత లొకింతయున్
బెగడఁ బోక యథేష్టవృత్తులఁ ♦ బేర్మి నొప్పెద రెప్పుడున్. 127

సహదేవుఁ డగ్నిం బ్రస్తుతించి ప్రసన్నునిఁ జేసికొనుట.

వ. ఇది యిట్లుండ ని మ్మాట్లు జాతవేదఃపరీతంబు లై నతనసేనలం జూచి భయార్దితుం డగుసహదేవుండు జలోపస్పర్శనంబు చేసి శుచి యై. 128

క. మ్రొక్కెదను హవ్యవాహన, మ్రొక్కెద నోచిత్రభాను ♦ మ్రొక్కెద ననలా
మ్రొక్కెదను లోకరక్షక, మ్రొక్కెద నోదేవదేవ ♦ మ్రొక్కెద ననఘా. 129

ఉ. పావనమూర్తి నే నిటకు ♦ వచ్చుట దిగ్విజయంబు గోరుటల్
నీవరపాదసేవనము ♦ నెమ్మి నొనర్పఁ గాదె యజ్ఞముల్
నీవు సమస్తదేవతలు ♦ నీముఖ మింద్రుఁడు చిత్రభానుఁడున్
నీవు జగత్త్రయంబునకు ♦ నేతవు త్రాతవు సంవిధాతవున్. 130

క. నీముఖమునందు వేల్చిన,సోమాసికి స్వర్గముఖముఁ ♦ జూపింతు గదే
నీమహిమ మెన్నఁ గలమే, స్వామీ పానీయసంభ♦వ కుమారగురూ. 131

తే. పావనము సేయుకతనఁ బా♦వకుఁడ వైతి,వహనమునఁ జేసి మఱి హవ్య♦వహుఁడ వైతి
వేదములు నీకుఁ గా జాత♦వేదుఁ డైతి, నీవ సర్వేశుఁడవు నీకు ♦ నీశుఁ డెవఁడు. 132

తే. అనలుఁ డై తేజ మనిలుఁ డై ♦ ప్రాణ ముర్వి,వై బలంబును సలిలమ ♦ వై శివంబు
నెలయ నొసఁగుచు మముఁ బ్రోవు ♦ వీతిహోత్ర, నీదుసంసేవఁ బిడె ♦ నే నొనర్తు.

తరళము. సలిలగర్భ సురేశ్వరేశ్వర ♦ సర్వభక్షక రక్షకా
జలజనాభుని పేర్మి ధర్మజు♦సల్పు నట్టిమహాధ్వరం
బెలమిఁ బ్రోతువు గాని విఘ్నము ♦ లిట్లు సూతువె కూర్మి నన్
దెలిచి తుష్టిని బుష్టినిం గరు♦ణింపవే కరుణాకరా. 134

వ. అని వినుతించి ప్రార్థించుచు సహదేవుండు ధాత్రీతలంబున దర్భలం బఱచి భయోన్ముఖం బగుసేనాముఖంబునకుఁ గృశానున కభిముఖంబుగాఁ బ్రాయోపవేశాచారంబు వడిమె నంత. 135

తే. ఆశ్రయాశుఁడు నటు వడ్డ • యతని దాఁటి
రాక వేలానివారితా • ర్ణవమువోలె
నిలిచి చెంత దయారస • మొలుకఁ బలికెఁ
బ్రణయ మిగురొత్త సాంత్వపూ • ర్వముగ నిట్లు. 136

చ. నృపవర లెమ్ము లెమ్ము నిను • నిన్నిటఁ బుచ్చినధర్మనందనుల్
గృప గలనే నెఱుంగుదుఁ బ • రీక్ష యొనర్చుట కిట్లు చేసితిన్
గపటము లేదు సుంతయును • గాచితి నిన్నిఁక నాకు నిప్పురీ
నృపతులు రక్షణీయు లని • యెప్పుడు వీరలఁ గాచుచుండెదన్. 137

వ. అని పలికిన విని సహదేవుండు సంతుష్టాంతరంగుండై లేచి సాష్టాంగనమస్కారంబు గావించి ప్రార్థించుచుండ నగ్నిభట్టారకుం డాశీర్వదించుచు నంతర్ధానంబు నొందె నంత.

క. పావకునాజ్ఞం గొని సహ, దేవుని వీక్షింప వచ్చి • దివ్యస్మృతి నా
దేవప్రభావుఁ డగునీ,లావనినాథుండు కప్పు • మర్పించెఁ గడున్. 139

వ. అట్లు విజయం బంది సహదేవుం డమందానందంబునం దరలి దక్షిణంబునందలి త్రైపురంబునం బౌరవేశ్వరుం దోలి స్వవశంబు చేసికొని సురాష్ట్రాధిపతిం గౌశికాద్యుం దత్తమి యటనుండి భోజకటకంబునం దున్న రుక్మిణీజనకుం డగుభీష్మకునకు శాసనంబు వ్రాసి కరంబు గొని ద్వారకాపురంబున వాసుదేవుని సమారాధనంబు గావించి నానావిధరత్నరాసులం బడసి కదలి శూర్పాకరతాలాకటదండకాదుల నోడించి సాగరద్వీపవాసు లగునిషాదపురుషాదకర్ణప్రావరణాదిమ్లేచ్ఛజాతిభూపతులం దూలించి కాలముఖాదినరరాక్షసయోనుల దీనులంజేసి కోలగిరిరామగిరిసురభీపదతిమింగిలతామ్రద్వీపనృపతుల వశగతులం జేసి సంజయంతీపాషండకరహాటకంబుల నేకపాదకేరకవనవాసుల వలన దూతలం బుచ్చి కరంబు పుచ్చుకొని యోడ్రకేరళపౌండ్రద్రవిడాంధ్రతాలవనకళింగోష్ట్రికర్ణికయవనభూపాలురభటుల ననిచి గెలిచి దక్షిణసముద్రతీరంబున విశ్రమించి. 140

ఉ. దూతలఁ బుచ్చి లంక కటఁ • దోరపులచ్చిఁ దలిర్చురావణ
భ్రాత విభీషణాఖ్యునకుఁ • బాడునియజ్ఞ మెఱుంగఁ జేయఁ గా
నాతఁడు ప్రీతిపూర్వముగ • నంచితకాంచనరత్నభూషణ
వ్రాతము నంపిపుచ్చె నమ • రన్ సహదేవునిశాసనంబునన్. 141

ఉ. మాద్రవతీసుతుం డటు క్ర • మంబున దక్షిణదిఙ్మహీంద్రులన్
మాద్రికి మీఱుతేజమున • మానక బల్మిని గెల్చి నోర్చి ని

ర్నిద్రయశోధనంబును మణినివహాతిధనంబు నొంది సం
పద్రమణీయుఁడై మగిడి వచ్చె వడి న్నిజరాజధానికిన్. 142

వ. ఇట్లు బలంబులం గూడి వచ్చి. 143

క. ధనకనకవస్తువాహన,ఘనమణివస్త్రాంబరాదికము లెల్ల జగ
జ్జనసుతుఁ డజాతశత్రున,కు నివేదించి సుఖముండెఁ గుతుకం బెసఁగన్. 144

నకులుండు పశ్చిమదిగ్విజయంబు సేయుట.

చ. నకులుఁడు పశ్చిమంబున కనారతనాదవిదారితాంతరి
క్షక మగుసేనతోఁ గదలి గహ్వరి గక్కదలంగ నేగుచున్
బ్రకటధనప్రపూర్ణమయి భాసిలురోహితకంబునన్ రణో
త్సుకు లగువారలం గెలిచె శూరుల మత్తమయూరకాదులన్. 145

వ. మఱియు మరు శైరీషక మాళవ మహేష్ఠ దశార్ణ త్రిగర్తాంబష్ఠ పంచ కర్పట మధ్య
మకేయ వాటధాన దేశాధీశులం బోర జయించి వశగతులం జేసికొని పరిక్రమించి. 146

క. ఆక్రోశరాజచంద్రుఁడు, విక్రమమున నెదుర నలని వినిహతశత్రు
ప్రక్రముఁడు నకులుఁ డని నిర్వక్రపరాక్రమమునం బరాజితుఁ జేసెన్. 147

తే. పుష్కరారణ్యవాసులు భూధరేంద్ర
వాసులును సింధుకూలనివాసు లైన
గ్రామణీయులు శూద్రులు గణము లగుచుఁ
బోర నెదిరింప విజయుఁడై పొలిచె నతఁడు. 148

వ. మఱియుం బంచనదామరపర్వతోత్తరజ్యోతిష దివ్యకట ద్వారపాలవాసుల నెల్ల వశ
గతులం జేసికొని రామఠ హార హూణాదిపాశ్చాత్యరాజుల నెల్లం బరాజితులం జేసి
వాసుదేవాదులకు ధర్మజుశాసనం బెఱింగించి పుచ్చి యదువృష్ణిభోజాంధకప్రవరుల
పారితోషికంబులం బరితుష్టుం డై. 149

ఉ. శాకల మేగి మాతులుని శల్యుఁ గన్గొని ప్రీతిపూర్వక
శ్లోకములన్ స్వకీయునిగఁ జూచి తదర్పితరత్నకాంచనా
నేకసహస్రముల్ వడసి నెమ్మి నట న్వసియించి కొన్ని నా
ళ్లాకురువీరుఁ డేగి కనె సంబుధిచుంబితభూమిభాగముల్. 150

వ. ఇట్లేగి సాగరకుక్షిస్థు లైనమ్లేచ్ఛ పల్లవబర్బరకిరాతయవనశకప్రముఖుల నెల్ల నోడించి
వారివలనఁ బదివేలు లొట్టియలు వేనవేలు ధనంబులుం గొని యిట్లు పశ్చిమదిగ్విజ

యంబు చేసి నకులుండు సకలవాహినీసమేతుండై మగిడి యింద్రప్రస్థంబునకు వచ్చి తన తెచ్చినధనాదికం బంతయు ధర్మజునకు నివేదించి సుఖంబుండె నంత. 151

## రాజసూయపర్వము.

చ. నలువురుతమ్ము లట్లవని నాలుగుదిక్కుల నున్నరాజులం
బలిమినిఁ జెల్మినిం గెలిచి బల్వుగఁ దెచ్చినద్రవ్యరాసులన్
గలిగి యుధిష్ఠిరుం డవనిఁ గాఁపుర మున్నమనుష్యధర్ముఁడై
పొలిచి మహేంద్రవైభవము పొంపిరివో ధర యేలె లీలమై. 152

చ. వృజినపరాఙ్ముఖుండు కురువీరునిసత్పరిపాలనంబునన్
నిజకులధర్మతత్పరత నిల్చి ద్విజప్రభృతుల్ మహీప్రజల్
గఱబిఱ లేక పాఁడియుఁ దొలంగనిపంటయుఁ గల్గి వెల్గుచున్
బ్రజలను గాంచి సంపద లవారిగ మించి సుఖించి రెంచఁగన్. 153

తే. కోరినప్పుడు వానలు కురిసె సర్వసస్యసంపూర్ణమై ధర సౌరు మీఱె
యీతిబాధలు వోయి పొల్పెసఁగి రెల్ల ప్రజలు ధర్మాత్ముఁ డగుపార్థుపాలనమున.

క. ధర్మానుశాసనంబున, ధర్మజురాజ్యమునఁ బోయె దస్యుభయంబున్
దుర్మంత్రిభయంబున్ దుష్కర్మాచారైకవంచకజనభయంబున్. 155

మ. అరిషడ్వర్గముతో సరాతిధరణీంద్రానేకవర్గంబులన్
వరశాస్త్రోజ్జ్వలశస్త్రసంతతులు పర్వం గెల్చుటం గర్వమున్
జిరవైరం బనుమాట లేక వసుధం జెన్నారుచుం డెల్లరున్
గరిమ ల్గట్టి భజింప నత్తు రెపుడున్ గౌరవ్యచూడామణిన్. 156

వ. అప్పుడు. 157

తే. ధనకనకవస్తునిస్తులపనితకోశకోష్ఠములపరిమాణము కొలఁది మీఱె
పొదలుచుండుటఁ గని పాండుపుత్త్రుఁ డెడఁద యజ్ఞ మొనరింపఁగాఁదగు నని తలంచె.

చ. హితులు పురోహితుల్ సచివు లేకముఖంబున ధర్మరాజుతోఁ
గ్రతు వొనరింప యుక్త మగుకాలము చేకుఱెఁ జేయు మోజగ
న్నుత విమతుల్ వశంవదు లనూనధనంబును గూడె నేఁడె వే
ల్పతఁ డిపు డుత్తరాయణము నందె నటంచును బల్కి రందఱున్. 159

వ. అని వారందఱును బ్రసంగించుకొను చున్నసమయంబున. 160

మ. అట వేంచేసెఁ బురాణపూరుషుఁడు విశ్వాత్ముండు వేదాంత వి
స్ఫుటరూపుండు మునీంద్రమానసనివాసుం డవ్యయుం డాద్యుఁడు

ల్కాటతేజోనిలయుం డనంతుఁ డజుఁ డుద్యద్భానుబింబప్రభా
పటలాంతర్గతుఁ డచ్యుతుం డమలుఁ డాపద్బాంధవుం డర్మిలిన్. 161

ఉ. ఆనకదుందుభిన్ నిజబలాధిపతిత్వమునందు నిల్పి పో
వైనధనౌఘ మాబలఁగ మంతయు మోయఁగఁ దెచ్చి మచ్చటన్
మానుషవిగ్రహుం డయి రమాధవుఁ డాతఁడు ధర్మసూతికిం
గానుక వెట్ట నాతఁడును గన్గొని భక్తి భజించె నాతనిన్. 162

క. ఆకమలాక్షునిరాకం, బాకారిప్రస్థపురము భాసిల సంతో
షాకర మై కోకప్రియు, రాకన్ లోకమును బోలి ప్రస్ఫుటదీప్తిన్. 163

వ. అంత భీమార్జుననకులసహదేవసహితుం డగుపాండవాగ్రజుండు ధౌమ్యద్వైపాయనప్రముఖఋత్విక్పరివృతుం డై సమాగతుం డయి సుఖాసీనుం డగుకృష్ణునిం జూచి యి ట్లనియె. 164

చ. జలరుహనాభ నీదగుప్రసాదమునం బృథివీతలంబునన్
గలిగినయెల్లరాజులను గైవసమందు నిలంగఁ జేసి ని
ర్మల మగుభూరికీర్తియు సమగ్రధనంబును నందఁ గల్గి భూ
తలమున నాటి రా రెవరు ధర్మతనూజున కందు మించితిన్. 165

తే. అనఘ సముపార్జితం బగునట్టివిత్త, మంతయును నగ్నిముఖమునయందు బ్రాహ్మ
ణాగ్రియముఖంబునందును నలరి వేయ, నభిలషించితి నయ్య నీయాజ్ఞ వడసి. 166

చ. అనుజులు నీవు నాఁబడుననంతమహాధన మంది యున్ననన్
దనరఁగ రాజసూయము నొనర్పఁగఁ బుత్తొ మహోన్నతాధ్వరం
బొనరుపఁ బుత్తొ కాని పురుషోత్తమ నీ దగునాజ్ఞ కేను నా
యనుజులు వేచియుంటిమి దయన్ మముఁ బ్రోవ ననుగ్రహింపవే. 167

వ. అనినఁ శ్రీకృష్ణుం డతని నభివర్ణించుచు ని ట్లనియె. 168

శా. నక్రముల్ నీకు ధరాధిపుల్ ధనము ధాన్యం బేన్గులున్ గొట్టియల్
సామ్రాణుల్ గజముల్ భటుల్ ప్రబల నైశ్వర్యం బవార్యంబుగా
సామ్రాజ్యంబు వహించు నీ యనుజులన్ శౌర్యాఢ్యులం గల్గియున్
సమ్రాడ్యజ్ఞసవం బొనర్పుమి ప్రశస్తప్రాభవం బే ప్రభూ. 169

క. ఏమెల్లం గృతకృత్యుల, మామహితాధ్వరము సేయ నగు దేనియు సం
దేమేమి పనులు గూర్పం,గా మది దలఁచెదవొ నాకుఁ జెప్పు మొనర్తున్. 170

వ. అనిన నప్పాండవాగ్రజుండు పుండరీకాక్షునిదిక్కు మొగం బై వినయం బభినయించుచు. 171

ఉ. ప్రాజ్ఞుఁడ వీవు సర్వవిష యజ్ఞుఁడ విట్లు ప్రసన్నచిత్తుఁ డై
యజ్ఞ మొనర్పు మేను గల నంతకు నంచు నను గ్రహించుటన్
బ్రజ్ఞ గల్వాఁడ నైతి నిఁక నాకు మనోరథసిద్ధి యయ్యె నీ
యాజ్ఞకు నేను బద్ధుఁడ నిరంతరమున్ వరయజ్ఞపూరుషా. 172

వ. అని యిట్లు వాసుదేవానుజ్ఞాతుం డై తమ్ములయనుమతంబున ధర్మరాజు రాజసూయంబు చేయ సమకట్టి సహదేవుం బిలిచి నీవు మంత్రులం గూడి ధౌమ్యోపదిష్టంబు లగుయజ్ఞాంగోపకరణంబులు సమకూర్చి యింద్రసేనవిశోకాదుల నన్నాద్యాహారణంబున నిల్పి దూతలం బుచ్చి ధరణిం గలబ్రహ్మక్షత్రియాదుల నెల్ల రావింపుమని నియోగించిన నిదె సర్వంబు సంసిద్ధంబ యని యతండును. 173

సహదేవాదులు రాజసూయసంభారంబులు సమకట్టుట.

చ. అధిసవనాంచితోపకర ణాదులతో భరితాంతరంబు నై
విధివిహితక్రమంబున సు మిశ్రితమై నుతమై మహోన్నతిన్
బ్రథితగుణంబు నై తఁరు ఫక్కి మఖాయతనం బొనర్చె స
ద్బుధులయు శిల్పకారులయు బుద్ధిబలంబులతో నుపాటునన్. 174

క. ఇంద్రప్రస్థముచుట్టును, సాంద్రము లగునునికియిండ్లు చలిపందిళ్లున్
జంద్రశిలావేదులు ని, స్తంద్రప్రతిభుం డతండు తగఁ జేయించెన్. 175

సీ. సకలోపవనవృక్ష సంశోభితంబులు, దీర్ఘికామలసరో దీపితములు
వివిధవాతాయనా విఖ్యాతమలయానిలోపసేవితము లత్యున్నతములు
చిత్రనిర్మాణప్రసిద్ధాంతరంబులు, శయనాసనాదినిర్ణయశాలములు
పరిచితాగురుధూప సురభిళంబులు దివ్యమణికుట్టిమాదిస మంచితములు

గీ. పుష్పదామపరిచ్ఛన్న భూతలములు, భక్ష్యభోజ్యాన్వితంబు లబాధకములు
భూతలేంద్రుల విడియింపఁ బొసఁగునిండ్లు, సేవ నొసరించె నాసహదేవుఁ డపుడు.

తే. ఋత్విజుల విప్రులం దొట్టి పృథివిజనులఁ
దేర లేఖ లంచిన సహదేవు నచట
పనుల కెద మెచ్చి ధర్మజుం డనిచె హాస్తి
నగరికిని బంధువులఁ బిల్వ నకులు నపుడు. 177

వ. అనంతరంబ. 178

క. సహదేవామంత్రితు లై, సహశిష్యులు వ్యాససముఖ్య సంయమిచంద్రుల్
మహిదేవేంద్రులు వే లై, బహుగతుల న్వచ్చి రటకుఁ బరమప్రీతిన్. 179

ఆ. నకులుఁ డన్నశాసనమ్మున హస్తినాపురము వోయి భీష్మముఖుల నెల్లఁ
జేరువరుస వేఱువేఱ నామంత్రించి, వచ్చె యజ్ఞకార్యపరత మఱలి. 180

వ. అంత గాంగేయాగ్రజరాజసూయమహాధ్వరదర్శనలాలసులై హిత పురోహిత బంధు మిత్ర పుత్ర భ్రాతృ సహితంబుగా భీష్మ ధృతరాష్ట్ర విదుర ద్రోణ కృ పాశ్వత్థామ సోమదత్త కర్ణ భూరిశ్రవశ్శకుని సైంధవ దుర్యోధన దుశ్శాసన వికర్ణాదులును విరాట ద్రుపద శల్య శిశుపాల గాంధారరాజ భగదత్త శక సాల్వ బృహద్బల చంద్రసేన సముద్రసేన పౌండ్రకవాసుదేవాదిరాజన్యులు నంగ వంగ కళింగ కాంభోజ కాశ్మీర సౌరాష్ట్ర మహారాష్ట్ర మగధ మాళ వాంధ్ర గౌడ ద్రావిడ సింహళ ప్రముఖనానాదేశాధీశ్వరులును వసుదేవ బలదేవ సాత్యకి గద సాంబ చారుదేష్ణ ప్రద్యుమ్న శూరసేనాదియదు వృష్ణిభోజాంధకప్రవరులును మఱియు మరు యవన పార్వతేయ సాగరానూపవాసులు నాదిగా సర్వసర్వంసహాచక్రమ్మునం గలరాజచక్రంబును వేదవేదాంగవేత్తలగు బ్రాహ్మణోత్తములును మహైశ్వర్యవశ్యు లగు వైశ్యులును గోబ్రాహ్మణారాధనతత్పరోన్నతగుణసముద్రు లగు శూద్రులును నానావిధమణిభూషణాంబరాద్యుపాయనంబులం గొని వచ్చినవారి నెల్ల ధర్మనందనుం డెదురేగి తోడితెచ్చి యథాపరికల్పితసన్నివేశంబుల నునిచి ప్రియసత్కారంబులం బూజించి మించినవేడ్క వారితో నయంబు దోఁప నిట్లనియె. 181

చ. నరవరులార! సంపదభినందితులార! మహాత్ములార! నే
నరుదుగ రాజసూయపరమాధ్వర మిట్లొనరింపఁ బూనితిన్
బరమదయాసముద్రలరు వచ్చితి రెల్ల రనుగ్రహంబునన్
గురువులు వారు పేరుపడఁ గూరిమి మీ రిది నిర్వహింపుఁడీ. 182

వ. అని యిట్లెల్లవారల వేఱువేఱం బ్రార్థించి భక్ష్యభోజ్యాధికారంబున దుశ్శాసనుని బ్రాహ్మణపరిగ్రహంబున నశ్వత్థామను రాజప్రతిపూజనంబున సంజయునిఁ గృతాకృతపరిజ్ఞానంబున భీష్మద్రోణులను సువర్ణరత్నాన్వేక్షణదక్షిణాదానంబులం గృపాచార్యుని సమస్తవస్తువ్యయంబున విదురుని దేశాధీశ్వరులు వెట్టునుపాయనంబులు గ్రహింప దుర్యోధనుని మఱియుఁ దక్కనుం గలయుచితోద్యోగంబుల ధృతరాష్ట్రబాహ్లీకసోమదత్తజయద్రథాదులను బ్రార్థించి నియోగించె నంత. 183

క. నానాదేశాగతు లగు,మానుల బ్రాహ్మణులపదకమలవిసరంబుల్
మానుగఁ గడిగి భజించుట, పూనెన్ హరి తనకుఁ దాన ముద మెదఁ బొదలన్. 184

చ. అరుదుగ నాసభాస్థలము నధ్వరముం గనువేడ్క నుర్విలోఁ
బరఁగినసర్వవర్ణములవారును దెచ్చి మణిగణంబులన్

గురువృషభున్ యుధిష్ఠిరునిఁ గొల్వఁగ వచ్చిరి మెచ్చ నత్తఱిన్
వరుణుని దిక్కరించువిభవంబున నిం బలరారె నాతఁడున్. 185

వ. అనంతరంబ. 186

ఉ. సత్యవతీసతీసుతుని సమ్మతి ధౌమ్యులు శాస్త్రకల్పితా
న్నత్యము నొందు దేవయజనంబునఁ బుణ్యమహం బెసంగ సం
పత్యధిక ప్రభావమున భాసిలుపాండుకుమారశేఖరున్
నిత్యవిభూతికై క్రతువు నిల్పఁగ దీక్షితుఁ జేసె వాసిగన్. 187

ఉ. ఆయెడ యజ్ఞదీక్షితుఁ డహస్కరతేజుఁడు ధర్మసూతి య
జ్ఞాయతనంబుఁ జేర నను జన్ములు జ్ఞాతులు విప్రు లంటి రా
నాయతనైభవంబున సమాగతులైన మహీంద్రు లెల్లరున్
బాయనిపేర్మిఁ జూడ బయి ప్రక్కలఁ గ్రిక్కిఱియంగ నొక్కటన్. 188

క. ధర్మజుఁడు దీక్షితుం డయి, కర్మారంభంబుఁ జేయఁ గడఁగి యపుడటన్
నిర్మలమతి నొప్పారెను, ధర్మము మూర్తీభవించి దనరువిధమునన్. 189

మ. వితతాంతర్గృహరంగణం బగునటన్ వీణాదివాదిత్రముల్
శ్రుతిపేయంబుగ మ్రోఁగ విప్రనిగమస్తోమస్వనం బొప్పె నా
నతమై నర్తకు లాడి రెల్లకడలన్ సంగీతసాహిత్యముల్
స్తుతిపాత్రంబుగ నుప్పతిల్లె త్రిజగన్మోదావహం బై కడున్. 190

క. దివి దేవేంద్రునకుం బలె, భువి భువనతలైకవీరపురుషుం డగునా
ప్రవిమలకీర్తికి నున్నత,సవము ప్రవర్తిల్లె నపుడు సన్నుతి కెక్కన్. 191

వ. అట్టి మహారాజసూయాధ్వరంబున బ్రహ్మాఖ్యం డగుకృష్ణద్వైపాయనుండు బ్రహ్మత్వంబును యాజ్ఞవల్క్యుం డాధ్వర్యంబును ధౌమ్యసహితుండును వసుపుత్రుం డగు పైలుండు హోత్రంబును ధనంజయఋషభుం డగుసుసాముం డౌద్గాత్రంబును వహింప వారిశిష్యగణంబు ప్రతిప్రస్థాతయుఁ బ్రస్తోతయు మైత్రావరుణుండు నాగ్నీంధ్రుండు నేష్టయు నున్నేతయు బ్రాహ్మణాచ్ఛంసియు గ్రావస్తుతయు నచ్ఛావాకుండునుం బోతయుఁ బ్రతిహర్తయు నై నారదాదిమహర్షులును భీష్మాదిరాజన్యులును సదస్యులై యుండ షడగ్నిసంయుతంబును సదక్షిణం బగునాసప్తతంతుక్రియాతంత్రం బధోక్షజరక్షితంబుగా సకలజనానందకరంబుగా నుపక్రమింపంబడియె నప్పుడు. 192

సీ. ప్రాగ్వంశమున వహ్ని ప్రజ్వరిల్లఁగ వేల్చి, యుత్తరవేద్యగ్ని నొప్పఁ జేసి
వరుణేంద్రసోమాదిసురల కాహుతు లిచ్చి, సంపూర్ణదక్షిణల్ సాఁగఁ జేసి

ధరణీసురుల నన్న♦దానంబునం దన్పి, ధనధాన్యదాసముల్ ♦ దనరఁ జేసి
గోభూశతసహస్ర♦కోటులు ప్రజ కిచ్చి, యెల్లధనంబులు ♦ కొల్లఁ జేసి
తే. వేల్పుల న్నెలవేల్పులఁ ♦ బొల్పు మిగులఁ, దృప్తులం జేసి ధర్మజుఁ ♦ డాప్తవర్గ
మనుచు నెల్లర మన్నించె ♦ నవని జనులు, నలరి రిట్లధ్వరం బొప్ప ♦ నయ్యె నంత.

అర్ఘ్యాభిహరణ పర్వము.

చ. అవభృథ మైనవాసరమునందు మునీంద్రులు రాజచంద్రులున్
సవనసదంబునం బొదల ♦ నారదముఖ్యులఁ గూడి ధర్మసం
భవుఁడు సమస్తఋత్విజుల ♦ మన్నన సేయుచు నిష్టగోష్ఠులన్
దవిలి యథోచితక్రియలఁ ♦ దత్పరుఁడై పొనరించె నెంచఁగన్. 193
వ. అయ్యవసరంబున. 194
మ. అగుఁ గాదంచును సర్వభాష్యవిదు ల♦న్యోన్యంబు శాస్త్రార్థముల్
దగ వాదింపుచు నుండ నింపుగొనునం♦తర్వేది సంపూర్ణబు
ధగతి న్నాకముఁ బోలె నందు యదువం♦శస్వామి చంద్రుండు నా
మొగి వెల్గం గని నారదుం డధికస♦మ్మోదమ్మునం బొందుచున్. 195
వ. తొల్లి బ్రహ్మలోకంబున వినినయంశావతరణవృత్తాంతం బంతయు స్మరియించుచుం
దనమనంబున. 196
మ. విదితం బయ్యె నితండు కృష్ణుఁడు మహా♦విష్ణుండు భూభారముం
బ్రిదులం జేయఁగ మర్త్యరూపమున నా♦విర్భూతుఁ డై పూతుఁ డై
యదువంశంబున వాసుదేవుఁ డగుచున్ ♦ హర్షొందుచున్నాఁడు దు
ర్మదదైత్యాంశభవాఖిలోర్వీధరవ♦ర్గక్షేపనాధ్యక్షుఁ డై. 197
వ. అని సాక్షాద్భగవంతుం డగుపుండరీకాక్షునియందు దృష్టి నిగిడించి మగుడక భక్తిభరి
తాంతరంగంబున నెంతయుం బ్రస్తుతించుచుండె నయ్యవసరంబున గురుపితామ
హుండు ధర్మరాజున కిట్లనియె. 198
చ.* యజన మొనర్చి వంశజుల ♦ కందఱకున్ సుకృతంబుఁ గూర్చి తీ
వజితుఁడ వన్న నిట్టిసమ♦యంబున నొక్కని కర్ఘ్య మీఁ దగున్
వృజినవిదూరి తత్కృతికి ♦ ఋత్విజుఁడు న్నృపుఁడున్ గురుండు సం
యుజుఁడును స్నాతకుండును బ్రి♦యుం డనునార్వురు నర్హు లుర్వరన్. 199
క. వీ నొకవత్సరకాలం, బౌరయ ప్రతి మంది యున్న♦యట్టిరి వలయున్
గారవవర నీసభ నగు,పూరుషులం దొకని జూచి ♦ పూజింపఁ దగున్. 200

* కొన్నిప్రతులయందు సహదేవుఁడే కృష్ణునకర్ఘ్యమిచ్చినట్లున్నది.

వ. అనిన నజాతశత్రుండు దేవవ్రతున కిట్లనియె. 201

క. ఈయున్న సదస్యులలో, నాయొకఁ డెవ్వండు వేని ♦ కర్ఘ్యం బిడ నా
నీయెడ వివరింపుము తా,తా! యన శాంతనవుఁ డిట్టు ♦ లనియెం బ్రీతిన్. 202

శా. జ్యోతిర్మధ్యమునం దినేంద్రుఁ డనఁ దే♦జోదివ్యదోర్జోబల
ఖ్యాతిన్ సభ్యులమధ్యమందు వెలుఁగుం ♦ గన్గొ హృషీకేశుఁ డే
పూతుం డీవసుదేవనందనుఁడె పో ♦ పూజ్యుండు లోకత్రయిన్
జేసెశ్శ్రద్ధగ నర్ఘ్య మి మ్మితనికిన్ ♦ శీతాంశువంశోద్భవా. 203

వ. అని దేవవ్రతుండు బోధించిన ధర్మతనయుండు కరంబు సంతసించి సహదేవోపనీతం బగు నర్ఘ్యంబు విధిదృష్టవిధానంబున నర్పణీయుం డగు నచ్యుతున కిచ్చిన నతండు నను మతించి దానిం బరిగ్రహించె నంత నది యంతయుం జూచి సహింప నోపక చేదిదే శాధీశ్వరుం డగు శిశుపాలుం డహంకరింపుచు శాంతనవుం బదరి వాసుదేవు నధిక్షేపించుచు నుపాలంభనపూర్వకంబుగా ధర్మరాజున కిట్లనియె. 204

శిశుపాలుండు ధర్మరాజు నాక్షేపించుట.

ఉ. ఇందు మహాత్ము లెందఱు మ♦హీపతు లెందఱు వందనీయు లై
యుందురు పార్థివాగ్రణులు ♦ నొప్పి ధరాభరణాయమాన నీ
కిందఱిలోన నెవ్వరిప♦యిం గుఱి నిల్వక పోయె నిన్ను నే
మందును నందనందనున ♦ కర్ఘ్య మొసంగితి వీతఁ డర్హుఁడే. 205

క. వృష్ణికులోద్భవుఁ డగు నీ,కృష్ణున కర్హాణము సేయఁ ♦ గేవలదూష్యం
బుష్ణాంశుతేజ గుణావ,ర్ధిష్ణులు పాండవుల కిట్టి♦కృత్యము తగునే. 206

చ.*ముది మది లేనిపిత్తఁడుల♦బుద్ధులు నుద్దులు విశ్వసింపఁగాఁ
బోదలునె మీరు కొండికలు ♦ వో తలపోయరె ధర్మమార్గ మి
య్యది కద శాస్త్రదూషిత మ♦నర్హము ధర్మసుతుండ వీవె యి
ట్లదటునఁ దప్పు చేసిన న♦హా! పెఱవారలఁ జెప్ప నేటికిన్. 207

ఉ. చుట్ట మటంచు నెయ్యమునఁ ♦ జూతురయేనియు గోపసూతికిన్
బెట్టుఁడు పోయుఁ డాదరిముఁ ♦ బెంచుఁడు నించుఁడు సంచితార్థ మె
వ్వట్టున నెవ్వ రేమి యన ♦ వత్తురు మెత్తురు గాక యిట్టిదో
నిట్టి యనర్హుఁ డర్హుఁ డగు♦నే కొన నర్హణ ధర్మనందనా. 208

సీ. గుణవృద్ధు వృద్ధని ♦ కొలువంగ నెంచితే, వసుదేవుఁ డుండ నీ♦వాసుదేవుఁ
బ్రియతరుం డని పిలిచి ♦ బిలిచి సేవించితే, మద్రరా జుండ నీ♦మాయకాని

* అదటు = మదము, గర్వము.

నాచార్యుఁ డని భక్తిఁ జూచి పూజించితే, ఘటజన్ముఁ డుండ నీ కుటిలచిత్తు
ఋత్విజుం డని మెచ్చి యెడఁద నర్చించితే, వ్యాసు లిం దుండ నీ దోసకారి
తే. స్నాతకుం డని కొల్చితే శాస్త్రవిద్వరుండు ననఘుఁ డశ్వత్థామ యుండ వీని
రా జని తలంచి కొల్చితే రాజరాజు, ఘనుఁడు దుర్యోధనుం డుండ ఖలుని వీని.

వ. మఱియుం గురుపితామహుం డగుశాంతనవుండును భరతవంశాచార్యుం డగుకృపుండును గింపురుషాచార్యుం డగుద్రుముండును భాండురాజతుల్యుం డగుభీష్మకుండును మద్రాధినాథుం డగుశల్యుండును జామదగ్న్యప్రియశిష్యుండును బలపరాక్రమనిర్జితావనీశ్వరుం డగుకర్ణుండును లోనుగాఁ గలమహానుభావు లెందఱో యీయజ్ఞాయతనంబునం బూజనీయు లుండ వారి నెల్లం గా దని వీని నే మని పూజించితివో యిది మముబోంట్ల నవమానించుటయ కా యని వెండియును. 210

చ. కురువృషభుండు ధర్మజుఁ డకుంఠితతేజుఁడు రాజసూయముం
బఱఁగ నొనర్చు నంచు నతివట్టి కనుంగొన వచ్చినార మీ
నరవరు లెల్లఁ గొల్ల యని నమ్మ భయ మందుచుఁ గాదె నీ యుధి
ష్ఠిర యిట్లు వీరి కెదురుకు సేగి దలంచుట నీకుఁ బాడియే. 211

క. జన్నంబుపేర రాజుల, మన్నింపక యిట్లు సేయ మదిఁ దలఁచియ నీ
విన్నరనాథులఁ దెచ్చితి, వెన్నఁగ నీతప్పు గాదె యిందుకులేశా. 212

మ. విమలార్ఘ్యగ్రహణార్హలక్షణాలనావిష్టుండు గానట్టిదు
ష్టమతిం గృష్ణునిఁ బెద్ద చేసి యిటు యజ్ఞాంగణంబందు న
ర్ఘ్యముఁ గల్పించుటఁ జేసి నీ దయిన ధర్మజ్ఞత్వ మొక్కింతయో
సమసెం దప్పు ఘటిల్లె నింకట నిసుక సమ్రాట్టు నా నొప్పునే. 213

వ. అని కృష్ణు నుద్దేశించి మఱియును. 214

శిశుపాలుండు కృష్ణు నుపాలంభించుట.

చ. బలము గలాఁడవుం గుడుసువా ల్గలవాఁడవు నీ వనుంగు నై
కలిగిన నెప్పుడేని యుపకారిమ గల్గక పోవ దంచు నీ
దెలియక పూజ చేసెను యుధిష్ఠిరుఁ డేఁ దగ గీర కంచు నా
కలరి గ్రహింతె సిగ్గఱి జనార్దన శ్వానము హవ్యముం బలెన్. 215

తే. మేటివిలుకాఁడ వని మిట్టిమిట్టి పడుదు, వలజరాసంధుని మహాత్ము [illegible]ఘు మోస
చేసి చంపించి దోసంబు చేకొనఁగి, నైతి నినుఁ జూచి కంటినే యఘము వచ్చు.

క. వేడికె దాని నాసంగి, పోఁడిమిఁ జేకొనిన సద్దముం జూపుగతిన్
జూడ నరాజన్ను నీకుం, గూడెఁ బూజారాజపూజ కువిధిం బడియెన్. 217

చ. ముదుసలి సెప్పుటల్ తనకుఁ • బోలఁగఁ దోఁపనిభీరు విచ్చుటల్
సుదతులపిండుసన స్మైలఁగు•చుక్ మతిమాలిసనీవు వట్టుటల్
పదుగురకు న్వినంబడఁగ • వచ్చె నిహీ ముగురుక్ దురాసదుల్
చదురున నిందు మాద్యశుల•సంగతియుం బరికింప దూష్యమే. 218

వ. అని శిశుపాలుండు రోఁజుచుఁ దనతోడిరాజులం గూడి సదంబు వీడి చనియె నంత వానిపిఱుందన చని మృదుమధురవచనరచనల ననునయించుచు ధర్మరా జిట్లనియె.

చ. పరుసము లాడరాదు శిశు•పాల భవాదృశు లైనరాజు లి
వ్వరుసను బెద్దలం దెగడి • పల్కుట పాపము నా నెఱుంగవో
విరస మి టేల నీకు గుణ•వృద్ధులు వృద్ధులు వీర లెల్ల నీ
వరసినధర్మ మారయుని•యట్టిరె యిట్టులు నీకుఁ బోలునే. 220

చ. తగ దిది నీవు కొండికవు • ధర్మ మధర్మము నేర్పరించి ప
ల్కఁగ నిసుమంతఁ జాల వధి•కప్రతిభాన్వితుఁ డైనభీష్ముఁ డి
ట్లగు నని వ్యాసముఖ్యులస•మక్షమునక్ హరిఁ బ్రస్తుతింపఁ గాఁ
దెగడుట నీకుఁ జెల్లదు మ•దిం గలహింపక శాంతినొందుమా. 221

వ. అని చేదిపతిం బట్టువఱుచుచున్నయజాతశత్రునిం జూచి శాంతనవుం డి ట్లనియె. 222

చ. పతితుఁడు వీఁడు వీని నిటు • పట్టువడం బతిమాలు దేల భూ
పతికులభూషణా భువన•వారసమర్చితుఁ డైనకృష్ణునిక్
గతి మరయంగఁ జాలక ని•కారవికారవదోవిగుంభనక్
వితగఁ దిరస్కరించి కడు • విప్రియుఁ డయ్యెఁ దొలంప నర్హుఁ డై. 223

—●●◆ భీష్ముండు శిశుపాలునకు బుద్ధి సెప్పుట ◆●●—

వ. అని శిశుపాలుదిక్కు మొగంబై. 224

తే. ఓరి శిశుపాల కృష్ణుఁ డ•యోగ్యుఁ డర్హ
ణమున కంచువి మూర్ఖు వై • క్రమ మెఱుఁగక
మాక కాదు విను సమస్త•లోకములకు
వందనీయుఁ డితఁడు భగ•వంతుఁ డగుట. 225

తే. ఇట్లు ప్రేలెదుతులువ నీ • వేమి లెక్క,వాఁడ వీకృష్ణునందె భూ•భార ముండె
నిటవయోవృద్ధు లుండిన • నితఁడె వృద్ధతముఁడ యంచును బూజించి•తిమిర మూర్ఖ.

చ. ఖలుని బృహద్రథాత్మజుని • గండడఁగించుట శౌరితప్పటం
చాలితితి ధర్మశాస్త్ర మది • యుండఁగ నిమ్మటు లట్టిదుష్టునిక్

గలసిననిన్ను నట్టియెడఁ • గాలునిప్రోలికి నంపకుంటయే
బల మగుత ప్పటంచుఁ దలఁ•వా తెలివిం దెలియంగఁ జాలవో. 227

ఆ. గెలిచి పగఱ గెలువఁ • గలిగి తదీయుల, విడిచి పుచ్చె నెవఁడు • విగ్రహమునఁ
గరుణఁ జేసి వాని • కరయ నాతఁడు గురుం, డెఱుఁగు మోరి కృష్ణుఁ • డెవఁడొ నీకు.

చ. అజితుఁ డొకండు లేఁడు హరి • కారయ నిం దగురాజు లీగదా
గ్రజుకరుణన్ విముక్తిఁ గనఁ గల్గినవారె జగత్త్రయంబునన్
భుజముల మోయఁ జాలినప్ర•భూతపరాక్రమశాలి వీనినిన్
వృజినము లాడ నోరి యవి•వేకమతీ యెటు నోరు వచ్చెరా. 229

ఆ. ద్విజులలోన జ్ఞాని • వృద్ధు పార్థివులలో, వీర్యవంతుఁడెన్న • వృద్ధు వణిజు
లందువృద్ధు విత్త • మధికంబు గలవాఁడు జన్మవృద్ధు నాల్వ•జాతి వృద్ధు. 230

క. దానము దాక్ష్యము శ్రుతమున్, మానము శౌర్యంబు కీర్తి • మహిమోన్నతియున్
జ్ఞానముఁ దుష్టియుఁ బుష్టియుఁ, గానంబడుఁ గృష్ణునందు • ఘనుఁ డతఁ డొకఁడే. 231

ఉ. *ఉరుబలవిద్యలం గలిగి • యుండినవాఁడు వివాహ్యుఁడున్నరే
శ్వరుఁడు గురుండు ఋత్విజుఁడు • స్నాతకుఁడుం బ్రియుఁడు న్మహేశ్వరే
శ్వరుఁ డని వీని కర్హణ మొ•సంగితి మింతియ కాని బంధుతా
దరము పురస్కరించుకొని • తచ్చనఁగా దని నీ వెఱుంగుమా. 232

క. ఒరుఁ డొక్కఁ డర్చితుఁ డయి, పరితృప్తిం బొందు నొకఁడ • పరమేశ్వరుఁ డీ
హరి యొకఁ డర్చితుఁ డయినం, బరితృప్తిం బొందు విష్ట•పత్రయ మెల్లన్. 233

క. ఇది యింతఁ యెఱిఁగి చేసిన,యది కాని యెఱుఁగక చేసి•నదికాదుర దు
ర్మదచిత్త మాకొలంబునఁ, బొదలం డవిమర్శకుండు • బుధుతం డయినన్. 234

వ. మఱియు నిమ్మహాత్మునిప్రభావసామర్థ్యంబు లెట్టి వంటివేని వినుము. 235

చ. సకలచరాచరంబులను • జంపఁగఁ బెంప సృజింపఁ గర్తయై
ప్రకటితసన్మహత్త్వమున • భాసిలుచుండియుఁ దాజగద్విధా
యకుఁ డయి తుష్టి పుష్టి విజ•యశ్రుతశౌర్యయశోబలాదులన్
సకలతయున్ మహత్త్వమును • బొప్పడ నచ్యుతుఁ డొప్పు నెప్పుడున్. 236

తే. పంచభూతంబులును సదుల్ • పర్వతములు
పురుషుఁడు మనంబు బుద్ధియు • భువనములును
భువనభర్తలు శశిగ్రహం•బులు నినుండు
చుక్కలును దిక్కులును గాల • మొక్కఁ డితఁడె. 237

---

* తచ్చన = కపటము.

సీ. అఖిలవేదంబులు నగ్నిహోత్రముఖంబు, లరయ ఛందముల గాయత్రి ముఖము
మనుజకోటికి రాజమార్తాండుఁడు ముఖంబు, నదుల కెల్లను మహార్ణవము ముఖము
సకలతేజములకు సప్తాశ్వుఁడు ముఖంబు, నక్షత్రములకుఁ జంద్రముఁడు ముఖము
పర్వతంబుల కెల్ల వరమేరువు ముఖంబు, ఖగముల కెల్లను గరుడి ముఖము
తే. క్రిందు మీఁదై మహాఖ్యాతిఁ బొందుపడిన, దేవలోకములకు నెల్ల దేవదేవుఁ
డచ్యుతుఁ డనాదినిధనుఁ డవ్యయుఁడు సకల,నాథుఁ డీవసుదేవనందనుఁడె ముఖము.

చ. ఎఱిఁగి యెఱింగి యిట్టు లని యెల్లజగంబులవారు శౌరినిన్
నెఱి భజియించుచుండ నవినీతుఁడ వో శిశుపాల చేల వై
యెఱుఁగక బాలభావమున నిట్టులు ప్రేలితి గాక యెవ్వరున్
జుఱుకన నిన్నుఁ బోలె మధుసూదను నాడఁగ సాహసింతురే. 239

వ. అని పలుకుచున్న సమయంబున. 240

చ. అరసి త్రిలోకపూజ్యుఁ డగు నచ్యుతు నర్చితుఁ జేసినార మీ
వరకృతి కిం దొడంబడని వారిశిరంబులయందు నే నిదే
చరణముఁ బెట్టెదన్ బలుకఁ జాలినవారలు పల్కుఁ డంచు నే
డ్తెఱఁ గడకాలి నెత్తె సహదేవుఁడు కోపపరీతభావుఁ డై. 241

ఉ. అత్తఱి నాసభాస్థలము నం దగుపందలు బొమ్మలట్లు నో
రెత్తక చూచుచుండి రొక యింతటిలో సహదేవుశీర్షమం
దొత్తుగఁ బుష్పవృష్టి పడె నుప్పరమందునుండి మేలు మే
లుత్తమ మేలు మే లనుచు నుప్పతిలెం గడు దేవవాక్యముల్. 242

వ. అంత సర్వసంశయనిర్మోక్త యగు నారదమునిచంద్రుం డాసదస్యమధ్యంబున నిలిచి
యి ట్లనియె. 243

క. ఏవాఁడు వాసుదేవుని, దేవానాంప్రియవిదూరుఁ దేజోమూర్తిన్
భావించి భజింపండో, జీవన్మృతుఁ డతఁడు వానిఁ జెల్లదు పలుకన్. 244

వ. అంత నాసహదేవుండు తక్కునుం గలఋత్విక్ప్రముఖపూజార్హులం బూజించుచుండె
నాసమయంబునఁ జేదిరాజసేనాధినాథుండు సునీథుం డనువాఁడు శిశుపాలప్రేరణం
బునం జేసి కోపారుణితాక్షుం డై లేచి. 245

క. సేనాపతి నే నుండఁగ, మానము చెడి యిట్టు లుంట మా కగునే యో
మానవనాయకులారా, ప్రాణము లివి యేల లెండు ప్రధనం మొనర్పన్. 246

వ. అని పురికొల్పినం దదీయు లైనక్షత్రియు లెల్లం గ్రుద్ధు లై చెలరేఁగి శిశుపాలుని
పక్షంబునం బడి సదంబు వీఁగి చని. 247

ఉ. కావున కంఘ్రితాడితమ్ముగ ప్రభువర్యములట్లు క్రోల్చుచున్
యాదవపాండవాన్వయబలౌఘముతో నెదిరించి యజ్ఞఘా
తాదికముం బొనర్చుటకు నై గడకట్టి పెనంగ మొగ్గరం
బై దత్తిఁ జేరనున్న హరి యంతయుఁ జూచుచు నుండె నవ్వుచున్. 248

శిశుపాలవధపర్వము.

వ. యుధిష్ఠిరుండు నట్టిసంక్షోభంబు సూచి భీష్మున కిట్లనియె. 249

చ. అడరి వడిన్ మహీశ్వరమహార్ణవ మిప్పుడు మేర మీఱి దుం
దుడుకుగ సంచలించెడి నదూరమునం దదె చూడు మధ్వరం
బడఁజడి నంతరాయముల నందక యుండఁ బ్రజాపకారమున్
బొడమక యుండ నెట్లు చనఁ బోలునొ చెప్పఁ గదే పితామహా. 250

వ. అనినం గురుపితామహుండు పాండవాగ్రజున కిట్లనియె. 251

క. జడియకుమయ్య కురూద్వహ, జను లెవ్వరు నెగ్గు సేయఁ జాలరు నీకున్
గమకొని కుక్కలు సింగము, నడకింపం గలవె లోకమున నెటనేనిన్. 252

తే. వృష్ణికులసంభవం బగు కృష్ణసింహ, మిట్లు నిదురించున ట్లుండ నెఱుక లేక
మొఱుఁగు నీశిశుపాలాదిభూమిపాలు, రెల్లఁ గుక్కలు కవియ ని మ్మేమి భయము.

మ. ఖలుఁ డీచైద్యుఁడు వీనికై వడిన యీకష్టాత్ములుం గిత్తినిన్
శలభంబుల్ బలె వాసుదేవునెదురన్ సంధించుచున్నారు వీ
రల నెల్ల న్మురదానవాంతకుఁడు ధైర్యస్థైర్యహేమాద్రి న
వ్వ్వలఁ గాలక్షయ మందఁ జేయు నిమిషంబు న్వచ్చు వీక్షింపుమా. 254

వ. అను నట్టిబెట్టిదంబు లగువచనంబులు విని దమఘోషనందనుండు మండిపడి యెల్లరు
విన భీష్మున కిట్లనియె. 255

శిశుపాలుండు భీష్ము నధిక్షేపించుట.

చ. ముదుసలివగ్గ వయ్యుఁ జలముం బలముం గలవాఁడ పోలె నై
వదరుచు నెల్లపార్థివుల వమ్ముగ నిట్టి బిభీషికోక్తులన్
బెదరుపడం బొనర్చి జడిపింపఁగఁ జొచ్చితె వంశపాంసనా
బెదరుదురే సుధీరు లగు వీరులు నీ వనునింతమాత్రకున్. 256

శా. ఈడంబోవక పాండవేయు లెద నీహీనోక్తుల న్నమ్మి తా
రోడం గట్టినయోడ లట్లు కృతులం దోటాటియుం జీకుతోఁ
గూడం బోయిన చీఁకుల ట్లురలి పెన్కుక్కల్ చిక్కులం గూడ నీ
తోడం గూడిరి పెద్దచేసి తమసాధుత్వంబు వోకాలఁగన్. 257

మ. అగము ల్మెట్టిన మెట్టుచుం బసుల నొయ్యం గాచుగోపాలునిన్
భగవంతుం డని వొత్తిమొత్తిమునులన్ వర్ణించి కీర్తింపఁగా
నగు నీనాలిక వేయిచీలికలుగా నై పోవ రాదే యిటన్
దగునే నీ కిటు ధర్మవున్ విడిచి చేఁత ల్సేసి చేయించుటల్. 258

వ. మఱియు నీగోపాలుండు. 259

సీ. తనకుఁ బాలీవచ్చు దానిఁ బూతనఁ జంపె, బక్కయెద్దును గూల్చె బండి విఱిచెఁ
జివికినముదిమద్ది చెట్లఁ బడం గొట్టె, గాలిసోఁకుని నేలఁ గూల వైచె
నో రెఱుంగనిగోవునుం జించిచెండాడె, గాడిదతోఁ బోరి గండడంచెఁ
దల్లితోఁబుట్టువు నల్లనఁ దెగటార్చెఁ, గొండముచ్చును గొట్టెఁ గొలఁకు మెట్టెఁ

ఆ. బుట్టుపాటిగట్టుఁ బూని తాఁ బై కెత్తె, పట్టె నేఁడునాల్గు లట్టె యీతఁ
డిట్టిపనులు జోదు లెంచెడుపాటివే, యేటికొఱుక వీని కేటికింత. 260

ఉ. కొండల నాలఁ గాయుచును గుత్తుకబంటిగ మెక్కి మాంసముల్
మిండఁడు వీఁడు వెన్నలును మీఁగడ పాలును దొంగిలించుచున్
మెండుగఁ జియ్యఁబట్టి బలిమిం గల ప్రేతల నంటి శూరుఁడై
యుండుట యిందుఁ గాని మఱియొక్కవిశేషము కల్మి యిందుమే. 261

చ. మఱియును గోద్విజాన్నదుల మానినులన్ శరణన్నవారి మై
మఱచినవారి నమ్మి తన మాట మెలంగెడువారిఁ జంపినన్
దఱచగుపాప మంచు విబుధప్రవరుల్ భవదుక్తి సఖ్యముం
దొఱసినయీతఁ డన్నిట ఘనుండె కదా యిది నీ వెఱుఁగవే. 262

తే. కురువృషభునిచేత నకార్యకరణ మీవు, పట్టి చేయించితివి దానఁ బాత్రత చెడి
పూర్ణతను బాసి వితథమై పోయె మఖము, బళిర యెంతయధర్మతత్పరుఁడ వైతి.

తే. ఒరుని వలచినకన్నె నీ వాడిసి తెచ్చి, తిది యధర్మ మటంచు నీ వెఱుఁగ వైతి
విడిచె నీతమ్ముఁ డెఱుఁగుట వెడఁగ యిట్టి,వాఁడ వీవు ధర్మము సెప్ప వాఁడ వోటు.

తే. ఆలుబిడ్డలు లేక నిత్యము తృతీయ, మగుప్రకృతియందు మెలఁగు చిహ్నంబుఁ బరముఁ
గూడఁ జెడ నున్న ముదుసలిగొడ్డు వీవు, నీక తగు నెట్లు చేసిన లోకమందు. 265

చ. స్తుత మగుబ్రహ్మచర్య మనుదొడ్డవ్రతంబును బట్టి తంట నీ
వ్రత మది యెట్టిపాటిది ధ్రువంబుగ నీకు సపుంసకత్వమో
స్థితి చెడి యుంటయో కలుగఁ జెల్లెను గాని మఱొండు గా దిలన్
వ్రత మెదియున్ ఫలింప దన పత్యున కియ్యది నీ వెఱుంగవో. 266

ఉ. సంతతయజ్ఞముల్ శ్రుతులు సజ్జనపూజలు సర్వకర్మముల్
సంతతిలోనిషోడశకళం బురుణింపఁగ లేవు గావునన్
సంతతి సత్క్రియోత్తమము సంతతి లేనిజనుండు పాపి యా
నింతటిపాపి వీవు నిను నేరు ప్రదర్శకుఁ డండ్రు చెప్పవే. 267

వ. హాహా! దంభవ్రతనిష్ఠాగరిష్ఠుండ వగునీప్రసంగంబు వలన నొక్కవృద్ధరాజహంస వృత్తాంతం బుద్బోధకం బగుచున్న దది చెప్పెద వినుము. 268

సీ. కలదు తొల్లిట నొక్కకలహంస ప్రబలి సాగరసమీపమునందుఁ గాఁపురముగ
ధర్మవేత్తనుబోలి ధర్మోపదేశ మావృద్ధ దానర్చును బక్షివితతి కెల్ల
జలపక్షు లవి దానిశాసనంబున నిల్చి, సేవించు నిచ్చలు సేమ మరసి
జంతుహింస యొనర్ప జంకెమదాని కాహారంబు ముప్రొద్దు నవి యొసంగు

తే. నెరల కేగుతఱిఁ బక్షు లెల్లను దమ
యండముల దానికడఁ బెట్టుచుండు నెపుడు
నంచయును బక్షు లెడ యాట నెంచి గుడ్ల
లెల్ల భక్షించి మొఱఁగు నే మేమొ యనుచు. 269

వ. ఇట్లు కొంతకాలంబు జరిగినవెనుక నొక్కనాఁ డక్కపటవృత్తం బెఱింగి యొక్కపక్కి తక్కినవాని కావృత్తాంతం బంతయుం జెప్పిన నవి దానిమాట ప్రత్యక్షంబుచేసికొని రోసంబునం జేసి మాయావృత్తప్రవృత్తి మగునావృద్ధుం బట్టి వధించె నట్లధర్మపరుండ వై ధర్మోపదేశంబు చేయునిన్ను నెప్పుడో పట్టి యీవసుంధరాధిపతులు వధియింపక మాన రని వెండియును. 270

చ. పొగడితి బట్టువోలె యదుపుంగవుబీరము నే నెఱుంగనే
పగఱ జయించె నెందుఁ దలఁప న్వలెనే మగధేశ్వరుండు మున్
తగిలి జయింపఁడే యతెని దాడికి వీఁడును వీనిచుట్టముల్
పొగ రత్తి పాఱరే నగరముల్ విడి పోరున మాఱు లెన్నియో. 271

మ. తనచేఁ గామి నెఱింగి భీము విజయుం దాఁ గొంచు మాయావి యై
జని వంచించి వధించెఁ గృష్ణుఁడు దయాసాంద్రుం జరాసంధు న
ప్పని మే లెంతువె లోకకర్త యనుచున్ వర్ణింతువే వృద్ధ వై
వనితాధర్మగుఁ డై తి వే మనుచు ని న్వారత్తు నే నిం కిటన్. 272

ఉ. అచ్చము గానివృత్తి నిటు లై నసిక్రుష్టుని నిన్ను దుష్టునిన్
నిచ్చలు నమ్మి నీనుడుల నే శ్రుతులంచుఁ దలంచి పాండవుల్

నిచ్చల మైనసచ్చరిత • లేశము నెంచక కించుమార్గమం
దుచ్చగతు ల్చెడం బడి ర•యో తలపోయ విచార మయ్యెడిన్. 273

వ. మఱి నీవు వందివలెం బరులఁ బొగడి జీవించువాఁడవయేని చెప్పెద నాకర్ణింపుము.

సీ. స్తుతియింపు మంగనా•థుని గర్ణు సహజకుం,డలకవచుని దాన•కలితకరునిఁ
బొగడు మాహిష్మతీ•పురవల్లభుని మాగ,ధుని జెట్టిమల్లుని • మనుజవిభునిఁ
గొనియాడుము జయద్ర•థుని దృఢవిక్రముఁ, గలితశస్త్రాస్త్రుని • సలలితాత్ముఁ
గొండాడు మఖిలభూ•మండలాఖండలు, దుర్యోధనుని శౌర్య•ధైర్యనిధిని

తే. మఱియు భగదత్తు భీష్మక•మత్స్యరాజ,దంతవక్త్ర శకునిముఖ్య•ధరణిపతులు
విపులకీర్తి ప్రతాపు లై • వెలుఁగుచుండ, వారిఁ గా దని యాదవుఁ • బొగడ నేల. 275

క. ముదుసలివగ్గవు గానన్, మది చెడి పెడతలను బట్టె • మహి నెవ్వరు నీ
ముదిమాట ప్రకృతి యనుచున్, మది సమ్మనవారు చెడక • మానరు సుమ్మీ. 276

వ. నీవు భూలింగశకునిం బోలి పరులకుం జెప్పుచుందు వది వినుము. 277

తే. కలదు భూలింగశకుని నా • సలరుసల్వ, జీవి హిమవంతమునఁ దొల్లి • చెప్ప వింటి
నది వలదు సాహసం బంచు•ననిశ మొరులఁ,బలికికొంచును దిరుగు న•ప్పొలమునందు.

చ. తనపొసఁగించుసాహస మొ•దం దలపోయదు పక్షి మాంసమున్
దిని మృగరాజు నోర్ దెఱువఁ • దీరినయప్పడు దాని పన్నులం
గనఁబడుమాంసలేశమును • గైకొని మెక్కుచు నుండు నట్లు నీ
వును బెరవారికి న్వినుతు • బుద్ధులు బుద్ధి నెఱుంగ వింతయున్. 279

వ. అని శిశుపాలుండు రూక్షాక్షరవచనంబుల నధోక్షజాదుల నధిక్షేపించు చున్నసమ
యంబున. 280

మ. అలుకం బాదముఁదొట్ట మేను చలనం • బందం గనుందోయియున్
జ్వలదగ్నిప్రతిమాన మై వెలుఁగ నూ•త్నభ్రూకుటిం బెట్టి దం
డలు పొంగం బరసంబులం గొఱుకుచు • స్గల్పాంతకాలుండు నాఁ
దిలకింపం దగి భీముఁ డార్చెఁ ద్రిజగ•ద్భీమంబుగా నయ్యెడన్. 281

మ. జగ మల్లాడఁగ నట్టు లార్చి త్రుటిలోఁ • జైద్యుం గ్రసింపంగ వే
గగతిం జూపుచునున్న భీముఁ గని గం•గానందనుం డంతలో
నాగిఁ గే ల్పట్టి తెరల్చి యాఁగిన నతం • డుప్పొంగువారాశి శీ
ఘ్రగ మై వేలను దాఁటన ట్లతనిప్ర•క్కం జిక్కి యుండె న్వగన్. 282

వ. ఇట్లు క్రుద్ధుం డయ్యును గురువృద్ధవాక్యబద్ధుం డగుభీమసేనుం జూచి చలింపక శిశు
పాలుండు దుశ్శీలుం డై నవ్వుచు నాపగాతనూజున కి ట్లనియె. 283

ఆ. వినుము భీష్మ వీని♦విక్రమంబును నాప,రాక్రమంబు నిచటి♦రాజు లెల్లఁ
గని యెఱుంగఁ గలరు ♦ కనలెడునాప్రతా,పాగ్ని కితఁడు శలభ ♦ మగును జువ్వె.

భీష్ముండు భీమునకు శిశుపాలునివృత్తాంతము సెప్పుట.

వ. అమ్మాటలు విని యుమ్మలించువడముడి నుపశమింపం జేయుచుఁ బితామహుం
డతని కిట్లనియె. 285

ఆ. తెలియ వినుము చేది♦కులమున దమఘోషు,నకును సాత్వతికిని ♦ నలుకరముల
తోడ మూఁడుకనుల♦తోడ వీఁడు జనించి,నప్పు డేడ్చె రాస♦భారవమున. 285

వ. అట్టి వీనివైకృతం బుపలక్షించి వీనితల్లిదండ్రులు చింతిల్లుచుం ద్యజింపం దలంచి
యున్నసమయంబున నశరీరవాణి యిట్లనియె. 287

మ. బలవంతుం డగు వీని కెవ్వరును నో♦పరు లేరసాధారణో
జ్జ్వలతేజంబున నొప్పుఁ గావునఁ ద్యజిం♦పం బోక రక్షింపుఁ డ
వ్వల నెడ్డో యొకఁ డౌను మృత్యు వనుచున్ ♦ వాక్రుచ్చినం బుత్త్రునం
దలివాత్సల్యమునన్ జనిత్రి మిగులన్ ♦ సంతప్తయై యిట్లనున్. 288

ఉ. మ్రొక్కెద భూతమా తెలియఁ ♦ బుచ్చుము వీని కెవండు మృత్యువై
యెక్కడ నుండు నా బయలు ♦ దిట్లను నవ్వఁడు వీని నెత్తుకో
మిక్కిలికన్నుఁ జేతులును ♦ మేదినిపైఁ బడు వాఁడె వీనికిన్
దక్కక మృత్యువై యెసఁగుఁ ♦ దప్పదు నానుడి నిక్క మింతయున్. 289

వ. అని యశరీరవాణి పలికి మిన్నకుండె ననంతరంబ. 290

చ. వికృతపుబిడ్డ పుట్టె నని ♦ వీనినిఁ జూడఁగ నెల్లరాజులున్
బ్రకటితబంధుతత్పరత ♦ వచ్చిన నద్దమఘోషుఁ డెల్లవా
రికిని గుమారు నెత్తికొనఁ ♦ బ్రీతి నొసంగును గాని మింటివా
క్కొకసమయంబునం దయిన ♦ నొందఁగఁ బోదు నిదర్శనంబునన్. 291

వ. ఇట్లు కొంతకాలం బతిక్రమించె నంతట. 292

క. తమమేనయత్త సాత్వతి, కొమరునిఁ గనె ననుచుఁ జూడఁ ♦ గుతుకముతోడన్
సుముఖు లగురామకృష్ణులు, సమయమునం జనిరి చేది♦జనపదమునకున్. 293

వ. అట్లు వచ్చినఁ గుశలం బడిగి వారి నాదరించి సాత్వతి తనకొడుకుం బలరామున
కెత్తుకొన నిచ్చినవెనుకం బుచ్చుకొని జనార్దనునుత్సంగంబునం బెట్టుటయును. 294

ఉ. మిక్కిలికన్నుఁ జేతులును ♦ మేను స్పృశించినయంతమాత్ర స
మ్మక్క యనంగఁ బోయె మఱి♦మాయముగా నది చూచి త్రస్తయై

పొక్కుచు వచ్చి సాత్వతి ప్రభూతభయమ్మున వేఁడుకొంచు నో
చక్కనితండ్రి నాకుఁ గల సాధ్వసముం దొలఁగించి ప్రోవవే. 295

వ. అని భయార్త యై ప్రార్థించినం బ్రసన్నుం డయి జనార్దనుండు కరుణించి భయంబుడిగి వరం బడుగు మది శక్య మైన నశక్య మైనం గాని యిచ్చెద ననుటయు నామెయును. 296

ఆ. నీమఱంది వీఁడు నీ కనిష్ఠుం డయి, తప్పు చేసెనేని దయ దలిర్ప
సైఁచిపుత్త్రు ననుచు సద్వరం బొసఁగుము, గుణవరిష్ఠ నాకుఁ గూర్తువేని. 297

వ. అని ప్రార్థించుటయును. 298

క. అపరాధశతము సైఁచెదఁ, గృప గదుర న్మేనయత్త కీష్టముగా నేఁ
గృపణుఁ డయి వీఁడు నాకు, న్విపరీతము మొనర్చెనేని విను మిటు తల్లీ. 299

వ. అని తొల్లి వీనితల్లికి యదువల్లభుండు వరం బొసంగెఁ గావున వీఁ డన్యులచే నిహతుండు గాఁడు నూఱుతప్పులును నిండినవెనుకఁ బుండరీకాక్షుండె వీని గండడంచు నని వెండియును. 300

మ. పరిగర్వంబునఁ జేసి యీకుటిలుఁ డాత్మం తేని చింతింప కీ
శ్వరులం బోనిమహానుభావులకు నాత్మాన్వం బల్కి యెగ్గుల్ నిరం
తరముం జేయుచుఁ బోటుమానిసిబలెన్ దా విఱ్ఱవీఁగుం జుమీ
హరితేజోంశ మిందు దాని నతఁడే హార్ద oబు . ం బొందెడున్. 301

వ. అని పలికి భీష్ముండు శిశుపాలాద్యహితభూపాలు రెల్లరు విన ని ట్లనియె. 302

చ. ఖలుఁ డయి చేదిరాజు మముఁ గా దనుచుండెను వానిపక్షమం
దలరెడువారినిం దృణములట్టులు చూతుము మేము నావుడున్
గలఁగి తదీయు లీముసలి కష్టుఁడు దుష్టుఁడు వీని సైఁప రా
దలుక వహింపుదుం బశువునట్టులు పట్టి వధింపుఁ డెల్లరున్. 303

వ. అని చెలరేఁగి పలుకుచున్న సమయంబునం జే యెత్తి భీష్ముండు వెండియు. 304

మ. హరిఁ బూజించితి ముత్తమోత్తముఁ డటం చద్దానికిన్ సైఁప కె
వ్వరు మా పైఁ గను లెఱ్ఱఁజేయ నగుచున్ వర్తింతురో వార లు
ర్వర నుండం దలపోయ కున్న హరి నాహ్వానంబు గావింపుచున్
దురముం జేయ నుపక్రమింపుఁ డిఁక మాతో వాదు మీ కేటికిన్. 305

వ. అనినం గర్వించుచు గర్వాంధుం డగుశిశుపాలుం డాలంబు సేయ నెంచి వాసుదేవుని దిక్కు మొగం బయి యి ట్లనియె. 306

చ. అరయ ననర్హుఁ డైననిను నర్హునిఁగాఁ దలపోసి పాండవుల్
వరసభ నర్ఘ్య మిచ్చి తమవాసి దొలంచిరి వారితో నినున్
దురమున నోర్వ నుంటి నిదె దొడ్డ గలాఁడ పరాక్రమంబునం
బరఁగుదువేని రమ్ము నను బాహుబలాఢ్యునిఁ దాఁకు డెంచఁగన్. 307

ఆ. తగనివాని కిచుట తప్పది వారిది, తగనివాఁడు కొంట తప్పు నీది
వారు నీవు తప్పుదారిని బడితిరి, గాన వధ్యులైరి గాదె తలఁప. 308

వ. అని గర్వించి పలికిన నలుక వోడమియుం దుసుకుపడక శ్రీకృష్ణుం డెల్లవారు విన నల్లన నిట్లనియె. 309

చక్రాయుధముచే శిశుపాలుండు చచ్చుట.

సీ. వినుఁడు పార్థివులార వీఁడు ప్రత్యర్థి గాఁ, డరయంగ నామేన యత్తకొడుకు
కాని నాతో వైర మూనెఁ బ్రాగ్జ్యోతిషమున కేము దాడిపోయిన నెఱింగి
ఘాతుకుఁడై వీఁడు కాల్చె ద్వారావతి, స్త్రీబాలవృద్ధులు సిలుగు పడఁగఁ
దరుణులతో రైవతకమున భోజరాజన్యులు విహరింపఁ జంపె వారి

తే. ఘనుఁడు మాతండ్రి వసుదేవుఁ డొనరఁ జేయు,నశ్వమేధమునకు విఘ్న మావహిల్ల
నశ్వము హరించె నీపాపి ముందు బభ్రు,భార్యను హరించెఁ బాపస్వభావుఁ డగుచు.

వ. మఱియు నాపరోక్షంబున ననేకాపకారంబు లొనరించి నన్నుఁ గారించె నేనును సాత్వతి కిచ్చినబాసం జేసి యపరాధశతంబు నిండువఱకు వీనిపై నలుగ కుంటి నిపుడు మీసమక్షంబున వీఁ డాడినదురాలాపంబు లెల్ల వింటిరి కదా వీని నింక నెట్లు సైఁప వచ్చు రుక్మిణి తన్ను వరింపక నన్ను వరించుటంజేసి నాపైఁ బగవట్టి వీఁ డిట్లు ప్రవర్తించుచున్నవాఁ డని పలికిన నందుఁ గలవా రందఱు శిశుపాలు నిందించి రప్పు డట్టహాసంబు సేయుచు శిశుపాలుండు గోపాలున కిట్లనియె. 311

తే. శ్రీసమపరాక్రమా నీదు భాసురోక్తు,లెల్లఁ దెల్లంబ యిది నీదు ప్రల్లదంబు
నిగ్రహానుగ్రహములకు నీ వెవఁడవు, చొనినె నను సైఁచి కాచితె తొడరి మున్ను.

క.*నీవు ప్రసన్నుఁడ వైనం, గేవలక్రుద్ధుండ వైనఁ గృష్ణా నాకున్
నీవలన నేమి యయ్యెడు,నో విరికను దెఱవ మూఁయ నొక్కఁడు గాదే. 313

క. నా కీయ నున్నకన్నియఁ, జేకొను సిగ్గింత లేక క్షితితలమందున్
నాకంటె ఘనుఁడు లేఁ డని, వాకొందువు పంద నిన్నెవఁడు గణియించున్. 314

వ. ఇది యిట్లు కాక నీకు పరాక్రమంబ యున్నయెడల నీరాజన్యులసమక్షంబునం దొక్కమాఱు సూపుము చూత మని శిశుపాలుం డత్యంతదురాగ్రహాగ్రసుం

* విరికను = పువ్వుఁగన్ను

డయి ప్రలపించుచుండె నాసమయంబున. 315

మ.*తలఁచెం గృష్ణుఁడు నెమ్మనమ్మున జగద్రక్షాతిదక్షప్రధా
వలితావక్రము విక్రమాపహృతభవ్యద్వేషకృన్నక్రియమ్
బలదాంతాసురచక్రమున్ వరమునిట్ప్రాపాటవీశుక్రమున్
విలసద్వైభవబద్ధశక్ర మవితోర్వీచక్రమున్ జక్రిమున్. 316

తే. తలఁచునంత నిజప్రభావలి దిగంతరములు నిండ భయంకరారవము పర్వ
నరుణబింబము పూర్వాద్రి నవతరించునట్లు చక్రము కై సేసె హారికరంబు. 317

ఉ. అప్పుడు చక్రహస్తుఁ డగునచ్యుతుఁ డిట్లను నోమహీంక్షితుల్
చెప్పెద నాలకింపుఁడు నులీమసుఁ డీశిశుపాలుఁ డెన్నియోఁ
దప్పు లొనర్చె నే నితనితల్లి కొసంగినబాస పూర్ణమై
యొప్పె సహింప నింకఁ గనుచుండుఁడు మీరని చూచెఁ జక్రమున్. 318

ఆ. అదియు భూనభోంతరావకాశము నిండ, మంట లెగయ వచ్చి మానవేంద్రు
లెల్ల నరయుచుండఁ బ్రల్లదుఁ డగుశిశుపాలుశిరముఁ దునిమెఁ గూలి పడఁగ.

వ. అంత నాశిశుపాలునిశరీరంబునుండి మహాతేజం బొకటి వెడలి వచ్చి యెల్లరును వెఱఁగంది చూచుచుండ సకలజగద్రక్షకుం డగుపుండరీకాక్షునిశరీరంబునం బ్రవేశించె నాసమయంబున. 320

క. జలదములు లేక గగనము, పిడుగుల వర్షించె మిగులఁ బృథివీస్థలియున్
జలధులతో నద్రులతో, వడఁకెం జైద్యుండు కృష్ణు వడిఁ గలయంగన్. 321

తే. అందుఁ గలయట్టిరాజులు కొందఱపుడు, పలుదెఱంగులఁ బడియును బలుకరైరి
పలుకఁ గలవారు మెచ్చుచుఁ బలికిరి హరి, జయజయధ్వని రోదసీస్థలము నిండె.

తే. అంత హరి శిశుపాలభూకాంతవరుని, మృతకళేబరమును సంస్కరింపఁ బంచి
యతనిపుత్రుని చేదిరాజ్యమునకు ననురక్తిమెయి రాజు గా నభిషిక్తుఁ జేసె. 323

రాజసూయపరిసమాప్తి.

వ. అట్లు శాంతవిఘ్నంబును సుఖారంభంబును జక్రాయుధసంరక్షితంబు నై రాజసూయ మహాధ్వరవిధానంబు సమాప్తసంవిధానం బయి యున్నసమయంబున. 324

తే. అవభృథస్నాతుఁ డై సుమహావిభూతిఁ, బొంది పొసఁగుచు నానందమున నెసంగు
పాండవాగ్రజుఁ గని రాజమండలి కడు, సంతసించుచు నిట్లనె నంతరమున. 325

మ. జగ మగ్గింపఁగ రాజసూయమును శశ్వద్వైభవం బేర్పడన్
దగ సాధించి లసద్విశాలయశముం దక్షోత్త సమ్రాట్టు వై

* వక్రము = కుటిలము, క్రూరము. శుక్రము = అగ్ని.

జగతిన్ రాజులు నాజమీఢకుల మెచ్చం జేసితీ వన్నిటన్
సుగుణప్రాంచిత నీప్రభావగరిమన్ సూచింప సామాన్యమే. 326

క. ఏ మాహూతుల మై యిట, నీమహితాధ్వరముఁ జూచు నెఱి వచ్చి భవ
త్ప్రేమకుఁ బాత్రుల మైతిమి, మా మా రాష్ట్రముల కరుగ నన్నింపు మికన్. 327

వ. అనిన ధర్మనందనుండు వారి నందఱ వేఱువేఱ గౌరవించి పూజించి వీరి విషయాంతంబు వఱకు నంపిపుచ్చుఁ డని తనవారి కాజ్ఞాపించుటయు నంత భీష్మధృతరాష్ట్రుల భీమసేనుండును యజ్ఞసేను నర్జునుండును సపుత్త్రకుం డగుసుబలుని మద్రనాథుని నకులుండును కృపద్రోణాశ్వత్థామల సహదేవుండును విరాటభగదత్తుల ధృష్టద్యుమ్నుండును బార్వతేయుల ద్రౌపదేయసౌభద్రేయులును దక్కినవారిం దక్కినుం గలవారు ననిచిపుచ్చి రంత. 328

క. పూజితులై తగువిప్రులు, యాజకులు న్మునులుఁ గౌరవాన్వయతిలకున్
రాజాధిరాజు వీడ్కొని, నైజగృహంబులకుఁ జనిరి నయ మలరారన్. 329

వ. బ్రహ్మక్షత్త్రియాదు లెల్లరునుం గదలి పోయినవెనుక వాసుదేవుండును ద్వారవతికిం బయనంబయి ధర్మరాజున కిట్లనియె. 330

చ. మతిగలవాఁడ వైన నొక మాత్త్రపువాని కసాధ్య మై మహో
న్నత మగురాజసూయముఁ బొనర్చితి ధన్యుఁడ వైతి వెల్లభూ
పతులును నీవశంవదు లపారయశంబున సార్వభౌముఁ డై
ప్రతి యిసుమంత లేక ధర భాసిలుచుండుము ధర్మనందనా. 331

ఆ. నేను పోయివత్తు నీ వప్రమత్తుండ, వగుచు రాజ్య మేలు మఖిలజనుల
కరయ నరయ ననిశ మనురంజకుండ వై, మెలఁగుచుండు మరిని మిత్త్రుఁ దెలిసి.

వ. భూతంబుల నెల్లఁ బర్జన్యుండుం బోలె బంధుమిత్త్రవర్గంబుల నెల్ల నీవు పోషించి రక్షించుచుండు మనిన ధర్మజుం డతని కిట్లనియె. 333

ఉ. నీకరుణాకటాక్షమున నే నొనరించితి రాజసూయమున్
నాకు వశంవదుల్ నృపు లనారతమున్ ధర నేన మేటి నై
కైకొని సర్వసౌఖ్యము లఖండయశంబునుఁ బొంది పర్వతిన్
నాకులముం బవిత్త్ర మయి నల్వగు నోజగదేకవల్లభా. 334

క. నీవిరహము దుస్సహ మీ, నీవారికి నచటు వోక నిలు మనుటయుఁ గా
దేవలస నున్నఁ గానీ, మావలనం జూచుచుండు మా మానాథా. 335

వ. అనిన విని మనంబునం దనురక్తుం డతనిం గూడి కుంతీదేవికడకుం జని నీకొడుకు లిప్పుడు సామ్రాజ్యంబు నొంది రేను బోయివచ్చెద నని యనుజ్ఞ వుచ్చుకొని సుభద్రా

ద్రౌపదులతోడం జెప్పి యంతఃపురంబునుండి వచ్చి స్నానసంధ్యాద్యనుష్ఠానంబు లొన
రించి బ్రాహ్మణాశీర్వాదంబు లంది యంత. 336

ఉ. దారకసారథిత్వవిను ♦ తం బమలాశ్వసమేత మున్నత
శ్రీరమణీయ మంబుదవ ♦ రిష్ఠరవాఢ్యము తార్క్ష్యకేతన
స్ఫారము దేవయానసదృ ♦ శం బగుదివ్యరథంబు నెక్కి తా
ద్వారవతీపురంబునకు ♦ దారిగతిం జనె సాప్తబంధుఁడై. 337

తే. ధర్మజుఁడు తమ్ముఁగుఱ్ఱలుఁ ♦ దాను బాదచారులై పోయి కడుదవ్వు ♦ సాత్వతప్ర
వరు ననిపి వచ్చి యిచ్చమై ♦ వాని కథలె, చదువుకొనుచు సుఖంబుండె ♦ సంతతంబు.

తే.*యాగదర్శనలాలసు ♦ లగుచు వచ్చి, యున్నవారలలోన దు ♦ ర్యోధనుండు
సౌబలుండును మయసభా ♦ స్థలముమీఁది, మోహముఁ జేసి పోకుండి ♦ రీహ నచట.

వ. అని చెప్పిన విని నైమిశారణ్యవాసు లవ్వలివృత్తాంతంబు చెప్పు మని సూతు నడుగు
టయును. 340

ఆశ్వాసాంతము.

శా. †ఆధివ్యాధుల కాకరంబు తను వ ♦ త్యల్పంబు కాలంబు సం
బోధించన్ జముఁ డింతలోఁ జపలతం ♦ బొంగారి నే భారతా
గాధాబ్ధిం దరియింపఁ బూనితిని నీ ♦ కారుణ్య మన్ తేప నా
కాధారంబుగ నిచ్చి ప్రోవఁగదె దే ♦ వా నిన్ను సేవించెదన్. 341

గద్యము.

ఇది శ్రీమదధునాతనోభయకవిమిత్రి వేంకటయజ్వాగ్రిపుత్త్ర
సమారాధితవిబుధరాజ శ్రీపాదకృష్ణమూర్తి కవిరాజ
ప్రణీతం బయిన శ్రీ కృష్ణభారతంబునందు
సభాపర్వంబున ద్వితీయాశ్వాసము.
శ్రీ. శ్రీ. శ్రీ.

* ఈహ = కోరిక. † పొంగారు = అతిశయించు.

శ్రీ

శ్రీబాలాత్రిపురసుందర్యై నమః.

# శ్రీకృష్ణభారతము

సభాపర్వము—తృతీయాశ్వాసము.



శ్రీమద్వేదోపనిష
త్స్తోమస్తుత ధృతిసమస్త•సుస్థిరమూర్తీ
సోమార్కానలతేజో
ధామ లసన్నామ సర్వ•దా సర్వేశా. 1

వ. అక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లనియె నట్లు రాజసూయమహాధ్వరంబు నిర్విఘ్నపరిసమాప్తి నొంది యున్నసమయంబున. 2

ద్యూతపర్వము.

చ. ఘనుఁడు పరాశరాత్మజుఁ డ•ఖండతపోధనుఁ డేగుచుం బృథా
తనయునిఁ జూచి యి ట్లనియె • ధర్మతనూభవ నీకతంబునం
దనరెను భారతాన్వయము • ధన్యుఁడ వైతివి రాజసూయముం
బొనరిచి సర్వసంపదలఁ • బొంది సుఖింపుము సార్వభౌముఁ డై. 3

క. చనియెదము మేము శిష్యులు, ననవుడు ధర్మజుఁడు తాత • కనియె మునీంద్రా
మనమున సందియ మొండొకఁ, డొదవె నిటుం దానిఁ దీర్ప • నొప్పును మీకున్. 4

వ. నారదుండు నాకు దివ్యాంతరిక్షపార్థివంబు లను త్రివిధోత్పాతంబులం జెప్పె నందుఁ గొన్ని శిశుపాలుం డవునప్పుడ పొగడ నొప్పె వీనిఫలం బెప్పు డెప్పాట నగునో యనిన నతం డతని కిట్లనియె. 5

మ. పదుమూఁడేఁడులు దప్పకుం డత్తఱిలమున్ దప్పం జెల్లు నోరాజ నీ
కదు రెచ్చం దగు ధార్తరాష్ట్రజనితా•న్యాంతాపరాధంబునన్
త్రిదశద్వీపవతీసుతార్జునబలో•ద్రేకప్రతాపంబునం
గదనం బై మిగులన్ ధరిత్రి సకల•క్షత్రక్షయం బయ్యెడిన్. 6

మ.*ఒకస్వప్నం బగు సందుఁ జూచెదవు నీ వొంటొక్కఁడా ద్రేకడన్
సకలేశున్ భవుఁ గృత్తివాసు నభవున్ స్థాణుం గపాలిం బినా
కకరున్ దక్షిణదిక్పరీక్షకు నజుం గైలాసకూటోపమాం
గకు నుగ్రుం ద్రిపురాంతకుం ద్రినయనున్ గంగాధరున్ ధూర్జటిన్. 7

క. కాలము దురితక్రమ మెద, నేలా చింతింప దాని కీ వీపృథివిం
బాలింపు మప్రమత్తుఁడ, వై లలి నీ కగుత సంతతాభ్యుదయంబుల్. 8

వ. అని పలికి కృష్ణద్వైపాయనుండు శిష్యసమేతుం డై కైలాసపర్వతంబునకు నిర్గమించె నంతఁ జింతాశోకసమన్వితుం డై ధర్మతనయుండు వేఁడినిట్టూర్పు నిగిడించుచు. 9

క. పౌరుషముఁ జేసియు దై,వారంభం బునుగఁ జేయు టది వశ మగునే
పారాశర్యులు చెప్పిన,తెరుగ సంతయును గాక తీఁదు తెలియన్. 10

వ. అని తదర్థంబు చింతించుచుఁ దమ్ముల బిలిచి దాని నెఱింగించి యి ట్లనియె. 11

ఆ. తమ్ములార యిట్లు ద్వైపాయనుఁడు సెప్పె, చనిన దాని మదికి శాంతి చెడియె
నేమి సేయువాఁడ నెటు పొత్తు సంధియుఁ, దోఁప దెల్లప్రజకుఁ దోఁచుఁ జేటు.

క. అని సర్వక్షత్రవినా,శనముం గన నున్న నేను సన్నుతమతినే
వినుఁ డిట్టినికృతిజీవన,మున నేమిప్రయోజనంబు పొడమెడు చెపుఁడా. 13

వ. అని పలుకుచున్న పార్థివతల్లజునకు ఫాల్గునుం డి ట్లనియె. 14

క. మదిఁ జెడుచునిట్టికర్మల, ముదయింపఁగఁ జేసికొనుట యొప్పునె దేవా
యెది చేసిన నేమం బగు, నది చేయం గడఁగు మిటుల యగు టేమిటికిన్. 15

వ. అనిన ధర్మతనయుండు వెండియును. 16

మ. ఇది నామూలము నా విలంబదివె నే నీనాఁడునుం గోలె నీ
పదుమూఁడేఁడులు నేరితోఁ బరుసముల్ వల్కంగఁ బో నెట్టిపో
ముదముం జూపక సట్టు లున్నఁ గలుగం బో దేరికిం భేద మ
య్యది లేకుండిన లేదుపో దురము క్షత్రౌఘప్రణాశంబునన్. 17

వ.‡అని తమ్ములయంగీకారంబున సమయంబు చేసి పాండవాగ్రజుండు పితృదేవసంతర్పణాదికం బొనరించి కృతమంగళకార్యుం డై గృహప్రవేశంబు చేసి కొంతకాలంబు వహించి యుండె నంత నట దుర్యోధనుండును సభాదర్శనలాలసుం డయి శకుని తోడం గొన్నినా ళ్లుండి దానిదివ్యాభిప్రాయంబుల కచ్చెరుపడి మెచ్చుచు నొక్కనాఁడు తా నొక్కరుండ సభాభవనమధ్యంబునకుం జని దుర్మనుం డై సంచరించుచు. 18

* రేకడ = రాత్రిచివర. ‡ దుర్మనుఁడు = చెడ్డమనస్సు కలవాఁడు.

పాండవసభయందు దుర్యోధనుండు పరాభవంబు నొందుట.

సీ. స్ఫటికసంఘటితంబు స్థలము జలాశయం, బని వస్త్రమెగఁద్రోచికొని గమించె
స్ఫటికాంబుజములఁ బ్రస్ఫుటవాపి గనిస్థలం, బని వొచ్చి నీటిలో నారమునిఁగె
సంవృతద్వారదేశము వివృతం బని, పోరఁ దలఁ గొట్టుకొని త్రొక్కి పడియె
వివృతంబు సంవృతం బవ్వప్రదేశం బని, పడిఁ జని తలక్రిందు వడి వగచె
తే. సమతలం బున్నతం బని చక్క నడచి, యొకని మణిదీప్తిఁ బెక్కుర బ్లూహ చేసి
తె న్నెఱుంగక ఖిన్నుఁడై యున్నఁ గాంచి, పలుగురును నాల్గుతెఱఁగుల నగిరి తగిలి.

వ. ఇట్లున్న తన్నుఁ బరిహసించువారిం జూచి చూడనియట్లు కోపంబుఁ గప్పిపుచ్చి నటించుచు సుయోధనుండు విషణ్ణహృదయుండై పెబ్బెబ్బుపడం గని ధర్మతనయుండు వానికిం గట్టుపుట్టంబు లిచ్చి యంపిపుచ్చుటయు నతండు నప్రహృష్టమనస్కుండై పాండవుల వీడ్కొని హస్తినాపురంబునకుం బోయి ధర్మరాజరాజసూయంబునకును వారి యపూర్వసభాభవనంబునకును సమృద్ధికిని సహింపనోపక నితాంతచింతాజ్వరసంతప్తచిత్తుండై. 20

ఆ. కుడువఁ గునుక నొల్ల కెడ లేనితాప మంగకము లెల్ల నుడికి కములఁ జేయ
ఖలుఁడు తా వివర్ణకాయుఁడై కృశియించెఁ, నాఁడునాఁట సుకము వీడి మాఁడి.

వ. ఇట్లు సకలోపభోగవిముఖుండై దుర్యోధనుండు పాపవ్యవసాయపరాయణుండై పరులతోడం బలుక కున్నం గని శకుని వాని కిట్లనియె. 22

ఆ. వత్స యేల నీదువదనంబు కడు వాడె, వత్స లయ్యె నూర్పు నడయ నయ్యెఁ
బలుక వేల మాఱు పిలిచిన యేనియుఁ, గత మదేమి తెలుపఁగదవె నాకు. 23

క. నే నీకు ముఖ్యతముఁడను, గాన నీ శోకనితాపకారణ మెదియేఁ
గానీ నాకు వచింపుము, దానికిఁ దగునట్లు ప్రతివిధాన మొనర్తున్. 24

వ. అనిన నట్టకేలకు దుర్యోధనుం డతని కిట్లనియె. 25

దుర్యోధనుని దురాలోచనము.

మ. అకటా యే మని చెప్పవాఁడనొకొ మామా మా నాపుదాయాదికిన్
సకలోర్వీతలముల్ వశానుగము లై సమ్రాట్పదం బబ్బెఁ
ద్రికళాలోపిదు లై తమ్ములమహాశౌర్యం బవార్యంబు లై
ప్రకటించెంగద పార్థివత్వము మహేంద్రప్రస్థంబు నిల్లంబుగన్. 26

మ. సురలోకంబులయందునేఁ గలుగ దంచుం జెప్ప నొప్పిట్టిది
వ్యరహస్యాంచితగర్భకాంచనసభన్ వాస్తోష్పతిం బోల నై

చిరకీర్తిం గొని రాజసూయమును జేసెం ధర్మజుం డెల్లభూ
వరులుం గప్పము వెట్టి రర్థము లటన్ । వైశ్యుల్బలెన్ వశ్యులై. 27

చ. పరమపవిత్రుఁ డైనశిశుపాలుని సాత్వతముఖ్యుఁ డేయుచోఁ
బురుషుఁ డొకండు లేఁ డచట । భూపతు లెల్లరుఁ గోపతప్తులై
పరఁగియు నాంత్రమువోలె నుసుమవం దగి శాంతి వహించి మెచ్చి రా
క్రూరుఁడు నెదుర్పఁ జాలినటు । గన్గొనఁ బోలఁడు గాదె మాతులా. 28

చ. అరులకుఁ గల్గునట్టిసుమహత్త్వమునుం బృథివీశ్వరత్వమున్
సిరియును బుద్ధియుం బలముఁ । జెల్వమునుఁ గన్గొని లో సహించునే
నరవరుఁ డైనవాఁ డరయ । నాకిఁక వారివిపాలంబులే
శరణము లేమి సేయుదు సశక్తుఁడ నక్తిగలారు శాత్రవుల్. 29

తే. అరులబుద్ధియు నిజహైన్య । మరసి యరసి, నేను స్త్రీఁ గాను స్త్రీఁ గాక పోను తెలిసి
పోల్పఁ బూరుషుఁడను గాను । బూరుషుండఁ, గాకపో నిట్టు లుంటె లో । శోక మంది.

క. నే నసహాయుఁడ నొకఁడం, గానం బాండవులసిరులు । గనియు హరింపం
గాననివాఁడను పౌరుషహీనుఁడ నై కుంద నైతి । నిటు సుబలసుతా. 31

తే. పౌరుషము రిత్త దైవమే । పరము తొల్లి, పాండవులపట్ల నేఁ జేయు పనుల వెల్ల
వమ్ములై వారు ప్రబలులై । వఱలి రకట, పుష్పఁబాటును వచ్చెఁ బో । నాకు నిచట.

వ. దానం జేసి యిట్లు క్రోధానలదహ్యమానాంతఃకరణుండ నై పరితపించుచుం బరంబు
నొంద నున్నవాఁడ నని మాతండ్రికిం దెలియం జెప్ప మఱి శకుని యిట్లనియె. 33

సీ. పాండుపుత్రులు తమభాగధేయంబున, వఱలుచుండిరి దాన । వగవ నేల
ద్రోవది వారికి । దేవేరి లభియించె, ద్రుపదుండుఁ గొడుకులుఁ । దోడు గలరు
వాసుదేవుఁడు వారివశవర్తి నరుఁ డగ్ని,వలను గాండివాదులను బడసె
మయుఁడు వారికి రత్నమయసభాభవనంబు, గంచితభక్తి నిర్మించి యిచ్చె

తే. నధికసామర్థ్యమున వార । లరులఁ గెలిచి, రాజసూయముఁ జేసిరి । రాజు లెల్ల
మెచ్చ రారాజ నీ కిట్టి మచ్చరంబు, పుట్టి పరిదేవనము సేయఁ । బోలునె కట. 34

వ. అని మఱియును. 35

శకుని దుర్యోధను నూఱడించుట.

మ. అసహాయుండను నే నటంచు నది సత్యం బౌనె రాజేంద్ర స
ర్వసమర్థుండవు నీవు భ్రాతృశతముల్ । రాధేయుఁడున్ గౌతముం
డు సపుత్రుం డగుద్రోణుఁడుం గృతియు నేనున్ సోమదత్తాత్మజుం
డు సురు ల్లెన్ని కడ నెంచి యుండ నిటు లేలో లోనఁ జింతింపఁగన్. 36

వ. అనిన దుర్యోధనుండు శకుని కిట్లనియె. 37

తే. నీవు నీయున్నవా రట్లు నిలుతు రేని, పగఱ నోడింతు సకలభూభార మేన
తాల్తుఁ బృథివీపతులు నన్నె కొల్తు రమ్మ, హాసభాభవనమ్ము నా కగును సొమ్ము.

వ. అనిన విని శకుని సుయోధనుం జూచి వత్సా వాసుదేవద్రుపదాద్యతిరథమహారథసహాయసంపన్ను లగునప్పాండవేయుల భండనంబునఁ జెండాడుట దేవగణంబుల కైన నశక్యం బట్లయిన యుధిష్ఠిరు నెట్లు జయింప వచ్చునో యది నే నెఱుంగుదు ననిన దుర్యోధనుండును. 39

క. ఏరీతి నప్రమాదము, తో రిపులం గెలిచి జయము ధ్రువముగఁ బడయన్
నేరుతువో నీవు దానిం, గోరి నెఱిఁగింపు నాకుఁ గుదురుగ మామా. 40

వ. అనిన శకుని వెండియు. 41

ఉ. అక్షము లాడఁ బ్రీతిగలఁ డాతఁ డెఱుంగఁడు దాన నిక్కువం
బీక్షణమందునుం బిలుతు మేఁ జనుదెంచెను జూదమాడ నే
దక్షుఁడ ముజ్జగంబుల నుదారత నాతని గెల్చి నీకుఁ గా
నక్షయ మైనతద్విభవ మంతయు నింతటిలోనఁ దెచ్చెదన్. 42

క. ఇది యంతయు నీతండ్రికి, మది కెక్కఁగఁ జేసి యాజ్ఞ మనమందితిమే
నిదె యింతలోన ధర్మజుఁ, జదురున నోడించి కొందు సంపద లెల్లన్. 43

వ. అనుటయు దుర్యోధనుండును. 44

తే. నే నివేదింప శక్తుఁడఁ గాను నీవ, పోయి కురుముఖ్యునకు యథాన్యాయముగను
నిది నివేదించి యొప్పించి హృదయతాప, మాఱఁ గరుణింపవే మామ యల్లు నితని. 45

వ. అని ప్రార్థించిన సౌబలుండును దుర్యోధనుం దోడ్కొని ధృతరాష్ట్రునొద్దకుం జని తమ్మెఱింగించి యిట్లనియె. 46

మ. మనదుర్యోధనుఁ డెంతయేనియు మదిన్ మానేది చింతాపరుం
డును దీనుండయి వాడి వత్తిలుచు యుండున్ నీవు నే జెప్పఁగన్
విని రప్పించి పరీక్ష సేయవు గదా వృత్తాంత మెట్లానొకో
యని యైనం గనుఁగొవు గా యనుచు డాయం ద్రోచె దుర్యోధనున్. 47

ధృతరాష్ట్రుఁడు కొడుకువిచారం బెఱుంగుట.

వ. అంత ధృతరాష్ట్రుండు నాతని దడవి చూచి యుదరిపడి యిట్లనియె. 48

మ. ఇది యేమయ్య మహామహీశ్వరుఁడ వీవే చూడ నీయందె సం
పద లెల్లన్నిలువంబడెన్ హితులు నీ భ్రాతల్ నినుం గొల్తు రె

ప్పదమందుం దినఁ గట్ట నుండెఁ గను లోపం బెందునున్ లేదు నీ
హృదయం బిట్లు తపింప నేమిటికిఁ దం డ్రీ! నాకు వాకీయవే. 49

వ. అనుటయు దుర్యోధనుండును. 50

మ. తినఁ గట్టం గల దంచు సంతసపడన్ దీనుండు మానంబుసం
జనుతేఁ డెప్పుడు నొడ్ల మించినమహైశ్వర్యంబు శౌర్యంబునున్
గొన నెంచుం గుతుకంబె పుష్టి కయి మే ల్గూర్చు న్మహారాజ నా
మనమందుం గలచింతె యింత యనుచుం భాషింపఁగా శక్యమే. 51

తే. చిత మృతునిఁ గాల్చిపుచ్చును జింత బ్రదికి
యున్నవానిని దహియించు నెన్న నట్టి
చింత నాహృదయంబునఁ జేరెఁ బెద్ద
వ్యాధి యై మానుపం గాక వసుమతీశ. 52

క. మనచేతఁ బ్రతిష్ఠితుఁ డై, పొనరినధర్మజుఁడు నేఁడు పురుహూతుని మిం
చినవై భవంబు బుద్ధియుఁ, గొని ఘనుఁ డై యున్నవాఁడు కురుభూనాథా. 53

పంచచామరము. చతుస్సముద్రముద్రితోర్వి చక్రమందు విక్రమాం
చితు ల్ద్వితీయసోదరు ల్ప్రసిద్ధు లై ప్రవృద్ధిమై
ప్రతిష్ఠఁ గొన్నరాజలోక రాజి నొంచి కప్ప ము
న్నతిన్ గ్రహించి తెచ్చి యిచ్చినారు వైభవంబునన్. 54

ఆ. మనసపత్నులట్లు ఘనతరవైభవం,బునుఁ బొనర్చుచుండఁ గనియు వినియు
సలఁతులట్ల మేము పాలు పేది కృశియింప, వలసి వచ్చెఁ జువ్వె వసుమతీశ. 55

తే. వెలయ నెనుబదియెనిమిది వేలవిప్రవరుల కొక్కొక్కనికిని ముప్పండ్రు దాసు
లుగ నొసంగి భరించు నొప్పుగ యుధిష్ఠి,రాఖ్యుఁడు మహాగ్రహారము లందు నిలిపి.

తే. మఱియుఁ బదివేలగేస్తు లామానవేంద్రు
సదనమునఁ బ్రత్యహంబును సౌఖ్య మొనఁగఁ
బేర్మి భుజియింత్రు షడ్రసోపేతముగను
బంక్తులను గీరి బంగారుపాత్రములను. 57

ఉ. రాజకులప్రసిద్ధుఁ డయి రాజుల నెల్లర గెల్చి కప్పముల్
తేజునఁ గొన్నధర్మజుని దివ్యసవం బగువేళఁ బుచ్చెఁ గాం
భోజుఁడు రత్నకంబళస,ముత్కరమున్ గజవాజిసంఘమున్
రాజితరత్నకాంచనవ,రాఢ్యరథప్రకరంబు డంబునన్. 58

చ. విను మఱియుం గలట్టిపృథివీపతు లెల్లరు రత్నరాసులం
గొని బలి వెట్ట వచ్చి యట గొంకక యమనందనుకొల్వుకూటముం
జనుటకుఁ జోటు లేక వలిచక్కిన నిల్చిరి మూఁగి బాపురే
కని విని నే నెఱుంగ నొకకాలము నాఁటికి నంతవిత్తమున్. 59

ఉ.*ఆకరణిం బ్రవర్తిలెడు నట్టిమఖావభృథాంతమందు లో
కైకమనోహరం బగుమహాసభఁ గృష్ణుఁడు శంఖవర్యముం
జేకొని చేసె ధర్మజుని శీర్షమునం దభిషేక మారయన్
వేఁకి జనించిన ట్లయి తపించెను నాబహిరంతరంగమున్. 60

ఆ. లక్షమంది గుడువ లక్ష్మముగా మ్రోయు, నున్నశంఖ మధ్వరోత్సవదివ
సముల నెడము లేక నిముసమునకు నూఱు, పరులు మొరసె వెఱఁగుపాటు దోఁప.

ఆ. అట్టివైభవంబు నట్టిసంపదయును, నట్టిసిరియు ధనము నమరనాథు
నొద్దఁ గాని వరుణునొద్దఁ గాని ధనదు, నొద్దఁ గాని చూడ ముర్వినాథ. 62

వ. అట్టివారిసిరిసంపదలం జూచి యెట్లు సైఁచి యుండు నని బెట్టు వాపోవుచున్న శకుని
వాని కి ట్లనియె. 63

జూద మాడింపు మని దుర్యోధనుఁడు తండ్రిం గోరుట.

తే.†వగవకుము వత్స మీతండ్రి వల్లె యనిన, నశ్రమంబున ధర్మజునంతసిరియు
నోడిచి తెచ్చెద జూదంపుటుదుటు పన్ని, వానిఁ బిలిపింపు మిచటి కెవ్వలనఁ గాని.

క. అనవుడు దుర్యోధనుఁ డా, మనుజేంద్రున కిట్టు లనియె మామామ కనుం
ఘనుఁ డందుఁ జూద మాడఁగ, ననుమతి నీ వలయు మాకు నవనీనాథా. 65

వ. అనుటయు నాంబికేయుం డొక్కింత చింతించి కొడుకున కి ట్లనియె. 66

చ. తనయుఁడ నాకు మంత్రియును ధర్మవిదుండును దీర్ఘదర్శియున్
ఘనుఁడు వివేకియున్ ధిషణకల్పుఁడు నా విదురుండు వానికిన్
వినిచెద ధర్మమార్గమున వీడక మీకును వానికిన్ హితం
బనువడ నింతయుం దెలుపు నాతఁడు కార్యము నిశ్చయింపుచున్. 67

వ. అనిన దుర్యోధనుండు. 68

తే. విదురుఁ డేతెంచెనే నీకు బెదరు పుట్టఁ, జెప్పి జూదంబు వారించు నప్పు డేను
విడిచెదను మేను నీవును విదురుఁ డెపుడు, సుఖముగా భూతలం బేలుచును మనుండు.

క. నే నేమైనను గాని, మానసమున నింతచింత మనలదు నీకున్
మానుగ రాజ్యసుఖంబుల, నానుచు మీకుత్తఁ గూడి యలరెద వెపుడున్. 70

* వేఁకి = జ్వరము. † ఉదుటు = ఉద్ధతి.

వ. అని పలికిన ధృతరాష్ట్రుండును బ్రణయోక్తంబు లయిన దుర్యోధనునయ్యార్తవచ
నంబులు విని తనమనంబున నతనిం గనికరించి తత్క్షణంబ యనల్పశిల్పకళాదక్షు లగు
శిల్పికులాధ్యక్షులం బిలిపించి వారి కి ట్లనియె. 71

చ. అడరెడువేయికంబములు ♦ నద్దపుఁదల్పులు నూఱుగుమ్మముల్
కడు సొగ సైనగోడలును ♦ గ్రాలఁగ నొప్పుచుఁ గ్రోశమాత్రపుం
బొడుగు వెడల్పునుం గలిగి ♦ పొల్పగునొక్కసభాస్థలంబు పే
ర్పడ నిట మా కొనర్పుఁడు సు♦పర్వులు మెచ్చఁగ సత్వరంబుగన్. 72

వ. అని నియోగించిన శిల్పులును శతసహస్రసంఖ్యాకు లగుజనంబులం గూర్చుకొని సర్వ
ద్రవ్యంబులును సంపాదించి యత్యల్పకాలంబున నానావిధరత్నకాంచనసమంచితం బగు
నట్టిసభాభవనంబు నిర్మించి ధృతరాష్ట్రునకు నివేదించిన నతండును ద్యూతం బనర్థదా
యకం బని యెఱింగియుం గొడుకువలని ప్రేముడిం జేసి విదురుం బిలువం బంచి కార్యం
బెఱింగించుటయు. 73

విదురుండు జూదంబు తగ దని చెప్పుట.

చ. విదురుఁడు నంతయుం దెలియ ♦ విన్న యనంతర మన్నపాదముల్
పొదలఁగ మస్తకంబునను ♦ మ్రొక్కి నయంబున నిట్లు వల్కె నో
సదసదభిజ్ఞ జూడ మది ♦ సంతస మీయదు దాన భేదముం
గదిరెడు మైత్రి మై సుతులు ♦ గ్రాల నొనర్చుట పాడి నీ కిటన్. 74

క. భూతలనాథ విను సుహృద్ద్యూతం బని తలఁచి యాడ ♦ నొప్పదు దానన్
బ్రీతి చెడుఁ గలహ మొదవెడు, ఖ్యాతి చెడుం గులవినాశ ♦ మగుఁ బరికింపన్. 75

వ అనిన ధృతరాష్ట్రుండు. 76

ఉ. వారును వీరు నాసుతులు ♦ వారికి వీరికి రాదు భేద మే
కారణ మైనఁ గాని కుతు♦కం బగు నా కెద జూద మారయన్
గోరితి నాపగాసుతుఁడు ♦ కుంభజుఁ డేనును నీవునున్ సభం
దీరుచు నుండ నేడ్కి మెయి ♦ దీనిఁ బ్రవర్తిలఁ జేయు టొప్పగున్. 77

వ. అని చెప్పుచున్న విదురుండు చేయునది లేక మిగుల వగలం బొగులుచు నాపగాతనూ
జునికడకుం జనియె నంత నిట నాంబికేయుండు దుర్యోధనున కి ట్లనియె. 78

ఉ. క్షత్త బృహస్పతిప్రభృతి♦శాస్త్ర మెఱింగి హితంబు సెప్పువాఁ
డుత్తముఁడుం గురుప్రవరుఁ ♦ డొప్పదు జూదము దాన భేద మా
పత్తతి రాజ్యనాశ మగు♦నంతకు వచ్చును గాన దానినిం
జిత్తమునందు నిల్పకుము ♦ చెప్పినమాటలు విశ్వసింపుమా. 79

క. పితృపైతామహరాజ్యము, సతమై నీ కయ్యె నీవు చదివితి శాస్త్రం
బతిమానుషవైభవమున, నతిశితి నీ కింతచింత కవసర మగునే. 80

వ. అనిన దుర్యోధనుం డను. 81

దుర్యోధనుండు తండ్రికడఁ బాండవులసిరికి దుఃఖించుట.

సీ. అతిలోక మగుపృథాసుతులసంపదచెంత, నారాజ్యసంపద యలుసు గాదె
సర్వసర్వంసహాసర్వస్వ మాయుధిష్ఠిరునందె తిరమయి పరఁగె సూవె
హిమవంతమున సాగరమున నుండెడురత్నరాసు లాతనియింటఁ గ్రాలు వింటె
వైశ్యులుబలె నృపుల్ వశ్యులై వానికి, వివిధార్థములు నరి వెట్ట లేదె
తే. వింటివే తండ్రి యిట్టియవిరళభాగ్య, వైభవంబున నింద్రుఁడై వసుధ నాదు
దాయ దనరారుచుండ నే రాయఁడనని, చెప్పకొనుచు బ్రదికి యుంట సిగ్గుగాదె.

క. మును నేఁ గని విని యెఱుఁగను, జనవిభుఁ డగుధర్మరాజుసదనమునకుఁ జే
క్కొనరతనంబులపేళ్లివి, యని చెప్పం గలఁడె శేషుఁడైనం దండ్రీ. 83

చ. మఱియు వినం దగున్ మయుఁ డమానుషశిల్పకళాప్రవీణతన్
బఱ పగుమానికంబులను బన్ని యొసంగను వారికి న్సభన్
వెఱఁ గగు దానివైభవము వీక్షణముం బొనరింప వేల్పులే
నెఱుఁగరు నాఁగ వచ్చుఁ దమ రెప్పను నట్టివిమానరాజమున్. 84

చ. జలము లటంచు నాసభ లసన్మణికాంతులు సూచి పుట్టమున్
మొల కెగఁద్రోసికొంచుఁ జనఁ బోఁ గని భీముఁడు నవ్వె నట్టిచో
బలము గలాఁడఁ గామి శిశుపాలున కౌఁగిలి పట్టు నంచు నే
వెలలితి నద్ది నాహృదయవీధి దహించెను నక్కటక్కటా. 85

ఆ. మఱి జలాశయంబు మణిదీప్తి గలస్థలం, బనుచు నడచి పడితి నందు నగిరి
ద్రోవదియును విజయుఁ డావలం దడి విడఁ, దాల్ప నిచ్చె నాకు ధర్మజుండు. 86

ఉ. గుమ్మము లేక గుమ్మ మనుకొంచు నడన్ మొగమందు దక్కనం
చిమ్మట గాఁగఁ దాఁకె మణిభిత్తి కనుంగొని దవ్వులం గవల్
నెమ్మది నూఱడించుగతి నిల్చిరి నవ్వుచు భీమసేనుఁడున్
రమ్మిది మార్గ మోన్నృపవరా యని కేకిసఁ గొట్టె బెట్టుగన్. 87

వ. ఇదియునుం గాక మఱియు నయ్యక్షజంబుల విరాటుండు రెండువేలేనుంగుల నొసంగె
వసుదానుండు పర్వతోపమానంబు లగునిరువదియాఱుగజంబులును రెండువేలాజానే
యాశ్వంబు లర్పించె ద్రుపదుండు పదునాలుగువేలదాసదాసీజనంబులును నూఱువేలు

గజాశ్వరథంబులును గొంతరాజ్యంబు నొసంగె వాసుదేవుండు పదివేలదాసజనంబును బదునాలుగువేలగజంబులును మహాగజయుక్తంబు లగునిరువదియాఱుమహారథంబులును వేనవేలు మహారత్నంబులును జిత్రరథుండు నన్నూఱు వాయువేగాశ్వంబులును మఱియు నంగ వంగ కళింగ కాశ్మీర కాంభోజ కారూష బర్బర సౌవీర గాంధార పాళ మాళవ చోళ పాండ్య మగధ మద్ర కేకయ పుండ్ర ప్రముఖదేశాధీశ్వరులును బాహ్లిక తార్క్ష్య ప్రహ్లావ వశాత వాలేయకుర్కుర వశక తామ్రలిప్తదార్వాలిక కృతకాల సుబల పారద కులింద శిబి త్రిగర్త యౌధేయ శక ఖర కంక రోమశ కాళియ కైరాత దరద యవన యమ కౌదుంబర చీనాంబష్ఠ క్రౌడ్ర హార హూణ మ్లేచ్ఛాదులును హైమవంతులును నీపానూపవాసులును వంకూతీరనివాసులును బార్వతీయులును సాగరకులును లోనుగాఁ గలవా రెల్లరును గజాశ్వరథరత్నకాంచనకంబళాదినానావిధోపాయనశతసహస్రంబులు కరం బర్పించి రాజసూయదీక్షితుం డగుయుధిష్ఠిరుని సేవించిరి మఱియును. 88

క. అత్తఱి దేశములం గల, మొత్తమటం జేరె ననుచుఁ • బొగడఁగ నేలా
యుత్తరకురుపద కైలా, సోత్తరభాగములనుండియుం ధన మబ్బెన్. 89

ఆ. మాధవుండు పార్థ • మధ్యమునకు ధ, మనఁగ నేల ప్రాణ • మైన నొసఁగు
మాధవాత్మ నరుఁడు • మాధవుండును నరు, నాత్మ యనుచుఁ దెల్ల • మయ్యె నధిప.

తే. అవనిలోఁ గలయాదిమ • ధ్యాంత్యజు లగు, నెల్లజాతులవారుఁ దా • రల్ల నల్ల
ధర్మజునిరాజసూయసం • దర్శనేచ్ఛ, వచ్చి రచ్చోటి కెంతయు • వైభవమున. 91

ఉ. ఆవసుధాతలేంద్రునిల • యమ్మున నమ్మఘవాసరమ్ములన్
భావ మెలర్పఁగాఁ దినని • వాఁడును ద్రావనివాఁ డలంకృతిం
బోవనివాఁడు సత్కృతులఁ • బొందనివాఁడు నొకండు నేనియున్
భావనసేయ లేఁ డఖిల • వర్ణములందు నిజంబు వల్కితిన్. 92

తే. ఊర్ధ్వరేతస్కు లగుమహా • యోగులు పది, వేలు బంగారుపాత్రల • వేళలం ద
పుడు యుధిష్ఠిరుమఖవేదిఁ • గుడిచి రర్థి, నిష్టమృష్టాన్న మెంతయుఁ • దుష్టిగాను. 93

క. స్నాతకులుం గృహమేధులు, బ్రీతిమెయిం బంధుమిత్ర • భృత్యులు నష్టా
శీతిసహస్రంబులు యమ, సూతిమఖాంగణమునందుఁ • జూపట్టి రొగిన్. 94

క. కన వచ్చి యజ్ఞశాలం, దిన కుండిసయలఁతిఁదొట్టి • తెలియఁగ నగుభూ
జనులం దా నారయుచుం, దినిపించున్ యాజ్ఞసేని • తిరుగుచు నెపుడున్. 95

సీ. అవభృథార్థము గంగ • కరుగునప్పుడు కుంతి, పట్టిరథముఁ దోలె • బాహ్లికుండు
తెల్లనికాంభోజ • దేశరథ్యంబుల, లక్షించి కూర్చె సు • దక్షిణుండు

రథకూబరము వట్టి • ప్రమదుఁ డై నడచె నిర్నిద్రతేజుండు సు • నీథనృపతి
తనచేతధ్వజ మెత్తు • కొని వెనువెంటఁ జెచ్చెరఁ గాలినడ నేగఁ • జేదిరాజు
తే. వీకఁ బావలఁ గైకొనె • నేకలవ్యుఁ, డరయుచుం జనె సక్షముల్ • విరటరాజు
మఱియు సన్నహనోష్ణీష • మాల్యములను, మహియుధిష్ఠిరునకుఁ బెట్టె • మాగధుండు.

వ. అంతఁ గృష్ణద్వైపాయనుండును ధౌమ్యుండును జామదగ్నిసహితు లగుదేవలాసితనార దాదిదివ్యమునులం గలసి వేదమంత్రంబులు సెప్పుచుండ విశ్వకర్మనిర్మితంబును నిష్కసహస్రసమంచితం బగువారుణశంఖంబున శ్రీకృష్ణుండు ధర్మరాజు నభిషేకించె నంత. 97

ఉ. అత్తఱి మంగళార్థము సహస్రశతంబులు డంబుమీఱఁగా
నొత్తిరి శంఖవర్యములు • హోరున దిక్కులు పిక్కటిల్ల న
య్యుత్తిడికి న్వసంజ్ఞు లయి • యుండిరి పార్థివు లెల్ల నాకునుం
జిత్తము తత్తఱించె నది • చెప్పెడుపాటిది గాదు భూవరా. 98

తే. తెగువ మూర్ధాభిషిక్తులు • తెచ్చిపెట్టి, దివ్యరాసులు బహుసహస్రములు విప్ర
వర్యులకు ధర్మనందనుఁ • డార్యవినుతుఁ, డోలి నర్పించె దక్షిణా • కాలమందు. 99

క. అంచితగతి విప్రవరుల, కెంచి సువర్ణంబుఁ గూర్చి • శృంగంబులపైఁ
బంచశతగోవృషము లర్పించెం గాండీవధరుఁడు • ప్రీతి దలిర్పన్. 100

శా. శ్వేతచ్ఛత్రము పట్టె సాత్యకి యముల్ • వింజామరల్ వైచి రా
వాతప్రోద్భవుఁడు స్మరుండు వ్యజన • ద్వంద్వంబు చేఁ బూని రు
ర్వీతల్పుల్ తగఁ గొల్చి రప్పుడు కురు • శ్రేష్ఠుండు లోకత్రయ
ఖ్యాతుం డైనమహేంద్రుఁడో యనఁగ నొ • ప్పారెన్ యశఃకాముఁ డై. 101

మ. నహుషుండున్ బృథువున్ భగీరథుఁడును • న్నాభాగుఁడున్ నైన్యుఁడున్
బహుళాశ్వుండును యౌవనాశ్వుఁడును భా • స్వద్రంతిదేవుండునున్
మహిమం గొన్నయయాతియున్ మనువును • న్మాన్యాత్ము లెవ్వారునున్
మహి నాపాండవుఁ బోలి జన్న మొనరింపం బోరు నిక్కంబుగన్. 102

క. ఏవారు సాటి రా రను, దేవ హరిశ్చంద్రుఁ డిల కడిందియశముసం
గావించె రాజసూయము, భావింపఁగ నదియుఁ గొఱఁత • వడు దీని కలన్. 103

క. ఏతాదృగ్విభవమునన్, ఖ్యాతియునుం బొందె దాయ • గిరోన్నతిమై
భూతలమునఁ దనరం గని, చేతము దరికొనక యున్నె • చెప్పము తండ్రీ. 104

వ. అని వాపోవుకొడుకునకుం దండ్రి యి ట్లనియె. 105

ధృతరాష్ట్రుఁడు కొడుకును మందలించుట.

చ. వినుము కుమార నీహృదయ • వీధి విచారము పాండవేయులన్
దొడరుము వారితో నొడిపగ • తో నిటు లుంటుట పాడి గాదు వా
రొడఁబడ రాజ్యకట్టెసుగు • ణోత్తరులం గలఁగింప నెగ్గగున్
గనుసరి వీవు దుందుడుకు • నం బడ నెంచుట నీకుఁ బోలునే. 106

క. కనకమణిమయసభాస్థల, మునుఁ బొనరుచుఁ గొలువుదీర • బుద్ధియ యేనిన్
బొసరింపించితి నట్టిస, భను గని మఱిఁ గుదిరి నీవు • పరఁగుము తండ్రీ. 107

ఉ. ఆతతయాగవైభవము • నందుట కెంచితివేని యాజక
వ్రాతము నీమనోరథ మ • వశ్యము దీర్చును నీకునుం ధరి
త్రీతలనాథు లెల్లరును • దెచ్చి యొసంగుదు రర్థజాల మో
తాత సుఖంబుగన్ మను మ • దం దలపోయకు ద్రోహ మెప్పుడున్. 108

క. న్యాయార్జితవిత్తం బది, యేయెడ సౌఖ్యంబు లెంచు • నెల్లరకును స
న్యాయార్జితవిత్తము వం, శీయులకుం దనకు హానిఁ • జేయుం దలఁపన్. 109

తే. పరులదెస నో కెపుడుఁ దన • పనులయందఁ గడఁక నుద్యోగ మొనరించి • చెడుగు విడిచి
యప్రమత్తతఁ గొని విసీ • తాత్ముఁ డైన, నాఁడు భద్రంబు లందెడు • వసుధయందు.

వ. కావున నీవు నీభ్రాతృవరు లగుపాండవుల ధనార్థంబ వైరంబు పూని మిత్రద్రోహంబు
సేయక వారితో మైత్రి నెఱపి సర్వకామంబులుం దీఱి భద్రంబు లనుభవింపు
చుండు మనిన దుర్యోధనుం డను. 111

దుర్యోధనుండు కొండొకరాజనీతిం జెప్పుట.

క. తనకుం బ్రజ్ఞ యొకించుక, తనరక కేవలము శ్రుతుల • దారులు పెక్కుల్
గనువారికి శాస్త్రార్థము, పొసరదు దర్వికిని సూప • మున రుచివోలెన్. 112

క. స్వార్థము తిలకింప వెదఁ బ, రార్థమె తిలకింతు నీ వ • హర్నిశమున్ సన్
వ్యర్థముగన్ ద్వేషింతు వ, పార్థము గల్గించి యేమి • యన వలయు నినున్. 113

చ. ఎఱిఁగి యెఱింగి యిట్లు నను • నీవు భ్రమింపఁగఁ జేయుచుంటి వి
త్తఱి నిది పోలునయ్య వసు • ధాతలనాథ కుమారు నిశ్చయం
బెఱుఁగఁగనోటు లోకము న • వృత్తము కంటెను రాజవృత్తపుం
దెఱఁగు విభేద మంచు గణు • తించె బృహస్పతిధర్మశాస్త్రముల్. 114

చ. అరుల జయించి వారిసిరు • లందెడువృత్తియె ధర్మ మంచు సు
స్థిరమతి నున్న రాజులుఁ • జెందుటకుం దలపోయుఁ గాని త

ద్విరచనమం దధర్మ మని ♦ తెల్పినమాత్రన వారిమాటలన్
సరకుగొనం డెదన్ గుణవి ♦ చారణమం బని లే దొకింతయున్. 115

ఉ. శత్రుఁడు మిత్రుఁ డన్నునడి ♦ సత్కృతులం బ్రభవించు నెవ్వఁ డే
మాత్రముగాని తాప మొరు ♦ మానస మంటఁ జరించువాఁడెపో
శత్రుఁడు పుత్త్రుఁ డైనఁ దొలఁ ♦ చం జను నిం పొనరించువాఁడెపో
మిత్రుఁడు లాఁతి యైనఁ జెలి ♦ మిం గని చేకొన నొప్పు నెప్పుడున్. 116

ఆ. అరయ రాజధర్మ ♦ మైశ్వర్యములపట్ల, స్వపరబుద్ధి పట్టు ♦ వడఁగ నీదు
ద్రోహచింత యచటఁ ♦ దొడరనిచ్చుటయును, ధర్మహాని యనుచుఁ ♦ దలఁతు నెడఁద.

క. అద్రోహసమయ మొసఁగియు, భద్రరూపం బున్న ముచిఁ ♦ బరికింపక ని
ర్నిద్రాసిఁ గోసి చంపెన్, రుద్రప్రియుఁ డైనవజ్రి ♦ రూఢుం డగుచున్. 118

చ. అలఁతి యటంచు వృద్ధిఁగొను ♦ నట్టిరిపుం దలపోయ కుండినన్
బలసి జగంబునం గలుగు ♦ వారల నెల్ల నతిక్రమించి పెం
పలర నసాధ్యుఁ డయ్యెడు ర ♦ సంబె మహీరుహమూలమం దిలన్
మొలచినపుట్ట చెట్టు తుద ♦ ముట్టి నశింపఁగఁ జేయు దానినిన్. 119

క. పగతురవృద్ధి యుపేక్షింపఁగ నెప్పటికైన ముప్పు ♦ వచ్చును రోగం
బగు నల్ప మనుచు నుండిన, దిగ్భ్రంగుం గాదె నరుని ♦ దినదినవృద్ధిన్. 120

ఉ. పాండవరాజ్యవైభవము ♦ ప్రస్తుతి కెక్కెను నాఁటనాఁటికిన్
మెండయి దాని నెట్లయిన ♦ నేఁ గొన నెంచితి నట్లు గానినాఁ
డుండిన నేమి నాయసురు ♦ లూడిన నేమి భరింపఁ జాల నీ
మండెడుతాపవహ్ని కని ♦ మ్రాన్పడి యుండిన సౌబలుం డనున్. 121

చ. కలఁక యి దేల నీమదికిఁ ♦ గౌరవరాజకుమార పాండుపు
త్రుల నొకవేల్మిడిన్ గెలిచి ♦ తోకొని వచ్చెద వారిసంపదల్
ఫలకము విల్లు పాచికలు ♦ బాణము లాట రణంబు గాఁగ నే
నిలిచెద రంగమధ్యమున ♦ నీబల మేటికిఁ గార్యసిద్ధికిన్. 122

వ. అని దుర్యోధనుండు వెండియు. 123

క. ఇతఁ డుత్సహించుచుండెం, గృతి గావున జూదమాడ ♦ నిపు డాజ్ఞ యొసం
గతివేగ వారిసిరులన్, క్షితి లేక హరించు ననినఁ ♦ గౌరవవిభుఁడున్. 124

వ. నేను విదురునుమతంబున నుండువాఁడ నతండు దురోదరంబు కలహకారణం బని
వాక్రుచ్చె నాకును దానం జేసి బలవద్విరోధం బగు నని తోఁచినది కావున నీవు

ష్టారిమం ద్యూతసభఁ బోలుతత్సభ సుహృద్ద్యూతంబు వర్తించు ని
ష్కారియం దమ్ములతోడ రాఁ బిలువ నస్నంచెం బ్రియం బేర్పడన్. 135

క. ధృతరాష్ట్రుఁడు సుతు ననుమతిఁ, బ్రతి లేనివిధంబునన్ సంభ్రమం బొనరించెం
గితవులతోఁ గట జూదము, సుతు లందఱుఁ గూడి యాడఁ గూడఁ దలంచెన్. 136

చ. అనిన యుధిష్ఠిరుం డనియె నార్య మహోదర మెన్న విగ్రహం
బున కగుఁ గాన నెవ్వరును బోల దలంతురు నీవు దానిఁ బో
లున యని యెంచితే మనములో వివరింపుము మేము నీయడన్
వినయమున న్మెలంగెదము నీవె గురుండవు మాకు నన్నిటన్. 137

వ. అనిన విదురుండు వెండియు. 138

ఉ. ద్యూత మనర్థమూల మని యొప్పక పోవదు నాకు దానిపైఁ
బ్రీతిఁ దొలంగఁ జం చుమనఁ బెక్కులు చేసితి నేఁ బ్రయత్నముల్
నాతర మయ్యె నాఁ బడదు నన్నిటఁ బుచ్చెను దోడితేర ని
న్నాతఁడు వచ్చితిం దెలియ మంతయు వింతగ నంతకాత్మజా. 139

వ. మఱియు నాకర్ణింపు మట నీతోఁ జూదమాడుటకు నక్షవిద్యావిశారదులు శకుని వివింశతి చిత్రసేన సత్యవ్రత పురుమిత్రాదులు గల రందుఁ బ్రధానుండు శకుని యనిన విని యుధిష్ఠిరుండును. 140

చ. అధికభయావహుల్ కితవు లచ్చట నుండిరి పెచ్చు రేఁగి వా
రధములు మాయ వన్నఁ గల రక్కట సర్వమునుం బ్రవర్తిలు
న్విధివశమై స్వతంత్రత జనింపదు మానిసి కట్టివాని కే
విధమున నైన వచ్చెదను బిల్చిరి కావున జూద మాడఁగన్. 141

తే. శకునితో జూదమాడ నే సమ్మతింప, వాఁడు క్రూరుఁడె యెంతకే నోడఁ డకట
పిలువఁబడి ద్యూతసభ కేగ వలయు నట్టివ్రతము శాశ్వతమై నాకు వచ్చుచుండె.

వ. అని కృతనిశ్చయుం డయి తనతోఁ గాఁ దగినవారి నెల్లరా నియమించి నాఁడు గడపి మఱునాఁ డరుణోదయంబున ధర్మతనయుండు తమ్ములుం బరివారమ్మును గొలువ ద్రౌపదిం బురస్కరించుకొని బ్రహ్మపురస్సరంబుగాఁ బయనం బై పవనజవనప్రసిద్ధ మహాహయాయత్తం బగురథోత్తమం బధిష్ఠించి విదురునితో హాస్తినపురంబున కరిగి భీష్మ ద్రోణ కృ పాశ్వత్థామ సోమదత్త కర్ణ శల్య శకుని సైంధవాదిసమేతం బయి దుర్యోధన దుశ్శాసనాదికురుకుమారశతపరివృతం బయి యున్న ధృతరాష్ట్రగృహంబునం బ్రవేశించి తమ్ములుం దానునుం దల్లిదండ్రులకుం దక్కనపెద్దలకుం దద్దయు నభివందనం బొనరించి దీవెనలం బడసి తదనుమతి వేఱువేఱ విడిదల న్విడిసి రంత.

ఆ. స్త్రీశతంబుతోడ • దీపించు ద్రౌపది, నరసి కురుకుమార • తరుణు లెల్ల
సంతరంగమందు • నామెసమృద్ధికి, నోర్వఁ జాల రయిరి • గర్వ ముడుగ. 144

వ. పాండవులు నట వ్యాయామపూర్వకంబు లగునాహ్నికకర్మంబు లెల్లం దీర్చి దివ్యచందన చర్చితాంగు లై సుఖభోజనంబు గావించి వేణువీణాదిమంగళవాద్యంబు లాలకించుచు హంసతూలికాతల్పంబుల శయనించి నిద్రించి రంతఁ బ్రభాతంబునఁ గాల్యకృత్యంబు లొనరించినయనంతరంబ. 145

చ. సురుచిరచిత్రరత్నపరి • శోభిత మైనసభాస్థలంబు పెం
పరియ యుధిష్ఠిరప్రభృతు • లందఱును గితవాభిహూతు లై
పరువడి నేగి నల్గడల • భాసిలుగద్దియలందు నిల్చి త
ద్వరకృతి కిచ్చ మెచ్చుచుఁ బ్ర • వర్తిలి రెల్లరు నిష్టగోష్ఠులన్. 146

వ. అయ్యవసరంబున శకుని యుధిష్ఠిరుం జూచి యి ట్లనియె. 147

—— శకుని ధర్మజుని జూదమాడు మని కోరుట. ——

చ. నృపవర యీసభాస్థలిని • నిండిన రాజులు జూదమందు నీ
నిపుణతఁ జూచు నిచ్చ మెయి • నిల్చిరి వీరిమనోరథంబు దీ
రుపు మిదె పాచికల్ గొనుము • రో యిదు మెద్దియు నేని వేడ్క మై
నిపుడు దురోదరంబు వెల • యింపుము నింపుము సొంపుఁ బెంపునన్. 148

వ. అనిన వాని కయ్యజాతశత్రుం డి ట్లనియె. 149

ఉ. క్షాత్రము పౌరుషంబుఁ గల • జాతికి నీకితవేష్ట మక్షవి
ద్యాత్రయి నీచ మందున నిఁ • హంబుఁ బరంబుఁ జెడు న్మహాఘ మై
పాత్ర మటంచు నీ విపుడు • ప్రస్తుతి చేసెదు దాని నిస్సిరో
శత్రునివర్ధనం బద ప్ర • శంసకు సర్వ మటోయి సౌబలా. 150

తే. ద్యూతము సధర్మమునఁ జేయ • దోష మగును
ధర్మమునఁ జేయ ధర్మయు • ద్ధంబు నోజ
రాజులకుఁ బుణ్య మనుచు శా • స్త్రంబునందుఁ
దెలియ వచియించె నసితుండు • దేవలుండు. 151

వ. అనిన సౌబలుం డతని కి ట్లనియె. 152

తే. అక్షహృదయం బెఱింగిన • యతఁడు లోక, మెఱిఁగినట్టేఁడ యని వాని • నెఱిఁగి కొంద్రు
జనులు కౌంతేయ నీ కిట్లు • చనునె దాసిఁ, గడవ నాడితి నీబుద్ధి • పెడతలఁ బడె. 153

మ. బలహీనుండు బలాఢ్యునిం గెలిచి వి • శ్వప్రస్తుతుం డై యశం
బలరార న్వెలుఁగొందు నందు నికృతిన్ • భావింపఁగా నొప్పునే

విలసద్ధర్మము కాదె జూద మొనఁగన్ ♦ విజ్ఞుండు మర్మజ్ఞుఁడై
తెలివిం జూపుడు దాని మోస మని వా♦దింపంగఁ బో రెవ్వరున్. 154

క. ద్యూతమున నికృతిభయ మిట్లు, నీతలఁపున నుండెనేని ♦ నృపవర ధీరుం
డై తివిరి పొమ్ము మఱుఁగుము నా, నాతఁడు సౌబలున కిట్టు ♦ లనియెం గడంకన్. 155

శా. ఆసూతుండను ద్యూతకర్మమునకే ♦ నం దోడి పో నోపని
ట్లాహవాపోహమునన్ వచించితిని గా ♦ కెప్పైనఁ దప్పైన సం
దేహింపన్ బలవత్తరంబు విధి వే♦రే దీయంగఁ గా దిప్పు డిం
దే హంవీరుని తోడ నాడెదఁ బణం ♦ బేమో వచింపం దగున్. 156

క. నా ప్రసు దుర్యోధనుఁ డను, నే విత్తము వెట్టువాఁడ ♦ నీతో నాకై
దేవనము సేయు సౌబలుఁ, డే వలవని జాలి నాకు ♦ నిష్టుఁ డగుటన్. 157

వ. అని యనంతమణిగణంబు లొడ్డి పందెం గని యుధిష్ఠిరుం డాకనికై మఱి యొకండు జూద మాడుట విషమం బైన నే నిదె సన్నద్ధుండనై యున్నవాఁడ నని సాగరావర్తసంభవంబు లగు మణిహారోత్తరోత్తమభూషణంబు లొడ్డి యున్న సమయంబున నట నానాంబికేయపురస్సరంబుగా భీష్మద్రోణకృపవిదురులు వచ్చి యుచితాసనాసీను లై సుహృద్ద్యూతంబు ప్రవర్తిల్లం జూచుచుండి రంత. 158

ధర్మరాజు శకునితో జూదమాడుట.

ఆ. అక్షతత్త్వవేత్త ♦ యగు సౌబలుం డక్షములు గ్రహించి వ్రాలిచి ♦ గెలిచితి నని
పెద్ద కేక వైచెఁ ♦ బృథపెద్దకొడుకు కంత, మత్సరంబు వెరుఁగ ♦ మఱియుఁ దొడఁగె. 159

సీ. వరనిష్కదశశత♦భరితబహుభాండ, యుతననుకోశంబు ♦ లొడ్డి యోడెఁ
బంచపంచద్రోణ♦కాంచనసంచితా, యుతచతుశ్శతనిధు ♦ లొడ్డి యోడెఁ
సకలకలాలంకృ♦తకమనీయాంగక, యోషిత్సహస్రంబు ♦ లొడ్డి యోడె
ననుదినాతిథిభోజ♦నాదిక్రియార్థని, యుక్తదాసశతమ్ము ♦ లొడ్డి యోడెఁ

తే. తుంగగిరితుల్యమత్తమా♦తంగకోటు, లుష్ట్రగోరాసభవృషభా♦యుతము లున్న
తోన్నతస్యందనశకట♦సాహ్యసాధనము, లుత్తమాశ్వసహస్రంబు ♦ లొడ్డి యోడె.

మ. సుమనస్సంస్తుతిబంబు కాంచనమణి♦స్తోమాఢ్య మాకింకిణీ
సముదాయాంచిత మంబుదాంబుధిసమ♦స్వానంబు గత్యుల్లస
త్తురగముదాభాష్టతురంగమోహ్యము జగ♦న్నోన్మాదావహం బై నరా
జమహాస్యందన మొడ్డి యోటువడె వి♦శ్వప్రస్తుతుం డయ్యెడన్. 161

మ. అరయం జిత్రరథుండు గాండివికి ము ♦ న్నర్పించె యుద్ధంబునం
బరిభూతుం డయి ప్రీతిపూర్వకముగా ♦ భవ్యాశ్వముల్ వానిఁ ది

త్రిరికల్మాషములం బృథాతనయుఁ డుద్రేకంబుమై నొడ్డి యో
డె రుషన్ మాయలు వన్ని యాడుశకునిన్ డీలింప లే కార్తుఁడై. 162

తే. శాలితండులాన్నముఁ దిని పాలు ద్రావి, యుక్కుతునుకలవలె నుండ్రు యోధవరులు
వార లఱువదివేగు రీసారి గెలుచు,మనుచు నొడ్డి యోడెను వారి ననఘుఁ డతఁడు.

వ. ఇట్లు ధర్మతనయుండు దధర్మద్యూతంబున నాకొక్కకయొడ్డున నెల్లధనంబు లోటువడి యున్నసమయంబున సర్వసంశయనిర్మోక్త యగువిదురుండు ధృతరాష్ట్రున కిట్లనియె.

జూదమాడునప్పుడు విదురుఁడు గర్హించుట.

చ. ఖలుఁడు సుయోధనుం డితఁడు గల్గినవేళ శివారవంబునన్
బాలు పట్ల వేడ్క దుశ్శకునముల్ గన నయ్యెను బెక్కు లప్పుడేఁ
దెలిపితి నీకు వీఁడు కులతిక్తము వీడు మటంచు నీవు నా
పలుకు ముమూర్షు వౌషధముభంగి గ్రహింప వనిష్టవృత్తివై. 165

క. నక్క సుయోధనురూపము, నక్కట కోని నీగృహంబునందు మెలంగున్
మిక్కిలి కష్టం బగు నీ, కెక్కడిమోహంబొ కాని యెఱుఁగవు దీనిన్. 166

క. కలు ప్రేమించినవాఁ డవ్వలఁ బతనం బెఱుఁగనట్లు పడి పాచికలన్
బలవద్వైరముఁ గొని చెడుఁ, దలఁచె సుయోధనుఁడు సుబలతనయునికతనన్. 167

చ. ఒకనికతంబునం గులమహోన్నతి కెగ్గగుచుండెనేని వా
నికె నిధనంబు నొప్పు టది నేర్పని శుక్రుఁడు సెప్పెఁ దొల్లి దా
నికెఁ దగ భోజసంతతి జనించినవాఁ డసమంజసుండు పు
త్రకుఁ డతనిం ద్యజించె మును తండ్రి స్వరాజ్యహితంబుఁ గోరుచున్. 168

ఉ. కృష్ణునిఁ బుచ్చి యాదవులుఁ గేకయులుం గుకురాంధకాదులున్
వృష్ణులుఁ గూడి కంసు నడఁచి సుఖించిరి యట్లు నీవునున్
జిష్ణునిఁ బుచ్చి సమ్మెఁ డగునీసుతు న్నిరసించి ధర్మవ
ర్ధిష్ణువు భారతాన్వయముఁ దేర్పుము కూర్పుము నేర్పు పెర్పునన్. 169

ఉ. కాకిని వీడి కేకులను గైకొనినట్లును నక్క వీడి శా
ర్యాకరకేసరీంద్రముల సంగి యట్లును దుష్టవర్తను
న్నీకొడుకుం ద్యజించియు ననింద్యచరిత్రులఁ బాండవేయులఁ
జేకొని శోకము న్విడిచి చెన్నలరారుము కౌరవేశ్వరా. 170

చ. అడవులఁ గ్రుడ్డి సెనెడువిహంగములం గని రాజు ఖొకండు పే
ర్పడ ధనలోభ మాశకునిపంక్తులఁ బట్టి గృహంబునందుఁ గ

ట్టుడు నవి రిత్తవోయెను గ • డుంగడు నాస వెలార్చి తద్గతిన్
జెడకుము పాండవేయులకుఁ • జెడ్డఁ దలంచి తపింతు వవ్వలన్. 171

ఉ. ఒక్కొకపువ్వు గా నరసి • యొప్పఁగ దండను గూర్చువాఁడు నా
మిక్కిలి కూర్చి పాండవుల • మేలు దలంపుము బొగ్గు లేఁడువాఁ
డక్కట మూలముం జెడఁగ • నంతయుఁ గాల్చెడునట్లు గాకు మీ
చక్కనివంశముం గొనలు • సాఁగ నొనర్పుము నేర్పు పెంపునన్. 172

తే. మదట దుర్యోధనుఁడు మన • పదమునందు, క్షేమ మవలికిఁ బోవంగ • జేయుచుండె
బాలనేతలు గలనావ • లీల నెక్కి, మునుఁగ నుండెను వ్యసనస • ముద్రమందు. 173

వ. మఱియు మదించి బలీవర్దంబు గొమ్ములం గొండ విదారింపఁ గాలుద్రవ్వునట్లు
కన్నును మిన్నునుం గానక నీకొడుకు దుర్యోధనుండు బలవద్విరోధంబు గా దుష్టదు
రోదరంబు వన్నె దీనం జేసి పరమపవిత్రం బయిన భరత ప్రతీప శంతను భీమసేన బాహ్లీ
కులకులంబు పాపభూయిష్ఠం బై బడల్పడ నున్నయది నీవు దీని వారింపక కొడుకు
జూదంబున గెలిచి పాండవులసిరులు హరింపఁ గలుగునో యనియె చూచుచుంటి
వవల వచ్చునది చూడకుంటి వావృకోదరార్జునులు దేవదానవదుర్జయు లని దుర్యో
ధను నుపలక్షించి. 174

తే. పుత్త్రమోహంబునం జేసి • బుద్ధిచెడి, తండ్రి వారింపఁ డయ్యె నిన్ • ధర్మవిముఖ
మాయజూదంబునం బాండ • వేయలక్ష్మిఁ, గొనిపరాభవించుచునుంటి • గుణమె చెపుమ.

శా. నీచేతల్ గని కర్ణుఁడున్ శకునియు • న్నీతమ్ముఁడుం గాక యీ
భూచక్రంబున మెచ్చువాఁ డెవఁడు నో • మూర్ఖుండ వో రాజపు
త్త్రా చాలున్ నికృతిం బొనర్చుటలు నీ • యం చున్నవా రెల్లరున్
నీచం బీపని మాని పాండుసుతులన్ • మే లెంచి ప్రేమించుమా. 176

వ. అనినం గటకటం బడి దుర్యోధనుండు శకుని కిట్లనియె. 177

దుర్యోధనుండు విదురుం దూలనాడుట.

చ. పరులయశంబ చెప్పెదవు • పల్మరుఁ బాండవపక్షపాతి వై
నిరతము ధార్తరాష్ట్రులను • నింద యొనర్తువు బాలురం బలెన్
బోరి నవమానవాక్యములు • మున్నిడుకొంచు మమున్ దృణీకరిం
తరమగ లేక మాకు జము • నట్టిడ వైతివి చెప్ప నేటికిన్. 178

తే. పిల్లి పెనుచునాతని గ్రుడ్లు • పెఱికినట్లు, కుడిచినింటికె కడుఁ దప్పఁ • గూర్తు నీదు
పొత్తు కాలాహిపొత్తును • బోలెడుం గృతఘ్నుఁడవు నీవు నీ కాడఁ • దగదు పొమ్ము.

వ. సులభోపాయంబున శత్రులం గెలిచి ఫలం బందుట రాజధర్మంబు గా దని ధర్మవే
త్తయుం బలె వృద్ధరాజుకడ మమ్ముం బరిభవించి పరుషంబులు వలుకుచుంటి విట్లు
తగ దని వెండియును. 180

తే. అడిగినం జెప్పదువుగాని ♦ యడుగ నేను, విదుర నీనీతిశతకంబు ♦ విందు రెవరు
వితగ శ్రమపడె దేటికి ♦ వినువు మింక, మాకు బుద్ధులు సెప్పెడి♦మార్గ మీవు. 181

వ. అనిన విదురుం డి ట్లనియె. 182

క. బాలుఁడను గాను నే ననిని, నీలో గర్వంతు వేమొ ♦ నృపసుత నీకుం
బోలం జెప్పిన దిట్టిదు, బాలుఁడవుం బాలిశుఁడవు ♦ పరికింపంగన్. 183

క. మే లాసు సట్టిమి త్రుని, బోల దటం చనఁడు చెప్పగు♦పోకలఁ బసుచుం
బాలుగ నాశనో వాఁడే, బాలుఁడునుం బాలిశుండుఁ ♦ బశువును దలఁపన్. 184

క. తులువవు నీకుం దగియెను, తులువలు బోధించుసద్ధ♦తులె ప్రియతమముల్
తెలిసి వచించెసువారిల, పలుకులు నులుకులుగఁ దోఁచుఁ ♦ బలువా నీకున్. 185

మ. ప్రియముల్ నల్కెడువాని మెత్తురు జనుల్ ♦ పెన్బుద్ధి గానన్ననన్
ప్రియముం బథ్యము వల్కువాని ఘనునేఁ ♦ బ్రేమింప రజ్ఞుల్ కుమా
ర యెఱుంగిం దగు నప్రియంబువలె నై ♦ ప్రారంభమం దవ్వలం
బ్రియ మౌ నానుడి నమ్ము మేను హితుఁడన్ ♦ మీ కిందునం బల్కితిన్. 186

తే. కోపమును బ్రింగి శాంతించి ♦ పాపమతివి, గాక పెరువంశమున కప♦ఖ్యాతి తేక
విజ్ఞు లగువారివాక్యముల్ ♦ విశ్వసించి, పాండవేయుల మైత్రి మై ♦ బ్రదుకు మూర్ఖ.

చ. అనియెనఁనంత సౌబలుఁ డ♦హంకృతి మీఱ నజాతశత్రుని
గ్గని నచియించెఁ బాండవధ♦నం బది యంతయు నొడ్డి యోడి తో
డ నవర యింక నొడ్డుటకుఁ ♦ జాలి మఱేంటుధనంబు గల్గనే
యీ నభిమాని యుక్కఁ దగు♦నాతెఁడు సౌబలుఁ జూచి యి ట్లనున్. 188

మ. శకుని యే మిము నీమదిం గెలుచు ము♦చ్చన్ మానమానంగ నీ
కిఁక నర్థం బెది యందుఁ బల్కితివి కా♦వి యందుఁ గోరా నో
ట్లును హేమప్రెక్షనంబు విప్రపసను ♦ గ్రా కెల్లభూభాగముల్
సకలార్థంబులు నొడ్డి పోరువడియెన్ ♦ జంద్రాస్యమేశుం డటన్. 189

తే. మఱియునుం గలగోపులు ♦ మాపులు మహి
షములు లొట్టియ లేను లజములు కంచ
గములు లోనగునెన్నియేఁ ♦ గ్రమముతోడ
నొడ్డి యోడెను ధర్మజుం ♦ డొక టొకటిగ. 190

క. పణ మిడి యాటకుఁ దొడఁగిన, క్షణమునఁ బాచికలు దొలిచి ♦ శకుని మనమ్ములో
గణనమాత్ర మైనఁ గొంకక, రణమునబలె విజయ మంది ♦ రవరవఁ జూపెన్. 191

ధర్మరాజు తమతో ద్రౌపది నొడ్డి యోడుట.

చ. తమతమరాజభూషలను ♦ దమ్ములఁ దాను గీసి యొడ్డి పం
దెము గెలు మంచు ధర్మజుఁడు ♦ తెంపున నాడను సౌబలుండు న
క్షములను నేర్పుమైఁ గదిపి ♦ శాంబరిఁ జేసి వాని నోర్చి భూ
రమణ జయించితిన్ ధనప♦రంపరల న్మరి యొడ్డు మింకనే. 192

వ. అనిన నంత ధర్మతనయుండును. 193

ఆ. నాకుఁ గూర్చువాఁడు ♦ లోకమెల్లఁ గాఁగఁ బశ్చిమదిశావిజయము ♦ చేసినతఁడు
నకులుఁ డిపుడు ధనము ♦ నా కని యొడ్డఁగా, గెలిచె సౌబలుండు ♦ లలిగ వాని.

క. గొంతికి ముద్దులబిడ్డఁడు, సంతానములందు ఘనుఁడు ♦ సహదేవుఁడు నా
కెంతయు ధన మని యొడ్డిన, నంతటిలో గెలిచి శకుని ♦ యిట్లని పలికెన్. 195

చ. గెలిచితి మాద్రిపుత్రకులఁ ♦ గింపుల నెంచఁగ ధర్మరాజ నీ
సలిపినయం దధర్మ మగు ♦ సర్వసమర్థులు తమ్ము లుండ నీ
యలఁతుల నొడ్డి యాటువడి ♦ యంతయు నీ కయశంబు వచ్చుఁ గా
మ్మలసితి వీవు పాచికల ♦ నాడఁగ లే వన ధర్మజుం డనున్. 196

చ. దొరకొని మత్స్యయంత్ర మొక ♦ తూపున నేసినబల్లిదుండు ని
ర్జరపతి నోర్చి ఖాండవము ♦ సర్వము నగ్ని కొసంగినట్టి పో
టరి రిపులోకభీకరుఁ డ♦టన్ విజయంబునె కాంచువాఁడు మా
భరతకులప్రదీపకుఁడు ♦ ఫల్గునుఁ డిప్పుడు నాకు దో యగున్. 197

వ. అని యొడ్డి యోటువడి వెండియును. 198

మ. బకునిం ద్రుంచి హిడింబముఖ్యదనుజ♦వ్రాతంబులం ద్రుంచి కొం
చక బాహాబల మేర్పడన్ ఖలు జరా♦సంధు న్విసర్జించి భూ
మికి సౌఖ్యంబు లభింపఁ జేసినపరా♦మేయప్రభావుండు మా
మకభాగ్యోదయ మైనభీము నిట నీ♦మాయాక్షముల్ వ్రేల్వమా. 199

వ. అని యాడిన శకునియుఁ దాని నతిశీఘ్రంబునం గెలిచికొని. 200

తే. ధనము ధాన్యంబు పశువులు ♦ దాసగణము,హయగజాదులు సమస్తమ్ము ♦ లఖిలధరణి
యోడి తిం కట నొడ్డఁగా ♦ నొండు నద్ది, చప్పి యాడుము లేకున్న ♦ జితుఁడ ననుము.

వ. అనిన యుధిష్ఠిరుండును. 202

తే. తమ్ముఁగుఱ్ఱలతో నోడఁ • దలఁచి నేన, మిగిలి యుండితి సౌబల • మగుడ నేల
నన్ను నే నొడ్డికొంటిని • నాఁగ నాతఁ, డక్షములు డొల్చి యోడితి • వనుచుఁ బలికె.

తే. ఒండుధన ముండ దన్నుఁ దా • నొడ్డుకొనిన, దోష మందురు మఱచితే • ద్రుపదపుత్త్రి
కృష్ణ నీకు ధనంబు గా • కేమి దాని, బణముగా నొడ్డి గెలు మనఁ • బార్థివుండు. 204

చ. ద్రుపదునివహ్నికుండమున • దొడ్డతపోమహిమన్ జనించి తా
నపగతదోష యై జగము • నందుఁ బ్రశస్తికి నెక్కు సాధ్వి యై
యపరిమితప్రభావనిధి • యై తగు పాండవధర్మపత్ని నే
నిపుడు పణంబు గా నిడితి • నిందఱుఁ జూడఁగ నాడు సౌబలా. 205

వ. అని పందెము వెట్టుటయును. 206

క. కని ధర్మసూతిపలుకులు, విని సీ సీ యనుచు నచటి • వృద్ధులు యమసం
దనుఁ గా దని సౌబలునిన్, మనమున నిందించి రంత • మాత్సర్యమునన్. 207

క. గెలుగెల్లు మనుచుఁ బాచిక, లలఘుధ్యానంబుతోడ • నట మొరయఁగ నా
ఖలుఁ డొగి నాడుచు గెలిచితి, గెలిచితిఁ బాంచాలి ననుచుఁ • గేకలు వైచెన్. 208

సీ. అపుడు సభాస్థల • మందు హాహాకార, ముప్పతిల్లెను భయం • బుత్కటముగఁ
గురుపితామహుఁడును • గురుఁడును గృపుఁడును, నిలువెల్ల నీఱు గాఁ • గలఁతపడిరి
విదురుఁ డధోముఖు • మొదవఁ జేతులఁ దలఁ, బట్టి నిట్టూర్చుచు • బడలుపడియె
నితరసభాసదు • లెల్లరుఁ గన్నీళ్లు, విడిచిరి కాల్వ లై • వెల్లివిరియఁ

తే. కర్ణదుశ్శాసనాదులు • కౌతుకమున, నొండొరులఁ జూచి నవ్వుచు • నుండిరి ధృత
రాష్ట్రుఁ డానందమునఁ బొంది • రాజపుత్త్రులార యేమేమి గెలిచితి • రనుచు నడిగె.

వ. అనిన విని నైమిశారణ్యవాసు లవ్వలివృత్తాంతంబు సెప్పు మని సూతు నడుగుటయును.

ఆశ్వాసాంతము.

శా. ఏ స్త్రీజేనెఁడుపాట్లకై తెలివి లే • కెన్నెన్నొ పాట్లందితిన్
నానాభూముల కేగి భూమిపతుల • న్గాంక్షించి కీర్తించితిన్
గానం జాలక రిత్తవోయితిని నీ • కై వారము ల్మానితిన్
నానేరంబులు సైఁచి నన్నుఁ గరుణన్ • రక్షింపు సర్వేశ్వరా. 211

గద్యము.

ఇది శ్రీమదధునాతనోభయకవిమిత్త్ర వేంకటయజ్వాగ్రపుత్త్ర
సమారాధితవిబుధరాజ శ్రీపాదకృష్ణమూర్తి కవిరాజ
ప్రణీతం బయిన శ్రీకృష్ణభారతంబునందు
సభాపర్వంబునఁ దృతీయాశ్వాసము.

శ్రీ. శ్రీ. శ్రీ.

శ్రీ

శ్రీబాలాత్రిపురసుందర్యై నమః.

# శ్రీకృష్ణభారతము

## సభాపర్వము—చతుర్థాశ్వాసము.



సకలచరాచరభూ
తాసాదితవిష్టపత్ర◆యాంతర్వ్యాపా
వ్యాసాదివినుత పరమో
ల్లాస మహాన్యాస ఋగ్విలాసవికాసా! 1

వ. దేవా దివ్యచిత్తంబున నవధరింపు మక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లనియె నిట్లు దురోదరంబునఁ బాంచాలిం గెలిచినవెనుక దుర్యోధనుండు గర్వించుచు విదురున కిట్లనియె. 2

### విదురుండు దుర్యోధనుని నిందించుట.

క. లెమ్మోయి విదుర వేగమ, తెమ్మిట కీపాండుసుతుల దేవేరిని దా
నెమ్మోయి పెరదాసులతో, సమ్మతిపడి నాగృహమ్ము ◆ చక్కఁగఁ దుడువన్. 3

వ. అని పలికినం గనలి విదురుం డతని కిట్లనియె. 4

క. ఎగ్గాడితి నీ విప్పుడు, పగ్గెకుబలె నగ్గి కెనయు◆పాంచాలిని దేఁ
దగ్గక పనిచెదు నను నీ, కిగ్గతి పరికింపఁ బాప◆హేతువు గాదే. 5

ఆ. నీచతరుఁడ వీవు ◆ నిర్భాగ్యుఁడవు నిజముఁ, బోల్పఁ దగిన వారు ◆ భూతలమున
లేరు నీచతరులు ◆ లేరు పాపాత్ములు, లేరు కలివు లేరు ◆ లేరు లేరు. 6

క. వల దన్న జూదమాడితి, వలకేలం దాఁకఁబడిన◆వాల్మీకములన్
గలిగిత్రిని శోఁకఁ ద్రోక్కిన, బలుత్రాఁచులు నీశిరంబు◆నయి కక్కఁ బగన్. 7

క. వరవుడమునకుం దగ దా, వరవర్ణిని కృష్ణ ద్యూత◆పణముగ నిచటన్
దొరతనము లేనిదొరచే, నరయక నోడ్డంగఁ బడియె ◆ నని తెలియఁ దగున్. 8

ఆ. వెదురుఁబండువోలె ◆ విషమంపుజూదంబు, వల దటన్న నాఁడె ◆ఫలము నంద
నుంటి వే మనంగ ◆ నొప్పఁ గాలాసన్న, మగుడు నోరులపలుకు ◆ లమరి వినునె. 9

ఆ. ఒరుల నిక్కృతి సేసి ♦ యొడిసి తెచ్చినసొమ్ము, తొంటితనదుసొమ్ము♦తో సమూల
మెగిరిపోవు నట్టి ♦ యెఱుకలు వచ్చిన, ట్లిట్టి యిట్లు సేయ ♦ నెగ్గు గాదె. 10
చ. తనతలఁ ద్రెవ్వ నేయుటకు ♦ దారుణశస్త్రము కంఠసీమపై
నొనరుప దానిఁ గోపమున ♦ నొండొక మేఁక కడంగి త్రెంప నాఁ
గొని కొఱుకుం దలంప నటు ♦ కొంచె మెఱుంగవు నీవు పాండురా
ట్తనయులతోడ వైరమును ♦ దాల్చితి వెంచఁగ దాన ముప్పగున్. 11
క. శకునికృతద్యూతం బను,వికృతిపుతా తెప్ప నెక్కి ♦ వెడలినమీఁదన్
ప్రకటితగుణ మనెడుభయా,నకపారావారమందు♦నం బడుదు గొగిన్. 12
వ. అని గర్హించుచున్న విదురుం దిరస్కరించి దుర్యోధనుండు ప్రాతికామి యనుసూత
పుత్త్రుం జూచి యి ట్లనియె. 13

### దుర్యోధనుండు ద్రౌపదిం దోడితేఁ బ్రాతికామిం బుచ్చుట.

తే. భయమునఁ దు లోనఁ బాండవ♦పక్షపాతి, విదురుఁ డెప్పుడుఁ గోరఁడు ♦ వృద్ధి మాకు
నీకు వెఱ పేమి గావునఁ ♦ నీవు వోయి, ద్రౌపదిని దోడికొని రమ్ము ♦ తడయ కిటకు. 14
వ. అని యాజ్ఞాపించుటయు నతం డాశాసనంబు దలం గొని పాంచాలికడకుం జని
తన్నెఱింగించి యి ట్లనియె. 15
క. ద్యూతమునమత్తుఁ డగుచును, జేతోమోదమున నాడి ♦ చేడియ నిన్నున్
ద్యూతపణంబుగ నోడెన్, భూతలనాథుండు ధర్మ♦పుత్త్రుండు సభన్. 16
వ. దానం జేసి నీవు దుర్యోధనునిదాసి వైతి వతనిశాసనంబున నిన్ను నే నటకుఁ దోడికొని
పో వచ్చితి ననుడు నచ్చకోరాక్షియును. 17
ఆ. ఏమి యిట్లు వలికె ♦ తెవ్వఁడైనను భార్య, నొడ్డి యోటువడుట ♦ యుర్విఁ గలదె
రాజు మత్తుఁ డనఁగ ♦ రాదు వో కొండొక, కైతవంబు దీనఁ ♦ గలదు తెలియ. 18
వ. అనినం బ్రాతికామి యి ట్లనియె. 19
క. కైతవము నొందు లేదిట, ద్యూతమునం ధర్మసూతి ♦ తోరపుసిరులన్
భ్రాతలఁ దన్నును నిన్నున్, బీతనయుం డగుచు నొడ్డి ♦ వెలఁదుక యోడెన్. 20
చ. *అనవుడు యాజ్ఞసేని యను ♦ నక్కట భర్త దురోదరంబునన్
గనుకనిఁ దన్ను నోడి వెను♦క న్నను నోడెనొ నన్ను నోడి తన్
వెనుకొని యోడెనో తెలుప♦వే తెలియంబడకున్న జూదరిం
గనుఁగొని రమ్ము నిక్క మెఱుఁ♦గం బడ రాఁ దగునేని వచ్చెదన్. 21

---

* కనుకని = సంభ్రమము.

వ. అనినఁ బ్రాతికామి మగిడి వచ్చి యుధిష్ఠిరు నది యడిగిన నతండు దురోదరపరాజితుండు గావున సిగ్గుపడి నిశ్చేతనుండుబలె నుండి ప్రత్యుత్తరం బిడకున్న దుర్యోధనుండు ప్రాతికామిం జూచి యిట వచ్చి పాంచాలి సభ్యులసన్నిధిం దనసందేహంబు దీర్చుకొనుం గాని తోడ్కొని రమ్మనిన వాఁడు మరల నటఁ జని సభాసదులు నీయడిగినయర్థంబు నిర్ణయించువారై నిన్ను రాఁ బనిచి రనినం బ్రాతికామికి ద్రౌపది యి ట్లనియె. 22

మ. ఘను లాసభ్యులు ధర్మనిర్ణయము వేడ్కం జేయ రాఁ బంచినా
రనుటల్ సంతస మయ్యె నే నటకు రానావశ్యకం బైనచోఁ
జను దెంతుల్ మునుమున్న యేమిటికి నాస్థానంబు సేరంగ నా
మనము న్వారికిఁ జెప్పి ధర్మ వెసఁగింపం జేయవే సూతజా. 23

సీ. అనవుడు నొం డాడ కతఁడు సభకుఁ బోయి, పాంచాలివాక్యముల్ పలికెఁ దెలియ
వా రధోముఖు లయి పలుక రించుక ధార్తరాష్ట్రునిర్బంధంబు ప్రబలుకతన
ధర్మజుం డది గని ద్రౌపది రా నగు, నని యిష్టుఁ డగుదూత ననిచె నన్న
నతఁ డటిత్వరిత మానసతిచెంత కరిగి పార్థునినిశ్చితం బామె కొనరఁ జెప్పెఁ

తే. పాండవులు దీను లై దుఃఖభావ మెచ్చ,నున్కిఁ గని సంతసించి సుయోధనుండు
ప్రాతికామిని గని నీవు పఱచి ద్రుపదతనయ నిటఁ దోడి తె మ్మని పనిచె నంత. 24

వ. దుర్యోధనవశానుగామి యగు ప్రాతికామి పాంచాలి కోపించునో యని భీతచిత్తుం డయి మఱియు సభ్యులం జూచి కృష్ణావాక్యంబుల కేమియుత్తరం బిచ్చితి రామె కే మని చెప్పువాఁడ నని యడుగుటయు నంత దుర్యోధనుండు దుశ్శాసనుం బిలిచి యి ట్లనియె.

తే. ప్రాతికామి వృకోదరుబలమునకును, వెఱచు నల్పచేతస్కుఁడు వెడఁగు గాన
నీవు చని పట్టుకొని తెమ్ము నెలఁతమిన్న, నేమి చేయుదురో చూత మిపుడు వీరు.

వ. అని నియోగించుటయు దుశ్శాసనుండు వడివడిం జని ద్రుపదరాజపుత్త్రిం గని యి ట్లనియె. 27

తే. రమ్ము రమ్ము తలోదరి రమ్ము సభకు, ద్యూతమునఁ గెల్చికొనె నిన్ను భూతలపతి
మాసుయోధనుఁ డతని సన్మానమునను, జేరి భజియింపు మింక నీసిగ్గు విడిచి. 28

దుశ్శాసనుండు ద్రౌపదికొప్పు పట్టి సభ కీడ్చుకొనివచ్చుట.

ఉ. నా విని సంభ్రమించి సయసంబున నశ్రులు జాలువాఱ నా
ద్రోవది సాధ్వసంబునను దోరము మేను వడంక నార్తయై
బావురుగానిఁ జూచి వెఱఁ బాఱెడుకీరమువోలె వానికిన్
డావుగఁ బాఱె వృద్ధనృపతుల్ గలచోటికి మాటి కేడ్చుచున్. 29

చ.*వడివడి దుస్ససేనుఁడును । వారిజనేత్రపిఱుంద మందుఁ డై
తొడికిల సింహగర్జనము,తోడ నహంకృతి మీఱఁ బాఱె యో
పడఁతి యిఁ కెందుఁ బోయెదవు । పాండవపత్నివి గావు నీవు మా
తడవినదాసి వుంచు మని । తర్జనభర్జనముల్ పొనర్చుచున్. 30

మ.అభయుం డై కురువంశపాంసనుఁడు వాఁ । డారాజసూయాధ్వరా
వభృథంబందు సుమంత్రపూతసలిల।వ్యక్తాభిషిక్తంబు లై
సుభగస్నిగ్ధము లై మహాయతము లై । శోభిల్లుకేశంబులం
బ్రభుగర్వంబునఁ బట్టి యీడ్చె గరితం । బాంచాలరాజాత్మజన్. 31

క. నాథులు గలిగియు నామె య,నాథవలెన్ నీచుఁ డీడ్వ । నలఁగుచు వడి లో
బోధ చెడి యెట్టకేలకు, నాధృతరాష్ట్రజుఁ కట్టు । లనె మందగతిన్. 32

మ. తగ దోరీ తగ దే రజస్వలను వ।స్త్రం బొక్కఁడే తాల్చితిం
దగుపెద్దల్గలకొల్వుకూటమునకున్ । రా నొప్ప దన్నన్ ఖలుం
డగువాఁ డాయమకొప్పు వట్టి తిగిచెన్ । హాకృష్ణ హాశౌరి హా
జగదారాధ్య భరింపు మంచును మొఱం । జాగించు చున్నంతటన్. 33

వ. అట్లు తిగిచి వాఁ డాపతివ్రతాశిరోమణితో ని ట్లనియె. 34

తే. అతివ నీవు రజస్వల । వైన నేమి, యేకవస్త్రవును వివస్త్ర । వేని యేమి
ద్యూతజితదాసి వగుట మా । కూడిగములు,కలసి వరవృళ్లతోఁ బాటు।సలుపవలయు.

వ. అని దుస్సహమానుం డగుదుస్ససేనుం డయ్యాజ్ఞసేనికొప్పు వట్టి వధకుండు వధ్యస్థానంబునకు ధేనువుం దిగిచికొని వచ్చునట్లు సభాస్థలంబునకు దీడ్చుకొని వచ్చిన వివర్ణయు వికీర్ణశిరోరుహయు విచలితార్ధవస్త్రయు నై ప్రభంజనవ్యవధూయమాన మగుకదళి వలెం గంపించుచుఁ గంటికిం గడవెడనీళ్లు గా వలవల విలపించుచు నో రెండి నాలుక తొట్రువడ నవనమితాంగయష్టి యై కోపలజ్జాపరవశ యై సభాసదు లెల్లరు విన నల్లన ని ట్లనియె. 36

మ. గురువుల్ వృద్ధులు బుద్ధిమంతులు నృపుల్ । గుర్వర్థశాస్త్రజ్ఞులున్
బురుహూతప్రతిమాను లీసభఁ దగం । బొల్పొందు చున్నారు పె
క్కురు పూతాత్మకు లీసమక్షమున నా।కు న్నిల్వరా దిప్పు డి
క్కురువంశాపశదుండు తెచ్చె నిట మీ।కుం జెల్లుఁ గా దాడఁగన్. 37

చ. అనఘుఁడు ధర్మపుత్త్రుఁడు మ।హాత్ముఁడు ధర్మువు తప్పఁ డెప్పుడున్
గనఁ దగుధర్మసూక్ష్మ మది । కా దని నేఁ బరమాణుమాత్ర మా

---

* తొడికిలు = లిగియు.

జనపతిఁ జెందనాఁడుటకుఁ ♦ జాలను జాలితినే సహస్రధా
తునియలు గాదె నారసన ♦ దోషపథంబునఁ ద్రుంగి పోవనే. 38

మ. కురువీరుల్ గురుధీరు లీరును గనుం♦గో వీఁడకార్యంబు చే
కురఁ జేసెన్ సభకున్ రజస్వలను నన్ ♦ గ్రూరుండ వై తెచ్చి తాఁ
బరిభావించె నొకండు నేని యిది పా♦పం బంచు నాడంగ నీ
పరిషన్మధ్యమునందు లేఁడెటు భయ♦భ్రాంతాత్ములే యెల్లరున్. 39

మ. అకటా! యే మనుదాన నే నిచట మ♦ర్యాదం బెడం బాపుక
ష్టకృతిం గన్గొని బొమ్మలో యనఁగ నీ♦సభ్యుల్ ప్రతీక్షింతు రీ
సకలక్షత్రియలోకధర్మమును న♦ష్టం బయ్యెఁ గష్టం బయో
యకలంకం బగుభారతాన్వయము పా♦పావిష్ట మై పోయెడిన్. 40

ఆ. కురుపితామహుండు ♦ గురుఁడును విదురుండు, సత్త్వహీనులట్లు ♦ చాల రైరి
వృద్ధరాజు లైన ♦ విని దీని వారింప, రైరధర్మ ముగ్ర ♦ మనుచు నాఁడి. 41

వ. అని సకరుణంబుగం బలికి పాంచాలరాజపుత్త్రి త్రపాకోపసమీరితంబు లగునిజకటాక్ష పాతంబులఁ గోపపరీతచేతస్కు లగుభర్తలం దిలకించుచు వారికి నపారం బగుదుఃఖం బినుమడింపం జేయుచుండె నపుడు దుశ్శాసనుం డాడలు మఱచినట్లున్నకృష్ణం జూచి యోసీ ధార్తరాష్ట్రదాసీ యని సంబోధించుచు నట్టహాసంబు గావించె నంగ రాజు నామాట కంగ ముప్పొంగ హర్షించి మేలు మే లని మెచ్చుకొనియె శకునియు నభినందించె నన్యు లగుసభాస్తారు లాయమం జూచి దుఃఖించి రంత శాంతనవుండు కౌంతేయధర్మపత్నిదిక్కు మొగం బై యి ట్లనియె. 42

తరువోజ. సుదతిరో విను ధర్మ♦సూక్ష్మత్వకతన ♦ సారిది నీప్రశ్నంబు ♦ చూచియు లోన
నిదమిద్ధ మని నిర్ణ♦యింపఁగ లేక ♦ యిటు లూరకుంటి నే ♦ నెవ్వఁడుఁ దన
యది గాని పణ మిడఁ ♦ డతివలు పతికి ♦ నగుధను మది కాన ♦ నతఁ డొడ్డె యోడె
నది జూదమందు నే♦ర్పరి గెల్చికొనియె ♦ నట నిష్కృతియు లేద ♦ యను ధర్మజుఁడును.

వ. అనిన విని ద్రౌపది యతని కి ట్లనియె. 44

తరువోజ. అకట నీ కిట్లాడ ♦ నగునె ధర్మజ్ఞ ♦ యక్కృత ప్రయత్ను నీ♦యమసూతిఁ బిలిచి
నిష్కృతి సేయుచుఁ గాదె ♦ నేర్పరు లెల్ల ♦ నిలిచి మొక్కటిగ వీ♦నిం గలఁగించి
సకలధనంబులు ♦ సంసన్నుఁ గొనిరి ♦ జగతిలో ధర్మంబు ♦ చను నొండుజనుఁడు
ప్రకటంబుగాఁ దన్నుఁ ♦ బణమిడియోడి♦పై నొడ్డ నొడ్డఁ దాఁ♦ బ్రభువు గాఁ డరయ.

వ. ఈయర్థంబు నిర్ణయించి పలుక నిందలికురువృద్ధు లెల్లరు నర్హు లని పలుకుచుం బలవించు చున్నంత దుస్ససేనుండు విరసుం డై పరుసంబులు వలికె నాసమయంబున విప్రస్త

చేలాంచల యగుపాంచాలిం బ్రతీక్షించి వృకోదరుండు శోకవ్యాకులితచిత్తుం డై
తత్తఱంపడి ధర్మతనయున కి ట్లనియె. 46

తే. ఇంట నుండిన తొత్తులనేని గరుణ, సరసి కితవులు జూదమ్ములందు వారి
నోయిడఁగ నెంచ రెప్పుడు ద్రుపదపుత్రి, వాండ్రకన్న నలంతి గావలసి వచ్చె. 47

మ. ధనధాన్యంబులు వస్తువాహనములుం దత్తన్మహాగేహముల్
ఘనరాజ్యమ్మును మమ్ము నిట్ట బణముగాఁ గల్పించి కోల్పోతి వై
న సహించెద నొంనర్పఁ జెల్లు నిటు మానం బింత యే లేక మా
నిని దాయాదులదాసిగా నొసఁగుటల్ నీబోంట్లకుం ధర్మమే. 48

చ. కటకట భూతలేశ్వరునికన్నియ యై జగ మేలఁ జాలును
త్కటయశు లైనవారలకుఁ గామిని యై మహిమం దలిర్చునీ
చటులదృశం దలోదరిని సాధ్విని గృష్ణను జేతులార స
త్కుటిలులబారిఁ ద్రోచితివి క్రూరకిరాతుఁడ వీవు చూడఁగన్. 49

క. ఈచేతకు నాచేతము, నేఁ జెడికోపంబు సైఁప నేఁ జాల నికన్
నీచేతులు గాల్చెద నని, త్రేఁచుచు సహదేవు నగ్నిఁ దెమ్మని పిలిచెన్. 50

వ. అట్లు క్రోధపరవశుం డయి యున్నవడముడికిం గవ్వడి యి ట్లనియె. 51

ఉ. ఎన్నఁడు నిట్లు వల్క విటు లేరికిఁ బెద్దల నొవ్వఁ బల్కి నీ
కున్నది ధర్మగౌరవ మయో పెఱసంగతి వెచ్చపెట్టె దో
యన్న మనంబునం గినుక సందఁగనీయక ధర్మమార్గమం
దున్నటు లుండు మ ట్లయిన నొప్పగు నీకును మాకు నెప్పుడున్. 52

ఉ. ధర్మతనూజుఁ డెప్పుడును ధర్మువు తప్పఁడు తప్పెనే జగ
త్కర్మము తప్ప నట్టిబహుధార్మికుఁ డీతఁడు వీరు పిల్వఁగా
నిర్మలరాజధర్మమున నిల్చుట వచ్చెను జూదమాడ దు
ష్కర్మ మ దిట్లు తెచ్చె నలుకం గొన కీతనితప్పు చెప్పమా. 53

వ. అని చెప్పిన నప్పుడు భీమసేనుండు తనతప్పు తెలిసికొని పశ్చాత్తాపతప్తుం డయ్యె
నట్లు మిగుల వగలఁ బొగులుపాండవులను గ్లిష్టమానయగుపాంచాలిం జూచి
వగచుచు ధృతరాష్ట్రపుత్త్రుం డగువికర్ణుం డెల్లవారు విన ని ట్లనియె. 54

—●●◆ వికర్ణుండు ద్రౌపదీప్రశ్నంబునకు సదుత్తరం బిచ్చుట. ◆●●—

చ. అడిగెను సభ్యులార మిము సందఱ ముందఱ ధర్మనిర్ణయం
బడరఁగఁ జేయుఁ డంచు ద్రుపదాత్మజ దానికి నుత్తరంబు మీ

రిడఁ దగు నీయకుండిన నో♦కించుక యేనియుఁ దప్పు నిచ్చినన్
బడుదురు నారకవ్యథలఁ ♦ బండితు లైనను బాపభాక్కులై. 55

వ. అని పలికి యంతన శోక క్రుద్ధుం డై కురువృద్ధు లైనభీష్మధృతరాష్ట్రవిదురులును నాచార్యు లైనకృపద్రోణులును నానాదేశాగతు లైనమహీపతులును దక్కినవారునుం బ్రత్యుత్తర మీయకున్నం దెగడి మొగంబు బిగియఁబట్టి హస్తనిష్పీడనంబు చేయుచు మీరు సవిమర్శంబుగ ధర్మనిర్ణయంబు చేసి చెప్పరయేని నే నిదె చెప్పెద వినుం డని మఱియును. 56

తే. త్రాగుడును వేట జూదంబు ♦ గ్రామ్యరక్తి, యనఁగ నాలుగువ్యసనముల్ ♦ గొని జనుండు
ధర్మువుం దప్పి మెలఁగెడు ♦ ధరణి వాని, కృత్యముల్ చేకొనం దగ ♦ దెవరి కైన. 57

చ. వ్యసనరతుండు ధర్మసుతుఁ ♦ డందు సమర్థులు వీరు జూదరుల్
వెసఁ బిలువంగ వచ్చి కడు ♦ వీఁగియు నేగురకున్ సమాన మై
నసతి జితుండు దా నయి ప♦ణం బిడె గెల్చితి నంచు సౌబలుం
డెసఁగెఁ గనం జయింపఁబడ ♦ దీయమ యంచు మదిం దలంచెదన్. 58

వ. మఱియు రజస్వలయు నేకవస్త్రయు నగుగేస్తురాలి నిట్లు సభాగేహంబునకుం దెచ్చుటయు నన్యాయం బని పలుకుచున్నసమయంబున. 59

మత్తకోకిలము. మేలుమేలు వికర్ణ మిత్రు న♦మిత్రు నొక్కతెఱంగు గాఁ
బోలఁ జెప్పితి ధర్మనిశ్చయ♦ముం దలంపఁగ నిందు నిన్
బోలువాఁ డొకరుండు లేఁ డతి♦మూర్ఖుఁ డీనుబలాత్మజుం
డేల త్రెళ్లఁ డటంచు నాసభ ♦ నెంత యే రొద వుట్టెఁబో. 60

వ. అంతఁ గొంతవడి కక్కలకలం బుడిగినవెనుక వికర్ణునిం జూచి కర్ణుండు క్రోధమూర్ఛితుం డై యి ట్లనియె. 61

తే. చాలుఁ జాలు వికర్ణ నీ♦సాహసంబు, పోడమె నీకడఁ బెక్కులు♦బూమె లకట
పుట్టినింటికె మృత్యువు ♦ గట్టు నుంటె, అరణినిం బుట్టి కాల్చెడు ♦ వహ్ని యట్లు. 62

తే. ఒం డెఱుంగనికొండిక♦వో వికర్ణ, నిండుకొని యున్నయీసభ ♦ నీవు ధర్మ
శాస్త్ర మొలికెతి దోషజ్ఞ♦సార్వభౌము, నట్లు నీ కింత యేమిటి ♦ కిట్లు చెప్ప. 63

ఆ. యాజ్ఞసేని కోరి ♦ యడిగిన నిం దున్న, వారు పెద్ద లెల్లఁ ♦ బలుక రారు
ధర్మవిజిత యనుచుఁ ♦ దారు కృష్ణ నెఱింగి, యున్నవార కాన ♦ నోర్నెడంగ. 64

సీ. విజిత నీకృష్ణ స♦విజిత యం టది యట్టి, దైన విజిత యంచు ♦ ననుమతింతు
రెట్లు పాండవులు దా ♦ రట్లు తదగ్రజుం, డోలి సర్వస్వమ్ము ♦ నొడ్డి యోడె

సం దీమె చేరిన • యదియ కావున నిప్డు, ధర్మవిజిత యంచుఁ • దలఁపఁ దగదె
యొంటిపుట్టముదాని • నోలగంబునకుఁ దె,చ్చుట పాడి గా దంటి • విటులు వినుము
తే. సతికి నొకభర్త దైవవి•హితముఁ డనేక,వశగ కాన బంధకి యున•వచ్చు దీని
నేకవస్త్ర యనఁగ నేల • నిటకు విగత,వస్త్రఁగాఁ జేసి తెచ్చినఁ • బరము చెడదు. 65

దుశ్శాసనుండు ద్రౌపది కట్టినపుట్టం బొలుచుట.

వ. అని వికర్ణుం బదరి కర్ణుండు దుశ్శాసనుం జూచి మన కీబాలభావునితోడ నేమి నీ వీపాండవేయులయు ద్రౌపదియుఁ బుట్టంబు లొలిచికొను మనిన విని పాండవులు తమ తమపై పుట్టంబులు దీసి మునుమున్న దుశ్శాసనునెదుటం బెట్టి రంత నంతకసన్నిభుం డగుదుస్ససేనుండు పాంచాలిపాలికిం జని యామె కట్టినపుట్టంబు వట్టి బలాత్కారంబున నూడ లాగుచున్నతఱిఁ జేయునది లే కప్పరమపతివ్రతాశిరోవతంసంబు తనపరిశుద్ధాంతరంగంబున శ్రీకృష్ణదేవు నిడికొని యి ట్లని ప్రార్థింపం దొడంగె. 66

శ్లో. హా కృష్ణ! హా కృష్ణ! హా కృష్ణ! కృష్ణ!, హా నాథ! హా నాథ! హా మానసనాథ !
హా ద్వారకావాస! హా లోకవాస!, హా దేవ! హా దేవ! హా దేవదేవ! 67

శా. ఓకారుణ్యపయోధి యోవరద యో•యోగీంద్రహృద్వాస యో
లోకైకస్తుత యోరమారమణ యో•లోకత్రయాధీశ్వరా
యోకంసాంతక యోసురేంద్రవరదా • యోదైవచూడామణీ
యోకృష్ణా మధుసూదనా యదుపతీ • యోవాసుదేవా హరీ! 68

ఉ. ఎక్కడ నుంటి వోయి జగ•దీశ్వర నీ విటు రాఁగదోయి వీఁ
డెక్కడివాఁడొ కాని యొక•హీనకిరాతుఁడు నన్నుఁ బట్టె నా
కిక్కడ దిక్కు లేదు ఖలుఁ • డిందఱు నూడఁగ మానభంగముం
దక్కక సేయుచుండె నిటు • తాఁగఁ జాల ననుగ్రహింపవే. 69

చ. ఖలులు సుయోధనాదు లగు•కౌరవు లెల్లరుఁ గావరిమ్మునన్
బలసి ననున్ రజస్వలను • బట్టి సభాస్థలి మానభంగమున్
సలుపఁగ నున్నవా రిదె వె•సం జనుదెంచి మదీయదుఃఖమున్
వెలలఁగఁ జేసి ప్రోవఁగదె • వే మురమర్దన యోజనార్దనా! 70

మ. అని పాంచాలి యదూద్వహు న్మనమునం • బ్రార్థింప లోకేశ్వరుం
డును లోకజ్ఞుఁడు లోకరక్షకుఁ డుపేం•ద్రుం డింద్రముఖ్యామర
ప్రణతుం డాగ్రజనావనప్రియుఁడు త•ద్వాక్యంబు లాద్వారకన్
విని శయ్యన్విడి వచ్చె నచ్చటికి సా•ధ్వీశుద్ధహృద్వీధికిన్. 71

మ. అతఁ డంతర్హితుఁ డై సభాస్థలమునం దాకాశరూపంబునన్
స్థితిఁ గైకొంచు సతీవతంసమున కీర్తింపంగ నై యక్షయాం
చితవస్త్రంబు లనుగ్రహించి వర మిచ్చెం గాచి రక్షింప నీ
క్షితి ధర్మంబున దేవుఁ డుండు ననుచుం జెప్పంగ నాలింపమే. 72

మ. పరిధానంబును బట్టి యట్టు లపు డప్రాజ్ఞుండు దుశ్శాసనుం
డురుశక్తిన్ సడలించునంత మెయి వేఱొక్కండు వస్త్రంబు త
ద్వరరూపంబున నొప్ప వాఁడు వెఱఁ దద్వస్త్రంబును నీడ్వ ముం
దరయ ట్లామె మఱొక్కచేల మమరెన్ దళ్కొత్తె నబ్రంబుగన్. 73

శా. ఆనీచుం డటు కన్నుఁగాన కెదలో నామానినీమానభం
గానూనేష్టతమై మఱి న్మఱియుఁ జేలాకర్షముం జేయుచున్
నానారాగవిరాగవస్త్రచయ మొన్నం బర్వతప్రాయమై
కానం బొల్చె నటం బడెన్ హలహలాక్రాంతారవం బెంతయున్. 74

వ. అంత దుశ్శాసనుండును గొండపోడువుగం బడినవస్త్రరాశిం జూచి సిగ్గుపడి మఱియు నొలువంగ నోపక శ్రాంతుండై యుక్కుదక్కి దిక్కులు సూచుచుండె నయ్యవసరంబున. 75

చ. ఇది పరమాద్భుతంబు గన నీద్రుపదాత్మజ లోకమేల ని
ట్లాదవిపర్యయాదిశక్తి పరమోత్తమురాలు భజించువారి కా
పదలు దొలంగు నీచుఁ డిటు పాపము చేసెను దీనిమూలమై
పదుగురు పాడు గావలసివచ్చు నటంచు వచించి రెల్లరున్. 76

వ. ఆసమయంబున భీముండు భీముండో యనం గ్రోధతామ్రాక్షుండును విస్ఫురమాణోష్ఠుండును దంతసందష్టదారుణముఖుండును నై సకలరాజలోకమధ్యంబున లేచి కరనిష్పీడనంబు సేయుచు సంరంభించి బృహద్భీషణస్వనంబున నెల్లరు వినునట్లుగా ని ట్లనియె. 77

## భీముండు ప్రతిజ్ఞ పట్టుట.

మ. వినుఁడో క్షత్రియులార మీ రిపుడు వీక్షించుచుండంగ మా
వనితన్ ముట్టి పరాభవించె ఖలుఁ డీపాపాత్మునిం బట్టి నే
ననిలో నెల్లరుఁ జూచుచుండ నురమున్ హా హా యనం జీల్చి త
జ్జనితానంతకవోష్ణరక్తమును నాస్వాదింతు నుగ్రుండ నై. 78

వ. అట్లు సేయనినాఁడు పితృదేవతలగతిం గానివాఁడ నగుదు ననిన రోమహర్షణంబు లగువానిరౌద్రవాక్యంబులు విని పరమాద్భుతభరితాంతరంగులు దిక్స్తబ్ధముఖరిత

ముఖులునై సభాస్తారులెల్లరు భీమసేనుం బ్రశంసించి ధృతరాష్ట్రాదులం దూఱి ద్రౌప
దీప్రశ్నంబున కుత్తరంబు సెప్పనికురువృద్ధులం గా దనుచుండి రవుడు లేచి చేతు లెత్తి
సభాసదులకలకలంబు వారించి ధర్మస్వరూపుం డగువిదురుం డెల్లరు విన ని ట్లనియె. 79

విదురుండు కశ్యపుండు చెప్పినధర్మసూక్ష్మంబు చెప్పుట.

తే. ఆర్తయై ద్రౌపదీదేవి • యడిగెఁ బ్రశ్న, మెవరు దానికి నుత్తర • మిడరు సభల
ధర్మమును దెల్పకుండుట • తగవు కాదు, గానఁ బ్రత్యుత్తరం బిడ • నౌను మీకు. 80

క. చదురునకు వచ్చి మండెను, హృదయంబున నగ్నివోలె • నెవఁ డార్తిపడున్
సదయులు సభ్యులు వానికిఁ, బోధింపం దగును ధర్మ • మునఁ బ్రశమనమున్. 81

తరళము. మనవికర్ణుఁడు ప్రజ్ఞకుం దగ • మాటలాడి యథావిధిన్
మనకుఁ దెల్పెను ధర్మసూక్ష్మము • మార్గ మిట్టిది యంచు మీ
రును యథామతి నేర్పరింపుఁడు • ద్రౌపదిం గరుణించి క
ల్గును సభాసదులార మీ కతి • లోకకీర్తి ధ్రువంబుగన్. 82

ఆ. ఎఱిఁగి ధర్మ మడుగ • నిదమిద్ధ మనకున్న, ననృతఫలమునందు • నర్ధ మందు
ధర్మ మెఱిఁగి వేఱు • దారిఁ జెప్పిన సభ, ననృతఫలము సర్వ • మందు నరుఁడు. 83

వ. ఈయర్థంబు తేటపడ నొక్క యితిహాసంబు గల దాకర్ణింపుఁడు తొల్లి ప్రహ్లాదపుత్త్రుం డగువిరోచనుండు నంగిరఃపుత్త్రుం డగుసుధన్వుండు నొక్క కన్యకాపరిగ్రహకారణంబున వరిష్ఠుండ నేను నే నని తమతమప్రాణంబులు పణంబులు చేసికొని పలుకుచుం బెద్దవాదు పెట్టుకొని వా రిరువురును బ్రహ్లాదునికడకు వచ్చి తమవాదం బెఱింగించి ధర్మవిదుండవు నీవు పక్షపాతంబు విడిచి మాతారతమ్యంబు నిర్ణయింపు మట్లు నిర్ణయింపనినాఁడు నీశిరంబు శతధాభిన్నం బగు ననుసుధన్వునిమాట కతఁ డశ్వత్థపర్ణంబువలె వ్యథితుండై కశ్యపునికడకుం బోయి ధర్మప్రశ్నంబు వచ్చినప్పు డెఱిఁగి చెప్పనివానికిని దప్పు చెప్పినవానికిని నెట్టిలోకంబులు గలుగు నని యడుగుటయుఁ గశ్యపుండును. 84

సీ.*ఎఱిఁగి చెప్పక యున్న • మఱియొకలాగునఁ, జెప్పిన ధర్మజ్ఞ • శేఖరుఁడును
వినుకలిం గనుకలిం • గనినయర్థము కూట, సాక్ష్యంబు సెప్పిన • సాక్షియు నొగి
వరుణపాశసహస్ర • బద్ధులై యేఁటేఁట, నొక్కొక్క పాశంబ • యొత్తిగిల్లఁ
జెవులుఁ గన్నులుఁ జెడఁ • జెన్నఱి వేయేండ్లు, నారకవ్యథ లంది • నవయుదు రది

తే. తలఁప ధర్మ మధర్మవి • ద్ధం బయి సభఁ, దనరఁ దీర్పనిసభ్యు ల • ధర్మవిద్ధు
లగుదు రయ్యఘమందు సే • డర్ధముఁ గొను, గర్త పాదము సభ్యులు • కడమ గొండ్రు.

* కను = తెలియు.

క. తప్పెత్తఁగి చెప్పి రేనియు, నప్పుడు తత్పాప మెల్ల • నగుఁ గర్తకు నా
చెప్పినవారికి దేనికిఁ, దప్పక పుణ్యంబ యగును • దానవనాథా. 86

వ. మఱియు నధర్మంబు ధర్మం బని చెప్పినవారు పరావరంబు లగునేడేఁడుతరంబులవారి యిష్టాపూర్తులం గొట్టుటయు కాక సకలధనంబుం గోలుపోయినవారును గొడుకు చచ్చినవారును ఋణంబు చేసినవారును నుద్యోగం బూడినవారును విధవ లగువారును బందిం బడినవారును నపుత్త్రకు లగువారును వాల్మీకంబు మూర్కొన్నవారును సవతిపోరు గలవారును సాక్షినిహతు లగువారును లోనగువా రెట్టిదుఃఖంబు లనుభవింతు రట్టిదుఃఖంబు లనుభవింతు రని త్రిదివేశ్వరులు చెప్పుదురు గావున సర్వవిధంబుల సత్యంబు చెప్పవలయు నని కశ్యపుండు చెప్పిన విని ప్రహ్లాదుండు విచారించి విరోచనునికన్నం బెద్దఁ జేసి సుధన్వుం జెప్పె సుధన్వుండును బుత్త్రస్నేహంబు పరిత్యజించి చెప్పితివి గావున నీకుం గరుణించితి నీకొడుకు నూఱేండ్లు జీవించుఁ గాక యని పణంబు వీడుకొని ప్రహ్లాదుం బ్రశంసించె నట్లు మీరును ద్రౌపదీప్రశ్నంబున ధర్మనిర్ణయంబు సేయుం డనినఁ బార్థివు లెల్లరు దుర్యోధనునివలనిభయంబునం బలుక కుండి రంత కర్ణుండు దుశ్శాసనుం జూచి దాసి యగుద్రౌపది నీసభామధ్యంబునకుం దోడికొని రమ్మనిన సమ్మతించి వాఁ డామెం బట్టి కర్షించి ధర్షించినం బడి దుఃఖించుచు ద్రౌపది యి ట్లనియె. 87

ద్రౌపది తనపురాభవంబునకు దుఃఖించుట.

మ. అపు డారీతి స్వయంవరంబునను ది • వ్యప్రాభవం బేర్పడన్
సుపరిష్కారపరిష్కృతాంగ నగుచున్ • శోభించి రంగస్థలిన్
నృప దళ్కొత్తఁగ రాజమండలము వీ • క్షింపంగ నై యున్న నే
నిపు డీరీతిని వీరికంటఁ బడ నై • యి ట్లుంటిఁ గా దైవమా. 88

తే. ఎప్పుడు వరవుల్లుడిగముల • నెఱఁగుచుండ, నెండకన్నును వానక • న్నెఱుఁగకుండ
నంతిపురముల విహరించు • నట్టినాకుఁ, బరులయూర్పులఁ బడి కుంద • వలసె నకట. 89

చ. మలయభవంబు గానియొక • మాత్రపుగాలియుఁ దాఁకనేని నా
కెలమి సహింపనట్టిదొర • లీబలవంతులు పాండవుల్ ననుం
దులువ స్పృశించి యీడ్చినఁ గ • నుంగొను చుండిరి సైఁచి వృద్ధరా
జులు నిది కాదటం చలుగఁ • జూడరు కాలవిపర్యయం బయో. 90

తే. ఆఁడుదానను నన్నిట్టు • లడల నడల, నీడ్చికొనివచ్చి పుట్టముల్ • విడ్చి వీఁడు
తేఁడు లెల్లరు నిట మూఁగి • చూడఁజూడఁ, గౌరవులయందు ధర్మంబు • కాలె నకట.

చ. అలఘుఁడు యజ్ఞసేనునిమ ♦ ఖాయతనంబునఁ బుట్టి శౌరికిన్
చెలియలియట్టిదాన నయి ♦ చెన్నలరారెడు పాండురాజపు
త్త్రులవరధర్మపత్ని నయి ♦ తోరపుఁగీర్తి నెసంగునట్టినే
నలఁతిబలెన్ సభాస్థలము ♦ నం దిటు కూడఁగ నైతి నక్కటా. 92

చ. కురుకులపాంసనుండు నను ♦ గోసెకిగోఁతకుఁ దార్చెఁ జాల నో
నరవరులార ధర్మము వి ♦ నంబడ వేఁడితి నెవ్వరే నను
త్తర మిడ రేను ద్యూతజిత ♦ దాసినొ కానొ యెఱుంగఁ జెప్పుఁడీ
కరుణ దలిర్ప మీరనుడిప్ర ♦ కారమునన్ మెలఁగం దలంచితిన్. 93

ఆ. అట్లు కురిసి వోలె ♦ నార్తస్వరంబున, నడలుచున్నదాని ♦ నరసి యరసి
పలుక రెవరుఁ గాని ♦ పార్థివుల్ ధార్తరాష్ట్రనిభయంబుకతన ♦ నొంపు దక్క. 94

ఆ. అపుడు భీష్ముఁ డనియె ♦ నమ్మ నేఁ జెప్పితి, ధర్మసూక్ష్మ మిది య ♦ థావిధమున
నెఱుఁగ నోటువడదు ♦ నెట్టిరు దీనికు, త్తరము ధర్మజుండ ♦ తగును జెప్ప. 95

వ. సూక్ష్మంబును గహనంబు నగునీప్రశ్నంబునకు నుత్తరం బిడఁ జాలక ధర్మవిదులగు ద్రో
ణాపరిభృతు లిట్లు తలలు వాంచి చచ్చిన ట్లున్నవారు చూడుము మెట్లయిన నిట్లు చేసిన
దాని ఫలం బీకౌరవు లచిరకాలంబున ననుభవింతురు గాక యని పలుకుచున్నంత
నవ్వుచు ధృతరాష్ట్రాగ్రపుత్త్రుండు పాంచాలరాజపుత్త్రిం జూచి యి ట్లనియె. 96

చ. అడిగితి ప్రశ్న మీకురుకు ♦ లాధిపు లెవ్వరు నేమి సెప్ప నో
పడఁతి నీకతంబునను ♦ పాండుకుమారులు నల్వు రెవ్వనే
నొడయఁడు గాఁడు ధర్మసుతుఁ ♦ డుగ్మలి కన్న నతం డధర్మ మిం
దడరెడు నన్న దాస్యమున ♦ నప్పుడ పాసితి వంచు నెంచుమా. 97

వ. అప్పు డప్పేరోలగంబున మేలు మే లనుశబ్దంబును హాహాకారరవంబు నుప్పతిల్లె నం
దున్నవా రందఱు నెవ రేమి చెప్పుదురో యని పాండవులం జూచుచుండి రంత నకో
లాహలంబు బుసంగి లేచి భీమసేనుండు లోకరత్నాదకుం బగుతనదక్షిణహస్తం బెత్తి
యి ట్లనియె. 98

సీ. ధర్మావతార మీ ♦ ధర్మరాజేశుండు, గాఁ డని పలుకంగఁ ♦ గలఁ డెవండు
మాప్రాణములకును ♦ మానము మానులం, బున కీశుఁ డీపుణ్య ♦ మూర్తి తలఁప
నతఁడు మేమును ద్రుప ♦ దాత్మజయును దీన, విజితుల మని చెప్ప ♦ నెనుకఁబడము
మత్త్యధర్మము వీడి ♦ మాదేవి నోరు లంటి, పరిభవించినరీతి ♦ పాడి యనను

తే. యిదిగో చూడుఁడు నాహువు ♦ లెత్తినాఁడ, నాయతంబులు వృత్తము ♦ లతిదృఢములు
పరిఘ లివి వీనిలోఁ బడి ♦ బడలి పిండి, గాఁడె నగభేదియంతటి ♦ ఘనుఁడు నైన. 99

వ. ధర్మపాశబద్ధం బై ధర్మజనిరుద్ధం బగుటం జేసి యిట్లుండెఁ గాని నాఁడు ధర్మరాజవిసృష్టం బగునీభీమసింహంబు గాంధారేయక్షుద్రమృగంబులం గరతలంబులం బిండివెట్టకుండునే యని విజృంభించి రౌద్రాకారంబు సూపుటయుం జూచి భీష్మద్రోణవిదురులాతనిఁ బ్రశాంతచిత్తుం జేసి రయ్యవసరంబునఁ గర్ణుండు ద్రౌపదిదిక్కు మొగం బై.

కర్ణుండు ద్రౌపదిని బరిహసించుట.

ఆ. దాసి వైతి నీవు ♦ తరళాక్షి పతు లిట్లు, పడుగు రైన నేమి ♦ ఫలము గలదె
జూదమందు నోడఁ♦జూడనిమ్మతియొక్క,పతిని గోరుకొనుము ♦ ఫలము దక్క. 101

క. నీ కింక ధార్తరాష్ట్రులు, గా కీశులు పాండుసుతులు ♦ గా రిటఁ దడయం
బో కరుగుము నగరున కట, నీకార్యము లివి యటంచు ♦ నేర్పెద రతివా. 102

క. అని యుల్లసమాడిన విని, కను లెఱ్ఱం బడఁగ నలుకఁ ♦ గని భీముఁడు క
ర్ణుని నొంపు వలుక కూరక, తను వెరియఁగ రోఁజుచుండె ♦ దాసుం డగుటన్. 103

వ. అయ్యవసరంబున. 104

పంచచామరము. సుయోధనుండు ధర్మరాజుఁ ♦ జూచి యూరకుంటి వే
మి యయ్య తమ్ము లెల్ల నీకు ♦ మించి యుండ రంట నీ
వ యీశుఁ డంట వారి కీవు ♦ వారిజాక్షి నోడవో
జయింప లేదొ మేము ధర్మ ♦ సంశయంబు దీర్పుమా. 105

వ. అని యంతన పోక నవ్వుచు నైశ్వర్యమదగర్వంబునం బాంచాలిం జూచి తనకుఱువు మీఁదివస్త్రంబుఁ దొలఁగించి చూపుచు. 106

మ. కదళీదండసదృక్ష మక్షయకళా♦క్రాంతంబు దంతీంద్రహ
స్తదృఢంబున్ విభవాభిరామ మగునా♦సవ్యోరుదేశంబు ద్రౌ
వది సూడం గర మప్పళించి యట ని♦ల్వన్ సన్నఁ గావించె ను
న్మదలీలం దమవారు కౌతుకము నొం♦దం బాండవుల్ కుందఁగన్. 107

క. భీముఁడు దానిం గనుఁగొని, భీముం డై దష్టదశన♦భీమాస్యుం డై
భూమీశు లెల్ల విస్మయ,భూమిక లై వినఁగఁ బలికె ♦ భూరిరవమునన్. 108

మ. ఇచటన్ రాజ్యమదాంధతన్ గరిత ని ♦ ట్లీక్షించి త ప్పెంచుటన్
విచలచ్చండభుజద్వయంబున గదం ♦ బే రెమ్ములుం బాఱఁ ద్రి
వ్వుచుఁ దాఁటించి సుయోధనోరుయుగళం♦బుం బిండిగాఁ జేసెదన్
బ్రచురోగ్రాహవమందు నెల్లరు భయ♦భ్రాంతి న్విలోకింపఁగన్. 109

క. అని క్రుద్ధుం డగునాశుగ,తనయుని స్రోత్రములనుండి ♦ దహనార్చులు ప
ర్వెను వహ్నిపర్వతంబునఁ, బొనరారెడుకందరౌఘ♦ములనుండి బలెన్. 110

క. అతిమానుషతేజంబునఁ, బ్రతిబింబించెనువృకోదరక్రోధనునిన్
మతి నెఱిఁగి విదురుఁ డీతని,కతన మహోపద్రవంబు కలిగెడు ననియెన్. 111

తే. అంత ధృతరాష్ట్రునగ్నిహోత్రాలయమున
నఱచె రాసభములు వఱు ళ్లతులితముగఁ
గాకులును గ్రద్దలును గూబ లేకసరణిఁ
గూసె నాఱుచు నంతట ఘోరగతుల. 112

వ. తత్త్వవేత్త లగువిదురభీష్మద్రోణగౌతము లాదుర్నిమిత్తంబు లరసి స్వస్తివచనంబు లుచ్చరించి రపుడు గాంధారవిదురు లామహోత్పాతంబులు ధృతరాష్ట్రున కెఱుంగం జెప్పిన నార్తుం డగుచు నతం డుదరిపడి దుర్యోధనుం జీరి యి ట్లనియె. 113

ఉ. చచ్చితి నోరి నీకతనఁ జాలఁగ వచ్చెను నాకుఁ జెల్లమిం
దెచ్చితి ద్రోవదిన్ సభకుఁ దెచ్చెటె కాక తదీయవస్త్రమున్
విచ్చియు నీడ్చియున్ నెఱులు వీడ్వడ నొప్పియు దెప్పరంబులం
గ్రుచ్చియు నొవ్వఁ జేసి తఁట కూడునె నీ కిటు సేఁత దుర్మతీ. 114

ధృతరాష్ట్రుఁడు ద్రౌపదికి వరంబు లిచ్చుట.

తరళము. అనలసంభవ రాజసూయమఖాత్తకీర్తిఁ బతివ్రతా
జనశిరోమణి ధర్మతత్పర సత్యవాదిని ద్రోవదిన్
మనుజకాంతగఁ నెంచి తేమొ మనంబునన్ నిసుఁగా జగం
బునఁ బొనర్చెనునాదిశక్తిగఁ బోల్చి భక్తి భజింపుమా. 115

వ. అని కొడుకుం బదరి పలుకుచుం బాంచాలిం జేరఁ బిలిచి సాంత్వనపూర్వంబుగా నామె కి ట్లనియె. 116

క. నాకోడండ్రురలో నీ,వే కనుఁ బేరందితిపుడు ప్రేముడి యయ్యెన్
నీ కిత్తు వర మభీష్టము, చేకుఱ నభివాంఛితంబు చెప్పుము తల్లీ. 117

వ. అనిన ద్రుపదరాజపుత్త్రి మామ కభివందనంబు చేసి. 118

క. వర మొసఁగఁ దలఁచితేనియు, భరతర్షభ ధర్మసుతుఁడు వరపుడమునకున్
బరిముక్తుఁ డగుతెఱం గెదఁ, గరుణింపుము జగ మెఱుంగఁ గరిపురనాథా. 119

వ. దానం జేసి రాజపుత్త్రుం డగు ప్రతివింధ్యునకుఁ గురుకుమారులలో దాసపుత్త్రుం డను నపయశంబునుం దొలంగు ననుడు నతం డట్ల యిచ్చితి నింకొక్క వరం బడుగు మనిన ద్రోపదియు. 120

క. యమసుతునలువురుతమ్ములు, తమశస్త్రాస్త్రములతో రథమ్ములతో ది
వ్యమణీనివహమ్ములతోఁ, దమదాస్యమువలనఁ బాసి తనరఁగ వలయున్. 121

వ. అనిన నతం డిచ్చితి నింకొక్కవరంబు వేఁడు మనిన నామెయును. 122

ఆ. వైశ్య కొకటి క్షత్త్ర•వనితకు రెండును, విప్రసతికి మూఁడు • వేఁడ వచ్చు
వరము లేను లోభ•వశమున ధర్మహా,నికి సముత్సహింప • నృపవరేణ్య. 123

వ. అనిన నతం డామెధర్మతత్పరతకు మెచ్చుకొనుచు నుండె నప్పుడు కర్ణుం డెల్లరు విన
ని ట్లనియె. 124

మ. వినలే దింతకుమున్న యెన్నఁడును బృ•థ్వీనాథ నారీతిగాఁ
బొనరింపం గను సబ్బురంబ యిది పెం•పుం దూలి దుఃఖార్ణవం
బునయందుం బడి మగ్నులై నమగలన్ • బోలంగఁ దా నుద్ధరిం
చెను బాంచాలి నిజప్రభావమున వా•సిం గూర్చుచున్ వారికిన్. 125

వ. అనిన వానిమాటలకు లోన గర్వించుచు భీమసేనుం డర్జునునకు విన ని ట్లనియె.

ఆ. నెలఁతకతనఁ బాండు•నృపతిపుత్త్రుల కిట్లు
గతులు కలిగె నంట•కంటెఁ గష్ట
మొకఁడు గలదె తేజ • మొకఁడు గాక మఱొండు
పురుషుఁ డెనఁగుటకును • బొసఁగఁ గలదె. 127

వ. దేవలుండు చెప్పినకర్మవిద్యాపత్యంబులు మూఁడును బురుషునకు పొడవడంగినవెనుకం
బనికివచ్చు నిపుడు పరాక్రమించుటయ తేజం బనుచు విజయునిప్రతివచనంబు
లాదరింపక విజృంభించి. 128

ఆ. పలుకు దేటి కేమొ • బలపరాక్రమమునఁ, బోయి పగఱ నాజిఁ • బొడిచి గెలిచి
పుడమి యెల్లఁ గొందుఁ • బొమ్మని కనుల నం,గారకణము లురలఁ • గసలి కనలి.

వ. అట్లు కుటిలభ్రూకుటి యై కన్నులెఱ్ఱఁబడ నొసలు గఱచి కనిష్ఠభ్రాతృమధ్యంబుననుండి
మృగమధ్యంబున నున్నసింహంబువలె రోఁజుచుఁ గల్పానల్పగభీరభైరవుం డనం
జూపట్టి నట్టియెడ యుధిష్ఠిరుండు చే యెత్తి వాని వారించి ధృతరాష్ట్రునకుం
బ్రాంజలి యై నీవ మా కీశ్వరుండవు మే మెల్ల నీశాసనంబున నుండం దలంచితిమి
మా కేమియాజ్ఞ యనిన నతం డతని కి ట్లనియె. 130

సీ. వత్స భద్రము నీకు • వఱలు స్వారాజ్య మే,ల్కొనుము నాశాసనం•బునను బొంది
వృద్ధసేవ యొనర్చి • విజ్ఞుఁడ వై నీవు, సమబుద్ధి నెడఁదఁ బ్ర•శాంతిఁ గనుము
పరులు చేసినతప్పు • పాటింప రుత్తముల్, కొడుకుచేఁతకుఁ బగఁ • గొనకుమయ్య
జననిఁగా గాంధారి • జనకుఁగా నను వృద్ధుఁ, దలఁచి సుయోధను • గలసికొమ్ము

తే. పుత్త్రుల బలాబలంబులు • మిత్త్రకోటి,దర్శనంబును దెలిసి సం•తసము నొందఁ
గలుగు నని జూద మొప్పితిఁ • దెలివి లేక, దాన నింతలు పుట్టె నం•తయును మఱుము

వ. మఱియు సర్వశాస్త్రవిశారదుం డగువిదురునిమంత్రిత్వంబును నీధర్మంబును భీభత్సుని ధైర్యంబును భీమసేనునిపరాక్రమంబును గవలగురుశుశ్రూషయును నీకురుదేశంబుల లగ్గు సేయుచుండుఁ గావుత నీవు నీసర్వస్వమ్ముతో ఖాండవప్రస్థమునకుం బొమ్ము నీకు భద్రమ్మగుఁగాక నీతమ్ములతోడి సౌభ్రాత్రంబు నెఱపుచుందువు గాక నీబుద్ధి ధర్మంబునఁ దిరం బుండుంగాక యని యంపి పుచ్చుటయు నజాతశత్రుండు విదురానుమతమ్మునఁ దమ్ములుం దానును కృష్ణాసహితమ్ముగా వసుసనాధమ్ము లగు రథమ్ము లెక్కి హర్షించుచు నింద్రప్రస్థపురమార్గంబు వట్టి చని రిట దుశ్శాసనుం డది యంతయు నెఱింగి సామాత్యమిత్రుం డగుదుర్యోధనునిసన్నిధికిం జని ఖిన్నుం డయి విన్నవించిన నతండు కర్ణశకునులతో విచారించి వైచిత్రవీర్యునిపాలికిం జని యి ట్లనియె. 132


అనుద్యూతపర్వము.

తే. ఏయుపాయంబునం గాని హితులు గాని, వారిఁ గెలుచుట లగ్గని పలికె మున్ను
పాకశాసనునకు బృహస్పతి నరేంద్ర, దేవగురునీతిశాస్త్రమ్ము నీవు వినవె. 133

మ. పలుమాఱు లెగ్గులు చేసి పాండవులకుం బ్రాపింపఁ బ్రత్యక్షవై
రలసద్భావుల మై చరించుమను మో రాజేంద్ర నేఁ డెన్నిల
గ్గులు గావించిన వారికిం హితుల మై కూర్పంగఁబో మర్మిలిం
దెలియం జాలక వారిని న్విడిచి యాత్రిం దెచ్చితే మందుఁ బో. 134

క. అలిగించి కోడెత్రాఁచుల, గళముకడ న్విడుచునట్లుగ న్విడిచితి వా
రల వారు కనలుచు న్మన, బలఁగంబుల మసల బడలుపడఁ జేయ రొకో. 135

క. ద్రౌపదిని బట్టి సభలో, నాపగిదిం జేయుకతన నాపాండవులీ
నీపుత్త్రుల మడియింపక, యేపగిదిం బ్రదికి యుండ నెంతురు చెపుమా. 136

స్రగ్ధర. బద్ధద్వేషప్రవృద్ధప్రథితధృతి గదం బట్టి భీముండు క్రేయం
క్రుద్ధుండై గాండివంబుం గొని ఘనశరముల్ గుప్పి భీభత్సుఁ డుద్య
ద్యుద్ధస్ఫారప్రసిద్ధిం దొడరుకొనఁ గవల్ తోమరాద్యాయుధాళిం
వృద్ధిం గైకొన్న వైరుల్ విడివడ నెదురన్ వీరు నీవా రథీరుల్. 137

వ. అది కావున నక్షవిద్యావిశారదుం డగుశకునికారణంబునఁ బునర్ద్యూతంబుఁ గల్పించి పాండవేయులం బరాజితులం జేసి పదిరెండువర్షంబు లరణ్యవాసంబును నొక్కవర్షం బజ్ఞాతవాసంబును గావింపం బుత్త్ర మ ట్లయిన మనకు సర్వరాజ్యంబును స్థిరపడు నవ్వల మహాసేనాసమూహపరిగ్రహాదులం జేసి దురం బైనం గెలువ దుర్లభంబు గా దనిన నాంబికేయుండు దాని కొం డాడ కొడంబడియె నంత శాంతనవ కుంభసంభవ భూరి

శ్రవస్సోమదత్త బాహ్లిక విదురాశ్వత్థామ వైశ్యాపుత్త్ర వికర్ణులది కాదని గర్హించి పలుకుచున్నను వారిం గాదాడి సుతప్రియుం డగుధృతరాష్ట్రుండు పాండవేయులఁ బునర్ద్యూతమునకుం దేర నెంచె నపుడు గాంధారి శోకకర్శిత యై పతి కిట్లనియె. 138

గాంధారి దుర్యోధనునిఁ ద్యజించు మనుట.

మ. మనదుర్యోధనుఁ డుద్భవిల్లునెడ గోమాయుప్రకారస్వరం
బున నేడ్చెన్ విదురుండు వీఁడు కులముం బోకార్చుఁ గానం బరం
బున కేగింపుము వీని నంచుఁ దెలిపెన్ బుత్త్రస్నేహం బూని నీ
వనుమానించితి వీనిమూలమున వంశాంతంబు గా నయ్యెడిన్. 139

ఉ. ఇంతకు మూలకారణము వీ వయి తెల్లఁగఁ బాండుపుత్త్రు ల
త్యంతము శాంతచిత్తములఁ గ్రాలుచు నుండఁగ వారిఁ బిల్చి దు
శ్చింత దురోదరం బొకఁడు చేసి కలంచితి వారు క్రుద్ధులై
యెంతకుఁ జాల రుందు రిఁక నే మనుదాన నినుం గురూద్వహా. 140

చ. కురుకులపాంసనుం డయిన కూరిమి నీ కైనఁ బరిత్యజించి భూ
వర పరమోత్తమం బయిన వంశముఁ గావుము పుత్త్రమోహముల్
దారలెదవేని దత్తులముఁ దోడన పొందెదు చెప్ప నేటికిన్
సురుచిరధర్మమార్గమున శోభిలఁ జేయుము బుద్ధి బుద్ధిగన్. 141

వ. అని చెప్పుచున్నం ధృతరాష్ట్రుండు దీని నివారించుటకు శక్తుండుఁ గా నేది యెట్లు కానున్న దది యట్లు కాక మాన దని వెండియుం బాండవులం దేరఁ బ్రాతికామిం బంచె నతండు నటఁ జని మార్గమధ్యంబునఁ బాండవులం గని మరల జూదమాడ రావలయు ననుపితృనియోగంబు ధర్మజున కెఱింగించుటయు నతం డందు శకుని చేయు మాయ నెఱింగియున్నను విధినియోగంబునఁ బితృనియోగం బతిక్రమింపం జాలక పాంచాలీసహితుం డై సభ్రాతృకంబుగ హస్తిపురంబునకు మరలి చని యెప్పటియట్ల జూద మాడుట కుద్యుక్తుం డై యున్న శకుని వాని కిట్లనియె. 142

చ. కురువిభుఁ డెల్లసంపదలు గొమ్మని నీకు నొసంగెఁ గావునన్
మరల న వన్నియుం బణముగం గెలువం గొనఁ బాడి గాదు భూ
వర మఱియొం డపూర్వ మన వచ్చినయట్టిపణంబు చెప్పెదం
బరఁగఁగ నద్ది నీమదికి వచ్చిన నాడుము లేక వీడుమా. 143

వ. అది యెట్టి దంటివేని వినుము మాపునర్ద్యూతంబున నోటువడినవారు భార్యాభ్రాతృసహితులై వల్కలాజినంబులు గట్టి పదిరెండువర్షంబులు వనవాసంబును నొక్కవర్షంబు జనపదంబున నజ్ఞాతవాసంబును జేయునది యజ్ఞాతవాసవత్సరంబునఁ దెలియఁ

బడితేని మరలఁ బండ్రెండుసంవత్సరంబులు వనవాసంబును నజ్ఞాతవాసంబు నొనర్చునది యిట్లు త్రయోదశవత్సరంబులుం గడపిన వెనుక వారిరాజ్యంబు వా రనుభవించునది యనిన ధర్మనందనుండును. 144

క. పిలువఁబడి జూదమాడఁగఁ, గలిగిన వెఱపునను నాడఁగా మగుడుట రా
జులధర్మము గా దది నీ, తెలిపినపణ మొప్పి యాడెఁ దివిరెద శకునీ. 145

—ధర్మరాజు రెండవమాఱు జూదమాడి యోడుట.—

చ. అని వచియించి ధర్మసుతుఁ డప్పుడ పాచికలం గ్రహించి గ
ల్లనురవ ముప్పతిల్ల వడి నాడి యొకించుకలోన నోడె దు
ర్జను లగువారు చూచి నగఁ జాగురె దైవవిధాన మెట్టిదై
నను ద్రసరేణుమాత్ర మయినం గడి దాఁటఁగఁ జాలరే కదా. 146

వ. అట్లు దురోదరపరాజితులైనపాండవేయులు రాజచిహ్నంబులు విడిచి వల్కలాజినోత్తరీయంబులు దాల్చి వనవాసదీక్షితులై యున్నసమయంబునఁ బరిహాసింపుచు దుశ్శాసనుం డిట్లనియె. 147

చ.*గెలిచితి మిట్లు పాండవులు కేవలదీనులరై విపత్తిలోఁ
బలఁ బడి రాజ్యమేద వనవాసము నాఁబడుదుర్గతిం బడన్
వెలలెద రింక రార యను విన్నను వొప్పఁగ మీఁద ధార్తరా
ష్ట్రులకు నిరంతరశ్రీప్రభుత చొప్పడు నెప్పుడు లోక మొప్పఁగన్. 148

తే. దీర్ఘకాలము నరకపాతితులు పాండు
రాజపుత్రులు గావున రాజచిహ్న
ములు దుకూలములును మణిభూషణములు
విడిచి రురుచర్మములు దాల్చి వెడలఁ గలరు. 149

తరళము. ధనమదాంధులు తారు నవ్వెరి ధార్తరాష్ట్రులఁ దొల్లి కో
లుప్పన ఫలం బిటు లంట వచ్చెను బో తలంపఁగ వారిని
గనిన లోకు లిహీ యనంగ నగంగ నారయఁ గంటి మీ
ఘనులు సౌబలుకారణంబున గన్నుపండువ గా నిటన్. 150

క. షండు లగుపాండవుల కాం,ఖండలసమవైభవుండు గదపో పాంచా
లుం డిడి కన్నియ నప్రాజ్ఞుండై వగవంగ నయ్యెఁ జూడం జూడన్. 151

వ. అని యంతన శోక పాంచాలి నుద్దేశించి. 152

---

* విన్ననువు = విధము.

నిండఁగ రోదస్సునందుఁగ నిలిచి రణమునఁగ నేఁ గృతాంతుండ నై ద్వి
ట్తుండంబుం గూల్చి కూల్తుఁగ వలఁగక కలుష ద్రవ్యసంపూర్ణుఁ గర్ణుఁగ. 162

వ. నకులుం డి ట్లనియె. 163

మ. పరుషంబుల్ ద్రుపదాత్మజం బలికి పాపస్వాంతు లై నవ్వుచుం
బరిభావించిన ధార్తరాష్ట్రులఁ బలుప్రాయస్తులాలంభులఁగ
శరవర్షంబున ముంచి మించి నిజదోశ్శౌర్యం బవార్యంబుగా
దురమందుం బఱమార్చి చేసెద జయస్తోత్రాతిపాత్రుండ నై. 164

వ. సహదేవుం డి ట్లనియె. 165

ఉ. అక్షములందు నేర్చి ఖలుఁ డై యమ వందురు మాయఁ జేసి పు
ణ్యాక్షయమూల మైనసభ నాఁడె సిరుల్ హరియించి మాకుఁ బ్ర
త్యక్షవిరోధి యై సుబలరాత్మజుఁ డాత్మజబంధుపుత్త్రులఁ
దక్షుఁడ నై రణాంగణమునఁ బృథివిం బడి విక్రమించెదఁగ. 166

వ. అని ప్రతిజ్ఞలం బల్కుతమ్ములయు ద్రౌపదియు సాన్నిధ్యంబున ధర్మజుండు ప్రయాణా
భిముఖుం డై భీష్మ ధృతరాష్ట్ర సోమదత్త బాహ్లిక ద్రోణ కృప పాశ్వత్థామ విదురాదు
లను యుయుత్సుసంజయాదులను ధార్తరాష్ట్రాదులను నామంత్రించి పోయివత్తు
మని నెవ్వరు నేమియుం బలుకక నేల తలలు వాంచుకొని యుండి రపుడు విదురుం
డి ట్లనియె. 167

చ. పొదలినపుత్త్రులం గనినపుత్త్రులు గల్గినతల్లి మాధవం
బొదవఁగ నెల్లసౌఖ్యముల నొంది మెలంగఁగ నైనసాధ్వి సం
పదలను బాసి కానడవి వాసము సేయఁగ లేదు కుంతి నా
సదనమున న్వసించుత మనఃప్రసన్న నాపరిచర్య లందుచుఁగ. 168

వ. అనిన ధర్మతనయుం డిట్లనియె. 169

ఉ. తండ్రివి నీవు నీయట్టి తండ్రివి గావనో నిప్పు మాకు నే
వాండ్రును నిన్నుఁ బోలరు ధ్రువంబుగ నీనుడి మాకు వేద మో
తండ్రి భవన్మతంబునను దమ్ముల నేనును నాదునాల్గురు గో
డండ్రను నిల్చి యుండు మొకటి నన్నటి యెట్లు మెలంగఁ జెప్పుదో. 170

వ. అనిన విదురుండు వెండియు ని ట్లనియె నయ్యా నీవు సకలధర్మజ్ఞుండవు భీమసేనుండు
పరాక్రమధనుండు ధనంజయుండు వివిధయుద్ధవిశారదుండు నకులుం డర్థసంగ్రహని
పుణుండు సహదేవుండు దివ్యజ్ఞానవంతుండు ధౌమ్యుండు బ్రహ్మవిదుత్తముండు

ద్రౌపది ధర్మార్థకుశలయుం ధర్మచారిణియు సట్టిమీఁద నన్యోన్యప్రేమానుబంధబంధురులరై యుండునట్లుం జేసి మిమ్ముర్వ్యు లాదరించి మోదింతురు కాని ఖేదించువారు లేరిది నీకు శక్రాదిదుర్లభం బగుపట్టాభిషేకకల్యాణంబు మఱియుం దొల్లి హిమవంతంబున మేరుసావర్ణియు వారణావతంబునఁ గృష్ణద్వైపాయనుండును భృగుమంతంబున రాముండును దృషద్వతియందు శంభుండును నీకు ధర్మోపదేశం బొనరించిరి భృగ్వసితనారదులు నీకుఁ బరమగురువులు ధర్మార్థనిధిజ్ఞుండు ధౌమ్యుండు నీకుఁ బురోహితుండు నీవునుం దమ్ములును బుద్ధిబలంబునం బృహస్పతిని బలపరాక్రమంబున నితరరాజులను ధర్మోపసేవ దేవర్షులను బ్రభుత్వమహాత్మ్యప్రభావాదుల నింద్రయమవరుణకుబేరాదులం గెలిచితిరి మీకు బంచభూతంబులును జంద్రాదిత్యులును క్షమాసత్యతేజోవిజయాదుల నొసంగి రక్షింతురు రెప్పవలె ప్రమత్తులరై ప్రవర్తిల్లుఁడు మీకాగమనంబును శుభంబగుం బోయిరండు శీఘ్రకాలంబునఁ బునర్దర్శన మయ్యెడుం గాత యని బోధించి. ధర్మనందనుం డట్ల యగు పరి భీష్మద్రోణులకు నమస్కరించి ప్రయాణోన్ముఖుం డయ్యె నంత ద్రౌపది గొంతికడకుం జని మ్రొక్కి దుఃఖించిన నాయమయుం దుఃఖించుచు ని ట్లనియె. 171

తే. తల్లి శోకింప వలదు నీ ♦ వెల్లధర్మములు నెఱింగిన దానవు ♦ పుణ్యవతివి
నీకతంబునఁ గులద్వయము వర్ణింపఁబడియె, భూషణం బయ్యె నిది ప్రశంస ♦ పూజ్యమయ్యె.

తే. సకలాచారమతివి సుస్నేహదయవల్లభులను సేవించువిధము నేఁ ♦ దెలుప వలవ
దైనఁ గడగొట్టు సహదేవుఁ ♦ డార్తిఁ బొందఁ, డంతి నీ వెల్లప్పుడు రక్షింతు వాని.

క. అనినం గనుఁగవ నశ్రువు, లనిశముఁ గాలువలు గట్ట ♦ నడలెడుదానిం
దనకోడలిఁ గౌఁగిటం గదిసికొని, చనుదెంచుచు గాంచె సుతుల ♦ సదమలమతులన్. 174

తే. దివ్యభూషాంబరాదులు ♦ దీసి వైచి, వల్కలాజినధారులై ♦ పరమమునుల
పగిది సత్యవ్రతముఖులగు ♦ వారిఁ గాంచి, యగచి విలపించుచును గుంతి ♦ వలికె నిట్లు. 175

అడవికి నేగుపాండవులం జూచి కుంతి విలపించుట.

సీ. అయ్యయో నాకన్న ♦ యట్టిపుత్త్రకులార, విధివిపర్యయ మిట్లు ♦ వెలయ నయ్యె
నెప్పుడే వేల్పుల ♦ కెగ్గు ధ్యానంబున, నపరాధము చేసి ♦ నారొ కాని
వ్యసన మిట్లందుటలు ♦ నడసినవారికిఁ, బలె మీకు రా నేల ♦ వలసి వచ్చె
నాభాగ్యదోషమే ♦ నాకన్నకొడుకులు, కూడుగుడ్డలు లేక ♦ కుతిలపడుట

ఆ. జోగులైన మిమ్ముఁ ♦ జూడక మీతండ్రి, పాండురాజు స్వర్గ ♦ భాగి యయ్యె
ధన్యతముఁడు మాద్రి ♦ ధన్యాత్మురాలామె, మగనితోడఁ జనియె ♦ వగపు దక్కి.

మ. తనప్రాణంబులకన్న మిన్న యని సర్వ ♦ దాత్పర్య మొప్పంగఁ గ
న్గొనుచుం డా నఖచేతఁ బెట్టుకొని యుం♦దుం బ్రీతి లాలించి మం
చిని ప్రాణేశునితోడఁ బోవ కటు లీ♦జీర్ణాంగంబులం గూడ నుం
డినదానం బ్రమ కాన చేసితిని నీ ♦ నే నెంత దుర్బుద్ధినో. 177

చ. జననము విధాత నర్మ మిచ్చెఁ ♦ జాలఁ దపించుచుఁ బ్రాణవాయువుల్
వెడలవు మేనినుండి యొక♦వేళకునైనియుఁ దాళఁజాల నె
వ్వఁడవుర గన్నబిడ్డలను ♦ గాసి వసింపఁగ నేర్తు నింట న
య్యెడవ్రుల కేనునుం డనుచు ♦ నక్కట దిక్కు వఁడింక నా కిటన్. 178

శా. హా కృష్ణా కమలాసనాదివినుతా ♦ హా దేవకీనందనా
హా కంసాంతక హా యదుప్రవర హా ♦ హా ద్వారకావాస హా
లోకత్రాణపరాయణా కరుణ నీ♦లో నూనవా కానవా
మాకష్టంబులఁ దీర్పవా మనిచి ప్రే♦మం గూర్పవా మాధవా. 179

ఆ. వాసుదేవ నిన్నుఁ ♦ బ్రస్తుతింతు రనాది,నిధనుఁ డనుచు మునులు ♦ నీవు సకల
లోకవర్తివేము ♦ నీకటాక్షమునకుఁ, బాత్రులముల మయ్య ♦ పద్మనాభ. 180

క. ద్రోణుఁడు భీష్ముఁడుఁ గృపుఁడుం, ద్రోణాయని చూచుచుండ ♦ దుర్దశ యిటు లై
క్షోణీనాథకుమారులు, ప్రాణములకుఁ దెగి వనాళిఁ ♦ బడ ధర్మంబే. 181

క. హా హా పాండుమహారాజా హా హా పుత్రవత్స♦లా యెట నుం టీ
ద్రోహము వాపఁగ వే రా,వే హరి హరి యి ట్లుపేక్ష ♦ యిది నీ కగునే. 182

శా. అన్నా కన్నకుమారుఁ డై నసహదే♦వా నీవు నారణ్యభూ
మి న్నిల్వం జనుచుంటివా యిపుడు నె♦మ్మి న్వీడఁగా నోప నే
నిన్ను న్నీ విట నుండు మన్న లరుగ ♦ న్నెక్కొంచు ధర్మంబునన్
సన్నుం బ్రోచినయట్టిపుణ్య మెట నుం♦న్న న్నిను వచ్చుం జుమీ. 183

వ. అని విలపించుచున్న తల్లికిం దండప్రణామంబు చేసి పాండవులు విగతానందు లై
వనంబునకుం బయనంబయి చని రంతఁ గుంతి నాశ్వాసించి విదురుండు తనగృహం
బునకుం గొనిపోయె నప్పు డొం గున్నగురుపులాంగన లెల్లరు పతులవెంబడి నడలుచుఁ
బోవుద్రోవదిం జూచి హస్తతలవిన్యస్తముఖాంబుజ లై కౌరవులం దూఱుచు
దుఃఖించి రయ్యవసరంబున. 184

సీ. మేఘోదయము లేక ♦ మెఱుములు తఱు చయ్యె, ధరణి కంపించె గో♦త్రములతోడ
నాదిత్యునిఁ రాహు ♦ వపపర్వమునఁ బట్టె, నుల్కలు తప్పఁగా ♦ నుర్వి రాలెఁ

ధారుణీస్థలి నీవు నీ ప్రజ ♦ దాన నొప్పంగ శ్రేయముల్
భూరికీర్తి నొసంగు చుండురు ♦ పూరువంశవిభూషణా. 211

వ. అని గావల్గణంబున విదురుండు చేసినహితోపదేశంబు పుత్త్రహితైషి యగుధృతరాష్ట్రుండు గ్రహింపకుండె నని. 212

క. జనమేజయజనపతికిన్, ముని వైశంపాయనుండు ♦ మును నొనఁ బొదలన్
వినిపించె సభాపర్వం, బున గలకథ యెల్లఁ దెలియ ♦ బూర్ణప్రజ్ఞన్. 213

వ. అనిన విని నైమిశారణ్యవాసు లవలివృత్తాంతంబు సెప్పు మని సూతు నడుగుట యును. 214


ఆశ్వాసాంతము.

మ. ప్రతివృష్టింబుఁ జేసి ఘూర్క్ తుఱుముమేగిం బెన్కు శాంభారి
ప్రతులంబుం గలసారి యెల్ల దొను లోకోప్పం గూర్చి నానేర్చి
ట్లతిభక్తిన్ భవదంఘ్రిపద్మములయం ♦ దర్పించితిన్ గొని యం
చితచిత్తంబున నాదరించి చెలిమిం ♦ జేకొమ్ము లోకేశ్వరా. 215

మాలిని. నిరుపమగుణభూషా ♦ నిత్యకల్యాణవేషా
సురమునిజనపోషా ♦ శుద్ధసత్త్వప్రఘోషా
సరసమధురభాషా ♦ శాసితాత్మీయదోషా
భరితజగదశేషా ♦ భవ్యతేజోవిశేషా. 216

గద్యము.

ఇది శ్రీమద్రఘునాథనోభయకవిమిత్ర వేంకటయజ్వాగ్రిపుత్త్ర
సమారాధితవిబుధరాజ శ్రీపాదకృష్ణమూర్తి కవిరాజ
ప్రణీతం బయిన శ్రీకృష్ణభారతంబునందు
సభాపర్వంబున సర్వంబును
చతుర్థాశ్వాసము.

శ్రీ.